# డిస్కవరి ఐకాన్స్

20వ శతాబ్ద గతి నిర్దేశించిన 100 మంది ప్రముఖులు




















*Published by*
**SCIENCE FOR 'U' Knowledge Society**
**113, (Left Wing) Amrutha Ville, Rajbhavan Road,**
**Somajiguda, Hyderabad-500 082.**



**Printed in 2007, Hyderabad**

***Chief Editor:***
**D. Srinivasa Reddy**

***Editor:***
**K. Rama Rao**

***Copy Editor :***
**J. Umamaheswara Rao**

***Writers:***
**R.V. Rama Rao**
**K. Harinder**
**D. Aruna**
**G. Parvateesam**
**P. Santharam**
**P. Sankar**

***Type setting & Layout:***
**T. Srinivas**

Courtesy:
Barbara Cady, Milton Viorst, William F. Buckely Jr., Anand Panyarachun, Jonathan D. Spence, Pramoedya Ananta Toer, David Chandler, Donald Gregg, Sandra Burton, ED Reingold, John Nathan, Anthony Spaeth, Zhang Yimou, Suketu Mehta, Wilfrid Sheed etc.,






















# విషయ సూచిక






























# వి షయ సూ చి క




















# నూరు పూలు పూచాయి ఇందులో...
# కనీసం మీలో వెయ్యి ఆలోచనలు మెరుస్తాయి

వ్యక్తిత్వం పుట్టుకతో వచ్చేది కాదు. ప్రయత్నపూర్వకమైన కృషి ఉంటే తప్ప ఉత్తమ వ్యక్తిత్వం అలవడదు. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకోవడానికి అనేక సదుపాయాలు కల్పిస్తోంది. ఈ ఇంటర్నెట్ యుగంలో సమాచారానికి కొదవ లేకపోవచ్చు. అయితే సమాచారం మాత్రమే జ్ఞానం కాదు. కేవలం జ్ఞానసంపన్నులైనంతమాత్రాన వివేకం అబ్బకపోవచ్చు. ఈ రహస్యం తెలుసుకోగలిగితే మన వ్యక్తిత్వాన్ని మెరుగుపరుచుకోవడం అసాధ్యం కాదు.

కొందరి వ్యక్తిత్వం స్ఫూర్తిదాయకంగా ఉంటుంది. జ్ఞానం, వివేకం సంపాదించడానికి అలాంటి వ్యక్తులు మార్గదర్శకులుగా ఉంటారు. గొప్ప వ్యక్తులు మన మార్గాన్ని దేదీప్యమానం చేస్తారు. వారిని ఆదర్శంగా తీసుకోవడం ద్వారా, వారిని అనుసరించడం ద్వారా, వారిని అభిమానించడం ద్వారా, వారి బోధనలను, ఆలోచనలను ఆచరణలో పెట్టడంద్వారా మనం ఉన్నత స్థానాన్ని సంపాదించుకోవచ్చు.

మనకు ఆదర్శప్రాయులైన వారు ఏ రంగానికి చెందిన వారైనా కావచ్చు. వారి జీవితం, వారు సాధించిన విజయాలు, వారికి ఎదురైన అపజయాలు అన్నీ మనకు ఉపకరిస్తాయి. మనకూ ఆశయాలు, ఆదర్శాలు ఉండొచ్చు. అయినా వాటిని సాధించడానికి అనుసరించలసిన సరైన మార్గం ఏదో మనకు తోచకపోవచ్చు. ఆ దశలో మహనీయులే మనకు మార్గదర్శకులుగా ఉంటారు.

ఇరవయ్యవ శతాబ్దిలో చాలా మంది ప్రపంచ గమనంపై తమ పాదముద్రలను వదిలివెళ్ళారు. అందుకే వారు ఆదరణీయులు అయ్యారు. ఇరవయ్యవ శతాబ్దంలో మానవజాతి మనుగడను ప్రభావితం చేసిన వంద మంది ప్రముఖులను ఎన్నుకొని 'డిస్కవరి' పత్రిక 'డిస్కవరి ఐకాన్స్' అన్న గ్రంథంప్రచురిస్తోంది. వారు వివిధ రంగాలకు చెందినవారు. వారు తమ తమ రంగాలలో మార్పుకు, పురోగతికి కారకులయ్యారు.

మహాత్మాగాంధీ, విన్‌స్టన్ చర్చిల్, ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్, చార్లెస్ డిగాల్ వంటి రాజనీతిజ్ఞులు, మదర్ థెరిసా, ఇందిరాగాంధీ లాంటి ఆదర్శ వనితలు, బెనిటో ముస్సోలినీ, అడాల్ఫ్ హిట్లర్‌లాంటి నియంతలు, లెనిన్, మావోసేతుంగ్, చేగువేరా లాంటి చరిత్ర గతిని మార్చిన విప్లవకారులు, ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, మేరీక్యూరీ లాంటి అద్వితీయ శాస్త్రవేత్తలు, వాల్ట్ డిస్నీ, చార్లీ చాప్లిన్ వంటి కళాకారులు హెలెన్ కెల్లర్, స్టీఫెన్ హాకింగ్ వంటి స్ఫూర్తి ప్రదాతలు ఈ 'డిస్కవరి ఐకాన్స్'లో దర్శనం ఇస్తారు.

అరుదైన, ఆకర్షణీయమైన చిత్రాల సమాహారం 'డిస్కవరి ఐకాన్స్'. తప్పకుండా ప్రతివారి నేస్తంగా ఉండవలసిన గ్రంథం. ఇది విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ముఖ్యంగా తల్లిదండ్రులకు, సామాన్య పాఠకులకు కూడా ఉపయోగిస్తుంది. జ్ఞాన సముపార్జనకు, వ్యక్తిత్వ వికాసానికి కృషి చేసే వారందరికీ ఉపయుక్తమైందే. ఈ ఐకాన్స్ వివరాలు మన ప్రస్తుత సాంస్కృతిక జీవనానికేగాక మారుతున్న మన స్పందనకు కూడా ప్రతీక.

# మహమ్మద్ అలీ

కండ బలంతో పాటు గుండెబలం, నైతిక బలం, క్రమశిక్షణ వున్న వ్యక్తులు మనకు అరుదుగా కనిపిస్తుంటారు.దానికి తోడు ఆధ్యాత్మికత, పరస్పర విరుద్ధభావాలు కనిపించే ఈ లక్షణాలన్నీ కలగలసిన వ్యక్తే బాక్సర్ మహమ్మద్ అలీ. మానవీయత, ఆదర్శాలు, వ్యక్తిత్వం ప్రపంచంలోనే ఒక ప్రత్యేక వ్యక్తిగా మహమ్మద్ అలీని నిలబెట్టాయి. వాస్తవానికి అలీ జన్మత: ముస్లిం కాదు. అతడి అసలు పేరు కాసియస్ క్లే. నల్లజాతివారి హక్కుల ఉద్యమకారుడు అయిన మాల్కం ఎక్స్‌తో స్ఫూర్తి పొందిన క్లే ఇస్లాంను స్వీకరించి, తన పేరును మహమ్మద్ అలీగా మార్చుకున్నాడు.

తన స్నేహితులంతా జీవితంలో ఏదో ఒకటి సాధించాలనే తపనతో వున్న సమయంలో క్లే తనేం చేయాలో అప్పటికే నిర్ణయించుకుని వున్నాడు. తనంత గొప్ప వీరుడు ఎవరూ వుండబోరంటూ ఆయన చెప్తుంటే ఎవరూ పట్టించుకోలేదు. ఎప్పుడూ సరదాగా వుండే క్లే అలాగే జోక్ చేస్తున్నాడని అందరూ భావించారు. కానీ, అతను చెప్పింది చేశాడు. తన పన్నెండవ ఏట నుంచే ఆయన తన అభ్యాసాన్ని ప్రారంభించాడు. ఆ వయసులో సైకిల్‌ను పోగొట్టుకున్న అలీ, తన సైకిల్ దొంగిలించిన దొంగ దొరికితే వాడిని పచ్చడి చేస్తానంటూ మల్ల యుద్ధంలో శిక్షణ ఇస్తూ, కాపలా వుండే జో మార్టిన్‌తో అన్నాడు. అయితే, ముందుగా నిన్ను నువ్వు కాపాడటం నేర్చుకోమంటూ మార్టిన్ ఇచ్చిన సలహాను క్లే స్వీకరించాడు. ఈ సంఘటనే ఆయన జీవితాన్ని మలుపు తిప్పింది. ఆ రోజు తరువాత నుంచే అలీ షాడో బాక్సింగ్, స్కిప్పింగ్, పంచింగ్ బ్యాగ్ పై కొట్టడం వంటివి ప్రారంభించాడు. ఈ కఠోరమైన అభ్యాసమే రెండు దశాబ్దాలు ఆయన బరిలో గడిపినా ఎటువంటి భారీ గాయాలు తగలకుండా కాపాడింది.వేగంగా, బలంగా, ఆకులా తేలికగా ఎగురుతూ ఆయన ఇచ్చే బాక్సింగ్ పంచ్‌లే అనంతర కాలంలో 'అలీ షఫుల్'గా ప్రాచుర్యంలోకి వచ్చాయి.

బరిలో క్లే సాధించిన విజయాలన్నీ కండబలంతో సాధించినవే కావు. అతను ఎంతో క్రమశిక్షణను పాటించేవాడు. నైతిక ప్రవర్తనను అవలంబించాడు. బాక్సింగ్‌ను ఒక తపస్సులా తలచాడు. లూయివిల్లే సెంట్రల్ హైలో వుండే సమయంలో అతడు మద్యపానానికి, మహిళలకు దూరంగా వుంటూ వెల్లుల్లి నీరు తాగి, సువార్తలు చదువుతూ ఒక సన్యాసిలా జీవించాడు. తన తల్లి ఒడెస్సాలో వుండే మంచితనాన్ని అనుసరించిన అతను తాను చాలా శుభ్రమైన, నిజాయితీ అయిన ఛాంపియన్‌గా వుంటానంటూ తనకు తాను వాగ్దానం చేసుకున్నాడు. అమెరికాలోని శ్వేత, నల్ల జాతి యువత, ముఖ్యంగా నల్లజాతి యువత అలీ వ్యక్తిత్వానికి ముగ్ధులైంది.

తన కదలికలు పకడ్బందీగా వుండేలా అభివృద్ధి చేసుకోవడానికి క్లే ఎక్కువ సమయాన్ని వెచ్చించేవాడు. ఈ అంకితభావం, సూక్ష్మతే క్లే పద్దెనిమిదేళ్ళకే ఒలంపిక్ స్వర్ణ పతకాన్ని చేజిక్కించుకునేందుకు కారణమయ్యాయి. తన ప్రత్యర్థి బలహీనతలను తెలుసుకోవడంలో అతడికి అతడే సాటి. బరిలో వున్న సమయంలో ప్రత్యర్థిని రెచ్చగొట్టేందుకు ఆ సమయంలో ఒకరి పై ఒకరు వ్యంగ్య వ్యాఖ్యలు చేసుకోవడం, వెక్కిరించడం వంటివి చేస్తుంటారు. కానీ క్లే మాత్రం బరిలోకి దిగే ముందు, బరిలోనూ, పోటీ తరువాత కూడా తన శత్రువుల బలహీనతలను ఎత్తిచూపి ఏడిపిస్తుండేవాడు. తన ప్రత్యర్థి ఎప్పుడు ఓడిపోతాడో, నిర్దిష్టంగా చెప్పడానికి క్లే యిష్టపడేవాడు. "నేను చెప్పిన రౌండ్‌లోనే వారు ఓడిపోవాలి" అన్నది అతడి నినాదమైంది.

అతడి సాహసం, ప్రతిభ కారణంగా తన బాక్సింగ్ జీవితకాలంలో అరవై మిలియన్ డాలర్లను సంపాదించగలిగాడు. అతను ఏ మ్యాచ్ ఆడినా ఆ హాల్ అంతా నిండిపోయేది. తొలి భారీ పోరు ద్వారా అతడు గెలుచుకున్నది ఆరు లక్షల డాలర్లు. మియామీలో జరిగిన ఈ పోరులో అప్పటికే ప్రముఖుడు, బలవంతుడు అని

పేరు పడిన సోనీ లిస్టాన్‌ను క్లే ఓడించాడు. అప్పటికి తొమ్మిదవ ర్యాంక్‌లో వున్న ఇరవై రెండేళ్ళ ఆటగాడికి అది చాలా పెద్ద విజయం, పెద్దమొత్తం. పోరుకు ముందు అప్పటికే హెవీ వెయిట్ ఛాంపియన్‌గా వున్న లిస్టాన్‌ను ఓడిస్తానంటూ తనకు తాను ప్రచారం చేసుకున్నాడు క్లే. "నాకు లిస్టాన్ కావాలి' అన్నది అతడి నినాదం. మీడియాలో కూడా తను లిస్టాన్‌తో బరిలోకి దిగిన తరువాత సీతాకోక చిలుకలా ఎగురుతూ, తేనెటీగలా కుడతానంటూ ప్రకటించాడు. క్లే బహిరంగంగా ఏం చెప్పాడో అదే చేసి చూపించాడు. ఏడవ రౌండ్‌లో లిస్టాన్ లేవలేక కుదేలైపోయాడు. ఈ విజయంతో అందరినీ ఆశ్చర్యపరిచిన క్లే, ఇస్లాం స్వీకరించి తన పేరును మహమ్మద్ అలీ (అల్లాకు అత్యంత ప్రీతిపాత్రుడు) అని మార్చుకోవడం ద్వారా ప్రపంచానికి మరో షాక్ ఇచ్చాడు. నల్లజాతి హక్కుల ఉద్యమకారుడు మాల్కం ఎక్స్ నుంచి స్ఫూర్తి పొందిన క్లే బానిసత్వపు చిహ్నంగా వున్న తన పేరును మహమ్మద్ అలీగా మార్చుకున్నాడు.

తన నూతన విశ్వాసాలతో ప్రభావితమైన అతడు 1967లో బహిరంగంగా వియత్నాంపై యుద్ధాన్ని వ్యతిరేకించాడు. అతడి వ్యాఖ్యలతో నిరసనోద్యమం ప్రారంభమైంది. ఆయన విశ్వాసం చివరకు ఆయనను జైలు పాలు చేయడమే కాకుండా, వరల్డ్ బాక్సింగ్ అసోసియేషన్ ఆ సంవత్సరం అతడికిచ్చిన హెవీవెయిట్ టైటిల్ రద్దుకు దారితీసింది. యవ్వనంలో అత్యంత కీలకమైన సమయాన్ని, మిలియన్ల కొద్దీ డాలర్ల ఆదాయాన్ని కోల్పోయినప్పటికీ అలీ తన అభిప్రాయాలను మార్చుకుని రాజీపడేందుకు సిద్ధం కాలేదు. జైలు నుంచి బయటకు వచ్చిన అలీ తిరిగి బాక్సింగ్ మ్యాచ్‌లలో పాల్గొనడం ప్రారంభించాడు. తన హెవీవెయిట్ టైటిల్‌ను తిరిగి దక్కించుకునేందుకు 1971లో జో ఫ్రేజియర్‌తో 'ఫైట్ ఆఫ్ ది సెంచరీ'కి అతడు సిద్ధపడ్డాడు. అయితే, 15 రౌండ్ల ఆ మ్యాచ్‌లో టైటిల్‌ను అలీ దక్కించుకోలేకపోయాడు. తన ఓటమితో అలీ నిరాశచెందలేదు. తిరిగి 1974లో ఫ్రేజియర్‌తో తలపడి ఆ టైటిల్‌ను దక్కించుకున్నాడు.

అలీ కేవలం తను ప్రత్యేకంగా పునరుద్ధరించిన తన క్రీడకే పరిమితం కాలేదు. ఈ వ్యక్తిత్వంలోని పలు కోణాలు సమకాలీన రాజకీయ, సామాజిక సరళిని ప్రతిఫలించడమే కాదు వాటికో రూపాన్ని ఇచ్చాయి. మానవులందరూ సమానమేనని, వియత్నాంతో యుద్ధం సరికాదని, సిద్ధాంతాలు ముఖ్యమనే భావనలు అరవయ్యవ దశకంలో అలీ ప్రతిఫలించాడని అతడి జీవితచరిత్రను రచించిన థామస్ హాసర్ అభిప్రాయపడ్డారు. ఎన్ని విజయాలు సాధించినా అమెరికాలో అలీ వివక్షతను కూడా చవి చూశాడు. ఒలంపిక్స్‌లో విజయాన్ని సాధించి ఇంటికి వచ్చిన అలీకి లూయివిల్లే డైనర్ హక్కు ఇవ్వడానికి నిరాకరించారు. కారణం అతడు నల్లజాతివాడు కావడమే. కానీ అతడి ఆదర్శవాదం, అతడి మానవీయ కృషి, బలమైన వ్యక్తిత్వం అతడికి ప్రపంచ వ్యాప్తంగా హీరో స్థాయిని తెచ్చిపెట్టాయి.

వయసు మీరిన అలీపై పార్కిన్‌సన్స్ వ్యాధి దాడి చేసింది. దీనికి కారణం బాక్సర్లకు తరచుగా వచ్చే ఎన్సెఫెలోపతి. దీనినే 'పంచ్ డ్రంక్' సిండ్రోమ్ అంటారు. ఆ వ్యాధి లక్షణాలైన కదలికలు మందగించడం, బాలెన్స్ లేకపోవడం, అతడి మాట ముద్దగా రావడానికి కారణమైన ముఖానికి వచ్చిన పక్షవాతం అతడి వ్యక్తిత్వం పై ప్రభావం చూపలేకపోయాయి. ఇంతటి అనారోగ్యంతోనే అలీ 1996లో జరిగిన సమ్మర్ ఒలంపిక్స్‌లో వణుకుతున్న చేతితో కాగడా వెలిగిస్తూ కనిపించి ప్రపంచాన్ని దిగ్భ్రాంతిలో ముంచెత్తారు. ఆరోగ్యం మందగించినా ఆయన ఆధ్యాత్మిక తృష్ణ పెరిగింది. అతడికి మతం పట్ల ఉన్న విశ్వాసాలు బలపడ్డాయి. ఎలాగైనా విజయం సాధించాలన్న లక్ష్యం నుంచి అతడు ప్రేమను పంచాలన్న సందేశాన్ని ఇచ్చే వరకూ ప్రయాణించాడు. రంగులకు తావులేని ఈ సందేశం ఏ జాతివారైనా ఆచరించదగ్గదే!

1932–2002

# ధీరూభాయి అంబానీ

ఏదైనా ఒక విద్యలో నైపుణ్యాన్నీ, ధర్మబద్ధంగా ధనాన్ని సంపాదించేవారు ఎప్పటికీ సంతృప్తి చెందకూడదనీ, సముపార్జనే ధ్యేయంగా ముందుకు సాగిపోతుండాలని నీతిచంద్రిక చెబుతుంది. అయితే అదే నీతిచంద్రిక మరోచోట, అభివృద్ధి చెందడానికి అర్రులు చాచడం సరైన పద్ధతేననీ కానీ ఈ అభివృద్ధికోసం నైతిక విలువలు కోల్పోకూడదని పరోక్షంగా హెచ్చరిస్తుంటుంది. ఇలా రెండు విభిన్న సిద్ధాంతాలనూ సమపాళ్లలో మేళవించి ఉన్నత శిఖరాలను చేరుకునేవారు అతికొద్ది మందే ఉంటారు. ప్రధానంగా వర్తక, వాణిజ్యాలలో ఇది అసాధ్యమని వాదించే వ్యాపారులు చాలా మందే ఉన్నారు. అలాంటి వారికి భిన్నంగా నైతిక విలువలు కోల్పోకుండా భారత వాణిజ్య సామ్రాజ్యంలో మకుటంలేని మహారాజుగా ఆకాశమంత ఎత్తుకు ఎదిగిన వ్యక్తి ధీరజ్‌లాల్ హీరా చంద్ అంబానీ.

ఒక సామాన్యుడైన వీధి వర్తకుడిగా కార్యరంగంలోకి దిగి అతి తక్కువ కాలంలోనే భారతదేశ వ్యాపార, వాణిజ్యాలను శాసించగలిగే స్థాయికి ఎదిగిపోయిన మహోన్నత కార్యశీలి ఆయన. భారత మార్కెట్‌ను మాత్రమే శాసించే స్థాయితో ఆగిపోలేదు. ఈ దేశ రాజకీయాలలో సైతం చక్రం తిప్పగల సమర్థుడాయన. గుజరాత్‌లోని సౌరాష్ట్ర ప్రాంతంలోని గాంధీజీ పుట్టిన పోర్‌బందర్‌కు చేరువగా ఉన్న "ఛోర్‌వాడ్" గ్రామంలో ధీరూబాయి అంబానీ 1932లో జన్మించారు. చిన్ననాటి నుంచే అంబానీపై చుట్టుపక్కల గల సమాజప్రభావం విపరీతంగా ఉండేది. ధనాన్ని సంపాదించడమే ధ్యేయంగా సౌరాష్ట్రలోని వ్యాపారస్తులు పోటీపడటం ఆయనకు బాగా నచ్చింది. గుజరాతీల పండుగలు, పర్వదినాలు వచ్చినప్పుడు కావలసిన సరుకులను పట్నం నుంచి తీసుకొచ్చి లాభం వేసుకుని అమ్మేవాడు. తన తండ్రి కన్నా భిన్నంగా బడిపంతులుగా వచ్చే చాలీ చాలని జీతంతో బతకకూడదని భావించిన అంబానీ అన్వేషణా దృక్పథంతో, ప్రయోగాత్మక పథంలో అకుంఠిత దీక్షతో అవరోధాలను అడ్డుతొలగించుకుంటూ ముందుకు సాగిపోగలిగే మానసిక స్థైర్యం, పట్టుదల అంబానీ సొంతం. చిన్నతనంలో చదువు అంతగా అబ్బలేదు. చదువు అంతగా ఒంటబట్టకపోయినా వ్యాపార సూత్రాలను నేర్చుకొని క్రమంగా ఒక్కో మెట్టు ఎక్కడం మొదలుపెట్టాడు. ఎప్పుడూ ఒకే రకమైన వ్యాపారమే చేసి ఉంటే ఆయన ఓ వ్యాపారిగా ఉండిపోయేవారేమో కానీ అంబానీ తీరు దానికి పూర్తిగా విరుద్ధం. మారుతున్న ప్రజల అవసరాలను ముందుగానే గుర్తించడం ఆయనకున్న ప్రత్యేక లక్షణం. అందుకే అంబానీ ఎప్పుడూ ఒకే తీరులో ఉన్న వ్యాపారాలను చేయలేదు.

భగవద్గీతలో పేర్కొన్న 'నీ కర్తవ్యాన్ని నువ్వు నిర్వర్తించు ఫలితం ఆశించకు' అన్న సూక్తి అంబానీ మనస్తత్వానికి పూర్తిగా విరుద్ధం. ఫలితమే తదుపరి కర్తవ్యాన్ని బోధిస్తుందనేది ఆయన నమ్మిన సూత్రం. ఆ విశ్వాసమే ఆయనను ఇంతటి వాడిని చేసిందని ఆయన అభిమానులు అంటుంటారు. ఈ విశ్వాసమే లేకపోతే ఆయన వ్యాపారంలో ఒక్కో మెట్టూ ఎదిగి పైకి వచ్చి ఉండేవాడు కాదు. తన తండ్రిలాగే బడిపంతులో, సర్కారీ గుమస్తానో అయి ఉండేవాడు. ఒక వ్యాపారంలో వచ్చిన లాభాన్ని పెట్టుబడిగా పెట్టి అంబానీ మరో వ్యాపారం చేసేవాడు. దాని ఫలితంగా

మరింత డబ్బు సంపాదించేవారు. అంబానీకి 17 ఏళ్లు రాకముందే స్థానికంగా చిన్న వ్యాపారాల్లో పూర్తి పట్టు సంపాదించారు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఇంధనం చుట్టూనే పరిభ్రమిస్తుందని అంబానీ చిన్న వయసులోనే తెలుసుకున్నాడు. అందుకే ఒక దశలో వ్యాపారాల్లో సంపాదించిన ధనాన్ని తండ్రికిచ్చి భారతదేశాన్ని వదిలి, బ్రిటీష్ కాలనీగా ఉన్న ఆడెన్ చేరుకున్నాడు. అక్కడ బ్రిటీష్ షెల్ అనే ఆయిల్ కంపెనీలో 300 రూపాయల జీతానికి ఉద్యోగిగా చేరాడు. ఇక్కడే చమురు పరిశ్రమకు సంబంధించిన విశేష అనుభవాన్ని సంపాదించుకున్నాడు. ఈ కంపెనీలో నేర్చుకున్న పాఠాలే ఆయన విజయానికి ప్రధాన కారణం. కొన్నాళ్ల తరువాత ప్రమోషన్‌తో షెల్ కంపెనీకి అనుబంధంగా ఉన్న ఎబీస్ కంపెనీలో ఎక్కువ జీతానికి కుదిరాడు. అరబిక్ భాష కూడా నేర్చుకుని స్థానిక వ్యాపారులతో సత్సంబంధాలను ఏర్పర్చుకున్నాడు. ఈ రెండు కంపెనీల్లో నేర్చుకున్న పాఠాలు, వ్యాపార సూత్రాలూ ఆయనకు తన మీద తనకు సంపూర్ణ విశ్వాసాన్ని కలిగించాయి. ఇక తనకు తిరుగులేదన్న నమ్మకం పూర్తిగా కలిగిన తరువాత ఆయనే 1958లో భారతదేశం తిరిగి వచ్చారు. తన ఆశయాలూ, ఆలోచనలకూ తగిన నిర్మాణ వేదిక సౌరాష్ట్రలో లేదని గ్రహించిన వెంటనే ఆయన ముంబై వెళ్ళిపోయారు.

1958లో అంబానీ ముంబై చేరుకున్న వెంటనే నైలాన్, రేయాన్, జీడిపప్పు, మిరియాల వ్యాపారాన్ని ప్రారంభించేందుకు 'రిలయన్స్ కమర్షియల్ కార్పొరేషన్' సంస్థను ఏర్పాటు చేశాడు. ఆడెన్‌లో పనిచేసిన అనుభవం, అక్కడ వ్యాపారులతో ఏర్పర్చుకున్న సత్సంబంధాలు ఆయనకు వ్యాపారంలో ఉపయోగపడ్డాయి. దీంతో రెండు మూడేళ్లలోనే ఈ రంగంలో తలపండిపోయిన వ్యాపారులను కూడా ఆయన ఓడించడం మొదలుపెట్టారు. అనుభవంతో పాటే ముందు చూపు అపారంగా ఉన్న అంబానీ ఇక వెనక్కి తిరిగి చూసుకోలేదు. 1960 ప్రాంతంలో భారతదేశంలో రేయాన్ ఉత్పత్తి ప్రారంభమైంది. అయితే నైలాన్ మాత్రం దిగుమతి చేసుకోవాల్సి వచ్చేది. దీనితో ప్రభుత్వం రేయాన్ ఎగుమతి చేసే సంస్థలకు నైలాన్ దిగుమతుల్లో రాయితీలు, ప్రోత్సాహకాలు ప్రకటించింది. ప్రభుత్వం తీసుకున్న ఈ నిర్ణయమే అంబానీ జీవితాన్ని, వ్యాపారాన్ని మలుపు తిప్పిందని చెప్పవచ్చు. అహోరాత్రులూ శ్రమించి రేయాన్ ఎక్కువ ఉత్పత్తి చేసి నైలాన్‌ను దిగుమతి చేసుకొని పరిశ్రమలకు ఎక్కువ ధరకు అమ్మేవాడు. దీంతో రిలయన్స్‌కు లాభాల పంట పండింది. తరువాత ఆయన దృష్టి సింథటిక్ ఉత్పత్తి మీద పడింది. కేవలం పదేళ్ళ వ్యవధిలో సింథటిక్, పాలియెస్టర్ ఉత్పత్తిలో రిలయన్స్ దేశంలోని అగ్రశ్రేణి సంస్థల జాబితాలోకి చేరిపోయింది. ఏడాదికి 10 వేల టన్నుల పాలియెస్టర్ ఫిలమెంట్ యార్న్‌ను ఉత్పత్తి చేసే లక్ష్యంతో ముంబైకి చేరువలోని పాతాళగంగ వద్ద 1980లో అత్యంత ఆధునికమైన పరిశ్రమని స్థాపించారు. ఇది క్రమంగా 35 వేల టన్నులు, ఆపై 50 వేల టన్నుల సామర్థ్యానికి పెరిగింది. పక్షవాతంతో ఆరోగ్యం క్షీణించడంతో అంబానీ తను పాతికేళ్లుగా శ్రమించి నిర్మించిన వ్యాపార సామ్రాజ్యాలను తన కుమారులు ముఖేష్, అనీల్ అంబానీలకు అప్పగించారు

1929-
2004

# యాసెర్ అరాఫత్

అతడిపై చాలా కాలం తీవ్రవాది అనే ముద్ర వుంది. తరువాతి కాలంలో ఆయనే నోబెల్ శాంతి బహుమతి గ్రహీత అయ్యారు. హింస నుంచి శాంతి వరకూ ప్రయాణించిన ఆయనే 'యాసిర్ అరఫాత్'! ఆయన ఆశయం 'ప్రత్యేక పాలస్తీనా' సృష్టి. 1993లో శాంతి ప్రక్రియ ప్రారంభం అయ్యేవరకూ ఇజ్రాయిల్, పాశ్చాత్య దేశాలు ఆయనకు తీవ్రవాది అనే ముద్ర వేసి, ఆయన ఓటమిని గాఢంగా కోరుకున్నాయి. కానీ ఆయన ఏ ముద్రల కారణంగానూ చలించలేదు. మాతృభూమి పునరుద్ధరణ అన్న ప్రజల కలను సాకారం చేసేందుకు నిరంతర కృషిలో నిమగ్నమయ్యారు. ప్రత్యేక పాలస్తీనా సృష్టి అనే సంక్లిష్ట లక్ష్యాన్ని సాధించేందుకు అవిశ్రాంతంగా పోరాడారు.

తాను విద్యార్థిగా వున్నప్పుడు తన కార్యకలాపాలను ప్రారంభించాడు. బ్రిటిష్ సేనలు, ఇజ్రాయిల్ రక్షణ దళాలతో పోరాటం చేస్తున్న అరబ్బులను సాయుధులను చేసేందుకు 1948లో ఆయన ఈజిప్టు నుంచి జెరూసలేంకు ఆయుధాలను చేరవేశాడు. యూదులతో వ్యాపారం చేస్తున్నారనే ఆరోపణలను ఎదుర్కొనడంతో వ్యాపారవేత్త అయిన అరఫాత్ తండ్రి తన కుటుంబాన్ని గాజా నుంచి కైరోకి తరలించాడు. కాగా, అసలు అరఫాత్ కైరోలోనే జన్మించాడన్నది మరొక వాదన. ఇజ్రాయిలీలకు వ్యతిరేకంగా పోరాటం చేసిన అనంతరం ఆయన 1949లో ఇంజనీరింగ్ చదివేందుకు వెళ్ళాడని అంటారు. ఆ సమయంలోనే స్వల్ప కాలం ఐరోపాలో పర్యటించిన అరఫాత్ కేవలం పాలస్తీనా సమస్యపై పోరాడటంతో సంతృప్తి పడక రాజైన ఫైజల్‌కు వ్యతిరేకంగా కుట్రపన్నాడు. ఈ విషయం బయటపడటంతో అతడు ఈజిప్టు నుంచి ప్రవాసం వెళ్లవలసి వచ్చింది. 1956లో ఆయన మరొకరితో కలిసి 'అల్ ఫతా' అనే తిరుగుబాటు గ్రూపును ప్రారంభించాడు.

పేరు చాలా గొప్పగా ఉన్నప్పటికీ, అల్‌ఫతా కొత్తగా ఏర్పడ్డ ఇజ్రాయిల్‌కు వ్యతిరేకంగా పోరాడుతున్న అరబ్బుల సమూహం మాత్రమే. కువైట్‌లో కమెండోలకు శిక్షణ ఇవ్వడంలో వ్యవస్థాపరమైన నైపుణ్యాన్ని చూపిన అరఫాత్, ఇప్పుడు పోరాటంలో తన తెలివిని చూపాడు. ఇజ్రాయిల్‌పై మెరుపుదాడులు చేస్తూనే మరొక పక్క బలమైన ఇజ్రాయిలీ సేనలతో తలపడటానికి ఇష్టపడని సైనికులను కూడా ఆకర్షించి అందులోకి దింపడం సాధించాడు.

సమైక్య అరబ్ ప్రభుత్వాలు తమను పరికరంగా ఉపయోగించుకునేందుకు 1964లో సృష్టించిన పాలస్తీనా విమోచన సంస్థ అరఫాత్‌ను లక్ష్యం లేని ఒక ఆయుధంగా పరిగణించింది. ఇదే సమయంలో ఇజ్రాయిలీ దళాలు అల్‌ఫతా యోధులను నేలకూల్చగా, అస్థిర అరబ్బు స్పాన్సర్లు అతడి ప్రజలతో రాజకీయం చేశారు.

మొత్తంమీద 1969లో అరఫాత్ ప్రణాళికలు తొలి ఫలితాన్నిచ్చాయి. అతడు పిఎల్ఓ చైర్మన్‌గా ఎన్నికయ్యాడు. చైర్మన్ అయిన వెంటనే అతడు పొరుగుదేశమైన జోర్డాన్ నుండి ఇజ్రాయిల్‌పై దాడులు ముమ్మరం చేశాడు. కానీ అతడు తన బలాన్ని తప్పుగా అంచనా వేశాడు. ఇజ్రాయిల్ నుంచి వచ్చిన ఒత్తిడి కారణంగా జోర్డాన్ రాజు హుస్సేన్ పిఎల్ఓకి వ్యతిరేకంగా చర్యలు చేపట్టి, ఆ సంస్థ కమెండోలను తన దేశ భూభాగం నుంచి తరిమి వేశాడు. దీనినే 'బ్లాక్ సెప్టెంబర్ పర్జ్' అంటారు. ఇజ్రాయిల్ శత్రు వైఖరి, అరబ్బుల అవకాశవాదం, ప్రపంచం తమ పోరాటాన్ని నిర్లక్ష్యం చేస్తోందన్న భావన అధికం కావడంతో పిఎల్ఓ చిన్న గ్రూపులుగా చీలిపోయి తమ పోరాటాన్ని సాగించింది. విమానాలను హైజాక్ చేయడం, బడిపిల్లలపై దాడులు, ఒలెంపిక్ అథ్లెట్ల మీద

దాడులు వంటివి ప్రపంచానికి పరిచయం చేసింది. అరఫాత్, పిఎల్ఓ గ్రూపుల నాయకుడే నన్న విమర్శ ఉంది. ఆ రకంగా 'కఫుజె' ధరించిన అరఫాత్ పాశ్చాత్య హృదయాల్లో భయాన్ని, ద్వేషాన్ని రగిల్చాడు.

కాలక్రమంలో అరఫాత్ పోరాటశైలి రాజకీయ విధ్వంసానికి ఆహ్వానం పలికింది. ఐక్యరాజ్య సమితికి పిస్టల్ హోల్స్టర్ ధరించి యూనిఫాంలో అరఫాత్ వెళ్లాడు. ఇజ్రాయిలీలు సముద్రతీరం వరకు తరిమిన పిఎల్ఓ కమెండోలను ఐక్య రాజ్య సమితి సేనలు 1982లో ఖాళీ చేయించాయి. ఆ రకంగా వారు కేవలం తొమ్మిది వారాల విజయాన్ని మాత్రమే చవిచూశారు. 1991లో గల్ఫ్ యుద్ధ సమయంలో సద్దాంహుస్సేన్‌కు అరఫాత్ తన మద్దతు ప్రకటించాడు. కానీ త్వరలో పాశ్చాత్య, అరబ్బు సేనలు ఇరాకీలపై దాడి చేయడాన్ని ఆయన చవిచూడవలసి వచ్చింది. 1993 నాటికి దాని సోవియట్ స్పాన్సర్లు అదృశ్యం కావడం, అరబ్ మిత్ర పక్షాలు చల్లబడటంతో పిఎల్ఓ దివాలాతీసి, ఏకాకి అయింది. ఐదు సంవత్సరాలపాటు పలు ప్రాంతాలను అల్లకల్లోలం చేసిన 'ఇంతిఫాదా'ను నియంత్రించలేకపోయింది.

కానీ అరఫాత్ ఒకరకంగా గెలుపు సాధించాడు. పాలస్తీనా సేనల్లో పెరుగుతున్న ఇస్లామిక్ మతతత్వ వాదంతో ఇజ్రాయిలీ నాయకులకు అరఫాత్ మితవాదిగా కనిపించాడు. అంతిమంగా ఇజ్రాయిలీలు



అరఫాత్‌తో సంప్రదింపులు ప్రారంభించారు. అనతి కాలంలోనే అతడు వైట్‌హౌస్‌లో ఇత్జాక్ రబీన్‌తో కరచాలనం చేస్తూ కనిపించాడు. అతడితోనే 1994 నోబెల్ శాంతి బహుమతిని అరఫాత్ పంచుకున్నాడు. పిండదశలో వున్న పాలస్తీనాకు పురాతన నగరమైన జెరికో కేంద్రమైంది. తన మాతృభూమి గాజాకు తిరిగి వచ్చిన అరఫాత్ ఉద్వేగంతో కళ్లనీళ్లు పెట్టుకున్న ఫోటో ప్రపంచవ్యాప్తంగా ప్రచురితమైంది. ప్రత్యేక పాలస్తీనా కల వాస్తవరూపం దాలుస్తుందని, శాంతి ప్రక్రియ విజయవంతమవుతుందని ప్రపంచం భావించింది.

అనుకున్నవి అనుకున్నట్టు జరిగితే చరిత్రే లేదు. 1995లో రబీన్ హత్యకు గురయ్యాడు. ఆయనను హత్యచేసింది ఏ అరబ్ తీవ్రవాదో లేక పిఎల్ఓ సాయుధ సైనికుడో కాదు. మితవాది అయిన ఒక ఇజ్రాయిలీ. అనంతరం జరిగిన ఎన్నికల్లో రైట్‌వింగ్ 'లికుడ్' అధికారం చేజిక్కించుకుంది. దానికి నాయకత్వం వహించింది అమెరికా మద్దతుదారులైన బెన్యామిన్ నెతన్యాహు. నూతన ప్రధాని శాంతి ప్రక్రియకు తక్షణమే అడ్డుకట్ట వేశాడు. దీనితో నిరాశ చెంది, ఆగ్రహంతో నిండిన పాలస్తీనా ప్రజలున్న రాజకీయంగా, చట్టపరంగా అస్పష్టమైన భూభాగాన్ని అరఫాత్ పాలించవలసి వచ్చింది. సాయుధ తిరుగుబాటు కన్నా పాలన చాలా క్లిష్టమైన వ్యవహారమని ఆయనకు అర్థమైంది. అవినీతిలో కూరుకుపోయిన పాలస్తీనా అధికారులు ఒక్క చిన్న ప్రాజెక్టును కూడా సమర్థవంతంగా నిర్వహించలేకపోయారు. తమ నూతన ప్రభుత్వం సాంప్రదాయసిద్ధమైన అరబ్ రాజకీయాలతో పశ్చిమాసియాలోని నియంతృత్వం వైపు పాలస్తీనాను తీసుకువెడుతుందేమోనని అనేకమంది పాలస్తీనావాసులు ఆందోళన చెందుతున్నారు. ఇదిలా వుండగా, 1993లో ప్రారంభమైన శాంతి ప్రక్రియ పూర్తి కావడాన్ని చూడాలని ప్రపంచం మాత్రం కోరుకుంటోంది.

1860-
1935

# జేన్ ఆడమ్స్

'మగవారి వ్యవహారాల్లో కలుగచేసుకుంటోంది' అంటూ ఆమెను దేశాధ్యక్షులు అపహాస్యం చేశారు. మీడియా ఎద్దేవా చేసింది. "ఆమె అమెరికాలోనే అత్యంత ప్రమాదకరమైన మహిళ" అంటూ ప్రభుత్వం ముద్రవేసింది. అయినా, ఇవేవీ ఆమె నమ్మకాలను సడలించలేకపోయాయి. ఆమె చేస్తున్న పనిని ఆపలేకపోయాయి. అమెరికా అంతర్యుద్ధ ప్రారంభానికి ఒక సంవత్సరం ముందు జన్మించిన జేన్ ఆడమ్స్ ఆ దేశం అత్యంత సంక్షోభాన్ని ఎదుర్కొంటున్న కాలంలో జీవించారు. అంతర్యుద్ధం ముగుస్తుండగానే, పారిశ్రామిక విప్లవ దుష్ప్రభావాలు ప్రారంభమయ్యాయి. బాల కార్మికులు, దారుణమైన పని పరిస్థితులు, దారిద్ర్యం, ఐరోపా నుంచి వలస వచ్చినవారిని నగరీకరణలోకి నెట్టివేశాయి. మొదటి ప్రపంచ యుద్ధ సమయం తరువాత వచ్చిన 'గ్రేట్ డిప్రెషన్' (ఆర్థిక మాంద్యం) కూడా ప్రజలపై ప్రభావాన్ని చూపింది. ధనికులైన జర్మన్-ఆంగ్ల తల్లిదండ్రులకు జన్మించిన ఐదుగురు కుమార్తెలలో ఒకరైన ఆడమ్స్ ఈ మూడు సంఘటనల కారణంగా ఏర్పడిన సమస్యలనుంచి ప్రజలకు ఊరట కలిగించేందుకు తన చివరి శ్వాస వరకూ కృషి చేసింది. చికాగోలో నివాసం ఏర్పరచుకున్న ఆమె నిరుపేదలకు ఆహారం తయారు చేయడం నుంచి, న్యాయమైన పని చట్టాల కోసం మద్ధతు కూడగట్టడం, మహిళా హక్కుల కోసం మద్ధతును సమీకరించడం, అంతర్జాతీయ ఒప్పందం కోసం తన కుటుంబ విశ్వాసాలను ఉపయోగించి బుజ్జగించడం వంటి ప్రయత్నాలు చేశారు. తన ప్రదర్శనలతో, పత్రికలలో వ్యాసాలతో మగవారి వ్యవహారాలలో కలుగచేసుకుంటోందన్న అపవాదును ఎదుర్కొంటూనే సమస్యలను ప్రజల, ప్రభుత్వాల దృష్టికి తెచ్చారు. ఎన్ని దూషణలు ఎదురైనప్పటికీ నైతిక వర్తన, తన విశ్వాసాలపై తనకున్న నమ్మకం ఆమె ముందుకు దూసుకుపోయేందుకు తోడ్పడ్డాయి. ఆ విశ్వాసం, కార్యదీక్ష, దృఢసంకల్పమే ఆమెకు నోబెల్ శాంతి బహుమతి ప్రకటించేందుకు కారణమయ్యాయి.

1881లో లింకన్‌కు స్నేహితుడు, రిపబ్లిక్ సెనేటర్ అయిన ఆమె తండ్రి మరణం మినహా, లారా జేన్ ఆడమ్స్ జీవితం ఒక దశవరకూ ప్రశాంతంగానే కొనసాగింది. రాక్‌ఫోర్డ్ మహిళా సెమినరీలో సేవ చేయాలన్న సంకల్పంతో ఆమె ఫిలడెల్ఫియాలో మెడికల్ కళాశాలలో చేరారు. కానీ అనారోగ్య కారణాలవల్ల ఆమె దానిని మధ్యలోనే వదిలిపెట్టవలసి వచ్చింది. 1883లో ఆమె చేపట్టిన బ్రిటిష్ పర్యటన సందర్భంగా ఆమెకు బ్రిటీష్ సెటిల్మెంట్ కేంద్రమైన 'టాయ్‌నబీ హాల్'తో పరిచయమైంది. ఆమె తన జీవితం చివరి వరకూ కొనసాగించిన కృషికి స్ఫూర్తి అదే. ఆ వెంటనే ఆమె తన జీవితకాల మిత్రురాలైన ఎల్లెన్ గేట్స్ స్టార్‌తో కలిసి స్వదేశంలో అటువంటి సంస్థనే ఏర్పాటు చేసేందుకు ప్రణాళికలు సిద్ధం చేయడం ప్రారంభించింది.

ఈ ఇద్దరు యువతులూ షికాగోలోని వెస్ట్ సైడ్‌లోని ఒక మురికివాడలోని శిథిలభవనంలోకి తమ మకాం మార్చారు. 'హల్ హౌస్' అనే పేరుతో అక్కడ నుంచే తమ ప్రగతిశీల కార్యకలాపాలకు శ్రీకారం చుట్టారు. అక్కడ ఒక బలమైన, ఔత్సాహిక కమ్యూనిటీ సెంటర్‌ను నిర్మించేందుకు మధ్య తరగతి మహిళల, కళాశాల విద్యార్థుల ప్రతిభను, మద్ధతును కూడగట్టారు. ప్రాథమికమైన కూడు, గుడ్డ, గూడు కల్పనతో పాటుగా అది ఒక సాంస్కృతిక కేంద్రంగా రూపుదిద్దుకుంది. అంతేకాకుండా విదేశాలలో జన్మించి, ఇక్కడకు వలస వచ్చిన వారికి ఉద్యోగ కౌన్సిలింగ్, వైద్య పరీక్షలు, సలహాలు ఈ కేంద్రంలో అందించేవారు. సామాజిక సమస్యల లక్షణాలను ఎత్తిచూపడంతోనే సమస్య పరిష్కారం కాదని, నేరాలు, దారిద్ర్యానికి గల కారణాలను తెలుసుకొని నివారణ చర్యలు చేపట్టడం కూడా అంతే ముఖ్యమని ఆడమ్స్ విశ్వసించారు. ఈ కేంద్రాన్ని ఏర్పాటు చేసిన తొలి దశాబ్దంలోనే ఆమె స్థానికుల ప్రధాన సమస్యలను ఎత్తి చూపుతూ 'హల్ హౌస్ మ్యాప్ అండ్ పేపర్స్'ను ప్రచురించారు. దీనితోనే తొలిసారిగా సోషియాలజీ ఒక ప్రత్యేక వృత్తిగా రూపాంతరం చెందింది.

1907 నాటికి ఈ సంస్థ 13 భవనాల సముదాయంగా ఎదిగింది. దానితోపాటుగానే సామాజిక, రాజకీయ లక్ష్యాల పరిధి కూడా విస్తరించింది. స్థానిక దాతలు అందించే ఆర్థిక సాయంతో కేంద్రాన్ని నడుపుతూ, కొత్తగా వస్తున్న వారి పట్ల రెండవ తరం వలసదారులు ఆగ్రహాన్ని, అసహనాన్ని తగ్గించేందుకు చట్టపరిధిలో అందరికీ సమానంగా న్యాయం అందేందుకు ఆడమ్స్ తన ప్రచారాన్ని ఉద్యమాన్ని ఉధృతం చేసింది.

'హల్ హౌస్'ను నిర్వహిస్తున్న కాలంలో ఆమె ఓటు హక్కు విషయంలో కూడా ఉద్యమించారు. లుక్రేటియా మాట్, జూలియా వార్డ్ హో, సూసాన్ బి అంథోని, కారీ చాప్‌మన్ కాట్‌లతో పాటుగా మహిళలకు స్థానిక వ్యవహారాల నిర్వహణలో భాగస్వామ్యం ఇవ్వాలని పిలుపిచ్చింది. మానవీయ పరిష్కారంలో మహిళల నైతికత, ఉదారత, దయ ఎంతో ప్రభావాన్ని చూపుతాయని ఆమె వాదించారు. ఈ విషయంపై ఆమె ప్రాంతీయ స్థాయిలోనూ, జాతీయ స్థాయిలోనూ పోరాటం చేశారు. ఈ నేపథ్యంలో ఆడమ్స్ 1911-14 కాలంలో 'నేషనల్ అమెరికన్ వుమన్ సఫ్రేజ్ అసోసియేషన్ (జాతీయ అమెరికా మహిళా ఓటు హక్కు సంస్థ) ఉపాధ్యక్షురాలిగా పనిచేశారు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఆమె తన ఫెమినిస్టు రాజకీయ అజెండాను శాంతివాదంతో జోడించారు. తరువాత 1915లో హేగ్‌లో జరిగిన అంతర్జాతీయ మహిళా సదస్సుకు ఛైర్‌పర్సన్‌గా ఆమె వ్యవహరించారు. తమ తమ దేశాలలో యుద్ధ అనుకూల వర్గాల వేధింపులకు, అమాయకులంటూ వెక్కిరింతలకూ గురైనా ఈ సదస్సు సభ్యులు తాము ఆయుధాలు ధరించకుండా తటస్థ వర్గాలను యుద్ధం చేస్తున్న దేశాల మధ్య సంధానకర్తలుగా వ్యవహరించమని ఒప్పించేందుకు విఫలయత్నాలు చేశారు. ఈ మేరకు ఆడమ్స్‌తో సహా ఎమర్జెన్సీ పీస్ ఫౌండేషన్ సభ్యులతో కూడిన బృందం అధ్యక్షుడు విల్సన్‌తో సమావేశమైంది. అయితే విల్సన్ వారి శాంతి వాదనలతో ఏకీభవించలేదు. అందుకు అంగీకరించలేదు.

దీని కారణంగా అమెరికాలో అధికభాగం ప్రజలు, ఆడమ్స్ మిత్రులు, భాగస్వాములు విల్సన్ ప్రతిపాదించిన పద్నాలుగు సూత్రాలను అసంతృప్తిగా అనుసరించవలసి వచ్చింది. ఈ నేపథ్యంలోనే విదేశీయుల, విదేశీ తిరుగుబాటుదారులపై దౌర్జన్యాల పట్ల ఆమె అభ్యంతరాలు, జర్మన్ యుద్ధబాధితులకు ఆహారం ఇవ్వడానికి ఆమె చేసిన ప్రయత్నాలు, ముసాయిదాకు వ్యతిరేక వైఖరిని అవలంబించడం వంటి కారణాలన్నీ ఆమెను ద్రోహిగా ముద్రవేసేందుకు దోహదం చేశాయి. ఆమెకు దేశభక్తిపై బహిరంగంగా అనుమానాలు వ్యక్తమయ్యాయి. ఆమె ఆర్థిక సాయాన్ని అందిస్తున్న వారి విశ్వాసాన్ని ఆమె కోల్పోయారు. తన తోటి సంఘ సంస్కర్తల నమ్మకాన్ని కోల్పోయారు! థియోడర్ రూజ్‌వెల్ట్ ఎన్నిక కావడానికి ఆమె ఎంతో సాయపడినప్పటికీ ఆయన కూడా ఆమెను దూరంగా వుంచారు. సొంత ప్రభుత్వమే ఆమెను 'అమెరికాలోని అత్యంత ప్రమాదకరమైన మహిళ' అంటూ ముద్రవేసింది. ఈ పరిణామాలతో ఆరోగ్యం బాగా దెబ్బతిన్నప్పటికీ, ఆమె తన పనిని ఆపలేదు. 1919లో ఆమె వుమెన్స్ ఇంటర్నేషనల్ లీగ్ ఫర్ పీస్ అండ్ ఫ్రీడంకు అధ్యక్షురాలయ్యారు. ఒప్పందంలోని కఠినమైన అంశాలను అమలు చేయడంలో నానాజాతి సమితి అధికారాలు లేనిదవుతోందని భావించిన తరుణంలో ఈ సంస్థ ఏర్పడింది. అయితే దీనిపై కమ్యూనిస్టు సంస్థ అని ముద్రవేశారు.

తాను నమ్మిన భావాలు కార్యరూపం దాల్చేందుకు ఆమె చేసిన కృషిలో దూషణ భూషణలను ఎన్నో ఎదుర్కొం టున్నప్పటికీ ఆమె చలించలేదు. ఆమె సహచరులు, సానుభూతి పరులు ఆమెను 'సెయింట్ జేన్' అని పిలుచుకునేవారు. ఆడమ్స్‌కు 1931లో నోబెల్ శాంతి బహుమతిని ప్రకటించారు. అయితే, తీవ్రమైన అనారోగ్య కారణాలవల్ల ఆమె దానిని అందుకునేందుకు స్టాక్‌హోం వెళ్ళలేకపోయారు. ఎన్నో రకాల వేధింపులను, విమర్శలను ఎదుర్కొన్నప్పటికీ ఆమె చేసిన కృషి, ఆమె స్ఫూర్తి అమెరికా నగరాలలోని సమాజాన్ని ప్రభావితం చేసిందన్నది వాస్తవం.

1882-
1941

# వర్జీనియా ఊల్ఫ్

ఎవరి జీవితంలోనైనా అత్యంత అపురూపమైనది బాల్యం. బాల్యంలో ఏర్పడే అభిప్రాయాలు, ఎదురయ్యే అనుభవాలు జీవితాంతం వెంటాడుతాయి. కొందరికి అవి అందమైనవి అయితే, మరికొందరికి అవి విషాదకరమైనవి కావచ్చు. ఏది ఏమైనా కొందరి జీవితాలను ఆ బాల్యంలో ఏర్పడిన భయలు, అనుభవాలే నడిపిస్తాయి. అందుకు ప్రముఖ రచయిత్రి, ఫెమినిస్టు, విమర్శకురాలు వర్జీనియా ఊల్ఫ్ జీవితం గొప్ప ఉదాహరణ. అప్పటి విలాసవంతమైన బ్రిటిష్ సమాజ అభిప్రాయాలను, ప్రయోగాత్మక ఫిక్షన్‌ను రంగరించి చేసిన రచనలతో మంచి రచయిత్రిగా పేరు గడించింది. మంచి జీవితం అంటే సృజనాత్మకత, అత్యున్నత వ్యక్తిగత సంబంధాలే అనే సాహితీ దృష్టికి ఆద్యురాలు ఆమె.

ఊల్ఫ్ పేద కుటుంబంలో జన్మించలేదు. అర్థాకలితో జీవితాన్ని గడపలేదు. ఆమె ధనికుల కుటుంబంలో జన్మించింది. ప్రముఖుడు అయిన సర్ లెస్లీ స్టెఫాన్‌కు, అందమైన జూలియాడక్‌వర్త్‌కు వర్జీనియా జన్మించింది. ఎంతో మంచి కుటుంబంలో పుట్టినప్పటికీ ఆమె బాల్యంలో ఎంతో దుఃఖాన్ని, భయాన్ని అనుభవించింది. అదే ఆమెను జీవితాంతం వెంటాడి వేధించింది. ఆరేళ్ళ వయసులో సవతి సోదరుడు, 18 ఏళ్ల యువకుడు అయిన జార్జి డక్‌వర్త్ ఆమెపై అత్యాచారం చేశాడు. ఆమె యవ్వనంలోకి వచ్చే వరకూ ఈ అత్యాచారం కొనసాగింది. ఈ కారణంగానే ఆమెకు పురుషులతో లైంగిక సంబంధాల పట్ల శాశ్వతంగా భయమేర్పడింది. దీనికి తోడుగా ఆమె పదమూడేళ్ళ వయసులోనే తల్లి జూలియాను కోల్పోయింది. సున్నితమైన ఊల్ఫ్ దీనితో మానసిక భ్రాంతులకు లోనయ్యింది. నలభై ఏళ్ళు వచ్చే వరకు తల్లి గొంతు వినిపిస్తోందని, కనిపిస్తోందనే భ్రాంతిలో వుండేది. సరిగ్గా రెండేళ్ళ అనంతరం ఆమె సవతి సోదరి, పెంపుడు తల్లిలా వ్యవహరించిన స్టెల్లా డక్‌వర్త్ మరణించింది. ఆ తరువాత కొద్ది కాలానికి ఆమె తండ్రి కాన్సర్‌తో పోరాడి కన్నుమూశాడు. బాల్యాన్ని, అమాయకత్వాన్నే కాక తాను ప్రేమించే వారు, తనను ప్రేమించే వారిని చిన్నతనంలోనే కోల్పోయిన ఊల్ఫ్ దాదాపు పిచ్చిదైంది. ఏడవ ఎడ్వర్డ్ పొదలమాటు నుంచి తనను పిలుస్తున్నాడంటూ భ్రాంతి పడేది.

ఈ మానసిక సంక్షోభం నుంచి తప్పించుకునేందుకు ఊల్ఫ్ రాయడం ప్రారంభించింది. దేనికీ లోటు లేని ఊల్ఫ్ బాల్యం నుంచే అత్యంత ఆనందాన్ని ఇచ్చే మరో ప్రపంచాన్ని సృష్టించుకుంది. సాధారణంగా ఏ స్త్రీకి వుండని సౌలభ్యం డబ్బుకు లోటు లేని పరిస్థితి ఊల్ఫ్‌కు లాభించింది. ఎవరూ ప్రేమించనంతగా తన సృజనాత్మక ప్రపంచాన్ని ఊల్ఫ్ ప్రేమించింది. ఎందుకంటే, ఆమెకు జీవితం ఇవ్వలేని నిర్భయత్వం, కాంక్ష, సృజనను ఆ ప్రపంచమే ఇచ్చేది. అటు పిచ్చికి, ఇటు స్థిరత్వానికి మధ్య గల స్పష్టాతిస్పష్టతను ఆమె రాతలు ఎత్తిచూపుతాయి. జీవితంలో రొటీన్‌గా జరిగే వ్యవహారాలే ఆమె రాతల్లో జీవితమైపోయింది.

తండ్రి మరణించిన అనంతరం ఆమెకు ఆ యింటి నుంచి స్వేచ్ఛ లభించింది. దు:ఖం తప్ప మరే జ్ఞాపకాన్ని ఇవ్వని ఆ యింటి నుంచి ఆమె గార్డన్ వీధిలోని బ్లూమ్స్‌బరీకి మారింది. అదే ఆమె సృజనాత్మక మిత్రులకు కేంద్రమైంది. స్వలింగ సంపర్కుడైన లిట్టన్ స్ట్రాచే, తన సోదరి, చిత్రకారుడు వెనెస్సా, లియోనార్డ్ వుల్ఫ్, ఇ.ఎం. ఫోస్టర్, రోగర్ ఫ్రై, క్లైవ్ బెల్, జాన్ మేనార్డ్ కేన్స్ వంటి వారందరికీ ఒక కేంద్రమైంది. అనంతర కాలంలో లియోనార్డ్ ఊల్ఫ్ ఆమెను వివాహం చేసుకున్నాడు.

సాహితీ చరిత్రలోనే అత్యంత ప్రముఖమైన బ్లూమ్స్‌బరీ బృందమిదే. వీరే సాహిత్యాన్ని, కళను విక్టోరియా కాలం నుంచి ఆధునిక కాలంలోకి మలుపు తిప్పారు. తన రచనా వ్యాసంగంలో భాగంగా ఆమె 1905లో 'దిటైమ్స్' సాహితీ సంచికకు వ్యాసాలు, విమర్శలు రాయడం ప్రారంభించింది. ఆ తరువాత పది సంవత్సరాలకు ఆమె తన తొలి నవల 'ది వోయేజ్ ఔట్'ను పూర్తి చేసింది. రచనా వ్యాసంగం ఆమెను మరొకసారి మానసిక సంక్షోభంలోకి నెట్టింది. అదే తిరిగి మరొక నవల 'నైట్ అండ్ డే' (1919) రాయడానికి కారణమైంది. ఆమె నిరంతరం మానసిక వ్యథతోనూ, పిచ్చిదాన్ని అవుతాననే భయంతో పోరాటం చేస్తుండేది. ఆ తరువాత రెండేళ్ళకు తన తొలి కథల పుస్తకం 'మండే ఆర్ ట్యూస్‌డే' వెలువడింది. నాయకుడి అంతర్గత ప్రపంచం పై వెలుగు ప్రసరింపచేసిన, పరిణితితో చేసిన రచన ఇది. ఆమె తదుపరి రచన 'జాకోబ్స్ రూమ్' ఒక సంచలనం. ఒక వ్యక్తిని అతడి గదిలో వున్న అంశాలను, ఇతరులు తమ దృష్టి నుంచి చూడటాన్ని అందులో ఆమె అభివర్ణించింది. మూడేళ్ళ అనంతరం ఆమె రాసిన "మిసెస్ డాలోవే" విమర్శకుల మన్ననలను అందుకుంది. మొదటి ప్రపంచ యుద్ధం సమాజంలోనూ, వ్యక్తిగతంగానూ తెచ్చిన మార్పులను కళ్ళకు కట్టినట్టుగా రచయిత్రి రాసిందని విమర్శకులు దానిని ప్రశంసించారు. తరువాత ఆమె రాసిన 'ది లైట్ హౌస్' పుస్తకం తన కుటుంబ గాథనే పోలివుంటుంది. అదే ఆమెను ఇరవయ్యవ శతాబ్దపు సాహితీ సింహాసనాన్ని అధిష్టింపచేసింది

అయితే, ఊల్ఫ్ రచనలను ఆమె సమకాలీనులు ఎప్పుడూ అర్థం చేసుకోలేదు, ప్రశంసించలేదు. అలాగే ఆమె కూడా ఇతర విప్లవాత్మక రచనలను ప్రశంసించలేదు. ఆమె తన సమకాలీనులైన రచయితల రచనలను నాసిరకం రచనలుగా కొట్టిపారేయగా, ఆమె విమర్శకులు ఆమె రచనలను డ్రాయింగ్ రూం కథలుగా అభివర్ణించేవారు.

మానసిక వ్యథను తగ్గించుకొనేందుకు ఆమె లియోనార్డ్ ఊల్ఫ్ కలిసి 1917లో హోగార్త్ ప్రెస్‌ను ప్రారంభించారు. అప్పటి పురోగమనవాద రచయితలైన డబ్ల్యు.హెచ్.ఆడెన్, కాథరీన్ మాన్స్‌ఫీల్డ్, సిగ్మండ్ ఫ్రాయిడ్ వంటి వారి పుస్తకాలను ప్రచురించిన ఏకైక ప్రెస్ అదే. అయినా, ఈ కార్యకలాపాలేవీ ఆమె మనోవ్యథను తగ్గించలేకపోయాయి. ప్రేమ కూడా ఆమెను మనోవ్యథ నుంచి బయటపడేయలేకపోయింది. విజయవంతమైన ఆమె రచనా వ్యాసంగం, ఆమె కీర్తి ఏవీ కూడా ఆమెకు సాయపడలేదు. అత్యంత ప్రయోగాత్మక 'ఒర్లాండో' అన్న పుస్తకాన్ని ఆమె 1928లో రచించింది. ఆ మరుసటి సంవత్సరం ఫెమినిస్టు రచన అయిన 'ఏ రూమ్ ఆఫ్ వన్స్ ఓన్' వెలువడింది. ఎనిమిదేళ్ళ అనంతరం 'ది ఇయర్స్' వెలువడింది. ఆమె సాహితీపరంగా విజయవంతమైనప్పటికీ, మానసికంగా సంక్షోభంలో కూరుకుపోతూనే వుంది. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యేనాటికి ఆమె పరిస్థితి మరింత విషమించింది. అందుకే, తనను నిరంతరం వెంటాడే మనోవ్యథ అనే రాక్షసిని తప్పించుకోలేక పోయింది. తనను ప్రేమించి, తన కష్టాన్ని, సుఖాన్ని పంచుకున్న భర్తకు ఒక లేఖ రాసి, ససెక్స్‌లో తన ఇంటి సమీపంలో వున్న నది వద్దకు వెళ్ళి తన జేబుల నిండా రాళ్ళు నింపుకుని ఆ నదిలోకి నడిచి వెళ్ళి మునిగిపోయి జీవితాన్ని అంతం చేసుకుంది. మానసిక సంక్షోభం, డిప్రెషన్, సృజనాత్మక రచనల మధ్య లోలకంలా ఊగుతూ జీవితం గడిపిన ఆమె ఆ రకంగా ప్రశాంతతను సాధించింది.

1847-
1931

# థామస్ ఆల్వా ఎడిసన్

చాలా మంది భావిస్తున్నట్టుగా థామస్ ఆల్వా ఎడిసన్ శాస్త్రవేత్త కాదు. ఆయన అమెరికాలో కుప్పలు తెప్పలుగా జనించిన అరుదాతి అరుదైన ఆవిష్కర్తల్లో ఒకడు మాత్రమే. ఆయన దగ్గర 1,093 పేటెంట్లు ఉండేవి. అన్ని పేటెంట్లు ఒకరికే జారీ చేసిన ఉదంతం చరిత్రలో మరొకటి లేదు. ఎడిసన్ విపరీత మనస్తత్వంగలవాడు. స్వోత్కర్షలకు పోయేవాడు. పేచీకోరు. ఆయన మానవ ద్వేషి. ప్రయోగాలు చేయడం అతని నైజం. సాంకేతిక ఇంద్రజాలికుడు. టూకీగా చెప్పాలంటే ఆయనే 20వ శతాబ్దపు ఆవిష్కర్త.

సంఖ్యాపరంగా చూస్తే ఆయన కనిపెట్టిన అనేక నూతనాంశాలు, ఆవిష్కరణల ముందు అనేక మంది ఇతర ప్రతిభావంతులు సాధించిన విజయాలు అంతగా లెక్కలోకి రావు. ఉజ్వలంగా వెలిగే ఎలక్ట్రిక్ బల్బు, విద్యుత్ వ్యవస్థ, ఫోనోగ్రాఫ్, మూవీ కెమెరా వంటివి ఆయన అనేకానేక నూతన ఆవిష్కరణల్లో కొన్ని మాత్రమే. ఆయన కనిపెట్టిన ప్రతి నూతనాంశం ఒక పరిశ్రమ నెలకొనడానికో లేక మరిన్ని నూతన ఆవిష్కరణలకో దారితీసింది. అంతకు ముందే ఎవరో కనుగొన్న విషయాలను మరింత అభివృద్ధి చేయడం, లేదా ఇతరులు చేసిన ఆలోచనల నుంచి ప్రయోజనం పొందడమో ఎడిసన్ అసలైన ప్రతిభ. అయినప్పటికీ, ఊహాత్మకమైన అతని సృజనాత్మకత, నిరంతర ప్రయత్నం, విజయం సాధించాలన్న పట్టుదల చరిత్రలో ఆయన స్థానాన్ని పదిలపరిచాయి.

ఆయన ఓహియోలో జన్మించాడు. ఆయన కుటుంబం రెండు విప్లవాలలో పరాజితులైన వారిని సమర్థించింది. (ఆయన ముత్తాత అమెరికా విప్లవ సమయంలో పాలక పక్షానికి విశ్వాసపాత్రుడు. కెనడాలో జన్మించిన ఆయన తండ్రి విఫలమైన మెకంజీ తిరుగుబాటుదార్లతో కలిసి పనిచేశాడు.) అయినా ఎడిసన్ ఒంటి చేత్తో పారిశ్రామిక విప్లవ కారకుడిగా అవతరించాడు. బాల్యంలో అనేక రకాల జబ్బులు సోకడం వల్ల ఎడిసన్‌కు కొంత చెవుడు ఉండేది. అప్పుడప్పుడూ ఎదురయ్యే శారీరక అశక్తత, కొరవడిన ప్రశాంత చిత్తం కారణంగాఎడిసన్ ప్రతిభావంతుడైన విద్యార్థి కాలేదు. అయితే రసాయన శాస్త్రంలో మంచి పట్టు ఉండేది. ఇంట్లో అతనిని ఆల్వా అని పిలిచేవారు. అతని తండ్రి రెచ్చగొట్టే స్వభావం గలవాడు. విపరీతమనస్తత్వం గలవాడు. తన కొడుకు ఒట్టి బడుద్దాయి అన్నది ఆయన నమ్మకం. అందుకే ఆల్వాకు 12 ఏళ్ల వయసున్నప్పుడే రైళ్లలో పత్రికలు అమ్మడానికి అనుమతించాడు. 1863 నుంచి 1868 మధ్య టెలిగ్రాఫ్ ఆపరేటర్‌గా, రైల్వే కార్మికుడిగా పనిచేసిన ఎడిసన్ అనేక ఊళ్లు మారాడు. ఎన్ని ఊళ్లు తిరిగినా తన చిన్న రసాయనిక ప్రయోగశాలను మాత్రం విస్మరించేవాడు కాదు. పైసా కూడా జేబులో లేని టెలిగ్రాఫర్ అయిన ఎడిసన్ దారిద్ర్యమే 1868లో సరికొత్త సృష్టికి దారి తీసింది. ఒకేసారి రెండు సందేశాలు పంపే పద్ధతిని ఎడిసన్ సృష్టించాడు. ఆ తర్వాత ఆయన స్టాక్ మార్కెట్ ధర వరలు తెలియజేసే స్టాక్ టిక్కర్‌ను కనిపెట్టాడు. ఆ తర్వాత అమెరికాలో పారిశ్రామిక పరిశోధనలకు మద్దతు ఇచ్చే వెస్టరన్ యూనియన్ కంపెనీ ఈ యంత్రంకోసం 1870లో ఎడిసన్‌కు 40 వేల డాలర్లు చెల్లించింది. ఈ డబ్బును ఎడిసన్ న్యూ జెర్సీలోని న్యూ ఆర్క్‌లో ప్రయోగశాలను ఏర్పాటు చేయడానికి వినియోగించుకున్నాడు.

ఎడిసన్ తన జీవిత కాలం అంతా మౌలిక శాస్త్రవేత్తలను చిన్న చూపు చూశాడు. వారు బాన బొజ్జలు గలవారు అని విమర్శించేవాడు. ఎడిసన్ ఆచరణ వాది. అతని నీతి నియమాలు కూడా గొప్పవేమీ కాదు. తన తెలివితేటలన్నింటినీ కేవలం డబ్బు సంపాదించడానికే వినియోగించేవాడు. ఎవరు ఎక్కువ డబ్బిస్తే వారి దగ్గరే పనిచేసేవాడు. వెస్టరన్ యూనియన్ అందజేసిన సహాయంతో ఆయన నాలుగు సందేశాలు ఏక కాలంలో పంపించగలిగే టెలిగ్రాఫ్ ట్రాన్స్‌మీటర్ 'క్వాడ్రూప్లెక్స్'ను సృష్టించాడు. కానీ అతని రుణదాత జే గౌల్డ్ లక్ష డాలర్లు ఇచ్చేసరికి ఆ యంత్రాన్ని అప్పగించేశాడు. అద్భుత ఆవిష్కర్త అయిన ఎడిసన్ ఎలాంటి సంకోచం లేకుండా ఆ డబ్బు పుచ్చుకుని ఆగ్రహించిన వెస్టరన్ యూనియన్‌తో వ్యాజ్యానికి దిగాడు. డబ్బు సంపాదించడంలో గట్టివాడే అయినా ఆర్థిక వ్యవహారాలు ఎడిసన్‌కు అంతగా చేతనయ్యేవి కావు. ఆయన భార్య అనుకూలవతి కాదు. ఆ దశలో ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటూ మకాం న్యూ

జెర్సీలోని మెల్నో పార్క్‌కు మార్చాడు. అక్కడే 1877లో అలెగ్జాండర్ గ్రాహంబెల్ రూపొందించిన టెలిఫోన్‌కు కార్బన్-బటన్ ట్రాన్స్‌మీటర్ తయారుచేశాడు. ఈ సరికొత్త సృష్టే ఇప్పటికీ భారీ ఎత్తున వాడుకలో ఉంది. టెలిఫోన్ పరికరంలో అతి కీలకమైన పరికరం అది.

ఆ మరుసటి సంవత్సరం చాలా మంది మహాద్భుతం అని భావించిన ఫోనోగ్రాఫ్ కనిపెట్టడం నిజంగా గొప్ప విషయమేనని ఎడిసన్ కూడా స్వయంగా భావించాడు. కాగితంతో చేసిన స్థూపాకార పరికరంపై ములుకులాంటి దానితో అక్షరాలుగా మార్చడం ఎలా అని ప్రయత్నిస్తున్న దశలో ఆశ్చర్యకరంగా ఎడిసన్‌కు ఆ యంత్రం నుంచి అస్పష్టమైన ధ్వనులు వినిపించసాగాయి. తాను కనుగొన్న ఈ అద్భుతాన్ని అమలులో పెట్టడంకోసం 21 రోజులపాటు ఎడిసన్ కఠోర పరిశ్రమ చేశాడు. స్నానం కూడా చేయలేదు. చిరుతిళ్లు తినడం, కాఫీ తాగడం తప్ప తిండి కూడా లేకుండా నిరంతరం తీవ్రంగా శ్రమించాడు. చివరకు 1877 డిసెంబర్‌లో తగరపు రేకుతో మెరుగైన సిలిండర్ తయారు చేశాడు. అందులో 'మేరీ హాడ్ ఎ లిటిల్ లాంబ్' అన్న పాట తానే స్వయంగా పాడి రికార్డు చేశాడు. దీన్ని చూసి ఆశ్చర్యచకితమైన యావత్ప్రపంచం ఎడిసన్ 'మెల్నోపార్క్ మాంత్రికుడు' అని కీర్తించింది. అయితే ఒక ఫ్రెంచి శాస్త్రవేత్త మాత్రం ఇది కేవలం కుహనా ధ్వన్యనుకరణ విద్య మాత్రమేనని ఈసడించాడు. నిజానికి ఎడిసన్ సృష్టించిన ఫోనోగ్రాఫ్ వాస్తవమైందే. ఆ ఆవిష్కరణకు ముగ్ధుడైన ఎడిసన్ దానికి తానే పనిగట్టుకుని పెద్ద ఎత్తున ప్రచారం చేశాడు. న్యూయార్క్‌లోని స్టాచ్యూ ఆఫ్ లిబర్టీ తలలో ఫోనోగ్రాఫ్ అమరుస్తానని ప్రకటించుకున్నాడు.

నిశ్శబ్దాన్నించి శబ్దాన్ని సృష్టించడంలో కృతకృత్యుడైన ఎడిసన్ ఇక తన దృష్టిని రాత్రిని పగలుగా మార్చడం మీద కేంద్రీకరించాడు. అతని శక్తియుక్తులన్నీ అందరికీ కంటగింపైన లైట్ బల్బ్ మీద పడ్డాయి. తక్కువ నిరోధక శక్తిగల ఫిలమెంట్ స్థానంలో ఎక్కువ నిరోధక శక్తిగల ఫిలమెంట్‌ను అమర్చి 1879లో ఎడిసన్ కర్బనీకృత దారం లాంటి ఫిలమెంట్‌తో లైట్ బల్బ్ తయారు చేశాడు. ఆ బల్బు మునుపటి కన్నా ఎక్కువసేపు ప్రకాశవంతంగా వెలిగింది. ఆ తర్వాత ఆయన ఆధునిక ఎలక్ట్రికల్ వ్యవస్థకు రూపకల్పన చేశారు. ఆ వ్యవస్థ సహాయంతో 1882లో మన్‌హట్టన్ నగరంలోని కొంత భాగాన్ని వెలుగులతో నింపి దేదీప్యమానం చేశాడు. దురదృష్టవశాత్తు ఎడిసన్ జీవితంలో కూడా కొన్ని లోపాలు ఉన్నాయి. తన దగ్గర ఒకప్పుడు సహాయకుడిగా పనిచేసిన నికోలా టెస్లా రూపొందించిన ఆల్టర్‌నేటింగ్ కరెంట్ (ఏసి) వ్యవస్థను గట్టిగానూ, మోసపూరితంగానూ వ్యతిరేకించినందువల్ల విద్యుత్‌ను విస్తారంగా వాడడం ఆలస్యమైంది. 1888లో తన శక్తియుక్తుల్ని సవ్యంగా ఉపయోగించుకొని కైనెటోస్కోప్‌ను రూపొందించాడు. చిన్న కన్నంలోంచిచూసే ఈ పద్ధతికి ప్రత్యామ్నాయంగా లుమిరీ సోదరులు తెరమీద చిత్రాన్ని ప్రతిబింబింపచేసే విధానాన్ని కనిపెట్టిన తర్వాత ఎడిసన్ వ్యాపారాన్ని పెంపొందించుకునే తన చాతుర్యాన్ని వినియోగించాడు. మరో వ్యక్తి ప్రొజెక్టర్‌ను సంపాదించి దాన్నే 'ఎడిసన్ అద్భుతమైన విటాస్కోప్'గా చెలామణి చేశాడు. అయితే ఎడిసన్ మంచి భర్త, మంచి తండ్రి కాలేకపోయాడు. చాలా అరుదుగా మాత్రమే ఇంటికెళ్ళేవాడు. తన ప్రయోగశాలలోనే నిద్రపోయేవాడు. ఇరవయ్యవ శతాబ్దం తొలినాళ్లలో ఆయన కుయుక్తితో అనేక కంపెనీలను ఏర్పాటు చేయడంలో నిమగ్నమయ్యాడు. కొత్త కంపెనీలను ఏర్పాటు చేయడానికి బదులు ఉన్నవాటిని కబళించసాగాడు. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో మాత్రం రక్షణ శాఖకు సంబంధించిన అనేక కార్యక్రమాలు చేపట్టాడు. ఆయన జీవించినంతకాలం భూగోళం మీద నివసించే వారినందరినీ విభ్రాంతి పరుస్తూ సంపూర్ణ జీవితం గడిపాడు. తాను చేయలేని పని ఏమీ లేదన్న విషయంలో ఊగిసలాట, అనుమానం ఎడిసన్‌కు ఏనాడూ లేవు. ఆమాట నిజం కూడా! ఎడిసన్ సాధించలేనిదల్లా మానవుడు శాశ్వతంగా జీవించగలగడానికి అనువైనయంత్రాన్ని కనిపెట్టలేకపోవడమే. అదే గనక సాధ్యం అయి ఉంటే ఆయన 21వ శతాబ్దాన్ని కూడా ఆవిష్కరించి ఉండేవాడేమో!

1926–
2004

# క్వీన్ ఎలిజబెత్

మార్పుకోసం పరితపిస్తున్న శతాబ్దంలో మహా ఘనత వహించిన రెండవ ఎలిజబెత్ రాణి సంప్రదాయానికి ప్రతీకగా నిలిచారు. ఆమె సంయమనం, దృఢ చిత్తంగల వ్యక్తి. రాజరికాన్ని కాపాడడానికి జీవితాంతం పాటుపడ్డారు. కాని తన కడుపున పుట్టిన వారి మీద చెలరేగిన వివాదాలు, ఆ పవిత్రతను, గౌరవాన్ని మంటగలిపాయి. ఆమె కుమారుడు, భవిష్యత్తులో సింహాసనం అధిష్టించాల్సిన వేల్స్ రాకుమారుడు అయిన చార్లెస్, యార్క్ ప్రభువు వంశస్థురాలు, వేల్స్ రాకుమారి అయిన కోడళ్లు వ్యవహరించిన తీరు తీవ్ర అలజడికి కారణం అయ్యింది. రాజ వంశీకుల వ్యవహారాలను టాబ్లాయిడ్ పత్రికలు, కథలు కథలుగా వర్ణించాయి. డేగ కళ్ళతో పరిశీలించి బట్టబయలు చేశాయి. విశ్వాసం నిలబెట్టుకోలేని చార్లెస్ దగ్గర్నుంచి విడాకులు తీసుకున్న డయానా రాజ వంశానికి నీడగా మారడాన్ని ఎలిజబెత్ రాణి నిస్సహాయంగా చూస్తూ ఉండిపోవాల్సి వచ్చింది. రాకుమారి డయానా కారు ప్రమాదంలో మరణించిన తరువాత ఎలిజబెత్ రాణి మాటకు ఉన్న విలువ, ఆ మాటకొస్తే రాజవంశంపై ఉన్న గౌరవ మర్యాదలు త్వరితగతిన క్షీణించాయి. ఆమె మనవడిని అతని తండ్రి స్థానంలో రాజ్యాభిషిక్తుడిని చేస్తారని వినిపించిన వదంతులు సద్దుమణిగి ఉంటే ఉండవచ్చు. కానీ విండ్సర్ రాజప్రసాదంలో నివాసం ఉంటున్న వారు ఇక ఉద్యోగాలో సద్యోగాలో చూసుకోక తప్పదన్న వార్తలు పతాక శీర్షికాలుగా అవతరించాయి. 1953లో తన 26వ ఏట మహారాణిగా పట్టాభిషిక్తురాలైనప్పుడు ఎలిజబెత్ ఊహించిన పరిస్థితి నిస్సందేహంగా ఇది కాదు.

యార్క్ సామంతుడికి, ఆయన భార్య ఎలిజబెత్ బొవీస్‌లీ ఆన్‌కు ఎలిజబెత్ అలెగ్జాండ్రా విండ్సర్ లండన్ లోని 17, బ్రూటన్ స్ట్రీట్‌లో జన్మించింది. ఆమె తండ్రి రాజకుమారుడు. ఆరవ జార్జి చక్రవర్తి రెండో కుమారుడు. ఆయన ఎప్పుడూ రాజసింహాసనం అధిష్టిస్తాడనుకోలేదు. ఎలిజబెత్‌కు, ఆమె చెల్లెలు మార్గరెట్‌కు రాజకుటుంబానికి తగిన మర్యాదలకు అనుగుణంగా వారి నాయనమ్మ క్వీన్ మేరీ తర్ఫీదు ఇప్పించింది. ప్రైవేటుగా పాఠశాలలో చదువు, గుర్రపు శాలలు తనిఖీ చేయడం ఎలిజబెత్‌కు ఇష్టమైన వ్యాపకం. నౌకలకు పేరుపెట్టడం, ఆస్పత్రుల ప్రారంభోత్సవాలు చేయడం తన విధి అని అనుకుంది. ఆమె పెదనాన్న అమెరికాకు చెందిన ఒక విడాకులు పుచ్చుకున్న మహిళను పెళ్లాడడం కోసం రాజ్యాధికారాన్ని పరిత్యజించాలని నిర్ణయించుకున్నప్పుడు ఎలిజబెత్ తండ్రిపై రాజ్యభారం పడింది. అప్పుడు ఎలిజబెత్‌కు పదేళ్ళు. ఆ తర్వాత రకరకాల రాజకీయ పరిణామాలు సంభవించి రెండో ప్రపంచ యుద్ధానికి దారి తీశాయి.

యుద్ధ సమయంలో చేపట్టే కార్యకలాపాల్లో పాల్గొనడానికి ఎలిజబెత్ ఉత్సాహం ప్రదర్శించినప్పటికీ 1945 దాకా ఆమె తండ్రి దీనికి సమ్మతించలేదు. ఆక్సిలరీ టెరిటోరియల్ సర్వీసులో స్వచ్ఛంద సేవకురాలిగా పనిచేసిన యువ ఎలిజబెత్ ట్రక్కు నడపడం నేర్చుకుంది. ట్రక్కు టైరు బిగించడం ఎలాగో తెలుసుకుంది. ఇలాంటి పనులు చేసినప్పటికీ ఇంట్లో పెద్ద కూతురిగా భవిష్యత్తులో తానే రాజ్యభారం మోయాల్సివస్తుందన్న వాస్తవాన్ని ఆమె గుర్తించకపోలేదు. (తన తండ్రికి మగపిల్లవాడు కనక జన్మించి ఉన్నట్టయితే అతడే రాజయ్యేవాడు) ఆమె తండ్రికి రాజ్యభారం స్వీకరించేంతవరకు రాజరిక వ్యవహారాల నిర్వహణతో సంబంధం లేదు ఆ మాట ఆయనే అంగీకరించాడు. కానీ తన కూతురు భవిష్యత్తులో రాజ దండం పట్టుకోవాల్సి వస్తుందన్న నమ్మకం ఆయనకు ఉండేది. అందువల్లే ఆమెకు అలాంటి బాధ్యతలు నిర్వహించడానికి అనువైన శిక్షణ ఇప్పించాడు. తన తండ్రి రాజ్యాధికారం నిర్వహిస్తున్న సమయంలోనే ఫిలిప్ మౌంట్ బాటన్‌ను పెళ్ళాడింది. ఆ మరుసటి సంవత్సరం కొడుకు పుట్టాడు. అతడే చార్లెస్. ఆ తర్వాత 1950లో అన్నే, 1960లో ఆండ్రూ, 1964తో ఎడ్వర్డ్ జన్మించారు.

1952లో ఆరవ జార్జి మరణించిన సమయంలో

కామన్వెల్త్ దేశాలలో పర్యటిస్తున్న రాకుమారిని తక్షణం రప్పించారు. 1953 జూన్ 2న ఆమె పట్టాభిషిక్తురాలైంది. మొట్టమొదటి సారి ఈ పట్టాభిషేక మహోత్సవాన్ని టీవీలో ప్రత్యక్ష ప్రసారం చేశారు. "తన రాకుమారుడు రాజ్యంలోకెల్లా మేటి పెద్ద మనిషి" అని ఆమె ప్రకటించారు. తనను, తన సంతానాన్ని 'హౌజ్ ఆఫ్ విండ్సర్' అని సంబోధించాలని ఆదేశం జారీ చేశారు. ఆ రకంగా తమ జర్మన్ ఆనవాళ్లను చెరిపివేయడానికి ప్రయత్నించారు.

ఆ తర్వాత ఆమె రాజకుటుంబ బాధ్యతలు నిర్వర్తించడంలో తలమునకలైపోయారు. పార్లమెంటు ప్రారంభ సమావేశాలకు హాజరు కావడం, దాతృత్వ ఉత్సవాలకు హాజరు కావడం, బిరుదులు ఇవ్వాల్సిన వారి జాబితాలు తయారు చేయడం, సంప్రదాయాలకు అనుగుణమైన ఆచార వ్యవహారాలు నిర్వహించడం కొనసాగించేవారు. తన కుటుంబ వారసత్వానికి అనుగుణంగా ఈ కార్యక్రమాలు నిరంతరం కొనసాగేవి. ఇంగ్లాండ్‌కు లిఖిత రాజ్యాంగం లేనప్పటికీ ఆచరించే సంప్రదాయాల ప్రకారం ఎలిజబెత్‌కు వాస్తవంగా అధికారాలు ఏమీ లేవు. ఆమె పరిపాలించలేదు కాని ఆధిపత్యం చెలాయించింది. ఆ మాటకొస్తే రాజరిక అస్తిత్వం సుస్థిరతకు చిహ్నం. విధి నిర్వహణకు, విశ్వాసపాత్రతకు, నిస్వార్థ సేవకు ప్రతిరూపాలు మాత్రమే. కానీ హద్దులు దాటిన ఆమె కుటుంబం ఈ సంప్రదాయాలను మంటగలిపింది.

ఆమె కుమారుడు చార్లెస్ ముదురు బ్రహ్మచారి. 1981లో అట్టహాసంగా 20 ఏళ్ళ అందమైన లేడీ డయానా స్పెన్సర్‌ను వివాహం చేసుకున్నప్పటి నుంచీ విండ్సర్ల కీర్తి ప్రతిష్టలు తరగటం ఆరంభమైంది. ఆ తర్వాత 12 ఏళ్ళకు బ్రిటిష్‌వారు రాజరికాన్ని రద్దు చేయాలని కూడా తీవ్రంగా ఆలోచించారు. 1992లో రాకుమారుడు ఆండ్రూను పెళ్ళాడిన సారా ఫెర్గ్యూసన్ టెక్సాస్‌కు చెందిన ఒక ప్రేమికుడితో గడిపిన వైనానికి సంబంధించిన చిత్రాలు ప్రచురితం కావడంతో రాజకుటుంబం అప్రతిష్టపాలయ్యింది. డయానాను ఆమె భర్త నిర్లక్ష్యం చేశారనీ, కిరాతకంగా వ్యవహరించారని, వ్యభిచారానికి పాల్పడ్డారని, అనేక విమర్శలు చెలరేగాయి. విండ్సర్ కుటుంబాన్ని ఆవహించిన ఈ విమర్శల జ్వాలలు ఆ తర్వాత నిజంగానే అగ్ని ప్రమాదానికి దారితీశాయి. విలువైన వస్తువులు కాలి బూడిదైపోయాయి. మరమ్మతులకోసం కోటి డాలర్లు వెచ్చించవలసి వచ్చింది. ఈ నష్టాన్ని తాము ఎందుకు భరించాలని బ్రిటీష్ పౌరులు గొణుక్కున్నారు. ప్రపంచంలోకెల్లా అత్యంత సంపన్నుల కుటుంబం అయిన విండ్సర్ కుటుంబం అగ్ని ప్రమాద బీమా ఎందుకు చేయించలేదన్న విమర్శలు వెల్లువెత్తాయి. (రాణి సొంత ఆస్తుల విలువ 11 బిలియన్ డాలర్లని ఒక అంచనా) దీంతో విండ్సర్ పునరుద్ధరణ కార్యక్రమాలకు రాణి భారీ మొత్తంలో విరాళం ఇచ్చారు. తనకు ఏటా అందుతున్న 12 మిలియన్ డాలర్ల వేతనంపై పన్ను చెల్లించడానికి సిద్ధపడ్డారు. అందుకే పార్లమెంటును ఉద్దేశించి ప్రసంగించేటప్పుడు రాణి ఆ సంవత్సరాన్ని దుష్ట సంవత్సరంగా అభివర్ణించడంలో ఆశ్చర్యం లేదు.

పత్రికల్లో వెలువడుతున్న కథనాలు హోరెత్తడంతో రాజప్రసాదం ప్రతినిధులు నిస్సహాయంగా ఉండిపోవాల్సి వచ్చింది. ఎలిజబెత్ రాణి చేయగలిగింది ఏమీ లేదు. ఆమె ఈ అసౌకర్యాన్ని భరిస్తూ 'మేం వ్యాఖ్యానించలేం అనుకొంటా' అని ఎప్పుడూ ఒకే సమాధానం చెప్పేవారు. రాజరికం భవిష్యత్తు గురించి బహిరంగ, నిరంతర ఊహాగానాలు సాగాయి. కానీ 20వ శతాబ్దం చివరకు వచ్చేసరికి ఎప్పుడూ తప్పటడుగు వేయని రెండవ ఎలిజబెత్ వ్యక్తిత్వం కారణంగానే కావచ్చు రాజకుటుంబం భవిష్యత్తు పదిలంగానే ఉన్నది. ఈ భద్రతకు కేవలం ఆమె వ్యక్తిత్వమే కారణం. అయితే రాణి తర్వాత పరిస్థితి ఏమిటి అన్నది జవాబులేని ప్రశ్న.

1879-
1955

# ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

గత శతాబ్దం నాటి అత్యంత గొప్ప శాస్త్రవేత్త తన 76వ ఏట నిద్రలోనే శాశ్వత నిద్రలోకి జారుకున్నప్పుడు ప్రపంచంలోని సకల ప్రాంత వాసులు ఆయన అద్భుత మేధాశక్తికి ఘనంగా నివాళులర్పించారు. పదార్థానికి- ప్రకృతి శక్తులకు మధ్య ఉన్న సంక్లిష్ట సంబంధాలను ఆల్బర్ ఐన్‌స్టీన్ ఆవిష్కరించడం, అవి మానవాళి స్థితిగతులను నాటకీయమైన మలుపు తిప్పడమే కాదు, ఆయన ఆవిష్కరణలు ఆ పని చేసిన మాట వాస్తవమే అయినా సత్యాన్వేషణలో ఆయన ఎంత మాత్రం తొణకకుండా, బెణకకుండా తన అన్వేషణా పథంలో ముందుకు సాగినందువల్ల ఆయన మతాతీతమైన యోగిగా పరిణామం చెందాడు. "ఆయన హఠాత్తుగా ప్రపంచ వ్యాప్తంగా ప్రజల చేతనలో భాగం అయిపోయాడు. విజ్ఞాన శాస్త్రానికి ప్రతిరూపంగా మారిపోయాడు. 20వ శతాబ్దంలోని అద్భుత మేధావులలో అగ్రగణ్యుడైపోయడు అని సి.పి. స్నో తన 'వెరైటీ ఆఫ్ మెన్' అన్న గ్రంథంలో రాశారు. యుద్ధ బీభత్సంలో విసిగి వేసారిపోయిన వారు, నాజీయిజం దుష్టచేష్టలతో ఆర్థికంగా ఒట్టిపోయినవారు చింపిరి జుట్టుతో, ఆత్మీయుడైన తాతయ్యలా కనిపించే ఐన్‌స్టీన్‌ను మానవునిలో కొత్త ఆశల శకానికి ప్రవక్తగా, ప్రతిరూపంగా భావించారు.

జర్మనీలోని ఉల్మ్‌లో 1879లో మార్చి 14న మతభావాలు లేని యూదుల కుటుంబంలో ఐన్‌స్టీన్ జన్మించాడు. భారీ తలతో ఆయన ఈ భూమి మీద పడడం భావి విజయాలకు సంకేతం కావచ్చు. అసాధారణమైన రీతిలో అతి పెద్దగా ఉన్న తమ బిడ్డ తలను చూసి అతని తల్లిదండ్రులు అతను మేధకుడు అని అనుకున్నారు. ఆ బిడ్డ చాలా మందకొడిగా ఉండడం చూసిన నర్స్ అతనికి "ఫాదర్ బోర్" అన్న ముద్దుపేరు పెట్టింది. మేధోపరంగా తిరుగుబాటు తత్వంగల వాడు అయినందు వల్ల అతని చదువు సైతం కుంటుపడింది. స్తబ్దుగా ఉండే ఆ పసికందు మనసును అదృష్టవశాత్తు అతని మేనమామ గణితం మీదకు మళ్ళించాడు. బీజ గణితంలోని ఎక్స్‌ను ఒక జంతువు ఆకారంలోకి మార్చి అదేమిటని చెప్పమని మేనమామ అడిగేవాడు. అయితే ఐన్‌స్టీన్ గణితంలో అంతగా పుంజుకోలేదు. ఆ తర్వాత ఏరికోరి తనకు ఆసక్తి కలిగినవి మాత్రమే నేర్చుకునేతత్వంగల ఐన్‌స్టీన్ భౌతికశాస్త్ర సిద్ధాంతాల మీద దృష్టి సారించాడు. జ్యూరిచ్‌లోని ఫెడరల్ పాలిటెక్నిక్‌లో రెండు సార్లు బలవంతంగా ప్రవేశ పరీక్ష రాయాల్సి వచ్చింది. స్నాతకోత్తరులకు ఉద్యోగం దొరకడం అప్పట్లో కష్టసాధ్యంగా ఉండేది. తన తోటి విద్యార్థిని 'మిలేవా మార్టిష్'ను పెళ్ళి చేసుకోడానికి ఆయనకు డబ్బు అవసరం అయింది. ఈ భార్యాభర్తలు ఎంతటి పేదరికాన్ని అనుభవించవలసి వచ్చిందంటే ఏడాదిన్నర వయసు ఉన్న తమ బిడ్డను దత్తత ఇవ్వక తప్పలేదు. ఉపాధ్యాయుడిగా చేరడానికి వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోకుండా ఉంటే ఐన్‌స్టీన్‌కు ఈ తిప్పలు తప్పేవి. చివరకు 1902లో బెర్న్‌లోని ఒక పేటెంట్ కార్యాలయంలో ఆయనకు ఉద్యోగం దొరికింది. అక్కడే గణితం, భౌతిక శాస్త్రంలో ట్యూషన్లు చెప్తానని స్థానిక పత్రికల్లో ప్రకటనలు విడుదల చేశాడు. ఆ తర్వాత మిలేవా ఇద్దరు కొడుకుల్ని కన్నది. ఉదయం, సాయంత్రం ఖాళీ సమయంలో ఐన్‌స్టీన్ తన శాస్త్ర సిద్ధాంతాలపై కృషి సాగించేవాడు.

నిరంతర ధ్యాన నిమగ్నుడైన ఐన్‌స్టీన్ ప్రయత్నాలు చివరకు 1905లో ఫలించాయి. అది ఆయన పాలిటి అద్భుతాల సంవత్సరం అని విజ్ఞాన శాస్త్ర చరిత్రకారులు అంటుంటారు. ఆ సమయంలోనే ప్రతిష్టాత్మకమైన 'అన్నలెన్ డెర్ ఫిజిక్' అన్న పత్రిక ఆయన రాసిన మూడు వ్యాసాలు ప్రచురించింది. ఈ వ్యాసాల్లో ఆయన సిద్ధాంత వైవిధ్యం పొడసూపింది. ఫోటో ఎలక్ట్రిక్ ఎఫెక్ట్, విశిష్ట సాపేక్ష సిద్ధాంతం అన్న ఆయన సిద్ధాంత ప్రతిపాదనలు ఈ వ్యాసాల్లోనే ఉన్నాయి. ఫోటో ఎలక్ట్రిక్ అనే సిద్ధాంతంలోనే ఆయన అతి సూక్ష్మశక్తి భాగాల్లో కాంతి ఉంటుందని, దీనిని క్వాంటా లేదా ఫోటాన్స్ అంటారని ఐన్‌స్టీన్

ప్రతిపాదించాడు. ఈ ప్రతిపాదనల ఆధారంగానే ఆ తర్వాతి శాస్త్రజ్ఞులు క్వాంటమ్ థియరీని రూపొందించారు. ఇది ఇరవయ్యవ శతాబ్ది భౌతిక శాస్త్రంలో మేలి మలుపు. ఐన్‌స్టీన్ ప్రతిపాదించిన సాధారణ సాపేక్ష సిద్ధాంతం, 1916లో ప్రతిపాదించిన విప్లవాత్మకమైన గురుత్వాకర్షణ సిద్ధాంతం కూడా ప్రపంచగతి మారడంలో విశేషమైన ప్రభావం కనబరిచాయి. ఎందుకంటే శాస్త్రజ్ఞులు, సామాన్యులు కూడా ఈ ప్రతిపాదనలను విలోమంగా అర్థం చేసుకున్నారు. కాలం, స్థలం, సాపేక్షకం అని ఐన్‌స్టీన్ ప్రతిపాదించాడు. అవి మనం అనుకునేట్టుగా పరమమైనవి కాదని ఆయన వాదన. నిజానికి కాలం మూడు పార్శ్వాలతో కూడిన ఈ విశ్వంలో బాహిరమైంది కాదు. అది స్థలం అనే నాలుగో పార్శ్వంలో భాగం. ఆయన విశిష్ట సిద్ధాంతం కాంతి వేగం పరమమైందని రుజువు చేసింది. కానీ ఆయనే తర్వాత ప్రతిపాదించినట్లుగా కాంతిని కూడా వక్రీభవింపచేయవచ్చు.

1919లో ఆయన ప్రతిపాదించిన సాధారణ సిద్ధాంతం స్వతంత్ర పరిశీలనలో రుజువు కావడంతో ఐన్‌స్టీన్ విశ్వ విఖ్యాతుడు అయ్యాడు. 1921లో ఆయనకు నోబెల్ బహుమతి వచ్చింది. అయితే వైపరీత్యం ఏమిటంటే ఆయనకు బాగా పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టిన సాపేక్ష సిద్ధాంతానికి కాకుండా క్వాంటం ఫిజిక్స్‌లో ఆయన కనుగొన్న అంశాలకు ఆ ఖ్యాతి దక్కింది. ఆయన సాపేక్ష సిద్ధాంతం అసలైన కొత్త విషయం కాదని నోబెల్ కమిటీ భావించినట్టు కనిపిస్తోంది. ప్రసిద్ధి చెందిన $E=mc^2$ అన్న ఆయన సూత్రం అణు పరిణామ రహస్యాలను ఛేదించింది. అణుబాంబు తయారీకి అదే ఆధారభూతమైనందువల్ల ఆయనకు అణ్వస్త్ర పిత అన్న అయాచిత బిరుదూ దక్కింది. గట్టి బౌద్ధిక భావాలు, ప్రకృతి సంయోజనం అంతిమమైందన్న భావనలు కలిగిన ఐన్‌స్టీన్‌కు ఇలాంటి బిరుదు ఏవగింపునే కలిగిస్తుంది. అయితే జర్మనీ కన్నా ముందు వినాశకరమైనదే అయినా అణుబాంబు తయారు చేయాలని కోరుతూ ఐన్‌స్టీన్ 1939లో అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్‌కు లేఖ రాయడం గుడ్డిలో మెల్ల అనుకోవాలి.

1930 నాటికి జర్మనీ ప్రభుత్వం ఐన్‌స్టీన్ పౌరసత్వాన్ని రద్దు చేసి ఆస్తులన్నింటినీ స్వాధీనం చేసుకుంది. ఆయన అమెరికాకు రహస్యంగా పయనం కాక తప్పలేదు. 1940లో ఆయన అమెరికా పౌరుడయ్యాడు. హిట్లర్ అనుసరించిన అంతిమ పరిష్కార సూత్రాలు చివరకు ఐన్‌స్టీన్ యుద్ధ నివారణ భావాలు కచ్చితమైన రీతిలో రూపు దిద్దుకోవడానికి దోహదపడ్డాయి. యుద్ధం ముగిసిన తర్వాత న్యూజెర్సీలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీ ఇన్ ప్రిన్స్‌టన్‌లో విశిష్టమైన ఈ మేధావి అణుశక్తిని నియంత్రించడానికి అంతర్జాతీయ ఒప్పందం కుదుర్చుకోవడంలో పాలుపంచుకున్నాడు. ఆయన జియానిస్టు ధోరణులను ముందుకు తీసుకెళ్ళడానికి కూడా ప్రయత్నించాడు. అందువల్ల ఇజ్రాయిల్ అధ్యక్షపదవి ఇవ్వజూపినా ఆయన నిరాకరించాడు.

ట్రాన్సిస్టర్‌లు, ఫోటో ఎలక్ట్రిక్ సెల్స్ వంటి చిన్న చిన్న ఆవిష్కరణలతో పాటు ఆధునిక విశ్వశాస్త్రం, అణు విచ్ఛేదకాలు మొదలైనవన్నీ ఆయన అద్భుత మేధా సంపత్తి అందజేసిన ఫలితాలే. విశాల ఏకీకరణ సిద్ధాంతం రూపొందించడానికి ఆయన జీవిత చరమాంకం వరకు శ్రమిస్తూనే ఉన్నాడు. ఆయన మెదడు ఇప్పటికీ ఒక ప్రయోగశాలలో పదిలంగానే ఉంది. ఇంకా దాని మీద పరిశోధనలు కొనసాగుతూనే ఉన్నాయి. తన ఆత్మకు దేవుడు శాశ్వతమైన నెలవు ఏర్పరుస్తాడని ఐన్‌స్టీన్ విశ్వసించలేదు. కాని అతీతమైన మేధాసంపత్తి ఏదో తన జీవితంలో పవిత్ర జిజ్ఞాసను ప్రేరేపించిందని ఆయన భావించేవాడు. ఆ శక్తే ఐన్‌స్టీన్ జీవితాన్ని నడిపించింది. అదే ఆయనకు ఆనందదాయకమైంది.

1890-
1969

# డ్వైట్ డేవిడ్ ఐసెన్ హోవర్

పుట్టుకతోనే గొప్పవాళ్ళు కాని వారికి గొప్పతనం ఎలా అబ్బుతుందో తెలుసుకునేవారు డ్వైట్ డేవిడ్ ఐసన్‌హోవర్ జీవితాన్ని పరిశీలించడం మంచిది. రెండో ప్రపంచ మహాసంగ్రామం సమయంలో మిత్రపక్షాల సేనల సర్వసేనానిగా, అమెరికా సంయుక్త రాష్ట్రాల 34వ అధ్యక్షుడిగా ఉన్న ఐసెన్ హోవర్ దురదృష్టవంతుడైన ఒక పాడిపరిశ్రమ కార్మికుడు, దీర్ఘకాలం బాధలు తప్ప మరోటి ఎరగని అతని భార్య సంతానంగా టెక్సాస్ రాష్ట్రంలోని మారుమూల గ్రామం అయిన డెనిసన్‌లో జన్మించాడు. ఆ కుటుంబం కన్సాస్ రాష్ట్రంలోని అబిలెనే వెళ్ళవలసి వచ్చింది. అక్కడ డ్వైట్ కుటుంబానికి ఆర్థికంగా సహాయ పడడం కోసం సేవకుడిగా, గుంటలు తవ్వే వాడిగా, పశువుల కాపరిగా పనిచేయక తప్పలేదు. ప్రభుత్వ కళాశాలలో చేరడానికి కూడా వీలుకాని స్థితిలో ఉన్న ఐసెన్‌హోవర్ అనపోలిస్, వెస్ట్ పాయింట్‌లోని మిలిటరీ అకాడమీల పరీక్షలకు హాజరయ్యాడు. నౌకాదళం ఆయనను నిరాకరించినా సైన్యం ఆయనకు ఉపాధి కల్పించింది. 1915లో వెస్ట్ పాయింట్‌లో సైనిక శిక్షణ పూర్తిచేసుకున్నాడు. ఆ మరుసటి సంవత్సరం టెక్సాస్‌లోని సాన్ ఆంటోనియాలో మామీ జెనీవా దౌద్‌ను కలుసుకుని ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. ఆమె సంపన్నుడైన డెన్వర్ మాంసం ఎగుమతిదారుడి కూతురు. ఆమె గృహిణిగా అంత నైపుణ్యం ఉన్నది కానందువల్ల వంట చేయడం, ఇల్లు శుభ్రం చేయడం వంటి పనులన్నీ మొదట్లో ఐక్ స్వయంగా చేసేవాడు. సహాధ్యాయులు అతనిని ఐక్ అని పిలిచేవారు. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో అతనికి అనేక బాధ్యతలు అప్పగించారు. కానీ యుద్ధం ముగిసిన తరువాత అంతకు ముందు లెఫ్టినెంట్ కల్నల్‌గా కల్పించిన పదోన్నతి మళ్ళీ కెప్టెన్ స్థాయికి కుదించారు. రెండు నాటకీయమైన సంఘటనలు ఆయన జీవితాన్ని మలుపు తిప్పకపోతే ఐసెన్ హోవర్ ఆర్మీ పోస్ట్ ఫుట్‌బాల్ కోచ్‌గా తెరమరుగున అనామకంగానే ఉండిపోయేవాడు. 1921లో అతని చిన్న కుమారుడు ఒళ్లంతా దద్దుర్లు లేచి జ్వరంతో మరణించడం, విషపూరిత వాతావరణం నుంచి తప్పించుకోవడం కోసం కార్యనిర్వాహణాధికారిగా పనామాకు వెళ్ళాలన్న జనరల్ ఫాక్స్ కోనర్ ఆహ్వానాన్ని అంగీకరించడం అన్న రెండు సంఘటనలు ఐసెన్‌హోవర్ జీవితాన్ని మలుపుతిప్పాయి.

ఒకవైపు విషాదం, మరోవైపు అందివస్తున్న అవకాశం మధ్య కొట్టుమిట్టాడిన ఐక్, కోనర్ అందించిన చేయూతను ఉపయోగించుకుని కమాండ్ అండ్ జనరల్ స్టాఫ్ స్కూల్‌లో చేరి మొదటి శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. ఆ తర్వాత మేజర్ అయి తెలివితేటలు, అహంకారం గల సైనిక దళ ప్రధానాధికారి జనరల్ డగ్లస్ మాక్ ఆర్థర్‌తో పాటు పని చేశాడు. మెకార్థర్ 1935లో ఐక్‌కు ఒక బాధ్యత అప్పగించి మనీలా తీసుకెళ్ళాడు.

1939లో కూడా ఐక్ మేజర్‌గానే ఉన్నాడు. కానీ ఆ తర్వాత మూడు పదోన్నతులు సమకూరిన తర్వాత అత్యంత సమర్థుడైనప్పటికీ కార్య క్షేత్రంలో అనుభవం లేని ఈ సైనికుడిని సైనిక దళాల ప్రధానాధికారి జార్జ్ మార్షల్ తన కార్యాలయానికి పిలిపించి ఒకే ఒక సాధారణ ప్రశ్న అడిగాడు. అదేమిటంటే పసిఫిక్‌లో మన విధానం ఎలా ఉండాలి? అప్పుడు ఐసెన్ హోవర్ ఇలా సమాధానం ఇచ్చాడు. "ఫిలిప్పీన్స్ వద్ద ఒక హద్దు నిర్ణయించండి. అది చెరిగిపోవచ్చు. ఎందుకంటే మనం ఏం చేయబోతున్నామో ఆసియా ఖండం గమనిస్తుంది. ఆ తర్వాత ఆస్ట్రియాలో సేనలను పెంచండి. అదీ లొంగి పోతుంది. మనస్తత్వాన్ని వ్యూహాన్ని నర్మగర్భంగా కలగలిపి ఐసెన్ హోవర్ ఇచ్చిన ఈ సమాధానం మార్షల్‌కు బాగా నచ్చింది. 1942లో ఐక్‌కు యూరప్ దళాల బాధ్యతలు అప్పగించిన సమయంలో మేజర్ జనరల్‌గా ఉన్న ఆయన వయస్సు 52 సంవత్సరాలు.

కానీ ఓటమి అన్నది ఎరుగనివాడు. పోకర్ క్రీడలో ఆరితేరినవాడు. కన్సాస్ వారి లక్షణమైన అతిజాగ్రత్తగా వ్యవహరించే తత్వంగలవాడు అయిన ఐసెన్ హోవర్ అటో ఇటో తేలిపోయే రోజు ఆయన 1944 జూన్ 6న అననుకూల వాతావరణాన్ని కూడా లెక్కచేయకుండా నార్మాండి మీద దాడికి ఉత్తర్వులు జారీ చేశాడు. ఒక వైపున ఫ్రెంచి సముద్రపు తీరాలు ప్రశాంతంగా ఉంటే మరొకవైపు అనేక యోజనాల దూరంలో ఉన్న ఇంగ్లాండ్‌లో మాత్రం పళ్ళు బగపట్టినట్టుగా, కొంచెం నిరాశాజనకంగా ఉండింది. దాదాపు 25 లక్షల దాకా ఉన్న సేనలు దాడి చేయడానికి సిద్ధంగా ఉన్న పులిలాగా ఉగ్గబట్టుకుని ఉన్నాయి. ఆ సేనలను ఉత్సాహ పరచడం కోసం “మీరు ఒక గొప్ప పవిత్ర యుద్ధానికి వెళుతున్నారు” అని చెప్పి వారి దగ్గర సెలవు పుచ్చుకున్నాడు. అమెరికాకు చెందిన 101వ ఏర్‌బోర్న్ విభాగానికి చెందిన పారాట్రూపర్లకు వందనం చేసిన తరువాత “యావత్ ప్రపంచం దృష్టీ మీ మీదే ఉంది” అని అన్నాడు. ఆ పారాట్రూపర్లలో చాలా మంది తమ లక్ష్యాన్ని సాధించలేరన్న విషయమూ ఆయనకు తెలుసు. అందుకే ఆయన కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరుగుతుండగా మళ్ళీ తన పనిలో నిమగ్నమైపోయాడు. ఉత్తర అమెరికాలో విచీ ఫ్రెంచితో అక్రమ సంబంధాలు, పాటన్ బెర్లిన్‌లోకి దూసుకుపోకుండా నిలువరించడానికి ఉద్దేశించిన ఆపరేషన్ ఓవర్ లార్డ్ వంటి విషయాల్లో ఐసెన్ హోవర్ తీసుకున్న నిర్ణయాలు వివాదాస్పదమైన మాట నిజమే కానీ ఆయన లక్ష్యమల్లా వీలైనంత త్వరగా విజయం సాధించడమే. యాభై రోజుల పాటు జరిగిన ఆ పోరాటంలో అనుకున్నట్టుగానే ఆయన విజయం సాధించాడు. ఇటలీ, ఉత్తర ఆఫ్రికా విమోచనానికి కూడా బాధ్యుడు ఆయనే. 1945 మే 7వ తేదీన జర్మనీ లొంగుబాటు సాక్షాత్తు ఆయన సమక్షంలోనే జరిగింది.

యుద్ధం ముగిసిన తర్వాత అమెరికా అధ్యక్ష స్థానానికి నామినేషన్ తిరస్కరించి కొలంబియా యూనివర్శిటీకి అధ్యక్షుడయ్యాడు. కానీ 1952 నాటికి ఆయన ఒత్తిళ్ళకు లొంగిపోయాడు. రెండు జాతీయ ఎన్నికల్లో మొదటి దానిలో ఐసెన్ విజయం సాధించారు. అధ్యక్షుడిగా ఉన్న సమయంలో కొరియా వివాదం నుంచి అన్న మాట ప్రకారం అమెరికాను గట్టెక్కించాడు. వియత్నాంకు సేనలు పంపడానికి నిరాకరించి ఆ ఉచ్చునుంచి బయటపడ్డాడు. అయితే ఎంత జాగ్రత్తగా నాయకత్వం వహించినా పౌర హక్కులకు సంబంధించిన వ్యవహారాల్లో కార్యదక్షతను ప్రదర్శించలేకపోయాడు. 1957లో అర్కాన్సాస్‌లోని లిటిల్ రాక్ అనే పట్టణంలో వెలివాదం నివారించాలన్న కోర్టు ఉత్తర్వులను అమలు చేయడం కోసం 82వ ఏర్‌బోర్న్‌ను పంపించాడు. ఆయన మంత్రివర్గంలో విదేశాంగ మంత్రిగా పనిచేసిన జాన్ ఫోస్టర్ డల్లెస్ అనుసరించిన జోక్యం చేసుకోకూడదన్న విదేశాంగ విధానం వల్ల ప్రచ్ఛన్న యుద్ధ ప్రమాదం పెరిగినప్పుడు “మనం సైనిక పారిశ్రామిక సదుపాయాల’ ’దిశగా వెళుతున్నామని దివ్యదృష్టి ఉన్నవాడిలాగా హెచ్చరించాడు.

ఐసెన్ హోవర్‌ను అందరూ ఇష్టపడలేదు. అందరూ ఆయనను గౌరవించలేదు. కానీ ఆయనకున్న అపారమైన విచక్షణా జ్ఞానం, తత్పరత, ఆత్మవిశ్వాసం, భగవంతుడి మీద నమ్మకం వల్ల 20వ శతాబ్దంలో తీవ్రమైన, కిరాతకమైన, అమానుషమైన ఘర్షణలు తలెత్తిన సమయంలో కూడా నావను క్షేమంగా ఒడ్డుకు చేర్చగలిగాడు. ఆయనలో ఉన్న ఈ సామాన్యగుణాలే చరిత్రలో ఎదురైన పరీక్షా సమయాల్లో ఆయనను గొప్పవాడిగా నిలబెట్టాయి. ఆ లక్షణాలే ఆయనకు లేకపోతే దేశానికి మహా విపత్తు తప్పేది కాదు.

# జెస్సీ ఓవెన్స్

బానిస బ్రతుకులకు సజీవ సాక్ష్యంగా, అణగారిన వర్గాల ప్రతినిధిగా ఒలంపిక్స్ బరిలోకి దిగి, జాతి దురహంకారులు, తెల్లతోలు బిలాఢ్యులను అతి తక్కువ సమయంలో మట్టి కరిపించిన మహాయోధుడు జెస్సీ ఓవెన్స్. ఆర్యులే ప్రపంచాన్ని పాలించగల మొనగాళ్లంటూ విర్రవీగిన నాజీ నియంత కళ్ళ ముందే నీగ్రో నల్లవాడు, కాళ్ళకు సరైన బూట్లు కూడా లేని అనాకారి జెస్సీ నాలుగు ప్రపంచ రికార్డులను తిరగరాసాడు. పుట్టుకతో ఎవడూ గొప్పవాడు కాడు. నీ సంస్కారం, తెలివితేటలు, వినయ విధేయతలే నిన్ను మహోన్నతుడుగా నిలబెడుతుంది' అన్న మహాత్ములు చెప్పిన దానికి నిదర్శనంగా ప్రపంచాన్నే అబ్బురపరిచిన క్రీడాకారుడు జెస్సీ ఓవెన్స్.

అమెరికాలోని అలబామా డాన్‌వెల్లె ప్రాంతంలో భూస్వాముల పొలాన్ని కౌలుకు తీసుకుని సాగుచేస్తున్న హెన్రీ ఓవెన్స్, ఎమ్మాల పదకొండు మంది సంతానంలో జెస్సీ ఏడవవాడు. పుట్టుకతోనే బక్క పలచగా పోషకాహార లోపంతో ఎన్నాళ్ళు బతుకుతాడో కూడా చెప్పలేమన్నట్టుండే వాడు ఈ పసివాడు. దానికితోడు అస్తమా జబ్బుకూడా పీడించడంతో పేదవారైన తల్లిదండ్రులు సరైన వైద్యం కూడా చేయించలేకపోయారు. దక్కడనుకున్నవాడు బతికి బట్టకట్టడంతో తల్లిదండ్రులు జెస్సీని ఆరేళ్ల ప్రాయంలో బళ్ళో చేర్పించారు. ఒకే గదిలో అన్ని తరగతుల విద్యార్థులు కూర్చుని చదువుకునే ఆ స్కూలులో రెండు మూడేళ్లు గడిచేసరికి ఉపాధ్యాయుడులేని సమయంలో మిగిలిన పిల్లల్ని అల్లరి చేయకుండా కూర్చోపెట్టే స్థాయికి ఎదిగాడు. పద్నాలుగేళ్ల వయసు వచ్చేసరికి జెస్సీ చురుకుదనం చూసి అతని తల్లిదండ్రులు, స్కూలు మాస్టారు అన్ని పనులు అతని చేతే చేయించేవారు. ఇంటికి కావలసిన సరుకులు తేవాలన్నా, బడిలోకి అత్యవసరమైనవి కావాలన్నా కారు, జీపు కంటే వేగంగా పరిగెత్తి ఆ పనులను జెస్సీ చక్కపెట్టుకుని వచ్చేవాడు. దీంతో ఆ వూళ్లో జెస్సీ గురించి ఎవరిని అడిగినా కాళ్ళకు చక్రాల్లాంటివి కట్టుకున్నట్లు అటూ ఇటూ పరుగులు పెట్టాడే ఆ కుర్రాడే జెస్సీ అని చెబుతారు. చదువులో కూడా రాణిస్తున్నందున అతని తల్లిదండ్రులు జెస్సీని కళాశాలలో చేర్పించారు. ఎన్నో ఆశలతో జెస్సీ కాలేజీలో చేరాడు. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత జెస్సీ తల్లిదండ్రులు ఒహాయోలోని క్లీవ్‌ల్యాండ్స్‌కు మకాం మార్చారు. అక్కడ కాలేజీలో చేరిన జెస్సీ తక్కువ సమయంలోనే మిగిలిన విద్యార్థులను అధిగమించి ట్రాక్ స్టార్‌గా ఎదిగాడు. ట్రాక్ అండ్ ఫీల్డ్ ఈవెంట్స్‌లో జెస్సీ పరుగు పందెం, జావెలిన్, డిస్కస్, రిలే వంటి పోటీల్లో తనకు ఎదురే లేదని నిరూపించుకున్నాడు. అయితే జెస్సీ తండ్రిని ఎల్లప్పుడూ ఓ భయం వెంటాడుతూనే ఉండేది. అదేమిటంటే అథ్లెటిక్‌లో అందర్నీ వెనక్కి నెడుతున్న తన కొడుకు పట్ల శ్వేత జాతి పిల్లల్లో ద్వేషభావం పెరుగుతుందేమోనని. అంతర్ విశ్వవిద్యాలయాల పోటీల్లో పాల్గొనేందుకు వెళ్ళిన జెస్సీ ఎన్నోసార్లు శ్వేత జాతీయుల వర్ణ వివక్షను ఎదుర్కొన్నాడు. ఈ సంగతులన్నీ జెస్సీ తల్లికి చెప్పుకొని బాధపడేవాడు. అయితే తల్లి కొడుక్కి ధైర్యం నూరిపోసి అతనిలోని క్రీడా తృష్ణను మరింత రగిల్చేది.

అమెరికాలో శ్వేత జాతీయులు నల్లవారిని విచ్చల విడిగా దోచుకుంటున్న రోజులవి. బానిస సంకెళ్లను ఛేదించుకున్నా నీగ్రోలు ఎప్పటికీ కట్టుబానిసలేనని నమ్మే 'కు క్లాక్స్ క్లాన్' మళ్ళీ రెచ్చిపోయి నల్లవారిపై దాడులకు పాల్పడుతున్న సమయమది. చదువులో, ఆటపాటల్లో నీగ్రోలెవరన్నా ప్రతిభ కనబరిస్తే వారిని 'కు క్లక్స్ క్లాన్' బృందం కిడ్నాప్ చేసి దారుణంగా హతమార్చేది. అయితే జెస్సీ కూడా ఈ వివక్షతకు గురయ్యాడు. అల్పాదాయ వర్గానికి చెందినప్పటికీ నీగ్రో అన్న కారణంగా జెస్సీకి ఆ ఏడాది స్కాలర్ షిప్ మంజూరు కాలేదు. అయితే జెస్సీ మాట తీరు, ప్రవర్తన గురించి తెలిసిన కొంత మంది అతనికి సాయం చేయడంతో జెస్సీ చదువు, క్రీడాజీవితం ముందుకు సాగింది.

1935లో అమెరికాలోని 40 రాష్ట్రాల విశ్వవిద్యాలయాల విద్యార్థులు పాల్గొన్న ఒహాయ్యో ట్రాక్

మీట్‌లో జెస్సీ పాల్గొన్నాడు. అక్కడకు వచ్చిన వేలాది మంది క్రీడాకారులు, అధ్యాపకులను ఆశ్చర్యానికి గురిచేస్తూ జెస్సీ కేవలం 45 నిముషాల వ్యవధిలో మూడు ప్రపంచ రికార్డులను తిరగరాసాడు. లాంగ్ జంప్, 220 అడుగుల పరుగు పందెం, 220 అడుగుల హార్డిల్స్‌లో జెస్సీ ఈ రికార్డులను సృష్టించాడు. 220 అడుగుల పరుగు పందెంలో అయితే జెస్సీ సాధించిన రికార్డులను నమ్మలేని కోచ్‌లు అతన్ని మరోసారి పరుగెత్తమన్నారు. రెండోసారీ అంతే వేగంతో పరుగెత్తిన జెస్సీ ప్రతిభను స్థానిక పత్రికలు వేన్నోళ్ళ పొగిడాయి. దీనితో 1936లో బెర్లిన్‌లో జరిగే ఒలింపిక్స్‌కు క్రీడాకారులకోసం వెతుకుతున్న అమెరికా ఒలెంపిక్ కమిటీ సభ్యులు జెస్సీ చదువుతున్న యూనివర్శిటీకి వచ్చారు.

నాజీ నియంత హిట్లర్ హయాంలోని బెర్లిన్ ఈసారి ఒలంపిక్స్ వేడుకలకు ముస్తాబైంది. బెర్లిన్ ఒలంపిక్స్‌లో అత్యధిక బంగారు పతకాలు తామే సాధించి ఈ ప్రపంచాన్ని ఏలడానికి తామే అర్హులమని చాటి చెప్పాలని హిట్లర్ ఉవ్విళ్ళూరుతున్నాడు. బెర్లిన్ ఒలంపిక్స్‌కు పదేళ్ళ ముందే జర్మన్ క్రీడాకారులకు అన్ని రకాలైన శిక్షణలనిచ్చి రేసు గుర్రాల్లా తయారు చేశారు. నాలుగువైపులా స్వస్తిక్ జెండాలు రెపరెపలాడుతుండగా అట్టహాసంగా ఒలంపిక్స్ వేడుకలు మొదలయ్యాయి. మొదటి రోజే ట్రాక్ అండ్ ఫీల్డ్ ఈవెంట్స్‌లో 100 మీటర్ల పరుగు పందెంలో హిట్లర్ కళ్ళ ముందే జెస్సీ ప్రపంచ రికార్డు సాధించాడు. విశ్వవిజేతగా జెస్సీ పేరు ప్రకటించగానే అదొక దుశ్శకునంగా తోచింది హిట్లర్‌కు. అంతే విసవిసా అక్కడ నుంచి లేచి వెళ్ళిపోయాడు. తరువాత రోజు హిట్లర్ ఎన్నో ఆశలు పెట్టుకున్న లాంగ్ జంప్ ఈవెంట్ రానే వచ్చింది. లాంగ్ జంప్‌లో జర్మనీకి బంగారు పతకం ఖాయమనుకున్నారు. దానికోసం లుజ్‌లాంగ్ అనే జర్మనీ క్రీడాకారుడిని 8 ఏళ్ళు సానబట్టారు. లాంగ్ జంప్ పోటీలో మొదటి రెండు విడతల్లో జెస్సీ, లుజ్‌లాంగ్ సమానంగా వచ్చారు. చుట్టూ చేరిన జర్మన్లు తమ జాతీయుడిని ప్రోత్సహిస్తూ తనను ఎగతాళి చేయడంతో ఓవెన్స్ ఖంగుతిన్నాడు. ఈ సమయంలో ఓవెన్స్ సామాన్య క్రీడాకారుడు కాదని గుర్తించిన లుజ్‌వాంగ్ మనస్ఫూర్తిగా ఆ నీగ్రోను ప్రోత్సహించాడు. మూడో ప్రయత్నంలో సర్వశక్తులూ ఒడ్డు పతకం నీదే అని జెస్సీ భుజాల చుట్టూ చేయివేసి అభినందించాడు. సాటి క్రీడాకారుడి, గొప్ప మనస్సుతో పులకించిపోయిన జెస్సీ తన సర్వశక్తులూ కూడగట్టుకొని మూడో ప్రయత్నంలో లాంగ్‌జంప్‌లో 26 అడుగుల 5 1/2 అంగుళాల దూరం దూకాడు. అంతే చుట్టూ ఉన్న జర్మన్లు, ప్రతినిధులు సంభ్రమాశ్చర్యాలతో చూస్తుండగానే ప్రపంచ రికార్డు నమోదైంది. జెస్సీ పేరిట నమోదైన ఈ రికార్డు ఆ తరువాత పాతికేళ్ల వరకూ ఎవరూ బద్దలుకొట్టలేకపోయారు. లుజ్‌లాంగ్‌కు రజత పతకం లభించింది. ఆ తరువాత జెస్సీ, లుజ్‌లాంగ్ మంచి స్నేహితులయ్యారు. మొత్తానికి జెస్సీ ప్రతిభ చూసిన జర్మన్లు ఇక ఆ తరువాత అతనికి మద్ధతునివ్వడం ప్రారంభించారు. బెర్లిన్ ఒలంపిక్స్‌లో అమెరికాకు నాలుగు స్వర్ణాలు సాధించిన జెస్సీతో కరచలనానికి హిట్లర్ ఇష్టపడలేదు.

**అమెరికాలో నీగ్రోలకు అధోగతే :** హిట్లర్ పీచమణచి, వీరోచితంగా నాలుగు ఒలంపిక్స్ స్వర్ణాలతో స్వదేశానికి చేరిన జెస్సీకి అక్కడ వీరోచిత స్వాగతం లభించింది. అయితే జర్మన్‌లోని ఆర్యన్ జాతి వివక్షతలాగే అమెరికాలోనూ శ్వేత జాతి వారికి ఒక చట్టం, నల్లవారికి ఒక చట్టం అమలవుతుండటంపట్ల పలు సందర్భాల్లో ఓవెన్స్ ఆవేదన వ్యక్తం చేశాడు. నాలుగు బంగారు పతకాలతో అమెరికా ప్రతిష్ట నిలిపిన తాను కూడా అమెరికాలో బస్సును వెనకవైపు నుంచే ఎక్కి వెనకవైపు నుంచే దిగాల్సి వస్తుందని బహిరంగంగా ఆక్షేపించాడు. తన 67వ ఏట ఊపిరితిత్తుల క్యాన్సర్‌తో చనిపోయేవరకూ నీగ్రోలలో క్రీడాస్ఫూర్తి రగిలిస్తూ వర్ణ వివక్షతకు వ్యతిరేకంగా పోరాడాడు జెస్సీ ఓవెన్స్.

1904-
1967

# జె. రాబర్ట్ ఓపెన్ హైమర్

భారతీయ పురాణాలలో వర్ణించే బ్రహ్మాస్త్రాన్ని సృష్టించి కదన కుతూహలంతో అతను కృష్ణుని పాత్రను పోషించి తను సృష్టించిన బ్రహ్మాస్త్రం మానవాళికి ఎంత ప్రమాదమో పసిగట్టి దానికి వ్యతిరేకంగా యుద్ధ వైముఖ్యం పొందిన అర్జునుడిగా మారాడు. పాశ్చాత్య దేశానికి చెందిన అతను సంస్కృత పండితుడు. గీతాపారాయణం చేసి దానిని తన విద్వత్తుతో జోడించి వ్యాఖ్యానించడం అతని జీవన విధానం. అతనే కలియుగ బ్రహ్మాస్త్రం "అణుబాంబు" సృష్టి కర్త ఓపెన్ హైమర్.

ఆ శాస్త్రవేత్త చదువుల్లో అచ్చంగా సరస్వతీ పుత్రుడే. తెల్లవాడే అయినా సంస్కృతంలోనూ నిష్ణాతుడే! ఓపక్క పరిశోధనలు చేస్తూనే మరోపక్క పాఠాలు బోధించాడు. అందర్నీ నాశనం చేసే యుద్ధం ఆయనను అందలాలు ఎక్కించింది. అణ్వస్త్ర బాటా పట్టించింది. ప్రపంచంలోనే తొట్టతొలి అణ్వస్త్ర పరీక్ష సందర్భంలో ఆయన గీతా వ్యాఖ్యానం కూడా చేశాడు. తమ దేశం కోసం అణు బాంబు రూపొందించడానికి అమెరికన్ భౌతిక శాస్త్రవేత్త జె. రాబర్ట్ ఓపెన్ హైమర్‌ను పురిగొల్పిందేమిటి? చరిత్ర పుటల్లో శాశ్వత స్థానం సంపాదించుకోవడమా! క్లిష్ట పరిస్థితుల్లో ఉన్న దేశాన్ని ఆదుకోవడమా! రెండవ ప్రపంచ యుద్ధపు అసాధారణ రక్తపాతాన్ని ఆపడానికి చర్చిల్ చేతికి 'అమేయ అస్త్రాన్ని' అందించాలనే తపనా?... వీటిలో ఏదో ఒకటి చెప్పడం కష్టం. పరస్పర విరుద్ధ భావాల వ్యక్తిత్వం, సన్నిహిత స్నేహితులకు కూడా అంతుపట్టని మనస్తత్వం గల ఈ అణు బాంబు రూపశిల్పి మదిలో మెదిలిన అన్ని భావాల సమాహారమే బహుశా అణ్వస్త్ర రూపకల్పనకు దారితీసిందేమో! అతి భయంకరమైన అణు బాంబును సృష్టించేటప్పుడు 'అణు'వంతైనా చింతించని ఓపెన్ హైమర్ చేతులు 'కాల్చాక' ఆకులు పట్టుకోమన్నట్లు హిరోషిమా, నాగసాకిలపై దాని విధ్వంసాన్ని, జన హననాన్ని కళ్లారా చూశాక చలించిపోయి అణ్వస్త్ర వ్యతిరేకిగా మారాడు.

పువ్వు పుట్టగానే పరిమళించినట్లు చదువులో ఓపెన్ హైమర్ ప్రతిభాపాటవాలు బాల్యంలోనే బయటపడ్డాయి. అతడి తండ్రి న్యూయార్క్ నగరంలోని ఓ ధనిక వస్త్ర వ్యాపారి. తల్లి కళల పట్ల మక్కువ చూపేది. ఓపెన్ హైమర్ పేరు ముందు ఉన్నతంగా ఉంటుందని 'జె' అనే అక్షరాన్ని అతడి తండ్రి చేర్చాడు. స్కూల్లోనే ఓపెన్ హైమర్ లాటిన్, గ్రీక్ నేర్చాడు. సైన్సు సబ్జెక్టులను ఔపోసన పట్టాడు. 1922లో ప్రఖ్యాత హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో చేరాడు. కేవలం మూడేళ్లలోనే గ్రాడ్యుయేషన్ పూర్తిచేశాడు. యూనివర్సిటీ టాప్ ర్యాంకర్‌గా నిలిచాడు. తర్వాత భౌతిక శాస్త్రం చదవడానికి కేంబ్రిడ్జి వెళ్లాడు. ఎర్నెస్ట్ రూథర్‌ఫోర్డ్ వద్ద శిష్యరికం చేశాడు. అప్పుడే ఆవిర్భవించిన క్వాంటం మెకానిక్స్ సిద్ధాంతంలో పట్టు సాధించాడు. మాస్టర్ అయ్యాడు. 1927లో జర్మనీలోని గొట్టిన్‌జెన్ విశ్వవిద్యాలయం నుంచి ఫిజిక్స్‌లో డాక్టరేట్ పొందాడు. ఆ సమయంలో ఓపెన్ హైమర్ భౌతిక శాస్త్ర సిద్ధాంతాల్లో తలమునకలై పోయి ఉండేవాడు. ఆ సిద్ధాంతాల లోతుపాతులు తెలుసుకున్నాడు. ఓపెన్ హైమర్‌కు డాక్టరేట్ పరీక్ష నిర్వహించేందుకు వచ్చిన పరీక్షకుడు అతడు తననేమైనా ప్రశ్నలు అడుగుతాడేమోనని హడలిపోయాడు.

యూరప్‌లో మరో రెండేళ్లు చదివిన తర్వాత ఆయన 1929లో అమెరికాకు తిరిగివచ్చాడు. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాడు. మరోపక్క కాలిఫోర్నియా ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో పరిశోధనలను ప్రారంభించాడు. పాఠాలను, పరిశోధనలను సమన్వయం చేసుకుంటూనే జీవితాన్ని ఉల్లాసంగా గడపడం మొదలుపెట్టాడు. సాహిత్యానికి, సరదాలకు సమయాన్ని కేటాయించేవాడు. ఈ సమయంలోనే ఆయన ఇటాలియన్ భాష నేర్చుకున్నాడు. సంస్కృతంలో పండితుడయ్యాడు. భగవద్గీతా పారాయణం చేశాడు. ప్రౌస్ట్ కవిత్వాన్ని ఫ్రెంచి భాషలో చదవడం జీవితంలోనే తనను కదిలించిన అరుదైన సన్నివేశాలలో ఒకటని ఓపెన్ హైమర్ తరచు స్నేహితులకు చెబుతుండేవాడు. 1929లో అమెరికాలో స్టాక్ మార్కెట్ పతనమైన సంగతి 1930లో కానీ ఓపెన్ హైమర్‌కు తెలియలేదంటే అతడు ఎంత ధనవంతుడో ఊహించుకోవచ్చు. 1940లో ఆయన కాథరిన్ హారిసన్‌ను పెళ్లి చేసుకున్నాడు. వాళ్లకు ఇద్దరు పిల్లలు పుట్టారు.

రెండవ ప్రపంచ యుద్ధంతో ఓపెన్ హైమర్ జీవితం మరో మలుపు తిరిగింది. కమ్యూనిస్టులతో రాసుకుపూసుకు

తిరిగాడని తెలిసినా అణ్వస్త్రాన్ని రూపొందించడానికి 1942లో అమెరికా ఆయన నేతృత్వంలో ఓ శాస్త్రవేత్తల బృందాన్ని నియమించింది. ఎడ్వర్డ్ టెల్లర్, ఎన్రికో ఫెర్మి వంటి అత్యుత్తమ శాస్త్రవేత్తలు ఆ బృందంలో ఉన్నారు. అణు బాంబును రూపొందించే ఈ రహస్య ప్రాజెక్టుకు ఓపెన్ హైమర్ బృందం 'ది మన్‌హాటన్ ప్రాజెక్ట్' అని నామకరణం చేసింది. ఆయన బృందం తమ పరిశోధనలకు లాస్ అలమోస్‌లోని ఒక మూతపడిన బాలుర స్కూలును వేదికగా చేసుకుంది. మూడేళ్ల రహస్య పరిశోధనల అనంతరం వారి కృషికి ఫలితం దక్కింది. అణు బాంబు ప్రయోగానికి సిద్ధమైంది. అసలే బక్కపల్చగా ఉండే ఓపెన్ హైమర్ నిద్రాహారాలు మానేసి నిరంతరం అణ్వస్త్ర రూపకల్పనలో మునిగిపోవడంతో మరింత చిక్కిపోయాడు. 14 కిలోల బరువు తగ్గిపోయాడు. న్యూ మెక్సికో ఎడారుల్లో అణు బాంబును పరీక్షించారు. ఒక బ్రహ్మాండమైన పుట్టగొడుగు ఆకారంలో పొగ మేఘం భూమ్యాకాశాలను కప్పివేసింది. 'అణు' విశ్వరూపం ప్రత్యక్షమైంది. అణ్వస్త్ర విధ్వంసకర శక్తికి ఓపెన్ హైమర్ గీతా వ్యాఖ్యానం చేశాడు. ఆయన నోటివెంట భగవద్గీతా శ్లోకం జాలువారింది. 'నేను ప్రళయ లోక విధ్వంసకారిని. సాక్షాత్తూ మృత్యుదేవతను' అని దానికి అర్థం. ఈ ప్రయోగంతో సైన్సు చీకటి కోణం వారి కళ్ల ముందు ఆవిష్కృతమైంది. 'సైంటిఫిక్' విధ్వంసాన్నీ వారు సాధించారు.

అణ్వస్త్రం చేతిలో సిద్ధంగా ఉంది. అమెరికా అధ్యక్షుడు ట్రూమన్, ఆయన సలహాదారులు, సైనికాధికారులు, శాస్త్రవేత్తలు సమాలోచనలు జరిపారు. అణ్వస్త్రాన్ని జపాన్‌ను లొంగదీయడానికి ఉపయోగించాలా? లేక రెండవ ప్రపంచ యుద్ధాన్ని అంతమొందించడానికి జర్మనీపై ప్రయోగించాలా? అని తర్జనభర్జనలు పడ్డారు. తుది నిర్ణయానికి రాలేకపోయారు. బాంబు ప్రయోగంపై శాస్త్రవేత్తలు కూడా ఏకాభిప్రాయానికి రాలేకపోయారు. అయితే శాస్త్రవేత్తల తరఫున ఓపెన్ హైమర్ అంతిమ నిర్ణయానికి వచ్చాడు. 'అణ్వస్త్ర దాడి చేయకుండా ఉండడానికి మాకు ఆమోదయోగ్యమైన ప్రత్యామ్నాయ మార్గాలు కనిపించడంలేదు' అని ప్రభుత్వానికి తెలిపాడు. అణు బాంబు గురించి అందరికంటే ఎక్కువ తెలిసిన ఓపెన్ హైమర్ కూడా దాని విధ్వంసకర శక్తిని సరిగా అంచనా వేయలేకపోయాడు. అణు బాంబుకు కేవలం ఇరవై వేలమంది మాత్రమే ఆహుతి అవుతారని భావించాడు. జపాన్‌లోని హిరోషిమా, నాగసాకి పట్టణాల మీద అమెరికా అణుబాంబులను ప్రయోగించింది. అణు బాంబు విధ్వంసాన్ని, జన నష్టాన్ని చూసిన ఓపెన్ హైమర్ కళ్లు తెరుచుకున్నాయి. అతడి ఆలోచనలు శాశ్వతంగా మారిపోయాయి. అణ్వస్త్ర వ్యతిరేకిగా మారాడు. ట్రూమన్ దగ్గరకు పరిగెత్తుకుంటు వెళ్లాడు. 'నా చేతు(త)లు రక్తసిక్తమయ్యాయి' అని ఆవేదన చెందాడు. రాజనీతిజ్ఞుడైన ట్రూమన్ 'నాకూ రక్తం మరకలు అంటాయని విచారిస్తున్నాను' అని బదులిచ్చాడు

తర్వాత ఓప్పెన్ హైమర్ 1946 నుంచి 1952 వరకు అమెరికా అణు శక్తి కమిషన్ సంస్థకు అధ్యక్షుడుగా పనిచేశాడు. ఐక్యరాజ్య సమితికి వెళ్లిన అమెరికా అణు శక్తి బృందానికి సలహాదారుగా వ్యవహరించాడు. సోవియెట్ యూనియన్ అణు బాంబును రూపొందించడంతో దానికి వ్యతిరేకంగా అమెరికా హైడ్రోజన్ బాంబును సృష్టించే ప్రయత్నాలను మొదలుపెట్టింది. దీనిని ఓపెన్ హైమర్ తీవ్రంగా వ్యతిరేకించాడు. అణు శక్తిని విద్యుత్ అవసరాలకు ఉపయోగించాలని ఆయన కోరాడు. అమెరికా అణు విధానాన్ని వ్యతిరేకించినందుకు ఓపెన్ హైమర్‌ను దేశ భద్రతకు ముప్పుగా పరిగణించి 1953లో ఆయనను ప్రభుత్వం పదవి నుంచి తొలగించింది. ఆయన అణు కర్మాగారాలను సందర్శించడాన్ని ప్రభుత్వం నిషేధించింది. తన సృష్టికే ఆయన దూరమయ్యాడు. ఇది అమెరికాలో పెద్దఎత్తున వివాదానికి దారితీసింది. అయితే ఓపెన్ హైమర్ మేధస్సు ఆయనకు అవకాశాలు కల్పించింది. 1947లో ఆయన ప్రిన్స్‌టన్‌లోని 'అడ్వాన్స్‌డ్ స్టడీస్ సంస్థ' డైరెక్టర్ అయ్యారు. 1954లో ఆయనను తిరిగి ఆ పదవికి ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. రాబర్ట్ ఓపెన్ హైమర్ తన కాలానికి చెందిన గొప్ప అధ్యాపకుల్లో ఒకరిగా కీర్తికెక్కారు. భవిష్యత్తు తరాలకు తన అపార విద్య, అమూల్య పరిశోధనలను వారసత్వంగా వదిలివెళ్లారు. తాను పుట్టిన లోకంలోనే ఆయన మరో అణు ప్రపంచాన్ని సృష్టించారు.

1917–
1963

# జాన్ ఎఫ్. కెనడీ

అమెరికా అధ్యక్షుల్లో ఆకర్షణీయమైన వ్యక్తిగా ఎన్నో రంగాల్లో తనదైన ముద్ర వేసి ప్రపంచవ్యాప్తంగా పేరు ప్రఖ్యాతులు పొందిన వ్యక్తి జాన్ ఫిట్జ్ గెరాల్డ్ కెనడీ. కేవలం 43 ఏళ్ల చిన్నవయసులోనే అగ్రరాజ్యమే కాక, సంపన్నమైన అమెరికా దేశానికి అధినేత కాగలిగిన కెనడీ తన పాలనలో ఎన్నో సంస్కరణలకు కారణభూతుడయ్యాడు. రాజకీయనేతలు కేవలం రాజకీయాలకే పరిమితం కాకూడదు, వారిని స్టేట్స్‌మెన్‌గా (రాజనీతిజ్ఞులు) ప్రపంచం గుర్తించాలని చాచా నెహ్రూ చెప్పిన మాటలు కెనడీకి అక్షరాలా వర్తిస్తాయి.

1917లో మే నెల 29న మెసాచుసెట్స్‌లోని బ్రూక్లిన్‌లో పుట్టాడు జాన్.ఎఫ్. కెనడీ. తండ్రి జోసెఫ్ కెనడీ. తల్లి అమెరికాకు చెందిన రోజ్ ఫిట్జ్ గెరాల్డ్. వీరిద్దరూ ఐర్లాండ్ జాతీయులైన అమెరికన్లు. వారిద్దరికీ మొత్తం తొమ్మిది మంది సంతానం. అందులో జాన్ రెండో వాడు. కొడుకుల్లో పెద్దవాడైన జూనియర్ జోసఫ్‌ను తండ్రి జోసెఫ్ ఎంతో గారాబం చేసి పెంచాడు. ఎప్పటికైనా నువ్వు అమెరికాకు అధ్యక్షుడివి కావాలంటూ మొదటి పుట్టినరోజు నుంచే పెద్ద కొడుక్కి నూరిపోసేవాడు. ఈ లోగా రెండో ప్రపంచయుద్ధం ముంచుకొచ్చింది. పెద్దకొడుకు జోస్ సైనికుడిగా యుద్ధంలో పాల్గొని వీరమరణం పొందాడు. దీంతో దుఃఖాన్ని దిగమింగుకున్న తల్లిదండ్రులు రెండో కొడుకు జాన్‌ను దేశాధ్యక్షుడిగా తీ ర్చి దిద్దడం ప్రారంభించారు. సాధారణంగా రాజకీయాలంటే అమెరికన్లు చీదరించుకునేవారు. తమ పిల్లలను సైంటిస్టులుగా, ఆవిష్కర్తలుగా, విమానాలు నడిపే పైలెట్లుగా చూడాలనుకునేవారు. కానీ ఎందుకనో జోసెఫ్ కెనడీ మాత్రం తన రెండో కొడుకును రాజకీయాల్లో దించాలన్న దృఢచిత్తంతో చిన్నారి జాన్‌కు అందుకు కావలసిన అన్ని ఏర్పాట్లూ అందుబాటులో ఉంచారు.

చిన్నప్పటినుంచే మానవ సంబంధాలూ, రాజనీతి శాస్త్రం, పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, ఉపన్యాసాలివ్వడం వంటి వాటిలో శిక్షణనిచ్చి పై చదువులకోసం జాన్‌ను హార్వర్డ్ విశ్వవిద్యాలయానికి పంపాడు. యూనివర్శిటీలో చేరిన రెండేళ్లలోనే జాన్ అక్కడ అందరికీ సుపరిచితుడైపోయాడు. ఏడాది తరువాత జాన్ సోదరుడు జో కూడా ఇదే యూనివర్శిటీలో చేరడంతో ఈ అన్నదమ్ములిద్దరికీ ఎదురు లేకుండా పోయింది. పట్టా తీసుకున్న తరువాత జాన్ తన తండ్రికి వ్యక్తిగత కార్యదర్శిగా పనిలో కుదిరాడు. ఈలోగా జాన్ తండ్రి బ్రిటన్‌లో అమెరికా రాయబారిగా నియమితులయ్యారు. ఇదే అవకాశంగా జాన్ తన తండ్రి తోపాటు ఎన్నో దేశాలు తిరిగాడు. రకరకాల వ్యక్తులను కలుసుకున్నాడు. లండన్‌లోని అమెరికన్ రాయభార కార్యాలయంలో కార్యదర్శి పదవిని పొందిన కెనడీ ఎంతో మంది ప్రముఖులు, రకరకాల మేధావులు, శాస్త్రవేత్తలు, కళాకారులను కలుసుకున్నాడు. దౌత్య వ్యవహారాల్లో తండ్రి పోకడలను అనుక్షణం గమనించే జాన్ ఒక దౌత్యవేత్తకు అవసరమైన లక్షణాలను అలవర్చుకున్నాడు. బ్రిటన్ విదేశాంగ విధానంలోని లోపాలను ఎత్తిచూపుతూ తండ్రి సహకారంతో జాన్ 1940లో ఒక పుస్తకం రాశాడు. "వై ఇంగ్లండ్ స్లెప్ట్" అనే ఈ పుస్తకం అప్పట్లో సంచలనం సృష్టించింది. రెండో ప్రపంచ యుద్ధం మొదలుకావడంతో నిర్బంధంగా అందరూ సైన్యంలో పనిచేయాలన్న నిబంధన మేరకు జాన్ ఆర్మీ సెలక్షన్స్‌కు వెళ్ళాడు. అయితే కళాశాల రోజుల్లో ఫుట్‌బాల్ ఆడేటప్పుడు జాన్ వీపు భాగంలో బలమైన గాయమైన కారణంగా అతన్ని ఆర్మీలోకి తీసుకోకుండా తిరస్కరించారు. దీనితో సైన్యంలోనే పనిచేసి తీరాలన్న పట్టుదలతో, అంతగా పట్టింపులు లేని నావికాదళంలో చేరాడు. అమెరికన్ నౌకాదళంలో లెఫ్టినెంట్ గ్రేడ్ టూ గా చేరిన జాన్ అక్కడ కూడా చరిత్ర సృష్టించాడు. యుద్ధం ముమ్మరంగా జరుగుతున్న రోజుల్లో జాన్ తన సహచరులతో కలిసి సాలమన్ దీవుల్లో

అమెరికా స్థావరం రక్షణ కోసం వెళ్ళాడు. తీర ప్రాంతాల్లో గస్తీ తిరుగుతున్న జాన్ బోటును జపాన్‌కు చెందిన ఒక యుద్ధ నౌక టార్పెడో ప్రయోగించి ముంచివేసింది. దీంతో నడి సముద్రంలో మునిగిపోతున్న ముగ్గురు సహచరులను జాన్. ఎఫ్. కెనడీ ఎంతో సాహసంతో ఒడ్డుకు చేర్చాడు. జాన్ సాహసాన్ని ఆ తరువాత పత్రికలు పతాక శీర్షికల కెక్కించాయి.

రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత జాన్ మెసాచూసెట్స్‌లో తన రాజకీయ జీవితాన్ని ప్రారంభించాడు. అక్కడ బోస్టన్ సీటు నుంచి పోటీ చేసి విజయం సాధించాడు. ఈ లోగా రాజకీయాలపై తనకున్న అభిప్రాయాలను వెల్లడిస్తూ రాసిన 'ప్రొఫైల్స్ ఇన్ కరేజ్' పుస్తకం అమెరికాలో సంచలనానికి కారణమైంది. ఆ పుస్తకమే కెనడీకి పులిట్జర్ బహుమతి సాధించి పెట్టింది. దీనితో ఇక ప్రపంచంలోని అత్యున్నత పదవి అయిన అమెరికా అధ్యక్ష స్థానానికి జాన్ గురిపెట్టాడు. నాలుగేళ్ల నిరంతర శ్రమ తరువాత అప్పటి వరకూ అవినీతి, నీతిబాహ్య కార్యకలాపాలతో విసుగెత్తిపోయిన అమెరికన్ ప్రజలు యువకుడైన జాన్ ఎఫ్ కెనెడీకి అనుకూలంగా తీర్పు ఇచ్చారు. దీనితో ఎన్నో ఏళ్లుగా కన్న తండ్రి కలలను సాకారం చేస్తూ జాన్ అమెరికా ముప్పయ్ అయిదో అధ్యక్షుడిగా పగ్గాలు చేపట్టాడు. ప్రపంచంలోని అతి బలమైన ప్రజాస్వామ్య వ్యవస్థ అధ్యక్షుడిగా జాన్ ఎన్నో సవాళ్లను ఎదుర్కొన్నాడు. పెరిగిపోతున్న రష్యా పెత్తనాన్ని అడ్డుకోవడం ఒక ఎత్తైతే, పక్కలో బల్లెంలా మారిన కమ్యూనిస్ట్ క్యూబాను నిలువరించాలన్న జాన్ ప్రయత్నాలు సాగలేదు. ఈలోగా రష్యాలో సంస్కరణలు తెచ్చి, స్టాలిన్ అరాచకాలకు మంగళం పాడిన నికితా కృశ్చేవ్ అసలు జాన్‌ను తాను ప్లేబాయ్ ప్రెసిడెంట్‌గా మాత్రమే గుర్తిస్తానని ప్రకటించాడు. ఇలా మొదటి రెండేళ్లు జాన్ పాలన వైఫల్యాల బాటలో నడి చింది. ఆ తరువాత క్యూబా విషయంలో తలెత్తిన వివాదం కెనడీ కాలంలో అమెరికా-రష్యాల మధ్య భీకర యుద్ధానికి దారి తీసే పరిస్థితులను కల్పించాయి. అయితే రష్యా బెదరింపులకు లొంగిపోకుండా నిబ్బరంగా వ్యవహరించిన కెనడీ సాహసాన్ని అమెరికన్లు హర్షించారు.

అమెరికా అధ్యక్షుడిగా కెనడీ మరో తప్పిదానికి పాల్పడ్డాడు. అదే వియత్నాం యుద్ధం. ఎక్కడో సుదూరాన ఉన్న వియత్నాంలో కమ్యూనిస్టు పాలన అంతమొందించేందుకు యుద్ధం చేయాలన్న కెనడీ నిర్ణయం అమెరికన్లకు ఒక పీడకలగా మారింది. యుద్ధంలోకి దిగిన తరువాత ఎటూ తేల్చుకోలేక అమెరికన్లు అల్లాడి పోయారు. ఈలోగా భార్య జాక్వెలిన్‌తో లైంగిక జీవితంలో ఒడిదుడుకులెదుర్కొంటూ కెనడీ పెట్టుకున్న కొన్ని వివాహేతర సంబంధాలు పత్రికల్లో చర్చనీయాంశాలుగా మారాయి. అప్పట్లో శృంగార రాణి, సెక్స్ సింబల్ మార్లిన్ మన్రోతో కెనడీకి సంబంధాలున్నట్లు ప్రచారం జరిగింది. అయితే తన చతురోక్తులు, ప్రజలను కర్తవ్య నిర్వహణకు సమాయత్తపర్చడంలో కెనడీ చాతుర్యం అసామాన్యమైనది. "ఈ దేశం నాకేమిచ్చిందని కాదు దేశానికి మనమేం చేశాము" అన్న కెనడీ సూక్తి అప్పట్లో అమెరికా, యూరప్‌లో సంచలనం సృష్టించింది. రష్యా ప్రభావంలో భారతదేశం కొట్టుకొని పోతుందని హెచ్చరిస్తూనే నెహ్రూతో కూడా ఆయన సత్సంబంధాలు నెరిపాడు.

పేరు పొందిన అమెరికా అధ్యక్షుల్లాగే జాన్.ఎఫ్. కెనడీ కూడా ఒక హంతకుని తుపాకీ గుళ్లకు బలైపోయాడు. 1963 నవంబర్ 22న టెక్సాస్‌లోని డల్లాస్ వీధి గుండా టాప్ లెస్ కారులో ఊరేగింపుగా వెళ్తున్న కెనడీని ఒక ఉన్మాది కాల్చిచంపడం అప్పట్లో ప్రపంచ వ్యాప్తంగా సంచలనం సృష్టించింది. చిన్న వయస్సులోనే ప్రపంచంలో అతి పెద్ద ప్రజాస్వామ్య వ్యవస్థకు అధ్యక్షుడై ఎన్నో ఒడిదుడు కులను ఎదుర్కొన్న కెనడీ చిరకాలం గుర్తుండే అమెరికా అధ్యక్షుల్లో ఒకరు.

1907-
1964

# రాచెల్ కార్సన్

పక్షుల కిలకిలా రావాలు వినిపించని చోటు. సూర్యోదయానికి చిహ్నంగా పిట్టలు కిచకిచమనని చోటు. అడవులు సంపూర్ణంగా అంతరించిన చోటు. వింత వింత వ్యాధులతో మరణించే మనుషులు. ఆకాశం నుంచి విష వర్షం. ఇదంతా ఏదో సైన్స్ ఫిక్షన్‌లోని వర్ణన కాదు. ఇది అక్షరాలా మనం నివసిస్తున్న నేల. ఈ విపరీత పరిణామాలన్నింటినీ మనం ఏదో ఒక స్థాయిలో అనుభవిస్తూనే ఉన్నాం. ఎంత దుర్వినియోగం చేసినా ప్రకృతి పదిలంగా ఉంటుందనుకోవడం భ్రమ. 1962లో ప్రచురితమైన 'సైలెంట్ స్ప్రింగ్' అన్న గ్రంథంలో రాచేల్ కార్సన్ ఇలాంటి పరిస్థితిని కళ్లకు కట్టినట్టుగా చిత్రించారు. విచక్షణారహితంగా క్రిమి సంహారక మందులు, రసాయనిక ఎరువులు వాడడం ఇలాగే కొనసాగిస్తే భవిష్యత్తు ఎలా ఉండబోతోందో ఈ గ్రంథంలో ఆమె స్పష్టంగా రూపు కట్టించారు. 'సైలెంట్ స్ప్రింగ్' అన్న గ్రంథం వెలువడగానే బాగా అమ్ముడు పోయింది. కార్సన్‌ది అరణ్యరోదనం అనిపించినా ఆమె కృషి కారణంగానే పర్యావరణ పరిరక్షణోద్యమం ఆవిర్భవించింది.

పెన్సిల్వేనియాలోని స్ప్రింగ్‌డేల్‌లో స్కాట్లాండ్‌కు చెందిన తండ్రి, అమెరికాకు చెందిన తల్లికి కార్సన్ జన్మించింది. ఆమె తల్లిదండ్రులు కార్సన్ రచనాసక్తిని ప్రోత్సహించారు. పిన్నవయస్సులోనే ప్రకృతిని గురించి కార్సన్ విపరీతమైన ఆసక్తి, అనురక్తి కనబరిచేది. ఆమె చిన్ననాటి నుంచీ కూడా తను రచయిత్రిని కావాలనే కోరుకునేది. కౌమారదశలో ఉండగానే బాలల పత్రిక సెయింట్ నికోలస్‌కు ఒక కథ పంపగలిగారు. అయితే ఆమె రచనలు ప్రచురితం కావడం ఆ తర్వాత అంత సునాయాసమైన వ్యవహారంగా లేని మాట నిజమే. పెన్సిల్వేనియా మహిళా కళాశాలలో చదువుకునేటప్పుడు ఆమె సైన్స్‌లో తన ప్రతిభను, ఆసక్తిని వ్యక్తం చేయడం మొదలైంది. అనేక పత్రికలకు కవితలు రాసి పంపించింది. అయితే అవన్నీ తిరుగు టపాలో వచ్చేశాయి. 1928లో పట్టభద్రురాలైన కార్సన్ తర్వాత జాన్స్ హాప్కిన్స్ యూనివర్శిటీలో చేరారు. 1932లో జంతు శాస్త్రంలో మాస్టర్ డిగ్రీ పుచ్చుకున్నారు. కొంత కాలం కళాశాలలో అధ్యాపకురాలిగా పనిచేశారు. మెసాచూసెట్స్‌లోని ఊడ్స్‌హోల్‌లో మెరైన్ బయలాజికల్ లాబొరేటరీలో కొంత కాలం విద్యాభ్యాసం చేశారు. ఆమె సోదరి మరణించడంతో ఆమె పిల్లలిద్దరినీ పోషించవలసిన బాధ్యత కార్సన్, ఆమె తల్లిపై పడింది. అంతకు ముందు సంవత్సరమే ఆమె తండ్రి మరణించాడు. అందువల్ల ఉద్యోగం వెతుక్కోక తప్పలేదు. 1936లో అమెరికా మత్స్య విభాగంలో సముద్రజీవ శాస్త్రజ్ఞురాలిగా చేరారు. ఈ సంస్థ ఆ తర్వాత ఫిష్ అండ్ వైల్డ్ లైఫ్ సర్వీస్‌గా మారింది. 1949లో ప్రభుత్వ ప్రచురణలకు కార్సన్ ప్రధాన సంపాదకురాలయ్యారు. 1952లో ఆ ఉద్యోగానికి రాజీనామా చేశారు.

కార్సన్ రచనా వ్యాసంగం మాత్రం కొనసాగిస్తూనే వచ్చారు. ఆమెలో కవితాశక్తి ఆ తర్వాత ఆమె వచనానికి వన్నెలు దిద్దడానికి ఉపయోగపడింది. అంతకు ముందు 'అండర్ సీ' అని అట్లాంటిక్ మంత్లీలో రాసిన వ్యాసాన్ని విస్తరించి గ్రంథంగా ప్రచురించారు. ఈ గ్రంథానికి ఒక మోస్తరుగా ఆదరణ లభించింది. కానీ ఈ రచనే ఆమె తన వృత్తిని ఎన్నుకోవడానికి ఉపకరించింది. 1955 నాటికి 'ది సీ అరౌండ్ అజ్' 'ది ఎడ్జ్ ఆఫ్ ది సీ' గ్రంథాలు కూడా వెలువడడంతో సముద్ర విజ్ఞానంపై వరుసగా మూడు గ్రంథాలు ప్రచురించినట్టయింది. అమితమైన అనుభూతితో, ప్రతిభావంతంగా రాసిన ఈ మూడు గ్రంథాలు పాఠకులను ఆకర్షించాయి. ఈ గ్రంథాలు చదివిన ఒక పాఠకుడు పక్షుల అభయారణ్యంలో

విపరీతంగా డిడిటి చల్లడాన్ని నిరసిస్తూ ఆమెకు ఒక లేఖ రాశాడు. ఈ లేఖే డిడిటి ప్రభావంపై పరిశోధన చేయడానికి కార్సన్‌ను ప్రేరేపించింది. చీడ పీడల బాధ లేకుండా ప్రగతిశీల పద్ధతిలో పంటలు పండించాలన్న తాపత్రయంతో రైతులు, భారీ వ్యవసాయ క్షేత్రాలు నిర్వహించేవారు, అమెరికా వ్యవసాయ శాఖవారు, రసాయనిక ఎరువులు, క్రిమి సంహారక మందులు తయారు చేసే కంపెనీలవారు పక్షులకు ఎంత తీవ్రమైన నష్టం కలిగిస్తున్నారో కార్సన్ గ్రహించారు. అంతకు చాలా కాలం ముందు నుంచే ఆమె ఆడుబాన్ సొసైటీ సభ్యురాలిగా ఉన్నారు. ఈ పరిశోధనకు, ఆ తర్వాత గ్రంథం రాయడానికి నాలుగు సంవత్సరాలు పట్టింది. ఈలోగా ఆమె కీళ్లవాతం, అల్సర్లతో బాధ పడింది. అదే సమయంలో ఆమె తల్లి మరణించింది. చివరకు ఆమెకు కాన్సర్ సోకినట్టు తెలిసింది.

డిడిటి వంటి క్రిమిసంహారక మందులు చీడ పీడలను నాశనం చేయడంతో ఆగిపోవనీ, అవి పంటలకు హాని కలిగించే క్రిమి కీటకాదులనే కాకుండా ఇతర జీవజాలాన్ని కూడా ఎలాంటి విచక్షణా లేకుండా అంతమొందిస్తాయని ఆమె గ్రహించారు. ఈ రకంగా పక్షులు, చేపలు, జంతువులు అంతరిస్తున్నాయని ఆమె కనిపెట్టారు. క్రిమి సంహారక మందులు చల్లడంవల్ల నీటిలో ఈదే చేపలు, నేలపై పాకే జీవులు, ఎగిరే పక్షులు ఏవీ కూడా ఈ మందుల ప్రభావం నుంచి తప్పించుకోలేవు. మరీ భయంకరమైన వాస్తవం ఏమిటంటే ఈ క్రిమి సంహారక మందులు మనుషుల కొవ్వు కణాల్లో అలాగే ఉండిపోతాయి. ఈ విషపదార్థాలు అనేక సంవత్సరాలపాటు చడీ చప్పుడు లేకుండా శరీరంలో ఉండి పోయి అవి కాన్సర్‌కు, ఇతర ప్రాణాంతక వ్యాధులకు దారితీయవచ్చు. ప్రకృతిలో అన్నింటికీ పరస్పర సంబంధం ఉందని, ఇలా అంతస్సంబంధం ఉన్న వాటిలో ఏ ఒక్క దానిని కదిలించినా ఆ ప్రభావం మిగతా వాటన్నింటిపై ఉంటుందని ఆమె వాదించారు. దీనికి చెల్లించాల్సిన మూల్యం చాలా భారీగా ఉంటుందని హెచ్చరించారు.

నేటి విజ్ఞాన శాస్త్రం ఈ అభిప్రాయాన్ని సాంప్రదాయికమైన వివేకంగానే పరిగణిస్తోందని కాని నిన్నటి విజ్ఞాన శాస్రం ఇలాంటి భావాలను, అలాంటి భావాలు ఉన్న వారిని తిరస్కరించింది. అవహేళన చేసింది. జంతు శాస్త్రంలో స్నాతకోత్తర విద్య అభ్యసించినప్పటికీ కార్సన్‌ను 'సైంటిస్ట్ కాదు' అనే వారు. కార్సన్ వెలిబుచ్చే సరికొత్త భావాలవల్ల రసాయనిక కంపెనీలకు, అవి దండుకునే లాభాలకు పెద్ద ప్రమాదం ముంచుకు వచ్చింది. అందువల్ల ఆ వర్గాల వారు ఆమెపై క్రూరమైన విమర్శలకు దిగారు. వన్యప్రాణులపై ఆమె కనబరుస్తున్న శ్రద్ధను మొదట్లో కొనియాడిన టైమ్ పత్రిక కూడా ఆమె తాజా గ్రంథం ఏకపక్షమైందనీ, అతిశయోక్తులతో కూడిందని విమర్శించింది. కానీ చివరకు సత్యమే జయించింది. అయిదేళ్ళ తర్వాత పరిశుభ్రమైన పర్యావరణం పౌరుల హక్కు అన్న అంశాన్ని వాస్తవం చేయడానికి 'ఎన్విరాన్‌మెంటల్ డిఫెన్స్ ఫండ్' (పర్యావరణ పరిరక్షణ నిధి) ఏర్పాటైంది. ఆ తర్వాత మూడేళ్ళకు పర్యావరణ పరిరక్షణ సంస్థ (ఎన్విరాన్‌మెంటల్ ప్రొటెక్షన్ ఏజెన్సీ) ఏర్పడింది. అంతిమంగా 1972లో అమెరికాలో డిడిటిని నిషేధించారు. దురదృష్టవశాత్తు 'సైలెంట్ స్ప్రింగ్' అన్న తన గ్రంథం ఏం సాధించగలిగిందో చూడడానికి కార్సన్‌కు అవకాశం కలగలేదు. ఆ గ్రంథం ప్రచురితమైన రెండేళ్ళకు ఆమె కాన్సర్ వ్యాధితో మరణించింది. ప్రకృతి ఒడిలో చేరిపోయింది. "నేను కలకాలం జీవించడం, ముఖ్యంగా అందమైన, ఆనందకరమైన వాటితో కలిసి జీవించడం మంచి ఆలోచన" అని ఆమె రాశారు.

1867-
1934

# మేరీ క్యూరీ

గత శతాబ్దం తొలి నాళ్లలో రష్యా ఆధిపత్యంలోని పోలెండ్‌లో పెరిగిన మేరీ క్యూరీ ఆ తర్వాత మరో రకమైన అణచివేతకు కూడా సిద్ధం అయ్యింది. ఆ కాలంలో శాస్త్ర పరిశోధనల రంగంలో మహిళలపై అనేక పరిమితులు ఉండేవి. నోబెల్ బహుమతి అందుకున్న మొట్ట మొదటి మహిళ క్యూరీ. ఫ్రాన్సులో మొదటి మహిళా ప్రొఫెసర్ అన్న ఖ్యాతి కూడా ఆమెకే దక్కింది. ఆమె రేడియంను కనుగొన్నారు. అంటే తళ తళ మెరిసే పదార్థం రహస్యాలనే కనిపెట్టారన్నమాట. తన భర్త పియరీతో కలిసి రేడియంను కనిపెట్టిన మేడం క్యూరీ అజరామరమైన కీర్తిని సంపాదించారు. వైపరీత్యం ఏమిటంటే ఆమె కనిపెట్టిన పదార్థమే ఆమెను కబళించింది.

ఆమె తల్లిదండ్రులిద్దరూ ఉపాధ్యాయులే. తండ్రి వ్లాడిస్లా. తల్లి బ్రోమ్‌స్లావా స్కోడోస్కా. వార్సాలోని తమ ఇంట్లో బ్రోమ్‌స్లావా ఒక పాఠశాల నిర్వహించేవారు. ఆ రోజుల్లో మేరీని మాన్యా అనేవారు. పాఠశాల విద్యకన్నా హెచ్చుస్థాయికి ఎదగడానికి ఆమె తల్లి దండ్రులు తోడ్ప డ్డారు. తన తల్లిదండ్రులలాగే తాను కూడా ఉపాధ్యాయవృత్తినే స్వీకరించాలన్నది ఆమె ఆకాంక్ష. అయితే విజ్ఞాన శాస్త్రం, గణితంలో ఆమెకు ఉన్న గాఢాభినివేశం వల్ల ఆమె మరోదారి అనుసరించాల్సి వచ్చింది. ఆమె ప్రతిభవంతురాలైనప్పటికీ, సార్బోన్ ఎం.డి. అయిన తన అక్క బ్రోనియా ఆదర్శంగా ఉన్నప్పటికీ ఆమె ప్రయాణం పూలపాన్పు ఏమీ కాలేదు. ఆ సమయంలో మహిళలు ఉన్నత విద్య అభ్యసించడం చట్ట విరుద్ధం. కానీ ఉన్నత పాఠశాల స్థాయిలో మాన్యా అసాధారణ ప్రతిభ కనబరిచినందువల్ల ఫ్లోటింగ్ యూనివర్సిటీలో ఆమె విజ్ఞానశాస్త్ర సాంకేతికతను, సంఘ సంస్కరణను అధ్యయనం చేశారు. భావసారూప్యతగల యువజనులు దానిని నిర్వహించేవారు. స్థానిక మ్యూజియం ఆఫ్ ఇండస్ట్రీ అండ్ అగ్రికల్చర్‌లో పనిచేస్తున్న సమయంలో మేరీ గవర్నెస్‌గా పనిచేసేది. చివరకు 1981లో పారిస్ యూనివర్సిటీలో చేరారు.

ఇరవై నాలుగేళ్ల మాన్యా పారిస్‌లో తన అక్క బావతో కలిసి ఉంది. బావ ప్రవాస జీవితం గడుపుతున్న పోలెండ్ డాక్టర్. ఈ పరాయి నగరానికి వచ్చిన తర్వాత ఆమె జీవితం కొత్త మలుపు తిరిగింది. తన పేరు మేరీగా మార్చుకుంది. తన చదువు పూర్తయిన తరువాత వార్సా వెళ్ళి తన తండ్రి వృత్తి అయిన బోధన చేపట్టాలనుకుంది. రెండేళ్ల తర్వాత భౌతిక శాస్త్రంలో ప్రథమశ్రేణిలో నిలిచి లెసిన్స్ ఎస్ సైన్సెస్ సంపాదించింది. ఆ మరునాటి సంవత్సరం గణిత శాస్త్రంలో డిగ్రీ సంపాదించింది. శక్తి సామర్థ్యాలు, కృతనిశ్చయం ఉన్న ఈ యువ విద్యావేత్త తన చదువును తనకు అమితాసక్తిని కలిగించిన అయస్కాంతతత్వ శోధనకు వినియోగించింది. ఆమె డాక్టరేట్ చేయాలని నిర్ణయించుకున్న ఆనాటి స్థితి ఏమిటంటే మహిళలు అలాంటి ఆలోచనలు చేయడమే వింత. కాని విధి ఆమెని పారిస్ మునిసిపల్ స్కూల్ ఆఫ్ ఫిజిక్స్ అండ్ కెమిస్ట్రీలో పియరీ ప్రయోగశాలకు లాక్కెళ్ళింది. మేరీలాగే అతనికీ నిజమయిన పరిశోధన మీదే ఆసక్తి. ఇద్దరూ కలిసి అయస్కాంతతత్వంపై పరిశోధన ప్రారంభించారు.

1895లో వారు పెళ్ళి చేసుకున్నారు. అదే సంవత్సరం జర్మన్ శాస్త్రవేత్త విల్‌హెల్మ్ రాంట్జన్ ఎక్స్ కిరణాలను కనిపెట్టాడు. ఎక్స్ కిరణాలను కనిపెట్టడం ఎంత ఉద్వేగం కలిగించిందంటే అదే సమయంలో యురెనిక్ కిరణాలను కనిపెట్టిన ఆంటోయిన్ హెన్రీ బెక్విరెల్ కృషిని ఎవరూ పట్టించుకోలేదు. యురేనియం మిశ్రపదార్థాల ద్వారా ఈ కిరణాలు వెలువడుతాయి. కానీ మేరీ క్యూరీ ఈ అంశాన్నే తన డాక్టొరల్ సిద్ధాంతం కోసం ఎంపిక చేసుకుంది. టన్నులకొద్దీ దొరికే యురేనియం భస్మం నుంచి యురేనియంను వేరు చేస్తున్నప్పుడు ఆ భస్మం నుంచి ఎక్కువ 'అణుధార్మికత' వెలువడినట్టు మేరీ కనుగొన్నారు. అణుధార్మికత అన్న పదం కూడా మేరీ సృష్టే. మేరీ, పియరీ సంయుక్తంగా ఈ ధోరణికి గల కారణాలను అన్వేషించడం ప్రారంభిస్తే వారికి ఒక కొత్త మూలకం దొరికింది. దానికి పొలోనియం అన్న పేరు పెట్టారు. ఆ పేరు మేరీ జన్మించిన ఊరి పేరు నుంచి వచ్చింది. మేరీ కొనసాగిస్తున్న పరిశోధనలు

చాలా ప్రయాసతో కూడుకున్నవైనందువల్ల పియరీ తన పరిశోధనను వదిలిపెట్టి మేరీతో కలిసి పనిచేయడం ప్రారంభించాడు. ఈ మూలకాన్ని కనిపెట్టడం మాత్రం మేరీకి సంతృప్తి కలిగించలేదు. మూడు మూలకాలు కలిసి యురెనిక్ కిరణాలు విడుదల చేస్తున్నందువల్ల యురేనియం, పొలోనియం కాక మరో మూలకం ఆ ముడి ఖనిజంలో ఉండి ఉండాలన్న ఆలోచన ఆమెకు తట్టింది. బేరియంను పరిరక్షిస్తుండగా ఆమె అనుమానం నివృత్తి అయింది. దానికి వారు రేడియం అని పేరు పెట్టారు.

అంత మాత్రం చేత క్యూరీకి అమాంతం కీర్తి ప్రతిష్టలు రాలేదు. ఎందుకంటే ఏ కొత్త విషయాన్ని కనిపెట్టినా దాన్ని అనుమాన దృక్కులతో చూడడం పరిపాటి. ఆ పరిస్థితి ఇప్పటికీ ఉంది. ఆ తర్వాత అనేక ఏళ్లపాటు విశ్లేషణలు, జాగ్రత్తగా కొనసాగించిన సంయోజనల తర్వాత చివరకు 1903లో మేరీకి, ఆమె భర్తకు నోబెల్ బహుమతి వచ్చింది. ఆంటోయిన్ బెక్విరల్‌కు కూడా నోబెల్ బహుమతి దక్కింది. అదే సంవత్సరం ఆమెకు డాక్టరేట్ పట్టా కూడా వచ్చింది. రేడియంను వేరు చేయానికి తన భర్తతో కలిసి కనుగొన్న ప్రక్రియకు పేటెంట్ పొందదానికి ఉన్నతాశయాలు గల మేరీ నిరాకరించింది. ఆ పేటెంట్ హక్కులే సంపాదించి ఉంటే వారు అపారమైన డబ్బు సంపాదించగలిగేవారు. ఈ ప్రక్రియ ఇతర పరిశోధనలకు సైతం అందుబాటులో ఉండాలన్నది మేరీ ఆశయం. ఈలోగా ఆమె అధ్యాపనం, పరిశోధన ప్రారంభించడంతో పాటు ఇరిన్, ఈవ్ ఇద్దరు ఆడపిల్లలకు తల్లికూడా అయింది. ఆ ఇద్దరూ కూడా 1935లో నోబెల్ బహుమతి గ్రహీతలయ్యారు. అడ్డదిడ్డంగా నడుస్తున్న ఒక గుర్రపు బండి కింద పడి 1906లో పియరీ మరణించాడు. పుట్టెడు దుఃఖంలో ఉన్నప్పటికీ మేరీ తను కనుగొన్న రేడియంకు ఉండే ధర్మాల్లాగే తన పరిశోధనల్లో పట్టు సడలించలేదు. రేడియంకు ఉన్న ధర్మాలు కాన్సర్ చికిత్సకు అమోఘంగా ఉపకరించాయి. అల్సర్లు, చర్మ కాన్సర్ చికిత్సకు రేడియం ఉపకరిస్తుందని పియరీ తన చివరి పరిశోధనా పత్రంలో చర్చించారు. సోర్బోన్‌లో పియరీ ఉద్యోగాన్ని మేరీకి ఇచ్చారు. ఆ బాధ్యత గురించి మేరీ తన డైరీలో 'నీ స్థానంలో పనిచేయడం కన్నా మించిన కిరాతకం ఏదైనా ఉంటుందని కలలో నైనా ఊహించగలమా" అని రాసుకున్నారు. 1911లో మేరీకి రెండోసారి నోబెల్ బహుమతి వచ్చింది. ఈసారి రసాయన శాస్త్రంలో ఆ అవకాశం దక్కింది. అయితే ఈ బహుమతి ఆమెకు మరో కారణంగా ఆనందదాయకం కాలేదు. ఒక ఫ్రెంచి వైద్యుడితో ఆమెకు ఉన్న సాన్నిహిత్యం, వారిద్దరి మధ్య ఆత్మీయంగా సాగిన ఉత్తర ప్రత్యుత్తరాలు బట్టబయలు కావడంతో ఆమెకు నోబెల్ బహుమతి వచ్చిన సంతోషం దక్కలేదు. ఆమె మృతి తర్వాత ఆమె చితా భస్మాన్ని, పియరీ చితాభస్మంతో పాటు 1955లో ఫ్రాన్స్ సర్వదేవతాలయంలో ఉంచారు. ఆ అరుదైన గౌరవం వారికి దక్కింది. మొదటి ప్రపంచ సంగ్రామం సమయంలో రోగ నిర్ధారణకు ఉపయోగించే ఎక్స్ కిరణాలకు సంబంధించిన కృషిని ఆమె సమన్వయం చేశారు. యుద్ధం ముగిసిన తర్వాత తన రేడియం ఇన్‌స్టిట్యూట్‌లో మళ్ళీ పరిశోధనల్లో మునిగిపోయారు. ఆమె ఎంత సమర్థురాలైనప్పటికీ ఆమెది విశ్వవిఖ్యాత శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ తర్వాతి స్థానమే.

క్యూరీ ఆవిష్కరించిన సర్వరోగ నివారిణి అనుకున్న రేడియం చివరకు ఆమె ప్రాణాలనే హరించింది. దీనికోసం పరిశోధనలు కొనసాగిస్తున్న దశలోనే మేరీ, పియరీ రేడియం శరీరాన్ని దహించి వేస్తుందని గుర్తించినప్పటికీ ఆ మూలకం నిజంగా ఎంతటి వినాశకరమైందో కనిపెట్టలేకపోయారు. అలాంటి స్థితిలోనే సంవత్సరాల తరబడి ఎలాంటి రక్షణ లేకుండానే రేడియంతో తమ పని కొనసాగించారు. (ఆమె వాడిన నోట్ బుక్స్ ఇప్పటికీ భయంకరంగా అణుధార్మికతతో కలుషితం అయి ఉన్నాయి) ఫలితంగా మేరీ జబ్బుపడింది. కంటి చూపు కోల్పోయింది. అయినా చివరి వరకు పనిచేస్తూనే ఉంది. తాను కనిపెట్టిన కొత్త మూలకం హతపడి చివరకు 1934లో లుకేమియా (ఒక రకమైన పాండురోగం)తో మరణించింది.

# ఫిడెల్ క్యాస్ట్రో

అతను మొక్కవోని పోరాటపటిమ గల యోధుడు. విద్యార్థి దశలోనే నాయకత్వ లక్షణాలు పుణికి పుచ్చుకొని దేశాధ్యక్షుడైన వ్యక్తి. అతనే క్యూబా అధినేత ఫెడరల్ క్యాస్ట్రో. శక్తిమంతమైన అమెరికాను ప్రతిసారి ఖంగుతినిపించిన కమ్యూనిస్టు నాయకుడు. 1959 జనవరి ఒకటిన అవినీతిలో కూరుకుపోయిన ఫల్జెన్సియో బాటిస్టా ప్రభుత్వాన్ని గెరిల్లా పోరాటంద్వారా కూల్చివేశాడు. అప్పటికి ఆ పోరాట వీరుడు, క్యూబా విప్లవకారుడు ఫిడెల్ కాస్ట్రోకు కేవలం 33 ఏళ్ళే. కాస్ట్రో గొప్ప జనాకర్షణ శక్తిగల నాయకుడు. నిర్దిష్టమైన రాజకీయ దృక్కోణం గల వాడు. శ్రోతలను మంత్ర ముగ్ధులను చేయగల మహావక్త. ఆయనకు క్యూబా ప్రజల సంపూర్ణ మద్దతు ఉంది. కాస్ట్రో మొదట ప్రధాన మంత్రిగా పనిచేసి ఆ తర్వాత అధ్యక్షుడయ్యాడు. విప్లవానికి ప్రతీకగా, సామాజిక దురన్యాయాలకు వ్యతిరేకంగా పోరాడేయోధుడిగా క్యూబాలో ప్రజాస్వామ్యాన్ని పరిఢవిల్ల చేస్తానని వాగ్దానం చేసిన వాడిగా జనం ఆయనను కొనియాడారు. అయితే ఆయన ప్రజస్వామ్యాన్ని అమలు చేయలేదు. ఎన్నికలు నిర్వహించకుండా తనంతట తాను అధ్యక్ష స్థానం చేపట్టాడు. తన ప్రత్యర్థులను జైళ్లలోకి నెట్టాడు. దేశం వదలిపోయేట్టు చేశాడు. హతమార్చాడు.

ఆయన తండ్రి చెరకు రైతు. కాస్ట్రో జెసూట్ విద్య అభ్యసించాడు. కౌమార దశలో నెపోలియన్, సీజర్ ధైర్యసాహసాలకు మారుపేరయిన లాటిన్ విమోచనోద్యమ నాయకులు జోస్ మార్టి, సైమన్ బొలివర్ వంటి వారు కాస్ట్రో దృష్టిలో హీరోలు. ఫిడెల్ కాస్ట్రోరుజ్ 1945లో న్యాయశాస్త్రం అభ్యసించడానికి హవానా యూనివర్శిటీలో చేరాడు. వామపక్ష రాజకీయాల్లో ఎక్కువగా పాల్గొనేవాడు. విద్యార్థి బృందాలలో నాయకత్వం కోసం పోటీ పడేవాడు. యూనివర్శిటీపై ఆధిపత్యం సంపాదించడానికి ఈ విద్యార్థి బృందాలు ప్రయత్నించేవి. ఒకసారి కాస్ట్రో తన ప్రత్యర్థిని గుండెల్లో కాల్చాడు. దౌర్జన్యానికి వెనుకాడకపోవడం, శక్తివంతమైన వ్యక్తిత్వం ఆసరాగా ఆయన ఆ కరీబియన్ దేశంపై ఆధిపత్యం సంపాదించాడు.

బాటిస్టా పాలనకు వ్యతిరేకంగా కాస్ట్రో ప్రారంభించిన పోరాటం శుభసూచకంగా మొదలవ్వలేదు. 1953 జులై 26న సాంటియాగోలోని మొన్కాడా సైనిక శిబిరం మీద చేసిన దాడి విఫలమైంది. అప్పుడు కాస్ట్రోను ఆయన తమ్ముడు రాహుల్ కాస్ట్రోను జైలుకు పంపారు. అనేక మంది ఖైదీలకు క్షమాబిక్ష ప్రసాదించినప్పుడు ఈ అన్నదమ్ములిద్దరికీ 1955లో విముక్తి కల్పించారు. మెక్సికో నుంచి ఓరియెంట్ రాష్ట్రంపై దాడి చేయాలని ఈ ఇద్దరు సోదరులు 'జులై 26'న సంకల్పించారు. బాటిస్టా సైనిక దళాలు వీరిని చుట్టు ముట్టినప్పుడు కాస్ట్రోకు విపరీతంగా ఆకలి వేస్తోంది. దాహం వేస్తోంది. చెరుకు తోటలో ఆకుల మాటున దాక్కున్న కాస్ట్రో తన సహచరులను ఉద్దేశించి అంత విపత్కర పరిస్థితుల్లోనూ "విజయం మనదే! మనదే విజయం" అని గుసగుసలా డాడు. ఓరియంట్‌లో ఓటమి తర్వాత కాస్ట్రో ఆయన అనుచరులు ఆగ్నేయ క్యూబాలోని పర్వత శ్రేణుల్లోని సియారా మెస్ట్రాలో తల దాచుకోవాల్సి వచ్చింది. అక్కడి నుంచి వారు విజయవంతమైన పోరాటం కొనసాగించి బాటిస్టాను పారద్రోలగలిగారు.

విప్లవ రథసారథిగా గుర్తింపు పొందిన కాస్ట్రో తన అధికారాన్ని పదిలపరుచుకోవడానికి అనేక మందిని అంతమొందించాడు. అధికారం చేపట్టిన మొదటి ఏడాది విదేశీ పరిశ్రమలను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ఆస్తులు ఉన్నవారి (చాలా మంది దేశం వదలి వెళ్ళిపోయారు) ఓటు హక్కు తొలగించాడు. ఉమ్మడి వ్యవసాయ క్షేత్రాలను ప్రారంభించాడు. 1961లో తాను మార్క్సిస్టు-లెనినిస్టునని ప్రకటించుకున్నాడు. తన దేశం లక్ష్యాలు, సోవియట్ యూనియన్ లక్ష్యాలు ఒకటేనని ప్రకటించాడు. దీనివల్ల సోవియట్ యూనియన్ నుంచి భారీ మొత్తంలో క్యూబాకు ఆర్థిక సాయం అందింది. పశ్చిమార్ధగోళంలో సోవియట్ కాలు మోపడానికి అవకాశం కలిగింది. అంటే అమెరికాకు కూత వేటు దూరంలో సోవియట్ యూనియన్‌కు అనుకూలమైన దేశం ఉంది. జీవన పరిస్థితులను మెరుగుపరుస్తానని హామీ ఇచ్చిన కాస్ట్రో సోవియట్ ఆర్థిక

సహాయం పుణ్యమా అని ఆ వాగ్దానం నిలబెట్టుకోగలిగాడు. జాతీయ ఆరోగ్య సదుపాయాలు పకడ్బందీగా అమలు చేశాడు. నిరక్షరాస్యతను అక్షరాలా నిర్మూలించాడు. కానీ ఈ సంస్కరణలన్నీ అమలు కావడం కోసం క్యూబా ప్రజలు భారీ మూల్యమే చెల్లించాల్సి వచ్చింది.

క్యూబా సోవియట్ యూనియన్ మీద ఆధారపడి ఉన్నందువల్ల ప్రచ్ఛన్న యుద్ధ సమయంలో కాస్ట్రో ప్రముఖుడిగా నిలిచాడు. 1961 ఏప్రిల్‌లో బే ఆఫ్ పిగ్స్‌లో కాస్ట్రో వ్యతిరేక దేశ బహిష్కృతుల దాడి అమెరికా గూఢచార సంస్థ సిఐఎ దన్నుతో చేసిన ప్రయత్నం విఫలం కావడం కాస్ట్రో విజయంగా పరిణమించింది. అది అప్పటి అమెరికా అధ్యక్షుడు జాన్. ఎఫ్. కెన్నడీకి తలవంపులుగా తయారైంది. క్యూబా, అమెరికా మధ్య సంబంధాలు మరింత క్షీణించాయి. దీంతో 1962లో క్యూబాలో సోవియట్ అణు క్షిపణులు ఉన్నాయన్న విషయం బయటపడింది.

ఆ సంవత్సరం అక్టోబర్‌లో రెండు అగ్ర రాజ్యాల మధ్య అణు యుద్ధం సంభవిస్తుందేమోనని ప్రపంచం యావత్తు ఆందోళనతో వారం రోజులపాటు ఎదురు చూసింది. అయితే సోవియట్ ప్రధానమంత్రి నికితా కృశ్చేవ్, అమెరికా అధ్యక్షుడు కెన్నడీ మధ్య రాజీ కుదరడంతో అంతిమంగా కాస్ట్రో అవమానం భరించాల్సి వచ్చింది. క్షిపణులను క్యూబా నుంచి తొలగించారు. కాస్ట్రో తనను తాను అంతర్జాతీయ నాయకుడిగా పరిగణించుకున్నాడు. ఆయన విప్లవ లక్ష్యం చెక్కు చెదరలేదు.

ఇతర దేశాల్లో విప్లవాన్ని ప్రోత్సహించాలన్న ఆలోచనలో భాగంగా క్యాస్ట్రో అంగోలా (1975-1989)కు, ఇథియోపియాకు క్యూబా సైనికులను పంపించాడు. పనామా, నికరాగ్వా, బొలీవియాలో జోక్యం చేసుకున్నాడు. బొలివియా పోరాటంలో కాస్ట్రో మిత్రుడు, సహచరుడు అయిన చేగువేరాను 1967లో బంధించి చంపేశారు. అది కాస్ట్రో విజయపరంపరకు విఘాతం అని చెప్పాలి. సోవియట్ యూనియన్ పతనంతో క్యూబాకు 1991లో ఆర్థిక సహాయం ఆగిపోయింది. క్యూబా పౌరులు జీవన స్థాయి దిగజారింది. ఆర్థిక సంక్షోభం ఎదురైనా కాస్ట్రో అంతర్గత సంస్కరణలను నిరాకరించాడు. తీవ్రమైన పొదుపు చర్యలు చేపట్టాడు.

1990ల మధ్యకాలంలో నిరుద్యోగం, ఆహార పదార్థాల కొరత పెరగడంతో క్యూబా అధినేత ప్రజాందోళనలను ఎదుర్కోవడానికి సైన్యాన్ని సమాయత్తం చేశాడు. తన భార్య డాలియా సోటో డి వల్లే, అయిదుగురు కుమారులతో కలిసి కాస్ట్రో తనదైన ప్రైవేట్ ప్రపంచంలో జీవిస్తున్నాడు. కాస్ట్రో సాధారణంగా సైనిక దుస్తుల్లో దర్శనమిస్తాడు. ఆయన ఇప్పటికీ కమాండెంటే. క్యూబా ఆర్థిక వ్యవస్థ 'డాలరీకరణ'కు గురవడాన్ని కాస్ట్రో ఎదుర్కోవాల్సి వచ్చింది. నల్ల బజారు విస్తరించింది. అమెరికా నాలుగు దశాబ్దాలుగా కొనసాగిస్తున్న ఆంక్షల ప్రభావాన్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. ఆర్థిక వ్యవస్థ క్షీణించడంతో కొత్త పెట్టుబడులను ఆకర్షించడానికి కాస్ట్రో ఆర్థిక వ్యవస్థను సరళీకరించాడు. దీనితో హవానాలోని సముద్ర తీరాలకు పర్యాటకుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. అంతకు ముందు చక్కెర ఉత్పత్తిపై ప్రధానంగా ఆధారపడిన క్యూబా ఆర్థిక వ్యవస్థకు పర్యాటక రంగం ప్రధాన వనరుగా మారిపోయింది.

గత శతాబ్దం ఆఖరి దశాబ్దంలో ఒక డామినిక్ మత నాయకుడికి ఇంటర్వ్యూ ఇచ్చాడు. ఈ ఇంటర్వ్యూ ఆధారంగా 'ఫిడెల్ అండ్ రెలిజియన్' అన్న గ్రంథం ప్రచురించారు. పోరాట పటిమగల కాస్ట్రో ఆ గ్రంథంలో ఆశ్చర్యకరంగా కొంత మేర ఆధ్యాత్మిక అంశాలవైపు మొగ్గు చూపాడు. "కార్ల్ మార్క్స్ సెర్మన్ ఆన్ మౌంట్‌ను సమర్థించే వాడు" అన్నాడు. 1998లో ఆయన పోప్ జాన్ పాల్-2కు స్వాగతం చెప్పడంతో మొత్తం ప్రభుత్వం నివ్వెరపోయింది. క్యూబా సందర్శించిన పోప్ మానవతా కారణాల దృష్ట్యా క్యూబా మీద ఆర్థిక ఆంక్షలు ఎత్తి వేయాలని విజ్ఞప్తి చేశాడు. అంతకు ముందు కూడా పోప్‌తో సమావేశం "ఒక అద్భుతం" అని వయసుమళ్లుతున్న ఈ విప్లవకారుడు అభివర్ణించాడు.

1910-
1998

# అకిరా కురసోవా

అకిరా కురసోవా పరిపూర్ణమైన ఆసియా చిత్ర దర్శకుడే అయినప్పటికీ ఆయన చిత్రాలు తాను పుట్టిన జపాన్‌లో కన్నా పశ్చిమ దేశాల్లోనే ఎక్కువగా మన్ననలు పొందాయి. సినిమాలకు సంబంధించినంత వరకు ఆయన ఆధునిక యుగంలో షేక్‌స్పియర్ వంటివాడు. జీవిత చరమాంకం దాకా ఆయన సినిమాలు నిర్మిస్తూనే ఉన్నాడు. వాటిని జనం ఆదరించారు. తరువాత కూడా ఆదరిస్తూనే ఉంటారు.

కురొసోవా 1910లో టోక్యోలో జన్మించాడు. ఆయన తండ్రి సైనికుడు. ఆ కుటుంబంలో కురొసోవా ఏడో సంతానం. చిన్ననాట కురొసోవాకు చిత్రకళ, సాహిత్యం అంటే అభిమానం ఎక్కువగా ఉండేవి. ఆ రోజుల్లో జపాన్ ప్రజలను బాగా ఆకట్టుకున్న పశ్చిమ దేశాల రచలన్నా విపరీతమైన మక్కువ. ఆ అభిమానం ఆయనకు చివరిదాకా కొనసాగింది. ఆయన చిత్రాల్లో ఒక చిత్రకారుడి దృక్కోణం ప్రస్ఫుటంగా కనిపించింది. తన చిత్రాలకు కావాల్సిన కథా ప్రణాళికలను ఆయన షేక్స్‌పియర్, దోస్తోవిస్కీ, డిటెక్టివ్ నవలా రచయిత ఎడ్ మెక్ బెయిన్ నుంచి తీసుకునేవాడు. చలన చిత్ర రంగంలోకి ఆయన యువ అసిస్టెంట్ డైరెక్టర్‌గా, సినేరియో రచయితగా ప్రవేశించాడు. 33వ ఏట "సన్‌షిరో సుగాతా" అనే చిత్రానికి దర్శకత్వం వహించారు. ఆ తర్వాత అయిదేళ్లకు దర్శకత్వం వహించిన "డ్రంకెన్ ఏంజెల్" అనే చిత్రం కురొసోవా మార్క్ ముద్ర ఉన్న చిత్రమని విమర్శకులు అంటారు. ఆ చిత్ర నిర్మాణం సందర్భంగానే కురొసోవా మొట్ట మొదటిసారి తోషిరో మిఫ్యూన్ అనే నటుడితో కలిసి పనిచేశారు. ఆ తర్వాత మిఫ్యూన్ 15 కురొసోవా చిత్రాల్లో నటించాడు. 20వ శతాబ్దంలో విపరీతంగా అందరినీ ఆకర్షించిన "రోషోమాన్"లో మిఫ్యూన్ తాగుబోతు బందిపోటుగా నటించాడు. సెవెన్ సమురాయ్ చిత్రంలో రైతు బిడ్డగా పుట్టి సైనికుడిగా మారిన వ్యక్తిగా నటించాడు. జపాన్ మాక్‌బెత్ అనదగిన 'త్రోన్ ఆఫ్ బ్లడ్'లో కూడా నటించాడు.

"రోషోమాన్" చిత్రంతోనే కురొసోవా ప్రతిభ జపాన్ ఎల్లలు దాటి బయటి ప్రపంచానికి తెలిసొచ్చింది. ఆ కీర్తి ఆయన జీవితాంతం కొనసాగింది. స్టాన్లీ కుబ్రిక్ లాగే కురొసావా కూడా రాజీ పడడానికి నిరాకరించగలిగే శక్తి ఉన్నవాడు. రాజకీయంగా కానీ, వాణిజ్యపరంగా గానీ రాజీ అనేది ఎరగడు. అయితే "రోషోమాన్" చిత్రం గొప్పతనం ఆ చిత్ర నిర్మాతకే అర్థం కాలేదు. అంతర్జాతీయంగా ఆ చిత్రానికి మంచి గుర్తింపు వచ్చిన తర్వాత మాత్రమే జపాన్‌లో ఆ చిత్రాన్ని మెచ్చుకోవడం మొదలు పెట్టారు. అప్పటి నుంచి వాణిజ్యపరంగా కురొసోవా ఇబ్బందులు ఎదుర్కొన్నాడు. "మొజింబో" వంటి చిత్రాలు జపాన్‌లో విజయవంతం అయినా ఆయనకు కష్టాలు తప్పలేదు. చివరలో ఆయన హాలీవుడ్ మద్దతుతో, ఆర్థిక సహాయంతో చిత్రాలకు దర్శకత్వం వహించారు. జార్జి లూకాస్, ఫ్రాన్సిస్ ఫోర్డ్ కొప్పోలా వంటి వారు ఆయనకు సహాయ పడ్డారు. ఆయన చిత్రాలకు జపాన్‌కన్నా పశ్చిమ దేశాల్లోనే ఎక్కువ ఆదరణ లభించింది. మధ్య యుగం నాటి సెట్టింగ్‌లు, జపాన్ దేశస్థులు మాత్రమే ధరించే దుస్తులు ఉన్నప్పటికీ పశ్చిమ దేశాలలో అవి విజయవంతం అయినాయి.

"రోషోమాన్" లాంటి అద్భుత చిత్రానికి దర్శకత్వం వహించిన కురొసావాను జపాన్ ప్రజలు మరచిపోయారు. 1998లో ఆయన మరణించేనాటికి జపాన్ దేశస్థుల మదిలో ఆయన లేనే లేరు. కురొసోవా "మొజింబో", "సంజూరో" వంటి అద్భుత

వీరగాథలను సృష్టించినా సమకాలీన అంశాలమీద, అతి సామాన్యమైన జీవితాలపైన కూడా చిత్రాలకు దర్శకత్వం వహించాడు. ఒక కిడ్నాపర్ చేతిలో పడి యమ యాతన పడిన సంపన్న వ్యాపారస్థునిగా మిఫ్యూన్ నటించిన 'హై అండ్' లో చిత్రం అలాంటిదే. ఈ చిత్రాలలోని వాస్తవికత, సామాన్య ప్రజల జీవన చిత్రణ బాగా ఆకట్టుకున్నాయి. కురొసోవా చిత్రాలను చూస్తే జపాన్ ఆత్మను, వారి ఆంతరిక శక్తిని అర్థం చేసుకోవచ్చు. అయినా ఆ దేశ వాసులే కురొసోవా విదేశీయుల కోసమే చిత్రాలు నిర్మిస్తున్నారని ఆరోపించారు. రోషోమాన్ అన్న చిత్రం జపాన్ ప్రజల అమాయకత్వాన్ని వెనుకబాటు తనాన్ని బట్టబయలు చేసిందన్న విమర్శలూ వచ్చాయి. ఈ ఆరోపణ ఇప్పుడు చాలా అసంబద్ధంగా కనిపిస్తుంది. యుద్ధానికి సంబంధించిన దృశ్యాల చిత్రీకరణలో కురొసోవా అందెవేసిన చేయి. ఆయన అంత అద్భుతంగా వాటిని ఎలా చిత్రీకరించగలిగేవారో ఇప్పటికీ అంతుబట్టదు. యుద్ధ దృశ్యాలను చిత్రీకరించ డానికి ఆయన కేవలం 200 గుర్రాలనే వాడినా వేలాది గుర్రాలను వినియోగించినట్టు అనిపించేది. ఇతర దర్శకులకు ఎక్కువ డబ్బు, ఎక్కువ సాంకేతిక పరిజ్ఞానం వంటివి అందుబాటులో ఉండేవి. అయినా చిత్రీకరణలో మాత్రం ఆయనను మించిన వారు ఎవరూ లేరు. ఆయనను అధిగమించడం కానీ, అనుకరించడం కానీ అసాధ్యం. అయితే చిత్ర దర్శకులను ఆయన ప్రభావం నిరంతరం వెంటాడుతూనే ఉంటుంది. దానిని కాదనడం సాధ్యంకాని పని.



కురొసోవా ప్రపంచం వాస్తవమైన జపాన్ అవునో కాదో తెలియదు. కానీ అలాగే అనిపిస్తుంది. తన దేశాన్ని, తన ప్రజలను ఆయన చాలా శక్తిమంతంగా, కళాత్మకంగా చిత్రించాడు. ఆయన చిత్ర నిర్మాణంలో జాతీయత బలమైన ముద్రగా కనిపిస్తుంది. ప్రపంచంలోని వివిధ దేశాల మధ్య ఎంత సాన్నిహిత్యం ఏర్పడుతున్నప్పటికీ కురొసోవా చిత్రాలు అందించే సందేశం మాత్రం జాతి మూలాలను విడనాడకూడదన్నదే. ఆసియా చిత్ర నిర్మాతలు నేర్చుకోవాల్సిన గుణపాఠం ఇదే. కురొసోవా తన కెమెరాను తన దేశం మీద మాత్రమే కేంద్రీకరించాడు. అయినప్పటికీ ఆ చిత్రాలు ఆ దేశాల సంకుచిత ఎల్లలు దాటి విస్తరించి దేశ దేశాల వారిని ఆకర్షించాయి. దర్శకుడిగా ఆయన పనితీరు చాలా విశిష్టమైనది. తనతో పని చేసే వారు ఆయనను అపారంగా గౌరవించేవారు. ఆయన చెప్పిన మాటలను శ్రద్ధగా వినేవారు. ఆయన మితభాషి. అయినా వారు అపారమైన శ్రద్ధ కనబరిచి ఆయన చెప్పిన మాటలను ఆచరణలో పెట్టేవారు. ఆయన ఒక సేనానిగా, అదే సమయంలో ఒక తండ్రిగా గోచరించేవాడు. ఆయన దర్శకత్వం వహించే చిత్రాలలో పనిచేసే వారికే కాక ఆయన తరానికి, ఆసియాలో చలన చిత్రాలు నిర్మించే వారందరికీ కూడా ఆయన సేనానే. పితృ సమానుడే.

1891-
1976

# అగాథా క్రిస్టీ

అత్యంత ప్రసిద్ధురాలు. వ్యాపార దృష్టితో అద్భుత విజయాలను సాధించిన డిటెక్టివ్ నవలా రచయిత్రి అగాథా క్రిస్టీ విస్తారమైన జీవితాన్ని గడిపారు. ఆమె దేవన్‌లో సముద్రపు ఒడ్డున ఉన్న ఒక గ్రామంలో జన్మించారు. ఆమె తల్లి ఇంగ్లీషు మహిళ. తండ్రి అమెరికా జాతీయుడు. ఆమె బాల్యంలోనే తండ్రి మరణించాడు. ఆమె పూర్తి పేరు అగాథా మేరీ కారిస్సా మిల్లర్. ఆమెకు సరైన పాఠశాల విద్య కూడా లేదు. తల్లే చదువు నేర్పింది. చిన్నప్పుడు వీధుల వెంట తిరిగేది. సుదూరంగా ఉన్న అందమైన ప్రాంతాల గురించిన ఊహల్లో తేలిపోయేది. పెరిగి పెద్దయిన తర్వాత రైలు ప్రయాణం చేయడం, ఎండలో ఎక్కువసేపు పడుకోవడం, వేడి నీళ్లతో స్నానపు తొట్టిలో గడపడం, తన నవలలకు కథలు ఆలోచించేటప్పుడు ఆపిల్ పళ్ళు తినడం లాంటి తన అభిరుచికి తగిన విధంగా కాలం గడిపేది. 1976లో ఆమెను బ్రిటిష్ సామ్రాజ్యం డేమ్ కమాండర్‌గా నియమించినందువల్ల ఆమెను డేమ్ అగాథా అనే వారు. ఆమె కోరుకుంటే ఇంకా విలాసవంతమైన జీవితం గడపగలిగేదే. అద్భుతమైన ప్రతిభాపాటవాలను ప్రదర్శించిన అగాథా 94 గ్రంథాలు, 17 నాటకాలు, 130పైగా కథలు రాశారు. ఆమె జీవిత కాలంలోనూ, జీవితానంతరం కూడా అపారమైన డబ్బు గడించారు. ఆమె ఆదాయం వందల కోట్ల డాలర్లలో ఉంటుందని అంచనా. ఆమె రచనలు ఒక్క ఇంగ్లీషు భాషలోనే కోట్లాది ప్రతులు అమ్ముడయ్యాయి కనుక అందులో ఆశ్చర్యపడవలసింది ఏమీ లేదు. కచ్చితమైన లెక్కలు వేయడం సాధ్యమయ్యే పని కాదు. విదేశీ భాషల్లో అచ్చయిన గ్రంథాలను సినిమాల ద్వారా సమకూరిన ఆదాయాన్ని, టీవీ కార్యక్రమాలుగా మలచిన కథల ద్వారా సంపాదించిన డబ్బును లెక్కగడితే అపారంగానే ఉంటుంది. రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో ఆమె రచనా వ్యాసంగం విస్తృతంగా సాగింది. దాదాపు ఏడాదికి ఒక్క గ్రంథమైనా వెలువడేది. "నేను నమ్మశక్యంగాని సాసేజ్ తయారు చేసే యంత్రం లాంటిదాన్ని' అని చెప్పుకునేవారు. ఆమె అభిమానులు, ఆబతో చదివే పాఠకులు "ప్రతి క్రిస్మస్ నాడు ఒక అగాథా గ్రంథం" అనేవారు. ఆమె ప్రచురణకర్తల పంట పండించే అదృష్ట దేవత.

ఆమె రచనాశైలి చాలా నైపుణ్యంతో కూడినదని విమర్శకుల అభిప్రాయం. ఆ శైలి చాలా మితమైందని, సులభ గ్రాహ్యమైందని, సంభాషణలు పటిష్టంగా ఉంటాయని, వర్ణనలు తక్కువగా ఉంటాయని, పాత్ర చిత్రణ అమోఘమైందనీ విమర్శకులు వింగడించారు. ఆమె కథల్లోని అంశాలు చాలా పటిష్టమైనవి. అల్లిక జిగిబిగిగా అక్కడక్కడా పిడకల వేటకూడా ఉండేది. ఏం జరుగుతుందోనన్న అంశం పాఠకుల ఊహకు అందినట్టే అంది అందకుండా పోయేది. చివరకు సంభవమనుకున్న పద్ధతుల్లోనే పరిష్కారాలు ఉండేవి. తేలికగా నమ్మే స్వభావం గల పాఠకులను ఆమె ఎప్పుడూ కష్టపెట్టలేదు. ఆ కథల్లోని వాతావరణం సంపూర్ణంగా పాఠకులకు అలవాటైన విధంగానే ఉండేది. నేరాలకు సంబంధించిన ఆమె కథాంశాలు ప్రశాంతంగా, నిర్మలంగా, సంప్రదాయబద్ధంగా, హాయిగొలిపేట్టు ఉండేవి. ఆమె నవలల్లో హత్యలకు గురైన వారి కళేబరాలు గ్రంథాలయాల్లోనూ, ఆహ్లాదకరమైన వంట గదులలోనూ, సుఖప్రదమైన చోట్ల సాక్షాత్కరించేవి. ఆ హత్యలు దుడ్డుకర్రలతో జరిగినా, తుపాకీ గుండుతో జరిగినా, విష ప్రయోగంతో జరిగినా ఎన్నడూ అర్థరహితంగానూ, భయంకరంగానూ ఉండేవి కావు. ఆ ఘోరాలు ఎంత తీవ్రమైనవి, భయానకమైనవి అయినా ఆ దుశ్చర్యలన్నింటి వెనకా బలమైన మానసిక ఉద్దేశాలు ఉండేవి. అవి సాధారణంగా ఏడు భయంకర పాపాల్లో ఏదో ఒకటి అయి ఉండేవి. ఆ నేరాలు భీకరమైనవే. కానీ ఎప్పుడూ కనిపించీ కనిపించనట్టుగా, ఎప్పుడూ పరిష్కరించడానికి అనువైనవిగానే ఉండేవి.

బాల్యంలోనే క్రిస్టీ తల్లి ఆమెను కథలు రాయమని ప్రోత్సహించేది. ఆమె అక్క సాధారణ ప్రక్రియలకు భిన్నమైన డిటెక్టివ్ నవల దమ్ముంటే రాయమని సవాలు విసిరింది. 1916లో రాయల్ ఫ్లేయింగ్ క్యాంప్‌లో జూనియర్ అధికారిగా పని చేస్తున్న ఆర్చిబాల్డ్ క్రిస్టీని వివాహం చేసుకున్న తరువాత అగాథా క్రిస్టీ ఈ సవాలును స్వీకరించింది. అప్పుడు ఆయన

యుద్ధంలో గాయపడిన వారికి చికిత్స చేసే ఆస్పత్రిలో ఫార్మసిస్ట్‌గా పనిచేసేవాడు. విషాలకు సంబంధించిన వివరాలు ఆమెకు అక్కడే తెలిశాయి. ఆ వివరాలన్నింటినీ తన నవలల్లోనే నేర్పుగా వినియోగించుకునేది.

'మిస్టీరియస్ ఆఫేర్ ఎట్ స్టైల్' అన్న రచన 1920 దాకా అచ్చు కాలేదు. కానీ అందులోనే ఆమె ప్రబలమైన, చురుకైన హెర్క్యూట్ పాయిరట్ అనే పదవీ విరమణ చేసిన డిటెక్టివ్ పాత్రను ప్రవేశపెట్టారు. ఆయన తన పరిశోధనలకు తన అనుభవం మీద ఆధారపడేవాడు. పాయిరట్ అహంకార పూరిత వ్యక్తిత్వం ఉన్న వాడన్నది క్రిస్టీ అభిప్రాయం. అతని మొదటి కేసే ఆఖరి కేసు అయితే బాగుండునని అనుకుంది. కానీ ఆర్భాట పూరితమైన అతని ప్రవర్తన తీరు, తీక్షణమైన పరిశీలనా దృక్పథం కారణంగా ఆ పాత్రను చాలా కాలం కొనసాగించవలసి వచ్చింది. దాదాపు 25 నవలల్లో ఈ పాత్ర సాక్షాత్కరించింది. జనం ఆ పాత్రను విపరీతంగా అభిమానించేవారు. చివరకు 'కర్టెన్' (1975) అన్న రచనలో ఈ పాత్రను చంపేశారు. ఆ పాత్ర మరణం గురించి న్యూయార్క్ టైమ్స్ పత్రిక మొదటి పేజీలో వార్తా కథనం ప్రచురించింది. పాయిరట్‌కు ఇంగ్లీషు ప్రతిరూపం లాంటి పట్టువిడవని, అంతగా స్థిర చిత్తం లేని మిస్ జేన్ మార్పుల్ పాత్ర 1930లో అవతరించింది. సెయింట్ మేరీ మీడ్ అనే పెళ్ళికాని పాత్ర మర్డర్ ఎట్ వికారేజ్ గ్రంథంలో ప్రవేశించింది. 1962లో క్రిస్టీ నూతనావిష్కరణ ప్రచురణ రంగంలో ఒక రకమైన కల్లోలం సృష్టించింది. మర్డర్ ఆఫ్ రోజర్ అక్రోయిడ్‌లో కథ చెప్పే వ్యక్తే హంతకుడని తేలుతుంది.

రోజర్ అక్రోయిడ్ ప్రచురితమైన కొద్ది రోజులకే క్రిస్టీకి రెండు దుర్భర సంఘటనలు ఎదురయ్యాయి. మొదటిది ఆమె అమితంగా ప్రేమించే తల్లి మరణం. రెండవది మరో మహిళను పెళ్ళాడడంకోసం విడాకులు కావాలని భర్త అభ్యర్థించడం. ఆ విపత్కర సమయంలో ఆమె అచ్చం తన నవలల్లోని పాత్ర వ్యవహరించినట్టే వ్యవహరించింది. ఆమె హఠాత్తుగా అంతర్ధానం అయిపోయింది. పదకొండు రోజులపాటు ఈ ఉదంతంపై పత్రికల్లో పతాక శీర్షికలు దర్శనం ఇచ్చాయి. చివరకు యార్క్‌షైర్‌లోని ఒక హోటల్‌లో క్రిస్టీ తారసపడింది. ఆమె ఆచూకీ తెలుసుకోవడం కోసం నదులను గాలించారు. వేట కుక్కలు అడవులన్నీ గాలించాయి. అప్పుడు క్రిస్టీ మతిమరుపుతో బాధపడుతుండేది. హోటల్‌లో గది తీసుకునేటప్పుడు తన పేరు 'టెస్సా నీలే'గా నమోదు చేయించింది. అది తన భర్త ఉంపుడుగత్తె పేరు. ఈ ఉదంతం అంతా ప్రచారం కోసం వేసిన ఎత్తుగడ అని అన్నవారూ ఉన్నారు. కానీ మిస్ మార్పుల్ ఈ వాదనను అంగీకరించేది కాదేమో! ఈ విషయాన్ని గురించి మాట్లాడడానికి క్రిస్టీ ఎన్నడూ ఇష్టపడలేదు.

ఆ తర్వాత ఆమె జీవనం ప్రశాంతంగానూ, ఫలవంతంగానూ సాగింది. ఆర్చిబాల్డ్‌కు విడాకులు ఇచ్చిన తరువాత అగాథా ఇరాక్‌లోని పురాతత్వ పరిశోధనా స్థలాలను సందర్శించింది. అక్కడ సర్ మాక్స్ మలోవాన్ అనే పురాతత్వ పరిశోధకుడితో పరిచయం అయింది. ఆయన ఆమెకన్న 14 ఏళ్ల చిన్న. ఆ తర్వాత వారిద్దరు పెళ్ళి చేసుకున్నారు. ఇద్దరూ కలిసి అనేక చోట్ల పర్యటించారు. మలోవాన్ పరిశోధనల్లో క్రిస్టీ సాయపడేది. బహుశా రైలు ప్రయాణాల ఫలితంగానే 'మర్డర్ ఆన్ ది ఓరియంట్ ఎక్స్‌ప్రెస్' అన్న నవల వెలువడింది.

తన డిటెక్టివ్ నవలల గురించి ఆలోచించడం, వాటి కథాంశాలను గురించి ఆలోచించడం ఆమెకు ఇష్టం. కానీ రాయడానికి మాత్రం చాలా ఇబ్బంది పడేది. బహుశా తన శక్తి అందుకు సరిపోదేమోనన్న అనుమానం ఉండేదేమో! తాను మురియల్ స్పార్క్ లాగానో, గ్రాహం గ్రీన్ లాగానో రాయలేకపోతున్నానని బాధపడేది. ఆమె పడ్డ వేదన నిజానికి అనవసరమైనది. డిటెక్టివ్ నవలా రచయిత్రిగా ఆమె నిరుపమానమైనది. ఆమె రచనల్లో సాహిత్యగాఢత లేకపోవచ్చు. కానీ ఆసాంతం చదివించే లక్షణం ఉంది. మెరుగైన జీవితాన్ని వినోదపరచడానికి కావలసిన అంశాలు ఉన్నాయి.

1922-

# హరగోవింద్ ఖొరానా

హరగోవింద ఖొరానా కృత్రిమంగా జన్యువును ఉత్పత్తి చేసి ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తాడు. 'సూపర్ మనిషి'ని ప్రయోగశాలల్లో కృత్రిమంగా సృష్టించడానికి ఆయన అడుగు జాడలు దారి తీస్తాయి. వస్తువులనే కాదు, ప్రాణులనూ ఉత్పత్తి చేయొచ్చు. దైవ కార్యం, లేదా ప్రకృతి రహస్యంగా భావిస్తూ వచ్చిన ఈ 'సృష్టి'ని ప్రయోగశాలలో సాధ్యం చేసిన అపర బ్రహ్మ డాక్టర్ హరగోబింద ఖొరానా.

ప్రకృతిలో ప్రతి జీవీ తనను పోలిన మరో జీవిని పునరుత్పత్తి చేస్తూ తన జాతి పరంపరను కొనసాగిస్తుంది. తన జాతి లక్షణాలను తన తరువాతి తరాలకు సంక్రమింపజేస్తుంది. ఇదెలా సాధ్యం? 'పుట్టిన ప్రతి ప్రాణికి ఒక జీవితకాలం ఉంటుంది. తర్వాత చనిపోతుంది. మనిషి జీవితాన్ని భగవంతుడు ముందే రాసేస్తాడు. ఆ ప్రకారమే భూమ్మీద అతడి జీవితం ఉంటుంది. ఈ బ్రహ్మరాతను కనిపెట్టడం ఎవరి సాధ్యంకాదు...' ఇలాంటి భావనలన్నీ జన్యు విజ్ఞాన శాస్త్రం ఆవిర్భావంతో బలహీనమయ్యాయి. జీవ రహస్యాల గుట్టు విప్పితే అది విపరీతాలకు దారితీస్తుందన్న అభ్యంతరాలు, తీవ్ర ప్రతిఘటనలు, కఠిన ఆంక్షల నడుమ 150 ఏళ్లనాడు పుట్టిన ఓ కొత్త శాస్త్రం నేడు చిలవలు పలవలుగా విస్తరించి బ్రహ్మరాతను చదివే స్థాయికి ఎదిగింది. పుట్టుకతోనే తాత తండ్రుల నుండి వారసత్వంగా సంక్రమించే అనేక జబ్బులను జన్యు విజ్ఞానంతో నివారించే రోజు వచ్చేసింది. మనిషి జీవితకాలాన్ని అసాధారణంగా పెంచేసే పరిశోధనలు సాగుతున్నాయి. మనిషిని పోలిన 'సూపర్ మనిషి'ని ప్రయోగశాలలో కృత్రిమంగా సృష్టించడం ఇక సైన్సు కాల్పనిక సాహిత్యం ఎంత మాత్రం కాబోదు. జెనెటిక్ ఇంజనీర్ల తదుపరి లక్ష్యం అదే.

1976 ఆగస్టు నెల మానవాళి చరిత్రలో ఓ మహత్తర ఘట్టానికి తెరతీసింది. ఖొరానా తన పరిశోధనశాలలో ఇ.కోలి జన్యువును కృత్రిమంగా ఉత్పత్తి చేశాడు. మన పేగుల్లో ఈ ఇష్కరీషియా కోలి (ఇ.కోలి) అనే బ్యాక్టీరియా ప్రాణి జీవిస్తూ ఉంటుంది. ఖొరానా బృందం తాము తయారుచేసిన కృత్రిమ జన్యువును 'ఇ.కోలీ' దేహంలో ప్రవేశపెట్టారు. అది అచ్చు సహజసిద్ధమైన జన్యువులా పనిచేసింది. 'ఇ.కోలి'లోని వివిధ జీవన చర్యలను అది సహజరీతిలోనే నిర్వహించింది. ఈ ప్రయోగం యావత్ ప్రపంచాన్నీ దిగ్భ్రమకు గురిచేసింది. ఇది 'సృష్టి' కార్యమే!

ఖొరానా అంతకంటే ముందు, 1968లోనే తన 46వ యేట నోబెల్ పురస్కారం పొందాడు. 'ఈస్ట్' జీవి జన్యుకణంలోని కొంత భాగాన్ని ప్రయోగశాలలో నిర్మించినందుకు మార్షల్ డబ్ల్యు. నిరేన్‌బర్గ్, రాబర్ట్ డబ్ల్యు హాలీలతో కలసి వైద్య విభాగంలో ఆయన నోబెల్ ప్రైజ్‌కు ఎంపికయ్యారు. ఎ, టి, జి, సి అనే నాలుగక్షరాల జన్యు సంకేత భాష అర్థం చేసుకోడానికి ఈ ముగ్గురూ ఎవరికి వారే తమ స్వతంత్ర పరిశోధనలతో అనన్య కృషిచేశారు. తర్వాత, ఖొరానా బృందం 'ఇ.కోలీ'ని ఎంచుకునీ దాని పూర్తి జన్యువును సృష్టించింది. జన్యు నిర్మాణాన్ని అర్థం చేసుకుని వివరించడం అంతా ఒక ఎత్తయితే, దాన్ని కృత్రిమంగా నిర్మించడం మరొక ఎత్తు. ఇ.కోలి జన్యునిర్మాణానికి ఖొరానా తన 24 మంది శాస్త్రవేత్తల బృందంతో 9 ఏళ్ల పాటు కఠోరంగా శ్రమించాల్సి వచ్చింది. మానవ జన్యు కణ నిర్మాణం ఈ.కొలీ అంత సులభంకాదు. అత్యంత సంక్లిష్టంగా ఉంటుంది. అంతమాత్రాన అది అసాధ్యం కూడా కాదు. కాకపోతే ఇందుకు ఇంకా చాలా కాలం పట్టవచ్చు.

హరగోవింద ఖొరానా అవిభక్త భారతదేశంలోని పంజాబ్ (ప్రస్తుతం పాకిస్తాన్) ప్రాంతంలో రాయపూర్ అనే కుగ్రామంలో పుట్టారు. పుట్టిన సంవత్సరం 1922. తేదీ కచ్చితంగా తెలియదు. జనవరి 9 అని రికార్డుల్లో ఉన్నది. ఖొరానా తండ్రి గ్రామ పట్వారీ. అయిదుగురు సంతానంలో ఖొరానా చివరివాడు. పేద కుటుంబం అయినా తండ్రి తన పిల్లల్ని చదివించాడు. ఆ ఊర్లో చదువుకున్న కుటుంబం వారిదే. ముల్తాన్‌లోని డిఏవీ స్కూలులో చదివిన ఖొరానా

లాహోర్‌లోని పంజాబ్ యూనివర్శిటీలో ఎంఎస్‌సి కెమిస్ట్రీ చేశాడు. చాలామంది తాము చిన్నప్పటి నుండీ ఇదే చదవాలనుకున్నాం, అలా అవాలని కలలు కన్నాం అంటూ చెబుతుంటారు. కాని ఖొరానా అందుకు భిన్నమైన వ్యక్తి. కాలేజీ చదువు తర్వాత, ఇంగ్లీషు సాహిత్యం, రసాయనిక శాస్త్రాలలో సీటు కోసం యూనివర్శిటీకి దరఖాస్తు చేశాడు. రసాయనిక శాస్త్రం కోర్సులో సీటిస్తామన్నారు. కాని ముందుగా ఒక ఇంటర్వ్యూకి హాజరై ఎంపిక కావాల్సి ఉంటుంది. బిడియస్తుడైన ఖొరానా ఇంటర్వ్యూకు హాజరు కాలేదు. లిటరేచర్‌లో చేరదామని అనుకున్నాడు. ఇంటర్వ్యూకి వెళ్లకపోయినా, సీటు ఇచ్చాం వచ్చిచేరమని యూనివర్శిటీ నుండి పిలుపు రావడంతో అతడి జీవితం మలుపుతిరిగింది.

1945లో ప్రభుత్వ ఉపకార వేతనంతో ఇంగ్లాండ్ వెళ్లి లివర్‌పూర్ యూనివర్శిటీలో ఖొరానా పీహెచ్‌డి చేశాడు. దేశ విభజన తర్వాత, ఆయన మిత్రులు, బంధువులు అంతా కాందిశీకులుగా ఢిల్లీ వచ్చేశారు. ఖొరానా 1949లో భారత్‌కు వచ్చినా కొద్దికాలం మాత్రమే ఉండి తిరిగి బ్రిటన్ వెళ్లాడు. మాతృభూమికి దూరమైన ఖొరానా ఈ భూమిపై తనకంటూ ఒక ప్రాంతంలేదని, తను ఏకాకిననీ దిగులుకు లోనయ్యాడు. ఆ స్థితిలో పరిచయమైన స్విట్జర్లాండ్ వనిత ఎస్తర్ ఎలిజబెత్ సిబ్లర్‌ను 1952లో పెళ్లి చేసుకున్నాడు. తన ముగ్గురు పిల్లల్లో ఏ ఒక్కరికీ భారతీయ పేరు పెట్టలేదు.

1959లో ఖొరానా పేరు శాస్త్ర ప్రపంచం దృష్టిని ఆకర్షించింది. 'కోఎంజైమ్-ఏ' అనే మానవ శరీర రసాయనాన్ని బ్రిటిష్ కొలంబియా యూనివర్శిటీ (కెనడా) ప్రయోగశాలలో కృత్రిమంగా తయారుచేయగలగడం జీవ రసాయనిక శాస్త్రంలో ఆయన భావి విజయాలకు తొలిమెట్టు వేసింది. తర్వాత అమెరికాలోని విస్కాన్సిన్ యూనివర్శిటీ 'ఎంజైమ్ పరిశోధనా సంస్థ'లో చేరాడు. 1970లో మసాచుసెట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (ఎమ్ఐటి) ఆయనకు ఆల్ఫ్రెడ్ స్లోన్ ఆచార్య పీఠం ఇచ్చింది. పరిసరాలను ఎప్పుడూ మార్చుకుంటూ ఉండగలిగితే మేధోపరంగా దీర్ఘకాలం మనవచ్చునని ఖొరానా ఒక సందర్భంలో వ్యాఖ్యానించారు. ఆయన ఏ ఒక్క సంస్థలోనూ స్థిరంగా ఉండలేదు. దేహకణంలో జన్యువు ఎలా పనిచేస్తుంది? అనే అంశంపై ఖొరానా తాజా పరిశోధనలు కొనసాగుతున్నాయి. జన్యువులు మనిషి శారీరక మానసిక కార్యకలాపాలను నిర్దేశిస్తాయన్న విషయం తెలిసిందే. అయితే వాటి పనిని ఎవరు (!) నిర్ధారిస్తారు? ఫలానా రీతిలో కణాలను పనిచేయించాలని అవి ఎందుకు అనుకుంటాయి? స్విచ్ ఆన్, స్విచ్ ఆఫ్ చేసినట్లు జన్యువులు ఎందుకు అలా ప్రవర్తిస్తున్నాయి? ఈ ప్రశ్నలకు సమాధానం కోసం ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా పరిశోధనలు సాగుతున్నాయి.

అచ్చు ఒకేలా ఉన్న కొందరు సియామీస్ కవలలపై జరిపిన అధ్యయనం మరిన్ని కొత్త ప్రశ్నలు రేకెత్తించింది. ఇలాంటి కవలల్లో డీఎన్ఎ జన్యుపదార్థం అచ్చు ఒకేలా ఉన్నా ఒకరికిలేని రుగ్మత మరొకరిలో కనిపించింది. దానికి కారణం ఆ వ్యక్తిలో జన్యువు ఎక్కువగానో, తక్కువగానో పనిచేస్తూ ఉంది. జన్యువు నిర్మాణం ఒకేలా ఉన్నా రేడియో మాదిరిగా దాని 'ట్యూనింగ్' ఎక్కువగానో తక్కువగానో ఉండటంవల్ల శారీరక కార్యకలాపాల్లో మార్పులు సంభవిస్తున్నాయి. మరి వాటిని ట్యూన్ చేస్తున్నదెవరు? అప్పటి వరకూ నిద్రావస్థలో ఉన్న జన్యువు అకస్మాత్తుగా ట్యూన్ అవుతుంది. ఎందుకని? ఈ ప్రకృతి రహస్యాన్ని అధ్యయనం చేయడానికి, పెట్టె లోపలి మరో పెట్టెలో ఏముందో చూడడానికి, జన్యువుల స్విచ్'ఆన్, ఆఫ్'ల గుట్టు విప్పటానికి 'ఎపీజెనోమిక్స్' అనే మరో కొత్త శాస్త్రం అంకురించింది. ఖొరానా ప్రభృతుల పరిశోధనలు ఈ గుట్టును విప్పగలవా?

1934-
1968

# యూరీ గగారిన్

**1961** ఏప్రిల్ 12. మాస్కో కాలమానం ప్రకారం సరిగ్గా ఉదయం 9 గంటలకు వోస్తాక్-1లో యూరీగగారిన్ దేవతలకు నిలయం అనుకునే అంతరిక్షంలోకి దూసుకెళ్ళాడు. అంతరిక్షయానం చేసిన తొలి మానవుడతడు. అయిదు టన్నుల బరువు ఉన్న వ్యోమనౌకలో గంటకు 18 వేల మైళ్ల వేగంతో 108 నిముషాలపాటు భారరహిత స్థితిలో అతడు 188 మైళ్ళ ఎత్తున అంతరిక్షంలో గడిపాడు. సాహసోపేతమైన ఈ దేశభక్తుడు ప్రపంచాన్ని చుట్టి వచ్చి నేల మీద అడుగు పెట్టినప్పుడు ప్రపంచం యావత్తు అతనికి స్వాగతం పలికింది. కానీ ఆ ప్రపంచం ఆ తర్వాత మునిపటిలా లేదు.

సామాన్య మానవుడి శకం అన్న భావనకు అనుగుణంగా తొలి వ్యోమగామి అయిన గగారిన్ ఒకప్పుడు ఫౌండ్రీ కార్మికుడు. కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు. తన గురించి తాను చెప్పుకునేటప్పుడు సామాన్య మానవుడు అన్న మాటకు ముందు సోవియట్ అని చేర్చేవాడు. అద్భుత విజయం సాధించిన యూరీ అలెక్సియేవిచ్ గగారిన్ మాస్కోకు పశ్చిమాన వంద మైళ్ళ దూరంలోని క్లుషినో అన్న గ్రామంలో జన్మించాడు. ఆ తర్వాత ఆ గ్రామం పేరు గగారిన్ గ్రామంగా మారిపోయింది. గగారిన్ జార్ రాకుమారుడు గగారిన్‌కు వారసుడు అన్న వాదనలూ ఉన్నాయి. కానీ అవి నిజం కాదు. అతని తండ్రి ఉమ్మడి వ్యవసాయ క్షేత్రంలో పని చేసేవాడు. అతడు వడ్రంగి కూడా. అతని తల్లి పాలు అమ్మేది. 1941లో తన గ్రామాన్ని దురాక్రమణ దారులైన నాజీలు ఆక్రమించుకున్నప్పుడు గగారిన్‌కు ఏడేళ్ళు. ఆ వయసులో అతడు ఓ అద్భుతమైన దృశ్యం చూశాడు. అదే ఒక సాహసవీరుడి నిస్వార్థ గాథ. ఆ నిస్వార్థ సాహసమే గగారిన్ ఆ తర్వాత సాధించిన విజయాలకు ప్రేరణ అయింది. ఒక సోవియట్ యుద్ధ విమాన పైలెట్ గగనతలంలో గగారిన్ తలపై ఎగురుతూ జర్మన్ సైనిక దళాల మీద తన మర తుపాకి తూటాలను పేల్చాడు. చివరకు అతని విమానం సైనికుల మధ్య కుప్పకూలి ఆయన వీరమరణం పొందాడు.

యుద్ధం ముగిసిన తర్వాత 1950లో గగారిన్ మళ్ళీ తన చదువు మొదలు పెట్టడానికి మాస్కోకు చేరువలోని ల్యూబర్ట్సీ ఫౌండ్రీ పాఠశాలలో చేరాడు. అది భారీ పరిశ్రమలకు కేంద్రం. అతడు నూతన సోవియట్ పౌరుడికి ఆదర్శంగా తయారు కావడానికి ఆ ప్రాంతం బహుశా ఉపకరించేదేమో! ల్యూబర్ట్సీలో ఒక విమానాల కర్మాగారం కూడా ఉండేది. గగారిన్ పైలెట్లతో పిచ్చాపాటి చేసేవాడు. వారు విమానాలు నడపడాన్ని ఆసక్తితో పరిశీలించేవాడు. ఆ మరుసటి సంవత్సరం అతడు సరతోవ్ పారిశ్రామిక కళాశాలలో చేరాడు. అక్కడ ఒక ఫ్లయింగ్ స్కూల్, ఏరోడ్రోమ్ ఉండడంతో గగారిన్ విమానయానంలో శిక్షణ పొందడం ఆరంభించాడు. ఇది అధికారిక చరిత్ర. కానీ సరతోవ్ సోవియట్ 'రహస్య పట్టణాల్లో' ఒకటి. అక్కడ చాలా రహస్యమైన పథకాలు అమలు అయ్యేవి. అంతరిక్ష పరిశోధకులకు కూడా అది కేంద్రం. అందువల్ల గగారిన్ అక్కడ ఉండడం కేవలం యాదృచ్ఛికం కాకపోవచ్చు.

రాత్రివేళల్లో విమానయాన సిద్ధాంతాలు, విమానయానం గురించి అధ్యయనం చేస్తూ మొట్ట మొదటి సారి పారాచ్యూట్‌గా పనిచేశాడు. దీనికి ప్రతిఫలంగా అతనిని మొదటిసారి యుద్ధ విమానంలో తీసుకెళ్ళారు. ఆ దశలో తనకు స్పష్టమైన లక్ష్యంపై దృష్టి ఉండేదని గగారిన్ ఆ తర్వాత వివరించాడు. 1955లో అతడు ఫౌండ్రీమాన్ డిప్లొమాతోపాటు విమానాలు నడపడానికి యోగ్యత కూడా సంపాదించాడు. వేసవిలో యుద్ధ విమానాలు నడపడంలో శిక్షణ పొందాడు. ఆ సంవత్సరం ఆకురాలు కాలంలోనే ఆరెన్‌బర్గ్ ఫ్లయింగ్ స్కూలులో చేరి 1957లో పట్టా పుచ్చుకుని సోవియట్ వైమానికదళంలో యుద్ధ విమానాల పైలెట్‌గా చేరాడు. అతడు చాలా పొట్టివాడు. కేవలం 5 అడుగుల 2 అంగుళాలు ఎత్తు మాత్రమే ఉండేవాడు. అందుకని అతనిపై అధికారులు కవాతు సమయంలో అతనిని ముందు వరుసలో ఉండనిచ్చేవారు కాదు. అతను శిక్షణ పొందిన మిగ్ విమానాలు నడపడానికి దిండు వేసుకుని కూర్చోవాల్సి వచ్చేది. కాని అతడు పొట్టివాడు కావడం కూడా అంతరిక్ష కాప్స్యూల్‌లో ఉండే అతి తక్కువ చోటులో ఒదిగి పోవడానికి అర్హతగా పరిణమించింది. 1957లో గగారిన్ నర్సింగ్ విద్యార్థిని పెళ్ళి చేసుకున్నాడు. ఆ ఏడాది అతనికి లెఫ్టినెంట్‌గా

పదోన్నతి లభించింది. రెండేళ్ళ తర్వాత అతనికి అత్యంత రహస్యంగా కొనసాగుతున్న సోవియట్ అంతరిక్ష కార్యక్రమం గురించి తెలిసింది. ఆ కార్యక్రమంలో పాలు పంచుకోవడానికి స్వచ్ఛందంగా ముందుకొచ్చాడు. అయితే దీనికోసమే అతనిని సిద్ధం చేస్తుండేవారు అని అనుకోవడానికి కూడా ఆస్కారం ఉంది. గగారిన్ నిర్మొహమాటి. చిత్తశుద్ధిగలవాడు. ఆత్మవిశ్వాసంగలవాడు. భయంలేనివాడు. జిజ్ఞాసువు. ఇవన్నీ అంతకు ముందు ఎవరూ చేయని సాహసకృత్యం చేపట్టడానికి కావల్సిన యోగ్యతలే. శారీరకంగా తగినవాడు. మేధోపరంగా శక్తిమంతుడు అయిన గగారిన్ ప్రతి రోజూ వ్యాయామం చేసేవాడు. మద్యం ముట్టేవాడు కాదు. సిగరెట్లు కాల్చేవాడు కాదు. దూసుకెళ్ళే శతఘ్ని గుండులాగా దూసుకెళ్ళే మిలిటరీ పైలెట్ అయినందువల్ల వ్యోమగామి కావడానికి అతనికి అన్ని అర్హతలూ ఉన్నాయి.

మూడేళ్ళపాటు అంతరిక్షయానానికి శిక్షణ పొందాడు. ఆ మూడేళ్ళ కాలంలో అతను చేసిందల్లా రాకెట్ పైకెగురుతున్నప్పుడు భూమ్యాకర్షణ స్థితిలో ఉండడానికి అలవాటు పడడం. మళ్ళీ భూమి మీద దిగేటప్పుడు ఆ కుదుపు తట్టుకోవడానికి సిద్ధంగా ఉండడమే. మేజర్ గగారిన్ భూ మండలం మీంచి అంతరిక్ష యాత్రకు బయలుదేరడానికి ముందు తన కుటుంబ సభ్యులకు వీడ్కోలు చెప్పే రోజున అతను అన్న మాటల్లా 'కీలకమైన సేవ' అని మాత్రమే. అప్పుడూ అంతా అనిశ్చితస్థితే. అంతరిక్షంలోకి వెళ్ళే మానవుడికి ఏమవుతుందో ఎవరికీ తెలియదు. ఉష్ణోగ్రతల్లో విపరీతమైన మార్పులు ఎదురైనప్పుడు శరీరం ఎలా ఉంటుందో తెలియదు. మానసిక ఒత్తిడిని శరీరం ఎలా తట్టుకుంటుందో తెలియదు. చిన్న సాంకేతిక వైఫల్యం ఎదురైతే గగారిన్ కాలి బూడిద అయిపోయేవాడు. లేదా అంతుపట్టని ఆ అంతరిక్షంలో సుదీర్ఘకాలం తీసుకుని ఒంటరి చావు చావాల్సిందే.

మండుతున్న రాకెట్ అగ్రభాగాన అమర్చిన అంతరిక్ష కాప్స్యూల్‌లోకి చేరుకున్నప్పుడు గగారిన్ ప్రశాంతంగా కనిపించాడు. రాకెట్‌పై కెగరగానే మిరిమిట్లు గొలిపే వెలుగులు ఎగిసిపడ్డాయి. దానితో అతను ఉన్న యంత్రం అంతరిక్షంలోకి ప్రవేశించింది. రెండు గంటల పాటు అతడు అంతరిక్షంలోనే ఉన్నాడు. ఈ ఒక్క విజయంతో రష్యన్లు అన్ని అంతరిక్షయానాల రికార్డులను బద్దలు కొట్టారు. తామే మొట్టమొదటి మానవుడిని అంతరిక్షంలోకి ప్రవేశపెట్టాలన్న అమెరికా ఆశలు పటాపంచలయ్యాయి. సోవియట్ యూనియన్ స్పుత్నిక్‌ను ప్రయోగించడం 1957లో ప్రారంభమైన అగ్ర రాజ్యపోటీలో గగారిన్ ప్రాతినిధ్యం వహించే సోవియట్ అగ్రభాగానికి దూసుకెళ్ళింది వోస్తోక్-1. మళ్ళీ భూ వాతావరణంలోకి ప్రవేశించినప్పుడు ఉద్రిక్తుడైన గగారిన్ 'మాతృభూమి వింటోంది-మాతృభూమికి తెలుసు' అని పాడాడు. తాను ఉన్న కాప్స్యూల్ చుట్టూ అలుముకున్న మంటల్ని చూశాడు.

అయితే అతను సురక్షితంగా భూమి మీద దిగాడు. ఆ వ్యోమ నౌక ఒక ఉమ్మడి వ్యవసాయ క్షేత్రంలో దిగింది. లెనిన్స్‌వే అనే చోట ఉన్న ఆ వ్యవసాయ క్షేత్రంలో సేద్యం జరగడం లేదు. గగారిన్‌కు అఖండమైన రీతిలో ఒక వీరుడికి లభించినంతటి స్వాగత సత్కారాలు లభించాయి. ఆతర్వాత అతనికి "ఆర్డర్ ఆఫ్ లెనిన్", "హీరో ఆఫ్ ది సోవియట్ యూనియన్" వంటి బిరుదులూ దక్కాయి. అయితే అంతటి విజయాన్ని సాధించినా గగారిన్ హుందాగా వ్యవహరించాడు. నక్షత్రాల చేరువున అనేక మందికి చోటు ఉంది అని ప్రకటించి తన వినయశీలతను నిరూపించుకున్నాడు. అయితే సోవియట్ ప్రధాని కృశ్చేవ్‌తో సంభాషించినప్పుడు మాత్రం పెట్టుబడిదారులను ఓడించినందుకు ఒక్కింత విజయగర్వం ప్రదర్శించాడు. గగారిన్ స్నానాల గదిలో పడిపోవడం వల్ల అతని చెవిలోపలి భాగం దెబ్బతినడంతో మరిక అంతరిక్ష యానానికి వీలు లేకపోయింది. 1968 మార్చి 27న మిగ్ విమానం నడుపుతుండగా అది కూలి గగారిన్ మరణించాడు. దాదాపు 30 ఏళ్ళ కిందట గగారిన్ బాల్యంలో గమనించినట్టుగానే అనామకుడైన సోవియట్ యుద్ధ విమాన పైలట్‌ను మృత్యువు ఎలా కబళించిందో గగారిన్‌నూ అలాగే తన ఒడిలోకి లాక్కుంది. అయితే గగారిన్ మరణం అనామకమైంది కాదు. అదే తేడా.

1931-

# మిహాయిల్ గోర్బచేవ్

1922 డిసెంబర్ 20న ప్రారంభమై 79 ఏళ్ళ 11 రోజుల తర్వాత ముగిసిన మహా నాటకం చరమాంకానికి ఆయనే ప్రయోక్త. ఆయన హయాంలోనే సోవియట్ యూనియన్ పతాకం అవనతం అయింది. గ్లాస్‌నస్ట్ (దాపరికం లేని విధానం), పెరిస్త్రోయికా (పునర్నిర్మాణం) అన్న భావనలను ప్రోది చేసిన మిహాయిల్ గోర్బచేవ్ సోవియట్ యూనియన్ ఆఖరి అధ్యక్షుడు. కమ్యూనిస్టు రష్యా విచ్ఛిన్నాన్ని ఆయన అయిష్టంగానే అంగీకరించవలసి వచ్చింది.

గోర్బచేవ్ స్వేచ్ఛా ప్రియులైన కొసాక్‌ల సంతతికి చెందినవాడు. వారు సోవియట్ సామ్రాజ్యం వెలుపల ఉండేవారు. ఒక మోస్తరు సంపన్నుడైన ఆయన తాతను ఈర్ష్యాపరులైన పొరుగువారు ఈసడించుకున్నారు. స్టాలిన్ రహస్య పోలీసులు జైలులో పెట్టారు. గోర్బచేవ్ బాల్యంలో దీనికి సంబంధించిన గుసగుసలతోపాటు రైతుల పాటలు తన అమ్మమ్మ ఒడిలో విన్నాడు. వ్యవసాయ కార్మికుడిగా పనిచేస్తూ 18వ ఏటనే ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బానర్ ఆఫ్ లేబర్ అన్న బిరుదు సంపాదించాడు. 1952లో కమ్యూనిస్టు పార్టీలో చేరాడు. మాస్కో యూనివర్సిటీలో న్యాయశాస్త్రం చదివాడు. అక్కడే అందమైన, తత్వశాస్త్ర విద్యార్థిని ఆయన రైజా తితొరెంకోతో పరిచయం ఏర్పడి పెళ్ళి చేసుకున్నాడు. ఆమె చాలా శక్తిమంతమైన మహిళ. ఆయన పాండిత్య కృషిని ప్రేరేపించింది. ఇంగ్లీషు నేర్చుకోవడానికి తోడ్పడింది. ఆ తర్వాత ఆయన రాజకీయాలలో మార్గదర్శకత్వం నెరపింది. ఆమె మీద గోర్బచేవ్ ఆధారపడేవారు. అతి కొద్ది మంది రష్యన్ నాయకులు మాత్రమే ఆ పనిచేశారు. ఆ తర్వాత ఆయన ఉత్తర కాకసస్‌లోని స్టావ్రాపోల్ చేరుకుని 1950, 1960లలో స్థానిక కమ్యూనిస్టు పార్టీలో నాయకత్వ స్థానానికి ఎదిగాడు. 1970లో యు.ఎస్.ఎస్.ఆర్. సుప్రీం సోవియట్‌కు ఎన్నికయ్యాడు. ఆ తర్వాత కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శివర్గంలో వ్యవసాయ కార్యదర్శి అయ్యాడు. 1980లో యూరీ ఆంద్రొపోవ్ అనుంగు సహచరుడిగా పొలిట్‌బ్యూరో సభ్యుడయ్యాడు.

గోర్బచేవ్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి అయ్యేనాటికి పార్టీ వ్యవస్థ, దేశం కూడా దయనీయమైన స్థితిలో ఉన్నాయని స్పష్టమైంది. సంస్కరణలే లక్ష్యంగా గల గోర్బచేవ్ పొలిట్‌బ్యూరోలో వయసుమీరి పదవులకు అతుక్కుపోయిన మితవాదులను బలవంతంగా రిటైర్ అయ్యేట్టు చేశాడు. వారి స్థానంలో తన దృక్పథంతో ఏకీభవించే యువ సభ్యులను నియమించాడు. వాస్తవం ఏమంటే చివరకు ప్రజల రోజువారీ కనీస అవసరాలను సైతం తీర్చలేని స్థితిలో పార్టీ మనుగడ సాగుతుందన్న నిజాన్ని గ్రహించవలసి వచ్చింది.

ఆలోచనాపరుడే అయినా ఆచరణవాదం కోరే గోర్బచేవ్ తాను ద్విపాత్రాభినయం చేయవలసి వస్తుందని, పరస్పర విరుద్ధమైన పాత్రలను నిర్వహించవలసి వస్తుందని గ్రహించాడు. పార్టీ నాయకుడిగా, ఆయన పార్టీని సంస్కరించే దిశలో పాతుకుపోయిన, అసమర్థులైన అధికార గణాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. అమిరా వారిమీదే ఆధారపడక తప్పలేదు. అందుకే చాలా తెలివిగా, అటునుంచి నరుక్కురావడం మొదలుపెట్టి నూతన భావాలు పశ్చిమ దేశాలనుంచి వస్తున్నట్టు కనిపింపచేశాడు. దృఢంగా వ్యవహరిస్తూనే ఉల్లాసంగా ఉండే రైజా అండతో ఆయన విదేశీ పర్యటనలకు వెళ్లినపుడు అక్కడ ప్రధానమంత్రులను, అధ్యక్షులను ఆకట్టుకున్నాడు. సోవియట్ శిబిరంలోని పోలెండ్ 1989లో స్వేచ్ఛలోకి అడుగుపెట్టింది. ఆ తర్వాత వెంటనే హంగెరీ, జెకొస్లొవేకియా అదే మార్గం అనుసరించాయి. చినుకుచినుకుగా ప్రారంభమైన ఈ మార్పు ఒక్కసారి వెల్లువెత్తింది. బాల్టిక్ రాష్ట్రాలు, దేశ పొలిమేరల్లో ఉన్న రాష్ట్రాలు ఒక్కొక్కటే స్వాతంత్ర్యం కోసం ఆందోళన చేయడం ప్రారంభించాయి. ఆ రాష్ట్రాలు ఎంతగా స్వేచ్ఛకోసం పరితపిస్తే సోవియట్ నిరంకుశాధికార వర్గం అంతగా ప్రతిఘటించింది.

కమ్యూనిజం అన్న ఆదర్శానికి నిరంతరం కట్టుబడి ఉన్న గోర్బచేవ్ పార్టీని సంస్కరించాలనుకున్నాడే తప్ప

రూపుమాపాలని భావించలేదు. కానీ ఆర్థిక సంక్షోభం, దానికి తోడు తూర్పు యూరప్‌లోని పరిస్థితి తదనంతర పరిణామాలను శాసించాయి. చెర్నోబిల్ అణు కేంద్రంలో ప్రమాదం జరిగిన మూడేళ్ల తర్వాత 1989లో ఆయన అమెరికా అధ్యక్షుడు రీగన్ ప్రతిపాదించిన స్టార్‌వార్స్ పథకంపై పదేళ్ళపాటు మారటోరియం ప్రకటించాలని చేసిన సూచనను అమెరికా తోసిపుచ్చింది. అదే సమయంలో ఎర్రసేన ఆఫ్ఘానిస్తాన్‌నుంచి వెనుదిరగడం, బెర్లిన్‌గోడ కూలిపోవడం మొదలైంది.

ఆర్థిక పరిస్థితి దిగజారడం కొనసాగుతూనే ఉంది. తూర్పు యూరప్‌పై సోవియట్ ఆధిపత్యం సన్నగిల్లడం, బాల్టిక్ రాష్ట్రాలు మరియు జార్జియా స్వాతంత్ర్యకాంక్ష గని కార్మికుల సమ్మె నేపథ్యంలో గొర్బచేవ్‌ను గద్దె దించే కుట్రకు దారితీసింది. పోలిట్ బ్యూరో సభ్యులు, కె.జి.బి. అధిపతులు, ఆంతరంగిక వ్యవహారాల మంత్రిత్వ శాఖలోనివారు ఈ కుట్రకు దన్నుగా ఉన్నారు. గొర్బచేవ్ ప్రతిపక్ష శిబిరానికి బోరిస్ ఎలిత్సిన్ నాయకుడు. అయినా గొర్బచేవ్ తన పదవిని కాపాడుకోగలిగాడు. ఎలిత్సిన్ త్వరగా పావులు కదిపాడు. ఆ తర్వాతి నెలలో ఆయన కమ్యూనిస్టు పార్టీని రద్దుచేశారు. పార్టీ అస్త్రాలను స్వాధీనం చేసుకున్నాడు. బాల్టిక్ రాష్ట్రాలను, ఉక్రెయిన్‌ను స్వతంత్ర దేశాలుగా గుర్తించాడు. డిసెంబర్ కల్లా స్వతంత్ర రాజ్యాల కామన్వెల్త్ అవతరించింది. గొర్బచేవ్ ఈ కొత్త రాజకీయ వ్యవస్థను నిరాకరించాడు. అయితే ఆయన చర్యలే ఈ స్థితికి కారణం కావడం ఒక వైపరీత్యం.

అయితే ప్రచ్ఛన్న యుద్ధానికి స్వస్తి వాచకం పలికిన వ్యక్తిగా పశ్చిమదేశాలు గొర్బచేవ్‌ను రాజనీతిజ్ఞుడిగా, వీరుడిగా కీర్తించాయి. ఆయన జ్ఞాపకాలను విదేశీ పాలకులు అక్కున చేర్చుకున్నారు. ఆయన చర్చిల్ అంతటి వాడని ఘనంగా పొగిడారు. ఆయన ఉపన్యాసాలు ఒక్కొక్కటీ లక్ష డాలర్లు పలికాయి. శాన్‌ఫ్రాన్సిస్కోలో ఆయన నెలకొల్పిన సంస్థ రాజకీయ పరిశీలనకు కేంద్రంగా వర్ధిల్లుతోంది. కాని ఇంట మాత్రం విమర్శలు హోరెత్తాయి. గొర్బచేవ్ ప్రారంభించిన సంస్కరణలు అర్ధమనస్కంగా మాత్రమే అమలు చేశారని, అందువల్ల అదే సోవియట్ యూనియన్ వినాశనానికి ప్రధాన కారణంగా పరిణమించిందన్న విమర్శనాస్త్రాలు సంధించారు. ఆయనను ఖాతరు చేయడం మానేశారు. రష్యా పత్రికా రచయితలు అతనిని దూషించని సమయంలో కూడా గొర్బచేవ్ విషాదం గురించి మాట్లాడారు. "నాకు ఎదురైన అతి పెద్ద దురదృష్టం, నాకు అపారమైన దుఃఖాన్ని మిగిల్చింది దేశాన్ని అఖండంగా ఉంచడం సాధ్యం కాలేదన్నదే" అని గొర్బచేవ్ 1995లో అన్నారు.

1996లో బోరిస్ ఎలిత్సిన్‌పై అధ్యక్షస్థానానికి పోటీ చేయడం ద్వారా గొర్బచేవ్ దాదాపు అంతా అయిపోయిన తర్వాత కూడా మిగిలిన పరిస్థితులనైనా చక్కబెట్టాలని ప్రయత్నించారు. ఆయన చేసిన ఈ ప్రయత్నం అత్యంత దారుణంగా విఫలమైంది. దాదాపు ఒక్క శాతం మంది రష్యన్ ఓటర్లు మాత్రమే గొర్బచేవ్ కొత్త పరిపాలనకు అనుకూలంగా ఉన్నట్టు ఆ ఎన్నికల్లో రుజువైంది. పాతుకుపోయిన భావాలు ఉన్న పాత తరం వారు ఆయనను అమితంగా ద్వేషించారు. ఏ మేధావి వర్గాలనైతే పోలీసుల ఆధిపత్యం నుంచి ఆయన విముక్తం చేశారో వారే ఆయనను చరిత్రపుటలకు ఎక్కించారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అంటే తెలియని, ఆ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు అనుభవించడానికి చేయవలసిన బాధ్యతలు ఏమిటో తెలియని రష్యా నవతరం గ్లాస్‌నస్ట్‌ను ప్రవేశపెట్టినప్పటి నుండీ జరిగిన అన్ని విషయాలకూ, ఎదురైన సవాలక్ష సమస్యలకూ బాధ్యత అంతా ఆయనపైకి తోసి నిందించింది. అయినా గొర్బచేవ్ సైనికుడిలాగా తన బాధ్యతలను నిర్వర్తిస్తూనే ఉన్నాడు. తనను కేవలం సోవియట్ యూనియన్‌ను ప్రపంచపటం నుంచి చెరిపివేసిన వాడిలా కాకుండా మరో కోణంలో మరింత మేలైన రీతిలో గుర్తుంచుకోవాలన్న ఆశా దీక్షతో ముందుకు సాగుతూనే ఉన్నాడు.

1869-
1948

# మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ

ఇరవయ్యవ శతాబ్దంలోని గొప్ప విప్లవకారుల్లో ప్రథమగణ్యుడైన వ్యక్తి వేషధారణ ఎంతగా ఆ దేశ సామాన్యుల అస్తిత్వానికి ప్రతిరూపమో అంతే ప్రయోజనకరమైంది. ఆ వేషధారణ చేతితో నేసిన అద్దకం వేయని తెల్లటి కొల్లాయి గుడ్డ మాత్రమే. ఆయన వాడిన ఆయుధాలు ప్రార్థన, నిరశన, అహింసాయుతమైన ప్రతిఘటన. ఈ ఆయుధాలు సనాతనమైనవి కాకపోవచ్చు. కానీ ఇతర స్వాతంత్ర్య సమరయోధులు వినియోగించిన తుపాకులు, శతఘ్నుల కన్నా శక్తిమంతమైనవి. జనసామాన్యంలో విశ్వాసం పాదుకొల్పగలిగినవి. ఆయన దేశం నలుమూలలా నిరంతరం తిరిగిన బక్క పలచని యోగి. భారత స్వాతంత్ర్యం కోసం ప్రాణాలు అర్పించిన నిరుపమాన త్యాగశీలి. నిరాడంబరత, సౌశీల్యాలను తన సహచరులకు బోధించినవారు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ. ఆయన అభిమానులు ఆయనను 'మహాత్మా', 'బాపూజీ', 'జాతిపిత'అని పిలుస్తారు.

'రాబోయే తరాలవారు ఈ భూమిపై గాంధీ జన్మించి సత్యం, అహింసలకై పాటుపడ్డాడని చెబితే నమ్మరేమో'! అని ఐన్‌స్టీన్ పేర్కొన్నాడు. గాంధీ అందగాడా? కాదు. సంపన్నుడా? కాదు. గొప్ప విద్యావేత్త? కాదు. గాంధీ చాల సామాన్యుడు. అందరిలాగే బలహీనతలు ఉన్నవాడు. అన్న జేబులో డబ్బులు దొంగిలించి బీడీలు కాల్చాడు. మేక మాంసం తిన్నాడు. వేశ్యావాటికకు వెళ్ళి కాళ్ళు వణికి వెనకకు వచ్చాడు. ఆయనే బలహీనతలను జయించాడు. క్రమంగా ఉన్నతునిగా మహాత్మునిగా ఎదిగాడని సర్వేపల్లి రాధాకృష్ణన్ తెల్పాడు.

భారత్‌లోని పశ్చిమ తీరంలో చిన్న చేపల రేవు పోర్‌బందర్‌లో ఆయన 1869లో జన్మించాడు. గాంధీ బాల్యం ఆహ్లాదకరంగా, అట్టే బాదరబందీ లేకుండా గడిచింది. న్యాయశాస్త్రం అభ్యసించడం కోసం లండన్‌లో మూడు సంవత్సరాలు గడిపినందుకు సనాతనులు 1891లో ఆయనను సంఘ బహిష్కారానికి గురిచేశారు. సముద్రయానం చేయడాన్ని ఆ రోజుల్లో అపవిత్రమైందిగా భావించేవారు. యువ విద్యావేత్త జీవితంలో అది గమనించదగిన సంఘటన.

గాంధీలో ఆత్మ విమర్శపాలు ఎక్కువ. ఆయన ఆచరణవాది. విదేశాల్లో ఉన్నప్పుడు బ్రిటిష్‌వారి సంప్రదాయాలైన టోపీ పెట్టుకోవడం, చేతికర్ర పుచ్చుకొని నడవడం వంటి ఇంగ్లీషు నాగరికతా లక్షణాలను అనుసరించాడు. నాట్యంలోనూ, ఉపన్యాస కళలోనూ శిక్షణ పొందాడు. అయితే తమ సంస్కృతే మహత్తరమైందన్న బ్రిటిష్‌వారి జాత్యహంకారపూరితమైన ధోరణితో పొంతన కుదరకపోవడం ఆయనలో నిరాశనే మిగిల్చింది.

గాంధీ బక్కపల్చగా ఉండేవాడు. సహజంగా సిగ్గరి. చిన్నతనంలో శ్రవణుని పితృభక్తి, హరిశ్చంద్రుని సత్యనిరతి ఆయనపై ప్రభావం చూపాయి. తరువాత టాల్‌స్టాయ్, థోరో, జాన్ రస్కిన్ ప్రభావం గాంధీపై ప్రసరించింది. ముఖ్యంగా థోరో రచనలు శాసనోల్లంఘన, సహాయ నిరాకరణ స్ఫూర్తిని ఆయనలో పెంచాయి. మతసాహిత్యం నుండి అహింస, త్యాగం, ప్రేమ, దయాగుణాలను పుణికిపుచ్చుకున్నాడు. భారత్‌కు తిరిగివచ్చిన తర్వాత బొంబాయిలో బారిష్టరుగా పనిచేశాడు. రెండేళ్ల తర్వాత దక్షిణాఫ్రికాలోని ఒక ముస్లిం వ్యాపార సంస్థకు న్యాయ సలహాదారుగా పనిచేయడానికి వెళ్ళారు.

డర్బన్ నుంచి ప్రిటోరియాకు రైలులో వెళుతున్న సమయంలో ఆయనను మొదటి తరగతి కంపార్ట్‌మెంట్ నుంచి బయటకు తోసేశారు. ఒక ఐరోపా దేశస్థుడికి తాను కూర్చున్న సీటు ఇవ్వడానికి నిరాకరించినందువల్ల రైల్వే అధికారి గాంధీ మీద చేయి కూడా చేసుకున్నాడు. దాంతో జాత్యహంకారంపై వర్ణ వివక్షతకు వ్యతిరేకంగా

పోరు సాగించాడు. అహింసా ఆయుధంతో శాసనబద్ధమైన పద్ధతులతో తన నిరసనకు పదునుపెట్టాడు. నిర్భయంగా, ధృఢదీక్షతో ఆరంభించిన శాంతియుత ప్రతిఘటనకు దక్షిణాఫ్రికా దద్ధరిల్లింది. వివిధ దేశాల ప్రజలు గాంధీకి బాసటగా పదం కలిపారు.

గోపాలకృష్ణ గోఖలే ఆహ్వానంపై 1915లో స్వదేశం తిరిగి వచ్చిన తర్వాత సమాజంలోని అంతర్, బహిర్ రూపాలలోని అన్యాయాలకు వ్యతిరేకంగా అహింసాయుత పద్ధతిలో సత్యాగ్రహం నిర్వహించారు. వలసవాదుల అణచివేతకు వ్యతిరేకంగా ఎంత దీటుగా పోరాడారో హిందూ మతంలో అంతర్నిహితమైన అంటరానితనానికి వ్యతిరేకంగా కూడా అంతే శక్తిమంతంగా పోరాడారు. సహాయ నిరాకరణోద్యమంలో భారత జాతిని మేల్కొలిపాడు. బ్రిటీష్‌వారి పునాదులను కదిలించాడు. ఉన్నతులు, మధ్యతరగతి, అతిసామాన్యులైన బడుగు, బక్క ప్రజలు స్త్రీలతో సహా ఉద్యమంలో పాల్గొన్నారు. విదేశీ వస్తు బహిష్కరణ, స్వదేశీ నినాదాలతో దేశం మార్మోగింది. దేశమంతటా రాట్నాలు తిరిగాయి. బ్రిటిష్ పారిశ్రామిక చక్రాలు ఆగాయి. భారత జాతికి స్వాతంత్ర్యపోరాట రూపం ఇచ్చారు.

గాంధీ పిలుపు ఇచ్చిన శాసనోల్లంఘన ఉద్యమం (ఉప్పు సత్యాగ్రహం) బ్రిటిష్‌వారిని భేజారెత్తించింది. సామాన్యుడి అవసరమైన ఉప్పుపై పన్ను విధించడాన్ని గాంధీ గర్హించాడు. సముద్రతీరాన ఉన్న దండి గ్రామానికి తన అనుచరులతో రెండు వందల మైళ్ళు నడిచి వెళ్ళి ఉప్పు తయారు చేయడానికి ప్రయత్నించాడు. బ్రిటిష్‌వారు ఆయనతోపాటు కాంగ్రెస్ నాయకులందరినీ అరెస్టు చేశారు. దేశమంతటా లక్ష ముప్పైవేల మంది జైలుపాలయ్యారు. జైళ్ళలో ఖాళీలేక కొన్ని చోట్ల బడులు ఖాళీ చేసి విద్యార్థులకు శెలవులు ప్రకటించారు. లక్షలు, కోట్ల జనాభాను పోరాటదిశగా మళ్ళించగలిగిన గాంధీకి సాటిరాగల నాయకుడు ప్రపంచంలోనే కనిపించరు.

గ్రామీణ జీవనం పదిలంగా ఉండాలని భావించే ఈ వ్యక్తి బ్రిటిష్‌వారికి కొరకరాని కొయ్యగా తయారయ్యాడు. "ఆయన చాలా ప్రమాదకరమైన, కొరుకుడు పడని శత్రువు. శారీరకంగా చూస్తే సునాయాసంగా లొంగదీసుకోగలిగినా ఆయన ఆత్మను లొంగదీయడం అసాధ్యం" అని ఒక పరిశీలకుడు వ్యాఖ్యానించాడు. సుదీర్ఘకాలం పాటు ఆయన అనేకసార్లు కొనసాగించిన నిరాహార దీక్షల ముందు, 1930లో ఉప్పు మీద పన్ను విధించినపుడు రెండు వందల మైళ్ల పొడవున ఉప్పు సత్యాగ్రహం నిర్వహించినప్పుడు వలసవాద ప్రభుత్వం అనుసరించిన ఎత్తుగడలు అన్నీ ఎందుకూ కొరగాకుండా పోయాయి.

శాంతియుత ప్రదర్శనలు నిర్వహించిన సందర్భంలోనూ రక్తం ఏరులై పారిన సమయంలోనూ గాంధీ నిస్సహాయుడిగా మిగిలిపోయినందుకు విమర్శకులు ఆయన అమాయకత్వాన్ని నిందించారు. ఆయన నిరాడంబరత్వానికి అమిత ప్రాధాన్యం ఇవ్వడంపై జవహర్‌లాల్ నెహ్రూ వంటి సహచరులు సంకోచం వ్యక్తం చేశారు. గాంధీని నిరాడంబరంగా ఉంచడానికి భారీ ధనం ఖర్చు చేయవలసి వస్తున్నదని భారత కోకిల సరోజినీ నాయుడు గుర్తు చేశారు. 1947లో దేశ స్వాతంత్ర్యంతోపాటు భారత్ హిందూ, ముస్లిం మతాల ఆధారంగా రెండుగా చీలిపోయింది. ఈ విభజనకు ఆయన విధిలేక మాత్రమే అంగీకరించారు. కానీ స్వాతంత్ర్యం సంపాదించిన ఏడాది తర్వాత ఒక హిందూ మతోన్మాది గాంధీని హత్య చేయడంతో ప్రపంచం అంతా తీవ్రంగా కలత చెందింది. యమునా నది ఒడ్డున ఆయన అంత్యక్రియలు జరిగినప్పుడు లక్షలాది మంది భారమైన హృదయాలతో, కన్నీటితో ఆ అంతిమ యాత్రలో పాల్గొన్నారు.

1917-
1984

# ఇందిరా గాంధీ

ఒక పెద్ద దేశానికి తొలి మహిళా ప్రధాన మంత్రి, భారత్‌లో గొప్ప రాజకీయ నాయ కుల వంశానికి వారసురాలు అయిన ఇందిరా గాంధీని దేశవాసులు 'అమ్మ' అనేవారు. కొన్ని సందర్భాలలో అమ్మ అన్న మాటే ఇందిరాగాంధీకి సంకేతంగా ఉండేది. అత్యధిక సంఖ్యాకులు హిందువులైన భారత్‌లో మాతృ భావన చాలా శక్తిమంతమైనది. సర్వశక్తి సంపన్నులైన దేవతలను మాతృమూర్తిగానే కొలుస్తారు. ఇందిరాగాంధీ సుదీర్ఘ రాజకీయ ప్రస్థానంలో కొన్ని సందర్భాల్లో ఆమె సకలార్థ ప్రదాయిని అయిన దుర్గగా భావిస్తే, మరికొన్ని సందర్భాల్లో విలయకారిణి అయిన కాళిగా కనిపించేది. ఆమె హత్యకు గురైన సమయం నాటికి ఆమె పట్ల దేశ ప్రజల్లో అమితమైన అనురాగమూ ఉంది. అపారమైన ద్వేషభావమూ ఉంది.

భావి భారత ప్రధానమంత్రి కావాల్సి ఉన్న జవహర్‌లాల్ నెహ్రూ, కమల అనే దంపతులకు ఉత్తరప్రదేశ్‌లో ఇందిరాగాంధీ జన్మించారు. ఆమె బాల్యం అంతా భారత జాతీయోద్యమంలోని ఒడిదుడుకుల మధ్యే గడిచింది. స్వాతంత్ర్యోద్యమంలోని అన్ని ముఖ్యమైన ఘట్టాలకు ఆమె ప్రత్యక్షసాక్షి. కొన్ని సందర్భాల్లో ప్రత్యక్ష పాత్రధారి కూడా. బ్రిటిష్ రాజ్యాధికారాన్ని ఎదిరించినందుకు తన తండ్రి, తాత మోతీలాల్ నెహ్రూ మీద మోపిన కేసులకు, వారు అనుభవించిన జైలు శిక్షలకు కూడా ఆమె బాల్యం సాక్షిగానే నిలిచింది. విదేశీ వస్తు విక్రయ శాలల దగ్గర పికెటింగ్ చేయడం నేరం అనడంతో జాతీయత నరనరాన జీర్ణించుకుపోయిన నెహ్రూ కుటుంబం తమ దగ్గరున్న యూరప్ మఖ్మల్ వస్త్రాలను, షిఫాన్ వస్త్రాలను దహనం చేసి ఖాదీ మాత్రమే కట్టాలని ప్రతినబూనింది.

ఆమె తండ్రి ఎప్పుడూ నిరసనోద్యమాల్లో పాల్గొనడం వల్ల లేదా, జైళ్లలో మగ్గుతున్నందువల్ల ఇందిరాగాంధీ బాల్యం చాలా వరకు ఒంటరిగానే గడిచింది. ఇందిర ఎలాంటి పాఠశాలలో విద్యనభ్యసించాలన్న విషయమై తన తాత, తండ్రి మధ్య కొనసాగిన వివాదాల కారణంగా ఆమె మొదట ఇంగ్లీషు పాఠశాలల్లోనూ, తర్వాత భారతీయ విద్యాలయాల్లోనూ, ఆ తర్వాత మళ్ళీ ఇంగ్లీషు బడుల్లోనూ విద్యాభ్యాసం చేయవలసి వచ్చింది. పాఠశాల విద్యను పక్కన పెడితే ఆమె అభ్యసించిన విద్య ఏమిటంటే తన సొంత కాళ్ళమీద నిలబడడం. ఆమె చదువులో చాలా భాగం బడికెళ్ళి నేర్చుకున్నది కాదు. జైలులో ఉన్న సమయంలో తండ్రి రాసిన ఉత్తరాలే ఆమెకు అసలైన విద్య. ఆ లేఖలన్నీ కలిపితే ప్రపంచ చరిత్ర (ది గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ) అయింది. తన స్వభావాన్ని తీర్చిదిద్దింది బాల్యంలోని ఒంటరితనం, విషణ్ణతేనని ఆమె తర్వాత చెప్పేవారు. చిన్నప్పట్నుంచీ ఇందిర గడుగ్గాయే. ఆ గడుసుతనమే ఆమె దుడుకు తనానికి, ఆదర్శవాదిగా మారడానికి దారి తీసింది. తనను తాను జోన్ ఆఫ్ ఆర్క్ అనుకునేది. 1926లో ఆమె తల్లి క్షయవ్యాధి చికిత్స కోసం స్విట్జర్లాండ్‌లో ఉన్నప్పుడు అక్కడ పాఠశాలకెళ్ళింది. 1927లో భారత్ తిరిగి వచ్చింది. తన తాతకి, తండ్రికి సన్నిహిత మిత్రుడైన మోహన్‌దాస్ గాంధీ నడుపుతున్న అహింసాయుత పోరాటాలపట్ల ఆకర్షితురాలై పన్నెండేళ్ళ ప్రాయంలోనే జాతీయతా భావాలు గల బాలలను సమీకరించి వానరసేనను ఏర్పాటు చేసింది. ఈ బాలలే జాతీయోద్యమం కోసం పోరాడుతున్న భారత జాతీయ కాంగ్రెస్‌కు సందేశాలు చేరవేసేవారు.

1936లో తల్లి మరణించిన తర్వాత ఆక్స్‌ఫర్డ్‌లోని సోమర్‌విల్లీ కళాశాలలో చేరారు. అక్కడ ఆధునిక చరిత్ర అధ్యయనం చేశారు. అక్కడే ఫిరోజ్ గాంధీతో సాన్నిహిత్యం కలిగింది. అప్పుడు ఆయన లండన్‌లో స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో చదువుకుంటుండేవారు. ఆయన అప్పటికే రాజకీయాల్లో చురుకుగా ఉండేవారు. ఆమె ఆక్స్‌ఫర్డ్‌లో ఉన్న సమయంలోనే భారత స్వాతంత్ర్యం కోసం మద్ధతు కూడగట్టడానికి నెహ్రూ తరచుగా ఇంగ్లండ్ వెళుతుండేవారు. ఇది ఆమె చదువుకు ఆటంకం కలిగించింది. రెండో ప్రపంచ యుద్ధం దగ్గర పడుతున్న సమయంలో బ్రిటిష్ వైస్రాయ్ కోపోద్రిక్తమై ఉన్న భారత్‌ను బ్రిటిష్ సామ్రాజ్యపక్షం వహించేట్టుచేశారు. ఆ సమయంలోనే ఆమె ఫిరోజ్‌ను పెళ్ళాడాలని నిర్ణయించుకున్నారు. ఫిరోజ్ తల్లిదండ్రులు ఒక చిన్న కొట్టు నడిపేవారు. ఉన్నతశ్రేణికి చెందిన నెహ్రూ కుటుంబానికి ఇందిర ఫిరోజ్‌ను పెళ్లి చేసుకోవడం అంతగా

ఇష్టం లేదు. కానీ మహాత్మాగాంధీ ఈ పెళ్ళిని అంగీకరించడంతో జవహర్‌లాల్ కూడా ఒప్పుకోక తప్పలేదు. చివరకు 1942లో ఈ పెళ్ళి జరిగింది. ఈలోగా సహాయ నిరాకరణోద్యమం కారణంగా నెహ్రూ తొమ్మిదోసారి కారాగార వాసం అనుభవించాల్సి వచ్చింది. ఫిరోజ్‌గాంధీ తప్పించుకున్నారు. అలహాబాద్‌లో ఒక బహిరంగ సభలో ఇందిరాగాంధీని అరెస్టు చేసి నైనీ జైలులో ఉంచారు. ఆ జైలులో ఉన్న పదమూడు నెలల కాలంలో ఆమె నిరక్షరాస్యులైన ఖైదీలకు చదువు చెప్పారు. జైలు నుంచి విడుదలైన తర్వాత తన భర్తను చేరుకున్నారు. 1944లో వారికి రాజీవ్ జన్మించాడు. రెండేళ్ళ తర్వాత ఇక తమ సామ్రాజ్యాన్ని నిలబెట్టడం అసాధ్యమని భావించిన బ్రిటీష్ వారు దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి అంగీకరించారు. అదే సంవత్సరం ఇందిర రెండో కుమారుడు సంజయ్ జన్మించాడు. ఆమె తండ్రి నవభారత ప్రధానమంత్రి కావడం ఖరారైపోయింది. హిందూ ముస్లింల మధ్య కలహాలు పెచ్చరిల్లిన వాతావరణంలో 1947 ఆగస్టు 15న స్వాతంత్ర్యం సిద్ధించింది. భారత్-పాకిస్తాన్‌గా దేశం రెండు ముక్కలైంది. ఆ మరుసటి సంవత్సరం నెహ్రూ కుటుంబానికి ఆప్త మిత్రుడైన మహాత్మ గాంధీ హత్యకు గురయ్యాడు.

ఇందిరాగాంధీ తన తండ్రికి విశ్వాసపాత్రురాలు కావడంతో పాటు ఆయన పనులు చక్కబెట్టడంలో నిమగ్నమయ్యారు. అలీన విధానానికి కట్టుబడి ఉండడం, భారత ఆర్థిక వ్యవస్థను పటిష్ట పరచడం అన్న లక్షణాలను ఆమె తన తండ్రి నుంచే పుణికి పుచ్చుకున్నారు. 1955 నాటికి అధికార కాంగ్రెస్‌లో ప్రముఖురాలైపోయిన ఇందిరాగాంధీ ఈ సూత్రాలను అమలులో పెట్టాలని నిర్ణయించారు. 1964లో నెహ్రూ మరణించారు. ఆ తర్వాత ప్రధాన మంత్రి బాధ్యతలు స్వీకరించిన లాల్ బహదూర్ శాస్త్రి మంత్రివర్గంలో ఆ దుఃఖభారంలో ఉన్నప్పటికీ ఆమె జూనియర్ మంత్రిగా చేరారు. రెండేళ్ళ తర్వాత శాస్త్రి దివంగతులయ్యారు. నెహ్రూ కూతురుగా జాతి ఐక్యతకు చిహ్నమైన ఇందిరాగాంధీని ప్రధామంత్రి పదవి వరించింది. అనుభవం కొరవడినందువల్ల తొలిదశలో ఆమె కొన్ని తప్పటడుగులు వేశారు. భారత్ చైనా యుద్ధ ప్రభావం, విపరీతమైన అనావృష్టి ఆమె సామర్థ్యానికి పరీక్ష పెట్టాయి. అయితే ద్రవ్యోల్బణం తెచ్చి పెట్టే సమస్యలు, పంజాబ్ కలహాలు మొదలైన జటిల సమస్యలను సమర్థవంతంగా ఎదుర్కొనే నైపుణ్యాన్ని ఆమె సంతరించుకున్నారు. కుటుంబ నియంత్రణ కార్యకలాపాలను భారీ ఎత్తున ప్రారంభించారు. ఆహార ధాన్యాల ఉత్పత్తిని పెంచడానికి ప్రయత్నించారు. భారత్‌ను పారిశ్రామిక దేశంగా మలిచి, పేదరికాన్ని నిర్మూలించి సోషలిస్టు తరహా సమాజం ఏర్పాటు చేయడానికి కృషి చేశారు. ఆమె పాలనలోనే భారత్ అలీన దేశాలకు నాయకత్వం వహించే స్థితికి చేరింది.

ఆమె అధికారంలో ఉన్న సమయం ప్రశాంతంగా ఏమీ నడపలేదు. అనేక ఒడిదుడుకులు ఎదుర్కోవాల్సి వచ్చింది. ఆమె అవినీతి పరురాలన్న ఆరోపణలు అనేకసార్లు వెల్లువెత్తాయి. 1971లో ఎన్నికల సమయంలో అక్రమాలకు పాల్పడినట్లు న్యాయస్థానం ఇచ్చిన తీర్పు అమలు కాకుండా చేయానికి 1975లో ఆమె ఎమర్జెన్సీ ద్వారా నియంతృత్వ అధికారాలను దత్తం చేసుకున్నారు. మిగతా సంవత్సరాలలో తన రాజకీయ ప్రత్యర్థులతో పోరాటాలతో సరిపోయింది. కుట్రలు, కలహాలు, నమ్మకద్రోహాలు పెచ్చరిల్లాయి. ఎమర్జెన్సీ పుణ్యమా అని 1977 ఎన్నికల్లో ఆమె ఓడిపోయారు. అవినీతి ఆరోపణల కారణంగా కొద్ది కాలం జైలులో ఉన్నారు. 1980లో ఆమె మళ్ళీ అధికారం చేజిక్కించుకున్నారు. తనకు రాజకీయ వారసుడనుకుంటున్న రెండో కొడుకు సంజయ్ విమాన ప్రమాదంలో మరణించాడు. స్వర్ణదేవాలయం సాయుధ సిక్కులకు ఆలవాలంగా మారినందువల్ల 1984లో సిక్కులు పరమ పవిత్రంగా భావించే స్వర్ణదేవాలయంపై సైనిక చర్యకు ఇందిరాగాంధీ ఉత్తర్వులు జారీ చేశారు. తన భద్రతకోసం నియోగించిన వారిలో సిక్కులను తప్పించాలన్న సలహాను ఆమె పెడచెవిన పెట్టారు. 1984 అక్టోబర్ 31న ఆమె అధికార నివాస గృహంలోని తోటలోనే తన భద్రతకోసం నియమితులైన ఇద్దరు సిక్కులు ఆమెను హతమార్చారు. ఆ తర్వాత 1947 తర్వాత ఎన్నడూ కనీ వినీ ఎరుగని రీతిలో సిక్కుల ఊచకోత కొనసాగింది. భారతీయులందరూ అమ్మ అని పిలుచుకునే ఇందిరాగాంధీ శాశ్వతంగా తిరిగిరాని లోకాలకు వెళ్ళిపోయింది.

1886-
1976

# డేవిడ్ బెన్ గురియన్

జియానిస్టు నాయకుడు, గెరిల్లా పోరాట యోధుడు, రాజనీతిజ్ఞుడు డేవిడ్ బెన్ గురియన్, ఇజ్రాయిల్ రాజ్యానికి పితామహుడు. ఎంతటి కౌటిల్యం, దృఢ దీక్ష గల వాడు అయినా జియానిస్టు రాజకీయాలలో చాలా కాలం తలమునకలై, తీవ్రమైన కృషి చేసిన తర్వాత మాత్రమే బెన్‌కు తన జాతి ప్రజలకు నాయకత్వం వహించే అవకాశం కలిగింది. ఇజ్రాయిల్ ప్రథమ ప్రధానమంత్రిగా ఉన్న బెన్ ప్రదర్శించిన నిబద్ధత, స్థిర దృక్పథం, భవిష్యద్దర్శనం ఇజ్రాయిల్ ప్రజలకు దిశానిర్దేశం చేయడంతోపాటు పశ్చిమాసియా రాజకీయాల గతినే మార్చివేశాయి. 1948 నుంచి 1953 వరకు, ఆ తర్వాత 1961 నుంచి 1963 వరకు బెన్ ఇజ్రాయిల్ ప్రధానిగా ఉన్నాడు.

పోలెండ్ రాజధాని వార్సాకు 35 మైళ్ల దూరంలోని ప్లోన్స్క్‌లో బెన్ జన్మించాడు. చిన్నప్పుడు అతనిని డేవిడ్ గ్రున్ అనేవారు. ఆయన తండ్రి లైసెన్స్ లేని న్యాయవాది. సాంప్రదాయిక రీతిలో చూస్తే బెన్‌కు మతం మీద అంత పట్టింపు ఎన్నడూ లేదు. కాని తాను యూదునన్న చైతన్యం మాత్రం చాలా స్పష్టంగా ఉండేది. తాత, తండ్రి ప్రభావం బెన్ మీద చాలా ఉంది. ఆయన తాత జియాన్ అభిమాన ఉద్యమంలో క్రియాశీల పాత్ర వహించాడు. చిన్నప్పుడు డేవిడ్‌కు హిబ్రూ భాష నేర్పింది ఆయనే. అందువల్ల బెన్‌కు చిన్ననాటి నుంచే జియానిజం మీద నిబద్ధత ఏర్పడింది. 14 ఏళ్ల వయసు వచ్చేటప్పటికే పాలస్తీనాకు వలసలను ప్రోత్సహించే సంఘానికి బెన్ కార్యదర్శిగా ఉన్నాడు. 1905 కల్లా బెన్‌కు యూదుజాతి అన్నా, జియానిజం మత నియమాలు అన్నా, మార్క్సిస్టు ఆర్థిక సిద్ధాంతం అన్నా తీవ్ర అభిమానం ఏర్పడింది.

1906లో గ్రున్ స్వయంగా పాలస్తీనాకు వలస వెళ్ళాడు. అప్పటికి ఆయనకు 20 ఏళ్లే. కాని జాతీయతావాదంగల జియాన్ సోషలిస్ట్ కార్మికుల సంఘానికి ఆయన అధిపతి అయ్యాడు. ఆ కార్మిక సంఘం కార్యనిర్వాహకుడిగా ఆయన మలేరియా వంటి వ్యాధుల బారినపడి ఆరోగ్యం పాడు చేసుకున్నాడు. ఇటు స్థానిక పాలస్తీనియన్లు ఆయనను అనుమానంతో చూశారు. తాను నమ్మిన జియానిస్టు ఆశయాలను పెంపొందించాలంటే టర్కీలోని ఓట్టోమాన్ ప్రభుత్వంలో భాగస్వామి కావడం మంచిదనుకున్నాడు. గ్రున్‌కు అనేక భాషలు తెలుసు. జియానిస్టులు ప్రచురించే 'యూనిటీ' అన్న పత్రికలో బెన్ గురియన్ అన్న కలం పేరుతో వ్యాసాలు రాసేవాడు. చివరకు అదే ఆయన పేరుగా స్థిరపడిపోయింది. న్యాయశాస్త్రం చదవడం కోసం, జియానిస్టులకు అనుకూలంగా ఉన్నత వర్గాల వారి మద్దతు కూడగట్టడం కోసం ఆయన కాన్‌స్టాంట్ నోపుల్ వెళ్ళాడు. ఆయన తండ్రి పంపించే డబ్బు అసలే చాలకపోవడం వల్ల అక్కడ బెన్ అర్ధాకలితో బతకాల్సి వచ్చింది. 1914లో పాలస్తీనాకు తిరిగివచ్చి మళ్ళీ యూనియన్ కార్యకలాపాలు చేపట్టాడు.

మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడంతో టర్కీ వారు జర్మనీకి సన్నిహితంగా ఉన్నందువల్ల బెన్‌ను అక్కడి నుంచి పంపించి వేశారు. బెన్ మొదట ఈజిప్టు చేరుకున్నాడు. అక్కడి నుంచి న్యూయార్క్ వెళ్ళాడు. అక్కడ ఆయన ఇజ్రాయిల్‌లోని ఎరెట్జ్‌లో యూదుల ఆవాసాలు ఏర్పాటు చేయడానికి చేసిన ప్రయత్నం విఫలం అయింది. అమెరికాలో ఉన్నప్పుడు ఆయన సాధించిన ఘన విజయమల్లా 1917లో పౌలామున్‌వీస్‌ను పెళ్ళాడడమే కావచ్చు. ఆమె నర్సుగా పనిచేసింది. వీరికి ముగ్గురు కొడుకులు. 1968లో మరణించేదాకా కూడా పౌలా తన భర్తకు అంకితం అయిపోయారు.

పెళ్ళి చేసుకున్న మరుసటి సంవత్సరం, 1918లో బెన్ గురియన్ యూదుల రాయల్ ఫ్యూజిలయర్స్ బెటాలియన్‌లో చేరాడు. జనరల్ అలెన్‌బీ నేతృత్వంలో టర్కీ వారికి వ్యతిరేకంగా పాలస్తీనాలో పోరాడడం కోసం బెన్‌ను పంపించారు. పశ్చిమాసియా పోరాటంలో టర్కీ

వారు అపజయం పాలయ్యారు. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత ఓట్టోమాన్ సామ్రాజ్యం ముక్కలైంది. పాలస్తీనాను పరిపాలించడానికి నానాజాతిసమితి బ్రిటన్‌కు అధికారం ఇచ్చింది. అయితే అప్పటికే తన వలస రాజ్యాలపై బ్రిటన్ పట్టు క్రమంగా తగ్గుతోంది. ఆ తర్వాత 15 ఏళ్ల పాటు బెన్ గురియన్ కార్మిక సంఘాల సమాఖ్య అయిన హిస్టాడార్ట్‌కు కార్యదర్శిగా పనిచేశాడు. ఆ హోదాలోనే పరిపాలనా వ్యవహారాలు, వలసలు, అజ్ఞాతంగా పనిచేసే మిలిటెంట్ల వ్యవహారం, మొత్తం మీద ఒక జాతి నిర్మాణానికి అవసరమైన సకల పనులు చక్కబెట్టేవాడు. రాజకీయ, ఆర్థిక సిద్ధాంతంగా మార్క్సిజాన్ని బెన్ అప్పటికే పక్కన పెట్టాడు. ఒక జాతిని నిర్మించడానికి ఆయన అదును కోసం వేచి చూస్తున్నాడు. రెండో ప్రపంచ యుద్ధం ఆ అవకాశం కల్పించింది.

పాలస్తీనాపై బ్రిటిష్ ఆధిపత్యాన్ని ఆసరాగా చేసుకుని ఇంగ్లాండ్ వనరులను వినియోగించుకుని ఇజ్రాయిల్ సైనిక శక్తిని పెంపొందించాడు. యూరప్‌లో సెమిటెక్ జాతులకు వ్యతిరేకంగా ఒత్తిడి పెరిగినందువల్ల యూదులు వలస వెళ్ళడం ఎక్కువైంది. దానితో పాలస్తీనాలో యూదుల సంఖ్య పెరిగిపోయింది. ఈ వలసలను నిరోధించడం కోసం 1939లో బ్రిటన్ మెక్‌డొనాల్డ్ శ్వేత పత్రాన్ని జారీ చేసింది. ఇది బాగా అపఖ్యాతి పాలైంది. దశాబ్దంలోగా పాలస్తీనాలో అరబ్బులు యూదులతో కూడిన రాజ్యం ఏర్పాటు చేయాలని, ఇజ్రాయిల్ నుంచి వలసల కోటాపై మొదటి అయిదేళ్లపాటు కచ్చితమైన ఆంక్షలు విధించాలని కూడా బ్రిటన్ ఆదేశించింది. కేవలం 75 వేల మంది యూదులను మాత్రమే పాలస్తీనాలో స్థిరపడడానికి అనుమతించాలని కూడా బ్రిటన్ నిర్ణయించింది. పాలస్తీనాలో యూదులు భూములు కొనక్కోవడంపై కూడా ఆంక్షలు విధించింది. రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత బెన్ గురియన్ 1947 నుంచి 1948 వరకు బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా రాజకీయ పోరాటం ప్రారంభించాడు. పాలస్తీనాలో శాంతి భద్రతలు కాపాడడం కోసం చేసే ప్రయత్నాలు రాజకీయంగానూ, ఆర్థికంగానూ చాలా ఖరీదైన వ్యవహారంగా తయారయ్యాయని భావించిన బ్రిటన్ మరోసారి యూదులు-అరబ్బులతో కూడిన రెండు జాతుల రాజ్యాన్ని ఏర్పాటు చేయాలని మరో పత్రాన్నీ జారీ చేసింది. ఆ తర్వాత ఈ వ్యవహారాన్ని ఐక్యరాజ్యసమితికి బదలాయించింది. ఐక్యరాజ్యసమితి పాలస్తీనాను రెండు ముక్కలుగా విడగొట్టి యూదుల, అరబ్బుల స్వతంత్ర రాజ్యాలుగా మార్చడంతో మాతృభూమి విభజనకు అరబ్బులు అంగీకరించలేదు. ఆ నిర్ణయాన్ని ప్రతిఘటిస్తూనే ఉన్నారు. 1948లో మే 14న ఇజ్రాయిల్ రిపబ్లిక్‌ను ఏర్పాటు చేసినట్టు బెన్ ప్రకటించాడు. పాలస్తీనా విభజన పట్ల ఆగ్రహంతో ఆ మరుసటి రోజే లెబనాన్, సిరియా, జోర్డాన్, ఈజిప్ట్, ఇరాక్‌తో కూడిన అరబ్ లీగ్ ఇజ్రాయిల్ మీద దాడి చేసింది. కానీ బెన్ గురియన్ తొణకలేదు. అరబ్ ఇజ్రాయిల్ యుద్ధంలో తామే విజయం సాధించినట్టు ప్రకటించుకున్నాడు.

బెన్ చాలా వివేకంగల ప్రధాన మంత్రి. కానీ త్వరగా ఆగ్రహానికి లోనయ్యేవాడు. ఇజ్రాయిల్‌ను ఆర్థికంగా పటిష్టం చేశాడు. కాని ఈ ప్రయత్నంలో భాగంగా ఆయన చాలా సార్లు ప్రపంచ దేశాల అభిమానాన్ని కోల్పోవలసి వచ్చింది. ఆయన విజయం అంతా తన జాతిని నడపడంలోనే కాకుండా జాతిని నిర్మించడంలో ఉంది. అరవైల నాటికి ఇజ్రాయిల్‌కు చేయి పట్టుకుని నడిపించే తండ్రి లాంటి వాడి అవసరం తీరిపోయింది. ఆ దశలో బెన్ గురియన్ ప్రధానమంత్రిగా రాజీనామా చేశాడు. నెగేవ్ ఎడారిలోని సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో గడిపేవాడు. చివరిదాకా రాజకీయంగా క్రియాశీలిగా ఉన్న బెన్ తాను కన్న కలల్ని సాకారం చేసుకోగలిగాడు.

1934-

# జేన్ గూడాల్

చింపాంజీల ప్రవర్తనా విధానాలను పరిశీలించడానికి నేను మొదట్లో టాంజానియాలోని గోంబేకు వెళ్ళినప్పుడు విలేకరులు "మీరు టార్జాన్‌ను కూడా చూస్తారా?" అని అడిగేవారని జేన్ గూడాల్ చెప్పేవారు. ఇలాంటి ధూర్త అవమానాలను లెక్క చేయకుండా 26 ఏళ్ల గూడాల్ 1960లో చింపాంజీలకు, మనుషులకు ఉన్న పోలికలు ఏమిటో పరిశీలించడానికి బయలుదేరింది. అయితే ఆమె పరిశోధనల్లో చింపాంజీలకు, మనుషులకు మధ్య ఉన్న పోలికల సంగతి అటుంచి మనుషుల్లో చింపాంజీల లక్షణాలు ఎన్ని ఉన్నాయో తేల్చింది. అప్పటికి గూడాల్ శిక్షణ పొందిన శాస్త్రవేత్త కాదు. అయినా ఆమె గొప్ప ప్రకృతి పరిశోధకురాలైంది. తాను పరిశోధిస్తున్న చింపాంజీల విషయంలో ఆమె అంతకు మునుపు ఎవరూ చేయని సాహసాలు చేసింది. పూర్తిగా ఆ పనిలో నిమగ్నమైపోయింది. గూడాల్ వాటితో మమేకం అయిపోయి జీవించింది. వాటితో కలిసి ఆడుకుంది. వాటికి తన మీద నమ్మకం కలిగించగలిగింది. అవి ఎలా జీవిస్తున్నాయో కనిపెట్టగలిగింది. అంతకు ముందు ఈ రంగంలో పరిశోధన చేసిన వారందరూ ఎంత అనుచితంగా ప్రవర్తించేవారంటే ఈ పరిశోధకులను చూడగా చింపాంజీలు జడుసుకుని చెట్టెక్కేసేవి. అడవుల్లో లోతట్టు ప్రాంతాలలోకి జారుకునేవి. ఈ కారణంగా పరిశోధకులు చింపాంజీల గురించి కనిపెట్టగలిగింది చాలా తక్కువ. గూడాల్ మాత్రం ఒంటరిగా ఆ పొదల్లోకి వెళ్ళి సుదీర్ఘ కాలం అక్కడే గడిపేది. అంతకు ముందు వానరాల గురించి పరిశోధనలు చేసిన వారందరూ కలిసి సేకరించిన సమాచారానికన్నా ఎక్కువ వివరాలను సంపాదించగలిగింది.

ఆమె తండ్రి ఒక నవలా రచయిత. తల్లి ఒక ఇంజనీరు కూతురు. తండ్రికి మోటార్ రేసులంటే మక్కువ. గూడాల్ లండన్‌లో జన్మించింది. తల్లిదండ్రులకు ఉన్న సాహసిక లక్షణాలు, తనకు ఉన్న ఉత్సుకత భవిష్యత్తులో ఆమె పరిశోధనలకు బాగా తోడ్పడ్డాయి. ఏడేళ్ళ ప్రాయంలోనే ఆమె అసాధారణ ప్రవర్తనా లక్షణం గల డాక్టర్ డూలిటిల్ గురించిన కథలు బాగా ఆకట్టుకున్నాయి. ఆ కథల్లో డూలిటిల్ జంతువులతో మాట్లాడగలిగేవారు. గూడాల్ దగ్గర ఒక చింపాంజీ బొమ్మ ఉండేది. దాని పేరు జూబిలీ. ఆ బొమ్మ ఎప్పుడూ ఆమె పక్కనే ఉండేది. తోటలో పురుగులను చూస్తూ ఆమె గంటల తరబడి ఉండిపోయేది. కోళ్ళ గూడులో ఉన్న కోళ్ళను అదే పనిగా పరిశీలించేది. క్రిములు, కీటకాలను తదేకంగా పరిశీలించేది. ఉన్నత పాఠశాల విద్య అయిపోయిన తర్వాత 1952లో గూడాల్ ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో సెక్రటరీగా పనిచేసింది. అయితే తాను గడపాల్సింది ఆఫ్రికాలో అన్న విషయం ఆమెకు తెలుసు. అదృష్టం ఆమెకు కలిసొచ్చింది. 1957లో కెన్యాలో ఉన్న ఒక నేస్తాన్ని కలుసుకోవడానికి ఆహ్వానం అందింది. కొద్ది నెలల తర్వాత సరుకులు రవాణా చేసే ఓడమీద బయలుదేరింది. ఆఫ్రికాలో ఉన్న సమయంలో ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన మానవ పరిణామవేత్త లూయీ ఎస్.బి. లీకీతో ఆమెకు పరిచయం కలిగింది. గూడాల్‌కు ఉన్న ఉత్సాహం చూసి ఆయన ముచ్చటపడ్డారు. తనకు సహాయకురాలిగా నియమించుకున్నారు. ఆల్డ్‌వాయ్ గార్జ్‌లో లీకీతో కలిసి ఆమె కూడా తవ్వకాలలో మునిగిపోయింది. ఆదిమ మానవుల అవశేషాల గురించి అన్వేషణ ప్రారంభించింది. వానరాలలో గూడాల్‌కు ఉన్న ఆసక్తిని గమనించిన లీకీ గోంబేలో చింపాంజీలపై పరిశోధకురాలిగా ఆమె పేరు సిఫారసు చేశారు.

కేవలం ఒక సాధారణ మహిళను పరిశోధకురాలిగా నియమించడానికి లీకీ తీసుకున్న నిర్ణయం వివాదాస్పదమైంది. అప్పటికి ఆమెకు కళాశాల డిగ్రీ లేదు. శాస్త్ర విషయాలలో శిక్షణా లేదు. అలాంటి వ్యక్తిని కష్టసాధ్యమైన శాస్త్ర పరిశోధనలకు వినియోగించడంపై విమర్శలు చెలరేగాయి. కానీ లీకీకి మాత్రం గూడాల్‌పై అపారమైన నమ్మకం ఉండేది. అయితే ఆయన సహచరులు మాత్రం ఆ అమ్మాయికి చింపాంజీలు కంటపడడమే కుదరని వ్యవహారం అని భావించేవారు. వారి అంచనాలను గూడాల్ తారుమారు చేసింది. కొద్ది రోజులపాటు లండన్‌లో పరిశోధనకు కావాల్సిన అధ్యయనం, సన్నాహాలు పూర్తి చేసుకున్న తరువాత తన తల్లిని తనకు సహాయకురాలిగా తీసుకుని గూడాల్

మళ్ళీ టాంజానియా చేరుకుని, అక్కడ అటవీ ప్రాంతంలో ఒక శిబిరం ఏర్పాటు చేసుకుంది. మొట్టమొదటిసారి ఆమె పొదల్లోకి వెళ్ళి చింపాంజీలను చూడగానే అవి ఆమెను బెదరించలేదు కానీ ఆమెను చూసినప్పుడల్లా పారిపోయేవి. అందువల్ల వాటి వెంటపడే బదులు కొత్త పద్ధతులను అనుసరించి చింపాంజీలను పరిశీలించాలని గూడాల్ నిర్ణయించుకుంది. ఒక మంచె ఏర్పాటు చేసుకుని దాని మీద కూర్చుని బైనాక్యులర్ సహాయంతో చింపాంజీల ప్రవర్తనా సరళిని గమనించేది. వాటి అలవాట్లను పరిశీలించేది. అవి కూడా ఆమెను పరిశీలించేవి. ఈ ఎత్తుగడ బాగా పని చేసింది. చింపాంజీలు గూడాల్‌ను చూస్తే భయపడడం మానేశాయి. తెల్లగా ఉన్న ఈ జీవికూడా తమలాగే ఒక వానరం అనుకోవడం మొదలుపెట్టాయి.

మంచె మీద కూర్చుని చింపాంజీలను పరిశీలిస్తూ గూడాల్ అనేక అద్భుతమైన కొత్త విషయాలను కనిపెట్టగలిగింది. తినడానికి ఉపయోగపడే చీమలను, చెదలను పట్టుకోవడానికి చింపాంజీలు పనిముట్లను తయారు చేసేవి. ఆ పుట్టలన్నీ తవ్వి వాటిని తినేవి. చింపాంజీలు తెలివైన వేటగాళ్లనీ, అవి మాంసాహారులని గూడాల్ కనిపెట్టింది. పరస్పరం కౌగిలించుకోవడం అన్నా, ముద్దు పెట్టుకోవడం అన్న, ఒకదాని చేయి మరొకటి పట్టుకోవడం అన్నా చింపాంజీలకు మహా సరదా. ఇంకా ఆశ్చర్యకరమైన అంశం ఏమిటంటే చింపాంజీలకు బహుశా ప్రేమించడం కూడా తెలుసు. చింపాంజీలకు కూడా మనుషులకు ఉన్నట్టుగానే అనేక రకాలైన భావోద్వేగాలు ఉంటాయని గూడాల్ కనిపెట్టింది. వాటికి కోపం, దుఃఖం ఉన్నాయి. ఈ అంశాలు కనిపెట్టడం చింపాంజీల గురించిన పరిశోధనల్లో పెద్ద ముందడుగు. శాస్త్ర పరిశోధనలో సాంప్రదాయిక పద్ధతులను విడనాడి గూడాల్ కొత్త పుంతలు తొక్కింది. ఆ చింపాంజీలకు గూడాల్ తమాషా తమాషా పేర్లు పెట్టేది. హత్య చేసే తత్వంగల పాం, ప్రలోభపెట్టే గుణం గల గిగీ లాంటి చింపాంజీ పేర్లు ప్రపంచానికి తెలిశాయి.

శాస్త్ర పరిశోధనా రంగంలోని వారు గూడాల్ పెట్టిన ఈ పేర్లను పరిహసించేవారు. కానీ తన ప్రయత్నాలకు మద్దతు కూడగట్టడంకోసం ఆమెకు ఈ పరిహాసాలే ఉపకరించాయి. చింపాంజీలు విశిష్టమైనవనీ, అవి మనుషుల్లాగే ఉన్నా, మనుషులు వాటిలా ఉండడం కాదని రుజువు చేయడానికి ఆమెకు ఈ పేర్లన్నీ ఉపయోగపడ్డాయి. ఆమెకు పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టిన రచనలన్నింటిలోనూ ఈ సాన్నిహిత్యానికి చాలా పెద్ద పాత్ర ఉంది. "మై ఫ్రెండ్స్ ది వైల్డ్ చింపాంజీస్" (1967), "ఇన్ ద షాడో ఆఫ్ మాన్" (1971), ఇన్నోసెంట్ కిల్లర్స్ (1971) లాంటివి గూడాల్ రాసిన ప్రసిద్ధ గ్రంథాలు. వీటితోపాటు ఆమె అనేక చిత్రాలు తీశారు. ప్రత్యేక టీవీ కార్యక్రమాలు రూపొందించారు. వ్యాసాలు రాశారు. ఇవన్నీ గూడాల్‌ను గత శతాబ్దంలోని ప్రసిద్ధ శాస్త్రవేత్తల సరసన నిలబెట్టాయి.

1965లో కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయం ఆమెకు పి. హెచ్.డి. ప్రదానం చేసింది. పట్టభద్రులు కూడా కాని వారికి పి. హెచ్.డి. డిగ్రీ ఇవ్వడం చాలా అరుదు. అంతకు ముందు మరో ఎనిమిది మందికి మాత్రమే ఈ అసాధారణ గౌరవం దక్కింది. ప్రకృతి దృశ్యాలను చిత్రీకరించే ఫోటోగ్రాఫర్ హ్యూగో వాన్‌లావిక్‌ను గూడాల్ పెళ్లి చేసుకుంది. వారిద్దరికీ ఒక కొడుకు పుట్టాడు. కానీ వారి వివాహబంధం నిలబడలేదు. 1974లో అతనికి విడాకులిచ్చి డెరిక్ బ్రైసన్‌ను పెళ్ళాడింది. డెరిక్ టాంజానియా పార్లమెంటు సభ్యుడు. డెరిక్ 1980లో మరణించాడు. ఇది గూడాల్‌ను బాగా కుంగదీసింది.

గూడాల్ చింపాంజీల సహజ ఆవాసాలను పరీక్షించాలని అలసట లేని పోరాటం కొనసాగించింది. చింపాంజీల ప్రవర్తన గురించిన మౌలిక సమాచారాన్ని గూడాల్ సి.డి.రామ్‌లోను, వీడియో టేపుల్లోనూ భద్రపరిచారు. అయితే తరచుగా సవ్యంగా చూడని వానరాలను పరిరక్షించేందుకు ఆమె కొనసాగించిన కార్యక్రమాలు అన్ని వేళలా విజయవంతం కాలేదు. 1994లో బోనులో ఉన్న ఒక చింపాంజీ ఆమె బొటనవేలు కొరికింది. ఇది అంతకు ముందు అనుభవం లేని వ్యవహారం. కాని ఆ చింపాంజీ గూడాల్ ఇచ్చిన అరటి పండు తీసుకుంది.

1874-
1965

# విన్‌స్టన్ చర్చిల్

"శత్రువు భయంకరమైన వెర్రి మేధావి. అపార ద్వేషంతో సమస్త మానవాళి హృదయాలను గాయపరచడానికి పూనుకున్నవాడు" అని హిట్లర్‌ను వర్ణించాడు. అతని చేష్టలు ఎంత ప్రమాదమో గుర్తించి ఎదురులేని నియంతను ఎదిరించి నిలిచిన ధీరాదాత్తుడు, యుద్ధ నిపుణుడు, తిరుగులేని నాయకుడు అతనే గ్రేట్ బ్రిటిషర్ విన్‌స్టన్ చర్చిల్. హిట్లర్ గురించి చర్చిల్ అన్న మాటలు కవితాత్మకమైనవి. ప్రస్ఫుటమైనవి. పదే పదే పునరుక్తం చేయగలిగినవి. చర్చిల్ శిక్షణ రీత్యా సైనికుడే అయినా రాజనీతిజ్ఞుడుగా, సైనికుడిగా, జర్నలిస్టుగా ఆయన జీవితం బహుముఖ ప్రజ్ఞా విశేషాల నిలయం. రెండవ ప్రపంచ యుద్ధం తొలినాళ్లలో జర్మనీ దాడులతో బ్రిటన్ అస్తిత్వమే సంక్షోభంలో పడింది. అలాంటి చీకటి సమయంలో ఆ ఒక్కడు జాతికి ఆశాజ్యోతిగా నిలిచాడు. జాతిని ఒక్కతాటిపై నిలిపి కార్యోన్ముఖులను చేశాడు. హిట్లర్‌కు వ్యతిరేకంగా తన వాగ్ధాటితో ప్రజల్లో కదనకుతూహలం రగిలించి వారిని కర్తవ్య పరాయణులను చేశాడు. రెండో ప్రపంచయుద్ధంలో అటో ఇటో తేలిపోయే రోజున బ్రిటిష్ నావికాదళంతోపాటు నార్మండీ వెళ్లాలని చర్చిల్ సంకల్పించాడు. కాని ఆరవ జార్జి చక్రవర్తి స్వయంగా నివారించడంవల్ల ఆయన ఆగిపోవలసి వచ్చింది.

అది రెండవ ప్రపంచ యుద్ధ సమయం. బ్రిటన్‌కు అత్యంతక్లిష్ట సమయం. హిట్లర్ నాయకత్వంలోని నాజీ జర్మనీ దూకుడుకు అడ్డుకట్ట వేయడానికి బ్రిటన్ శాయశక్తులా ఒంటరిపోరు చేస్తోంది. ఆ సమయంలో జాతి పగ్గాలు చేపట్టాడు చర్చిల్. అపార సైనిక అనుభవం, వ్యూహరచనా శక్తి ఉన్న వ్యక్తి. నాజీ జర్మనీకి వ్యతిరేకంగా కదనరంగంలోకి రమ్మని చర్చిల్ అమెరికాను అనేకసార్లు కోరాడు. అయినా అమెరికా ఆయన అభ్యర్థనను మన్నించలేదు. తనదాకావస్తేనే గానీ తెలియదన్నట్లు పెరల్ హార్బర్‌పై జపాన్ దాడి చేయడంతో అమెరికా అయిష్టంగానే రెండవ ప్రపంచ యుద్ధ రంగంలోకి ప్రవేశించింది. అమెరికా యుద్ధ రంగ ప్రవేశం రోజున తాను నిశ్చింతగా నిద్రపోయానని చర్చిల్ అన్నాడు. స్వతహాగా చిత్రకారుడు అయిన చర్చిల్‌కు గార్డెనింగ్ అంటే ఇష్టం. మార్ల్‌బొరో రాచవంశపు ప్రతినిధి అయిన లార్డ్ రాండోల్ఫ్ చర్చిల్ తండ్రి. చర్చిల్ తల్లి జెన్నీ జెరోమ్ అమెరికన్ జాతీయురాలు.

బ్లెన్‌హీమ్ రాజభవనంలో పుట్టిపెరిగిన చర్చిల్ రాచబిడ్డల వారసత్వాన్ని కొనసాగిస్తూ శాండ్‌హర్స్ట్ లోని రాయల్ మిలటరీ కాలేజి నుంచి 1894లో ఉత్తమ సైనికుడిగా ఉత్తీర్ణులయ్యారు. ఆయన హుస్సార్స్ అశ్విక దళానికి అధిపతిగా నియమితులై భారతదేశంతో పాటు వివిధ దేశాల్లో పనిచేశారు. సూడాన్‌లో ఓ సంవత్సరం పనిచేశాక నైలు దండయాత్రలో పాల్గొన్నారు. ప్రసిద్ధ ఒమ్‌దర్మన్ యుద్ధంలో పాల్గొని విజయం సాధించారు. తర్వాత ఆయన సైనికుడిగా తనకు ఉన్న అనుభవాన్ని ఉపయోగించుకుని యుద్ధ విలేకరిగా దక్షిణాఫ్రికాలో పనిచేశారు. అక్కడ పనిచేస్తున్నప్పుడు బోయెర్లకు పట్టుబడి వారినుంచి తప్పించుకుని రావడంతో చర్చిల్ ఒక్కసారిగా వెలుగులోకి వచ్చాడు. ప్రజలలో పేరుప్రఖ్యాతులు సంపాదించాడు. దీనివల్ల 1900లలో చర్చిల్ పార్లమెంటు సభ్యుడై రాజకీయ జీవితాన్ని ఆరంభించాడు. అప్పటికి ఆయన వయసు కేవలం 26 సంవత్సరాలు మాత్రమే. 1906లో ఆయనకు కేబినెట్ హోదా కల్పించారు. 1911లో పరిపాలన విభాగంలో ఆయన లార్డ్ స్థానాన్ని అలంకరించాడు. ఈ హోదాలో మొదటి ప్రపంచ యుద్ధం సందర్భంగా బ్రిటన్ నౌకాదళ మోహరింపును ఆయన స్వయంగా పర్యవేక్షించాడు. చర్చిల్ నేతృత్వంలో టర్కీతో డర్డెనెల్లెస్ వద్ద జరిగిన పోరులో బ్రిటన్ భారీగా నష్టాలను చవిచూడడంతో ఆయన హోదాను తగ్గించి రాయల్ స్కాట్స్ విభాగానికి బదిలీ చేశారు. 1917లో ఆయుధాగార మంత్రిగా పదవీబాధ్యతలు చేపట్టిన చర్చిల్ ప్రపంచంలోనే

మొట్టమొదటిసారిగా 'యుద్ధ ట్యాంకు'కు తుదిరూపునిచ్చి మొదటి ప్రపంచ యుద్ధంలో జర్మనీని నిలువరించాడు. తర్వాత ఆయన వలసవాద సెక్రెటరీగా పనిచేశాడు. తర్వాత ఆయనను ప్రభుత్వ ఖజానాకు చాన్సెలర్‌గా నియమించారు. దీంతో బ్రిటన్‌లో తొలిసారిగా ఆయన బంగారపు నిల్వలకు అనుగుణంగా ద్రవ్య నిల్వలను ఏర్పాటుచేసే పద్ధతిని ప్రవేశపెట్టాడు. నిరుద్యోగానికి వ్యతిరేకంగా 1926లో తలెత్తిన సాధారణ సమ్మెను ఆయన చాకచక్యంగా పరిష్కరించాడు. అయినా 1929లో ఆయన పదవి కోల్పోయాడు.

దీనితో మళ్లీ వెలుగులోంచి చీకట్లోకి వెళ్లిపోయి ఒక్కసారిగా చర్చిల్ ప్రాధాన్యతను, ప్రాభవాన్ని కోల్పోయాడు. అయితే జీవితంలో ఎదురైన సవాళ్లనే మెట్లుగా మార్చుకుని విజయలక్ష్యం దిశగా సాగిపోయిన చర్చిల్ సమయం కోసం వేచిచూశాడు. "ఉపయోగించని కత్తి తుప్పు పడుతుంద"ని ఎరిగిన చర్చిల్ ఖాళీ సమయాల్లో తన నైపుణ్యాలకు మరింత మెరుగులు దిద్దుకునేవాడు. జర్మనీలో హిట్లర్ ఎదుగుదల బ్రిటన్‌కు వినాశకారిగా మారుతుందని ముందే పసిగట్టి ప్రభుత్వాన్ని పార్లమెంటు సాధారణ సభలో హెచ్చరించాడు. 1939 సెప్టెంబర్‌లో జర్మనీ, పోలెండ్‌ను ఆక్రమించడంతో ఆయన హెచ్చరికలు నిజమయ్యాయి. దీనితో ప్రజల నుంచి వచ్చిన ఒత్తిడితో అప్పటి బ్రిటీష్ ప్రధానమంత్రి చర్చిల్‌ను తిరిగి పరిపాలనా విభాగపు లార్డ్‌గా నియమించాడు. జర్మనీ సంపూర్ణంగా లొంగిపోవాలని చర్చిల్ కోరాడు. అప్పటికి ఆయన వయస్సు 65 సంవత్సరాలు. 1940లో ఆయన బ్రిటన్ ప్రధానమంత్రిగా ఎన్నికయ్యాడు. వెంటనే ఆయన తన రణనినాదాన్ని ప్రకటించి సైనికుల్లో, ప్రజల్లో సమరోత్సాహాన్ని నింపారు. 'విజయం... ఎన్ని కష్టనష్టాలకు ఓర్చయినా విజయం సాధించాలి. బీభత్సాన్ని అడ్డుకుని విజయం సాధించాలి. కఠోర శ్రమకు ఓర్చి గమ్యాన్ని చేరుకోవాలి.' తను 'రక్తాన్ని, స్వేదాన్ని, కన్నీళ్లను, కష్టాలను' మాత్రమే అందజేస్తానంటూ ప్రజలకు పిలుపునిచ్చాడు చర్చిల్. వారిని కార్యోన్ముఖులను చేసి ఆయన లక్ష్యాన్ని సాధించాడు. అంతటి యుద్ధ సమయంలో పరిణతిని కనబరుస్తూ శత్రువులను సైతం ప్రశంసించాడు. జర్మన్ సేనాని రోమెల్ ఆఫ్రికాలో సాధించిన విజయాలను మెచ్చుకున్నాడు. జర్మన్ సైన్యాలను ఓడించిన సైద్ధాంతిక శత్రువు రష్యానూ మెచ్చుకున్నాడు. మిత్రపక్షాల అధినేతగా యుద్ధ వ్యూహాలను చాకచక్యంగా అమలుపరుస్తూ యుద్ధ కోవిదుడనిపించుకున్నాడు చర్చిల్. యుద్ధానంతరం వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా రూజ్‌వెల్ట్, స్టాలిన్‌లతో ఒప్పందాలను కుదుర్చుకుని ఆయన రాజనీతిజ్ఞుడనిపించుకున్నాడు.

అయితే చంద్రునిలో కూడా మచ్చలున్నట్లు విమర్శకులు చర్చిల్‌ను తెగిడారు. బ్రిటన్ ఆధీనంలోని వలస రాజ్యాలకు స్వాతంత్ర్యం ఇవ్వడానికి వ్యతిరేకించినందుకు ఆయన్ను తిరోగామిగా, ముందుచూపు లేనివాడిగా విమర్శకులు అభివర్ణించారు. తూర్పు యూరప్‌లో సోవియెట్ యూనియన్ ప్రాబల్యం పెరగడానికి స్టాలిన్‌కు ఆయన ఇచ్చిన రాయితీలే కారణమని బ్రిటీష్ విమర్శకులు అంటారు. కానీ ఆయన తన అమూల్యమైన అనుభవాన్ని భావి తరాలకు అందించాడు. యుద్ధ సమయంలో ఆయన కనబరిచిన గుండె నిబ్బరం, 1951–1955 శాంతి సమయంలోని ఆయన నాయకత్వం మరపురానివి. చర్చిల్ రాసిన ఆరు భాగాల 'రెండవ ప్రపంచ యుద్ధం' పుస్తకంతో 1953లో ఆయన నోబెల్ సాహిత్య పురస్కారాన్ని అందుకున్నాడు. చర్చిల్ జీవితమే ఓ అమూల్యమైన పాఠం. 20వ శతాబ్దపు మహా నాయకుల్లో ఆయన అగ్రగణ్యుడు. బ్రిటన్‌కే కాదు యావత్ ప్రపంచానికి ఆయన ఓ ధీరోదాత్త నాయకునిగా చరిత్ర పుటల్లో సజీవంగా ఉన్నారు.

1910–
1995

# సుబ్రమణ్యం చంద్రశేఖర్

1935వ సంవత్సరం. జనవరి 10వ తేదీ లండన్ నగరంలోని రాయల్ ఆస్ట్రోనాటికల్ సొసైటీ సమావేశ మందిరం శాస్త్రవేత్తలతో నిండిపోయి ఉంది. పాతికేళ్లయినా నిండని ఒక నవయువకుడు అప్పుడే తన శాస్త్ర ప్రసంగాన్ని ముగించి కూర్చున్నాడు. తాను కనిపెట్టిన ఓ ఖగోళ రహస్యాన్ని రాయల్ సొసైటీ సభ్యులకు చక్కగా వివరించగలిగానన్న గర్వం అతడి ముఖంలో తొణికిసలాడుతోంది. అంతలోనే, సర్ ఆర్థర్ ఎస్. ఎడ్డింగ్టన్ ప్రసంగం ప్రారంభమైంది. నక్షత్ర నిర్మాణంపై ఆయన మాట వేదముగా చెల్లుతున్న రోజులవి. ఎవరైనా సరే తమ కొత్త ప్రతిపాదనలను ముందుగా ఆయనతో చర్చించేవారు. అంతటి వాడికి నచ్చని ఓ విప్లవాత్మక సిద్ధాంతాన్ని రాయల్ సొసైటీ సమావేశంలో ప్రకటించడమా? అదీ సైన్సులో అప్పుడే కళ్లు తెరచిన ఓ పసిగుడ్డు, ఇంకా చెప్పాలంటే తమ ఏలుబడిలోని ఓ దాస్య దేశం నుంచి వచ్చినవ్యక్తి... సహించడానికి వీల్లేదనుకున్నాడు. శాస్త్రప్రతిపాదనను చీల్చి చెండాడాడు. నిప్పులు కక్కాడు. గణితం, భౌతిక శాస్త్రం రెంటిలో ఏదీ పూర్తిగా తెలియదని హేళన చేశాడు. జోకుల మీద జోకులు వేశాడు. సమావేశ మందిరాన్ని నవ్వులతో హోరెత్తించాడు. తన కసి తీర్చుకున్నాడు. యువ పరిశోధకుడు తన పరిశోధనలకు శాశ్వతంగా స్వస్తి పలికి స్వదేశం వెళ్లి పోవాలనుకున్నాడు. కళ్ళనీళ్ల పర్యంతమయ్యాడు. అయితే చరిత్రలో ఇలా అవమానాలు పొందిన మహామహా శాస్త్రవేత్తలను ఒక్కక్షణం తల్చుకుని తన నిర్ణయం మార్చుకున్నాడు. తన సిద్ధాంతపు రాత ప్రతులను ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఖగోళ, భౌతిక శాస్త్ర మేధావులకు పంపించాడు. దాన్ని చదివిన ఐన్‌స్టీన్ ముగ్ధుడయ్యాడు. స్వయంగా జర్మన్‌లోకి అనువదించి జర్మనీ సైన్స్ జర్నల్‌లో ప్రచురింపజేశారు. ఇతర శాస్త్రవేత్తలు కూడా ఔనన్నారు. రాయల్ సొసైటీలో బ్రిటీష్ శాస్త్రవేత్తల దారుణ పరాభవానికి గురైన ఆ అసాధారణ మేధావి పేరు సుబ్రమణ్యం చంద్రశేఖర్. అతడు భారతీయుడు.

"చంద్రశేఖర్ లిమిట్"గా సుప్రసిద్ధమైన ఆ ఖగోళ భౌతిక సిద్ధాంతం 1955లో 20 ఏళ్ల తరువాత ప్రయోగపూర్వక ఆధారాలతో రుజువైంది. మరో 28 సంవత్సరాలు గడిచాక దానికే నోబెల్ ప్రైజు లభించింది. చంద్రశేఖర్‌కు నోబెల్ పురస్కారం అంత ఆలస్యం కావడానికి ఎడ్డింగ్టన్ తుచ్ఛమైన స్వభావం ఒక కారణం. ఇండియన్ సైన్స్ పాలిట విలన్లలో ఈ ఇంగ్లీష్ శాస్త్రవేత్త ఒకడు.

1910 అక్టోబరు 19న లాహోర్‌లోని ఓ మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన సుబ్రమణ్యం చంద్రశేఖర్ చెన్నై హిందూ హైస్కూల్‌లో పాఠశాల విద్య పూర్తి చేశాడు. అక్కడే ప్రెసిడెన్సీ కాలేజి నుంచి భౌతిక శాస్త్రంలో బి.ఎ. (ఆనర్స్) డిగ్రీ తీసుకున్నాడు. సైన్స్‌నే వృత్తిగా స్వీకరించాలని అప్పటికే నిర్ణయించుకున్నాడు. కాలేజీలో ఫిజిక్స్‌తోపాటు గణితం క్లాసులకూ హాజరయ్యేవాడు. తనంతతానుగా ఉన్నత గణిత శాస్త్రం అధ్యయనం చేశాడు. మేనమామ సి.వి.రామన్ వలే, బి.ఎ. చదువుతున్నప్పుడే సైంటిఫిక్ పేపర్ రాశాడు. లండన్ 'రాయల్ సొసైటీ ప్రొసీడింగ్స్ జర్నల్ దీన్ని ప్రచురించింది. చిన్నప్పటి నుంచి చంద్రకు పుస్తకాలు చదవటమంటే ఇష్టం. ప్రతి రోజూ లైబ్రరీకి వెళ్లేవాడు. ఫిజిక్స్‌లో కనిపించిన ప్రతి పుస్తకం చదివేవాడు. ఏదైనా స్వతంత్రంగా అధ్యయనం చేసి తెలుసుకోవాలన్నది అతడి అభిమతం. జీవితాంతం అలాగే చేశాడు.

కేంబ్రిడ్జి ట్రినిటీ కాలేజిలో ఉన్నతాభ్యాసానికి చంద్ర 1930లో ఇంగ్లాండు బయలుదేరాడు. నౌకలో చేసిన రెండు వారాల ప్రయాణం చంద్ర భవిష్యత్తునే మార్చివేసింది. ఖగోళ భౌతిక శాస్త్రంలో గొప్ప శాస్త్రవేత్తగా ఆవిర్భవించడానికి ఆ ప్రయాణంలోనే అంకురార్పణ జరిగింది. ఓడలో ఉంటూ ఆయన శ్వేత నక్షత్రాల (వైట్‌డ్వార్ఫ్‌లు) గురించి ఆలోచించాడు. 'చంద్రశేఖర్ లిమిట్' ఐడియా అప్పుడు వచ్చిందే. 1937లో అమెరికా వెళ్లిన చంద్రశేఖర్ అక్కడే శాశ్వతంగా స్థిరపడ్డాడు.

ఆకాశంలో మిణుకు మిణుకుమంటూ కనిపించే చుక్కలు నిజానికి భగభగ మండిపోతూ ఉండే భారీ

అగ్నిగోళాలు. సూర్యుడి కంటే ఎన్నో రెట్లు ప్రకాశంతో ఉండే బృహత్తారల నుంచి అతి తక్కువ వెలుగునిచ్చే మరుగుజ్జు తారల వరకూ... మనం చూసే చుక్కల్లో ఉంటాయి. మరుగుజ్జుతార (వైట్‌డ్వార్ఫ్) ప్రకాశం సూర్యుడిలో వెయ్యోవంతే ఉంటుంది. సూపర్‌జెయింట్ నక్షత్రానికీ భూమంత ఉండే వైట్ డ్వార్ఫ్‌కూ వాటి ప్రకాశంలో ఉండే వ్యత్యాసం ఫ్లడ్‌లైట్‌కూ అగ్గిపుల్లకూ ఉన్నంత ఉంటుంది.

నక్షత్రం కేంద్ర స్థానంలో అణు సంయోగ చర్యవల్ల హైడ్రోజన్ వాయువు హీలియంగా మారుతూ విపరీతమైన శక్తి వెలువడుతుంది. ఈ విద్యుదయస్కాంత ధార్మిక శక్తి (రేడియేషన్), పదార్థాన్ని బయటకు నెట్టివేసే శక్తి. ఇక ద్రవ్యరాశి సృష్టించే గురుత్వాకర్షణశక్తి పదార్థాన్ని లోపలికి గుంజివేస్తుంటుంది. ఈ రెండూ సరిసమానంగా ఉంటూ నక్షత్రం అదే సైజులో ఉండేట్లు బ్యాలెన్స్ చేస్తాయి. కేంద్రకంలో అణు సంయోగ చర్యలకు అవసరమైన ఇంధనం తరిగిపోయినప్పుడు, రేడియేషన్ తాలూకు 'ఔట్‌వర్డ్ ఫోర్స్' కూడా క్షీణిస్తుంది. గురుత్వాకర్షణ శక్తిది పై చేయిగా మారి నక్షత్రాన్ని దగ్గర దగ్గరకు లాగివేస్తుంది. నక్షత్రం చివరకు భూగోళమంత చిన్నదిగా మారి 'వైట్‌డ్వార్ఫ్' లేదా న్యూట్రాన్ స్టార్‌గా మిగిలిపోతుంది. సాంద్రత లేదా గురుత్వాకర్షణ శక్తి అనంతంగా పెరిగే అవకాశం కూడా ఉంటుంది. అలా జరిగినప్పుడు ఆ నక్షత్రం పూర్తిగా చనిపోయి కృష్ణబిలం (బ్లాక్‌హోల్) అవుతుంది. అక్కడ పదార్థం సాంద్రత అనంతంగా ఉంటుంది. కాంతి కూడా దాని గురుత్వాకర్షణ శక్తినుంచి తప్పించుకుని పోలేదు. అందుకే అది వెలుగునివ్వదు. వైట్‌డ్వార్ఫ్‌లోంచి ఒక టీ స్పూన్ పదార్థం భూమ్మీదకు తెచ్చి తూకం వేస్తే ఐదున్నర టన్నులు తూగుతుంది. అదే బ్లాక్‌హోల్‌లో టీ స్పూన్ పదార్థం బరువు వేల వేల టన్నులు ఉంటుంది. మన పాలపుంతలోనే మరుగుజ్జు నక్షత్రాలు ఎన్నో ఉన్నాయి. ఒక పెద్ద కృష్ణబిలం కూడా ఉందని శాస్త్రవేత్తలు అనుమానిస్తున్నారు.

అత్యంత ప్రకాశమానంగా ఉండే సైరస్ నక్షత్రానికి జంటగా 'సైరన్-బి' అనే తార ఉంది. ఇది వైట్‌డ్వార్ఫ్. ఈ 'సైరస్-బి' తారే 1920లో చంద్రశేఖర్ కొత్త సూత్రీకరణకు, అతడిపై ఎడ్డింగ్టన్ అసహనానికి దారి తీసింది. నక్షత్రం ద్రవ్యరాశి, దాని వ్యాసం మధ్యఉండే సంబంధాన్ని చంద్రశేఖర్ కనిపెట్టాడు. వైట్‌డ్వార్ఫ్‌లోని ద్రవ్యరాశి ఒక పరిమితికి మించి ఉంటే దాని బరువుకు అదే కుంగిపోయి 'న్యూట్రాన్ స్టార్'గానో, 'బ్లాక్ హోల్'గానో అంతరించిపోతుంది. సూర్యుడి ద్రవ్యరాశి కంటే వైట్‌డ్వార్ఫ్ ద్రవ్యరాశి 1.4 రెట్లు మాత్రమే ఉండాలని, అంతకు మించితే అది కుప్పకూలి మృత నక్షత్రం అవుతుందని చంద్రశేఖర్ గణిత సమీకరణాలతో సూత్రీకరించాడు. దీన్నే ఖగోళ భౌతిక శాస్త్రవేత్తలు 'చంద్రశేఖర్ లిమిట్' అంటారు. ఆయన విరామమెరుగని శాస్త్రవేత్త. 1995లో చనిపోయేంత వరకూ పరిశోధనలు కొనసాగించాడు. బ్లాక్‌హోల్ థియరీ మీద ఆయన చివరి మోనోగ్రాఫ్ (కేవలం ఒక విషయం మీద ప్రత్యేకంగా రాసే గ్రంథం) రాశాడు.

నక్షత్రాలు, కృష్ణబిలాలే కాదు, చంద్రశేఖర్ కు సాహిత్యం, సంగీతం అన్నా మక్కువే. లలిత కళలకూ సైన్స్‌కు ఉన్న సంబంధం విడదీయరానిదని ఆయన నమ్మకం. 'ట్రూత్ అండ్ బ్యూటీ', 'ఈస్థటిక్స్ అండ్ మోటివేషన్ ఇన్‌సైన్స్' పుస్తకాలు ఈ విషయంపై చంద్రశేఖర్ ఆలోచనలకు దర్పణం పడతాయి. అమెరికా పౌరుడినని చెప్పుకున్నప్పటికీ ఆయన భారతీయ సంస్కృతిని మర్చిపోలేదు. మద్రాస్ వస్తూ ఉండేవారు. అమెరికాలో ఆయన ఇంటికి వెళ్తే కర్నాటక సంగీతం వినిపిస్తూ ఉండేది. అక్కడ చంద్రశేఖర్ ధోవతీతో దర్శనమిచ్చేవారు.

1995లో చికాగోలో కన్నుమూసిన ఈ మహోన్నత శాస్త్రవేత్తకు అమెరికా తగిన గుర్తింపు ఇచ్చింది. నాసా అంతరిక్ష అబ్జర్వేటరీకి 'చంద్ర' అని పేరుపెట్టి ఘన నివాళి అర్పించింది.

1889-
1977

# చార్లీ చాప్లిన్

చార్లీ చాప్లిన్ తనను బాగా గుర్తు పెట్టుకోవాలను కున్న సినిమా 'గోల్డ్‌రష్'. ఆ సినిమాలో అల్లరి చిల్లరగా, ఆవారాగా తిరిగే చాప్లిన్ పాత్ర ఒక పాత బూటును వండి, మంచి భోజన ప్రియులు ఆరగించినట్టుగా ఆరగిస్తుంది. ఒకవైపు విషాదాన్ని, మరోవైపు మోదాన్ని కలగలిపిన ఇలాంటి దృశ్యాలు ఆ చిత్రం స్థాయిని అమోఘంగా పెంచాయి. అలాటి వాటివల్లనే చాప్లిన్ చిత్రాలు కవిత్వాంశను సంతరించుకున్నాయి. మానవత్వపు విలువలను నింపుకున్నాయి. చాప్లిన్ చిత్రాల్లోని ఇలాంటి ఉదాత్త భావాలు, గేయ కావ్యాల స్వభావం ఆయన సినిమాలు వాణిజ్యపరంగా కూడా విజయవంతం కావ డానికి ఉపకరించాయి.

పూర్తి అమాయకత్వం, కటిక పేదరికం, పని పాటా లేని ఆవారాగా తిరుగుతున్నట్టు కనిపించే పాత్రలు ప్రశంసలు పొందేవి. జనం ఆ పాత్రలో తాదాత్మ్యం చెందేవారు. అనుభూతి పొందేవారు. ప్రపంచ వ్యాప్తంగా ప్రేక్షకులను చాప్లిన్ ఇలాంటి లక్షణాలతో బాగా ఆకట్టుకున్నాడు. చింపిరి గుడ్డలు, విచిత్రంగా కనిపించే వస్త్రధారణ, విశిష్టంగా కనిపించే మీసాలు, దేశ దిమ్మరితనం చాప్లిన్‌ను సర్వజనామోదయోగ్యంగా మలిచాయి. ఒక చేతి కర్ర, విచిత్రమైన టోపీ, ఆహ్లాదకరమైన చొరవ, వ్యవహార కుశలతతో చాప్లిన్ తన కష్టనష్టాలను, ఇబ్బందులను మరిచి పోయేట్టు చేయగలిగేవాడు. తర్వాత తర్వాత చాప్లిన్ చలన చిత్ర జీవితంలో ఆయన పాత్రలు, వాటికి ఉన్న జనాదరణ క్రమంగా రాజకీయ విమర్శనాధోరణిని కూడా సంతరించుకున్నాయి. మొదటి ప్రపంచయుద్ధ సమయంలో ఆయన సైన్యంలో చేరనందుకు విమర్శలకు దిగిన వారూ ఉన్నారు. కాని వైద్య పరీక్షల్లో ఆయన సైన్యంలో చేరడానికి అనర్హుడని తేలింది. ఆయన అమెరికాలో నాలుగు దశాబ్దాలపాటు జీవించినా, అదీ పన్నులు చెల్లించనవసరం లేని సదుపాయాలు పొందినా అమెరికా పౌరసత్వం స్వీకరించినందుకు దుమ్మెత్తిపోసినవా రూఉన్నారు. 1940లలో ఆయన కమ్యూనిస్టులవైపు మొగ్గే స్వభావం ఉన్నవాడు అన్న నిందలు కూడా మోయాల్సి వచ్చింది. అమెరికాకు అనుకూలంగా వ్యవహరించని వారిని విచారించడానికి ఏర్పాటు చేసిన కమిటీ ముందు హాజరైనప్పుడు ఆయన తాను కమ్యూనిస్టు అనుకూలుడి నన్న ఆరోపణలను గట్టిగా వ్యతిరేకించాడు.

చాప్లిన్ తనకు వామపక్ష భావాలు ఉన్నాయన్న అంశాన్ని నిరాకరించినా ఆయన అట్టడుగు వర్గాలవారిపట్ల అపారమైన సానుభూతి చూపేవారు. ఆయన తండ్రి తాగుబోతు. తల్లికి మానసిక స్థిమితం ఉండేది కాదు. వారిద్దరూ ఒక సంగీత నృత్య బృందంలో పనిచేసేవారు. సవతి తల్లి కొడుకు సిడ్నీతో కలిసి లండన్‌లోని మురికివా డల్లో చాప్లిన్ దుర్భరమైన జీవితం గడిపాడు. ఈ అనుభవమే చాప్లిన్ అన్ని రకాల బహిష్కృతులతో మమేకం కావడానికి, పేదరికం అంటే జీవితాంతం జడుసుకోవ డానికి దోహదం చేసింది.

చిల్లర డబ్బులకోసం చాప్లిన్ వీధుల్లో నృత్యం చేసేవాడు. ఎనిమిదో ఏటనే యైట్ లంకాషైర్ లాడ్స్ అన్న నృత్యబృందంతో కలిసి రంగస్థలం మీద ప్రదర్శనలు ఇవ్వడం ప్రారంభించాడు. కౌమార దశలో ఉన్నప్పుడు ఫ్రెడ్ మోటు సరసాన్ని ప్రదర్శించే ఒక నాటక బృందంతో కలిసి ప్రదర్శనలు ఇచ్చేవాడు. హాస్య నటుడిగా తన కౌశలానికి మెరుగులు దిద్దుకున్నారు. గారడి విద్యలతో ఆకట్టుకునేవాడు. ఈ లక్షణాలే నటుడిగా ఆ తర్వాత ఆయనకు బాగా ఉపకరించాయి. 21 ఏళ్ళ వయసు వచ్చేసరికి లండన్‌లోని సంగీత కచేరీల్లో చాప్లిన్ పేరు మారు మోగిపోయేది. మూకీ హాస్య చిత్రాలలో అగ్రగామి అయిన మాక్ సెన్నెట్, చాప్లిన్‌లో ఉన్న ప్రతిభను కనిపెట్టి 1913లో హాలీవుడ్‌కు తీసుకొచ్చాడు. అక్కడ వారానికి 150 డాలర్ల వేతనంతో కొత్తగా ఏర్పాటైన కీ

స్టోన్ స్టూడియోలో ఉద్యోగంలో పెట్టాడు. బహుముఖ ప్రజ్ఞాపాటవాలు గల చాప్లిన్ ఏడాది కాలంలోనే కీ స్టోన్ రూపొందించిన 35 కార్యక్రమాల్లో పాల్గొన్నాడు. వీటిలో చాలా వాటికి రచయిత, దర్శకుడు కూడా చాప్లీనే. అదే సమయంలో తన వేషధారణకు, వ్యక్తిత్వానికి, హావ భావాలకు పదును పెట్టుకున్నాడు. వదులుగా ఉండే పంట్లాలు వేసుకునేవాడు. 1915లో ఎస్సేనే ఫిల్మ్ కంపెనీతో ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఆ సంవత్సరంలోనే వెండి తెరమీద చాప్లిన్ పాత్రకు స్ఫూర్తి కలిగించిన 'ది ట్రాంప్' విడుదలైంది. మేరీ ఫిక్ ఫోర్డ్, డి. డబ్ల్యు. గ్రిఫిత్, డగ్లస్ ఫేర్ బాంక్స్‌తో కలిసి యునైటెడ్ ఆర్టిస్ట్స్ కార్పొరేషన్ ఏర్పాటు చేయడానికి తోడ్పడ్డాడు. చిత్ర పరిశ్రమలో ఇదే మొట్టమొదటి స్వతంత్ర చిత్ర నిర్మాణ కంపెనీ. నాలుగేళ్ళ తర్వాత ఈ కంపెనీ ఆధ్వర్యంలో 'ఎ ఉమెన్ ఆఫ్ పారిస్' అన్న తొలి చిత్రం రూపొందించాడు. 1920లలో టాకీ సినిమాలు వచ్చిన తర్వాత కూడా చాప్లిన్ వాటికి దూరంగానే ఉన్నాడు. "నేను మాట్లాడితే ఇతర హాస్య నటుల్లాగే ఉంటాను కదా" అని అనేవాడు 1940లో 'గ్రేట్ డిక్టేటర్' చిత్రంలో మాత్రమే చాప్లిన్ సంభాషణలు వినిపిస్తాయి. అందులో ఆయన హిట్లర్‌ను పోలిన పాత్ర పోషించాడు. అందులో చాప్లిన్ ప్రపంచ భూగోళం మీద ఒంటి కాలి మీద గిరగిరా తిరుగుతూ ఉంటాడు. అదే చిత్రంలో యూదు మంగలి పాత్రను కూడా పోషించి ద్విపాత్రాభినయం చేశాడు. 'మాన్యువల్ వెర్డాక్స్' (1947) వంటి చాప్లిన్ చిత్రాలు హితబోధలకు అధిక ప్రాధాన్యం ఇచ్చేవిగా తయారయ్యాయి. మాన్యువల్ వెర్డాక్స్ యుద్ధ వ్యతిరేకి. దీనితో చాప్లిన్‌ను అమెరికా నుంచి బహిష్కరించాలన్న ఉద్యమం మొదలైంది. కాని ఇది అంతగా ఊపందుకోలేదు. చాప్లిన్‌ను హాస్యనటుడిగా మాత్రమే చూడడానికి అలవాటు పడిన ప్రేక్షకులు ఆయనను సిటీ లైఫ్ వంటి చిత్రాల్లో చాప్లిన్ పాత్రలను జనం జీర్ణించుకోలేకపోయారు. నిజ జీవితంలో చాప్లిన్ కోటీశ్వరుడు కావడం, అతను ఎదుర్కొన్న పన్ను ఎగవేత, బాగా ప్రచారంలోకి వచ్చిన విడాకులు, నవ యవ్వనవతులంటే మోజు, అక్రమ సంతానానికి సంబంధించిన వ్యాజ్యాలు మొదలైనవి చాప్లిన్‌కు ఉన్న గ్లామర్ తగ్గడానికి కారణాలయ్యాయి. లండన్‌లో 'లైమ్‌లైట్' అన్న చిత్రం తొలి ప్రదర్శనకు హాజరుకావడానికి వెళుతూ అట్లాంటిక్ సముద్రాన్ని దాటుతున్నప్పుడు తాను తిరిగి వచ్చే సరికి తన నడవడిక, తన శీలం విమర్శలకు గురవుతాయని చాప్లిన్ గ్రహించాడు. ఇక అమెరికాకు తిరిగి వెళ్ళకూడదని నిర్ణయించుకున్నాడు. 1972లో జీవిత కాలంలో అతను సాధించిన విజయాలకు సంకేతంగా అకాడమీ అవార్డు అందుకోవడానికి మాత్రం 1972లో అమెరికా వచ్చాడు.

ఆయన నిందారోపణలు, రాజకీయాలు, ఇబ్బంది కలిగించే ఆయన స్వభావం అన్నీ కలగలిసి ప్రపంచ వ్యాప్తంగా ఆయనకున్న కీర్తి ప్రతిష్ఠలు కాస్తా తరిగిపోయాయి. జీవిత చరమాంకంలో చాలా వరకు భార్య ఊనాకు దూరంగానే ఉన్నాడు. అయితే కాలగమనంలో ఒక్కసారి వెనక్కు తిరిగి చూస్తే సినిమాకు చాప్లిన్ చేసిన సేవ విశిష్టమైందిగానే కనిపిస్తుంది. ఆయన చేసిన సేవలకు గుర్తింపుగా 1972లో ఎలిజబెత్ రాణి చాప్లిన్‌కు 'సర్' అన్న బిరుదు ఇచ్చింది. ఆయన సినిమాల మీద అనేక ప్రశంసలు వచ్చాయి. ఆయన బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఆయన రచయిత, నిర్మాత, దర్శకుడు, ఎడిటర్, నటుడు, సంగీత దర్శకుడు. 'సిటీ లైట్స్' అన్న చిత్రంలో ఆయన ముకాభినయం ఆయన విశేష ప్రతిభకు నిదర్శనం. 'మోడరన్ టైమ్స్' చిత్రంలోని సామాజిక అనుభూతి, ఆయనకు బాగా ఇష్టమైన 'గోల్డ్ రష్' వంటివన్నీ ఆయన కృషికి నీరాజనం పట్టే చిత్రాలే. వినోదం కలిగించే కళలో ఆయన ముకాభినయ కళా కౌశలమే పతాకస్థాయి.

1879-
1919

# ఎమిలియానో జపాటా

అనాదిగా భూమి కోసం పోరాటాలు జరుగుతూనే వున్నాయి. అది ఏ ఒక్క దేశానికో పరిమితమైన విషయం కాదు. మనిషికి, భూమికి మధ్య అనుబంధం కొనసాగినంత కాలం ఈ పోరాటాలు కొనసాగుతూనే వుంటాయి. ఒక్కోశకంలో ఒక్కొక్కరు ఆ పోరాటాలకు మార్గదర్శకులు అవుతుంటారు. పోరాట రూపాలూ మారుతుంటాయి. ఎమిలియానో జపాటా అటువంటి మార్గదర్శే. మెక్సికోలో పేదరైతాంగానికి భూమి పై హక్కు కోసం ఆయన చేసిన పోరాట చరిత్ర మరువలేనిది. సోవియట్ విప్లవం దశాబ్దకాలానికి ముందే ఆయన సామ్యవాద ఆదర్శాలను ఆచరించే ప్రయత్నం చేశాడు. మెక్సికోలో సాధారణంగా చోటు చేసుకున్న విప్లవాలన్నీ అధికారాన్ని చేజిక్కించుకునేందుకు చేసినవే. ఆదర్శాల కోసం, సిద్ధాంతాల కోసం జరిగిన విప్లవాలు బహుస్వల్పం. కానీ, జపాటా ఈ రెండింటిని సమన్వయం చేశాడు. దరిద్రంతో కునారిల్లుతున్న పేద రైతాంగానికి భూమి పై హక్కును కల్పించడమన్నది ఆయన పోరాట ప్రధాన లక్ష్యం. ఈ లక్ష్యం అతడి సాయుధ కామ్రేడ్‌లను కూడా భయపెట్టింది.

జపాటా మెక్సికో నగరానికి దక్షిణంగా వుండే మొరెలోస్ అనే రాష్ట్రంలో ధనిక రైతాంగ మెస్టిజోల కుటుంబంలో జన్మించాడు. చిన్నతనం నుంచీ చురుకుగా వుండే జపాటా ఆనతికాలంలోనే గుర్రపు స్వారీ, తుపాకీ కాల్చడం ఇంకా పలు విద్యలలో నైపుణ్యాన్ని, నాయకత్వ ప్రతిభను పెంచుకున్నాడు. అందుకే ఇరవైల్లోనే అతడిని 'కాల్పులెక్' అంటే గ్రామపెద్దను చేశారు. తొలిదశలో ఆయన లక్ష్యం ఐరోపా నుంచి వలస వచ్చి భూమిని ఆక్రమించుకున్నవారి నుంచి స్థానిక ఇండియన్లకు భూమిని ఇప్పించడంగా మాత్రమే వుండేది. ఈ నేపథ్యంలో మొరెలోస్ రాష్ట్రంలో తమ భూమిని విస్తరించుకుంటూ పోతున్న ధనిక చెరుకు రైతులు, వారి మెస్టిజో మిత్రులకు, స్థానిక రైతాంగ ఇండియన్లకు మధ్య ఉద్రిక్తతలు పెరగడం ఆయన విప్లవ దృక్పథం కూడా విస్తృతమవ్వడానికి కారణమైంది.. అవినీతి పరుడైన మెక్సికో నియంత పోర్ఫిరియో డియాజ్‌కు వ్యతిరేకంగా 1910లో జపాటా రైతాంగ ఉద్యమాన్ని నడిపించాడు. ఈ సమయంలో తిరుగుబాటుదారులు బలవంతంగా భూములను ఆక్రమించుకున్నారు.

అనంతరకాలంలో ఆయన మెక్సికో నగర పర్యటన సందర్భంగా అరాచక సిద్ధాంతాల పట్ల ఆకర్షితుడయ్యాడు. రైతాంగ సమస్యల పరిష్కారానికి అవి ఆచరణీయమని ఆయన భావించాడు. అయితే ఆ సమయంలో దేశంలోని ఇతర రాజకీయ నాయకులు సామ్యవాద సిద్ధాంతాల పట్ల ఆకర్షితులయ్యారు. వారిలో ఫ్రాన్సెస్కో మాదేరో ప్రముఖుడు. అతడి కోసమే జపాటా దక్షిణాదిని జయించాడు. మాదేరో మెక్సికో అధ్యక్షుడు అయ్యాడు. ఆయనను ఆ పీఠం పై అధిష్టింప చేసిన తరువాత భూసంస్కరణల కోసం జపాటా వత్తిడి తేవడం ప్రారంభించాడు. అది మాదేరోకు, అతడి కేబినెట్ సహచరులకు ఇబ్బంది కలిగించింది. జపాటా మాదెరోను కూలదోయాలని భావించకుండా నియంత్రించాలనుకుంటున్న వ్యవస్థకు వ్యతిరేకంగా తయారయ్యాడు.

జపాటాను నిర్మూలించేందుకు క్రూరుడైన జనరల్ విక్టోరియానో హ్యూర్టాను 1911లో దక్షిణాదికి పంపారు. వారికి చిక్కకుండా దాక్కున్న జపాటా ఆ సమయంలోనే 'అయాలా' భూ సంస్కరణల ప్రణాళికను రూపొందించాడు. దీనితో అతడి నిర్మూలన తప్పనిసరి అన్న భావన భూపెత్తందార్లలో మరింత బలపడింది. ఒక పక్క ప్రభుత్వ అత్యాచారాలు.. మరో పక్క తమ స్థావరం నుంచి బయిట పడలేని స్థితిలో వున్న జపాటా, ఉత్తరాదిన పోరాటం చేస్తున్న తీవ్రవాది పాంచోవిల్లాతో పొత్తుపెట్టుకున్నాడు. జపాటాను పేద రైతాంగం ఎంతగా ప్రేమించేదో, భూపెత్తందార్లు అంతగా ద్వేషించేవారు.

తాను కానీ విల్లా కానీ ఎక్కువ కాలం రాబిన్ హుడ్ పాత్రను పోషించలేమని జపాటా గుర్తించిన అనంతరం

వారి మధ్య స్నేహబంధం సడలింది. పేదల కోసం డబ్బును గుంజడమో లేదా శత్రువులను భయపెట్టడానికో అతడు చేసిన దాడుల కారణంగా అతడి మద్దతుదారులు పల్చబడటం ఆరంభమయింది. అయితే, మెక్సికో నగరానికి చెందిన సామ్యవాద ప్రణాళికావేత్తలు కొంతవరకూ ఆ లోటును పూడ్చే ప్రయత్నం చేశారు. వారే పాఠశాల వ్యవస్థను, ఇతర సంస్కరణలను జపాటిస్టులు పునర్ రచించేందుకు సాయపడ్డారు. అయితే, వారికి మరొక కొత్త శత్రువు ఎదురయ్యాడు. తనకు తానుగా ప్రవాసంలోకి వెళ్ళిన హ్యూర్టా స్థానంలోకి వచ్చిన నూతన అధ్యక్షుడు వినుస్టియానో కరాంజా అతడు. దక్షిణాదిన భూపోరాటాన్ని అణచివేసేందుకు సేనలను పంపుతూనే, భూసంస్కరణలకు మద్దతు ఇస్తున్నట్టు పెదవి చివరి మాటలు మాట్లాడిన మాయగాడు అతను. పోరాటాన్ని అణిచివేయడంలో భాగంగా రాజ్యసేనలు రైతాంగాన్ని కాల్చివేయడం, ఉరితీయడం, బహిష్కరించడం వంటి దారుణాలకు పాల్పడ్డాయి. 1916 నాటికి కరాంజా ప్రభుత్వ దళాలు తనను చుట్టుముట్టడంతో "అందరికీ, అన్నిటికీ వ్యతిరేకంగా పోరాటం" అన్న జపాటా నినాదం పదే పదే యదార్థం చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. అది తప్పించుకోలేని పీడకల అయింది.

భూ సంస్కరణల పై చర్చను కొనసాగించడం కోసం చివరి ప్రయత్నంగా జపాటా తీవ్రవాదం, విధ్వంసానికి పాల్పడుతూ భూములను ఆక్రమించుకోవడం ప్రారంభించాడు. 1917 నాటికి తీవ్రవాదాన్ని వదిలి సైనిక వ్యవస్థను పునఃస్థాపించేందుకు అవసరమైన మద్దతును జపాటా కూడగట్టుకున్నాడు. కానీ అప్పటికే చాలా ఆలస్యమైపోయింది. అప్పటి ఒత్తిడికి తలొగ్గి భూసంస్కరణలను చర్చించేందుకు కరాంజా అంగీకరించాడు. అంతకు ముందు సంవత్సరం జపాటా కోల్పోయిన భూములను తిరిగి కైవసం చేసుకునేందుకు అనుమతించాడు. కానీ ఇదంతా ఒక ప్రణాళిక మాత్రమే. నమ్మించి మోసం చేసేందుకు చేసిన కుట్ర మాత్రమే. జపాటాను శాశ్వతంగా నిర్మూలించేందుకు కరాంజా సమయం కోసం గుంటనక్కలా వేచి వున్నాడు.

సింహంలా పోరాడటం తప్ప జిత్తులమారితనం తెలియని జపాటా రెండు సంవత్సరాలు తన విజయాల్ని చవిచూశాడు. చివరికి వారి పట్ల అతడు పెంచుకున్న విశ్వాసమే అతడిని మింగివేసింది. తాను చేస్తున్న పోరాటానికి ప్రభుత్వ మద్దతు కూడగట్టుకోవాలని అత్యుత్సాహంతో జపాటా తాను ఒక మోసగాడితో వ్యవహరిస్తున్నాననే విషయాన్ని విస్మరించి నేరుగా అతడు పన్నిన ఉచ్చులోకి నడిచాడు. 1919, ఏప్రిల్ 10వ తేదీన కారాంజా ఏజెంట్లు అతడిని వెనుకనుంచి కాల్చివేశారు. అతడి మద్దతుదారులకు కడచూపు కూడా దక్కకుండానే అతడి మృతదేహాన్ని శత్రువులు మాయం చేశారు. ఆ దేహాన్ని ఎక్కడ ఖననం చేశారో ఇప్పటికీ ఎవరికీ తెలియని రహస్యమే.

కానీ లాటిన్ అమెరికాపై జపాటా ప్రభావం తొలగిపోలేదు. అర్జెంటీనా గెరిల్లా పోరాటయోధుడైన చేగువేరాకు, రైతాంగ తిరుగుబాటు సైన్యాలకు అతడే స్ఫూర్తి. దక్షిణ అమెరికా, కరేబియన్ రాజకీయ వేదికను అమరుడైన అతడు ప్రభావితం చేస్తూనే వున్నాడు. మెక్సికోలో దారిద్ర్యంతో కునారిల్లుతున్న చియాపాస్టా రాష్ట్రంలో ఉద్యమకారులు తమను తాము 1994లో జపాటిస్టా సైన్యంగా ప్రకటించుకున్నారు. ఎనిమిది దశాబ్దాల ముందు నిర్భయుడైన జపాటా మరణించినప్పుడు మెక్సికో పరిస్థితి ఎలా వుందో ఇప్పటికీ అలాగే వుంది. ఆధునిక జపాటిస్టులు కూడా పేదలకు భూమికోసం పోరాటం సాగిస్తున్నారు. వారిని భూపెత్తందార్లు, నిరంకుశ పాలకులు గతంలో లాగే వ్యతిరేకిస్తున్నారు. ఎక్కడా పెద్దగా మార్పు ఏమీ లేదు.. మార్పు అంటూ వచ్చిందీ అంటే అది కేవలం వ్యక్తుల పోరాట రూపాలలో మార్పు మాత్రమే.

1890-
1966

# హోమి జహంగీర్ బాబా

"ఫి జిక్స్ చదవాలన్న కోరిక నన్ను దహించి వేస్తోంది. బిజినెస్, ఇంజినీర్ ఉద్యోగం నా వంటికి సరిపడనివి. ఫిజిక్సే నా మార్గం. అందులో నేను అద్భుతాలు సృష్టిస్తా... అదే నా ఏకైక లక్ష్యం. ఓ వ్యాపార సంస్థకు అధిపతి కావాలన్న ఆలోచనే నాకు రుచించడంలేదు. తెలివైన వాళ్లు చాలా మంది ఉంటారు. వారిని ఆ పని చేయనివ్వండి. బీథోవెన్‌తో నువ్వు శాస్త్రవేత్తవు కావాలి...సైన్స్ చదువు అని, సోక్రటీస్‌కు 'ఇంజనీరు అవ్వు, అది తెలివైన వ్యక్తి చేసేపని' అని సలహాలు ఇస్తే ఎలా ఉంటుంది? దయచేసి నన్ను భౌతిక శాస్త్రం చదవనివ్వండి"

భారత అణుశక్తి కార్యక్రమ పితామహుడు హోమి జె బాబా కేంబ్రిడ్జి నుండి తండ్రికి రాసిన లేఖా సారాంశమిది. హోమి బాబా చిన్నప్పటి నుండి సైన్సుపట్ల అమితాసక్తితో ఉండేవాడు. భౌతికశాస్త్రం ఆయనకు ప్రాణం. 15 ఏళ్లు నిండకముందే, ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతం చదివి అవగతం చేసుకున్న ప్రతిభావంతుడు. అప్పట్లో పెద్ద పెద్ద శాస్త్రవేత్తలకే కొరుకుడుపడని సిద్ధాంతమది.

హోమి జహంగీర్ బాబా 1890 అక్టోబర్ 30న ముంబాయిలోని ఓ ధనిక పార్సి కుటుంబంలో పుట్టాడు. టాటాలు ఆ కుటుంబానికి దగ్గరి బంధువులు. తండ్రి జహంగీర్ హోర్ముస్ జీ బాబా ఆక్స్‌ఫర్డ్‌లో చదివి ఆ తర్వాత లాయర్ అయ్యాడు. తల్లి మెహెరిన్, సర్ దిన్‌షా మనేక్‌జీ మనవరాలు. హోర్ముస్‌జీ సోదరిని అంటే హోమీ బాబా మేనత్త మెహెర్‌బాయిని జెంషెట్‌జీ నుస్సెర్‌వాన్‌జీ టాటా (1839-1904) చిన్న కుమారుడు సర్ దొరబ్ జీ టాటాకు ఇచ్చి పెళ్లి చేశారు. అలా ఆయనకు టాటాలతో చుట్టరికం కూడా ఉంది. బాబా ముంబాయిలో ప్రాథమిక, మాధ్యమిక విద్య పూర్తిచేసి 1927లో ఉన్నత విద్య కోసం కేంబ్రిడ్జి వెళ్లాడు. మామ సర్ దోరబ్ టాటా చదివిన గోన్‌విల్లే కాలేజీలోనే బాబాను చదివించారు. తండ్రి కోరిక మేరకు మెకానికల్ ఇంజినీరింగ్‌లో చేరినా అది బాబాకు ఏ మాత్రం ఆసక్తి కలిగించలేదు. భౌతిక శాస్త్రవేత్త కావాలన్నదే అతని తపన. ఇంజినీరుగా టాటా స్టీల్ (టిస్కో)లో చేర్చి ఆ కంపెనీ బాధ్యతలు అప్పగించాలని తండ్రి, మామ దోరబ్‌ల వ్యూహం. కాని అది ఫలించలేదు. ఫిజిక్స్‌లో నోబెల్ బహుమతి గ్రహీత పాల్ డిరాక్ బాబాకు గణితం బోధించాడు. 1930లో మ్యాథ్స్ కోర్సు పూర్తి చేసుకుని తన అభీష్టం ప్రకారం కేవెండిష్ లేబరేటరీలో చేరి, సిద్ధాంత భౌతిక శాస్త్రంలో పీహెచ్‌డీ పొందాడు. తర్వాత యూరప్ వెళ్ళాడు.

జూరిక్‌లో ఉల్ఫ్‌గాంగ్ పాలి, రోమ్‌లో ఎర్నికోఫెర్మి, క్రామర్స్ వంటి హేమాహేమీల సాహచర్యం లభించింది. 1933లో బాబాకు 'న్యూటన్ స్టూడెంట్‌షిప్' ఉపకారవేతనం లభించింది. దాదాపు 3 ఏళ్లు కేంబ్రిడ్జిలో అధ్యయనం కొనసాగించాడు. కోపెన్ హెగన్‌లో నీల్స్ బోర్ ప్రయోగశాలలో ఆయనతో కలసి పనిచేశాడు.

సుదూర అంతరిక్షం నుండి అత్యంత వేగంతో దూసుకువచ్చే సూక్ష్మాతి సూక్ష్మ రేణువులే కాస్మిక్ కిరణాలు. ఇవి భూమి వాతావరణం పైపొరను తాకగానే, అక్కడి గాలి అణువులను ఢీ కొట్టి ఎలక్ట్రాన్‌ల వర్షం సృష్టిస్తాయి. 1937లో జర్మనీ భౌతిక శాస్త్రవేత్త వాల్టర్ హైట్లర్‌తో కలసి బాబా ఈ 'ఎలక్ట్రాన్ షవర్' గుట్టు విప్పాడు. హోమీ బాబా పేరు ఒక్కసారిగా శాస్త్ర ప్రపంచంలో మార్మోగిపోయింది. ఈ పరిశోధన ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతానికి నిరూపణలా కూడా మారింది. కాస్మిక్ రేణువుల్లో ఉండే కొత్త తరహా న్యూక్లియర్ పార్టికిల్స్‌ను ఎలా పిలవాలనే దానిపై అప్పటికి ఏకాభిప్రాయం లేదు. 'మీసాన్'లని పిలిస్తే బాగుంటుందని బాబా సూచించడంతో వాటికా పేరు స్థిరపడింది.

బెంగుళూరులోని ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్ (ఐఐఎస్‌సి)కు నోబెల్ సైన్స్ బహుమతి గ్రహీత సి.వి. రామన్ డైరెక్టర్. ఆయన ఐఐఎస్‌సిలో కాస్మిక్ కిరణాల అధ్యయనానికి ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటుచేసి బాబాను అందులో రీడర్‌గా చేర్చుకున్నాడు. 1942లో అక్కడే ప్రొఫెసర్ అయ్యాడు. మరో ప్రఖ్యాత భారతీయ శాస్త్రవేత్త విక్రమ్ సారాభాయి కూడా బాబా ఉన్నప్పుడే కొద్దికాలం ఈ సంస్థలో పనిచేశాడు. ప్రొఫెసర్ అవడానికంటేముందే కాస్మిక్ కిరణాలపై, ఎలిమెంటరీ పార్టికల్స్, క్వాంటమ్ మెకానిక్స్‌పై బాబా చేసిన పరిశోధనలకు గుర్తింపుగా రాయల్ సొసైటీ ఆయన్ను ఫెలో (సభ్యుడు)గా ఎంపిక చేసింది.

భారత్‌ను పశ్చిమ దేశాలకు దీటుగా నిలబెట్టాలంటే, శాస్త్ర విజ్ఞానంలో అభివృద్ధి తప్పనిసరన్న అభిప్రాయానికి వచ్చాడు. 1944 ఏప్రిల్ 20న సుబ్రమణ్యం చంద్రశేఖర్ (నోబెల్ బహుమతి పొందిన మరో భారతీయుడు)కు ఇలా రాశాడు.. "ఇప్పుడిక్కడ తగినంత ప్రోత్సాహం, ఆర్థిక వనరులు

వస్తున్నాయి. మాతృ దేశంలోనే ఉండటం మన కర్తవ్యం. గొప్ప విశ్వ విద్యాలయాలు, పరిశోధనా సంస్థలు ఉండటం విదేశాల అదృష్టం. ఇక్కడా మనం ఆ స్థాయి విద్యా సంస్థలను నిర్మించుకోవాలి ". దేశంపట్ల హోమి బాబాకు ఉన్న అంకిత భావానికి ఈ లేఖ నిదర్శనం. తమ దేశం వచ్చి పరిశోధనలు చేయవల్సిందిగా ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ పంపిన ఆహ్వానాన్ని రెండో ఆలోచన లేకుండా తోసిపుచ్చాడు.

భారతదేశంలో గొప్ప పరిశోధనా సంస్థను నెలకొల్పాలన్న కోరిక ఆయన్ను నిద్రపోనివ్వలేదు. మౌలిక పరిశోధనల ఆవశ్యకతను వివరిస్తూ అలాంటి సంస్థను నిర్మించాలని అభ్యర్థిస్తూ 1944లో టాటాలకు లేఖరాశాడు. భవిష్యత్తులో ఈ పరిశోధన సంస్థ పరిశ్రమలకు కూడా నూతన టెక్నాలజీల పరంగా ఎంతో ఉపయోగపడుతుందని సూచించాడు. విద్యుత్ ఉత్పాదన కోసం అణుశక్తి ప్లాంటులను నెలకొల్పాల్సి వచ్చినప్పుడు పాశ్చాత్య నిపుణుల కోసం, సాయం కోసం దేబిరించాల్సిన అవసరం ఉండదని వాదించాడు. అణుశక్తిని విధ్వంసకర ప్రయోజనాలకు ఎలా వాడుకోవాలీ, దాంతో బాంబులు ఎలా తయారు చేయాలీ అని విదేశాల్లోని శాస్త్రవేత్తలు పరిశోధనల్లో తలమునకలుగా ఉన్న ఆ సమయంలో, శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తిని వాడుకోవడంపై బాబా దృష్టి సారించాడు.ఏమైతేనేం, దోరబ్ జె టాటా నేతృత్వంలో 1945లో టాటా ఇనిస్టిట్యూట్ ఫర్ ఫండమెంటల్ రిసెర్చ్ (టిఐఎఫ్ఆర్) ముంబాయిలో ఏర్పాటైంది. బాబా దానికి డైరెక్టర్ అయ్యాడు. చివరి వరకూ ఆయన ఆ పదవిని నిర్వహించారు. ప్రస్తుతం దానికి కేంద్ర ప్రభుత్వమే పూర్తిగా నిధులు సమకూర్చుతోంది.

రెండేళ్ల తర్వాత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ప్రధాని నెహ్రూ దేశాన్ని శాస్త్ర సాంకేతిక రంగాలలో స్వయం సమృద్ధం చేయదలిచాడు. భారత సైన్స్ పాలసీకి బాబా రూపకల్పన చేశాడు. విద్యుత్ ఉత్పాదనవంటి శాంతియుత ప్రయోజనాల కోసం, పారిశ్రామిక అభివృద్ధి కోసం భారత్ అణుపాటవాన్ని సంపాదించాలన్న బాబా వాదనతో నెహ్రూ పూర్తిగా ఏకీభవించాడు. నెహ్రూ నుండి లభించిన ప్రోత్సాహంతో 1948లో ప్రత్యేకంగా ఆటమిక్ ఎనర్జీ కమిషన్ (ఏఈసీ) బాబా ఛైర్మన్‌గా ఏర్పాటైంది. దేశంలో అణుపరిశోధన ఊపందుకుంది. బాబా 1954లో ప్రత్యేకంగా కేంద్ర ప్రభుత్వంలో అణుశక్తి విభాగాన్ని ఏర్పాటు చేయించాడు.

కొద్ది సంవత్సరాలు గడిచేసరికి, బాబా పరిశోధనల దిశ మారింది. కేవలం విద్యుచ్ఛక్తి స్వావలంబనే కాకుండా, సైనిక అవసరాలపై ఏఈసీ దృష్టి సారించింది. 1958లో ఏఈసీ పూర్తిగా పునర్ వ్యవస్థీకరించారు. కమిషన్‌పై పూర్తి అధికారం బాబాకు లభించింది. అంతర్జాతీయ దౌత్య సంబంధాలకు, పొరుగు దేశాలతో శాంతికి కూడా అణుశక్తి సామర్థ్యం అవసరమని నెహ్రూను ఒప్పించాడు. పైకి మాత్రం శాంతియుత అవసరాలకే అణు పరిజ్ఞానం ఉపయోగిస్తాం అని నెహ్రూ చెప్పేవారు. బాబా మాత్రం అణు నిరాయుధీకరణ ఉద్యమంపట్ల బాహాటంగా తన అయిష్టతను వ్యక్తం చేస్తుండేవాడు. 'నెహ్రూ ప్రోత్సాహకరంగా మాట్లాడినా, తర్వాత బాబాను కలసినపుడు నిరాశ చెందాను. భారత శాస్త్రవేత్తల నుండి మనకే మాత్రం మద్దతు రాదని స్పష్టమైంది' అని ఐన్‌స్టీన్‌కు వ్రాసిన లేఖలో బెట్రాండ్ రస్సెల్ పేర్కొన్నాడు. అణు పరిశోధనల కోసం ట్రాంబే వద్ద ప్రత్యేకంగా 12 వందల ఎకరాల స్థలంలో మరో సంస్థ ఏర్పాటైంది. (బాబా మరణానంతరం 1967 జనవరి 12న ఇందిరాగాంధీ దీనికి బాబా ఆటమిక్ రీసెర్చ్ సెంటర్ -బార్క్ అని నామకరణం చేశారు.) తర్వాత కాలంలో అప్సర, సైరస్, జెర్లినా ఆటమిక్ రియాక్టర్లు బాబా నైపుణ్యంతో విజయవంతంగా నిర్మాణమయ్యాయి. అణుశక్తికి అవసరమైన యురేనియం ఖనిజం కోసం అన్వేషణ ముమ్మరమైంది. ఈ ఖనిజ శుద్ధి కోసం ప్లాంట్లను నెలకొల్పారు. 1963లో తారాపూర్‌లో భారత తొలి అణు విద్యుత్ కేంద్రం, రెండేళ్ల తర్వాత ప్లుటోనియం ప్లాంటు నెలకొల్పారు. సాంకేతిక రంగంలో మనం ఎవరికీ తీసిపోమని దేశ ప్రజలకు యావత్ ప్రపంచానికి బాబా నిరూపించారు. 1974 మే 18... భారత చరిత్రలో మరచిపోలేని ఘట్టం. అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ రాజస్థాన్ పోఖ్రాన్ ఎడారిలో శాంతియుత ప్రయోజనాల కోసం అణ్వస్త్ర పరీక్ష జరిపించారు. కాని తన కలల సాకారాన్ని చూసుకోడానికి బాబా ఆనాడు జీవించిలేరు. వియన్నాలో ఓ అంతర్జాతీయ సమావేశానికి వెళ్తుండగా, 'కాంచన్ జంగ్' విమాన ప్రమాదంలో హోమి బాబా 1966 మే 18న హఠాన్మరణం చెందడం దేశ అణుశక్తి రంగానికి తీరనిలోటు. కేవలం 57 ఏళ్ళే జీవించిన ఆయన ఆజన్మ బ్రహ్మచారి. "సైన్స్‌నే పెళ్ళి చేసుకున్నా" అంటూ చమత్కరించే హోమీబాబా భారత ప్రతిష్ఠను మాత్రం శిఖరాగ్రానికి చేర్చారు.

# మైఖేల్ జోర్డాన్

ప్రపంచంలోని క్రీడాకారులందరిలో అత్యంత ధనవంతుడు, బాస్కెట్‌బాల్ ఆటకు ఒక కొత్త నిర్వచనం చెప్పిన క్రీడా మేధావి మైకేల్ జోర్డాన్. అమెరికాలో బేస్‌బాల్, రగ్బీతో పాటు అత్యంత ప్రజాదరణ పొందిన బాస్కెట్‌బాల్‌కు అభిమానులు వెల్లువెత్తేలా స్టేడియంలకు రప్పించడం జోర్డాన్ ప్రత్యేకత. ఒకానొక సమయంలో అమెరికా, లాటిన్ అమెరికా, యూరప్, ఆసియాలోని కొన్ని దేశాల్లో జోర్డాన్ ప్రకటనలు లేని వీధులే కనిపించేవి కావు. ఫుట్‌బాల్ నల్ల వజ్రం పీలె తరువాత మరొక నీగ్రో క్రీడాకారుడు ఈ స్థాయిలో ఆకాశమంత ఎత్తుకు ఎదగడం జోర్డాన్‌కే సాధ్యమైంది.

గత ఇరవై సంవత్సరాలుగా మైకేల్ జోర్డాన్ కనిపించని ప్రాంతమంటూ లేదు. అడ్వర్టయిజ్‌మెంట్ల సైన్ బోర్డులు, మ్యాగజైన్లు, వాణిజ్యప్రకటనలు ప్రధానంగా టీవీలలో మైకేల్ జోర్డాన్ కనబడని నిముషం అంటూ లేదు. చెక్కిన గ్రీకు శిల్పంలా దాదాపు ఆరున్నర అడుగుల ఎత్తులో చేతిలో ఒక బంతిని పట్టుకొని బాస్కెట్‌బాల్ రింగువైపు గాలిలో అలా ఎగురుతూ కనబడే జోర్డాన్ ప్రపంచంలో పీలే తరువాత అత్యధిక మంది ప్రజలు గుర్తుపట్టే ఒకే క్రీడాకారుడు. జోర్డాన్ బాస్కెట్‌బాల్ క్రీడలోకి దిగిన తరువాతే ఆ క్రీడకు ఇంతటి ఆదరణ లభించిందని క్రీడా విశ్లేషకులు తెల్పారు. గాలిలో అలా అలా తేలిపోయి కాళ్ళకు స్ప్రింగులు తొడుక్కున్నాడా అన్న రీతిలో కనబడే జోర్డాన్ కోట్లాది మందికి ఆరాధ్యుడు. పిల్లలకు క్రీడలపట్ల అభిరుచి, అభినివేశం కలగడానికి జోర్డాన్ లాంటి ఆటగాళ్ళే కారణమని ప్రఖ్యాత అమెరికన్ రగ్బీ ఆటగాడు ఒ.జె. సింప్సన్ వ్యాఖ్యానించారు. ప్రత్యర్థుల నుంచి బంతిని లాక్కుని అద్భుతమైన జంప్ షాట్స్, పాసెస్‌తో వారి రక్షణ వలయాన్ని ఛేధించి క్షణాల్లో గోల్ సాధించే జోర్డాన్ అంటే పిల్లలకు ప్రాణం. ఒకప్పుడు అమెరికాలో చికాగో బుల్స్ అనే టీం గురించి ఎవరికీ పెద్దగా తెలియదు. అలాంటి టీమ్‌లో రిజర్వు ఆటగాడిగా చేరిన జోర్డాన్ ఆరు నెలల్లోనే ఆ టీమ్‌కు అంతర్జాతీయ ఖ్యాతి దక్కేట్లు చేశాడు. అమెరికన్ నేషనల్ బాస్కెట్‌బాల్ అసోసియేషన్ (ఎన్‌బిఎ)లో అప్పటి వరకూ గుర్తింపేలేని చికాగో బుల్స్ జోర్డాన్ ప్రవేశంతో మొదటి స్థానానికి ఎదిగింది. అత్యద్భుతమైన ఆట తీరుతో ప్రత్యర్థి జట్టు తేరుకునేలోపే వరుసగా గోల్స్ సాధించే నేర్పరితనమున్న జోర్డాన్ అనామక జట్టైన చికాగో బుల్స్‌ను మూడు సార్లు జాతీయ ఛాంపియన్‌గా నిలబెట్టాడు. అప్పటి వరకూ బాస్కెట్‌బాల్ కోర్టులో స్టార్లుగా పేరుపడ్డ లారీ బర్డ్, మ్యాజిక్ జాన్సన్ లాంటి వాళ్ళు జోర్డాన్ ప్రతిభ ముందు వెలవెలబోయారు. సచిన్ టెండూల్కర్ వార్షిక సంపాదన ఏడాదికి 120 కోట్లు అంటేనే నోరెళ్లబెట్టే మనం జోర్డాన్ ఆదాయం వింటే ఆశ్చర్యపోవాల్సిందే

జోర్డాన్ ఏడాది ఆదాయం 20,000 కోట్ల పైమాటే. మైకేల్ జోర్డాన్ బాస్కెట్‌బాల్ క్రీడను పైపైకి తీసుకెళ్ళడంతోపాటు వాణిజ్య ప్రకటనల్లో నటించే క్రీడాకారుల సంపాదనను కూడా చుక్కలను తాకించాడు. పెద్దలు, పిల్లలు తేడా లేకుండా జోర్డాన్ అంటే వెర్రెక్కిపోవడంతో ఎన్నో అంతర్జాతీయ కంపెనీలు జోర్డాన్‌తో వాణిజ్య ఒప్పందాలు కుదుర్చుకున్నాయి. కోకోకోలా, నైకీ, స్పింక్స్ వంటి ప్రసిద్ధ కంపెనీలతోపాటు ఆహార పదార్థాలు, పిల్లల డ్రింక్స్ ఉత్పత్తుల సంస్థలు కుదుర్చుకున్న ఒప్పందాల ప్రకారం జోర్డాన్ సంవత్సరానికి దాదాపు 20,000 కోట్ల రూపాయలు ఆర్జిస్తున్నాడు. ప్రపంచంలో మరే క్రీడాకారుడు గాని క్రీడా జట్టుగాని ఇంత ఆదాయాన్ని ఆర్జించలేదు. 1990 నుంచి 2000 సంవత్సరాల వరకూ ఏడాదికి 250 మిలియన్

డాలర్లు నుంచి 400 మిలియన్ డాలర్ల వరకు జోర్డాన్ సంపాదించాడు. ఇంకా సంపాదిస్తూనే ఉన్నాడు.

క్రీడలు, స్పోర్ట్స్‌తో అంతగా సంబంధంలేని ఓ నీగ్రో కుటుంబంలో 1963లో మైకేల్ జోర్డాన్ పుట్టాడు. నార్త్ కరోలినాలో విల్మింగ్‌టన్‌లోని జోర్డాన్ కుటుంబంలో ఎవరూ ఆరడుగులకు మించి ఎత్తుండలేదు. హైస్కూలు స్థాయిలోనే బేస్‌బాల్, బాస్కెట్‌బాల్ క్రీడల్లో నైపుణ్యాన్ని పెంపొందించుకోవాలనుకున్న జోర్డాన్‌కు పొడుగే అడ్డంకిగా మారింది. గెడకర్రలా ఆరడుగుల ఆరంగుళాల పొడవున్న జోర్డాన్ మైదానంలో స్వేచ్ఛగా కదలలేకపోయాడు. అయితే నార్త్ కరోలిన యూనివర్సిటీకి చెందిన బాస్కెట్ బాల్ కోచ్ డీన్ స్మిత్ దృష్టిలో పడటంతో జోర్డాన్ అదృష్టం పండింది. 1982లో జార్జ్‌టౌన్ యూనివర్సిటీ జట్టు, జోర్డాన్ జట్లు సమ ఉజ్జీలుగా నిలవడంతో ఆఖరు నిముషంలో విజృంభించి సాధించిన ఒక గోల్ బాస్కెట్‌బాల్ చరిత్రలో రికార్డ్ గోల్‌గా నమోదైంది. ఇంచు మించు ప్రత్యర్థులందరి చేతులు తాకినప్పటికీ బాల్‌ను గోల్‌గా మలిచి క్రీడాభిమానులను హోరెత్తించాడు. దీంతో జోర్డాన్‌కు ఒలంపిక్స్ జట్టులోస్థానం లభించింది.

1984లో అమెరికా బాస్కెట్‌బాల్ జట్టు తరఫున ఒలింపిక్స్‌లో ఆడిన జోర్డాన్ అక్కడ కూడా చరిత్ర సృష్టించాడు. ఫైనల్స్ వరకూ ఆడిన ఆరు మ్యాచ్‌ల్లో 40కి పైగా గోల్స్ సాధించి అమెరికన్ జట్టు బాస్కెట్‌బాల్‌లో బంగారు పతకం సాధించేటట్లు చేశాడు. అయితే ఒకసారి ప్రొఫెషనల్‌గా మారితే ఇక ఒలింపిక్స్, కామన్‌వెల్త్, వరల్డ్‌కప్‌లాంటి ఆటల్లో ఆడే అవకాశం ఉండదు. అయినప్పటికీ జోర్డాన్ ప్రొఫెషనల్‌గా మారేందుకే నిర్ణయించుకున్నాడు. చికాగోబుల్స్ తరఫున బాస్కెట్‌బాల్ కోర్టుల్లోకి దిగి కోట్ల రూపాయలకు పడగలెత్తాడు. జోర్డాన్ జట్టులో ఉన్నాడంటే ఆ మ్యాచ్‌లో కనీసం 28 గోల్స్ అయినా అతను సాధిస్తాడు. జోర్డాన్ ఇలా రెచ్చిపోయి గోల్స్ సాధించకుండా కట్టడి చేసేందుకు కనీసం ముగ్గురు ప్రత్యర్థి జట్టు ఆటగాళ్లు ఎప్పుడూ అతడ్ని అంటి పెట్టుకునే ఉంటారు.

1993లో జోర్డాన్ తండ్రిని ఇద్దరు వీధి రౌడీలు హత్య చేశారు. జోర్డాన్‌కు ఈ సంఘటన పెద్ద షాక్‌లా తగిలింది. జోర్డాన్‌కున్న వ్యసనాలూ, అతనికున్న జూదం ఆడే అలవాట్ల కారణంగానే అతని తండ్రి హత్యకు గురయ్యాడన్న ప్రచారం ఊపందుకుంది. దీనితో ఉచ్ఛ స్థితిలో ఉండగానే బాస్కెట్ బాల్ ఆట నుంచి రిటైర్ అవుతున్నట్లు ప్రకటించి జోర్డాన్ సంచలనం సృష్టించాడు. 1994-95 సీజన్‌లో అతను ఏ ఆటా ఆడకుండా ఇంటికే పరిమితమయ్యాడు. జోర్డాన్ రిటైర్‌మెంట్ నిర్ణయాన్ని వెనక్కి తీసుకోవలసిందిగా అతని అభిమానులు, తోటి క్రీడాకారులు పెద్ద ఎత్తున అభ్యర్థించారు. దాంతో పాటు జోర్డాన్ తండ్రిని చంపింది ఇద్దరు వీధిరౌడీలని న్యాయస్థానం నిర్ధారించడంతో అతనిపై బడ్డ నింద తొలగిపోయింది.

వెంటనే బాస్కెట్ బాల్ క్రీడలోకి మళ్ళీ దిగుతున్నట్లు ప్రకటించిన మైకేల్ జోర్డాన్ మొదటి పోటీలోనే తన జట్టు కప్ గెలిచేటట్లు అద్వితీయంగా ఆడాడు. ఆ తరువాత జోర్డాన్‌కు అభిమానులు విపరీతంగా పెరిగారు. అది చూసి నైకీ కంపెనీ ఒక్కటే 30 మిలియన్ డాలర్ల కాంట్రాక్టు కుదుర్చుకోవడంతో ఇక జోర్డాన్‌కు ఎదురు లేకుండా పోయింది. జోర్డాన్ కొన్ని హాలీవుడ్ సినిమాల్లోనూ నటించాడు. మొత్తానికి బాస్కెట్‌బాల్ చరిత్రలో ఆ ఆటకు ఇంతటి ప్రాధాన్యాన్ని పెంచి అభిమానులను సమ్మోహనపర్చిన జోర్డాన్‌లాంటి ఆటగాడు ఈ శతాబ్దంలో ఒక అపూర్వమైన క్రీడా ముత్యం.

# మేడం మావో జియాంగ్ జింగ్

ఆధునిక చైనా చరిత్రలో జియాంగ్ జింగ్ నిర్వహించిన పాత్ర పలు వివాదాలకు కేంద్రం. ఆధునిక చైనా నిర్మాత మావో ఆఖరి భార్య అయిన జింగ్, వివాహమైన రెండున్నర దశాబ్దాల వరకూ రాజకీయాలకు దూరంగా వుంది. అయితే, అనంతర కాలంలో ఒక దశాబ్దం పాటు ఆమె చెలాయించిన పెత్తనం, ఆమెను అప్రతిష్ఠ పాలు చేసింది. మావో మరణించిన వెంటనే ఆమె పై కుట్రదారు అనే ముద్ర వేశారు. తన కన్నా ఇరవై ఏళ్ళు పెద్దవాడు, అప్పటికే వివాహితుడు అయిన మావోను ఆకర్షించి వివాహం చేసుకున్న జింగ్ ఒక సినిమా నటి. ఆమె అప్పటికి లీజిన్ అన్న పేరుతో ప్రముఖురాలు. తనతో పరిచయమేర్పడిన అనంతరం మావో ఆమె పేరును కవితాత్మకంగా జియాంగ్ జింగ్ అని మార్చారు.

అత్యంత సాధారణ కుటుంబంలో జన్మించిన జింగ్ అసలు పేరు లీ యూహో. తండ్రి పరమ కోపిష్టి. తల్లిని పనిమనిషి స్థాయికి మించి ఎప్పుడూ ఆయన చూడలేదు. తండ్రి కోపం కారణంగా నరకప్రాయమైన ఆ యింటి నుంచి జింగ్ తన పదహేనవ ఏటే బయటప డింది. షాండాంగ్ ప్రయోగాత్మక నాటకశాలలో నటనలో శిక్షణ పొందింది. అనంతరం నాటకాలలో చిన్న చిన్న పాత్రలు వేస్తూ నాటకాల నుంచి సినీ రంగం వరకూ ఎదిగింది. అయితే, నటిగా ఆమె సృష్టించిన సంచలనాల కన్నా షాంఘాయ్‌లోని విలాసవంతమైన వర్గాల్లోనూ, వామపక్ష వర్గాల్లోనూ సృష్టించిన సంచలనాలే అధికం. ఆమెకు మిత్రులు, భర్తలు తరచుగా మారిపోతుండే వారు. ఈ సమయంలోనే షాంఘై నగరం పై జపాన్ దాడి చేయడంతో ఆమె ఆ ప్రాంతాన్ని వదిలి పెట్టింది.

అలా షాంఘాయ్‌ను వదిలిపెట్టిన ఆమె నటనను కూడా వదిలి కమ్యూనిస్టు కార్యకర్తగా మారింది. కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యాలయం వున్న యెనాన్ చేరింది. జపాన్ దాడిని ఎదుర్కొనేందుకు ఆ సమయంలో మావో సేనలు చియాంగ్ షేక్‌కు చెందిన కొమి టాంగ్‌తో పొత్తు పెట్టుకుని అక్కడే వున్నాయి. ప్రతి రోజూ మావో ఇచ్చే ఉపన్యాసాలకు హాజరై, ముందు వరుసలో కూర్చుని శ్రద్ధగా వింటూ మావో దృష్టిని ఆకర్షించింది. వారి మధ్య పెరిగిన సాన్నిహిత్యం కారణంగా మావో తన మూడవ భార్యను తిరస్కరించి, జింగ్‌ను వివాహమాడేం దుకు సిద్ధమయ్యారు. మావో నిర్ణయాన్ని అతని సహచరులు, పార్టీ నాయకులు తీవ్రంగా గర్హించారు. 1934–35లో నిర్వహించిన చారిత్రక లాంగ్ మార్చ్‌లో కష్టనష్టాలకు ఓర్చి, సహకరించిన మూడవ భార్యను తిరస్కరించడం అందులో పాల్గొన్న ఇతర ప్రముఖ నాయకులకు, సహచరులకు ఆగ్రహాన్ని తెప్పించింది. మావో పట్టుబట్టడంతో కొన్ని షరతుల పై అప్పటికే గర్భం ధరించిన జింగ్‌ను వివాహం చేసుకునేందుకు పార్టీ అంగీకరించింది. జింగ్ రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొనడానికి వీలు లేదని, వారిద్దరూ కలిసి ఏ బహిరంగ సభకూ హాజరు కాకూడదని పార్టీ పెట్టిన షరతుల కారణంగా మావోను వివాహం చేసుకున్నప్పటికీ, ఆమె భార్య స్థానాన్ని దక్కించుకోలేకపోయింది.

పార్టీ పెట్టిన షరతును జింగ్ ఏనాడు ఉల్లంఘించలేదు. దాదాపు రెండున్నర దశాబ్దాల కాలం పాటు ఆమె రాజకీయాలకు దూరంగా వుంది. నటి కావడంతో చిన్న సాంస్కృతిక కార్యక్రమాలలో ఆమె జోక్యం మినహా పెద్దగా ఆమె జోక్యం ఎక్కడా కనిపించలేదు. సహనంతో, ఓపికగా వున్న ఆమెకు 1963లో మావో ఆమెకు ఒక బృహత్తర బాధ్యతను అప్పగించారు. ప్రజా బాహుళ్యం కోసం సాంప్రదాయ చైనా నాటకాల నుంచి, నృత్య నాటకాల నుంచి బూర్జువా, రివిజనిజపు భావజాలాన్ని ఏరిపారేసి, కళలను సైద్ధాంతికంగా సరైన దారిలో పెట్టే బాధ్యతను ఆమెకు

అప్పగించారు. తత్ఫలితంగా బీజింగ్ థియేటర్లలో యూనిఫాంతో పాటుగా తుపాకి ధరించిన నృత్యకారిణిగా వేదికపై కనిపించి జనాన్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. అరవైయ్యో దశాబ్దం మధ్య నుంచి ఆమె తెరచాటు నుంచి బయటకు వచ్చి పెత్తనం చెలాయించడం ప్రారంభించింది. పార్టీ ప్రొలటేరియన్ సాంస్కృతిక విప్లవ కార్యక్రమం నుంచి పుట్టిన స్వతంత్ర ప్రతిపత్తి గల సంస్థ అయిన సాంస్కృతిక విప్లవ గ్రూపుకు ఆమె డిప్యూటీ చీఫ్‌గా నియమితురాలైంది. ఈ సంస్థ నేరుగా చైనా కమ్యూనిస్టు పార్టీకి రిపోర్ట్ చేసేది. మావో మేథో యువ సేన అయిన రెడ్‌గార్డ్స్‌తో పరిచయం పెరిగింది. అనంతరం ఒక దశాబ్ద కాలం పాటు జింగ్ పార్టీ పైన, దేశం పైన కూడా పెత్తనాన్ని చెలాయించింది. ముఖ్యంగా, తన వివాహానికి అభ్యంతరాలు చెప్పి, షరతులు పెట్టిన శత్రువులను శిక్షించేందుకు తన అధికారాన్ని ఉపయోగించింది. గ్యాంగ్ ఆఫ్ ఫోర్ (దుష్ట చతుష్టయం)లో సభ్యురాలిగా సాంస్కృతిక విప్లవాన్ని పర్యవేక్షిస్తూ, ప్రత్యక్షంగాను, పరోక్షంగాను వేలాది మంది అమాయక ప్రజలను హింసకు గురిచేసి, అణిచివేసి, ఖైదులో వుంచడానికి బాధ్యురాలైంది. ఆమె నాయకత్వంలో రెడ్‌గార్డ్స్ తమకు అడ్డం వచ్చేందుకు సాహసించిన చైనా మేథావి వర్గాన్ని, పార్టీకి నిబద్ధులైన విప్లవకారులను గడగడలాడించారు. మావో లక్ష్యాలైన, మరింత ప్రభుత్వ వికేంద్రీకరణ, పార్టీలో కొత్త రక్తం, గ్రామీణ చైనా పరివర్తన అన్న వాటిని సాధించినప్పటికీ, ఆధునిక చైనా చరిత్రలో అత్యంత విధ్వంసక కాలంలో ఇవన్నీ చోటు చేసుకున్నాయన్నది కొందరి వాదన.

మావో మరణంతో తిరిగి జింగ్‌కు కష్టాలు దాపురించాయి. మావో మరణించిన నాలుగు వారాల్లోనే జింగ్‌ను దేశానికే శత్రువు అంటూ అరెస్టు చేశారు. మావో మరణిస్తున్న సమయంలో ప్రభుత్వాన్ని కూల్చివేసేందుకు కుట్ర పన్నిందని, తనను వ్యతిరేకించేవారిని లెక్కలేనంతమందిని చట్టవ్యతిరేకంగా చంపించిందని ఆరోపణలు చేశారు. ఆమెతో పాటుగా ఆమె దుష్ట చతుష్టయంగా పేరుపడినవారిపై కూడా దాదాపు 34వేల మంది బాధితులను చంపించడమే కాకుండా, దాదాపు ఏడు లక్షల మందిపై అబద్ధపు నిందలు వేశారంటూ నేరారోపణలు చేశారు.

మావో మరణంతోనూ, ఈ నేరారోపణలతోనూ జింగ్ కుంగిపోలేదు. తాను దోషినంటూ ఒప్పుకోలేదు. ఎంతో ధీమాతో అరవై ఏళ్ళ జింగ్, అప్పటికే పార్టీ నాయకుడిగా నియమితుడైన, తనకు బలమైన శత్రువైన డెంగ్ జియావో పింగ్ ద్రోహి, ఫాసిస్టు అంటూ విచారణ సమయంలో కేకలు వేసింది. బహిరంగంగానే జరిగిన విచారణలో ఆమె తను తప్పు చేయలేదంటూ వాదించింది. తాను జీవితాన్ని అంకితం చేసిన వ్యక్తి విధానాల నుంచి తన నేరాలను విడదీయలేమని ఆమె నొక్కి చెప్పింది. తనను తాను సమర్థించుకునేందుకు తాను మావో కుక్కను అని చెప్పుకునేందుకు కూడా ఆమె సిగ్గు పడలేదు. తాను మావో కుక్కనని, అతడు కరవమంటే కరిచానని ఆమె వాదించింది. విచారణ పూర్తి అయ్యే వరకూ కూడా ఆమె తన పై తాను నియంత్రణను కోల్పోలేదు. జింగ్ శత్రువులను నిరాశపరుస్తూ ఆమెకు విధించిన మరణశిక్షను అంతిమంగా యావజ్జీవంగా మార్చే వరకూ కూడా ఆమె తన ధైర్యాన్ని కోల్పో లేదు, బేలగా మారలేదు. జైలులో నిరాహార దీక్షలు, కాన్సర్‌తో పోరాటంతో ఆమె తీవ్రమైన మనోవ్యథకు లోనైంది. అంతిమంగా జైలు గదిలోనే ఉరివేసుకుని తనను తాను శిక్షించుకుంది. పార్టీలో నాయకత్వ నిచ్చెన ఎక్కే సమయంలో కుట్రదారులకు సహకరించిన ఆమె చివరికి వారి చేతిలోనే మోసపోయింది. చైనా చరిత్రలో ఆమె ఒక కుట్రదారుగానే మిగిలిపోయింది.

1875-
1962

# కార్ల్ జంగ్

మానసిక శాస్త్ర రంగంలో సిగ్మండ్ ఫ్రాయిడ్ వ్యక్తుల అంతరంగాన్ని విప్పిచెప్పడంలో సిద్ధహస్తుడైతే అంతవరకు ప్రపంచంలో ఎవరు ఎరగని నూతన అంత'రంగాన్ని' కార్ల్ గుస్తావ్ జంగ్ ఆవిష్కరించాడు. మనం తరచు వినే 'అంతర్ముఖుడు'(ఇంట్రావర్ట్), 'బహిర్ముఖుడు' (ఎక్స్‌ట్రావర్ట్), 'సామూహిక అంతశ్చేతన', 'యానిమా', 'యానిమస్' వంటి పదాలకు ఆయనే సృష్టికర్త. మానసిక శాస్త్రాన్ని ఆయన కొత్త పుంతలు తొక్కించాడు. దానికి ఆధ్యాత్మిక రంగు, రుచి, వాసనలను జోడించాడు. దేవుడిని విశ్వసించే జంగ్ అనేకమంది స్త్రీలతో తనకు ఉన్న సంబంధాలను మానసిక 'శాస్త్రబద్ధంగా' సమర్థించుకోగలిగిన గ్రంథసాంగుడు కూడా! తొలిదశలో ఫ్రాయిడ్‌ని గురువుగా భావించిన జంగ్ తర్వాత ఆయనతో విభేదించాడు. మానవుల ఆలోచనా తీరు, ప్రవర్తనకు మూలకారణం లైంగికత్వంలోనే నెలకొని ఉంటుందన్న ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతాన్ని జంగ్ తీవ్రంగా వ్యతిరేకించాడు. 'విశ్లేషణాత్మక మానసిక శాస్త్రం' అనే కొత్త సిద్ధాంతాన్ని ఆయన ప్రతిపాదించాడు. వ్యక్తిగత అంతశ్చేతన, సామూహిక అంతశ్చేతనకు మార్గమని జంగ్ చెబుతాడు. సామూహిక అంతశ్చేతనలో విశ్వవ్యాప్త స్మృతులైన కలలు, గుప్త కోరికలు, జానపద గాథలు, పురాణాలు, మతాలు, విశ్వాసాలు ఇమిడిపోయి ఉంటాయని, వీటన్నింటిని వ్యక్తిగత మనో విశ్లేషణలో వివరించలేమని ఆయన సూత్రీకరించాడు. కథానాయకుడు, మంత్రగత్తె, భూదేవి లేదా నేలతల్లి, యోధుడు, వృద్ధ జ్ఞాని లాంటి విశ్వవ్యాప్త అనాది భావనల మానసిక మూలరూపాల గురించి ఆయన వివరించాడు. మానసిక శాస్త్ర రంగంలో తొలి అడుగు ఫ్రాయిడ్‌దైతే మహత్తరమైన మలి అడుగు కచ్చితంగా కార్ల్ గుస్తావ్ జంగ్‌దే!

కార్ల్ గుస్తావ్ జంగ్ స్విట్జర్లాండ్‌లోని ఓ సాంప్రదాయ ప్రొటెస్టెంట్ క్రైస్తవ కుటుంబంలో జన్మించాడు. తన తండ్రి నియంతృత్వానికి వ్యతిరేకంగా జంగ్ తరచు ఆయనకు ఎదురుతిరిగేవాడు. అయితే తండ్రి మత విశ్వాసాలను అతడు ఎన్నడూ ప్రశ్నించలేదు. యువకుడిగా ఉన్నప్పుడు భాషా శాస్త్రంతో పాటు జంగ్ సైన్సు అంశాలను ఇష్టపడేవాడు. అతడికి వైద్యం చేయడం వారసత్వంగా వచ్చింది. తండ్రిని తృప్తి పరచడానికి జంగ్ బేసెల్ విశ్వవిద్యాలయంలోని వైద్య కళాశాలలో చేరాడు. అదే యూనివర్సిటీలో జంగ్ తాతగారు మెడికల్ ప్రొఫెసర్‌గా పనిచేశారు. జంగ్ ఓపక్క చదువుకుంటునే మరోపక్క ఆధ్యాత్మిక కార్యకలాపాల్లో నిరంతరం మునిగితేలేవాడు. భగవంతుడితో సంబంధం పెట్టుకోవాలని తహతహలాడేవాడు. తర్వాతకాలంలో ఆయన గ్రంథస్థం చేసిన తన జ్ఞాపకాలలో 'నిరర్థకమైన జీవితానికి పరమార్థాన్నిచ్చే ఆ అతీతశక్తి కోసం అప్పుడు నేను పరితపించేవాడిని' అని రాసుకున్నాడు. డాక్టరేటు కోసం ఆయన సమర్పించిన థీసిస్‌లో 'రహస్య తంత్ర విద్యా పరిణామంపై భౌతిక, మానసిక విశ్లేషణ' జరిపాడు. గుప్త తంత్ర విద్యల పట్ల ఆయన ఆసక్తి కడవరకు కొనసాగింది. జంగ్‌కు తంత్ర విద్యలపై గల మక్కువను ఫ్రాయిడ్ ఎగతాళి చేయడమే కాకుండా అతడిని అప్పుడప్పుడు ప్రేమగా ఏడిపిస్తుండేవాడు.

జంగ్ 1900ల్లో జ్యూరిచ్‌లోని బుర్ఘోల్‌జి మానసిక చికిత్సాలయంలో యూగెన్ బ్యూలర్‌కు సహాయకుడిగా వైద్య వృత్తిని ఆరంభించాడు. యూగెన్ 'స్కిజోఫ్రేనియా' వ్యాధి సిద్ధాంతాన్ని ప్రతిపాదించి దానిని తగ్గించేదిశగా కృషి చేశాడు. 1902-03 శీతాకాలంలో జంగ్ ప్యారిస్ వెళ్లి పియర్రే జానెట్ అనే ప్రముఖ మానసిక వైద్యుడి నేతృత్వంలో మానసిక శాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. పియర్రే హిస్టీరియా, స్కిజోఫ్రేనియాలపై చేసిన పరిశోధనలలో కనుగొన్న 'అంతశ్చేతన'ను తర్వాత ఫ్రాయిడ్ తన సిద్ధాంతాలలో ఉపయోగించుకున్నాడు. 1903లో జంగ్, ఎమ్మా రషెన్‌బాక్‌ను వివాహమాడాడు. ఎమ్మా, జంగ్‌కు పరిశోధనల్లో సహాయం చేసేది. జీవితాంతం అతడికి తోడునీడగా నిలిచింది. బుర్ఘోల్‌జి ఆస్పత్రిలోనే జంగ్ మానసిక వైద్య చికిత్సలో తన పరిశోధనలను ప్రారంభించాడు. అప్పటి ఆయన పరిశోధన ఫలితాలు ఇప్పటి వైద్య చికిత్సలో ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. ఈ పరిశోధనల్లో 'కాంప్లెక్స్' అనే భావనను ఆయన ప్రతిపాదించాడు. మెదడులోని ఓ భావోద్వేగ కేంద్రం చుట్టు చిక్కగా అల్లుకున్న ఆలోచనలు, లక్షణాల సంక్లిష్ట సమాహారాన్నే ఆయన 'కాంప్లెక్స్'గా అభివర్ణించాడు. ఆయన పరిశోధనలు

అక్కడే ఆగిపోయిఉంటే మానసిక శాస్త్ర రంగంలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చి, ఫ్రాయిడ్ కుడిభుజంగా మెలగిన జంగ్‌కు నేటి వైద్య రంగం ఒక గొప్ప మానసిక శాస్త్రవేత్తగా మాత్రమే గుర్తింపును ఇచ్చి ఉండేది. తన కెరీర్ ప్రారంభంలో ఫ్రాయిడ్‌ను జంగ్ గురువుగా భావించాడు. 1910లో ఫ్రాయిడ్ సిద్ధాంతాల పట్ల మొగ్గు చూపిన అంతర్జాతీయ మనోవిశ్లేషణ సంస్థకు ఆయన అధ్యక్షుడిగా పనిచేశాడు. అయితే జంగ్‌లోని పరిశోధనా తృష్ణ... లైంగికత్వమే మూల ప్రాతిపదికగా ఉన్న ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతాలతో విభేదించేటట్లు చేసింది. మానసిక శాస్త్ర రంగంలో ఆయనను కొత్తబాట పట్టించింది. దీంతో అప్పటివరకు తండ్రికొడుకుల్లా మెలిగిన ఫ్రాయిడ్, జంగ్‌ల మధ్య పొరపొచ్చాలు వచ్చాయి. అవి వారిద్దరి శాశ్వత ఎడబాటుకు దారితీశాయి. 1913లో జంగ్ తన పరిశోధనల సారాంశమైన 'అంతశ్చేతనా మానసిక శాస్త్ర' గ్రంథాన్ని ప్రచురించాడు. అది మానసిక శాస్త్ర రంగాన్ని ఓ కుదుపు కుదిపింది. ఆ గ్రంథంలో ఆయన ఆదిమ పురాణాలను, మానసికంగా ఉండే గుప్త కోరికలను పోలుస్తూ అద్భుతంగా విమర్శనాత్మక విశ్లేషణ చేశాడు. ఈ గ్రంథం ప్రచురణ తర్వాత జంగ్, ఫ్రాయిడ్‌లు ఎప్పుడు మాట్లాడుకోలేదు.

మేధోపరంగా జంగ్ ఎంత ఎత్తు ఎదిగినా, ఎంత సంచలనం సృష్టించినా ఆయన వ్యక్తిగత జీవితం విమర్శలకు అతీతం కాలేదు. ఆయన తన వద్దకు చికిత్స కోసం వచ్చిన ఆంటోనియా ఉల్ఫ్‌తో వివాహేతర సంబంధం పెట్టుకున్నారు. దీనివల్ల భార్య మనోవేదనకు గురవుతున్నా ఆయన ఆ సంబంధాన్ని 40 ఏళ్లపాటు కొనసాగించాడు. ఉల్ఫ్ తర్వాత ఆయనకు పరిశోధనల్లో సహాయపడింది. జంగ్ తన వివాహేతర సంబంధానికి తాను ప్రతిపాదించిన 'అపోజిట్స్' అనే సిద్ధాంతాన్ని ఆపాదిస్తూ శాస్త్రబద్ధంగా దాన్ని సమర్థించుకున్నాడు. ఈ సిద్ధాంతం ప్రకారం తమ ఐదుగురు పిల్లలను పెంచిపెద్ద చేసి గృహిణిగానే ఉన్న భార్య ఎమ్మాను ఓర్పు, సహనం గల భూదేవి గాను, ఉల్ఫ్‌ను తన సృజనాత్మక శక్తిగాను ఆయన పేర్కొన్నాడు. జంగ్ అంతకుముందే సబీనా స్పెయిల్రిన్ అనే మహిళతో సంబంధాన్ని నెరపినా అది తన కెరీర్‌కు భంగం కలిగిస్తుందని దాన్ని మొగ్గలోనే తుంచివేశాడు. ఆయన తరచు ఆందోళన, నిరాశలకు గురయ్యేవాడు. అది మానసిక వ్యాధిగా పరిణమించింది. ఇది ఆయన్ను జీవితపర్యంతం వెంటాడింది. ఫ్రాయిడ్‌తో తెగదెంపులు చేసుకున్న తర్వాత తను జీవించిన 60 ఏళ్లకాలంపాటు ఆయన రహస్యంగా ఒక వ్యక్తిగత డైరీ రాసేవారు. దానికి 'రెడ్ బుక్' అని జంగ్ పేరుపెట్టాడు. ఆ డైరీలో జంగ్ తన అంతరంగాన్ని ఆవిష్కరించారు. రెడ్ బుక్ జంగ్ మానసిక క్షోభకు అద్దం పడుతుంది. తన మానసిక సంక్షోభానికి ఆయన ఆ డైరీలో అక్షర, చిత్ర రూపాలను ఇచ్చారు. తన వద్దకు చికిత్స కోసం వచ్చే మానసిక రోగుల అంతరంగాలను తెలుసుకోవడానికి తాను స్వయంగా మానసిక సంక్షోభాలకు, దర్శనాలకు, భ్రాంతులకు లోనయ్యేవాడినని జంగ్ పేర్కొనడం ఆయనలోని నిజమైన వైద్యుడికి నిదర్శనం.

మానసిక శాస్త్ర రంగంలో జంగ్ చేసిన కృషిని 'ఆధ్యాత్మిక మనస్తత్వ శాస్త్రం'గా పేర్కొనవచ్చు. కాథలిక్ మత కార్యక్రమాలు, గ్రహాంతర ఎగిరే పళ్లాలు, రసవాదాలపై ఆయనకు ఎంతో మక్కువ ఉండేది. ఇవన్నీ వ్యక్తులలో మానసిక రూపాంతరం కలగడానికి మార్గాలని ఆయన విశ్వసించాడు. తర్వాత దీనివల్ల ఆయన ఫ్రాయిడ్ అనుయాయుల గుప్పిట్లో ఉన్న మనస్తత్వ శాస్త్ర వ్యవస్థ విమర్శలకు గురి కావాల్సివచ్చింది. అయితే 20వ శతాబ్దం చివరినాటికి యాంత్రికమైన ఫ్రాయిడ్ మానవ ప్రవర్తనా సరళి సిద్ధాంతంపై శాస్త్రవేత్తలు ఆసక్తి కోల్పోయారు. జంగ్ సిద్ధాంతాలు మరోసారి తెరపైకి వచ్చాయి. మహా మేధావి, పరిశోధనలు చేయడం పట్ల ఎడతెగని ఆసక్తి చూపే జంగ్ తన జీవిత చరమాంకాన్ని అతీత శక్తుల అన్వేషణకు ఉపయోగించాడు. ఈ అన్వేషణలో భాగంగా ఆయన ఆఫ్రికాను, భారత దేశాన్ని సందర్శించాడు. తన జీవితపర్యంతం జంగ్ భగవంతుడి ఉనికిని తీవ్రంగా విశ్వసించాడు. ఒక సందర్భంలో బిబిసి జర్నలిస్టు ఆయనను ఇంటర్వ్యూ చేస్తూ మీరు దేవుడిని విశ్వసిస్తారా అని అడిగిన ప్రశ్నకు 'నాకు విశ్వసించాల్సిన అవసరం లేదు. ఎందుకంటే భగవంతుడు ఉన్నాడని నాకు తెలుసు కాబట్టి' అని సమాధానమిచ్చాడు జంగ్.

# టెడ్ టర్నర్

టెలివిజన్ కేవలం వినోద సాధనంగానే పరిమితమైన రోజుల్లో రంగ ప్రవేశం చేశాడు, టెడ్ టర్నర్. ప్రపంచాన్ని ఒక కుగ్రామంగా మార్చే ప్రక్రియకు టెడ్ టర్నర్ ఆనాడే శ్రీకారం చుట్టారు. పాతికేళ్ళ వయస్సులోనే తండ్రి ఆధ్వర్యంలో నష్టాల్లో ఉన్న బిల్‌బోర్డ్ అడ్వర్టయిజింగ్ కంపెనీని తనచేతుల్లోకి తీసుకుని లాభాల బాట పట్టించాడు. మంచి లాభాల్లో ఉన్న బిల్‌బోర్డ్ కంపెనీ ఆస్తులను తెగనమ్మి ప్రపంచంలో ఏ వ్యక్తీ చేయనటువంటి సాహసం చేశాడు టర్నర్. దాదాపు 40 లక్షల డాలర్లతో కేబుల్ సూపర్ స్టేషన్‌ను న్యూయార్క్‌లో స్థాపించాడు. టర్నర్ ఈ చర్యను అందరూ హేళన చేశారు. మొదట్లో న్యూయార్క్‌లో జరిగే రోజువారీ కార్యక్రమాలు, సంఘటనలను ప్రసారం చేసిన టర్నర్ తన సంస్థ పేరును కేబుల్ న్యూస్ నెట్‌వర్క్ (సిఎన్ఎన్)గా స్థిరపరిచాడు. న్యూయార్క్‌లో ఏం జరుగుతుందో ఏం జరగబోతుందో ఎప్పటికప్పుడు సిఎన్ఎన్‌లో సమాచారం లభ్యం కావడంతో మెల్లగా సిఎన్ఎన్ ప్రాధాన్యత పెరిగింది.

దీంతో మొదటగా తన కేబుల్ నెట్‌వర్క్‌ను మైక్రోవేవ్ సిగ్నల్స్ ద్వారా ఎర్త్ స్టేషన్‌ను ఏర్పాటు చేసి అమెరికా మొత్తానికి విస్తరించాలని, ఐదేళ్ళలో అమలుపర్చి ప్రపంచంలో ఎక్కడ, ఏ మూల ఎటువంటి సంఘటన జరిగినా తక్షణమే ప్రజలకు అందించే విధంగా ఏర్పాట్లు చేశాడు. అలా కాలక్రమంలో సిఎన్ఎన్ మొదటి టీవీ న్యూస్ ఛానల్‌గా పేరు తెచ్చుకుంది. ఆఫ్ఘాన్ యుద్ధంగానివ్వండి, ఇరాన్-ఇరాక్‌ల మధ్య సాగిన సుదీర్ఘ పోరు కానివ్వండి. సిఎన్ఎన్ రిపోర్టర్లు, కెమెరా సిబ్బంది ప్రాణాలకు తెగించి వార్తలందించే వారు. ఇప్పటి వరకూ ప్రపంచ వ్యాప్తంగా జరిగిన సంఘటనల్లో ఎక్కువ మంది మృత్యువాత పడిన వార్తా మాధ్యమం సిబ్బంది సిఎన్ఎన్ ఉద్యోగులే. మూడేళ్ళలోనే సిఎన్ఎన్ తన కష్టాలు, నష్టాలను అధిగమించి ప్రపంచంలోని మొదటి లాభాలార్జించే న్యూస్ ఛానల్ అన్న పేరు సంపాదించుకొంది.

న్యూస్ ఛానల్‌తో అమెరికా ప్రజలేకాక, యూరప్, రష్యా, జపాన్ వాసుల హృదయాల్లో తగిన స్థానం సంపాదించిన టెడ్ టర్నర్ దృష్టి ఆ తరువాత క్రీడాం శాల మీదకు మళ్లింది. బేస్‌బాల్‌కు స్పాన్సర్ షిప్ ఇచ్చి తన ఛానల్‌లో లైవ్‌గా ప్రసారం చేశాడు. సిఎన్ఎన్ కోసం కోట్లాది డాలర్లు ఖర్చు చేసి ప్రపంచవ్యాప్తంగా టెలివిజన్ ప్రేక్షకులు బీరుట్‌పై మిస్సైళ్ల దాడి, బెర్లిన్ గోడను జర్మన్లు కుప్పకూల్చడం వంటి చారిత్రక దృశ్యాలను చూపించాడు. వార్తా ప్రసారాల వల్ల రేడియో, టీవీలకు వృథా ప్రయాసే తప్ప లాభాలు ఉండవన్న అభిప్రాయాన్ని టర్నర్ పటాపంచలు చేశాడు. సిఎన్ఎన్ ప్రపంచంలోనే అత్యధిక లాభాలార్జించే ఛానల్‌గా పేరు గడించింది. సిఎన్ఎన్‌ను నడుపుతూనే టర్నర్ మరో సాహసం చేశాడు. చిత్రరంగంలో ప్రధానమైన ఎంజిఎం కంపెనీ నిర్మించిన అన్ని సినిమాలను కోటి యాభై లక్షల డాలర్లు పెట్టి కొనేసాడు. ఎంజిఎం రూపొందించిన ఆనాటి చిరస్మరణీయమైన సినిమాల టెలివిజన్ హక్కులు కొన్న టర్నర్ వాటిని ప్రదర్శించడం కోసం టిఎన్‌టి అనే ఛానల్ ప్రారంభించాడు. ఈ ఛానల్ కూడా విజయవంతం కావడంతో విమర్శకుల నోళ్ళు మూతబడ్డాయి. టెలివిజన్ రంగంలో రారాజుగా వెలిగిన టర్నర్ తన దృష్టి సమాజ ఉద్ధరణ వైపు నిలిపాడు. అధిక సంతానం, వర్ణవివక్ష, కాలుష్యం, నిరాయిధీకరణ వంటి అంశాలపై దృష్టి నిలిపాడు. హాలీవుడ్ నటీమణి జేన్ ఫోండాను 1991లో టర్నర్ పెళ్ళి చేసుకున్నాడు. భార్యా భర్తలిద్దరూ కలిసి ప్రపంచ శాంతికి, పేదరిక నిర్మూలనకు సిఎన్ఎన్ ద్వారా విస్తృత ప్రచారం జరుపుతున్నారు.

1996లో బిబిసి, స్టార్ గ్రూప్ సహా వివిధ ఛానల్స్ పోటీని అధిగమించేందుకు టర్నర్ టైమ్-వార్నర్ కంపెనీలో 750 కోట్ల డాలర్ల ఒప్పందం కుదుర్చుకున్నాడు. తాను సంపాదించిన ధనాన్ని ప్రజల బాగుకోసం వెచ్చించాడు టెడ్ టర్నర్. 1997లో ఐక్యరాజ్య సమితికి వందకోట్ల డాలర్ల విరాళాన్ని ప్రకటించాడు టర్నర్. దీంతో టర్నర్ పేరు ప్రపంచమంతా మోగిపోయింది. "ఇంత ధనాన్ని ఒక్కసారిగా ఐక్యరాజ్యసమితికి ఎలా ఇవ్వగలిగారు" అని న్యూయార్క్ టైమ్స్ విలేకరి ప్రశ్నిస్తే "నేను ఇంత కాలం రెండు చేతులా సంపాదించాను, ఇప్పుడిప్పుడే కనీసం ఒక చేత్తోనైనా ఇవ్వడం నేర్చుకుంటున్నాను" అని సమాధానమిచ్చాడు.

# ప్రిన్సెస్ డయానా

వేల్స్ రాకుమారి డయానా తన 36వ ఏట ఒక కారు ప్రమాదంలో మృత్యువాత పడింది. అప్పటిదాకా ఆమెపట్ల విభిన్నంగా వ్యవహరించిన యావత్ ప్రపంచం, ఆమె మరణ వార్తతో విషాదంలో మునిగింది. వివిధ దేశాలకు చెందిన అసంఖ్యాక జనం ఆమె అంత్యక్రియలను ఉద్విగ్నంగా వీక్షించారు. సంతాపం ప్రకటించారు. బరువెక్కిన గుండెలతో స్మృత్యాంజలి ఘటించారు. పూలు సమర్పించారు.

అశ్వచోదిత పల్లకీలో ఊరేగుతూ ప్రిన్స్ ఛార్లెస్‌ను పెళ్ళిచేసుకున్న అందాల డయానా వారి స్మృతిలో మెదిలింది. బోలెడు భవిష్యత్తు, అనుభవించవలసిన వయస్సు కోల్పోయినందువల్లనే జనం చింతించలేదు. ఆమె కుమారుల భవిష్యత్తు, ఎదుగుదల చూడకుండానే కన్ను మూసిందని కూడా జనం బాధపడలేదు. అంతకు మించిన కారణాలు అనేకం ఉన్నాయి. గత శతాబ్దిలో డయానా ఫోటోలతో పోటీపడే వారు ఎవ్వరూ లేరు.

డయానా ఎంత హంగు ఆర్భాటాలతో జీవితం గడిపిందో అందరికీ తెలుసు. భర్తతో ఆమె సమస్యలు, ఆత్మగౌరవం కోసం ఆమె పడ్డ తపన గురించి లోకానికి అంతకంటే బాగా తెలుసు. చార్లెస్‌ను పెళ్ళి చేసుకోవడంతో ఆమె లోకం దృష్టిని ఆకర్షించింది. అమితమైన ప్రభావాన్ని పెంచింది. ఆమె జీవితంలో పూర్తిగా సొంతం అనేది ఏదీ లేకుండా పోయింది. ప్రతి చిన్న విషయాన్ని కొండంతలు చేసి చూడడం మొదలైంది. ఆడంబరభరితమైన ఆమె జీవితాన్ని గురించి ఎన్ని చిలవలు పలవలో కల్పింపబడ్డాయి. తన జీవితానికి ఒక అర్థం, పరమార్థం సమకూర్చుకోవడానికి ఆమె పడ్డ యాతనను లోకం గ్రహించకపోలేదు. తనను తాను సంబాళించుకోవడానికి, బహుశా విఫలం కాకతప్పని వైవాహిక జీవితాన్ని పునరుద్ధరించుకోవడానికి ఆమె పడిన బాధ, చేసిన ప్రయత్నం, ప్రజలు నిశితంగా పరిశీలించారు. తన పిల్లలు సాధారణ జీవితం గడిపేటట్టు చేయడానికి ఆమె పడ్డ తపన ప్రజలు ఆమె మీద అమితమైన ఆదరాభిమానాలు చూపడానికి దోహదం చేశాయి. ఆమె ఆర్భాటం మాటున హృదయం గల ఒక విశిష్ట వ్యక్తిత్వం ఉంది. దురదృష్టమే చిరునామా అయిన సామాన్య ప్రజలను మానవత్వంతోను, చిత్తశుద్ధితోనూ చూడడానికి నిబద్ధతతో చేసిన కృషిని ఆమె ఆంతర్యాన్ని జనం గ్రహించకపోలేదు. వేల్స్ రాకుమారి గత శతాబ్దానికి ప్రతిరూపం అయిన వారిలో ఒకరు కావడం కేవలం ఆమె సాధించిన విజయాలవల్ల కాదు ఆమె స్వాధీనం చేసుకోదలచిన నూతన శిఖరాల కారణంగానే.

డయానా జీవితం, ప్రజలలో ఆమె పట్ల ఉన్న ఆదరం గత శతాబ్దంలో మారుతున్న వ్యవస్థలకు, సంప్రదాయాలకు, సాంకేతికకు ప్రతిరూపం మాత్రమే. గత శతాబ్దం 1901లో విక్టోరియా రాణి మరణంతో ప్రారంభమైంది. ఆమె చాలా అరుదుగా మాత్రమే ప్రజలకు కనిపించేవారు. పత్రికలు ఆమెను గురించి గౌరవపూర్వకంగా ప్రస్తావించేవి. ఆమె కుమారుడు ఎడ్వర్డ్-7 బ్రిటన్‌కు వారసుడు అయ్యాడు. అతని ప్రేమాయణాల గురించి ఎప్పుడూ అంతగా ప్రచారం జరగలేదు. 1936లో ఆయన కుమారుడు ఎడ్వర్డ్-8 తాను ప్రేమించిన అమెరికాకు చెందిన విధవరాలిని పెళ్ళాడడానికి సింహాసనాన్ని పరిత్యజించాడన్న విషయం జనం రేడియోలో విన్నారు తప్ప మరే రగడా లేదు. రాజ కుటుంబాల జీవితం ఒకప్పుడు గోప్యంగా ఉండేది. రాను రాను అది బహిరంగమై పోసాగింది. టెలివిజన్ అన్న నూతన ప్రసార మాధ్యమం రాజకుటుంబం ప్రచార కార్యకలాపాలకు ఒక శక్తిమంతమైన పరికరంగా ఉపకరించింది. దానిని అర్థం చేసుకున్నామని వారు అనుకున్నారు. రెండవ ఎలిజబెత్ రాణి పట్టాభిషేకం సమయంలోనూ, 1981లో ప్రిన్స్ చార్లెస్ వివాహ సందర్భంగానూ ఈ ప్రసార మాధ్యమాన్ని బాగా ఉపయోగించుకున్నారు. ఈ కార్యక్రమాలను ప్రపంచ వ్యాప్తంగా వందకోట్ల మంది వీక్షించారు. కానీ రాజకుటుంబ వ్యవహారాలను బహిరంగ పర్చడంవల్ల పరిస్థితి తమ చేయి దాటిపోయిందన్న విషయాన్ని రాజకుటుంబీకులు గ్రహించలేదు. ఛార్లెస్ వివాహమహోత్సవం తర్వాత ఒక సమాజానికి అత్యావశ్యకమని భావించే ఆచారాలూ సంప్రదాయాలు సడలినా రాజకుటుంబం వ్యక్తిగత జీవిత విశేషాలు-వార్తాంశాలు కావడంతో నాటకీయమైన మార్పులు చోటు చేసుకున్నాయి. ఇక వీరి జీవితాల్లో సంపూర్ణంగా వ్యక్తిగతమైంది ఏదీ మిగలలేదు.

మొదట్లో రాజకుటుంబానికి ప్రజల్లో ఆదరణ పెంచ దానికి డయానా బాగా ఉపకరిస్తుందనుకున్నారు. తాను పెళ్ళి చేసుకోబోయే వ్యక్తికన్నా పదమూడేళ్ళు చిన్న దయిన డయానా అందగత్తె. ఆత్మీయమైంది. ఆమె కూడా గొప్ప కుటుంబానికి చెందిందే. ఆమె స్పెన్సర్ ఎనిమిదవ సామంతుడు, ఫ్రాన్సిస్ రోష్ సంతానం. ఆమెకు చార్లెస్-2తో రక్తసంబంధం ఉంది. ఆమెకు ఏడేళ్ళ వయసులో ఆమె తల్లి దండ్రులు విడాకులు తీసుకున్నారు. ఆమె తండ్రి దగ్గర ఉండిపోయి వెస్ట్ హీత్ స్కూలులో చేరింది. ఆమె కొంత కాలం దాదిగాను, గవర్నెస్‌గాను, కిండర్ గార్డెన్‌లో ఉపాధ్యాయురాలిగానూ పని చేసింది. ఆమె దాపరికం లేకుండా ఉండడం చూసి రాజకుటుంబం ముదిరిపోతున్న బ్రహ్మచారి ఛార్లెస్‌కు ఆమె తగిన జోడీ అని భావించింది. అప్పటికే అతడు అంతర్ముఖుడిగా, నలుగురిలో కలవనితత్వంగల వాడిగా పేరు పడిపోయాడు. బిగుసుకుపోయే లక్షణంగల రాజకుటుంబంలో డయానా వచ్చి చేరడం ఆహ్వానించదగ్గ పరిణామం.

నిశ్చితార్థం జరుగుతుందని ప్రకటించిన దగ్గర్నుంచే డయానాకు ప్రచారం పెరిగిపోయింది. అందరి దృష్టినీ ఆకర్షించడం మొదలైంది. 1981లో జరిగిన ఆమె వివాహ మహోత్సవం ప్రతి మహిళ కలలుగనే పెళ్ళి సందడే. ప్రతి చిన్న అంశాన్ని జాగ్రత్తగా నిర్ణయించారు. ఆమె మొదటిసారి గర్భవతి అయిందన్న వార్త, భవిష్యత్తులో సింహాసనానికి వారసుడు అయ్యే విలియం, రెండో కుమారుడు హారీ జననం ఆదర్శ జీవితానికి అద్దం పడతాయన్న భావన కలిగించాయి. ఆమె ఫోటోలు ఎన్ని తీశారో లెక్కలేదు. సిగ్గరిగా ఉన్న ఆ యువతి నాజూకుగా, దర్జాగా దుస్తులు వేసుకున్న మహిళగా, తన పిల్లలకు, అపారమైన ప్రేమ పంచి ఇచ్చే తల్లిగా ఎదగడం ప్రపంచం కళ్లారా చూచింది. కానీ ఈ ఫోటోల వల్ల తెలిసిన మరో సత్యం ఏమిటంటే డయానాకు, ఛార్లెస్‌కు మధ్య దూరం అంతకంతకూ పెరిగిపోవడం. ఆమె పెళ్ళి విఫలం కావడం. దానికి గల కారణాలు బహిరంగ రహస్యాలు అయిపోయాయి.

1985 నాటికి డయానాపై విపరీతమైన ఒత్తిడి పెరిగింది. ఆమె తాగుబోతుగా మారిపోయింది. మేల్కొని ఉండడం కోసం మందులు వేసుకునేది. ఆత్మ విచ్ఛిత్తికి పాల్పడ సాగింది. రాజ ప్రసాదాల్లోని అందమైన, ఖరీదైన దుస్తులు, నగ, నట్రా ఆమెకు ఆనందాన్ని కలిగించలేకపోయాయి. చివరకు 1996లో ఆమె పెళ్ళి అధికారికంగా పెటాకులైంది. అపారమైన వ్యాకులతకు గురైన డయానా రాజప్రసాదం నుంచి కన్నీరు మున్నీరుగా విలపిస్తూ వెళ్ళిపోతున్న చిత్రాలు వెలువడ్డాయి. ఆమె దయనీయ పరిస్థితి, మోసపోయిన మహిళగా ఆమెదుస్థితి, ప్రేమానురాగాలు అవసరమైన ఆమె అవస్థను జనం గుర్తించారు.

వారి పెళ్ళి పెటాకులు అవడం అధికారికంగా బయట పడడానికి చాలా ముందే రాజకుటుంబం ఆమె మనసును గాయపరిచిందని, ఆమెను మోసగించిందని భావించి జనం ఆమె పక్షం వహించారు. డయానాకు, హౌస్ ఆఫ్ విండ్సర్‌కు మధ్య యుద్ధ వాతావరణం అలముకుంటుండగా రాజకుటుంబం అనేక తప్పటడుగులు వేసింది. ఫోటోలు తీయడానికి అనువుగా ఉన్న మహిళ తమను అదిమి ఉంచిందని భావించింది. ఆమెకున్న రాకుమారి అన్న బిరుదు తొలగించడంతో అభిమానులు ఆమెను 'ప్రజల రాణి' అన్న బిరుదిచ్చి పిలుచుకున్నారు. డయానా తనకు ఉన్న పేరు ప్రతిష్టలను తాను నమ్మిన విశ్వాసాల కోసం వినియోగించుకోవడం చూసి జనం గర్వంతో ఉప్పొంగిపోయారు. ఎయిడ్స్ వ్యాధితో మరణశయ్యమీద ఉన్న ఒక రోగిని ఆమె అక్కున చేర్చుకున్నప్పుడు, మందు పాతరలు అమర్చిన చోట ఆమె నిర్భయంగా నిలబడినప్పుడు జనం విచలితులయ్యారు.

దయ, జాలి ఉండాలని, మంచి పనులు చేయాలని, ప్రేమకు విలువ ఉండాలని డయానా నొక్కి చెప్పింది. అది బ్రిటీష్ రాజరికానికి మచ్చ తేవడంతోపాటు రాజకు టుంబాన్ని పునరావిష్కరించడానికి తోడ్పడింది. ఆమె అకాల మృత్యువు పాలబడడంవల్ల ఆమె ప్రజల మనసులో ఎప్పుడూ నవయువ్వనవతిగానూ, అందగత్తెగానూ, పులకరింపచేసేదిగానూ మాత్రమేకాక జాలి, దయ, మానవత్వం నిండిన మహిళగా శాశ్వతంగా ఉండిపోతుంది.

# చార్లెస్ డీగాల్

రెండో ప్రపంచయుద్ధం జరుగుతున్నప్పుడు 1940లో జర్మనీకి లొంగిపోవ డానికి నిరాకరించి చివరకు జర్మనీ సేనలను ఫ్రెంచి భూభాగం నుండి తరిమికొట్టిన తిరుగుబాటు తత్వంగల యువ ఫ్రెంచి జనరల్ డీగాల్‌కు ఎదురైన వైపరీత్యం ఏమిటంటే తీరా యుద్ధం ముగిసి ఫలితం అటో ఇటో తేలిపోయిన రోజున మిత్రపక్షాల వారు ఆయనను నోర్మాండీ నేల మీద అడుగుపెట్టనివ్వలేదు. ఆ తర్వాత ఎనిమిది రోజులకు ఆయన రక్తసిక్తమైన ఫ్రాన్స్ సముద్రతీరంలో దిగి 1944, ఆగస్టు 24న ప్యారిస్ హోటల్ డీవిల్లే చేరుకోగానే ఫ్రెంచి ప్రజలందరూ గాయపడిన తమ హృదయాలను ఆయనకు అర్పించారు. మూర్తీభవించిన అహంకారి, దయాదాక్షిణ్యాలు లేని సాహసికుడు, ప్రతిభావంతుడైన సైనికుడు, రాజనీతిజ్ఞుడు అయిన ఈ వ్యక్తి ఆ తర్వాత 26 ఏళ్ల వరకు అంటే అతను మరణించే దాకా తన దేశ రాజకీయాలను శాసించాడు. చెల్లా చెదురైన ఫ్రాన్స్ కీర్తి ప్రతిష్టలను మరోసారి పతాకస్థాయికి చేర్చాడు. సాధారణంగా చక్రవర్తులకు మాత్రమే సాధ్యమైన వైభవాన్ని అనుభవించాడు.

డీగాల్‌లో ఈ వైభవోపేత లక్షణాలు అతని తల్లిదండ్రులే ప్రోది చేశారు. వారిద్దరూ అటు చరిత్రతో, ఇటు రాజ్యంతోనూ సంబంధాలున్నవారు. లిలేలూలో జన్మించిన డీగాల్ జెసూట్ల దగ్గర, ప్రొఫెసర్ అయిన తన తండ్రి దగ్గర విద్యనభ్యసించాడు. ఆయన ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంలోనూ గణనీయమైన పాత్ర నిర్వహించాడు. రోమన్ క్యాథలిక్ అయినప్పటికీ సైనికుడి కుమారుడినన్న గర్వం ఆయనలో మెండుగా ఉండేది. తన భవిష్యత్తు దేశవాసుల భవితవ్యంతోనే ముడివడి ఉందని అతనికి చిన్నతనం నుంచీ నూరిపోశారు. ఇకోల్ మిలిటైర్ ఆఫ్ సెయింట్ సిర్ నుంచి పట్టభద్రుడైన డీగాల్ మొదటి ప్రపంచ మహా సంగ్రామంలో వెర్డున్ యుద్ధంలో పాల్గొన్న యోధుడు. ఆ యుద్ధంలో మూడు సార్లు గాయపడ్డాడు. 1916 మార్చి 16న డే మౌంట్‌లో పట్టుబడ్డాడు. మూడేళ్లపాటు యుద్ధ ఖైదీగా ఉన్నాడు. 1924లో జర్మనీలోని సైనిక పౌర రంగాల మధ్య సంబంధాలపై 'లా డిస్కార్డే షెడ్ లెన్నెమీ' అన్న గ్రంథం రాశాడు. ఆయన రచనాశైలిలో కవిత్వాంశ తొణికిసలాడేది. ఆయన అద్భుతమైన వక్త. సైనిక వ్యూహాలపై సులభశైలిలో అనేక గ్రంథాలు రాశారు. అయితే వీటిని ఫ్రాన్స్‌లోని వామపక్ష నాయకులతోపాటు ఆయన సహచరులు సైతం పెద్దగా పట్టించుకోలేదు. 1934లో వెర్స్ లార్మీ డి మిటియర్ అన్న గ్రంథంలో సేనలకు ఎత్తుగడల రీత్యా కలిగే అవకాశం ఉండాలని వాదించారు. ఈ గ్రంథం 1941లో 'ది ఆర్మీ ది ఫ్యూచర్' అన్న పేర ప్రచురితమైంది. మరో యుద్ధంలో విజయం సాధించేది వృత్తి నైపుణ్యంగల సేనలేనని ఆయన ఈ గ్రంథంలో చేసిన ప్రతిపాదన ఆ తర్వాత అక్షరాలా రుజువైంది.

రెండో ప్రపంచ యుద్ధ సమయంలో డీగాల్ శతఘ్నుల బ్రిగేడ్‌కు అధిపతి అయ్యాడు. 1940లో అప్పటి ప్రధాని పాల్ రేనాడ్ ఆయనకు రక్షణ, యుద్ధశాఖలో అండర్ సెక్రెటరీ ఆఫ్ స్టేట్‌గా పదోన్నతి కల్పించాడు. ఆ తర్వాత కొద్ది రోజులకే హెర్మాక్ట్ ఫ్రాన్స్ ఉత్తర భాగాన్ని ఆక్రమించడానికి డీగాల్ ప్రత్యక్షసాక్షి. ఒకప్పుడు తనకు గురువు, వెర్డున్ యుద్ధ వీరుడు అయిన ఫీల్డ్ మార్షల్ హెన్రీ ఫిలిప్ పెటైన్ జాతి నాయకత్వం స్వీకరించడానికి కూడా ఆయన సాక్షీ భూతుడే. విచీలో జర్మనీ సహకారంతో ప్రభుత్వం ఏర్పాటు చేయాలని పెటైన్ ప్రయత్నించడంతో డీగాల్ అత్యంత ఆగ్రహావేశపరుడయ్యాడు. ఈ ప్రతిపాదనను గట్టిగా వ్యతిరేకించి వెంటనే లండన్ వెళ్ళిపోయాడు. కొద్ది రోజులకే తనను తాను ఫ్రెంచి ప్రతిఘటనోద్యమ నాయకుడిగా ప్రకటించుకున్నాడు. బ్రిటన్ ప్రధాన మంత్రి విన్‌స్టన్ చర్చిల్ అనుమతితో లొంగుబాటును ప్రతిఘటించాలని ప్రబోధిస్తూ తన దేశవాసులకు సందేశాలు ప్రసారం చేశాడు. "ఫ్రెంచి ప్రతిఘటన జ్వాల ఆరిపోదు. ఆరిపోనివ్వకూడదు" అని సైన్యంలేని ఈ సేనాని ప్రకటించాడు. "ఫ్రాన్స్ ఏకాకి కాదు. ఒంటరిది కాదు" అని ఎలుగెత్తి చాటాడు. రేడియోలో ఇలాంటి సందేశాలు ప్రసారం చేసిన రెండు వారాలకు, 1940 ఆగస్టు 2న పరోక్షంలో ఆయనపై దేశద్రోహ ఆరోపణ కింద విచారణ కొనసాగించి మరణశిక్ష విధించారు.

ప్రవాస జీవితం గుడుపుతున్న ఇంగ్లండ్‌లోను, తన స్వదేశంలోనూ అతను అనామకుడే. ఆయన వెంట సేనలు ఏమీ లేవు. అయినా డీగాల్ ఉన్న కొద్ది మంది మద్దతుదారులను సమీకరించి 1942 నుంచి పశ్చిమ ఆఫ్రికాలోని ఫ్రెంచి వలస ప్రాంతాలతోనూ, రహస్యంగా కొనసాగుతున్న ప్రతిఘటనోద్యమాలతోనూ సంబంధాలు పెంపొందించుకున్నాడు. అదే సంవత్సరం నవంబర్‌లో అమెరికా, బ్రిటిష్ సేనలు ఉత్తర ఆఫ్రికాలో దిగడంతో తనకు మహదవకాశం లభించిందని డీగాల్ భావించాడు. అల్జీర్స్‌కు మకాం మార్చాడు. జనరల్ హెన్రీ గిరాడ్‌తో కలిసి ఫ్రెంచి విమోచన జాతీయ కమిటీని నెలకొల్పాడు. ఈ సంస్థే 1944లో ఫ్రెంచి రిపబ్లిక్‌లో తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. డీగాల్‌లో ఉన్న జాతీయ భావాలను చర్చిల్ పట్టించుకోనట్టుగా వ్యవహరించాడు. అయినా అతనిని భరించక తప్పదని భావించాడు. దేవదూతలా వ్యవహరించే డీగాల్ తత్వాన్ని భరించడానికి అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్ కూడా సిద్ధపడలేదు. కానీ ఫ్రెంచి విమోచన జాతీయ సంస్థ అధ్యక్షుడిగా ఎన్నికైన తర్వాత చర్చిల్, రూజ్‌వెల్ట్‌తో అనేకసార్లు సంప్రదింపులు జరిపి తన దేశం యుద్ధం తర్వాత మిత్ర దేశాలతో సమాన హోదాలో నిలబడుతుందని డీగాల్ వారికి నమ్మకం కలిగించగలిగాడు.

డీగాల్ 1946లో పదవీ విరమణ చేశారు. కానీ 1958లో మళ్ళీ ప్రజా జీవనంలోకి అడుగపెట్టి ఫ్రాన్స్ ఫిఫ్త్ రిపబ్లిక్ అధ్యక్షుడి గాఎన్నికయ్యాడు. ఫ్రెంచి రిపబ్లిక్ రాజ్యాంగాన్ని రూపొందించాడు. ఆ రాజ్యాంగంలో అధ్యక్షుడిని దేశ వాసులు ప్రత్యక్షంగా ఎన్నుకోవాలని ప్రతిపాదించాడు. కానీ పార్లమెంటును బలహీనమైన వ్యవస్థగా మలిచాడు. తద్వారా ఆయన అంతకు ముందు 83 ఏళ్ల కాలంలో ఫ్రాన్స్‌లో ఏర్పడిన 123 ప్రభుత్వాలు అందించలేని రాజకీయ సుస్థిరతను సమకూర్చగలిగాడు. వలస రాజ్యాలు ఏర్పాటు చేయడాన్ని నిషేధిస్తూ విదేశాంగ విధానానికి రూపకల్పన చేశాడు. దీనితో అల్జీరియా స్వతంత్ర దేశమైంది. కానీ ఈ నిర్ణయం వివాదాస్పదం కావడమే కాక ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం చెలరేగింది. రెండుసార్లు డీగాల్ మీద హత్యాయత్నం జరిగింది. అంతర్జాతీయ నాయకుడిగా డీగాల్ అన్ని దేశాలకూ సమానమైన హక్కులుండాలని, ముఖ్యంగా తమ దేశానికి హక్కులు ఉండాలని వాదించాడు. ఏ దేశానికి ఆ దేశం స్వతంత్రంగా వ్యవహరించే అవకాశం కలిగిఉండాలని, అగ్రరాజ్యాల ఆధిపత్య పోరుకు దూరంగా ఉండే వీలు ఉండాలని చెప్పేవాడు డీగాల్. అంతర్జాతీయ రాజకీయాల్లో ఆయన అనుసరించిన అనేక విధానాలు వివాదాస్పదమయ్యాయి. 1966లో ఫ్రాన్స్ నాటో కూటమి నుంచి వైదొలగడాన్ని అమెరికా వ్యతిరేక చర్యగా పరిగణించారు. తూర్పు యూరప్ దేశాలు ఉపగ్రహాలుగా ఉండకూడదన్న ఆయన వాదనను సోవియట్ వ్యతిరేక చర్యగా భావించారు.

1968లో చెలరేగిన సమ్మెలు, కలహాలవల్ల డీగాల్ మీద నీలి నీడలు వ్యాపించాయి. అంతగా ప్రాధాన్యత లేని ఒక అంశంపై జనాభిప్రాయ సేకరణ జరగాలని డీగాల్ పట్టుబట్టాడు. తీరా అది అపజయం పాలైంది. ఆ తర్వాత పారిస్ వదిలి కొలంబో లెస్ డియక్స్ ఎగ్లిసిస్‌కు వెళ్ళిపోయాడు. అక్కడా ఆయన మునుపు ఎలా జీవించారో అదే పద్ధతిలో విలాసవంతమైన ఏర్పాట్లు లేకుండానే గడిపాడు. స్నేహితులూ ఉండేవారు కాదు. ఆయనకు చేదోడుగా ఉండే భార్య వయోన్ మాత్రమే మిగిలింది. 1970లో డీగాల్ మరణించినప్పుడు అప్పటి ఫ్రాన్స్ అధ్యక్షుడు చార్లెస్ పాంపిడ్ "జాతి విధవరాలైంది" అని ప్రకటించాడు. డీగాల్ చరిత్ర పుటల్లోకి వెళ్ళాడని గుప్పెడు మంది చేసిన నినాదాలను ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. ప్రజలు వాటిని గుర్తుంచుకోనూ లేదు. ఫ్రెంచి ప్రజలకు గుర్తుండిపోయిందల్లా ఆయన ఒక నిర్దిష్ట ప్రయోజనం సాధించడానికి కృషి చేసిన వాడిగా మాత్రమే. ఆయనకున్న ఆదరణ ఆయన వ్యక్తిత్వాన్ని మించింది. ఆయన మంకుతనమే ఆయనకున్న మచ్చ. తన అహంకారం అంతటినీ తన దేశ ప్రయోజనాలకే వినియోగించాడు. ప్రజల మనసులో చెరగనిదల్లా పావు శతాబ్దం పాటు కొనసాగిన డీగాల్ శకం మాత్రమే.

# దలైలామా

దయామయుడైన చెన్రెజి అవతారమే 14వ దలైలామా అని భావిస్తారు. దలైలామా అసలు పేరు జెట్సన్ జాంఫెల్ నగ్వాంగ్ ఓస్సంగ్ యెషీ తెంజిన్ గ్యాస్టో. టిబెట్‌లోని మహాయాన బౌద్ధుడు. ఆయనను "పవిత్ర ప్రభువుగాను, మృదుకీర్తికి ప్రతిరూపంగాను, దయామయుడు గాను, వాగ్ధాటి గలవాడిగానూ, తమ మత విశ్వాసాలను ప్రోదిచేసే పండితుడిగానూ" కొనియాడతారు. ఆయన ప్రాచీన టిబెట్ మత సమాజానికి రాజు కూడా. అయితే తనకు 24 ఏళ్ల వయస్సు వచ్చినప్పటినుంచీ దలైలామా ఎన్నడూ తన మాతృభూమి మీద అడుగు పెట్టలేదు. ఆయన దేశం సర్వస్వతంత్రం కానందువల్ల, రాజకీయ ప్రత్యర్థులైన చైనా కమ్యూనిస్టుల తిరస్కారానికి గురై ఆయన ప్రవాస జీవితమే గడుపుతున్నారు. కానీ ఆయనను ఆరాధించే వారు ప్రపంచ వ్యాప్తంగా అసంఖ్యాకంగా ఉన్నారు. దలైలామా అంటే "వివేక సముద్రం" అని అర్థం.

1937లో ప్రపంచంపై కప్పు అనుకునే లాసాలోని సన్యాసులు, దివ్యవాణి వినిపించేవారు- 13వ దలైలామాకు వారసుడి కోసం అన్వేషణ మొదలు పెట్టారు. వారిలో ఒకరు ధ్యానమగ్నుడై ఉండగా బంగారు పైకప్పు, రంగు రంగుల రాళ్లతో కూడిన ఒక దేవాలయం కనిపించింది. ఆ దగ్గరలోనే ఒకరైతు ఇల్లు ఉంది. ఈ దృశ్యానికి గల విశిష్టతను గమనించి, ఆ వెంటనే కమ్ముకున్న విచిత్రమైన మేఘాలను, ఇంద్ర ధనుస్సులను చూసి సన్యాసులు దేశం నలుమూలలకు తమ దూతలను పంపించారు. టక్సర్ అనే గ్రామంలో వారికి చెన్రెజి అవతారాన్ని గుర్తించడానికి అనువైన అన్ని లక్షణాలు, శారీరక గుర్తులు గల ఒక బాలుడు కనిపించాడు. ఆ బాలుడు సకల పరీక్షల్లోనూ నెగ్గడం వల్ల అతడే అవతారపురుషుడైన తమ గురువు అని అనుకున్నారు. నాలుగేళ్ల ఆ బాలుడిని లాసాకు తీసుకెళ్ళి దలైలామాగా చేసి ఆ బాలుడిని సింహాసనమెక్కించారు. లాసాలోని ఆ రాజ భవనంలో వెయ్యి గదులున్నాయి. అది టిబెట్‌కు పవిత్రమైన వాటికన్ లాంటిది. ఆ రాజభవనంలో ఆ బాలుడు అతి చల్లగా ఉండే చోట నిద్రించాడు. అయిదవ దలైలామా పడక గదిలో పారాడే ఎలుకల మధ్య గడిపాడు. అతనికి మత సంబంధ వ్యవహారాల్లోనూ, భౌతిక వ్యవహారాల్లోనూ శిక్షణ ఇచ్చారు. ఆ తర్వాత ఆయన బౌద్ధంలో డాక్టరేట్ పట్టా సంపాదించాడు. తర్కం, టిబెట్ కళలు, సంస్కృతం, మధ్య యుగాల తత్వశాస్త్రం, బౌద్ధ తత్వ శాస్త్రం అభ్యసించాడు. కవిత్వం, కళలు, నాటకాలు, జ్యోతిషశాస్త్రం ఆయన భవిష్యత్తులో రాజకీయ నాయకుడిగా నిర్వర్తించాల్సిన బాధ్యతలకు అనువుగా గతి తర్కాన్ని క్షుణ్ణంగా అభ్యసించాడు. తర్కం, అలంకార శాస్త్రంలో నిష్ణాతుడైన ట్రిన్‌షాప్స్‌తో వాదోపవాదాలకు దిగడానికి అనువైన విద్యలన్నీ నేర్చుకున్నాడు. యువకుడిగా ఉన్నప్పుడు దలైలామాకు వాహనాల మీద విపరీతమైన ఆసక్తి ఉండడం ఆయనకు శిక్షణ ఇచ్చిన వారికి ఉద్వేగాన్ని కలిగించేది. డాడ్జ్ వాహనం, 1927 నాటి బ్రిటీష్ ఆస్టిన్ కార్లంటే దలైలామాకు చాలా ఆసక్తి ఉండేది. ఆ కార్లలో ఒకదాన్ని మరమ్మతు చేసి నడిపి ఒక స్తంభానికి ఢీ కొట్టాడు. అధ్యయనం చేయడం, దర్బారు నిర్వహించడం, కార్లు మరమ్మతు చేయడం వంటి కార్యకలాపాల్లో నిమగ్నమయ్యే వాడు. ఖాళీ సమయాల్లో పోటాలాలోని తోటలో పెంపుడు జంతువులతో ఆడుకునేవాడు.

ఆ యువకుడు సన్యాసిగా జీవితం గడుపుతున్న సమయంలో మావోసే తుంగ్ నాయకత్వంలోని కమ్యూనిస్టులు అవినీతిలో కూరుకుపోయిన చాంగ్‌కైషేక్ నాయకత్వంలోని జాతీయత వాదులను లోబరుచుకొని పశ్చిమాన ఉన్న మత రాజ్యంపై దృష్టి నిలిపినప్పుడు దలైలామా జీవితం చెల్లా చెదురైంది. ఆ మరుసటి ఏడాది చైనీయులు టిబెట్‌ను ఆక్రమించుకున్నారు. 'సామ్రాజ్యవాద దాడి'ని సాకుగా చూపించారు. సలహాదారుల, ప్రజల ఒత్తిడి కారణంగా దలైలామా ఇండియా చేరుకున్నాడు. పూర్తి రాజకీయ, మత స్వేచ్ఛ కల్పిస్తామని ఆయన శత్రువులు హామీ ఇచ్చిన తరువాత మాత్రమే ఆయన తిరిగి వెళ్ళాడు. ఆ తర్వాత తొమ్మిదేళ్ల పాటు టిబెట్‌కు స్వయం ప్రతిపత్తి కోసం మావోతో సంప్రదింపులు జరిపాడు.

చైనా దురాక్రమణను నివారించడానికి ప్రయత్నించాడు. ఆ తర్వాత మావోకు స్నేహితుడు, విశ్వాసపాత్రుడు అయ్యాడు. అయినా రాజకీయాల్లో సైనిక ధోరణులను అంగీకరించలేదు. అయితే దలైలామా ప్రవచించే అహింస, సత్యం అన్న బౌద్ధ సూత్రాలు పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ ప్రచారంతో సరితూగలేకపోయాయి. దలైలామా శాంతి ప్రియత్వం తన దేశ ప్రజలను గెరిల్లా పోరాట బాటను అనుసరించకుండా నివారించలేకపోయింది. ఈ గెరిల్లా పోరాటానికి తూర్పు టిబెట్‌లోని ఖంసా నుంచి అమెరికా గూఢచార సంస్థ సిఐఎ నుంచి మద్దతు సమకూరింది. ఈ తిరుగుబాటుకు ఊహించినట్టుగానే చైనా దురాక్రమణ సేనల నుంచి తీవ్ర ప్రతిఘటన ఎదురైంది. 1959లో చైనీయులు దలైలామాను ఒక నాటక ప్రదర్శనకు ఆహ్వానించారు. అయితే తన అంగరక్షకులను తీసుకు రాకూడదని ఆంక్ష పెట్టారు. అంతకు ముందు అలాంటి ఉత్సవాలకు హాజరు కావడానికి వెళ్ళిన టిబెట్ నాయకులు మరిక తిరిగి రాని అనుభవం ఉంది. కనుక వేలాది మంది ప్రజలు ఆయన వేసవి నివాసం ముందు గుమిగూడి వెళ్ళకుండా అడ్డుకోవడానికి ప్రయత్నించారు. చైనా సైనికులు రాజభవనాన్ని చుట్టు ముట్టారు. కానీ దలైలామా ఒక సైనికుడి వేషంలో మార్చి 17 రాత్రి తప్పించుకుపోయాడు. మార్చి 20న చైనీయులు దాడి చేసి టిబెట్ తిరుగుబాటును అణచివేశారు. వేలాది మందిని హతమార్చారు. దలైలామా మాత్రం తన దేశం శాశ్వతంగా వదలి వెళ్ళాడు. ఆయనతోపాటు లక్ష మంది టిబెటన్లు కూడా శరణార్థులుగా వెళ్ళారు. ఆ తర్వాత దలైలామా భారత్ చేరుకున్నాడు. భారత ప్రభుత్వం చైనా వారి అభిప్రాయాన్ని ధిక్కరించి దలైలామా ప్రవాస ప్రభుత్వం ఏర్పాటు చేసుకోవడానికి సహకరించింది. చైనా భారత ప్రధాన మంత్రి నెహ్రూతో ఉన్న సాన్నిహిత్యం కారణంగా రాజకీయాల్లో జోక్యం చేసుకోకూడదని అధికారికంగా చేసిన హెచ్చరికలను కూడా దలైలామా లెక్క చేయలేదు. టిబెట్‌లోని మత నాయకులను, జనాన్ని కూడా చైనా ఏరిపారేసింది. ఒక దేశంగా టిబెట్‌కు గుర్తింపు తీసుకురావడం కోసం దలైలామా చాలా ఓపికగా అంతర్జాతీయ స్థాయిలో ప్రయత్నాలు కొనసాగించారు.

పశ్చిమ దేశాల్లోన్ని ప్రజాస్వామ్య దేశాల నుంచి వచ్చే వారికి ఆయన స్నేహపూరితంగా, జిజ్ఞాసువుగా, శాస్త్రీయమైన విషయాల్లో ఆసక్తి గలవారిగా గోచరించేవాడు. ఒక సందర్భంలో సరదాగా ఆయన చేసిన వ్యాఖ్యలు చాలా ఆసక్తికరమైనవి. బుద్ధుడి మాటలు గనక శాస్త్రీయ భావనలకు సరిపోకపోతే వాటిని తిరస్కరించాలని చెప్పాడు. అయినప్పటికీ భవిష్యత్ వాణి వినిపించడం లాంటి అశాస్త్రీయమైన అంశాలలో కూడా ఆయనకు విశ్వాసం ఉండేది. తన దేశ వాసుల మీద అఘాయిత్యాలు జరుగుతున్నప్పటికీ ఆయన తన శాంతి కాముక భావాలను విడనాడలేదు. 1965లో ఐక్యరాజ్య సమితితో సంప్రదింపులు జరిపాడు. 1979లో అమెరికాలో పర్యటించాడు. ఈ రెండు సందర్భాల్లోనూ తనను ఇబ్బందులపాలు చేస్తున్న వారికి, తనను పీడిస్తున్న వారికి వ్యతిరేకంగా ఎలాంటి వ్యాఖ్యలూ చేయలేదు. వారు తనకు ఆధ్యాత్మిక గురువులు అని చెప్పే వాడు. వారు టిబెట్‌కు ఎంతో కొంత మేలు చేశారని కూడా అనేవాడు. 1989లో చైనా ప్రభుత్వ భావాలను తోసిరాజని నార్వేలోని నోబెల్ కమిటీ దలైలామాకు నోబెల్ శాంతి బహుమతి ప్రకటించింది. ఆ బహుమతిని స్వీకరిస్తూ "నేను ఒక సాధారణ బౌద్ధ సన్యాసిని. అంతకన్నా పిసరంత ఎక్కువ కాదు. ఒక్కింత తక్కువా కాదు" అని చెప్పాడు దలైలామా. టిబెట్‌లో ఎవరిని పంచెన్ లామాగా నియమించాలన్న విషయంలో దలైలామా అభిప్రాయాలను ఖాతరు చేయకుండా చైనావారు నోబెల్ బహుమతి ఇచ్చినందుకు తమ నిరసనను వ్యక్తం చేశారు. ఆ స్థానంలో తమకు అనుకూలమైన వ్యక్తిని పంచెన్‌లామాగా నియమించారు. 20వ శతాబ్దం ముగిసేనాటికి బౌద్ధం పశ్చిమ దేశాలలో త్వరితగతిన వ్యాపించింది. శాంతి కాముకుడయిన ఈ బౌద్ధ సన్యాసి ప్రయత్నాలు ఒక సామ్రాజ్యాన్ని ఏ మేరకు కదిలించగలుగుతాయో వేచి చూడాలి.

1913-
1994

# రిచర్డ్ ఎం. నిక్సన్

అమెరికా ప్రజాస్వామ్య చరిత్రలో అత్యంత అప్రతిష్టపాలై, అధ్యక్ష పదవికి రాజీనామా చేసిన వ్యక్తి రిచర్డ్ నిక్సన్. అంతర్యుద్ధ అనంతరం దేశంలో రాజ్యాంగ సంక్షోభం సంభవించింది నిక్సన్ కాలంలోనే. ప్రజల అభిమానానికి, తిరస్కారానికి కూడా గురైన నిక్సన్ పేరు చెప్పగానే ఎవరికైనా గుర్తు వచ్చేది 'వాటర్ గేట్' కుంభకోణమే. ప్రజాస్వామ్య దేశంలో ఒక దేశాధ్యక్షుడు అటువంటి వివాదంలో చిక్కుకోవడం ప్రపంచాన్నే ఆశ్చర్యంలో ముంచెత్తింది. దీనితో తన విధానాల ద్వారా ప్రజాశ్రేయస్సు కోసం ఆయన చేపట్టిన ఎన్నో చర్యలు మరుగునపడ్డాయి. ఎంతో కష్టపడి ఆయన నిర్మించుకున్న రాజకీయ జీవితం దీనితో ఒక్కసారిగా కుప్పకూలింది. తప్పు ఎవరు చేసినా తప్పేనని ప్రజలు తేల్చివేయడంతో నిక్సన్ రాజకీయాలనుంచి నిష్క్రమించక తప్పలేదు.

అమెరికా రాజకీయ చరిత్రలో సంచలనాలకు, వివాదాలకు కేంద్రమైన నిక్సన్ జన్మించింది కాలిఫోర్నియాలోని యోర్బాలిండాలో. అతడి తండ్రి ఫ్రాన్సిస్ ఎ నిక్సన్ రైతు. తల్లి హన్నా మలిహస్ నిక్సన్. వారు పెద్దగా ధనవంతులు కాదు. ఈ కారణంగా నిక్సన్ బాల్యంలో ఇతరులతో కలవలేక పోయేవాడు. ధనికులైన తోటి పిల్లల వెక్కిరింతలే నిక్సన్‌లో ఎదగాలనే పట్టుదలను పెంచాయి. ఆయన దేశాధ్యక్షుడు అయిన తరువాత కూడా బాల్యంలోని ఆ సంఘటనలను గుర్తు చేసుకునేవారంటే ఆ మాటలు ఆయన పై ఎంత గాఢప్రభావాన్ని చూపి వుంటాయో అర్థం చేసుకోవచ్చు. చదువులో చురుకుగా వున్న నిక్సన్ మంచి వక్త కూడా. ఆయన కళాశాల రోజుల నుంచే నాయకత్వ లక్షణాలు చూపడం ప్రారంభించారు. తనను కళాశాలలోని క్లబ్‌లోకి అనుమతించకపోవడంతో వెంటనే పోటీగా ఆర్తోగోనియన్స్ అనే బృందాన్ని ఏర్పాటు చేసి, పోటీగా కార్యకలాపాలు ప్రారంభించాడు. 1934లో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన నిక్సన్‌కు డ్యూక్ యూనివర్సిటీ న్యాయ కళాశాలలో చదువుకునేందుకు స్కాలర్‌షిప్ లభించింది. న్యాయవాదిగా 1937లో పట్టా పొందిన ఆయన వాల్‌స్ట్రీట్ సంస్థలో స్థానం లభించకపోవడంతో కాలిఫోర్నియాకు తిరిగి వచ్చారు.

తన సొంత పట్టణమైన యోర్బాలిండాలో న్యాయవాదిగా ప్రాక్టీస్ ప్రారంభించిన నిక్సన్ అతిత్వరగా తన వృత్తిలో నైపుణ్యాన్ని సాధించారు. అక్కడే ఆయనకు థెల్మా పాట్రీషియా కేథరిన్ రెయాన్ అనే స్కూల్ టీచర్‌తో పరిచయం అయింది. ఆ పరిచయం ప్రేమగా మారింది. 1940లో నిక్సన్ ఆమెను వివాహం చేసుకున్నాడు. ఆమె పట్ల నిక్సన్‌కు అపరిమితమైన ప్రేమ. అందుకే, తాను తీసుకున్న అత్యుత్తమ నిర్ణయం ఆమెను వివాహం చేసుకోవడమేనంటూ తరువాత కాలంలో ప్రకటించారు. పెర్ల్ హార్బర్ పై జపాన్ బాంబు దాడి చేసిన ఎనిమిది నెలల అనంతరం, 1942లో నిక్సన్ నావికాదళంలో కమిషన్‌ను సంపాదించారు. రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్నంత కాలం ఆయన దక్షిణ పసిఫిక్‌లోనే వున్నారు. మరో వైపు, పోకర్ ఆటలో వున్న ప్రతిభతో అక్కడ దాదాపు పదివేల డాలర్లు ఆయన సంపాదించారు. ఈ డబ్బును తన రాజకీయ ఎదుగుదలకు వెచ్చించారు. 1946లో తొలిసారి కాంగ్రెస్‌కు పోటీ చేసేందుకు ఆయన ఆ డబ్బును ఖర్చు చేశారు. తన ప్రత్యర్థి అయిన జెర్రీ వూరిస్ పై కమ్యూనిస్టు అనుకూలుడు అనే ముద్ర వేసి, ఆరోపణలు చేయడం ద్వారా ఆ ప్రచార ఘట్టంతో ఆయన నెగ్గారు. వాషింగ్టన్ వెళ్ళిన తరువాత కూడా ఆయన కమ్యూనిస్టులకు వ్యతిరేక విమర్శలు చేస్తూ పలువురి దృష్టిని ఆకర్షించారు. ఈ నేపథ్యంలోనే ఆయన అమెరికా వ్యతిరేక కార్యకలాపాల కమిటీకి నియమితులయ్యారు. అప్పటి మాజీ హోం శాఖ అధికారి ఆల్గర్ హిస్‌ను ఆయన వెంటాడిన తీరు రిపబ్లికన్ పార్టీ నాయకుల దృష్టిలో పడేలా చేసింది.

రెండు విడతలు ప్రతినిధుల సభా సభ్యునిగా వున్న నిక్సన్ తరువాత సెనేట్‌కు పోటీ చేశారు. అప్పుడు ఆయన ప్రత్యర్థి లిబరల్ డెమొక్రాట్ హెలన్ గహగన్ డగ్లస్. గెలుపు కోసం నిక్సన్ చేసిన ప్రచారం, డగ్లస్‌పై చల్లిన బురద అమెరికా రాజకీయ చరిత్రలోనే అతిహీనమైన ప్రచారంగా ఇప్పటికీ పరిగణిస్తారు. డగ్లస్‌కు కమ్యూనిస్టుల పట్ల సానుభూతి వుందంటూ ఆయన ఆరోపణలు చేసి, ప్రజాభిప్రాయాన్ని తన వైపుకి తిప్పుకున్నాడు. నిక్సన్ సాధించిన ఈ విజయం ఊరికే పోలేదు. రాజకీయ నాయకుడిగా మారిన యుద్ధ హీరో ఐసన్‌హోవర్ 1952

అధ్యక్ష ప్రచారంలో నిక్సన్ పేరును తన సహచరునిగా ప్రతిపాదించడానికి ఇదే విషయం కారణమైంది. కానీ, నిక్సన్‌ను దురదృష్టం వెంటాడింది. ఆయన తన స్నేహితులు ఏర్పాటు చేసిన ప్రత్యేక ప్రచార నిధి నుంచి డబ్బు స్వీకరించారనే విషయం వెల్లడైంది. రాజకీయ పతనానికి చేరువలో వున్నా, నిక్సన్ మాత్రం తాను తమ కుటుంబ శునకమైన 'చెకర్'ను తప్ప మరి దేనినీ బహుమతిగా స్వీకరించలేదంటూ వాదించారు. టెలివిజన్‌లో ఆయన ఈ వాదనే చెకర్స్ స్పీచ్‌గా ప్రాముఖ్యత పొందింది. ఆయన వాదనను ఓటర్లు నమ్మారు. ఐసన్‌హోవర్, నిక్సన్‌లను విజయపు మెట్టు ఎక్కించారు.

పెద్దగా అధికారాలు ఏమీ లేని ఉపాధ్యక్ష పదవిని చేపట్టినా, వార్తల్లో వ్యక్తిగా వుండేందుకు నిక్సన్ చాలా కష్టపడ్డారు. అప్పటి సోవియట్ నేత కృశ్చేవ్‌తో ఆయన వంటగది చర్చతో(మాస్కోలోని అమెరికా సంస్కృతి పై ఒక మోడల్ వంటగదిలో నిర్వహించిన చర్చ) ఆయన ప్రజా దృష్టిని ఆకర్షించారు. పార్టీ ఆయనను 1960లో అధ్యక్ష పదవికి అభ్యర్థిగా ఎంపిక చేసింది. ఆయన ప్రత్యర్థి ధనవంతుడు, ప్రజాకర్షణ వున్న సెనేటర్ జాన్ ఎఫ్ కెనెడీ. వీరిద్దరూ ఉత్తర దక్షిణ ధృవాలు. నిక్సన్‌లో లోపించినవన్నీ కెనెడీలో మెండుగా వున్నాయి. ప్రచార సమయంలో కెనెడీ తన ప్రతిభను కనపర్చి, అధ్యక్ష పీఠాన్ని కైవసం చేసుకున్నాడు. దీనితో నిక్సన్ కాలిఫోర్నియా తిరిగి వెళ్ళిపోయారు. అక్కడ రెండేళ్ళ అనంతరం జరిగిన రాష్ట్ర ఎన్నికల్లో కూడా ఓడిపోయాడు. కొంతకాలం రాజకీయంగా ప్రవాసంలో వున్న నిక్సన్ 1968లో వైట్ హౌస్‌కు పోటీ చేయాలని నిశ్చయించుకున్నారు. ఈసారి ఆయన ప్రత్యర్థి ఉపాధ్యక్షుడు హబర్ట్ హంఫ్రీ. డెమొక్రాట్లు వియత్నాంలో యుద్ధాన్ని చేసిన తీరును సమర్థించిన నేత. ఆ యుద్ధాన్ని అంతం చేసేందుకు తన వద్ద ఒక రహస్య ప్రణాళిక వుందంటూ నిక్సన్ దాదాపు ఒక అర మిలియన్ ఓట్ల తేడాతో హంఫ్రీ పై గెలుపు సాధించాడు. విదేశాంగ వ్యవహారాల్లో నిక్సన్ పరిణతి కారణంగా యుద్ధం పూర్తిగా అంతం కాకపోయినా వేదిక మారింది. ఆయన ఆ చతురతతోనే చైనాతో సంబంధాలను ప్రారంభించి, పశ్చిమాసియాలోని ఈజిప్టుతో సంబంధాలను పునరుద్ధరించి, సోవియట్ యూనియన్‌తో చాలా తెలివిగా వ్యవహరించాడు. దేశంలో కాన్సర్ పై యుద్ధాన్ని ప్రారంభించి, నేర వ్యతిరేక చట్టాలను ఏర్పాటు చేసి, అమెరికన్ ఇండియన్ల స్థితిగతులను మెరుగుపర్చి, అనేక పర్యావరణ సంస్కరణలు ప్రవేశపెట్టారు. అయితే, వామపక్ష కార్యకర్తలను, తన వ్యక్తిగత రాజకీయ శత్రువులను వెంటాడేందుకు ఆయన శాంతిభద్రతల విషయంలో దుష్ప్రచారాన్ని ప్రారంభించారు.

తనను వ్యతిరేకించినవారందరూ తన శత్రువులేనని, వారంతా తనకు చెడు చేస్తున్నారన్న అంతర్గత భయమే ఆయన నైతిక దిగజారుడుతనానికి కారణమైంది. అదే ఆయన వాటర్‌గేట్ వివాదంలో చిక్కుకోవడానికి కీలకమైంది. తన ప్రత్యర్థి అయిన జార్జ్ మెక్‌గవర్న్‌ను 1972లో నిక్సన్ ఓడించే కొద్ది నెలల ముందు, వాటర్‌గేట్ అపార్ట్‌మెంట్లలో వున్న డెమొక్రాటిక్ పార్టీ కేంద్ర కార్యాలయంలో చోరీకి వైట్‌హౌస్ నుంచి దొంగలను పంపారు. వారిని కనుగొని, అరెస్టు చేయడంతో ఈ వ్యవహారం బయిటపడింది. ఈ నేపథ్యంలో నిక్సన్, ఆయన సహచరులు తమను తాము కాపాడుకునేందుకు చేసిన ప్రయత్నాలన్నీ కూడా రాజ్యాంగ సంక్షోభానికి దారి తీసాయి. దీనితో ఈ వ్యవహారం పై విచారణ జరిపేందుకు 1973లో కాంగ్రెస్ కమిటీలను ఏర్పాటు చేయవలసి వచ్చింది. ఇవన్నీ కూడా మరు సంవత్సరం నిక్సన్‌ను అభిశంసించాలని సూచించాయి. తాను దుర్మార్గుడిని కానంటూ నిక్సన్ బహిరంగ ప్రకటన చేసినప్పటికీ, ఓవల్ కార్యాలయంలో రహస్యంగా రికార్డు చేసిన ఆయన సంభాషణలు నిజాన్ని బయటపెట్టాయి. రాజీనామా చేయడం మినహా ప్రత్యామ్నాయం లేకపోవ డంతో 1974, ఆగస్టు 9వ తేదీన నిక్సన్ అమెరికా చరిత్రలో పదవి మధ్యలోనే రాజీనామా చేసిన అధ్యక్షుడయ్యాడు.

కొంతకాలం రాజకీయాలకు దూరంగా వున్నప్పటికీ, ఎనభయ్యవ దశకంలో కొంత ప్రజాదరణను పొందిన నిక్సన్‌ను గతం వెంటాడుతూనే వుంది. అంతర్గతంగా ఆయనకున్న భయాలు ఆయనను రాజకీయాలకు దూరం చేయడమే కాదు, చేసిన మంచినీ విస్మరించేలా చేశాయి.

# నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్

"... పూను స్పర్థలు విద్యలందే... కత్తివైరము కాల్చవోయ్" అన్నాడు గురజాడ. అమెరికా, సోవియట్ మధ్య ప్రచ్ఛన్న యుద్ధ కాలంలో ఉన్న వైరాలే 1969లో మానవుడు చంద్రమండలం మీద కాలు మోపడానికి దారితీశాయి. యూరీ గగారిన్‌ను మొట్టమొదటిసారి అంతరిక్షంలోకి పంపి విశ్వ రహస్యాలను తెలుసుకోవడానికి సోవియట్ యూనియన్ ఒక జాంబవంతుని అంగ వేస్తే చంద్రమండలం మీద మానవుడు కాలుపెట్టడానికి అమెరికా మరో ముందడుగు వేసింది. చంద్రమండల యాత్ర జాతీయ లక్ష్యం కావాలని అప్పటి అమెరికా అధ్యక్షుడు జాన్.ఎఫ్. కెన్నడీ జారీ చేసిన ఆదేశానికి అనుగుణంగా 1969లో చంద్రుడి మీద దిగిన నీల్ ఆర్మ్ స్ట్రాంగ్ పౌర విమానాలు నడిపే పైలెట్. విశ్వ రహస్యాల్ని ఛేదించడానికి మానవజాతి చేస్తున్న ప్రయత్నాలు ఆ రకంగా విజయవంతం అయినాయి. ఆర్మ్‌స్ట్రాంగ్ తండ్రి, అనేక ప్రభుత్వోద్యోగాలు చేసి దేశమంతటా తిరిగి చివరకు వాపకొనేటాలోని ఓహియో పట్టణంలో స్థిరపడ్డారు. ఆర్మ్ స్ట్రాంగ్ అక్కడే జన్మించాడు. చిన్నప్పటి నుంచి ఆర్మ్‌స్ట్రాంగ్‌కు ఆకాశయానం అంటే మోజు. ఆరేళ్ల వయసులోనే మొదటిసారి విమానం ఎక్కాడు. పాఠశాల విద్య పూర్తయిన తర్వాత చిన్న చిన్న పనులు చేసి సంపాదించిన డబ్బుతో విమానయానంలో శిక్షణ పొందాడు. నమూనా విమానాలను తయారు చేశాడు. తన తోటి విద్యార్థులందరూ బేస్‌బాల్ ఆటలో నిమగ్నం అయి ఉంటే ఆర్మ్‌స్ట్రాంగ్ ఆకాశ యానం గురించి ఆలోచిస్తుండేవాడు.

1947లో పైలెట్ లైసెన్స్ సంపాదించాడు. ఇండియానాలోని పర్‌డ్యూ యూనివర్శిటీలో నౌకాదళ విమాన విభాగంలో కాడెట్‌గా చేరాడు. రెండేళ్ల తర్వాత ఆయన కొరియా యుద్ధంలో పాల్గొనాల్సి వచ్చింది. యుద్ధ విమానాలు నడిపాడు. మూడు పతకాలు సంపాదించాడు. కొరియాలో పని చేసిన తర్వాత తిరిగి వచ్చి పర్ డ్యూ యూనివర్శిటీలో అధ్యాపకుడిగా చేరాడు. బతుకు దెరువు కోసం ఒక జాజ్ సంగీత దళంలో పనిచేసేవాడు. 1955లో పట్టభద్రుడైన తర్వాత ఆర్మ్ స్ట్రాంగ్ పౌర విమానయాన పరిశోధక పైలెట్‌గా పని చేయడం కోసం నేషనల్ అడ్వైజరీ కమిటీ ఫర్ ఏరోనాటిక్స్ (ఎన్ఎసిఎ) నాకాలో చేరాడు. మొదట ఓహియోలోనూ ఆ తర్వాత కాలిఫోర్నియాలోని ఎడ్వర్డ్స్ ఏర్‌ఫోర్స్ స్థావరంలోనూ పనిచేశాడు. ఆ తర్వాత నాకా కాస్తా నాసా (ఎన్ఎఎస్ఎ)గా మారింది. దీనిని ఇప్పుడు నేషనల్ ఏరోనాటిక్స్ అండ్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్ అంటున్నారు. మొట్టమొదటి అత్యంత వేగంగా నడిచే విమానాన్ని కూడా ఆర్మ్‌స్ట్రాంగ్ నడిపాడు. ఎక్స్-15 రాకెట్ విమానానికి పైలెట్‌గా పని చేసిన ఆర్మ్‌స్ట్రాంగ్ భూమి నుంచి 40 మైళ్ళ ఎత్తుకు విమానాన్ని తీసుకెళ్ళాడు. అప్పటికి అదే రికార్డు. అయినా ఆర్మ్‌స్ట్రాంగ్‌కు సంతృప్తి కలగలేదు.

టెస్ట్ పైలెట్ అయిన ఏడేళ్ళకు వ్యోమగామి శిక్షణా కార్యక్రమానికి ఆర్మ్‌స్ట్రాంగ్ దరఖాస్తు చేశాడు. ఆయన అభ్యర్థనను మన్నించారు. 1966లో జెమినీ-VIIIని నడిపాడు. మార్చిలో అంతరిక్షంలో రెండు అంతరిక్ష నౌకలు ఒక పెద్ద రాకెట్‌తో లంకె పడిపోయి ప్రమాదకర పరిస్థితిలో చిక్కుకున్నప్పుడు ఆ చిక్కు ముడిని విప్పడంలో విజయం సాధించాడు. అత్యవసర పరిస్థితిలో ఆ అంతరిక్ష నౌకను సముద్రంలో భద్రంగా దింపగలిగాడు. ఉద్విగ్న భరితమైన ఆ పరిస్థితిలో కూడా ఆర్మ్‌స్ట్రాంగ్ చాలా ప్రశాంతంగా పని చేసి గొప్ప సాహసానికి ఒడిగట్టాడు. చంద్రుడి మీద దిగడానికి ఉద్దేశించిన అంతరిక్ష నౌక పతనం అయినప్పుడు కేవలం రెండు వందల అడుగుల ఎత్తు నుంచి పారాచ్యూట్ సహాయంతో భద్రంగా దిగాడు.

ప్రమాదకరమైన పరిస్థితుల్లో కూడా సాహసాలకు ఒడిగట్టి సురక్షితంగా దిగిరావడంలో ఆర్మ్‌స్ట్రాంగ్

చూపిన ప్రతిభ కారణంగానే ఆయనను చంద్రమండల యాత్రకు ఎంపిక చేశారు. చంద్రుడు శతాబ్దాలుగా ప్రాచీనులను ఆకర్షిస్తూనే ఉన్నాడు. కవులకు స్ఫూర్తి నిస్తూనే ఉన్నాడు. చంద్రుడి గురించిన కల్పిత గాథలు వాస్తవంలోకి రావడానికి అనువుగా 'నాసా' సాటర్న్ రాకెట్‌ను ఉపయోగించింది. ఈ అంతరిక్ష యానాన్ని నియంత్రించే కొలంబియాను చంద్రుడి మీద దిగే ఈగిల్‌తో ఎలా అనుసంధానం చేయాలి, మళ్ళీ ఎలా విడగొట్టాలి, చంద్రుడి మీద ఎలా దిగాలి, మళ్ళీ ఎలా వెనుదిరగాలి అనే అంశాలన్నింటినీ అమెరికా బృందం ఖరారు చేసింది. చంద్రుడి మీద దిగడానికి కావాల్సిన సకల సన్నాహాలు పూర్తయిన తర్వాత కూడా ఒక అంశం ఎటూ అంతు పట్టకుండానే మిగిలిపోయింది. చంద్రుడి ఉపరితలం కఠినంగా శిలలాగే ఉందా లేదా ఒక మైలు మేర దిగబడిపోయే మెత్తటి ఇసుక పాతరలాగా ఉందా? అక్కడ దిగినప్పుడు ఆ అంతరిక్ష నౌక, అందులోని వ్యోమగాములు ఆ ఇసుక పాతరలో కూరుకుపోతారా అనే అంశాలు నిగూఢంగానే ఉండిపోయాయి.

1969 జూన్ 16న అపోలో 11లో అంతరిక్ష నౌక కమాండర్ ఆర్మ్‌స్ట్రాంగ్, ఎడ్విన్ ఆల్డ్రిన్, మైఖేల్ కాలిన్స్‌తో కలిసి భూవాతావరణ పరిష్వంగాన్ని ఛేదించుకుని నింగి కెగిశారు. ఆ అంతరిక్షనౌక సెకనుకు ఏడు మైళ్ళ వేగంతో ప్రయాణించినా చంద్రమండలం చేరుకోవడానికి మూడు రోజులు పట్టింది. ఆ అంతరిక్ష నౌకకు మైఖేల్ కాలిన్స్ పైలెట్‌గా ఉన్నాడు. ఈ యాత్రకు కమాండర్ అయిన ఆర్మ్‌స్ట్రాంగ్, సహ పైలెట్ ఆల్డ్రిన్ చంద్రుడి మీద కాలు మోపారు. చంద్రుడి మీద దిగాల్సిన ఈగిల్ అనే అంతరిక్ష నౌకలోని విభాగం అక్కడ దిగడం వల్ల ఏర్పడిన పెద్ద గుంటలో కూరుకుపోయినప్పుడు ఆ అంతరిక్ష నౌకను ఆర్మ్‌స్ట్రాంగ్ సురక్షితంగా చదునైన ప్రశాంత సాగరం (సీ ఆఫ్ ట్రాంక్విలిటీ) వద్దకు చేర్చాడు. అప్పటికి అందులో కొద్ది సెకన్ల పాటు సరిపోయే ఇంధనం మాత్రమే మిగిలింది. 1969 జులై 20న ఆ యాత్రలో భాగస్వాములైన వారిలో సీనియర్ అధికారి అయినందువల్ల చంద్రుని మీద కాలు మోపిన మొట్టమొదటి మానవుడయ్యాడు. తన నౌకలోని నిచ్చెన మెట్లు దిగి అతి చల్లగా, రాళ్ళు రప్పలతో నిండి ఉన్న చంద్ర తలంపై దిగగానే "మానవుడు వేసిన చిన్న అడుగే మానవాళికి జాంబవంతుని అంగ" అన్న మాటలను ఎవరూ మరచిపోలేరు.

ఆల్డ్రిన్ కూడా చంద్రుడి మీద కాలు మోపిన తర్వాత ఇద్దరూ కలిసి 60 కోట్ల మంది టీవీల్లో ఈ మహాద్భుతాన్ని వీక్షిస్తుండగా మంచులో ఆడుకోవడానికి తెల్లని ప్రత్యేక వస్త్రాలు ధరించిన ఈడొచ్చిన బాలల్లాగా చంద్రుడి మీద అడుగులు కదిపారు. వారి బూట్ల గుర్తులు చంద్రుడి ఉపరితలంపై ఉన్న ధూళిపై అలా మిగిలిపోయాయి.

మళ్ళీ భూమికి తిరిగి వచ్చిన తర్వాత ఆర్మ్‌స్ట్రాంగ్ కళాశాలలో ప్రొఫెసర్‌గా చేరాడు. తన ఘనత గురించి తాను మాట్లాడకుండా తన విజయాలే తన గొప్పదనాన్ని చాటేట్టుగా వ్యవహరించాడు. ఎగబడి ఇంటర్వ్యూలు ఇవ్వడం వంటి వాటికి దూరంగా ఉన్నాడు. తనను ఒక మహాపురుషునిగా చేయడాన్ని అంగీకరించలేదు. కానీ భూమి గురుత్వాకర్షణ శక్తిలో కేవలం ఆరో వంతు గురుత్వాకర్షణ శక్తి మాత్రమే ఉన్న చంద్రుడిపై ఆర్మ్‌స్ట్రాంగ్, ఆల్డ్రిన్ పాద ముద్రలు మన మనసుల్లో శాశ్వతంగా నిలిచిపోయాయి. చివరగా ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్రమండలంపై అమెరికా పతాకాన్ని పాతాడు. ఇది అమెరికన్ సంకుచితత్వానికి సంకేతం అన్న వారూ ఉన్నారు. అయితే ఆర్మ్‌స్ట్రాంగ్ అక్కడ ఒక ఫలకాన్ని కూడా ఉంచాడు. ఆ ఫలకం మీద "మేం మానవాళి శాంతి కోసం ఇక్కడికి వచ్చాం" అని రాసి ఉంది. బహుశా విమర్శకారులు ఆ ఫలకం సంగతి విస్మరించి ఉండొచ్చు.

# జవహర్‌లాల్ నెహ్రూ

1889-1964

నవభారత నిర్మాత, శాంతి దూత, స్వతంత్ర భారత తొలి ప్రధాన మంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ పరిణితి చెందిన రాజకీయవేత్త. చరిత్రకారుడు, స్టేట్స్‌మన్, అన్నింటికి మించి రాజకీయ ఉద్యమాల ద్వారా ఆసియావాసుల్లో ఐక్యతాభావం పెంపొందించిన స్నేహశీలి. ప్రజాస్వామ్య ప్రియుడు. గొప్ప స్వాప్నికుడు. భారతదేశాన్ని దీర్ఘకాలం పాటు పాలించిన నెహ్రూ దూరదృష్టితో వేసిన పంచవర్ష ప్రణాళికలు మనదేశాన్ని వ్యవసాయికంగా, పారిశ్రామికంగా ముందుకు తీసుకొని పోయేందుకు ఎంతో దోహదం చేశాయి. తన ఆలోచనా విధానాన్ని, చొరవ, తెగింపును తన కుమార్తె ఇందిరా ప్రియదర్శినికి ధారాదత్తం చేసిన మహామనీషి. ఆయన మరణం తరువాత తనకంటే ప్రతిభాశాలి అయిన ప్రధానమంత్రిని మనకందించారు.

కాశ్మీర్ నుంచి వలస వచ్చి అలహాబాద్‌లో స్థిరపడిన సంపన్నుడైన మోతీలాల్ నెహ్రూ ఏకైక కుమారుడు జవహర్‌లాల్ నెహ్రూ. జవహర్ 1889 నవంబర్ 14న పుట్టాడు. నెహ్రూ పుట్టిన 11 ఏళ్ల తరువాత మోతీలాల్‌కు ఇద్దరు కుమార్తెలు కలిగారు. అలహాబాద్‌లో మోతీలాల్ పేరున్న బారిస్టర్. రెండు చేతులా సంపాదనతో మోతీలాల్ ఇంట్లో భారతీయ వాతావరణం కంటే ఆంగ్లేయుల అలవాట్లనే అనుసరించాడు. రెండు గుర్రాల శాలలతో, రెండు స్విమ్మింగ్‌పూల్స్‌తో రాజభవనం లాంటి ఆనంద నిలయంలో ఉపాధ్యాయులు ఇంటికొచ్చి నెహ్రూకు చదువు చెప్పేవారు. ఎప్పటికైనా లండన్ పంపి కొడుకును బారిస్టర్ చేయాలన్న పట్టుదలతో మోతీలాల్ ఇంగ్లీష్, స్కాటిష్ భాషల్లో విద్యాభ్యాసం చేయించాడు. 15 ఏళ్ళ ప్రాయంలో నెహ్రూ లండన్ వెళ్ళాడు. అక్కడి ప్రసిద్ధ విద్యాలయాలు హారో, కేంబ్రిడ్జిల్లో చదివి బారిస్టర్ అయ్యాడు. అలహాబాద్‌లోనే తండ్రితో కలిసి నెహ్రూ న్యాయవాద వృత్తి మొదలుపెట్టాడు. విద్యాభ్యాస కాలంలో తనకు చదువు చెప్పిన ఒక మాస్టారు ప్రభావంతో నెహ్రూ థియొసాఫికల్ సొసైటీ (దివ్యజ్ఞాన సమాజం) సభ్యుడిగా మారాడు. అప్పటి నుంచి దివ్యజ్ఞాన సమాజం నిర్వాహకురాలు అనిబిసెంట్‌ను నెహ్రూ తన గురువుగా భావించేవాడు. భారత స్వాతంత్ర్య పోరాటంలో అనిబిసెంట్‌ను అరెస్ట్ చేయడంతో నెహ్రూ ప్రత్యక్ష రాజకీయాల్లో పాల్గొన్నాడు. హోంరూల్ ఉద్యమంలో చురుకైన పాత్రను పోషించిన నెహ్రూ న్యాయవాద వృత్తిని పక్కకు పెట్టడంతో మోతీలాల్ కమలాకౌల్‌ను నెహ్రూకిచ్చి వివాహం జరిపించాడు. వారి సంతానమే ఇందిరా ప్రియదర్శిని.

తండ్రి, అనిబిసెంట్ల తరువాత మహాత్మాగాంధీ ప్రభావం నెహ్రూ జీవితాన్ని మలుపు తిప్పింది. 1919లో జలియన్‌వాలాబాగ్ దురాగత నిరసనోద్యమంలో గాంధీ నెహ్రూ ఒకరినొకరు కలుసుకున్నారు. అక్కడి నుంచి వారి అనుబంధం పెనవేసుకుపోయింది. 1921లో సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగంగా గాంధీ మద్దతిచ్చిన ఖిలాఫత్ ఉద్యమానికి బాసటగా నెహ్రూ నిలిచాడు. జాతీయోద్యమంలో నెహ్రూ ఉత్సాహాన్ని చూసిన గాంధీజీ యునైటెడ్ ప్రావిన్స్ కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శిగా నియమించారు. 1926-27 మధ్య కాలంలో కమలా నెహ్రూ ఆరోగ్యం క్షీణించడంతో నెహ్రూ ఆమెను చికిత్స కోసం యూరప్ తీసుకెళ్ళాడు. రాజకీయాల్లో ఎదుగుతున్న నెహ్రూకు యూరప్‌లో కమ్యూనిస్టులు, కేపిటలిస్టులు, సోషలిస్టులు, సామ్రాజ్యవాద శక్తులు, సంస్కర్తలతో పరిచయాలు ఏర్పడ్డాయి. అక్కడే సోవియట్ యూనియన్‌లో సోషలిజం, కమ్యూనిజం ప్రభావాన్ని

అధ్యయనం చేసిన నెహ్రూ సోషలిజం పట్ల ఆకర్షితుడయ్యాడు. భారత్‌కు తిరిగివచ్చిన నెహ్రూ అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు అధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డాడు. గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకరణ ఉద్యమానికి స్వదేశీ వస్తువుల ఆదరణ, జాతీయ విద్య, వివాదాలు కోర్టుబయటే పరిష్కరించుకోవటం వంటి నిర్మాణాత్మక కార్యక్రమాలు- విదేశీ వస్తు బహిష్కరణ కల్లు నిషేధం, కోర్టులు, శాసనసభలు ఆంగ్లేయులకు సహకరించే అన్ని ఉద్యోగాలను బహిష్కరించటం వంటి నిర్మూలనాత్మక కార్యక్రమాలు అనేవి రెండు కళ్ళులా ఉండేవి. 1930లో గాంధీజీ చేపట్టిన ప్రతిష్టాత్మకమైన దండి సత్యాగ్రహంలో ముందుండి పాల్గొన్నందుకుగాను భార్య కమలా సహా నెహ్రూను బ్రిటిష్ సర్కారు అరెస్టు చేసింది. 1931 నుండి 1935 వరకూ ఆ మధ్య కాలంలో కేవలం ఆరు నెలలు తప్ప మిగిలిన కాలమంతా నెహ్రూ జైల్లోనే గడిపాడు. అఖిల భారత కాంగ్రెస్ కమిటీ ఆధ్వర్యంలో జాతీయ ప్రణాళికా సంఘం క్రియాశీల పరిశీలకునిగా గాంధీ నెహ్రూను నియమించాడు. దీని తరఫున చైనా, యూరప్ దేశాలను కూడా నెహ్రూ సందర్శించారు. కాంగ్రెస్ పిలుపిచ్చిన క్విట్ ఇండియా ఉద్యమానికి నేతృత్వం వహించినందుకుగాను గాంధీ, నెహ్రూలతోపాటు ప్రధాన నాయకులందర్నీ బ్రిటిష్ సర్కారు అరెస్టు చేసింది.

దేశ విభజనను ప్రతిపాదించిన మహ్మద్ అలీ జిన్నాతో గాంధీ, నెహ్రూలు మొదట్లో సంపూర్ణంగా విబేధించారు. అయితే నెహ్రూ క్రమంగా పట్టు సడలించాడు. అప్పటి వైస్రాయ్, చివరి గవర్నర్ జనరల్ లార్డ్ మౌంట్ బాటన్ ప్రతిపాదన ప్రకారం భారతదేశం మత ప్రాతిపదికన రెండు దేశాలుగా చీలిపోవడం అనివార్యమైంది. 1947 ఆగస్ట్ 15న ఇండియా భారత పాకిస్తాన్‌లుగా ఏర్పడింది. భారతావని ఏర్పడింది. స్వతంత్ర భారత తొలి ప్రధానిగా పదవీ స్వీకరణ చేసిన అర్ధరాత్రే నెహ్రూ "ప్రపంచం నిద్రాదేవి ఒడిలో గాఢనిద్రలో ఉన్నప్పుడు భారతదేశం మేల్కొంటోంది" అనే చరిత్ర ప్రసిద్ధమైన ఉపన్యాసమిచ్చారు. దేశ విభజనతో ఏర్పడిన మతకల్లోలాలు, కాందిశీకులు, శరణార్థుల సమస్యలను పరిష్కరించేందుకు నెహ్రూ తీవ్రంగా శ్రమించాల్సి వచ్చింది.

భారతదేశాన్ని ప్రణాళికాబద్ధంగా అభివృద్ధి చేయడానికి నెహ్రూ ఎంతో పాటుపడ్డాడు. వ్యవసాయం, పారిశ్రామికాభివృద్ధికి పెద్దపీట వేసి దేశ పురోభివృద్ధికి ఎంతో శ్రమించాడు. కాలువల ద్వారా సేద్యాన్ని ప్రోత్సహించేందుకు భాక్రానంగల్, నాగార్జునసాగర్, హీరాకుడ్ వంటి భారీ బహుళార్ధక సాధక ప్రాజెక్టులను నిర్మించాడు. భిలాయి, రూర్కెలా వంటి ఉక్కు కర్మాగారాలు నెలకొల్పాడు. నెహ్రూ ప్రతిపాదించిన 'పంచశీల' ప్రపంచవ్యాప్తంగా మేధావుల మన్ననలను పొందింది. అలీన విధానాన్ని భారత విదేశాంగ విధానంగా రూపొందించాడు. పెట్టుబడిదారి, సోషలిస్టు కూటములకు మద్దతు ఇవ్వలేదు. అదే మన వైదేశిక నీతి. ఎందరు ప్రధానులు ఇప్పటిదాకా మారినా నెహ్రూ విదేశాంగ విధానమే నేటికీ అమలులో ఉన్నది. నెహ్రూ ప్రధానిగా ఉన్నప్పుడే చైనా, భారత భూభాగంపై దురాక్రమణ చేయడంతో భారత సైన్యం చైనా చేతిలో దెబ్బతింది. ఇందులో నెహ్రూ సాహసోపేతంగా వ్యవహరించలేకపోయారన్న అపవాదు వచ్చింది. దాదాపు పదిహేడేళ్ళపాటు స్వతంత్ర భారతాన్ని జనరంజకంగా నెహ్రూ పాలించాడు. దేశాభ్యున్నతి గురించి నిరంతరం కలలుగన్న ఆ మహామనిషి 1964 మే 27వ తేదీన నిద్రలోనే తుది శ్వాస విడిచారు.

1918-
1970

# గమాల్ అబ్దుల్ నాజర్

జాతి పతనాన్ని శాసించే అవినీతి, సోమరితనం తమ గౌరవాన్ని ఇతరుల ముందు తాకట్టు పెట్టి మోకరిల్లడం వంటి పరిస్థితులలో మార్పు తెచ్చి అరబ్ ప్రపంచాన్ని ఏకతాటిపై నిలిపేందుకు కృషి చేసిన నాయకుడు గమాల్ అబ్దుల్ నాజర్. బ్రిటిష్ వలస పాలన నుంచి, సామ్రాజ్యవాదులు వారి తొత్తులయిన అవినీతి పాలకుల చేతుల్లోంచి ఈజిప్టు విముక్తిని ఆశించిన గొప్ప నాయకుడు. వాస్తవానికి గమాల్ అబ్దుల్ నాజర్ ఒక గొప్ప మానవతావాది. అనేకమందికి ఆయన ఈజిప్టు అధ్యక్షునిగా మాత్రమే తెలుసు. నిజానికి ఆయన గొప్ప సామాజిక విప్లవకారుడు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం వలసవాదాన్ని నిరసించిన నేతల్లో మేటివాడు! అరబ్ ప్రపంచాన్ని ఏకతాటి పై నిలిపేందుకు ఆయన చేసిన కృషి అనన్య సామాన్యం. సోవియట్ యూనియన్‌తో నాజర్‌కు సంబంధాలున్నాయని నాటి అమెరికా పాలకులు గడగడలాడేవారు. ఒక్క అమెరికా ఏమిటి? అన్ని సంపన్న దేశాలదీ అదే పరిస్థితి!

రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా విద్యార్థి దశలోనే ఉద్యమించిన ఘన చరిత్ర ఆయన సొంతం. తన జాతి ప్రజల జీవనంలో ఐక్యతను సాధించి మొత్తం అరబ్బులను ఈజిప్టు గొడుగు కిందకు తేవాలని అభిలషించిన దార్శనికుడు నాజర్. రైతాంగ సంక్షేమం, అభివృద్ధి కోసం పరితపించాడు. క్రూర, నికృష్ట చర్యలను బలంగా నిరసించారు. సామ్యవాద తరహా సంపద పునఃపంపిణీని అభిలషించాడు. అందుకే ఆయన్ను "ఎల్‌రైజ్" (బాస్) అని గౌరవించారు. అరబ్ దేశాల చరిత్రలో జనాలను ఇంతగా ప్రభావితం చేసిన మరే నాయకుడు మనకు కానరాడు.

ఆయన నేపథ్యం చాలా విచిత్రమైంది. ఆయన తండ్రి ఒక చిన్న తపాలా ఉద్యోగి. తల్లి ఒక మహానగరానికి చెందిన పెద్ద బిల్డింగ్ కాంట్రాక్టర్ కుమార్తె. ఆ దంపతులకు నాజర్ అలెగ్జాండ్రియాలో పుట్టారు. నాడు ఈజిప్టు బ్రిటిష్ సంరక్షణలో ఉండేది. అప్పటి సామాజిక జీవన నేపథ్యంలో ఉన్నత వర్గాలకు మాతృభాష పై మమకారం వుండేది కాదు. ఎంతవరకూ, ఆంగ్లం, ఫ్రెంచ్‌ల పైనే మోజుగా వుండేది. ఆ రోజుల్లో అత్యంత అవినీతిపరుడైన ఒక నియంత ఏలుబడిలో ఈజిప్టు కునారిల్లుతుండేది. ఒక నిరుపేదకు సైన్యాధికారి అయ్యే అవకాశం వుండేది కాదు. ఆ నేపథ్యంలో నాజర్‌కు అవకాశం లభిస్తుందని ఊహించడం కష్టమే.

నైలు తీరప్రాంతంలో ఖటాబా గ్రామంలో ఆయన విద్యాభ్యాసం ప్రారంభమైంది. అక్కడే ఆయనకు అదృష్టం కలిసివచ్చింది. తన తండ్రి సోదరుడు ఆనాటికి బ్రిటిష్ ఖైదు నుంచి విడుదలై వచ్చారు. రాగానే నాజర్‌ను మంచి చదువులకోసం తన వద్దకు కైరో పంపమని కోరాడు. తన దాయాది, సహాధ్యాయితో కలిసి నాజర్ ఖటాబా నుంచి కైరోకు బయలుదేరాడు. పాపం! ఆ రోజుల్లోనే నాజర్ తల్లి అకాలమరణం చెందింది. తండ్రి పునర్వివాహం చేసుకున్నాడు. దాంతో నాజర్ కుంగిపోయారు. ఆ రోజుల్లో తన మిత్రునితో కలిసి అమెరికా సినిమాలను తెగ చూసేవాడు. కేవలం బాధను మర్చిపోయేందుకు. అదే కాలంలో నాజర్ రాజకీయ కార్యకలాపాల వైపు ఆకర్షితులయ్యారు.

ఆయన కైరోలో 1937 'రాయల్ మిలటరీ అకాడమీ'లో చేరారు. అంతకు పూర్వమే న్యాయశాస్త్రంలో పట్టభద్రుడయ్యారు. అప్పుడప్పుడే అరబ్బుల విద్యావకాశాలకు ద్వారాలు తెరుచుకుంటున్న కాలమది! సైనిక శిక్షణానంతరం ఈజిప్టు రైఫిల్ బ్రిగేడ్‌లో చేరారు. అక్కడ అనేకమంది సైనికాధికారులతో చర్చించేవాడు. అక్కడే ఆయనకు లెఫ్టినెంట్ అన్వర్-ఎల్-సదాత్‌తో పరిచయమేర్పడింది. అనంతరం కాలంలో అన్వర్ నాజర్ వెన్నంటి వున్నారు. 1941లో నాజర్ సైనిక శిక్షకునిగా నియమితులయ్యారు. యుద్ధ సైనిక కళాశాలకు మారారు. అక్కడే తన భవిష్యత్ ప్రణాళికలను రచించుకున్నారు.

నాటి ఈజిప్టు సైన్యంలో అవినీతి అతి సాధారణం. సోమరితనానికి కొదువే లేదు. దాంతో సామ్రాజ్యవాదుల ముందు జీ హుజూర్ అంటూ మోకరిల్లక తప్పని స్థితి అది. తన దేశం పట్ల, ప్రజల పట్ల అవ్యాజానురాగాలు కలిగిన నాజర్ ఆ పరిస్థితిని మార్చాలని బలంగా నిశ్చయించుకున్నారు.

తొలుత సైన్యంలో, అనంతరం ప్రజా జీవనంలో మార్పులు తేవాలని ఆకాంక్షించారు. ఓపిగ్గా పరిశీలనలను చేశారు. తన అనుభవాన్ని రంగరించారు. ఎన్నో ఏళ్ళు వేచి చూసి అంతిమంగా తిరుగుబాటు చేశారు.

నాజర్ 1948లో ఇజ్రాయెల్‌లో జరిగిన యుద్ధంలో పాల్గొన్నారు. ఆ యుద్ధంలో తీవ్రంగా గాయపడ్డారు. తనను బంధించిన సైనికాధికారితో మొట్టమొదట ఏమన్నారంటే..'మీరు బ్రిటిష్ వలస పాలన నుంచి ఎలా విముక్తులయ్యారు?' అని! 'మీ నుండి మేం నేర్చుకుంటాం' అని తర్వాత తోకలా వ్యాఖ్యానించారు. అనంతర కాలంలో నాజర్ తన సహ సైనికాధికారులతో కలిసి నాటి పాలకుడు ఫారుఖీని గద్దె దింపారు. ఈ ఉదంతాన్ని ఒక చరిత్రకారుడు సరిగ్గా అభివర్ణించారు. అది– 'ఒక అపురూప రహస్యం' అని! తొలుత నాజర్‌కు మేజర్ జనరల్ నజీబ్ అండగా నిలిచారు. అనంతర కాలంలో, అంటే 1954లో నజీబ్ సలహాను నాజర్ పక్కనబె ట్టారు. తనను తాను దేశ ప్రధానిగా ప్రకటించుకున్నారు. అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. తనదైన ఆశావాదంతో, చురుకుదనంతో జనసామాన్యాల హృదయాల పై నాజర్ చెరగని ముద్రను వేశారు.

అయితే ఆయనకు ప్రజాస్వామ్యం పై పెద్దగా నమ్మకాలు లేవు. అందుకే, 1956లో దేశాధ్యక్ష పదవిని చేపట్టిన వెంటనే అన్ని రాజకీయ పక్షాలను, పార్లమెంటును రద్దు చేశారు. అనంతరం భూసంస్కరణలపై దృష్టి సారించారు. భూపరిమితిని విధించారు. విస్తృతంగా భూములను రైతాంగానికి పంచారు. అంతేకాదు ఒక భారీ విద్యుత్ పథకానికి శ్రీకారం చుట్టారు. తద్వారా గ్రామీణ నిరుపేదలను ఆదుకోవాలని ఆయన ఆకాంక్ష. ఆ నేపథ్యంలోనే 'అశ్వాన్ హై డ్యాం'నిర్మాణానికి పునాదులు వేశారు. దురదృష్టం వెంటాడింది. సోవియట్ యూనియన్ నుంచి ఆయుధాలు కొనుగోలు చేశారన్న మిషతో అమెరికా, బ్రిటన్ ఆర్థిక సహాయాన్ని నిలిపివేశాయి. దాంతో నాజర్ ఆగ్రహోదగ్రులయ్యారు. ప్రతి చర్యలకు వెనుకాడరాదని నిర్ణయించుకున్నారు. సూయజ్ కాలువను దిగ్బంధనం చేశారు. అదొక సాహసోపేత నిర్ణయం. అంతే యుద్ధవాతావరణం కమ్ముకుంది. ఐక్యరాజ్యసమితి ఈ దురాక్రమణకు తప్పుపట్టింది. ప్రపంచ చరిత్రలో తొలిసారి అన్నట్టు – అటు అమెరికా, ఇటు రష్యా ఈజిప్టుతో తప్పనిసరై సౌహార్ద్రంగా వ్యవహరించాయి. పెద్ద యుద్ధం ముప్పు తప్పింది.

సూయజ్ సంక్షోభంతో అరబ్ ప్రాంతంలో నాజర్ ప్రభ వెలిగిపోయింది. ఒక్క ఆ ప్రాంతంలోనే కాదు మూడవ ప్రపంచ దేశాల్లో ఆయన ప్రాముఖ్యం పెరిగింది. దాంతో ఈజిప్టులో మతఛాందసవాదులు, కమ్యూనిస్టులపై ఉక్కుపాదం మోపారు. వేర్పాటువాదులను అణచివేశారు. తన కలలను సాకారం చేసుకునే దిశలో 1958లో ఈజిప్టు –సిరియాలతో కూడిన 'మహా అరబ్ గణతంత్రాన్ని' ఏర్పాటు చేశారు. అది 1961లో విచ్ఛిన్నమైంది. ఆయనకు చేదు స్మృతులు తక్కువేమీ కాదు. 1967లో ఇజ్రాయిల్‌తో జరిపిన ఆరురోజుల యుద్ధంలో చావుదెబ్బ తిన్నారు. అలాగే 1962–67 దాకా యెమెన్‌తో సాగించిన అర్ధదశాబ్ద పోరాటం సైతం చేదుగరళాన్ని తినిపించింది. ఇజ్రాయిల్‌తో జరిపిన పోరులో గాజా స్ట్రిప్, వెస్ట్‌బ్యాంక్, గోలన్ హైట్స్‌లో ఎదురుదెబ్బలే మిగిలాయి. దాంతో ఆయనకు రాజీనామా మినహా మరో గతిలేకపోయింది. అయినప్పటికీ ప్రజల మద్దతుతో మళ్ళీ ఆయన గద్దెనెక్కారు. ఏమైతేనేం– అనేకమంది హృదయాల్లో చెరగని స్థానం సుస్థిరం చేసుకున్నారు.

అనంతరకాలంలో శాంతిదూత అవతారమెత్తారు. యెమెన్‌తో సంధి కోసం కృషి చేశారు. 'శాంతి కోసమే భూమి' అన్న నినాదం ఇచ్చారు. పాలస్తీనా విముక్తి సేన (పిఎల్ఓ)కు జోర్డాన్‌కు మధ్య సంధానకర్తగా వ్యవహరించారు. సరిగ్గా 1970 సెప్టెంబర్ 28న ఆయన కువైట్‌కు పయనమవుతూ మార్గ మధ్యంలో విమానంలో తీవ్ర గుండెపోటుకు గురై మరణించారు. ప్రయత్నాలు ఫలించలేదు. మావో జెడాంగ్, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, ఫిడెల్ కాస్ట్రో, హోచిమిన్ తదితర ఉద్దండుల వలె వలసవాద వ్యతిరేక ఉద్యమనేతగా ఆయన పేరు చిరస్థాయిగా నిలిచిపోతుంది.

# ఫెడరికో ఫెల్లిని

వర్ణనాత్మక కథనాలు, కథ ఎలా మొదలవుతుంది, ఎలా ముగుస్తుంది అని ఊహించడానికి వీలైన పద్ధతిలో అందరూ చిత్రాలు రూపొందిస్తున్న తరుణంలో ఫెడరికో ఫెల్లిని అవధులు లేని కలలకు అనువైన చిత్రాలు నిర్మించాడు. ఫెల్లినీ చిత్రాలలో అచేతనులు, విలాసవంతమైన సుఖ జీవనం గడిపేవారు, విశాల వక్షస్థలం గల భూ మాతలు, కాముకత్వం నిండినవారు, అప్పుడప్పుడూ ప్రేక్షకులను మరులు గొల్పేవారు, విముఖత కలిగించే వారు దర్శనం ఇస్తుంటారు. ఒక చేతిలో మెగాఫోన్ పట్టుకున్న నల్లటి స్టెట్సన్ పోకిరీలాగా వ్యవహరించేవాడు. ఇల్‌మెస్ట్రో తానే సృజించిన సర్కస్‌లో రింగ్ మాస్టర్‌గా ఉన్నాడు. ఐ వెటిల్లోని (1953) ఆత్మచరిత్రాత్మకమైన తొలిప్రయత్నాల నుంచి మొదలుకొని, దిశా నిర్దేశంలేని అయిదుగురు యువకుల భేదామోదాల సమ్మిశ్రణమైన జ్ఞాపకాల నుంచి అంతర్జాతీయంగా బ్రహ్మాండంగా విజయవంతం అయిన ఆధునిక రోమ్‌లో సాంకర్యం గురించి వ్యంగ్యాస్త్రాలు విసిరిన "లాడాల్స్ విటా" (1960) వరకు ఫెల్లినీ వ్యక్తిగతంగా తనలో పాతుకుపోయిన భావనలను చిత్రాలలో జొప్పించినప్పుడల్లా అద్భుత విజయాలు సాధించాడు. అదృష్టవశాత్తు బౌద్ధికమైన సంక్షోభాల గురించి ఆయనకు ఎంత ఆసక్తి ఉందో, ఆయనలో ఉన్న హాస్యస్ఫోరకత, అధిక్షేపించగల శక్తి కూడా అపారంగా ఉండేవి. ఈ సమతుల్యత ఉన్నందువల్ల ఆయన కల్పనలు, పరధ్యానపు ఆలోచనలు సైతం అందరినీ ఆకర్షించగలిగాయి.

సినిమా రంగం చిత్రకారులు, సినీ విమర్శకులు ఫెల్లిని నయా వాస్తవికతను, శృంగార పూరితమైన ఆలోచనలను శల్య పరీక్షకు గురిచేస్తే తన చిత్రాల అంతస్సారం ఆ చిత్రాలే వ్యక్తీకరిస్తాయని ఈ దర్శకుడు నొక్కి చెప్పాడు. ఆయన అనుసరించిన మేధావుల వ్యతిరేక వైఖరి ఆయన జన్మించిన రిమినీలోని అడ్రియాటిక్ రేవు ఉన్న ప్రాంతంలో ద్యోతకమయ్యే కృత్రిమత్వానికి పూర్తి భిన్నంగా కనిపించేది. "సినిమా స్త్రీ లాంటిది, నిగూఢమైంది, కాల్పనికమైంది. ఈ లక్షణాలు ప్రతి సృజనాత్మక ప్రక్రియనూ వెంటాడతాయి" అని ఫెల్లినీ ప్రకటించేవాడు. జంగ్ ప్రభావం అమితంగా ఉండడం వల్ల ఆత్మ విమర్శ లక్షణాలను అలవర్చుకున్న దర్శకుడైన ఫెల్లినీ స్త్రీత్వాన్ని అంతరాంతరాల్లో అన్వేషించేవాడు. ఈ లంకె ద్వారానే ఉపచేతనను చేరుకోగలిగేవాడు.

అన్నా గియో వాన్నినీ అనే ఉద్యోగ విరమణ చేసిన ఒక ఫార్మసిస్ట్ భోగలాలసత, కాముకత్వంతో కూడిన తన అందమే ఫెల్లినీ ప్రేమాయణాలకు, తన చిత్రాలలో కథానాయికలను ఎంపిక చేసుకునే విధానానికి కారణం అని చెప్పుకునేది. కానీ ఇల్ మెస్ట్రోలోని కథానాయికకు ఆధారభూతమైన వ్యక్తిత్వం మాత్రం ఆయన భార్య గలియెట్టా మసినాదే. ఆమె ఆత్మ విశ్వాసం గల, తేజోవంతమైన నటి. ఫెల్లినీ నిర్మించిన అనేక చిత్రాలలో ఆమె కథానాయిక. 1943లో తాను రాసిన రేడియోస్క్రిప్టును చదివినప్పుడు ఆమెగొంతులోని మార్దవం ఫెల్లినీని అమితంగా ఆకర్షించింది. ఆ తర్వాత ఎనిమిది నెలలకు ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. అంతకు ముందే ఆయన కథలు రాశారు. నేర సంబంధ వార్తలు, న్యాయ సంబంధ వార్తలు రాశారు. అంతకు ముందు 19 ఏళ్ల వయసులో ఫెల్లినీ నృత్య సంగీత బృందంలో చేరాడు. ఈ అనుభవం ఆయనకు బాగా ఉపకరించింది. దృఢమైన వాస్తవాలను గమనించడానికి, ఆయన చిత్రాలలో తరచుగా కనిపించే సర్కస్ దృశ్యాలకు బాగా తోడ్పడింది. పత్రికలకు ఇంటర్వ్యూలు ఇచ్చినప్పుడు ఆయన తేదీలను అతిశయోక్తులతో చెప్పేవాడు. ఆరో ఏటనే ఇల్లు వదిలి పారిపోయానని చెప్పాడు. నిజానికి ఆయన బాల్యం ఆనందంగానే గడిచింది. మధ్యతరగతి కుటుంబాల వారికి అందుబాటులో ఉన్న సకల వసతులు ఉండేవి. ఆయన పడ్డ కష్టమల్లా తాను చదువుకునే ప్రైవేటు బోర్డింగ్ స్కూలు నిర్వాహకులు అప్పుడప్పుడు విధించే శిక్షలు

అనుభవించడమే.

రెండో ప్రపంచ యుద్ధ సమయంలో సైన్యంలో చేరకుండా వాటంగా తప్పించుకున్నాడు. కొంత మంది మిత్రులతో కలిసి లాభసాటి అయిన ఫన్నీ ఫేస్ షాప్ నిర్వహించాడు. ఇది వాయిస్ రికార్డింగ్‌లు, అప్పట్లో రోమ్‌ను ఆక్రమించిన జి.ఐ.ల కారికేచర్లు తయారు చేయడానికి ఉపయోగపడేది. కొత్త దర్శకుడు రాబర్టో రాసెల్లినీతో కలిసి నయావాస్తవిక చిత్రాల్లో ప్రామాణికం అనదగిన ఓపన్ సిటీ (1945) స్క్రీన్‌ప్లే రచనలో పాల్గొన్నాడు. మూడేళ్ల తర్వాత రాసెల్లినినీ 'ఇల్ మిరాకో' (ది మిరకిల్) అన్న సినిమాలో ఫెల్లినీ కథ వాడుకున్నాడు. ఆ చిత్రంతోనే అందగాడైన ఫెల్లినీ మొట్టమొదటసారి నటించాడు. ఆ పాత్ర నిష్కపటి అయిన ఒక రైతు మహిళకు గర్భం చేసేది. ఆ మహిళ పాత్రను అన్నా మగ్నానీ పోషించింది. కొన్ని చిత్రాలు విఫలమైన తర్వాత 'నై విటెల్లోని' అనే చిత్రం బ్రహ్మాండమైన విజయం సాధించింది. 1954లో ఫెల్లిని 'లా స్ట్రాడా' అనే చిత్రం రూపొందించడంలో నిమగ్నమయ్యాడు. కిరాతకమైన సర్కస్‌లోని ఒక బలిష్ఠుడైన వ్యక్తికి సంబంధించిన కఠోర కల్పిత కథ అది. ఆ పాత్రను ఆంథోని క్విన్ అద్భుతంగా పోషించాడు. ఆయన కఠిన హృదయుడిగా కనిపిస్తాడు. తన సహాయకురాలి స్ఫూర్తిని అణదొక్కుతాడు. ఆ పాత్రను మసినా పోషించింది. 'లాస్ట్రాడా' చిత్రం ఫెల్లినీ విదేశీ భాషా చిత్రాల జోన్‌లో సాధించిన నాలుగు ఆస్కార్ బహుమతుల్లో మొట్టమొదటి బహుమతిని సాధించి పెట్టింది.

ఒక సాధారణ రోమన్ వ్యభిచారిణిగా మసీనా నటించిన 'ఆఫ్టర్ ది నైట్స్ ఆఫ్ కిబిరయా' (1956) తర్వాత ఫెల్లిని కళ అరవైలలో అప్రతిహతంగా ముందుకు సాగింది. ఆ చిత్రంలోని మసినా పాత్ర భవిష్యత్తు మీద బోలెడు ఆశాభావంతో తొణికిసలాడుతుంది. ఆమెకు ఎదురైన దురదృష్టాన్ని లెక్క చేయకుండా మచ్చలేనిదిగా మనగలుగుతుంది. ఫెల్లినీ మొట్టమొదటిసారి ఆర్భాటంగా నిర్మించిన 'లా డాల్సవిటా'లో మార్సెల్లో మస్ట్రోయాని నటించాడు. ఆ నటుడు తర్వాత ఫెల్లినీకి ప్రతిరూపంగా మారిపోయాడు. రాత్రి వేళ ఆత్మలేని ప్రతిరూపమైన సంస్కృతిలో దురదృష్టవంతుడైన పత్రికా రచయిత పాత్ర అది. ఫెల్లినీకి ఉన్న మత వ్యతిరేక భావనలు, అనిటా ఎక్‌బెర్గ్‌ను ఒక కొలనులో ఉద్వేగ భరితంగా నర్తించే, గంతులేసే కాముకురాలిగా చిత్రించడాన్ని వాటికన్ ఖండించింది. కానీ ఈ చిత్రం వాణిజ్యపరంగా బ్రహ్మాండమైన విజయం సాధించింది. '$8^1/_2$' అన్న చిత్రంలో 1963లో ఫెల్లినీ కళ తారాస్థాయికి చేరింది. ఈ సినిమా పేరు '$8^1/_2$' అని పెట్టడానికి కారణం ఏమిటంటే అప్పటి వరకు ఆయన ఎనిమిదిన్నర చిత్రాలకు దర్శకత్వం వహించాడు. ఆ చిత్రంలో మిస్ట్రోయాని నటించాడు. ఇది ఒక సినిమా దర్శకుడి ప్రహసన ప్రాయమైన అవతారానికి సంబంధించినది. విఫలమవుతున్న తన సృజనాత్మకతను నిలబెట్టడం కోసం అందులో ఆ దర్శకుడు రకరకాల జనాన్ని పోగేస్తాడు. రకరకాల భావ చిత్రాలు వినియోగిస్తాడు. ఆ చిత్రంలోని అంతిమ దృశ్యం మరచిపోవడానికి వీలులేనిది. ఒక సర్కస్ రింగ్ చుట్టూ చేరి తగువు పడుతున్న తన అనుచరులను సరైన దారిలో పెట్టడానికి ఇబ్బందుల్లో ఉన్న ఈ దర్శకుడు, కథా నాయకుడి మీద చిత్రించిన అద్భుత దృశ్యం అది. అది దృశ్యరూపంలో పరమాద్భుతంగా రూపు కట్టించిన సంఘటన.

$8^1/_2$ తర్వాత ఫెల్లినీ దర్శకత్వం వహించిన చిత్రాల్లో అధివాస్తవిక 'సటిరికాన్' (1969) ప్రత్యేకంగా పేర్కొనదగింది. ఇది కొందరు యువకులతో కూడిన బృందం సాహసకృత్యాలకు సంబంధించినది. అది క్రైస్తవం నెలకొనక ముందు నాటి పరిస్థితిని చిత్రించిన చిత్రం. పాతజ్ఞాపకాల పేటికలాంటి అమర్‌కార్డ్ (1974) 1930లలో దర్శకుడి బాల్యదశకు సంబంధించిన మరో అపురూప చిత్రం. సుకుమారంగా హాస్యభరితంగా కథ చెప్పిన ఫెల్లినీ శైలి మరిచిపోవడానికి వీలు లేనిది. ఆయన భావదృశ్యాలు లక్షలాది మంది హృదయాలను తాకాయి. ముఖ్యంగా అతని దేశవాసులను ఉత్తేజితం చేశాయి. ఫెల్లినీ తన 50వ పెళ్ళి రోజు జరుపుకున్న మరుసటి రోజు మరణించినప్పుడు జాతి జనులు అర్పించిన నివాళి ఆయన ప్రతిభకు, హృదయ సౌకుమార్యానికి అద్దం పట్టింది.

1881-
1973

# పాబ్లో పికాసో

ఆధునిక చిత్రకళకు ఆయన ఆద్యుడు. 20వ శతాబ్దపు చిత్రకారుల్లో అగ్రగణ్యుడు. పికాసో కుంచె ప్రాచీన చిత్రాలకు ఆధునిక రూపాన్ని, భావాన్ని ఇచ్చింది. ఆయన చిత్రాలు విమర్శకులను, సామాన్యులను కూడా చిత్తరువులను చేసేవి. అయితే ఆయన వ్యక్తిగత జీవితం ఓ విషాద'చిత్రం'. ఆయనకు నలుగురు భార్యలు, అనేకమంది ప్రియురాళ్లు ఉండేవారంటే పికాసో విపరీత మనస్తత్వాన్ని అర్థం చేసుకోవచ్చు. వారిని ఆయన మానసికంగా 'చిత్ర'హింసకు గురిచేసేవాడు. పికాసో విశృంఖలత్వం ఆయన చిత్రాల్లోను కనిపిస్తుందని విమర్శకులు అంటారు. తొమ్మిదేళ్ల వయసులోనే అలవోకగా చిత్రాలను గీసినా కొద్దిగా పెద్దయిన తర్వాత టీవీ తెర పైనే బొమ్మలను గీసినా అవి కాల పరీక్షకు నిలబడలేదు. కానీ అవి ఆయన గురించి ఎంతో తెలుపుతాయి. అల్లరిచిల్లరగా బొమ్మలు గీస్తు చేసిన పరిశోధనే ఆయనను అందలాలు ఎక్కించింది. ఆయన 91 ఏళ్ల జీవితకాలంలో 81 సంవత్సరాలు కుంచెను కదం తొక్కించి కళాత్మక జీవితం గడిపాడు. ఆయనలో వెన్వెంటనే పెల్లుబికే భావాలు, కల్పనా శక్తికి అద్భుతమైన ప్రతిభ తోడై ఆధునిక చిత్ర రాజాలను సృష్టించాయి. 20వ శతాబ్దపు మేటి చిత్రకారుడయ్యాడు పాబ్లో రూయిజ్ పికాసో.

పదేళ్ల వయసులో డ్రాయింగ్‌లో ప్రొఫెసర్ అయిన తండ్రి జోస్ రూయిజ్ బ్లాస్కో వద్ద పికాసో చిత్రకళలో శిక్షణ పొందడం ప్రారంభించాడు. పికాసో ప్రతిభను కనిపెట్టిన తండ్రి చిత్రకళలో అతడు తన ఆశలను తీరుస్తాడని, తనకు పేరు తెస్తాడని భావించాడు. తర్వాత పికాసో బార్సిలోనా లోని లలిత కళల అకాడమీలో విద్యను అభ్యసించాడు. పికాసో తన 16వ ఏట అక్కడ్నించి బయటపడ్డాడు. మాడ్రిడ్ వెళ్లాడు. 'ప్రాడో' కళాఖండాలను చూసి అతడు బిత్తర పోయాడు. గోయా, ఎల్ గ్రెకో, వెలాజ్క్విజ్ లాంటి మహామహులైన చిత్రకారుల రహస్యాలను, చిత్రరీతులను ఆకళింపు చేసుకున్నాడు. డ్రాయింగ్ ప్రొఫెసర్ కావాలన్న తల్లిదండ్రుల కోరికను తిరస్కరించాడు. 1900వ సంవత్సరంలో కాటలాన్ స్టూడియోలో తన సహచరుడైన కార్లోస్ కసగెమాస్‌తో కలిసి ప్యారిస్‌కు పయనమయ్యాడు. ప్యారిస్‌లో వాంగో, టౌలౌస్ లాట్రెక్, సిజాన్నెల చిత్రాలను చూసిన పికాసోకు ఆధునిక స్వేచ్ఛా ప్రపంచపు చిత్ర ద్వారాలు తెరుచుకున్నాయి. ప్యారిస్‌లో కసగెమాస్ ఆత్మహత్య చేసుకోవడంతో పికాసో నిరాశనిస్పృహల్లో కూరుకుపోయాడు. అయితే ఈ సంఘటన పికాసో అనేక చిత్రాలను గీయడానికి ప్రేరణగా నిలిచింది. పికాసో జీవితంలో ఈ సమయాన్ని 'బ్లూ పీరియడ్‌గా' పరిగణిస్తారు. ఈ సమయంలో పికాసో మట్టి రంగు రంగరించి సంప్రదాయబద్ధంగా జాతరల్లో కనిపించే జానపద రూపాలను చిత్రించాడు.

1907లో సంప్రదాయ కళను అనుసరిస్తూ పికాసో చిత్రించిన 'లెస్ డిమొయిసెల్లెస్ డి అవిగ్నాన్' అతడి చిత్ర జీవితాన్ని మలుపు తిప్పింది. ఈ చిత్రంలో ఐదు గురు కథానాయకుల నగ్న దేహాలు కోణాకారంలో ముందుకు తీక్షణంగా చొచ్చుకుపోతున్నట్లు ఉంటాయి. ఈ పెయింటింగ్ పికాసో చిత్రాలలోనే చిత్రరాజమైంది. కళాఖండంగా నిలిచిపోయింది. పికాసోకు పండితులు, పామరులు బ్రహ్మరథం పట్టారు. ఇది ఆధునిక చిత్ర ప్రపంచంలో విప్లవాత్మక పోకడలకు దారి తీసింది. విశ్లేషణాత్మక క్యూబిజం చిత్రాలకు బీజం అయ్యింది. పికాసో అతడి సహ చిత్రకారుడు జార్జెస్ బ్రాక్‌లు అభివృద్ధి చేసిన ఈ శైలి పాశ్చాత్య ప్రపంచంలో చోటు చేసుకుంటున్న పునరుజ్జీవన సిద్ధాంతాన్ని తలకిందులు చేసింది. ఆఫ్రికా శిల్ప కళ, తొలినాళ్ల ఎల్‌రియన్ కళ, క్రైస్తవ శిల్ప రూపాల నుంచి పికాసో తన నూతన శైలికి స్ఫూర్తిని పొందాడు. ప్రాచీన కళా ఖండాలకు ఆధునిక రూపాన్ని, భావాన్ని సంతరించడంలో పికాసో సిద్ధహస్తుడ ు. పికాసోకు చిత్ర ధ్యాస పట్టుకుంది. ప్రతి వస్తువులో కళాత్మక రూపాలను దర్శించడం మొదలుపెట్టాడు.

ప్రాచీన కళాఖండాలు మహాత్ముల అవశేషాల వంటివని భావించాడు. సాహిత్యం కూడా అతడికి స్ఫూర్తినిచ్చింది. ఆస్కార్ వైల్డ్, గుల్లామ్ అపొల్లినైర్‌ల రచనలకు చిత్ర రూపాన్ని ఇచ్చాడు.

చిత్రకళలోనే కాక పికాసో కామకళలో కూడా సిద్ధహస్తుడే! ఆయనకు అనేకమంది స్త్రీలతో సంబంధాలు ఉండేవి. ఆయనకు నలుగురు భార్యలు అనేకమంది ప్రియురాళ్లు ఉండేవారు. వారు ఆయనకు పడకలో సుఖాన్ని, చిత్రాలకు స్ఫూర్తినీ ఇచ్చారు. పికాసో వారి మీద అంతులేని వ్యామోహాన్ని చూపించేవాడు. అంతలోనే కసురుకొని దూరంగా నెట్టివేసేవాడు. వారి మధ్య శత్రుత్వాన్ని కల్పించి వారు పోట్లాడుకుంటుంటే వినోదించేవాడు. వారి ఈర్ష్య, అసూయలు ఆయనకు సంతోషాన్ని కలగజేసేవి. యుగోస్లావియాకు చెందిన డొర మార్ ఆయన మొదటి భార్య. పికాసో చేష్టలతో రష్యా బ్యాలెట్ కళాకారిణి ఓల్గా కొఖ్లొవా, మేరీ థెరిసి వాల్టర్‌లకు పిచ్చి పట్టింది. వాల్టర్ ఈ 'చిత్ర'హింసను భరించలేక చివరకు ఆత్మహత్య చేసుకుంది. పికాసో విపరీత మనస్తత్వానికి విసిగిపోయి ఆయన భార్య ఫ్రాంకోయిస్ గిలాట్ పిల్లలు క్లాడ్, పలొమాలను తీసుకుని ఇంట్లో నుంచి వెళ్లిపోయింది. పికాసో చివరి భార్య జాక్వెలిన్ రొక్ రివాల్వర్‌తో కాల్చుకుని చనిపోయింది. పికాసో స్త్రీ ద్వేషం, తన పాత స్నేహితుడు, కవి అయిన మాక్స్ జాకోబ్‌ను నాజీల చెర నుంచి విడిపించడానికి ప్రయత్నించకపోవడం ఇవన్నీ తిమ్మినిబమ్మి చేసే మనస్తత్వం గల ఆయన వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించడానికి విమర్శకులు, కథకులకు అవరోధాలుగా నిలిచాయి.

పికాసో ఊహలు ఆయన అసంబద్ధమైన, వినాశకరమైన వ్యక్తిత్వం నుంచే ప్రాణం పోసుకునేవి. తర్వాతకాలంలో ఆయన కుంచె నుంచి రూపుదిద్దుకున్న చిత్రాలలో తననితాను బాధితుడిగా, శిక్షకుడిగా మలచుకునేవాడు. పికాసో కుంచె నుంచి జాలువారిన మినోటార్, ఏజియన్ మానవ వృషభం చిత్రాలు పరస్పర వైరుధ్య అంశాలైన ప్రేమ, ద్వేషాలపై ఆయనలోని మోజుకు ప్రతీకలు. అయితే ఆయన చిత్రాలన్నీ ప్రతికూల భావోద్వేగాలను ప్రతిబింబించవని విమర్శకులు, అభిమానులు అంటారు. పికాసో తననుతాను ఆకాశానికి ఎత్తివేసుకోవడం, తనకు నచ్చిన పనులనే చేయడం లాంటివి తరచు అందరిముందు ప్రదర్శిస్తుండేవాడు. ఆయన కంటబడిన వస్తువులకు రూపురేఖలు మారకుండా ఉంటాయనే నమ్మకమూ లేదు. ఆయన తన భౌతిక శక్తిసామర్థ్యాలను మిగతా రంగాలకు కూడా విస్తరించాడు. శిల్పకళ, లిథోగ్రఫీ, సెట్టింగుల నిర్మాణాలు, పింగాణీ కళ, భవన నిర్మాణాలలో ప్రావీణ్యం సంపాదించాడు.

విశ్లేషణాత్మక క్యూబిజం శైలి నుంచి కొలేజ్, సంయోగిక క్యూబిజం శైలులను తన చిత్రాలలో పికాసో ఉపయోగించాడు. తర్వాత ఆధిభౌతిక వాస్తవాలకు తన కుంచెతో రూపమిచ్చాడు. 1937లో పికాసో మాతృదేశం స్పెయిన్‌లో అంతర్యుద్ధం ప్రారంభమైంది. అదేసమయంలో జర్మనీ, స్పెయిన్‌లోని బాస్క్ రాజధానిపై బాంబుల వర్షం కురిపించి దానిని ధ్వంసం చేయడం పికాసో చిత్రాలలోనే ఉత్కృష్ట చిత్రం అనదగ్గ 'గుయెర్నికా'కు ప్రాణం పోసింది. ఇది కూడా ఆయన మనోభావాలను ప్రతిబింబించింది. తన మానసిక చేతనత్వ ధారలా మాటల స్రవంతికి కుంచెతో రూపమిచ్చిన పికాసో ఆధునిక చిత్రరాజమిది. పికాసో తనలో పెల్లుబికే పరస్పర మానసిక వైరుధ్యాలను కుంచెతో కాన్వాస్ మీద రంగరించాడు. జీవిత చరమాంకంలో పికాసో తన చిత్రాలలో ఎక్కువగా మృత్యువును చిత్రించడం మొదలుపెట్టాడు. ఈ దశలో తన కుంచె నుంచి జాలువారిన అద్భుత కళాఖండాలను నిర్లక్ష్యం చేశాడు. చివరకి 'నేను' అనేది ఇక ఉండదని, అది అఖండ మృత్యువులో లయం అవుతుందన్న చేదునిజం అతడిని ఒంటరిని చేయడమేకాక అతడిలోని మానవత్వాన్ని మేలుకొల్పింది.

1856-
1939

# సిగ్మండ్ ఫ్రాయిడ్

వియన్నాలోనూ, లండన్‌లోనూ ఉన్న సిగ్మండ్ ఫ్రాయిడ్ ఇళ్లల్లోని చదువుకునే గదుల బల్లలమీద ప్రాచీన నాగరికతకు ఆనవాళ్లయిన శిల్పాలు, చెక్కిన బొమ్మలు ఉండేవి. ఆయన మనసుకు నచ్చి సేకరించిన ఈ ఆదిమ కళాఖండాలు, ప్రాచీన కాలానికి చెందిన గణ చిహ్నాలు ఫ్రాయిడ్‌లో గూడుకట్టుకుపోయిన జిజ్ఞాసకు తార్కాణం. ఇవన్నీ వస్తు ప్రదర్శనశాలలో ఉంచదగినవే. ప్రాచీన కాలం నుంచి మానవ మనస్తత్వంలో దాగి ఉన్న భావాలను రుజువుచేయడానికే వినియోగించుకున్నాడు ఆ మనోవిశ్లేషణకు ఆద్యుడైన ఫ్రాయిడ్. తను మేదస్సుకు సంబంధించినంతవరకు ఒక రకమైన పురాతత్వవేత్తనని ఆయనే చెప్పుకునేవారు. ఈ కళాఖండాల్లో మానవ మేధస్సులో నిబిడీకృతమై ఉన్న మానవ స్వభావ చిత్రం ఉందని ఆయన కనుగొన్నాడు. విపరీతమైన ప్రయాసకు ఓర్చి తన మనస్సును, తన దగ్గరకు చికిత్సకోసం వచ్చే వారి మనస్తత్వాలను విశ్లేషించి మనిషిలో గుర్తుపట్టడానికి వీలులేని ఒక పరాయి భావన, దాగి ఉన్న ఉద్దేశాలు, విచిత్రమైన అపరాధభావన, అణచిపెట్టుకున్న ద్వేషం, నీడలా వెంటాడే లైంగిక వాంఛలు ఉంటాయని విప్లవాత్మకమైన విశ్లేషణను అందించిన 20వ శతాబ్దంలోని ప్రతిభాశాలి ఫ్రాయిడ్.

అచేతనపై ఆయన చేసిన పరిశోధన, మానవ స్వభావాన్ని ప్రభావితం చేయడంలో ఈ అచేతన పాత్ర గురించి చెప్పిన విషయాలు అదే వృత్తిలో ఉన్న తోటి వారి నుంచి తిరస్కారాలకు గురిచేసింది. ఆధునిక సైద్ధాంతిక చరిత్రలో ఇంతటి వివాదాస్పదమైన ప్రసిద్ధుడు మరెవరూ లేరు. తాను 'జనం నిద్రను చెడగొట్టిన దురాక్రమణదారున్నని' ఆయనే చెప్పుకునేవారు. చాలా మంది ఆయనను కువైద్యుడు, వెర్రివాడు అనేవారు. చిత్తవికృతి, బాల్యంలోని లైంగికత, దానికి సంబంధించిన ఈడిపస్ కాంప్లెక్స్‌పై ఇప్పటికీ వివాదాలు చెలరేగుతూనే ఉన్నాయి. కానీ అదే సమయంలో ఫ్రాయిడ్ భావనలు, వాటిని చెప్పడానికి ఆయన వాడిన పరిభాష మన సంస్కృతిలోను, భాషలోనూ విపరీతంగా చొచ్చుకుపోయాయి. బాల్యం అమాయకత్వంతో మాత్రమే కూడుకున్నదని, మానవ భావోద్వేగాలలోని నీచ భావనలు ఇతరులలో మాత్రమే ఉంటాయని చెప్పడానికి వీలు లేకుండా పోయింది.

మొరేవియాలోని ఫ్రీబెర్గ్‌లో జాకోబ్, అమేలీ ఫ్రాయిడ కు ఉన్న పదిమంది సంతానంలో సిగ్మండ్ అందరికన్న పెద్దవాడు. తల్లికి అతనంటే చాలా ఇష్టం. మొదటి నుంచీ ఆయన తెలివి తేటలుగల విద్యార్థి. కానీ అతనికి సహజంగా అబ్బిన జిజ్ఞాస చదువుమీద దృష్టి నిలవనీయకుండా చేసింది. ఆ కారణంగా వియన్నా యూనివర్శిటీలో విద్యాభ్యాసం చాలా ఆలస్యమైంది. ఆయనకు రాజకీయాల మీద ఆసక్తి మెండు. అయితే ఆయన వియన్నాకు చెందిన యూదు అయినందువల్ల రాజకీయాల్లో రాణించడానికి అవకాశం తక్కువ అయినందువల్ల వైద్యవృత్తిలో స్థిరపడ్డాడు.

మనస్తత్వ పరిశీలనలో పరిశోధనలు ప్రారంభించ డానికి ముందు ఆయన ప్రయోజనకరమైన పరిశోధనలు కొనసాగించి పరిణామ సిద్ధాంతంలోనూ, ఆధునిక నాడీ శాస్త్రం లోనూ మౌలికమైన అంశాలను ప్రతిపాదించాడు. 1895లో 'స్టడీస్ ఇన్ హిస్టీరియా' (జోసెఫ్ బ్రూయర్‌తో కలిసి రాసిన గ్రంథం) ప్రచురించడానికి ముందే ఆయన తన దగ్గరకు వచ్చే రోగుల చిక్కులతో కూడిన వ్యక్తిగత చరిత్రను విడమర్చేవాడు. స్వేచ్ఛానుషంగ పద్ధతి ద్వారా ఆయన ఈ పని చేసేవారు. ఈ విధానం మానసిక విశ్లేషణకు గురవుతున్న వ్యక్తి తన మనసుకు ఏది తోస్తే అది మాట్లాడేవాడు. కొద్ది సంవత్సరాల తర్వాత ఫ్రాయిడ్ సైకోన్యూరోసిస్‌లో మునిగిపోయాడు. తన ఉద్వేగభరితమైన, విభ్రాంతి పరిచే కలలను, తన మన ప్రవృత్తిలోని దుర్బలత్వాన్ని విశ్లేషించేవాడు. సాహసోపేతమైన ఈ ప్రక్రియ ఫలితంగానే ఆయన 'ది ఇంటర్ ప్రిటేషన్ ఆఫ్ డ్రీమ్స్' అన్న గ్రంథం రాశారు. ఇది 1900 సంవత్సరంలో వెలువడినప్పుడు ఆయన మీద విమర్శలు వెల్లువెత్తాయి. ఈ గ్రంథం కలల స్వభావాన్ని, విశిష్టతను విశ్లేషిస్తుంది. అచేతన ఎలా పనిచేస్తుంది, మానవ మనస్తత్వంలోని అంతరాంతరాలకు మూలం బాల్యంలో ఉందని, తెరలు తెరలుగా వచ్చే ఆలోచనలను, భావాలను చేతనత్వంగల మెదడు ఎలా నిరాకరిస్తుంది, ఏమైనా సరే వీటిని ఎలా విస్మరించాలని

ప్రయత్నిస్తుందో ఈ గ్రంథంలో వివరించారు. 1905లో ప్రచురితమైన 'త్రీ ఎస్సేస్ ఆన్ ది థియరీ ఆఫ్ సెక్స్యువాలిటీ' అన్న గ్రంథం కూడా తీవ్ర విమర్శలకు తావిచ్చింది. ఈ గ్రంథంలో కలత పెట్టే అంశాలు అంతవరకు బాల్యంలో దాగి ఉన్న లైంగికతను చర్చించాయి. ఆ దశ కోలాహలంగా ఉండే దశ అనీ, తల్లిదండ్రుల పట్ల తప్పించుకోడానికి వీలులేని శృంగార సంబంధాలు ఉంటాయని, అదే సమయంలో వారి పట్ల వ్యతిరేక భావన కూడా అంతే ఎక్కువగా ఉంటుందని ఈ గ్రంథంలో వివరించాడు.

ఈ భావాలు దిగ్భ్రాంతి కలిగించేవి అయినందువల్ల అన్ని పక్షాల నుంచి నిందాత్మకమైన అభిప్రాయాలే వ్యక్తం అయినాయి. కానీ కొత్త భావనలు కొత్త శత్రువులను కొనితేవడం సహజమే. 'మొజెస్ అండ్ మోనోథీయిజం' అన్న గ్రంథంలో హిబ్రూల గొప్ప నాయకుడు నిజానికి ఈజిప్ట్‌కు చెందినవాడు అని చెప్పడం వల్ల తన తోటి యూదులకు దూరం అయ్యాడు. అంతకు 11 ఏళ్ల ముందు రాసిన 'ది ఫ్యూచర్ ఆఫ్ ఇల్యూజన్' అన్న రచనలో చావు భయం వల్ల, అమరత్వం కావాలని కోరుకోవడంవల్ల మానవాళి ఒక మానవాతీతశక్తిని సృష్టించే క్రమంలోనే మతం పుట్టిందని వాదించాడు ఫ్రాయిడ్.

తనంత తానే తనకు అపరాధ భావన ఉందని, తనలో దుస్సాహసిక లక్షణాలు ఉన్నాయని, చిత్తవైకల్యం ఉందని చెప్పుకున్న ఫ్రాయిడ్ ఇతరుల లైంగికత గురించి మాట్లాడినందుకు ఆయన సమకాలికులు నిరసించారు. ఆయనకు తన భార్య మార్త చెల్లెలు మిన్నా బెర్నెస్‌తో సంబంధం ఉందని ఫ్రాయిడ్ జీవిత చరిత్ర రచయితలు అంటున్నారు. బహుశా ఫ్రాయిడ్ వైవాహిక జీవితం పొడవునా ఈ అక్రమ సంబంధం ఉండి ఉంటుందంటున్నారు. తాను 1907లో మొట్టమొదటిసారి ఫ్రాయిడ్‌ను కలుసుకోవడానికి వెళ్ళినప్పుడు మిన్నా తనను పక్కకు పిలిచి తన బావతో తనకు సన్నిహిత సంబంధం ఉందని చెప్పినట్టు ఫ్రాయిడ్ శిష్యుడు కార్ల్ జంగ్ చెప్పాడు. తన ఆప్త మిత్రుడు, చాలా సన్నిహితుడు అయిన డాక్టర్ విల్‌హెల్మ్ ఫ్లీస్ విషయంలో తనకు 'అణచిపెట్టుకోవడానికి వీలులేని స్వలింగ సంపర్క భావనలు' ఉండేవని ఫ్రాయిడ్ అంగీకరించాడు. స్త్రీలు, పురుషులు ఇద్దరి పట్ల కూడా అందరికీ లైంగిక భావాలు ఉంటాయని విల్‌హెల్మ్ సిద్ధాంతీకరించాడు. తర్వాత ఫ్రాయిడ్ దీనిని తన సిద్ధాంతంగా కూడా అంగీకరించాడు. కొన్ని విషయాలు లేదా వస్తువుల విషయంలో ఉండే అపరిమితమైన భయం (ఫోబియా) ఉన్న వారికి ఫ్రాయిడ్ చికిత్స చేసేవాడు. అయితే ఆయనకూ రైలు ప్రయాణం అంటే అపారమైన అయిష్టత ఉండేది. 'మౌఖిక ఆనందం' 'చావు కోరిక' అన్న మాటలను సృష్టించింది ఫ్రాయిడే. ఆయన రోజుకు 20 సిగార్లు కాల్చేవాడు. అప్పుడప్పుడు కొకెయిన్ వంటి మాదక ద్రవ్యాలను సైతం సేవించేవాడు. అతని దవడకు కాన్సర్ వ్యాధి సోకినందువల్ల 33 సార్లు శస్త్ర చికిత్స జరిగింది. ఈ బాధను ఉపశమింపచేయడానికి ఇవి ఉపకరించేవి. అతని మూర్ఖత్వానికి పరాకాష్ట ఏమిటంటే తన కూతురు అన్నాఫ్రాయిడ్ మీదే మనోవిశ్లేషణ ప్రయోగాలు చేయడం. ఈ పాపాన్ని ఇప్పటికీ ఎవరూ క్షమించలేరు. మళ్ళీ ఇలాంటి ప్రవర్తన కూడదని రాసింది కూడా ఆయనే.

తన వ్యక్తిగత విషయాలను మాత్రం చాలా జాగ్రత్తగా దాచిపెట్టేవాడు. తన జీవితకాలంలో అనేకసార్లు తన నోట్స్, ఫైళ్లు ధ్వసం చేశాడు. బహుశా భవిష్యత్తు తరాల వారికి వాటి మీద ఉండే ఆసక్తిని వమ్ము చేయడానికి ఈ పని చేసి ఉంటాడు. సొంత సాహసకార్యాల మీద ఫ్రాయిడ్‌కు విశ్వాసం ఉండేది కాదని ఇటీవల ఫ్రాయిడ్ జీవిత చరిత్ర రాసిన పీటర్ గే అంటారు. తన తరం వారు తనను ఎలా అపార్థం చేసుకున్నారో బహుశా ఫ్రాయిడ్ ఊహించి ఉంటాడని అంటాడు గే. ఫ్రాయిడ్ మీద ఈ విమర్శలు, దాడుల మాట ఎలా ఉన్నప్పటికీ ఫ్రాయిడ్ దారిలో విశ్లేషణలు కొనసాగుతూనే ఉన్నాయి. తన తప్పిదాలను తానే అంగీకరించేపాటి సాహసి అయిన ఫ్రాయిడ్‌కు అంతకు మించిన నివాళి ఏమీ ఉండదు. జనానికి తమపై తమకు ఉన్న భ్రమలను చెల్లా చెదురు చేసిన ఫ్రాయిడ్ తమ గురించి తాము అన్వేషించుకునేట్టు చేశాడు.

1901-
1954

# ఎన్రికో ఫెర్మి

అణుబాంబును తయారు చేయడానికి కావాల్సిన మౌలిక పరిశోధనలను అందజేసింది ఐన్‌స్టీన్ అయినా ఆ క్రమం పూర్తి కావడానికి అవసరమైన ఇతర అంశాలను కనిపెట్టిన శాస్త్రవేత్తలు ఎందరో వున్నారు. 1939లో పదార్థం రహస్యాన్ని కనిపెట్టిన ఘనత ఎన్రికో ఫెర్మికి దక్కుతుంది. ఫెర్మి ప్రతిభ బహుముఖమైంది. ఆయన గణిత శాస్త్రవేత్త. ఇంజనీరు. అణుబాంబు తయారు చేయడానికి అత్యావశ్యకమైన అణువు ప్రతిచర్యా పరంపర (చెయిన్ రియాక్షన్) కనుగొన్న వారిలో ఫెర్మి అవిభాజ్య భాగస్వామి. జీవితాంతం ఆయన కొనసాగించిన కృషి ఒక వైపు ప్రజాస్వామ్యం విజయవంతం కావడానికి తోడ్పడితే రెండో వైపున భయానక వాతావరణాన్ని సృష్టించడానికీ దోహదం చేసింది.

ఫెర్మి తాత పర్మాలోని స్వతంత్ర రాజ్యాధిపతులైన డ్యూక్‌ల దగ్గర పనిచేసిన చిరుద్యోగి. ఫెర్మి రోమ్‌లో జన్మించాడు: విజ్ఞాన శాస్త్ర రంగంలో పరిశోధనలు ఆయనను శాస్త్రవేత్తలలో మకుటంలేని రాజుని చేశాయి. బాల్య దశలోనే గణితంలోనూ విజ్ఞానశాస్త్రంలోనూ ఆయన అసాధారణమైన ప్రతిభా పాటవాలు కనబరిచాడు. భౌతిక శాస్త్ర సిద్ధాంతాల మూలాలను కనిపెట్టడానికి ఆయన పుస్తకాల దుకాణాల చుట్టూ తిరిగేవాడు. పదో ఏడు వచ్చేటప్పటికే ఫెర్మి గణిత శాస్త్ర ప్రయోజనాలను ఆకళింపు చేసుకున్నాడు. ఉన్నత పాఠశాల విద్య పూర్తయ్యేనాటికి విజ్ఞాన శాస్త్ర రంగంలో ఆయన తెలివితేటలు యూనివర్సిటీ పట్టభద్రులకేమాత్రం తీసిపోయేవి కావు. రియల్ స్కొలా నార్మేల్ సుపీరియర్‌లో చదువుకునేటప్పుడు పదిహేడేళ్ల వయసులోనే తన ప్రొఫెసర్లకే విప్లవకరమైన పదార్థం, శక్తి (క్వాంటం థియరీ) గురించి ఉపన్యాసాలు ఇచ్చాడు. విపరీతంగా పెరిగిన ఆధునిక భౌతికశాస్త్ర అగ్రగామి సిద్ధాంతాల విషయంలో ఆయన అప్పటికే నిష్ణాతుడు. పై చదువులకోసం ఆయన నెదర్లాండ్స్‌లోని లీడెన్‌లోనూ, జర్మనీలోని గోటింజెన్‌లోనూ ఫెలోషిప్‌లు సంపాదించాడు.

1924 నాటికే ఫెర్మి ఫ్లారెన్స్ యూనివర్శిటీ అధ్యాపకుడిగా ఉన్నాడు. ఆ తర్వాత రెండేళ్లలోనే ఆయన క్వాంటం సంఖ్య నిర్దేశించిన ఆవరణలో ఒకటి కన్నా మించి ఎలక్ట్రాన్ ఉండడం ఎందుకు అసాధ్యమో సిద్ధాంతీకరించారు. ఊల్ఫ్‌గాంగ్ పాలీ వర్జన సూత్రాలను విడమర్చగలిగాడు. 1927లో రోమ్ యూనివర్శిటీ భౌతిక శాస్త్ర సంస్థలో చేరాడు. అప్పటికి ఆ సంస్థ ఇటలీలో భౌతిక పరిశోధనల్లో మంచి పేరుతో ఉండేది. అతి కొద్ది మందికి మాత్రమే కొరుకుడు పడే అణు పరిశోధనలో ఆయన చేసిన కృషి కారణంగానే ఇటలీలో కొత్త నియంత బెనిటో ముసోలినీ ఫెర్మీని "అకాడమియా ద ఇటాలియాన్"లో పరిశోధకుడిగా నియమించాడు. అణు సిద్ధాంత భౌతికశాస్త్రం ఎదుగూ బొదుగూ లేకుండా తయారై స్తంభించిపోతోందని గుర్తించిన అతి కొద్ది మంది శాస్త్రవేత్తల్లో ఫెర్మీ ఒకడు. సిద్ధాంత విషయాలలోనూ, ప్రయోగ రంగంలోనూ అత్యంత ఆసక్తి కనబరిచేవాడు. అణుభౌతిక శాస్త్రంలో పరిశోధనలు కొనసాగించడానికి తాను పరిశోధిస్తున్న మౌలిక విభాగాన్ని మార్చుకున్నాడు. ప్రకృతిలో కొత్త స్థిరాంశాన్ని ఆయన శాసించాడు. దీనిని ఫెర్మి కాన్‌స్టెంట్ అనీ (జీ) అనీ అంటారు. దీనిని పదార్థం మూల కేంద్రంలో ద్వితీయ క్షయం అంటారు. అణు పరిశోధనల్లో ఇది చాలా మౌలికమైంది. అణుధార్మిక ప్రభావం ధర్మాల గురించి క్యూరీ కొనసాగించిన పరిశోధనలను మరింత ముందుకు తీసుకెళ్ళి వివిధ మూలకాలపై ఫెర్మీ పరిశోధన కొనసాగించాడు. వీటిని న్యూట్రాన్‌లతో విచ్ఛేదనం చేసేవాడు. యురేనియం, థోరియంను విచ్ఛేదనం చేయడంలో ఆయన ప్రయోగాలు విఫలం అయినా అవే 1938లో వాటి విచ్ఛేదన ప్రక్రియను కనిపెట్టడానికి ప్రత్యక్షంగా తోడ్పడ్డాయి. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే న్యూట్రాన్లపై ఆయన కొనసాగించిన పరిశోధనలన్నీ అత్యంత సాధారణ సాంకేతికతతో కొనసాగించినవే. చివరకు 1936లో విజయవంతమైన ఆ

పరిశోధనలకు ఖర్చయిన మొత్తం కేవలం వెయ్యి అమెరికా డాలర్లు మాత్రమే.

రెండో ప్రపంచ యుద్ధం దగ్గరపడుతున్న కొద్దీ ఫెర్మి పని కష్టసాధ్యం అయిపోయింది. తన కుటుంబ భారాన్ని ఎలా మోయాలన్న చింత ఆయనలో చాలా పెరిగిపోయింది. 1928లో ఆయన ఇటలీ నౌకాదళంలో పనిచేస్తున్న యూదు అడ్మిరల్ కుమార్తె లారా కాపన్‌ను పెళ్ళి చేసుకున్నాడు. నాజీల ఒత్తిడికి లొంగిన ముసోలినీ యూదులను ఒక పద్ధతి ప్రకారం వేధించడం మొదలు పెట్టాడు. ఇది చివరకు 1938లో సెమెటిక్ జాతుల వ్యతిరేక చట్టాలు తీసుకురావడానికి దారితీసింది. ఫెర్మి తత్వం సహజంగానే రహస్యాత్మకమైంది. యూదు అయిన తన భార్యకు ఏమవుతుందోనని భయపడేవాడు. బహిరంగంగా నిరసన తెలియజేయడం ఆయనకు అసాధ్యం అయింది. ఫాసిస్టు వ్యతిరేక ప్రణాళికలు జారీ చేయడం అసాధ్యం అనుకున్న ఫెర్మి తాను ఆ ప్రదేశంనుండి మారడానికి సిద్ధంగా ఉన్న అంశాన్ని మెల్లగా కొలంబియా యూనివర్శిటీకి చేరవేశాడు. 1938లో భౌతిక శాస్త్రంలో నోబెల్ బహుమతి అందుకోవడానికి స్టాక్‌హోం వెళ్ళినప్పుడు ఆయన అట్నుంచి అటే స్వీడన్‌కు, అక్కడి నుంచి న్యూయార్క్‌కు వెళ్ళిపోయాడు. మళ్ళీ ఎన్నడూ ఇటలీకి తిరిగి వెళ్ళలేదు.

1939 జనవరిలో అమెరికా చేరుకున్న ఫెర్మి వాషింగ్టన్ డి.సి.లో సైద్ధాంతిక భౌతిక శాస్త్రంపై జరిగిన ఒక సదస్సుకు హాజరయ్యాడు. ఆ సదస్సులో ఫెర్మీకి స్నేహితుడు గొప్ప భౌతిక శాస్త్రవేత్త అయిన నీల్స్ బోర్ ఒక వినూత్న అంశాన్ని ప్రతిపాదించాడు. యురేనియం అణువును విడగొడితే అది కనీ వినీ ఎరుగని రీతిలో లక్షల కోట్ల శక్తిని విడుదల చేస్తుందని నీల్స్ బోర్ చెప్పాడు. ఇది విన్న ఫెర్మి నీల్స్‌ను కొన్ని వివరణలు అడిగితే ఆయన సమాధానం చెప్పలేక నీళ్లు నమిలాడు. సదస్సుకు హాజరైన వారందరూ ఆశ్చర్యచకితులై నోట మాట రాకుండా ఉండిపోయారు. ఆ అంశం విచ్ఛేదనాన్ని కనిపెట్టడంలో ఫెర్మీని చాలా ఉద్వేగపరిచింది. పదార్థం విచ్ఛేదనం జరిగినప్పుడు ప్రతిచర్యాపరంపర సాధ్యం అన్న ఆలోచన ఆయనకు తట్టింది. ఈ సమస్యను పరిష్కరించడం కోసం ప్రయోగాలు మొదలు పెట్టాడు. రాబోతున్న యుద్ధంలో తన ప్రతిభను వినియోగించుకుంటారన్న విషయం ఆయనకు తెలుసు. అణ్వాయుధం కోసం వెంపర్లాడుతున్న అమెరికా వారు ఫెర్మి తన పరిశోధనలు కొనసాగించడానికి ఏం కోరితే అది ఇచ్చారు. షికాగో యూనివర్శిటీలోని ఫుట్ బాల్ స్టేడియం ఆవరణలో ఒక స్క్వాష్ కోర్టులో ఆయన మొట్టమొదటి అణు రియాక్టర్‌ను రూపొందించాడు.

అమెరికా ప్రభుత్వం ఫెర్మీని మన్‌హట్టన్ ప్రాజెక్టులో అంతర్భాగం చేసినప్పుడు ఆయన న్యూ మెక్సికోలోని అలమోస్‌లో నివసించాడు. మన్‌హట్టన్ ప్రాజెక్టు అంటే అణుబాంబు తయారు చేయడానికి అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ రెండు వందల కోట్ల డాలర్లు వెచ్చించి రహస్యంగా ఏర్పాటు చేసిన పథకం. అక్కడే ఫెర్మి అణువును ఉపయోగించి ప్రకృతిలోని అద్భుత శక్తిని ఆవిష్కరించాడు. రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన సమయంలో 1945లో జపాన్‌లోని హిరోషిమా, నాగసాకిలపై అమెరికా అణుబాంబులను వేసిన తర్వాత జరిగిన మహా విధ్వంసాన్ని చూసిన తర్వాతే అమెరికా వారికి ఫెర్మి పరిశోధనల ఫలితం ఏమిటో తెలిసి రాలేదు. ఈ రెండు అణుబాంబులకు అమెరికావారు 'ఫాట్ మాన్', 'లిటిల్ బాయ్' అన్న పేర్లు పెట్టారు. ఆశావాది అయిన ఫెర్మి మేధోపరంగా మాత్రం ఈ రెండు అణు బాంబులతో తనకు ఏమీ సంబంధం లేనట్టుగానే ఉండిపోయాడు. ఆయన శాస్త్ర రంగంలో సాధించిన విజయం మహాద్భుతమైందే. కానీ ఆ పరిశోధనల ఫలితంగా తయారైన అణుబాంబులు సృష్టించిన మహా విధ్వంసం ఆయన విజయాలను మసకబారేట్టు చేశాయి.

1925-
1998

# పోల్‌పాట్

ప్రాణ నష్టం జరిగినా సరే ప్రస్తుత వ్యవస్థను పూర్తిగా నిర్మూలిస్తేనే' నవ సమాజం సాధ్యమనే వాస్తవ విరుద్ధమైన విపరీత సిద్ధాంతాన్ని, అమలు చేయడం వల్లనే పోల్‌పాట్ నరహంతక నియంతగా చరిత్రలో మిగిలిపోయాడు.

కంబోడియాను నాలుగేళ్ళపాటు పరిపాలించిన కరుడుగట్టిన కిరాతక నియంత పోల్‌పాట్ కంబోడియా ప్రజలకు కొన్ని తరాలపాటు చెరగని పీడకలగా మిగిలిపోయాడు. 1975 నుంచి 1979 వరకు డెమొక్రటిక్ కంపూచియా పేరుతో పోల్‌పాట్ అమలు జరిపిన అతి కఠినమైన కిరాతక విధానాలవల్ల దాదాపు 15 లక్షల మంది కంబోడియన్లు నిష్కారణంగా మృత్యువాతపడ్డారు. ప్రతి ఐదుగురు కంబోడియన్లలో ఒకరు పోషకాహారంలేకనో, అనారోగ్యంతోనే, మితిమీరిన గ్రామీణ సంస్కరణల పేరుతో మావోయిస్ట్, నైనా విధానాలు కొన్నింటిని పోల్‌పాట్ పరమ కర్కశంగా అమలు చేశాడు. దాదాపు రెండు లక్షల మందిని ప్రభుత్వానికి పరమ శత్రువులుగా పరిగణిస్తూ నిర్దాక్షిణ్యంగా మరణశిక్ష విధించాడు. కంబోడియాలో పోల్‌పాట్ చేపట్టిన ఈ కిరాతక చర్యవల్ల కంబోడియా 19వ శతాబ్దంలోనే ఏ దేశం అనుభవించని పతనావస్థను ఎదుర్కొంది.

1925లో కంబోడియా ఫ్రాన్స్‌రక్షణలో, నియంత్రణలో ఉన్న కాలంలో పోల్‌పాట్ ఓ సంపన్నుడైన భూస్వామి ఇంటిలో జన్మించాడు. 1925 మేలో నెల 19వ తేదీన పుట్టిన పోల్‌పాట్ బాల్యంలో ఇష్టారాజ్యంగా, ఎంతో సురక్షితంగా గడిచింది. సంపన్న కుటుంబం అయిన రీత్యా పరిచయాలు, సంబంధాల వల్ల కంబోడియా రాజధాని, నాంఫెన్‌లోని ఫ్రాన్స్ పాలకుల రాజరిక భవనంలోనే పోల్‌పాట్ కాలం గడిపేవాడు. ఆరేళ్ల వయస్సులో పోల్‌పాట్ ఫ్రెంచ్ భాషా పాఠశాలకు వెళ్ళి విద్యాభ్యాసం చేశాడు. కేవలం కొన్ని వందల మంది కంబోడియన్లకు మాత్రమే అలాంటి అవకాశం లభించింది. ఫ్రెంచ్ భాషలో ధారాళంగా మాట్లాడగలిగే ప్రతిభకు గుర్తింపుగా పోల్‌పాట్ ఫ్రాన్సులో విద్యాభ్యాసం చేయడానికి వీలుగా స్కాలర్ షిప్ మంజూరైంది. రాజకీయపరంగా అతనికి గల సన్నిహిత సంబంధాలు కూడా అందుకు ఉపకరించాయి. మూడేళ్ల పాటు ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో ఉన్న పోల్‌పాట్ తాను చదవాల్సిన పాఠశాలను నిర్లక్ష్యంచేస్తూ కేవలం అభ్యుదయ వాద, సాహిత్యం మాత్రమే చదివాడు. 1952లో వలసవాద వ్యతిరేక వైఖరితో ప్రారంభమైన ఫ్రెంచ్ కమ్యూనిస్టు పార్టీలో పోల్‌పాట్ చేరాడు. ఆ తర్వాత అతను ఏ పరీక్షలోనూ ఉత్తీర్ణుడు కాకపోవడంతో స్కాలర్‌షిప్ రద్దు చేసి తిరిగి స్వదేశానికి పంపించివేశారు.

1954లో కంబోడియా స్వతంత్ర దేశమైన తర్వాత,పోల్‌పాట్ ద్వంద్వ పాత్రలు నిర్వహించాడు. నాంఫెన్‌లో ఒకవైపు ప్రైవేటు పాఠశాలలో విద్యాబోధన చేస్తూ మరోవైపు కమ్యూనిస్ట్ ఉద్యమంలో పనిచేసేవాడు. అజ్ఞాత రాజకీయాలు నడుపుతూ, అధికారం హస్తగతం చేసుకోవాలని ఎప్పుడూ కలలు గనేవాడు. 1963 నాటికి కమ్యూనిస్టు పార్టీని తన ఆధీనంలోకి తెచ్చుకోగలిగాడు. సాయుధ సంఘర్షణతో అయినా అధికారం చేపట్టాలని పథకాలు వేశాడు. 1965లో ఉత్తర వియత్నాం కమ్యూనిస్టు పార్టీతో సంప్రదింపులు జరిపాడు. వియత్నాం ప్రయోజనాలకు అనుకూలంగా పని చేయాలని, వియత్నాం అమెరికాను ఓడించేందుకు సహాయపడాలని, తగిన సమయం వచ్చేంత వరకు కంబోడియాలో అధికారం హస్తగతం చేసుకొనేందుకు వేచి ఉండాలని వియత్నాం కమ్యూనిస్ట్ పార్టీ అధినేత లీ దువాన్ అప్పట్లో పోల్ పాట్‌కు సలహా ఇచ్చాడు. ఈ సలహా తనకు నచ్చనప్పటికీ పోల్‌పాట్ మౌనంగానే భరించాడు. ఆ తర్వాత కొన్నాళ్ళకే పోల్‌పాట్ చైనా వెళ్ళి, అక్కడ తొలి కమ్యూనిస్టు సాంస్కృతిక విప్లవం పట్ల స్ఫూర్తిని పొందాడు. చైనా పర్యటన అతని జీవితంలోనే అతి పెద్ద మలుపు అయింది. చైనా విధానాలకు అనుకూలంగా మార్చుకున్న తన ప్రవర్తన గురించి వియత్నాం నాయకులకు కూడా తెలియనివ్వలేదు. చైనా నుంచి స్వదేశం తిరిగి వచ్చిన వెంటనే పోల్‌పాట్ కంబోడియాలో దట్టమైన అటవీ ప్రాంతంలో రహస్యంగా తన ప్రధాన కార్యాలయం ఏర్పాటు చేసుకున్నాడు. తనతోపాటు భావ సారూప్యంగల కొంత మంది సహచరులను కూడదీసుకొని పోల్‌పాట్ పరిపాలనపై తన ఊహాజనిత భావనలను మరింత పటిష్టంగా రూపొందించుకున్నాడు.

1970లో కంబోడియా నాయకుడు ప్రిన్స్ నరోదమ్ సిహనౌక్ అమెరికా అనుకూలవాద సైనిక తిరుగుబాటుతో పదవీచ్యుడు కావడంతో అధికారం హస్తగతం చేసుకోవ డానికి పోల్‌పాట్‌కు అవకాశం లభించింది. వియత్నాం కమ్యూనిస్టు పాలకులు పోల్‌పాట్ నాయకత్వంలోని ఖ్మేర్‌రూజ్ బృందానికి ఆయుధాలు ఇచ్చి ఆయుధ శిక్షణ కూడా కల్పించారు. 1975కల్లా ఖ్మేర్‌రూజ్ బృందం నాంపెన్ నగరాన్ని ఆక్రమించుకొంది. అప్పటికే ఏళ్ళతరబడి పోరాటం, హింసాకాండలతో విసిగిపోయిన నాంపెన్ లోని 20 లక్షల మంది ప్రజల్లో చాలా మంది ఖ్మేర్‌రూజ్ బృందానికి స్వాగతం పలికారు. సాయుధులైన ఖ్మేర్‌రూజ్ యువత కొత్త కంబోడియా సమాజ నిర్మాణానికి కృషి చేస్తారని ప్రజలు ఆశించారు. అయితే వారి ఆశలన్నీ అడి యాశలే అని రుజువైంది. కొన్ని రోజుల్లోనే వారు నాంపెన్ నగర జనాన్ని వ్యవసాయ కూలీలుగా మార్చి, గ్రామాలకు తరిమేశారు. ఇతర పట్టణాల్లోని ప్రజలను కూడా వారు ఇలాగే తరిమేశారు. డబ్బును, మార్కెట్లను, పాఠశాలలను, పత్రికలను, మతపరమైన సాంప్రదాయాలను, ప్రైవేటు ఆస్తులను పోల్‌పాట్ సారథ్యంలోని ఖ్మేర్‌రూజ్ బృందం పూర్తిగా నిషేధించింది.

గ్రామీణ పేదలకు రాజకీయాధికారం కల్పించడం ద్వారానే విప్లవం శక్తివంతం కాగలదని భావించిన పోల్‌పాట్ కంబోడియా సమాజ వ్యవస్థనే విధ్వంసం చేయ డానికి పూనుకున్నాడు. తన లక్ష్యసాధన కోసం అనుభవ శూన్యమైన, కిరాతకమైన పద్ధతులు ఎన్నుకున్నాడు. 1976లో పోల్‌పాట్ నాలుగేళ్ల ప్రణాళికను సిద్ధం చేశాడు. ఎరువులు, ఎలాంటి ఆధునిక వ్యవసాయ పద్ధతులు పాటించకుండా ఏడాదిలోనే ఆ దేశ వ్యవసాయోత్పత్తిని మూడు రెట్లకు పెంచాలని లక్ష్యం నిర్ణయించాడు. కంబోడియా భౌగోళిక పరిస్థితులపై అవగాహన లేకుండా, ఐదేళ్ళ అంతర్యుద్ధంలో రైతులు కూడా విసిగిపోయి ఉన్నారన్న అంశాన్ని కూడా పట్టించుకోకుండా, పోల్‌పాట్ ఇలాంటి ప్రణాళికా లక్ష్యాలు నిర్దేశించాడు. మరోవైపు ప్రజలకు తిండి గింజలుగా కేటా యించిన ధాన్యాన్ని కూడా పంపిణీ చేయకుండా ఖ్మేర్‌రూజ్ కార్యకర్తలు కోత విధించారు. దీనితో లక్షలాది మంది ప్రజలు తిండిలేక ఆకలితో అలమటించి చనిపోయారు. వేలాది మంది విపరీతమైన పని ఒత్తిడితో అలసిపోయి మరణించారు. వైద్య చికిత్సా వసతులు లేకపోవడం మరి కొందరి మరణాలకు కారణమైంది.

అయితే, ఇంతటి దుష్పరిణామాలకు తన విధానాలే కారణమన్న వాదనను పోల్‌పాట్ ఒప్పుకోలేదు. గ్రామీణ పరిస్థితులను మెరుగు పరచాలన్న వాదనను కూడా పోల్‌పాట్ అంగీకరించలేదు. 1977లో చైనాను సందర్శించిన పోల్‌పాట్ వియత్నాంతో పోరాటానికి చైనా సహాయంపై హామీని పొందాడు. కంబోడియా, వియత్నాంల మధ్య చెదురుమదురుగా మొదలైన ఘర్షణలు 1978లో పూర్తిస్థాయి యుద్ధంగా పరిణమించాయి. అయతే ఈ యుద్ధంలో పోల్‌పాట్‌కు చైనా సహాయం నిరాకరించింది. దాదాపు లక్ష మంది సైన్యంతో వియత్నాం 1978లో క్రిస్మస్ రోజున కంబోడియాపై దండెత్తింది. పోల్‌పాట్ ఓ హెలికాప్టర్‌లో దేశం వదలి థాయిలాండ్‌కు పరారయ్యాడు. జనవరి 7వ తేదీన వియత్నాం నాంపెన్‌లో కీలు బొమ్మ ప్రభుత్వాన్ని నియమించింది. ఖ్మేరురూజ్ బృందంలో పనిచేసిన వారిలో చాలా మంది కొత్త ప్రభుత్వం ప్రతినిధులయ్యారు.

పరారైన పోల్‌పాట్ వైద్య చికిత్స కోసం అప్పుడ ప్పుడు బ్యాంకాక్, బీజింగ్ వెళ్ళినా థాయిలాండ్, ఉత్తర కంబోడియా అడవుల్లో థాయిలాండ్ సైన్యం, మిగిలిన తన గెరిల్లా దళం రక్షణలోనే గడిపాడు. పోల్‌పాట్ మొదటి భార్య మానసిక రోగం వల్ల మరణించడంతో 80 ఏళ్ల వయస్సులో రెండవ పెళ్ళి చేసుకున్నాడు. 1990 దశకం మధ్య ప్రాంతంలో కంబోడియా కమ్యూనిస్టు పార్టీ కూడా ప్రభుత్వ మద్దతులేక కూలిపోయింది. 1996లో పోల్‌పాట్ బావమరిది, పోల్‌పాట్ ప్రభుత్వంలో విదేశాంగ మంత్రిగా పనిచేసిన ఇయెంగ్‌శారీ ప్రత్యర్థి వర్గంలోకి ఫిరాయించాడు. వేలాది మంది ఖ్మేర్‌రూజ్ కార్యకర్తలు కూడా ఆయన దారినే అనుసరించారు. మిగిలిన కొంత మంది ఉద్యమకారులకు నాయకత్వం వహించే తామోక్ అనే సైనిక నాయకుడికి, పోల్‌పాట్‌కు మధ్య కూడా విభేదాలు తలెత్తాయి. తామోక్ పోల్‌పాట్‌ను అరెస్ట్ చేసి నిర్బంధించారు. తామోక్ తనను అమెరికా కోర్టులకు విచారణకోసం అప్పగించనున్నట్లు 1998లో వాయిస్ ఆఫ్ అమెరికా రేడియో వార్తలద్వారా తెలుసుకున్న పోల్‌పాట్ దిగ్భ్రాంతి చెందాడు. స్పృహ తప్పి పడిపోయిన పోల్‌పాట్ 1998 ఏప్రిల్ 15వ తేదీ రాత్రి పదిగంటలకు గుండెపోటుతో మరణించాడు. పోల్‌పాట్ జీవితంలో మరణం కూడా అనేక ప్రశ్నలను మిగిల్చింది.

# మోడల్ టి

1896లో వర్షం కురుస్తున్న ఒక వేసవి రోజు ఉదయాన మిషిగన్ రాష్ట్రంలోని డెట్రాయిట్‌లోని ఎడిసన్ ఇల్యుమినేటింగ్ కంపెనీలోని 33 ఏళ్ళ ఇంజనీరు తన భార్య ఆశగా చూస్తుండగానే అసంగతంగా కనిపిస్తున్న "నాలుగుచక్రాల సైకిల్"ను మొట్టమొదటిసారి నడిపి చూడడం మొదలుపెట్టాడు. ఆ వ్యక్తే హెన్రీ ఫోర్డ్. అతనికి అసహనం మెండు. తన జీవిత పర్యంతం ఈ అసహనాన్ని ప్రదర్శిస్తూనే ఉన్నాడు. తాను తయారు చేసిన గుర్రాలు లేని బండికి తన దుకాణంలోకి ప్రవేశించే దారి చాలడం లేదని భావించి ద్వారం పక్కన ఉన్న గోదాముల్నే కూల్చేశాడు. సామాన్య రైతు బిడ్డ అయిన హెన్రీ ఫోర్డ్ మోటారు కారు ఆవిష్కర్తగా అవతరించాడు. 'అసంఖ్యాకులకు కారు' అన్నది అతడి మదిని తొలుస్తున్న అంశం. 'మంచి వేతనం పుచ్చుకుంటున్న వారెవరికీ ఈ కారు అందుబాటులో ఉండకుండా ఉండకూడదు' అన్నది ఫోర్డ్ నినాదం. అంతకు ముందు ప్రయత్నించిన లాభసాటి కాని అనేక మోడళ్లను వదిలివేసి, మోడల్ టీ కార్లు రూపొందించాడు. అందుబాటులోకి వచ్చిన ఏడాది కాలంలోనే దాదాపు పదివేల కార్లు అమ్ముడైనాయి. 1920 నాటికి ప్రపంచంలోని ప్రతి రెండు కార్లలో ఒకటి ఫోర్డ్ కారే. ఫోర్డ్ సాధించిన విజయం కలలో కూడా సాధ్యం కానిది.

మోడల్ టి కారుకు 'టిన్ లిట్జీ' అన్న ముద్దుపేరు ఉండేది. నల్లటి ఈ కారును రూపొందించిన కొద్ది సంవత్సరాలలోనే మిషిగన్‌లోని హైలాండ్ పార్క్‌లో ఉన్న ఫోర్డ్ ఫ్యాక్టరీలో ప్రతి మూడు నిముషాలకు ఒక కారు ఉత్పత్తి కావడం మొదలైంది. ఉత్పత్తి పద్ధతులను మార్చడంతో మోడల్ టి కార్ల ధర మునుపు ఉన్న 900 డాలర్ల నుంచి 500 డాలర్లకు తగ్గిపోయింది. ఈ కార్లను కనిపెట్టిన వ్యక్తి కోటీశ్వరుడు అయిపోయాడు. అందరికీ అందుబాటులో ఉండే చౌక కారు అమెరికా జీవనంలోని భౌతిక, సామాజిక, ఆర్థిక వ్యవస్థలను సమూలంగా మార్చేసింది. 1924కల్లా మోడల్ టి కేవలం 290 డాలర్లకే అందుబాటులోకి వచ్చింది. ఈ కారు త్వరలోనే గ్రామీణ అమెరికా రూపు రేఖలను మార్చివేసింది. పత్రికలను, సంపన్నతను, ఆమాటకొస్తే ప్రపంచాన్నే సుదూర ప్రాంతాల్లోని రైతుల ముంగిట్లోకి తీసుకొచ్చింది. గ్రామీణ ప్రాంతాలు పట్టణాలతో ఎలాంటి సంబంధం లేకుండా ఒంటరిగా ఉండే పరిస్థితిని పూర్తిగా మార్చివేసింది. మొట్టమొదటి జాతీయ వాణిజ్య నెట్‌వర్క్‌ను ఏర్పాటు చేయడంవల్ల ఈ కారు రైతు మార్కెట్‌ను అపారంగా విస్తరించింది. నగరవాసులను ఆ కారు గ్రామాలకు మోసుకొచ్చింది. దశాబ్ద కాలంలో అల్లిబిల్లిగా అల్లుకున్న రహదారులు నగరాలు ఏర్పడ డానికి, విశాలమైన పడక గదులు ఉండే వర్గాలు ఏర్పడ డానికి దోహదం చేశాయి. ఈ ప్రాంతాలన్నీ అంతకు ముందు పచ్చిక బీళ్లుగా ఉండేవి. ఈ స్వయం చాలిత వాహనం అమెరికన్ల పని విధానాన్ని, వారి జీవనతీరును సమూలంగా మార్చివేసింది.

ఇరవయ్యవ శతాబ్దానికి ఫోర్డ్ అందచేసిన మహత్తర మైన అంశం ఏమిటంటే 1913లో విడి భాగాలను కూర్చి కార్లను తయారు చేసే వ్యవస్థ (అసెంబ్లీ లైన్)ను ఏర్పాటు చేయడమే. పెద్ద కబేళాలో గోవుల కళేబరాలను కన్వేయర్ బెల్ట్ తరలించడం, వివిధ భాగాలలో కార్మికులు మాంసాన్ని సిద్ధం చేయడాన్ని చూచి స్ఫూర్తి పొందిన ఫోర్డ్ ఈ విడి భాగాలను వినియోగించడంలో భారీ స్థాయిలో కార్ల ఉత్పత్తిని సాధించాడు. వీటిలో ఏవీ ఫోర్డ్ సొంతంగా సృష్టించినవి కావు. అతను చేసిందల్లా విడి భాగాలన్నింటినీ సమన్వయం చేసి ఉపయోగించుకోవ డమే. అసెంబ్లీ లైన్ వేగం, ఆర్థికంగా గిట్టుబాటు కావడం, సాంకేతిక కచ్చితత్వం మొదలైనవన్నీ ప్రపంచంలోకెల్లా

పారిశ్రామికంగా అమెరికా ప్రాముఖ్యతకు సంకేతాలుగా మారిపోయాయి. అమెరికా విజయ గాథలకు ఫోర్డ్ ప్రతి రూపంగా నిలిచాడు. తన చిన్న గదిలో గడియారాలు మరమ్మత్తు చేసే రైతు బిడ్డ శక్తివంతమైన బడా వ్యాపారవేత్తగా మారిపోయాడు. తను కావాలనుకున్నప్పుడు తను ప్రభుత్వంలో భాగస్వామి కావడం, ఒద్దనుకున్నప్పుడు ఆ ప్రభుత్వాన్నే ఎదిరించే దశకు ఫోర్డ్ ఎదిగాడు. ఫోర్డ్ ఈ రెండు పనులూ చేశాడు. 1918లో తన సొంత రాష్ట్రం అయిన మిషిగన్ నుంచి అమెరికా సంయుక్త రాష్ట్రాల సెనేట్‌కు పోటీ చేసి పరాజితుడయ్యాడు. 1933లో ఆటో పరిశ్రమ నియమావళిని నియంత్రించడానికి ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్ తెచ్చిన జాతీయ రికవరీ చట్టాన్ని ఎదిరించి నిలబడ్డాడు.

ప్రపంచ యుద్ధాన్ని ఆపడానికి 1915లో ఒక నౌకను అద్దెకు తీసుకుని యూరప్‌కు బయలుదేరడం వంటి బోళాతనపు చేష్టలకు పాల్పడినప్పటికీ ఫోర్డ్ పలుకుబడి అపారంగానే ఉండేది. ఆయన గట్టి యుద్ధ వ్యతిరేకి. ఆ నౌక 'శాంతి నౌక'గా ప్రసిద్ధమైంది. ఆ శాంతి యాత్ర సందర్భంగా ఫోర్డ్ "క్రిస్మస్ కల్లా కందకాలు వదిలిపెట్టి సొంత గూళ్లకు" అన్న నినాదం ఇచ్చారు. సెనేట్‌కు పోటీ చేసి ఓడిపోయినప్పటికీ, తనను అరాచకవాది అన్నందుకు చికాగో ట్రిబ్యునల్‌పై పదిలక్షల డాలర్లకు వేసిన పరువు నష్టం దావా వీగిపోయినప్పటికీ, వీరుడిగా ఆయనకున్న పలుకుబడి ఏమాత్రం తగ్గలేదు. కోర్టులో ఆయన వాంగ్మూలం ఇచ్చినప్పుడు అందరికీ తెలిసిన చారిత్రక సత్యాలను కూడా చెప్పలేని ఆయన అజ్ఞానాన్ని చూసి అతనికి చదవడం, రాయడం కూడా రాదు అన్న వదంతి బయలుదేరింది. ఆయన నడిపిన 'డియర్‌బార్న్ ఇండి పెండెంట్' అన్న పత్రికలో సెమిటెక్ జాతివారికి వ్యతిరేక సమాచారాన్ని ప్రచురించినా ప్రజలు ఆయనను క్షమించి వదిలిపెట్టారు. తన పత్రికలో ఏం ప్రచురితం అవుతున్నాయో తనకు తెలియదన్న సంజాయిషీ ఇచ్చి తప్పించుకోవాలని ప్రయత్నించాడు. కార్మికులు సంఘాలు పెట్టుకోవడాన్ని ఆయన తీవ్రంగా వ్యతిరేకించినప్పటికీ జనం ఆయనను క్షమించారు. కానీ 1937లో బాటిల్ ఆఫ్ ది ఓవర్ పాస్ సందర్భంగా కార్మిక సంఘం నాయకుడు వాల్టర్ రూథర్‌ను, మరో ముగ్గురునీ కిరాతకంగా చితగొట్టినప్పుడు, 1941 నాటి సమైక్య ఆటో మొబైల్ కార్మికుల సమ్మె సందర్భంలోనూ ఆయన కార్మిక సంఘాలకు తలవంచక తప్పలేదు.

ఫోర్డ్‌కు ఒక రకమైన ఆకర్షణకూడా ఉండేది. తాను చేపట్టిన ఆటో మొబైల్ పరిశోధనలకోసం పెట్టుబడి పెట్టేవారిని ఆకర్షించడం కోసం తాను తయారు చేసిన రేసింగ్ కార్లను తానే నడపి అంతకు ముందున్న రికార్డులన్నీ బద్దలుకొట్టాడు. బండ చాకిరీ నుంచి కార్మికులను, రైతులను విముక్తం చేయడంలో యంత్రాల పాత్ర గురించి ఆయన ఆకర్షణీయంగా మాట్లాడేవాడు. ఈ పరమోత్కృష్ట కార్యంలో తన కీలక పాత్ర గురించి గొప్పగా చెప్పుకునేవాడు. తన దగ్గర పనిచేసే కార్మికుల వేతనాన్ని రెట్టింపు చేసి దాన్ని రోజుకు అయిదు డాలర్లకు పెంచినప్పుడు, శనివారం రోజు కార్మికులకు సెలవు ప్రకటించినప్పుడు తోటి పారిశ్రామికులు విస్మయంతో అవాక్కైపోయారు. కార్మికులు మాత్రం తెగ ఆనందపడి పోయారు. కాని ఫోర్డ్ చేసిందల్లా తన చతురతను ప్రదర్శించడమే. భారీ వినియోగం లేకపోతే భారీ ఉత్పత్తి లక్ష్యాలు విజయవంతం కావన్న వాస్తవాన్ని ఆయన గుర్తించాడు. సగటు కార్మికుడికి కార్లు కొనుక్కోగలిగిన వేతనాలు ఇవ్వడం వల్ల, ఆ కార్లను వినియోగించి సరదాగా గడపడానికి వారికి తీరిక కల్పించడం ద్వారా ఫోర్డ్ తన కార్లకు భారీ మార్కెట్ సృష్టించుకోగలిగాడు. దీనివల్ల ఉత్పత్తిని మరింతగా పెంచవలసిన అవసరం వచ్చింది. ఫోర్డ్ కనుగొన్న కారు అమెరికా జీవనంలోని ఏ రంగాన్నీ మార్చకుండా వదిలిపెట్టలేదు.

1892-
1975

# ఫ్రాన్సిస్కో ఫ్రాంకో

ఇరవయ్యవ శతాబ్దంలోని నియంతృత్వాల చరిత్రలో కెల్లా స్పెయిన్‌లో ఫ్రాన్సిస్కో ఫ్రాంకో నిరంకుశ ఫాసిస్టు పాలన అన్నింటికన్నా సుదీర్ఘ మైంది. అతి కిరాతకమైన, అణచివేతకు మారుపేరైన పాలన అది. 1939లో ప్రారంభమైన ఆ పాలన ఎప్పటికప్పుడు అంతమౌతుందనే పుకార్లతో రాజ్యమేలింది. అయినా కరడుగట్టిన ఆ నియంత 36 ఏళ్లపాటు అతి పాశవికంగా తన ఏలుబడి కొనసాగించాడు. అంతర్జాతీయంగా అతనికి ఎదురైన విమర్శలు, అవమానకరమైన ఛీత్కారాలు మరోవ్యక్తికి ఎదురైతే కుదేలైపోయేవాడే.

1975లో 83వ ఏట అతను మరణించినప్పుడు అనేక మంది పరిశీలకులు, అతని దేశవాసులు ఫ్రాంకో మరణించాడంటే నమ్మలేకపోయారు. మాకు అంత అదృష్టమా! అని గొణిగారు. స్పెయిన్ ప్రజలకు తమ నాయకుడిపై ద్వంద్వాభిప్రాయాలు ఉండేవి. అతనంటే ఒక రకమైన ఆరాధనాభావంతో పాటు చచ్చేటంత భయమూ ఉండేవి. అతను ఎలాంటి వాడంటే ఉదయం పూట ప్రార్థనా సమయంలో చాలా నిష్టగా పవిత్ర యుకారిస్ట్‌కు స్వాగతం చెప్పేవాడు. ఆ తర్వాత ఏ మాత్రం నదురు బెదురు, జంకు గొంకులు లేకుండా పదుల సంఖ్యలో జనాన్ని అంతమొందించమని ఆజ్ఞలు జారీ చేసేవాడు. ఇటీవలి కాలంలో ఫ్రాంకో మీద వచ్చిన అంచనాల్లో ఎలాంటి అస్పష్టతకు తావు లేదు. ఒకప్పుడు అతనికి సమాజంలో ప్రశాంతత నెలకొల్పాడనీ, వెనుకబడిన, అరాచకం తాండవిస్తున్న దేశంలో ఆధునికీకరణ ద్వారా ఆర్థిక అభ్యున్నతి సాధించాడన్న మంచి పేరు ప్రఖ్యాతులు ఉండేవి. కాని ఇప్పుడు అనేక మంది చరిత్రకారులు అతనిని అధికార మదం తలకెక్కిన చిట్టెలుక లాంటివాడనీ, అతని క్రూర పాలన పశ్చిమయూరప్ దేశాలలో స్పెయిన్‌కు సాంస్కృతిక అభ్యున్నతి, రాజకీయ స్థాయిని సాధించకుండా నివారించిందని అంటున్నారు.

అయితే భయంకరంగా కొనసాగిన స్పెయిన్ అంతర్యుద్ధంలో కనబరిచిన నాయకత్వ లక్షణాలే ఫ్రాంకోకు చరిత్రలో ప్రముఖ స్థానం సంపాదించి పెట్టాయి. కృతనిశ్చయంతోను, ఒక పద్ధతి ప్రకారం పని చేసే తత్వం కారణంగానే అతను అట్టడుగున ఉన్న పదాతిదళ సభ్యుడి స్థాయి నుంచి నేషనలిస్ట్ దళాలకు అధిపతి కాగలిగాడు. అదే క్రమంలో 1936లో ప్యాపులర్ ఫ్రంట్‌కు వ్యతిరేకంగా తిరుగుబాటు ఉద్యమం నిర్వహించగలిగాడు. ఎల్ ఫెర్రోలోని చిన్న గాలిషియన్ పట్టణంలో మధ్యతరగతి కుటుంబంలో ఫ్రాంకో పుట్టాడు. అతని కుటుంబానికి నౌకాదళంలో పనిచేసిన అనుభవం ఉంది. పదిహేనేళ్ల ఫ్రాన్సిస్కో పాలినో హెర్మెమిగిల్డో టియోడ్యులో ఫ్రాంకో బహమాండ్ 1907లో టొలెడోలోని అకాడమియా మిలిటర్ డి ఇన్‌ఫండలియాలో చేరాడు. 1912 నుంచి 1927 మధ్య స్పెయిన్ అధీనంలో ఉన్న మొరాకోలో జరిగిన అనేక దండయాత్రల్లో అతడు అసమానమైన ప్రతిభ కనబరిచాడు. చివరకు రిఫ్ అధిపతి అబ్దెల్ క్రమ్ తిరుగుబాటును అణచివేశాడు. ఈ సమయంలోనే 33 ఏళ్ళ ఫ్రాంకోకు బ్రిగేడియర్ జనరల్ హోదా దక్కింది. నెపోలియన్ తర్వాత యూరప్‌లో అంత చిన్నవయసులో జనరల్ అయినవాడు ఫ్రాంకో మాత్రమే. సరగోసా పట్టణం దేశ ఈశాన్య ప్రాంతంలోని ఎబ్రోలో ఉంది. అక్కడ ఫ్రాంకో అకాడమియా జనరల్ మిలటర్‌కు 1927లో అధిపతి అయ్యాడు. 1931లో సెకండ్ రిపబ్లిక్ రాజు అల్ఫోన్స్ -13ను పదవీచ్యుతుణ్ని చేసింది. ఫ్రాంకో రాజుకు నమ్మిన బంటు. అతనికి ప్రీతిపాత్రుడైన సైనికాధికారి. రాజుకు అనుకూలురైన వారిని అప్పుడు స్పెయిన్ తూర్పుతీరంలోని బలియారిక్ దీవులకు ప్రవాసం పంపించారు.

రెండేళ్ళ తర్వాత మళ్ళీ స్పెయిన్ ప్రధాన భూభాగంపై కాలు మోపినప్పుడు అధికారంలో ఉన్న మధ్యే మార్గ మితవాద ప్రభుత్వం ఈ ప్రీతిపాత్రమైన కమాండరుకు అస్టురియస్ రాష్ట్రంలోని గని కార్మికుల సమ్మెను అణచివేసే బాధ్యత అప్పగించింది. ఫ్రాంకో ఈ విధిని ఎంతో అత్యుత్సాహంతో, ఆశ్చర్యపరిచేటంతటి కిరాతకంగా నిర్వహించాడు. దాంతో 'కసాయి' అన్న ముద్దుపేరుతో పిలవడం మొదలుపెట్టారు. వామపక్షాల వారు అతనిని తీవ్రంగా ఈసడించారు. ఫాసిస్టు

ఫలాంగె ఆధిపత్యం సంపాదిస్తున్న దశలో కమ్యూనిస్టులు అతని పదఘట్టనల కింద నలిగిపోతున్న తరుణంలో తెలివిగల ఫ్రాంకో మితవాదులు, మోనార్కిస్టులు, తోటి సైనికాధికారులతో కూడిన మితవాద సంకీర్ణకూటమితో చేతులు కలిపాడ ు. పాప్యులర్ ఫ్రంట్‌కు వ్యతిరేకంగా జరిగిన కుట్రలో భాగస్వామి అయ్యాడు. ప్యాపులర్ ఫ్రంట్ ఉదారవాదులు, వామపక్షాల వారితో ఏర్పడిన కూటమి. ఈ కూటమి 1936 ఎన్నికల్లో విజయం సాధించింది. అదే సంవత్సరం జూలైలో ఫ్రాంకో అంతర్యుద్ధానికి శ్రీకారం చుట్టాడు. నాజీ జర్మనీ, ఫాసిస్టు ఇటలీ సహాయంతో స్పెయిన్‌గడ్డపై విమానాల్లో సైనిక దళాలను దింపాడు. ఆ తర్వాత జరిగిన ఘర్షణలు మానవత్వానికి, సైద్ధాంతిక పోరాటాలకు నడుమ సంభవించాయి. ఆ పోరాటం మరీ అనాగరికంగా సాగింది. దాదాపు 30 నెలలపాటు కొనసాగిన ఆ ఘర్షణలో దాదాపు పది లక్షల మంది స్పెయిన్‌వారు నేలకొరిగారు. వీరిలో ఎక్కువ మంది సాధారణ పౌరులే. పోరాటంలో ఏ పాత్రా లేని వారి మీద సైతం ఏమాత్రం కనికరం చూపని ఈ బీభత్సకాండను చూసిన ప్రపంచంలోని అన్ని భాగాలకు చెందిన మేధావులు, సాహసికులు, కళాకారులు రిపబ్లిక్ పక్షాన నిలిచారు. ఒక వైపున ముస్సోలినీ సేనలు ఇళ్ళపై శతఘ్నులతో వర్షం కురిపిస్తే మరోవైపు జర్మన్ పైలెట్లు అడ్డూ ఆపులేని రీతిలో బాంబులు కురిపించారు. ఫాసిజానికి ప్రజాస్వామ్యానికి మధ్య జరిగిన ఈ ఘర్షణ ప్రపంచమంతటినీ కుదిపేసింది. స్పెయిన్‌లో విదేశీయులు, విదేశీయులకు వ్యతిరేకంగా పోరాడారు అని ఆల్బర్ట్ కాము రాశారు. 'తమ మార్గం సరైందే అయినా ఓటమి తప్పదు' అన్న గుణపాఠం తమ తరం నేర్చుకుందని ఆయన అన్నారు.

1939 మార్చిలో అంతర్యుద్ధం ముగిసిన తర్వాత సైన్యం, కాథలిక్ చర్చి సహాయంతో ఫ్రాంకో చక చకా పావులు కదిపాడు. ఫ్రాంకో అధీనంలోని మొలిమెంటో నాసియోనల్ నేతృత్వంలో రహస్య పోలీసులు ప్రతిపక్షాల వారిని పరమ కిరాతకంగా అడ్డు తొలగించుకున్నారు. స్పెయిన్‌లోని అన్ని రంగాలు ఎల్ కాడిల్లోకు విశ్వాసపాత్రంగా ఉండాలని నిర్దేశించారు. కాని హఠాత్తుగా అంతా గందరగోళంగా ఉన్న దశలో ఫ్రాంకో లెబెన్‌స్రాం కోసం హిట్లర్ దురాశ మీద దృష్టి కేంద్రకరించవలసి వచ్చింది. అంతర్యుద్ధంలో జర్మనీ, ఇటలీ సహకారం అందించినందువల్ల ఫ్రాంకో వారితో జట్టు కట్టకుం డా ఉండడం అనివార్యం అయ్యింది. కాని తన యుక్తితోనూ, చాకచక్యంతోనూ పట్టు వదలకుండా ఉండడంతోనూ ఫ్రాంకో సరిగ్గా అదే పని చేశాడు. మిత్ర పక్షాలను సంతోష పెట్టడం కోసం "జాగరూకమైన తటస్థత"ను వినియోగించుకున్నాడు. హిట్లర్‌తో ప్రతి సంబంధాన్ని యుద్ధానంతరం జిబ్రాల్టర్, ఫ్రెంచ్ మొరాకోలో స్పెయిన్‌కు అనుకూలంగా భూభాగాలు కబళించడానికి ఉపయోగించుకున్నాడు. ఆ సమయంలోనే వేచిచూడటం ఎత్తుగడను అనుసరించాడు. తన నాజీ అనుకూల ధోరణులను కప్పి పుచ్చి విజయం సాధించిన పక్షం వైపు చేరడానికి పరిస్థితులు వినియోగించుకున్నాడు. కానీ జర్మనీ రష్యా మీద దురాక్రమణ చేసినప్పుడు తూర్పు రంగంలో యుద్ధంలో పాల్గొనే "బ్లూడివిజన్"లోకి స్పెయిన్ పౌరులను చేర్చుకోవడాన్ని అనుమతించాడు. దీనితో ఫ్రాంకో అసలు రంగు బయటపడింది. అయితే అధికారికంగా రెండో ప్రపంచయుద్ధం జరిగినంతకాలం స్పెయిన్ తటస్థంగానే ఉన్నట్టు లెక్క.

క్రమంగా ప్రపంచం ఫ్రాంకోను క్షమించినట్టు కనిపించింది. 1955 డిసెంబర్‌లో రాయబారి ఎల్ ఫార్డ్ రాజభవనాన్ని సందర్శించి ఐక్యరాజ్యసమితిలో ప్రవేశించ డంతో స్పెయిన్‌పై ఉన్న వెలి సమాప్తం అయింది. ఫ్రాంకో నాయకత్వంలోని స్పెయిన్ పాక్షికంగా ప్రయోజనం పొందింది. దీనితో ఎనిమిది పదుల ఈ నియంత స్పెయిన్ పీకనొక్కే వైఖరిని నెమ్మదిగా సడలించడం ప్రారంభించాడు. అంతర్జాతీయ ఒత్తిడికి లొంగి 1969లో తన రాజకీయ వారసుణ్ణి ప్రకటించాడు. స్పెయిన్‌కు మళ్ళీ రాజరికం అబ్బింది. రాకుమారుడు జువాన్ కార్లోస్ రాజయ్యాడు. తానే రాజును కావాలన్న ఫ్రాంకో జీవితంలోని అంతిమ లక్ష్యం మాత్రం నెరవేరకుండానే మిగిలిపోయింది.

# పీలే

ప్రపంచంలోని అత్యధిక దేశాల ప్రజలకు కొన్ని దశాబ్దాలపాటు తెలిసిన ఒకే ఒక క్రీడాకారుడు ఎవరంటే ఆ పేరు ఖచ్చితంగా పీలే అనే ఫుట్‌బాల్ క్రీడాకారుడిది. 'ద కింగ్ ఆఫ్ సాకర్' నల్లజాతి వజ్రం, 'లా ట్యులిప్ నీగ్రో' (నల్ల ట్యులిప్) అనే పేర్లతో క్రీడాభిమానులను 30 ఏళ్ళపాటు ఉర్రూతలూగించిన పీలేను కలవడం కోసం దేశాధినేతలూ, రాజులే తహతహలాడిపోయేవారు. అగ్రరాజ్యాలు, వర్ధమాన దేశాలు, పేద దేశాలనే తేడా లేకుండా ఆఖరికి ఫుట్‌బాల్ క్రీడ గురించి అంతగా తెలియని అమెరికా, ఆస్ట్రేలియన్లకూ ఆనాటి కాలంలో పీలే గురించి తెలుసు.

ఫుట్‌బాల్ క్రీడను యూరప్‌వాసులలాగా వ్యాపారాత్మకంగా కాకుండా కళాత్మకంగా ఆడగలనని నిరూపించిన నల్లముత్యం పీలే బ్రెజిల్‌లో పుట్టాడు. తన క్రీడా జీవితంలో మరే ఫుట్‌బాల్ ఆటగాడూ ఏనాడూ అందుకోని రీతిలో 1200 గోల్స్ సాధించాడు. 1958, 1962, 1979లలో జరిగిన మూడు ప్రపంచ కప్ పోటీల్లో బ్రెజిల్‌ను విశ్వవిజేతగా నిలిపిన జాతీయ సంపద పీలే. జాతీయ సంపద అనే పేరు ఎందుకొచ్చిందంటే పీలే ఎక్కడికెళితే ఆ దేశంలో పుష్కలంగా దొరికే జాతీయ వనరులను బ్రెజిల్‌కివ్వాలి. లాటిన్ అమెరికన్ దేశాల్లో ఎందరో ఫుట్‌బాల్ క్రీడాకారులకు తరువాత కాలంలో ప్రేరణగా నిలిచిన పీలే బ్రెజిల్ టీంను ఫుట్‌బాల్‌లో ఒక మహాశక్తిగా మలిచాడు. పీలే తన చిన్నప్పుడే తండ్రి డాన్ డిన్హోహో ఫుట్‌బాల్ ఆటలో మెళకువలు నేర్చుకున్నాడు. ట్రెస్‌కొరాకోస్ అనే పట్టణంలో స్టేడియంలోకి వచ్చే వారి బూట్లు పాలిష్ చేస్తూ ఎంతో కొంత ఆదాయం ఆర్జించేవాడు పీలే. పాత సాక్స్‌లను బంతిగా చుట్టి వీధుల్లో ఆటలాడుకునే పీలేలోని నైపుణ్యాన్ని గుర్తించింది అతని తండ్రి స్నేహితుడు, అప్పట్లో ప్రముఖ ఆటగాడు వాల్డెమార్ డి బ్రిటో పీలెలోని క్రీడా నైపుణ్యాన్ని సానబెట్టి అతన్ని 1956లో సావ్‌పాలో క్లబ్‌లో చేర్పించాడు. బక్కపలచగా, అనామకుడిగా ఉన్న పీలేను క్లబ్‌లోని సహచర ఆటగాళ్లు మొదట్లో ఎగతాళి చేసినా వారు అతనిలోని క్రీడాతృష్ణను చూడగలిగారు.

మొదట్లో తానాడుతున్న క్లబ్ నిర్వాహకులను నిరాశపరిచిన పీలే రకరకాల ఆటగాళ్ళు ఆడే తీరును పరిశీలించి తన ఆటను మెరుగుపర్చుకున్నాడు. ఏడాది తిరిగేసరికల్లా తన క్లబ్ అప్పటి మరొక స్టార్ క్లబ్‌పై ఆడిన మ్యాచ్‌లో మొత్తం 7 గోల్స్‌లో పీలే ఒక్కడే నాలుగు సాధించడంతో అందరి దృష్టిలో పడ్డాడు. బ్రెజిల్‌లోని రెండు మూడు ప్రధాన క్లబ్బుల తరఫున ఆడుతున్న పీలేను 1958 ప్రపంచకప్ సందర్భంగా ఆఖరు క్షణంలో అతన్ని జాతీయ జట్టులోకి తీసుకున్నారు. స్వీడన్ రాజధాని స్టాక్‌హోంలో జరిగిన సాకర్ ప్రపంచకప్ ఫైనల్స్‌లో పీలే అద్వితీయమైన రీతిలో గోల్ సాధించాడు. ఆ గోల్‌తో అనామకదేశంగా ఉన్న బ్రెజిల్ సాకర్‌లో తొలిసారి విశ్వవిజేత అయింది. దీనితో పీలే పేరు సాకర్ ప్రపంచంలో మారుమోగిపోయింది. నీగ్రోజాతికి చెందిన ఒక అనామకుడు ఇలా సాకర్ తారగా వెలుగొందడం చూసి తోటి శ్వేతజాతి యూరోపియన్లు ఇతర ఆటగాళ్ళు సహించలేకపోయారు. పీలేను గ్రౌండ్‌లో కట్టడి చేసేందుకు ముగ్గురు నలుగురు క్రీడాకారులు కలిసి ఎప్పుడూ అతన్ని శారీరకంగా దెబ్బతీయాలని చూసేవారు. ఇలా కోటగోడలా ఉన్న ప్రత్యర్థి ఆటగాళ్ళను తప్పించుకొని గోల్స్ ఎలా చేయాలో పీలే ప్రయోగాత్మకంగా చేసి చూపించాడు. పీలే రూపొందించిన రివర్స్ కిక్ ఫుట్‌బాల్ క్రీడాకారులను నివ్వెరపరిచేవి అతను కొట్టిన రివర్స్ కిక్‌లను గంటల తరబడి టీవీల్లో చూసిన క్రీడాభిమానులు ఆనందంతో

ఉద్రూతలూగిపోయేవారు. పీలేకి ఏ జాతీయ నాయకుడికీ, ఏ సినిమా స్టార్‌కూ, ఏ పాప్‌గాయకుడికీ లేనంత అభిమానులుండేవారు.

సాకర్ క్రీడకు కళాత్మకత అద్దిన వాడు పీలే. అప్పటివరకూ మొద్దుబలంతో, దూకుడుగా ఆడే ఫుట్‌బాల్‌ను నైపుణ్యంగా ఎలా ఆడాలో పీలే నేర్పాడు. చదరంగంలో ఎత్తుగడల్లా ప్రత్యర్థి బలం, బలహీనతలను తెలివిగా ముందే అంచనావేసి ఎలా దెబ్బకొట్టాలో అతని ఆటతీరు చూస్తే తెలుస్తుంది. పీలేను షార్ట్ డిస్టెన్స్ రన్నర్‌గా ఒలంపిక్స్‌కు పంపిన అతను మెడల్ తేగలిగేవాడు. ఎందుకంటే 100 మీటర్ల దూరాన్ని కేవలం 10 సెకన్లలోపే పీలే అధిగమించేవాడు. పీలే క్రీడానైపుణ్యానికి ఉదాహరణగా అప్పట్లో లాటిన్ అమెరికాలో జరిగిన ఒక దృష్టాంతాన్ని ప్రపంచమంతా చెప్పుకునేది. అర్జెంటీనాలో ఏడాది కాలంగా రెండు వర్గాల మధ్య చియాస్తాన్‌లో అంతర్యుద్ధం జరుగుతోంది. ప్రతిరోజూ రెండు వర్గాల మధ్య కాల్పులు జరుగుతూనే ఉండేవి. అలాంటిది పీలే వరుసగా 15 రోజులు తమ దేశంలోనే ఫుట్ బాల్ ఆడుతున్నాడని తెలిసి ఘర్షణ పడుతున్న ఇరు వర్గాలూ నెలరోజులపాటు యుద్ధ విరమణ ప్రకటించాయి. ఆ విరమణ తరువాత ఇరువర్గాలూ రాజీకొచ్చి మళ్ళీ ఘర్షణ పడలేదు. ఇలా ఒక యుద్ధాన్ని ఆపిన ఘనత పీలే దక్కించుకున్నాడు.

దక్షిణ అమెరికా, యూరప్, ఆఫ్రికా, ఆసియాలో కోట్లాది మంది అభిమానులను సంపాదించిన పీలే, తన దేశానికి మరో రెండు వరల్డ్ కప్‌లు అందించాడు. ఆ రకంగా పీలే కారణంగా హ్యాట్రిక్ సాధించిన బ్రెజిల్ రికార్డును ఆ తరువాత మరే దేశం అందుకోలేకపోయింది. 34 ఏళ్ల వయస్సు వచ్చేసరికి పీలే కోట్లాది సంపద ఆర్జించాడు. ఎక్కడికెళ్ళినా చుట్టుముట్టే అభిమానులు, గొడవపడే ప్రత్యర్థులతో విసిగిపోయిన పీలే 1974లో సాకర్ నుంచి రిటైర్‌మెంట్ ప్రకటించాడు. అయితే ఏడాది తరువాత అమెరికాలో ఫుట్‌బాల్‌కు ఆదరణ పెరగడంతో న్యూయార్క్ కాస్మోస్ క్లబ్ సవాలును స్వీకరించి యాభై లక్షల డాలర్ల ప్రైజ్‌మనీ కోసం మరోసారి మైదానంలోకి దిగాడు. ఆ టోర్నమెంటుతో పీలే అమెరికన్లకూ ఆరాధ్యుడయ్యాడు. పీలేకు ఈ దెబ్బతో హాలీవుడ్‌లో ఎన్నో అవకాశాలొచ్చాయి. దజనుకు పైగా సినిమాల్లో నటించి, వాటిలోకూడా ఫుట్‌బాల్ కథాంశాలనే చొప్పించాడు. తన క్రీడాజీవితంలో 1281 ఫస్ట్‌క్లాస్ గోల్స్ సాధించాడు. పీలే తరువాత ఏ ఒక్క అంతర్జాతీయ సాకర్ ఆటగాడూ కూడా ఇందులో సగం గోల్స్ కూడా చేయలేకపోయాడు. అలాగే సాకర్‌లో అంతర్జాతీయ మ్యాచ్‌లో తొలిసారిగా వెయ్యిగోల్స్ మైలురాయిని దాటిన ఘనత కూడా పీలేదే. 1958, 62, 79లలో జరిగిన మూడు వరల్డ్‌కప్ సాకర్ పోటీల్లో ఆడి మూడుసార్లు ఫైనల్స్‌లో తమ దేశాన్ని గెలిపించిన ఘనత కూడా పీలేకే దక్కుతుంది. ఉత్తర అమెరికా సాకర్ లీగ్‌లో చేరి అమెరికా తరఫున ఆడి వారిలో కూడా ఫుట్‌బాల్ పట్ల క్రేజ్ నింపాడు.

ప్రపంచవ్యాప్తంగా ఎక్కువ దేశాల్లో ఆడే ఫుట్‌బాల్ క్రీడకొక సరికొత్త నిర్వచనం చెప్పి, దాన్ని పాతికేళ్లపాటు శాసించిన క్రీడాదిగ్గజం పీలే. 1975లో క్రీడాజీవితం నుంచి రిటైరైనా ఇప్పటికీ పీలే బ్రెజిల్ దేశ ప్రజలకు ఒక గొప్ప స్ఫూర్తి. అట్టడుగు స్థాయి నుంచి స్వయంకృషితో ఎదిగి కోట్లాది మంది అభిమానులూ, ఆస్తిని సంపాదించిన పీలే అప్పుడప్పుడూ వివిధ ఫుట్‌బాల్ క్లబ్బుల్లో గౌరవ శిక్షకుడిగా కనిపిస్తాడు.

1935-
1977

# ఎల్విస్ ప్రెస్లీ

అమెరికాలో ఇప్పటికీ అక్కడి నయాగారా జలపాతాన్ని చూడటానికి ఎంత మంది సందర్శకులు వస్తారో, అంత మందీ ఒక వ్యక్తి సమాధిని చూడటానికి వస్తుంటారు. ఏటా కొన్ని లక్షల మంది చూసే సమాధి అంటే తాజ్ మహల్‌లాంటిది కాదు. అదొక సాధారణ సమాధే. కానీ ఆ సమాధి ఏ దేశాధ్యక్షుడిదో, స్వాతంత్ర్య సమరయోధునిదో అయితే పెద్దగా ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు. ఇంతకీ ఆ సమాధి ఎవరిదంటే అదొక ప్రఖ్యాత పాప్ గాయకునిది. అర్ధశతాబ్దం క్రితం అమెరికా, యూరప్ సహా ప్రపంచదేశాల్లో యువతరాన్ని ఉర్రూతలూగించిన ఎల్విస్ ప్రీస్లే అనే సంగీత తరంగానిది. అసలు ప్రీస్లే మరణించలేదనే ఇప్పటికీ అతనికున్న లక్షలాది మంది అభిమానులు విశ్వసిస్తుంటారు. రాక్ సంగీతంలో ఎందరు మహామహులు పుట్టుకొచ్చినా ఎల్విస్ ప్రీస్లే సృష్టించిన ఒరవడి, సంచలనాలను ఎవరూ సృష్టించలేకపోయారు.

1935లో అమెరికాలోని మిసిసిపీ రాష్ట్రంలోని టుపేలో అనే చోట పుట్టిన ఎల్విస్, చిన్నప్పటినుంచే మంచి గాయకుడిగా పేరు తెచ్చుకున్నాడు. తల్లితోపాటు క్రమం తప్పకుండా చర్చికెళ్లే ఎల్విస్ అక్కడి ప్రార్థనాగీతాలను లయబద్ధంగా ఆలపించేవాడు. గాస్పెల్ సంగీతంలో (ప్రార్థనాగీతాలను పాడటంలో) పేరు తెచ్చుకోవాలన్న తపనతో తల్లి అతనికి గిటార్, కీబోర్డ్, పియానో, డ్రమ్స్ వంటి వాటిని వాయించడంలో శిక్షణ ఇప్పించింది. 13 ఏళ్లు వచ్చేసరికి ఎల్విస్ తన తల్లితో కలిసి టెన్నెసీలోని మెంఫిస్ చేరుకున్నాడు. అక్కడకు వచ్చిన తరువాత స్థానికులతో కలిసి జానపద గీతాలను కూడా బాగా ప్రాక్టీస్ చేశాడు. మెంఫిస్‌లో జరిగే సాయంత్రంపూట సంతలో గిటార్ పట్టుకుని పాటలు పాడుతున్న ఎల్విస్‌లోని ప్రతిభను స్థానికంగా ఉన్న శామ్ ఫిలిప్ అనే వ్యక్తి కనిపెట్టాడు. పగలంతా ట్రక్కు డ్రైవర్‌గా కష్టపడే 18 ఏళ్ల ఎల్విస్ ఒక రోజు జబ్బుపడిన తన తల్లికి తాను కొత్తగా కూర్చిపెట్టిన పాటను విన్పించడానికి దాన్ని రికార్డు చేసి పెట్టాల్సిందిగా మెంఫిస్‌లోని సన్ రికార్డ్స్ నిర్వాహకుడైన శామ్‌ఫిలిప్‌ను కోరాడు. అయితే రికార్డైన పాటలో ఎల్విస్ గొంతు శామ్‌కు అంతగా నచ్చలేదు. మరొకసారి తన దగ్గరకు వచ్చిన ఎల్విస్‌ను "నీగ్రో సాంప్రదాయ పాటలు వారిలాగే పాడగలవా" అంటూ ప్రశ్నించాడు. 1954లో "దట్స్ ఆల్ రైట్ మామా" అంటూ ఎల్విస్ నీగ్రోల జానపద శైలిలో ఒక పాటపాడితే దాన్ని రికార్డు రూపంలో విడుదల చేశాడు శామ్. ఎల్విస్ గొంతులోని మార్ధవం, స్వరానికున్న ఆకర్షణ స్థానికంగా ఉన్న శ్రోతలను మంత్రముగ్ధులను చేసింది. వారం రోజులకే ప్రజలు మరీ మరీ కోరి ఎల్విస్ పాటలను ఎగరేసుకుపోయారు.

ఆఫ్రో-అమెరికన్ సంగీత సాంప్రదాయాలే తన విజయ రహస్యమని ఎప్పుడూ చెప్పుకునే ఎల్విస్ నీగ్రో పాటలతో క్రమంగా తనకు సొంతంగా అభిమానులను ఏర్పాటు చేసుకున్నాడు. బ్లూ మూన్ బాయ్స్ పేరుతో ఒక బృందాన్ని నెలకొల్పి అమెరికాలోని వివిధ ప్రాంతాల్లో రాక్ సంగీత ప్రదర్శనలివ్వడం ప్రారంభించాడు. అయితే డచ్‌కు చెందిన ఓ బుకింగ్ ఏజెంట్ అయిన కాలొనెల్ టామ్ పార్కర్‌ను తన మేనేజర్‌గా పెట్టుకున్న తరువాత ఎల్విస్ దశ తిరిగింది. పార్కర్ ఆధ్వర్యంలో ఎల్విస్ తన ట్రూప్‌ను మరింత బలోపేతం చేసి 'ద హిల్ బిల్లి క్యాట్' పేరుతో పక్కా పల్లెటూళ్లలో తిరగడం మొదలుపెట్టాడు. 1956 నాటికిగాని ఎల్విస్‌కు అసలైన విజయం లభించలేదు. ఆర్‌సిఎ మ్యూజిక్ కంపెనీకి చెందిన విక్టర్‌తో 35000 డాలర్ల కాంట్రాక్ట్ కుదుర్చుకొని 'హార్ట్ బ్రేక్ హోటల్' అనే ఆల్బంను విడుదల చేశాడు. ఊహించని విధంగా ఆ ఆల్బం 20 లక్షల కాపీలు అమ్ముడుపోయింది. ఎల్విస్‌ను మొదట గుర్తించిన శామ్ ఫిలిప్స్ ఆశ్చర్యపోయాడు. అతని కళ్ళముందే ఎల్విస్ మహావృక్షంలా ఎదిగిపోయాడు. ఎల్విస్ అమెరికాలోని ప్రతి గ్రామంలోనూ పర్యటించడం అతనికి బాగా కలిసివచ్చింది. ఏ మ్యూజిక్ షాపుకెళ్లినా ఎల్విస్ పాటలున్నాయా అని జనం అడగడం ప్రారంభించారు.

సంగీత ప్రదర్శనల సందర్భంగా ఎల్విస్ భంగిమలు అమెరికా యువతను వెర్రెక్కించాయి. ఎల్విస్

అసభ్యతను సవాలు చేస్తూ కొంత మంది పెద్దవారు కేసులు కూడా పెట్టారు. వాటికేమీ భయపడలేదు ఎల్విస్. యువతను పెద్దవారిపై తిరగబడండంటూ ధిక్కారధోరణిలో ప్రదర్శనలిచ్చాడు. క్రమంగా తన అసభ్య ప్రదర్శనలను తగ్గించి మంచి సాహిత్య విలువలున్న పాటలు ఆలపించిన ఎల్విస్ ఆ తరువాత పెద్దవారిని కూడా ఆకట్టుకున్నాడు. ఎల్విస్‌ను అమెరికన్ టీవీ ఛానళ్లు కూడా పోటీపడి అతని చేత ప్రదర్శన లిప్పించసాగాయి. 'ఎడ్ సల్లివాన్ షో' మిస్టర్ సండే హాట్ పేరుతో ఎల్విస్ నిర్వహించిన షోలు అప్పట్లో దాదాపు అమెరికా అంతటా కలిసి 40 లక్షల మంది చూసి ఉంటారని ఓ అంచనా. అమెరికా, యూరప్ యువ తరంగాలలో కెరటంలా లేచిన ఎల్విస్‌కు హాలీవుడ్ సాదరంగా స్వాగతం పలికింది. హాల్ వాలీస్ అన్ నిర్మాత ఎల్విస్‌తో 1956లో ఏడేళ్ళ కాంట్రాక్టు కుదుర్చుకున్నాడు. మొదటి సినిమా 'లవ్ మీ టెండర్' హాలీవుడ్‌లో సంచలనం సృష్టించింది. ఆ సినిమా నిర్మాణ వ్యయం నాలుగు లక్షల డాలర్లైతే అది 25 లక్షల డాలర్లు సంపాదించింది.

సినిమాల్లోనూ కూడా ఎల్విస్ గాయకుడు లేదా ప్రేమికుడి పాత్రనే పోషించాడు. ఎల్విస్‌ను నేరుగా చూసి ఆనందించలేని అభిమానులు అతని సినిమాలంటే ఎగబడ్డారు. అయితే సినిమాల మీద ఆసక్తి తగ్గిపోయిన తరువాత ప్రిస్లే మళ్ళీ సంగీత ప్రదర్శనలివ్వడం ప్రారంభించాడు. 1969లో ఇన్ ద గెట్టో, సస్పీషియస్ మైండ్స్, ద వండర్ ఆఫ్ యు (1970) కెంటుకీ రెయిన్ (1970) పేర్లతో విడుదల చేసిన ఆల్బమ్‌లు రికార్డు స్థాయిలో అమ్ముడు పోయాయి. తరువాత కాలంలో బీటింగ్స్‌కు, సౌండ్‌కు అంతగా ప్రాధాన్యతనివ్వకుండా సంగీతానికీ, మెలోడీకి ప్రాముఖ్యతనిచ్చి ప్రెస్లీ పాటలు పాడాడు. అమెరికన్ ఆర్మీలోని ఒక గ్రూపుతో కలిసి పాడిన పాటలు అతనికి ఖండాంతరాల్లో అభిమానులను సాధించిపెట్టాయి. 1968 వరకూ ఎల్విస్ టీవీల్లోగాని, సినిమాల్లోగానీ మళ్ళీ కన్పించలేదు. దీంతో ఎల్విస్‌ను చూడటానికి అతను ఏ మూల సంగీత ప్రదర్శన ఇచ్చినా జనం లక్షల సంఖ్యలో విరగబడేవారు.

ఆరడుగుల అందగాడు ఎల్విస్‌కున్న అభిమానుల్లో ఆడవాళ్ళే ఎక్కువ. పదహారేళ్ల పడచుపిల్ల నుంచీ 80 ఏళ్ళ బామ్మ వరకూ ఎల్విస్‌ను ఆరాధించేవారే. ఎల్విస్‌లాగా బెల్‌బాటం ఫ్యాంటు, లావుగా మందంగా ఉన్న బెల్టు, పెద్ద కౌబాయ్ టోపీ, ఎర్రటి షూ వేసుకోవడమంటే అప్పట్లో అమెరికాలో పెద్ద క్రేజ్. ఎల్విస్ ధరించిన ఏ కాస్ట్యూమ్ అయినా ప్రజల్లో ఇట్టే దూసుకుపోయేది. తన కెరీర్ ఉచ్ఛదశలో ఉన్నప్పుడు ప్రిసిల్లా బ్యూలాను పెళ్ళిచేసుకున్నాడు అయితే రెండేళ్ళు తిరక్కుండానే ఆమెకు విడాకులిచ్చాడు.

గ్రేస్ ల్యాండ్‌లో 23 విశాలమైన గదులున్న పెద్ద భవంతిని కొని అందులో ఉండేవారు ఎల్విస్. 1973లో హవాయి దీవుల్లో ఎల్విస్ ఇచ్చిన ప్రదర్శన ప్రపంచవ్యాప్తంగా కనీసం 10 కోట్ల మంది టీవీలో చూసి ఉంటారని ఒక అంచనా. అప్పటి వరకూ టెలివిజన్ చరిత్రలో అంతమంది ఒకే షోను చూడటం సరికొత్త రికార్డు. డబ్బు, పేరు ప్రఖ్యాతులతోపాటు ఎల్విస్ వ్యక్తిగత జీవితం కూడా విలాసవంతంగా ఉండేది. స్టేజి మీద ఎల్లప్పుడూ చలాకీగా కనబడటానికి మితిమీరిన డ్రగ్స్ వాడడం మొదలుపెట్టా డు. మారిజువానా, హెరాయిన్ వంటి మత్తు పదార్థాలు, మాదక ద్రవ్యాలు తీసుకునేవాడని అతని వైద్యులు చెప్పారు. సంగీత ప్రపంచంలో అన్ని రకాలైన సంచలనాలకు కేంద్రబిందువుగా, అన్ని రికార్డులను తిరగరాసిన ఎల్విస్ ప్రెస్లీ తన 42వ ఏట అకస్మాత్తుగా చనిపోయాడు. 1977 సంవత్సరం ఆగస్ట్ 16న ఉదయం ఎల్విస్ ప్రెస్లీ శవాన్ని చూసిన అతని సేవకులు ఈ విషయాన్ని బయటి ప్రపంచానికి వెల్లడించారు. ఎల్విస్ మరణించాడన్న విషయాన్ని అతని అభిమానులు తట్టుకోలేకపోయారు. డజను మందికి పైగా ఆత్మహత్య చేసుకున్నారు. ఇప్పటికీ ఎల్విస్ మరణించాడంటే అతని అభిమానులు నమ్మరు. అతను ఎక్కడో బతికే ఉన్నాడని వారు అనుకుంటారు. రాక్ సంగీతంలో రారాజుగా వెలిగిన ఎల్విస్ స్థానాన్ని బహుశా మరెవరూ అందుకోలేరేమో!

1856-
1950

# జార్జ్ బెర్నార్డ్ షా

"నా పద్ధతి ఏమిటంటే చెప్పాల్సిన మంచి విషయం ఏదోనిర్ణయించుకోవడానికి ఎక్కువ శ్రమ పడతాను. ఆ తర్వాత విషయాన్ని అత్యంత సులభంగా చెప్పడానికి ప్రయత్నిస్తాను" ఈ పద్ధతే అతన్ని సాటిలేని మేటి రచయితగా నిలిపింది. అతనే జార్జ్ బెర్నార్డ్ షా. ప్రతి రచయిత పాటించాల్సిన కనీస సూత్రం ఇదే. జార్జ్ బెర్నార్డ్ షా గొప్ప విదాయవంతుడు. ఆంగ్ల భాషా కోవిదుడు. నాటక రంగానికి సంబంధించిన గొప్ప ద్రష్ట. నాటకాన్ని విక్టోరియా శకం నుంచి ఆధునిక యుగంలోకి తీసుకొచ్చిన మహానుభావుడు. చాతుర్యం, శక్తి, సౌశీల్యం, భాషా పాటవానికి సంబంధించిన కొత్త కొత్త ఆలోచనల గని. బెర్నార్డ్ షా. (నాటకాలు చూసే ప్రేక్షకుల్లో ఒకరైన షా కొత్త ఒరవడితో సవాలును ఎదుర్కొన్నారు. మరోవైపున వారి స్థాయి, నాటకానుభవం పెరిగాయి). షాకు సన్నిహితంగా మెలిగినవారు ఆయన స్నేహ, సాహార్ధాలను తనివితీరా అనుభవించారు. ఆయన సుదీర్ఘకాలం నాటక రచయితగా కొనసాగాడు. ఆయన వ్యక్తిత్వం, ఔన్నత్యం ఇతరులు అధిగమించ లేనిది. అంత భారీ స్థాయిలో పేరుప్రఖ్యాతులు సంపాదించడానికి ఆయన ఎన్నేళ్ళు శ్రమించ వలసి వచ్చిందో కూడా జనం మరచిపోయారు.

బెర్నార్డ్ షా డబ్లిన్‌లో జన్మించాడు. ఆయన తండ్రి మద్యానికి బానిస అయినా మంచి హాస్య చతురత గలవాడు. ఆ రెండవది వారసత్వంగా బెర్నార్డ్ షాకు బాగా అబ్బింది. అందుకే 20వ శతాబ్దంలోని నాటక రచయితల్లో అద్వితీయుడ నిపించుకున్నాడు. యవ్వనదశలో ఉన్నప్పుడు ఆయన కుటుంబ పరిస్థితి దయనీయంగా ఉండడంవల్ల సెంట్రల్ మోడల్ బాయిస్ స్కూల్‌లో చేరవలసి వచ్చింది. అది దిగువ మధ్య తరగతి కాథలిక్ పిల్లలు చదువుకునే పాఠశాల. బెర్నార్డ్ షా తెలివి తేటలకు ఆ పాఠశాల ఎందుకూ సరితూగలేదు. పదిహేనో ఏట చదువు మానేసి చిన్నా చితకా ఉద్యోగాలు చేశాడు. అయితే ఆయనలో పెరుగుతున్న సాహిత్య పిపాసకు ఆ ఉద్యోగ జీవితం ఎంత మాత్రం సంతృప్తి కలిగించలేదు.

1876లో షా ఐర్లండ్ వదిలి పెట్టి లండన్ వెళ్ళాడు. అక్కడే మొదటి నవల రాశారు. ఆయన వ్రాసిన ప్రచురింపబ డని ఐదు నవలల్లో ఇదొకటి. తర్వాత పన్నెండేళ్లకు పత్రికా రచనకు అవకాశం వచ్చింది. ది స్టార్ పత్రికకు సంగీతంపై అద్భుతమైన వ్యాసాలు రాసేవాడు. రచనలో ఆయనకు సాంకేతిక పరిజ్ఞానం అంతగా లేకపోయినప్పటికీ తనకున్న సౌందర్య దృష్టితో మెప్పించగలిగాడు. చౌకబారు రచనలు చేసేవారిపై కత్తులు దూసేవాడు. "నా పద్ధతి ఏమిటంటే చెప్పాల్సిన మంచి విషయం ఏదో నిర్ణయించుకోవడానికి ఎక్కువ శ్రమ పడతాను. ఆ తర్వాత ఆ విషయాన్ని అత్యంత సులభంగా చెప్పడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు బెర్నార్డ్ షా. 1890లో ఆయన వరల్డ్ పత్రికకు మారిపోయాడు. ఆయనకు ఆ పత్రికలో ప్రత్యేకంగా పాఠకులు ఏర్పడ్డారు.

నాటక విమర్శకుడిగా షా అవాస్తవికమైన సంభాషణలను చీల్చి చెండాడేవాడు. 'మంచి నాటకం' అనిపించే వాటిలోని డొల్లతనాన్ని బయట పెట్టడం మొదలు పెట్టాడు. 1895 నుంచి 1898 వరకు సండే రివ్యూ పత్రికకు నాటకరంగ విమర్శలు రాయడం ద్వారా తన స్వీయ నాటకరంగ సిద్ధాంతాన్ని రూపొందించుకున్నాడు. సమాజ సంప్రదాయాలు అనే కుహనా ఆధిపత్యం అంటే ఆయనకు ఎక్కడలేని ఏవగింపు. సహజమైన నేపథ్యంలో, రోజువారీ వాడుక భాషలో చెబితే భావాల ప్రకటనకు నాటక రంగం అద్భుతంగా ఉపయోగపడుతుందన్నది షా విశ్వాసం. దీనికి ఇబ్సన్ నాటకాలు ఆయనకు ఆదర్శ ప్రాయంగా కనిపించాయి. ఇబ్సన్ నాటకాల గురించి షా చాలా విస్తారంగా రాశాడు. ఇబ్సన్ నాటకాలకు, బెర్నార్డ్ షా నాటకాలకు ఒక స్పష్టమైన తేడా ఉంది. ఇబ్సన్ తన పాత్ర మానసిక ఉద్దేశాల మీద ఎక్కువ దృష్టి కేంద్రీకరించేవాడు. షా తన నాటకాల్లోని పాత్రల సామాజిక అంశాలను ప్రతిబింబించే వాడు. అంటే రాజకీయ అంశాలను చర్చించేవాడు. 1884లో బెర్నార్డ్ షా ఫేబియన్ సొసైటీని స్థాపించడంతో సాహిత్య రంగంలో విగ్రహ విధ్వంసకుడిగా అంటే అంతకు ముందున్న సంప్రదాయాలను పటాపంచలు చేసే వాడిగా బోలెడు పేరు ప్రఖ్యాతులు పొందాడు. షా నెలకొల్పిన ఫేబియన్ సొసైటీ కూడా సోషలిస్టు బృందమే. కానీ షా ప్రబోధించిన సోషలిజం కార్ల్ మార్క్స్ ప్రవచించిన వర్గ పోరాట ఆధారితమైన సోషలిజం కాదు. అది ఒక పరిణామాత్మక ప్రక్రియ.

1892లో 'విడోయర్స్ హౌజెస్' అన్న నాటకంలో తన విభిన్న తాత్విక పునాదులను, నాటకం అంటే తనకున్న అభిప్రాయాలను షా వ్యక్తం చేయగలిగాడు. ఆ నాటకం తొలి ప్రదర్శనకు బ్రహ్మాండమైన ఆదరణ లభించింది. ఒక ప్రేక్షకుడు మాత్రం షాను వెక్కిరించాడు. అప్పుడు షా "మిత్రమా నేను ఒప్పుకుంటాను కాని అంత మంది అభినందిస్తుండగా మనిద్దరి దేముంది?" అన్నాడు. అప్పటిదాకా వివాదాస్పదుడైన నాటకరంగ విమర్శకుడిగా ఉన్న షా, నాటక రచయిత అయిపోయాడు. తన నాటకాలపై తీర్పు చెప్పే వారితో తలపడ్డాడు. 1897లో 'కాండిడా', 'డెవిల్స్ డిసైపుల్' నాటకాలు ప్రదర్శించే దాకా బెర్నార్డ్ షా ఆర్థికంగా నిలదొక్కుకో లేకపోయాడు. ఆ తర్వాత షా తన నాటకరంగ విమర్శకులకు స్వస్తి చెప్పి ఐరిష్ మహిళ చార్లెట్ పెయినె టౌన్స్‌హెండ్‌ను పెళ్లి చేసుకున్నాడు. అయితే లైంగిక సంబంధాలు పెట్టుకోకూడదని వారు ఒక ఒప్పందానికి వచ్చారు. అయితే తనను అభిమానించే అనేక మంది యువతులతో ఆయన లైంగిక వాంఛ తీర్చుకునేవాడు. కాని వారందరూ ఆయనకు ఉంపుడు గత్తెలు మాత్రం కాదు. నిజానికి షా జీవిత చరిత్ర రాసిన వారందరూ ఆయన లైంగిక జీవనం గురించి ఆయన చూపిన ఆసక్తికన్నా అనేక రెట్లు ఎక్కువ ఆసక్తి చూపించారు. ఎలెన్ టెర్రీ అన్న ప్రసిద్ధ నటితో ఆయనకు అమలిన శృంగార సంబంధాలు ఉండేవి. "మహిళలను ఏడిపించడంలో నా ప్రతిభ చాలా గొప్పది. అయితే అలా ఏడిపించడం వెనక గొప్ప ఉద్దేశాలు ఉన్నాయ"ని టెర్రీతో అన్నాడు. ఆయన స్నేహాల గురించి చెప్పాల్సి వస్తే ఆయన నలుగురితో కలిసి కలివిడిగా తిరగాలనే తత్వం ఉన్నవాడు. కాని ఆయనకు సన్నిహితులు అయినవారు చాలా తక్కువ మందే ఉన్నారు.

ఆయనకు శత్రువులు లేరు. కాని ఆయన స్నేహితులెవరికీ ఆయన నచ్చలేదు అన్న ఆస్కార్ వైల్డ్ వ్యాఖ్య బెర్నార్డ్ షా వ్యక్తిత్వానికి ఉత్తమ నిర్వచనం. చాలా మంది గొప్ప కళాకారుల్లా కాకుండా షాకు సమకూరిన గొప్ప విజయాలు ఆయనకు వయసు పెరిగిన తర్వాత మాత్రమే సమకూరాయి. "మాన్ అండ్ సూపర్‌మాన్" (1903), "యూ నెవర్ కెన్ టెల్" (1905), "ఆండ్రొ క్లీస్ అండ్ ది లయన్" (1912) వంటి రచనల ద్వారానే ఆయనకు కీర్తి వచ్చింది. "సెయింట్ జాన్" రాసిన రెండేళ్లకు 1923లో ఆయనకు సాహిత్యంలో నోబెల్ బహుమతి వచ్చింది. ఆయన రాసిన పిగ్మాలియన్ (1913) అమెరికన్ల హృదయాల్లో సుస్థిర స్థానం ఏర్పాటు చేసుకుంది. 1956లో "లెర్నర్ అండ్ లోనే" రూపొందించిన బ్రాడ్‌వే సంగీత రూపకం "మై ఫేర్ లేడీ" (1956)లో "పిగ్మాలియన్"లోని అంశాలనే పొందుపరిచాడు. ఇదే పేరుతో 1964లో జార్జ్ క్యూకర్ సినిమా కూడా తీశాడు. అయితే "మైఫేర్ లేడీ"లో వాడిన దుస్తులు షాకు నచ్చలేదు. రెండో ప్రపంచ యుద్ధం సమయంలో షా వ్యాసాలు రాస్తూనే ఉన్నాడు. హిట్లర్‌గానీ, స్టాలిన్‌గానీ దుర్మార్గులు కారని చెప్పి ఆయన పాఠకులను రెచ్చగొట్టాడు. షేక్స్‌పియర్ నాటకాల్లాగా తన నాటకాలను పాఠశాల విద్యార్థులకు బోధించనక్కర్లేదని కూడా ఆయనే చెప్పాడు. నాటకాల మీద విమర్శలు రాస్తున్న సమయంలో బెర్నార్డ్ షా షేక్స్‌పియర్‌ను కూడా వదలకుండా తీవ్ర విమర్శలు గుప్పించాడు. అయితే తాను పలుకుబడి సంపాదించడానికే అలా చేశానని ఆ తర్వాత అంగీకరించాడు. అయినప్పటికీ ఆయన నాటకాలను ఎంతగా ప్రదర్శిస్తున్నారో అంతే అధ్యయనం చేస్తున్నారు. అవి ఇప్పటికీ వినోదం కల్పించడంతో పాటు నైతిక ప్రవర్తనకు మెరుగుపరచుకోవడానికి కూడా తోడ్పడుతున్నాయి. మంచి నాటకాల లక్ష్యం నీతి బోధే అని షా చెప్పేవారు.

బెర్నార్డ్ షా గురించి ఒక హాలీవుడ్ నటి ఇలా అంది. "షా మీరు నేను వివాహం చేసుకుంటే నా అందం మీ తెలివితేటలతో మనకు పిల్లలు పుడతారు" అని. హాస్య చతురుడైన షా వెంటనే ఆ నటికి "ఒక వేళ నా అందం, నీ తెలివితేటలతో పిల్లలు పుడితే?!!! బదులిచ్చాడు.

ఒక సమావేశంలో బెర్నార్డ్ షా సమావేశ వేదికపైకి వస్తుంటే బ్రిటిష్ ప్రధాని చర్చిల్ వేదిక మెట్లు దిగి క్రిందికి వస్తుంటే, షా, చర్చిల్‌కు అడ్డంగా నిలబడి మూర్ఖులకు నేను దారి ఇవ్వను అంటాడు. అయితే చర్చిల్ హుందాగా ప్రక్కకు తప్పుకొని "నేను మూర్ఖులకు కూడా దారి ఇస్తాను' అని అంటాడు. ఇది షా పొగరుబోతు తనానికి ఉదాహరణ.

# క్రిస్టియన్ బెర్నార్డ్

1967 డిసెంబర్ 3న దక్షిణాఫ్రికాలోని గ్రూటీ స్కూల్ ఆస్పత్రిలోకి వాష్కన్ స్కీ అనే కిరణా కొట్టు యజమానిని శస్త్రచికిత్స చేసే గదిలోకి చక్రాల కుర్చీ మీద తీసుకెళ్ళారు. రోడ్డు ప్రమాదంలో తీవ్రంగా గాయపడిన డెనిస్ డర్వాల్ అనే 25 ఏళ్ల యువతి గుండెను తొలగించి వాష్కన్‌స్కీకి అమర్చారు. శస్త్ర చికిత్స ముగిసిన తర్వాత స్పృహలోకి వచ్చిన వాష్కన్‌స్కీ "నేను కొత్త భస్మాసురిడి(ఫ్రాంకెన్‌స్టెయిన్)"ని అని నర్స్‌తో అన్నాడు. ఆ మాట అక్షరాలా నిజమే. వైద్య రంగంలో విప్లవాత్మకమైన రీతిలో గుండె మార్పిడి చేసి వాష్కన్‌స్కీని బతికించిన డాక్టర్ మీద అప్పటికే ప్రకృతి నియమాలకు వ్యతిరేకంగా నడుచుకుంటున్నాడన్న విమర్శలు హోరెత్తాయి. కానీ వాష్కన్‌స్కీ గుండె మార్పిడి విజయవంతం అయినా ఆ తర్వాత వచ్చిన సమస్యల కారణంగా పద్దెనిమిది రోజుల తర్వాత మరణించాడు. అయితే గుండె మార్పిడి శస్త్ర చికిత్స చేసి చరిత్ర సృష్టించిన డాక్టర్ క్రిస్టియన్ బెర్నార్డ్ పేరు ప్రపంచ వ్యాప్తంగా మోగిపోయింది. ఈ గుండె మార్పిడి శస్త్ర చికిత్సా విధానంపై అంతర్జాతీయంగా వాడిగా వేడిగా చర్చలు జరిగాయి.

డచ్ రిఫార్మ్‌డ్ చర్చ్ ఫాదరీ క్రిస్టియన్ నీల్లింగ్ బర్నార్డ్ తండ్రి. మారు మూల కుగ్రామం. బ్యూ ఫోర్ట్ వెస్ట్‌లో బర్నార్డ్ జన్మించాడు. తన ఇద్దరు అన్నల అడుగుజాడల్లో బర్నార్డ్ పెరిగాడు. తండ్రి పని చేసే చర్చిలో సంగీత వాయిద్యాలు వాయించడం మినహా ఆయనకు మరో వినోద కార్యక్రమం ఏమీ ఉండేది కాదు. పాఠశాల విద్య పూర్తి అయిన తర్వాత కేప్‌టౌన్ మెడికల్ స్కూల్ యూనివర్శిటీలో చేరాడు. 1953లో వైద్య విద్యలో పట్టా పుచ్చుకున్నాడు. సెరిన్ నగరంలో సాధారణ వైద్య వృత్తిని కొనసాగించాడు. ఆ తర్వాత కేప్‌టౌన్ మెడికల్ స్కూల్‌లో శస్త్ర చికిత్సలో పరిశోధకుడిగా చేరాడు. అక్కడ అరకొరగా ఉన్న పరిస్థితిలోనే కుక్కలకు శస్త్ర చికిత్సలు చేస్తూ సర్జన్‌గా తన నైపుణ్యాన్ని పెంపొందించుకోవడానికి ప్రయత్నించాడు. అక్కడే వివాహిత అయిన అందమైన నర్స్ అలెట్టాలోవ్‌ను కలుసుకున్నాడు.

మరింత పై చదువులు చదవాలన్న తహతహతో 1955లో యూనివర్సిటీ ఆఫ్ మిన్నెసోటా మెడికల్ స్కూలులో చేరాడు. అక్కడ ఉపకార వేతనం లభించేంత వరకు చిన్నా చితకా పనులు చేసి రోజులు వెళ్ళబుచ్చాడు. అక్కడే మొట్టమొదటి గుండె శస్త్ర చికిత్స చేశాడు. మూడేళ్ళ విద్యాభ్యాసం ముగిసిన తర్వాత కేప్‌టౌన్‌లో శస్త్ర చికిత్స పరిశోధనా విభాగం డైరెక్టర్‌గా నియమితుడయ్యాడు. 1960లో కుక్క తలను మార్పిడి చేసి అంతర్జాతీయంగా తన సమకాలీకులైన శస్త్ర చికిత్స నిపుణుల దృష్టిని ఆకర్షించాడు.

1967 కల్లా ఆయన అనేక గుండె శస్త్ర చికిత్సలు చేశాడు. కృత్రిమ గుండె కవాటాలు కూడా అమర్చాడు. అప్పటికే బెర్నార్డ్ గుండె మార్పిడి చికిత్సకు సిద్ధంగా ఉన్నాడు. ఒక మనిషి గుండెను మరో మనిషికి అమర్చే విధానాన్ని అప్పటికే అమెరికాలోని నార్మన్ షమ్వే, మైఖేల్ డిబెకీ రూపొందించారు. కాని వారికి ఈ గుండె మార్పిడి విధానాన్ని అమలు చేసే అవకాశం రాలేదు. గుండెలోని కణాలు పీచు పదార్థంతో మూసుకుపోయిన వాష్కన్‌స్కీ మీద ఈ ప్రయోగం చేయవచ్చన్న ఆలోచన బెర్నార్డ్‌కు వచ్చింది.

డెనిస్ డర్వాల్ అనే యువతి రోడ్డు ప్రమాదంలో చిక్కుకునేంత వరకు నెల రోజులు వేచి చూడాల్సి వచ్చింది. ఆ ప్రమాదంలో ఆమె మెదడుకు మరింక బాగు చేయలేని రీతిలో తీవ్ర గాయమైంది. డర్వాల్ రక్తం, వాష్కన్‌స్కీ రక్తం గ్రూప్ ఒకటే నని బెర్నార్డ్ నిర్ధారించుకున్నాడు. రక్తం నమూనా ఒకే రకమైంది అయితే గుండె మార్పిడి చేస్తే కొత్త గుండెను అమర్చుకున్న వ్యక్తి శరీరం తిరస్కరించే అవకాశం ఉండదు. చావు బతుకుల్లో ఉన్న డర్వాల్ గుండెకాయను తొలగించి దానిని హార్ట్ లంగ్ యంత్రంతో అనుసంధానం చేసి అనారోగ్యపీడితుడైన వాష్కన్‌స్కీ గుండెను తొలగించి డర్వాల్ గుండెను అమర్చాడు. ఈ శస్త్రచికిత్సలో బెర్నార్డ్ సోదరుడు డాక్టర్ మారియస్ బెర్నార్డ్ సహకరించాడు. ఈ శస్త్ర చికిత్సకు అయిదు గంటల సమయం పట్టింది. దువాక్ గుండె వాష్కన్‌స్కీ శరీరంలో కొట్టుకోవడం మొదలవగానే ఓరి దేవుడా ఇది

పని చేస్తోంది అని గొణిగాడు బెర్నార్డ్. అయితే దురదృష్టం ఏమిటంటే పరాయి గుండెను తిరస్కరించకుండా ఉండడం కోసం వాష్కన్స్కీకి వాడిన మందులు పనిచేయకపోవడంతో ఆయనకు ఇన్‌ఫెక్షన్ సోకింది. నుమోనియా వ్యాధి సోకి మరణించాడు.

గుండె మార్పిడి శస్త్ర చికిత్స చేసిన బెర్నార్డ్‌కు దూషణ, భూషణలు రెండు తప్పలేదు. కానీ ఆయన అమాంతం ప్రముఖుడైపోయాడు. ఎక్కడ చూసినా ఆయన కనిపించడం మొదలు పెట్టాడు. అమెరికా అధ్యక్షుడితో సమావేశంతో పాటు విందులు, వినోదాల్లో పాల్గొనడం, అందమైన అమ్మాయిలతో డేటింగ్ నిత్యకృత్యం అయిపోయాయి. ఇటలీ నటి గిన లాలొబ్రిగిడాతో ఆయన స్నేహం ముఖ్యంగా చెప్పుకోదగింది. ఇతరుల వ్యవహారాల్లో జోక్యం చేసుకునే అలవాటు ఉన్న ఈ దక్షిణాఫ్రికా డాక్టర్‌ను ఇతనంటే ఈర్ష్యపడే సమకాలీకులు ప్రచారం కోసం ఆర్భాటం చేసేవాడిగా ముద్రవేశారు. చాలా మంది వైద్యులు గుండె మార్పిడిని చూసి కలత చెందారు. చావు బతుకుల్లో ఉన్నప్పటికీ ఇంకా మృత్యువాత పడని ఒక వ్యక్తి గుండెను తొలగించడం అనైతికం అని కొందరు శాస్త్రవేత్తలు, మత బృందాల వారు బెర్నార్డ్‌పై దుమ్మెత్తి పోశారు. గుండెను ఇవ్వడానికి సిద్ధపడిన వ్యక్తి మరణించినట్టు ధృవీకరించే అధికారం ఎవరిచ్చారు అని నిలదీశారు. మరో మనిషికి గుండె అమర్చే తొందరలో ఉన్న శస్త్ర చికిత్స నిపుణుడు ఆ గుండెకాయను దానం చేసే వ్యక్తి ప్రాణాలను కాపాడడానికి పాటుపడాలన్న వృత్తి ధర్మాన్ని పాటించవలసిన అవసరం లేదా అని ప్రశ్నించారు. వైద్య వృత్తిలో ఉన్నవారే గుండె మార్పిడులను నిషేధించాలని కూడా కోరారు. ఇలాంటి అనైతిక కార్యకలాపాలకు పాల్పడి పాపానికి ఒడిగట్టకుండా ఉండడానికి, కొన్ని ప్రధానమైన అంశాలను లోతుగా ఆలోచించాలని సూచించారు.

కానీ బెర్నార్డ్ ఈ హెచ్చరికలను, అభ్యంతరాలకు లొంగేతత్వం ఉన్న మనిషి కాదు. 1968 జనవరి 2న మరో గుండె మార్పిడి శస్త్ర చికిత్స చేశాడు. ఫిలిప్ బ్లెయిబర్గ్ అనే ఉద్యోగ విరమణ చేసిన దంత వైద్యుడికి పక్షవాతం సోకి కోమాలో ఉన్న క్లైవ్ హాప్ట్ అనే 24 ఏళ్ళ యువకుడి గుండెను అమర్చాడు. దక్షిణాఫ్రికా చట్టాల ప్రకారం హాప్ట్ 'నల్లజాతి' వాడు. ఈ అంశం కూడా దక్షిణాఫ్రికా ప్రజల్లో చర్చనీయాంశం అయింది.

అందగాడు, నలుగురితో కలివిడిగా ఉండే తత్వంగల బెర్నార్డ్ అమ్మాయిల వేట మితిమీరిపోయి కీర్తితో పాటు బోలెడు అపకీర్తి కూడా దక్కింది. ఇది ఎంత వరకు పోయిందంటే తీవ్రమైన మానసిక ఒత్తిడికి గురైన ఆయన భార్య 1969లో విడాకులు ఇచ్చింది. బెర్నార్డ్‌తో కలిసి బతకడం కష్టం అన్న భావం ఆమెలో నిండింది. బెర్నార్డ్ ఏ పని చేసినా చాలా జాగ్రత్తగా చేసేవాడు. ఆయన చేసే విమర్శలు చాలా తీవ్రంగా ఉండేవి. శస్త్ర చికిత్స చేసే గదిలో అత్యున్నత ప్రమాణాలు పాటించాలని పట్టుబట్టే వాడు. ఈ ప్రమాణాలు పాటించలేని వారిని నరాలు తెగిపోయినట్టుగా భావించేవాడు. కొద్ది కాలానికి బెర్నార్డ్‌కు కీళ్ళవాతం ప్రబలి పోయింది. చేతులు పనిచేయకుండా పోవడంతో శస్త్ర చికిత్సకు స్వస్తి చెప్పాల్సి వచ్చింది. ఆదాయవనరుల కోసం బోధన, రచన మీద దృష్టి కేంద్రీకరించాడు. డబ్బుకోసం అలంకరణ సామగ్రిని ప్రోత్సహించడం కూడా మొదలు పెట్టాడు. 1986లో ఆయన ముఖానికి రాసుకునే క్రీం వాడమని సిఫార్సు చేయడంతో వాణిజ్య ప్రయోజనాలకు మరీ దిగజారి పోతున్నాడని నిందలు తారస్థాయికి చేరాయి.

1997లో బెర్నార్డ్ వైద్య వృత్తి నుండి తప్పుకుని నవలా రచయితగా అవతరించాడు. తన స్వస్థలానికి దగ్గరలో ఒక పశు పాలనా క్షేత్రాన్ని నిర్వహించాడు. తన తప్పిదాలను ఆయన ఒప్పుకున్న సందర్భాలే తక్కువ. దక్షిణాఫ్రికాలోని జాతి వివక్షకు ఒడిగట్టే పాలకుల విషయంలో మెతకగా వ్యవహరించినందుకు మాత్రం విచారం వ్యక్తం చేశాడు. ఉద్వేగభరితమైన తన వైద్యవృత్తిని వదిలివేయడానికి తానే సృష్టించుకున్న నైతిక సమస్యల వలయంలో చిక్కుకోవడం కూడా మరో కారణం.

1897-
1945

# సుభాష్ చంద్రబోస్

భారత స్వాతంత్ర్య పోరాట మహోజ్వల ఘట్టంలో ఇద్దరు ప్రధాన నేతలు ప్రతి భారతీయుడికీ స్ఫురణకు వస్తారు. ఆ ఇద్దరే మహాత్మాగాంధీ, నేతాజీ సుభాష్ చంద్రబోస్. ఒకరిది అహింసా మార్గంలో లక్ష్య సాధన అయితే మరొకరిది ఆయుధంతోనే లక్ష్య సాధన. అద్భుతమైన తెలివితేటలు, మొక్కవోని పట్టుదల, ఎవరినైనా తన వాగ్ధాటితో ఇట్టే ప్రసన్నం చేసుకోగల ధైర్యం, చొరవ సుభాష్ చంద్రబోస్‌ను అద్వితీయమైన నాయకుడిగా నిలబెట్టింది. భారతీయుల పోరాటపటిమను ప్రపంచానికి చాటుతూ మొట్టమొదటిసారి ఇండియన్ నేషనల్ ఆర్మీని స్థాపించాడు. ప్రతి భారతీయుడు జీవితంలో ఏదో ఓ సందర్భంలో ఉచ్చరించే 'జై హింద్' నినాద సృష్టికర్త బోసే.

సుభాష్ చంద్రబోస్ 1897 జనవరి 23న ఒరిస్సాలోని కటక్‌లో జన్మించాడు. తండ్రి జానకీనాథ్ బోస్. తల్లి ప్రభావతి. జానకీనాథ్ బోస్ పేరున్న న్యాయవాది. బ్రిటీష్ ప్రభుత్వంలో ఆయన పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పనిచేశాడు. రాజబహదూర్ బిరుదుని పొందారు. అయితే ఆయన జాతీయోద్యమ కాలంలో ఇవన్నీ వదులుకొని జాతీయభావాన్ని, దేశభక్తిని ప్రదర్శించాడు. ఆ విధంగా చిన్నతనంలోనే సుభాష్‌చంద్రబోస్‌కు జాతీయ భావం అలవడింది. 1916లో ప్రెసిడెన్సీ కళాశాల ప్రొఫెసర్ ఎడ్వర్డ్ ఓటన్ అనే ఆంగ్లేయుడు భారతీయ విద్యార్థులను చులకన చేసి మాట్లాడటాన్ని సహించలేని బోస్ ప్రొఫెసర్‌ను చాచి చెంపమీద కొట్టాడు. ఆ దెబ్బతో బోస్‌ను కళాశాల నుంచి బహిష్కరించారు. ఆ తర్వాత పట్టభద్రుడైన బోస్ తండ్రి అభీష్టం మేరకు ఐ.సి.ఎస్. పరీక్ష రాసాడు. 1920లో ఆ పరీక్షలో జాతీయస్థాయిలో మొదటి ర్యాంకు సాధించాడు. అయితే దేశభక్తి అణువణువునా నిక్షిప్తం చేసుకున్న బోస్ గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకరణ ఉద్యమంపట్ల ఆకర్షితుడై 1921లో తన ఐసిఎస్ పదవికి రాజీనామా చేసి స్వాతంత్ర్యోద్యమంలోకి ఉరికాడు. దేశభక్త చిత్తరంజన్ దాస్ భావాలకు ఆకర్షితుడై ఆయనకు ముఖ్య అనుచరుడయ్యాడు. బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా అనేక పోరాటాల్లో బోస్ పాల్గొన్నాడు. అనేక బాధలు పడ్డాడు. తిలక్‌ను మినహాయిస్తే బోస్ వలె బాధలను భరించి తట్టుకోగలిగిన రాజకీయ నాయకులెవరు కనిపించరు. 10 సార్లు నిర్బంధానికి గురై 8 సంవత్సరాలు కారాగార వాసాన్ని అనుభవించాడు. అఖిల భారత కాంగ్రెస్ యువజన విభాగానికి నాయకుడై ఎన్నోసార్లు జైలుకు వెళ్ళాడు. సోషలిస్ట్ భావాలను వెల్లడించే బోస్, గాంధీజీ సిద్ధాంతాలతో బహిరంగంగానే విభేదించాడు.

"మహాత్ముడు స్టాలిన్ లేక ముస్సోలిని లేక హిట్లర్ భాషలో మాట్లాడి ఉంటే జాన్‌బుల్ అర్థం చేసుకొని ఉండేవాడు. తన శిరస్సును గౌరవంతో వంచేవాడు". గాంధీ విధేయత మరీ ఎక్కువగా చూపించడం మంచిది కాదని రౌండ్ టేబుల్ సమావేశంలో గాంధీ మాట్లాడిన ధోరణి తనకు బొత్తిగా నచ్చలేదని బోస్ తను వ్రాసిన 'ది ఇండియన్ స్ట్రగుల్' 320 పేజీలో పేర్కొన్నాడు. బ్రిటిష్ ప్రభుత్వం పట్ల కఠినంగా వ్యవహరించాలని, రాజీ లేని పోరాటం సాగించాలని బోస్ అభిప్రాయం. ఇది గాంధీకి నచ్చలేదు. అయితే నాయకత్వ లక్షణాలు, దేశభక్తితో అప్పటికే బోస్ భారత జాతీయ కాంగ్రెస్‌లో తనదైన ముద్ర వేసుకున్నాడు. మాండలే జైలు, అలీపూర్ కారాగారాల్లో ఉన్నప్పుడు రాజకీయ సిద్ధాంతాలపై బోస్ చాలా పుస్తకాలు చదివాడు. బోల్షెవిజం, ఫాసిజం, డెమొక్రసి, సోషలిజం టు ఫాసిజం పుస్తకాలు బోస్‌పై తీవ్ర ప్రభావాన్ని చూపాయి. 1938లో జరిగిన హరిపురా కాంగ్రెస్ సమావేశాల్లో సుభాష్ చంద్రబోస్ కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. బ్రిటిష్ వారు భారతదేశం విడిచిపెట్టాలంటే వారి శత్రువులతో చేతులు కలపాలన్న బోస్ సిద్ధాంతం గాంధేయవాదులకు నచ్చలేదు. 1939లో మరోసారి జరిగిన అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్ష పదవి ఎన్నికల్లో సుభాష్‌కు వ్యతిరేకంగా గాంధీజీ భోగరాజు పట్టాభి సీతారామయ్యను నిలబెట్టాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. పట్టాభిని ఓడించి సుభాష్ మరోసారి కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. పట్టాభి ఓటమి తన ఓటమిగా భావించిన గాంధీ, ఆయన అనుచరులు సుభాష్‌కు

సహకరించలేదు. గాంధీతో ఏర్పడిన అభిప్రాయబేధాలు, కొందరు కాంగ్రెస్ నాయకుల సహాయ నిరాకరణ వల్ల బోస్ 1939 సెప్టెంబర్‌లో కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు. కాంగ్రెస్‌లో అంతర్భాగంగా, సామ్యవాద భావాలు కలవారి వేదికగా 'ఫార్వర్డ్ బ్లాక్' పేరుతో ఒక పార్టీని ఏర్పాటు చేశాడు. తరువాత కాంగ్రెస్ పార్టీలో కొనసాగలేకపోయాడు. 'ఫార్వర్డ్ బ్లాక్'ను స్వతంత్ర రాజకీయ పక్షంగా మార్చాడు.

కలకత్తాలో బ్రిటిష్ అధికారి హార్వెల్ విగ్రహాన్ని తొలగించాలంటూ బోస్ చేపట్టిన ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. దీంతో బ్రిటిష్ సర్కారు బోస్‌ను ప్రమాదకర తీవ్రవాదిగా ప్రకటించి 1940 జులైలో అరెస్టు చేసి జైల్లో పెట్టింది. జైల్లో నిరాహార దీక్ష ప్రారంభించిన బోస్ ఆరోగ్యం క్షీణించడంతో ఆయనను విడుదల చేసి గృహనిర్బంధంలో ఉంచింది. 1941 జనవరి 26న ఉదయాన ప్రభుత్వం కళ్ళుగప్పి బోస్ అదృశ్యమయ్యాడు. కలకత్తాలో అదృశ్యమైన బోస్ పెషావరు, కాబూల్‌ల ద్వారా రహస్యంగా ప్రయాణమై మార్చి 27న జర్మనీ రాజధాని బెర్లిన్‌ను చేరుకోవడం గొప్ప సాహసోపేత గాథ. రెండో ప్రపంచయుద్ధం సదర్భంగా బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా పోరాడుతున్న అక్ష రాజ్యాలు (జర్మనీ, ఇటలీ, జపాన్) సహాయంతో భారతదేశ విముక్తి సాధించాలని భావించాడు. శతృవుకు శతృవు మిత్రుడన్న సిద్ధాంతాన్ని అమలు చేయాలని నిర్ణయించాడు. జర్మన్ నియంత హిట్లర్ ముఖ్య సహచరుల్లో ఒకరైన రిబెన్ ట్రాప్‌తో చర్చలు జరిపాడు.

హిట్లర్ అనుచరులు మనస్ఫూర్తిగా సహకరించడంతో బోస్ దృష్టి జపాన్‌పై పడింది. ఈలోగా యుద్ధంలో బర్మా ప్రాంతం జపాన్ ఆధీనంలోకి రావడంతో జపాన్ సైన్యాలు భారత సరిహద్దులదాకా చేరుకున్నాయి. బ్రిటన్‌తో జరిగిన యుద్ధంలో వేలాది మంది భారతీయ సైనికులు జపాన్ వారికి యుద్ధ ఖైదీలుగా పట్టుబడ్డారు. జపాన్‌లో స్థిరపడ్డ మరో విప్లవకారుడు రాస్‌బిహారీ బోస్ సాయంతో సింగపూర్‌లో జపాన్‌వారికి యుద్ధ ఖైదీగా చిక్కిన మోహన్‌సింగ్ స్ఫూర్తిగా భారతీయ యుద్ధ ఖైదీలతో సుభాష్ చంద్రబోస్ దాదాపు 60 వేల మందితో భారత జాతీయ సైన్యం (ఐ.ఎన్.ఎ) ఏర్పాటు చేశాడు. 1944 ఫిబ్రవరిలో ఐఎన్ఎ కు చెందిన దళాలు రంగూన్, అస్సాం, అండమాన్ వంటి చోట్ల ప్రవేశించి బ్రిటిష్ దళాలను తరిమికొట్టాయి. అయితే ఈ విజయోత్సవం ఎక్కువ కాలం నిలవలేదు. 1943 నుంచి ప్రపంచ యుద్ధ పరిస్థితుల్లో మార్పులు రాసాగాయి. మొదట్లో సంచలన విజయాలు సాధించిన అక్షరాజ్యాలు క్రమంగా వెనుకంజ వేశాయి. జపాన్ కూడా రంగూన్, అండమాన్ వంటి కీలక ప్రాంతం నుంచి తమ సైన్యాలను ఉపసంహరించింది. దీంతో బ్రిటన్ రంగూన్‌లోని ఐఎన్ఎ సైన్యంపై దాడులకు దిగి వారిని ఓడించి యుద్ధఖైదీలుగా బంధించింది.

బ్రిటిష్‌వారు బర్మాను స్వాధీనం చేసుకున్న తరువాత బోస్ అనేక కష్టాలను ఎదుర్కొని బాంకాక్ చేరుకున్నాడు. అక్కడ నుంచి విమానంలో బయలుదేరి ఆగస్ట్ 18న తైపే చేరుకున్నాడు. అక్కడ నుంచి టోక్యో వెళ్ళడానికి అదే రోజు విమానమెక్కాడు. జపాన్ ప్రభుత్వ సమాచారం ప్రకారం బోస్ ఎక్కిన విమానం బయలుదేరిన కొద్దిసేపటికే మంటలలో చిక్కుకొని నేలకూలింది. బోస్‌కు తీవ్రంగా గాయాలయ్యాయి. ఆ గాయాలతో 1945 ఆగస్ట్ 18 రాత్రి 8-9 గంటల మధ్య బోస్ మరణించాడు. అయితే బోస్ మరణంపై అనేక అనుమానాలు వ్యక్తమయ్యాయి. అనేక మంది ఉన్నాడని, బ్రిటిష్ వారికి బందీగా ఉన్నాడని రకరకాల వదంతులు వ్యాపించాయి. బోస్ మరణ వార్తపై నెహ్రూ ప్రధానిగా భారత సర్కారు షానవాజ్‌ఖాన్ కమిటీ, ఆ తరువాత ఖోస్లా కమిటీ పూర్తిస్థాయిలో విచారణ జరిపి బోస్ మరణించాడని తేల్చి చెపాయి. 'ఆయన వ్యక్తిత్వం అలెగ్జాండర్, సీజర్, క్రామ్‌వెల్, హిట్లర్‌లతో పోల్చదగినదని' బోస్ చేతిలో ఓడిన పఠాబి సుభాష్‌కు హృదయపూర్వక జోహార్లు అర్పించాడు. దేశ స్వాతంత్ర్యం కోసం పరితపించిన ఒక దేశభక్తుడు, త్యాగధనుడు, సాహసవంతుడు భైతికంగా కనుమరుగైనా దేశ ప్రజల గుండెల్లో చిరస్థాయిగా నిలిచిపోయాడు.

1858
1937

# జగదీష్ చంద్రబోస్

కలకత్తా టౌన్ హాల్... పెద్ద ఎత్తున జనం గుమిగూడారు. ఒక భారతీయుడు ఆ భవనంలోనే ఒక అసాధారణ కృత్యాన్ని బ్రిటిష్ లెఫ్టినెంట్ గవర్నర్ విలియం మెకెంజీ ఎదుట ప్రదర్శించబోతున్నాడు. ఒక టేబుల్ మీద పెద్ద సైజు బ్యాటరీలు వరుసగా అమర్చి ఉన్నాయి. వాటిని వైర్లతో కలిపిన పెద్ద పెట్టె... ఇంకా కొన్ని చిన్న చిన్న పరికరాలు అక్కడ కనిపిస్తున్నాయి. ఆ పెట్టె పేరు రేడియేటర్. అవి పనిచేసే తీరును అతడు వారికి వివరించాడు. స్విచ్ 'ఆన్' చేయగానే బ్యాటరీల్లోంచి హైఓల్టేజి కరెంటు ఆ పెట్టెలోకి ప్రసరిస్తుంది. వెంటనే పెట్టెలో 'రేడియో తరంగాలు' జనిస్తాయి. రెండు గదుల అవతల మూడో గదిలో ఉన్న తుపాకి మందును ఆ రేడియో తరంగాలు పేల్చివేయాలి. గదులు, పరికరాల మధ్య వైర్ల లింకు లేదు. రేడియో తరంగాలను స్వీకరించే కొహెరర్ (రిసీవర్) పరికరం మాత్రమే మూడో గదిలో ఉంది. ఇదీ ప్రయోగం. లెఫ్టినెంట్ గవర్నర్‌ను స్విచ్ ఆన్‌చేయడంతోనే అవతలి గదిలో పెద్ద పేలుడు వినవచ్చింది. అధికారులు మూడో గదిలోకి వెళ్ళి చూశారు. అక్కడ తుపాకి మందు విస్ఫోటనం చెందింది. గదంతా పొగ నిండిపోయింది. ప్రయోగ ప్రదర్శన విజయవంతంగా పూర్తయింది. మెకెంజీ అతడిని అభినందనలతో ముంచెత్తాడు.

కోల్‌కతా ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రొఫెసర్ అయిన ఆ యువ శాస్త్రవేత్త ప్రయోగం మానవాళి చరిత్రలోనే అత్యంత గొప్ప సైన్స్ ఆవిష్కరణల్లో ఒకటి...అది వైర్‌లెస్ రేడియో టెలిగ్రఫీ. ప్రపంచపు మొట్టమొదటి రిమోట్ కంట్రోల్ పరికరం కూడా అదే. ఆ భారత ఇన్వెంటర్ పేరు జగదీష్ చంద్ర బోస్. ఈ రేడియో టెలిగ్రఫీకే గుగ్లీమో మార్కోనీ ఒక ఏడాది తర్వాత పేటెంట్ సంపాదించాడు.రేడియో తరంగాలు ఉన్నాయని తొలుత హెన్రిక్ రుడాల్ఫ్ హెర్ట్జ్ ప్రతిపాదించాడు. బోస్ వాటి పనితీరును బహిరంగంగా ప్రదర్శించి చూపాడు. ఇందుకోసం బోస్ కనిపెట్టిన కొహెరర్ (రిసీవర్) పరికరాన్ని కొద్దిగా మార్చి మార్కోని 'వైర్‌లెస్'కు పేటెంట్ తీసుకున్నాడు. పేటెంట్ తీసుకోడానికి బోస్ ఇష్టపడకపోవడం, మార్కోనీకి వరమైంది. లేకపోతే నోబెల్ అవార్డు ఆయనకు బదులు బోస్‌కు దక్కి ఉండేది. బోస్ కోల్‌కతాలో చదివాడు. బిఏలో బోస్‌కు జీవ శాస్త్రం ఇష్టమైన సబ్జెక్టు. ఫాదర్ లాఫోంట్ అనే ప్రొఫెసర్ వల్ల అతడికి భౌతిక శాస్త్రంలోనూ ఆసక్తిపెరిగింది.

లండన్ వైద్య కళాశాలలో చేరినా అనారోగ్య కారణాలతో మెడిసిన్ ఆపేసి కేంబ్రిడ్జిలోని క్రైస్ట్ చర్చ్ కాలేజీలో ప్రకృతి విజ్ఞానశాస్త్రాల కోర్సు చేశాడు. కేంబ్రిడ్జి 'ట్రిపోస్' పరీక్షతోపాటు లండన్‌లో బ్యాచిలర్ ఆఫ్ సైన్స్ కూడా పూర్తి చేశాడు. భారత్‌కు తిరిగి వచ్చాక, కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజీలో అధ్యాపకుడుగా చేరాడు. అక్కడ శ్వేతజాతి సహోద్యోగులకు ఇచ్చే జీతంలో సగమే బోస్‌కు ఇస్తామన్నారు. ఉద్యోగంలో చేరినా, జీతం తీసుకోకుండా పనిచేసి తన నిరసన వ్యక్తం చేశాడు. 3 ఏళ్లు గడిచిన తర్వాత యాజమాన్యం దిగివచ్చి చేరిన తేదీ నుంచి పూర్తి జీతం చెల్లించింది. న్యాయం కోసం పోరాడి సాధించిన ఆ విజయం బోస్‌లో అపారమైన ఆత్మవిశ్వాసాన్ని, ధైర్యాన్ని పెంచాయి.

రేడియో తరంగాలను సృష్టించడానికి కావల్సిన పరికరాలను తుక్కు సామాను కొట్లలో సేకరించిన వస్తువులతో, రేకులతో చదువురాని పనివారి సాయంతో బోస్ తనే తయారుచేసుకున్నాడు. ప్రయోగాలకు ఎవరి సహాయం, గ్రాంటూ లేదు. సొంత డబ్బులే ఖర్చుపెట్టుకున్నాడు. రేడియో తరంగాల సృష్టి కోసం కొత్త తరహా 'రేడియేటర్'ను తనే డిజైన్‌చేసి తయారుచేశాడు. అలాగే, అంతకంటే ముఖ్యమైన కొహెరర్ (రేడియో రిసీవర్)ను తనే రూపొందించాడు. అప్పటికే యూరప్‌లో తయారైన వాటికంటే, స్పైరల్ స్ప్రింగులతో చిన్నగా ఉండే బోస్ రిసీవర్ ఎంతో అధిక సామర్థ్యంతో మిన్నగా పనిచేసింది. ఈ ప్రయోగ పరికరాలతో జగదీష్ చంద్రబోస్ రేడియో తరంగాల ముఖ్య ధర్మాలను (రిఫ్లెక్షన్, రిఫ్రాక్షన్ వంటివి) కనిపెట్టాడు. రేడియో తరంగాల వేగం కాంతి వేగంతో సమానమన్న విషయం బోస్ కనిపెట్టాడు.

బోస్ సృష్టించిన రేడియో తరంగాలు అతి తక్కువ పొడవు మాత్రమే కలిగి ఉంటాయి. వీటినే ఇప్పుడు మైక్రో తరంగాలు అంటున్నారు. రాడార్లలో, టెలికమ్యూనికేషన్లలో, ఉపగ్రహ కమ్యూనికేషన్లలో, రిమోట్ సెన్సింగ్‌లో, మైక్రోవేవ్ ఓవెన్లలో వీటిని విరివిగా వినియోగిస్తున్నారు. ప్రపంచపు మొట్టమొదటి హార్న్ ఏంటెన్నా కూడా ఆయన కనిపెట్టారు. ఇప్పుడు అన్ని పరికరాల్లో దీన్నే వాడుతున్నారు. కలకత్తా టౌన్ హాలులో లెఫ్టినెంట్ గవర్నర్ ఎదుట ప్రదర్శించిన ఈ పరికరానికి, ప్రయోగానికి దేశీయ పత్రికల్లో విశేష ప్రచారం లభించింది. జర్మన్ శాస్త్రవేత్త హెర్ట్జ్ ముఖ్య వారసుడిగా పేరు తెచ్చిపెట్టింది. వైర్‌లెస్ టెలిగ్రఫీకి ఆద్యులలో ఒకరుగా ప్రపంచం గుర్తించింది. బోస్ ఐడియాలతోనే మార్కోనీ రేడియో

కనిపెట్టాడని అంటారు.

బోస్ జీవానికి నిర్జీవానికి మధ్య ఉండే సరిహద్దులోకి ప్రవేశించాడు. భౌతిక, జీవ శాస్త్రాల విభజన రేఖపై ఓ కొత్త శాస్త్రం నిర్మాణానికి పునాదులు వేశాడు. దీన్ని నేడు బయోఫిజిక్స్ అంటున్నారు. 'సైబరెటిక్స్', 'సిస్టమ్స్ సైన్స్' పేరిట విస్తరిస్తున్న నూతన విభాగాలకు బోస్ కొత్త పరిశోధనలే నాంది. భౌతిక శాస్త్ర ప్రయోగాలలో తాను ప్రారంభించిన ఈ పరిశోధనతో 'ప్లాంట్ ఫిజియాలజిస్టు'ల రాజ్యంలోకి చొరబడుతున్న విషయం ఆయన గుర్తించలేదు. ప్యారిస్, లండన్, మ్యూనిచ్, వియన్నాలలో యూరప్ శాస్త్ర ప్రపంచంనుండి ఈ 'పదార్థ ప్రాథమిక సారూప్యత'పై ప్రశంసలు, విమర్శలు వర్షంలా కురిశాయి. భౌతిక శాస్త్రవేత్తలు, రసాయనిక శాస్త్రవేత్తలు శభాష్ అని మెచ్చుకోగా, వృక్ష సంబంధ శాస్త్రవేత్తలు విమర్శలు గుప్పించారు. పాశ్చాత్య పత్రికలు మాత్రం ఆయన్ను ఆకాశానికెత్తేశాయి. జీవానికి నిర్జీవానికి హద్దులు చెరిపేసే ఇలాంటి శాస్త్రీయ ఆవిష్కరణ ప్రాగ్దేశ శాస్త్రవేత్తలకే సాధ్యమంటూ టైమ్స్, స్పెక్టేటర్ పత్రికలు బోస్‌ను 'సైంటిస్ట్-హీరో' చేశాయి. 1901 మే 10న లండన్ రాయల్ ఇనిస్టిట్యూట్ శుక్రవారపు సాయంత్ర సమావేశంలో బోస్ ప్రసంగం కలకలం సృష్టించింది. బ్రిటిష్ ప్లాంట్ ఫిజియాలజిస్టులు జాన్ బర్డన్‌శాండర్సన్, అగస్టస్ వాలర్‌లు బోస్ ప్రసంగానికి తీవ్ర అభ్యంతరాలు వ్యక్తం చేశారు. లోహాలు, మొక్కలు 'ప్రతిస్పందిస్తాయి' అనే పద ప్రయోగాన్ని వ్యతిరేకించారు. ప్రాణమున్న వాటికే 'స్పందనలు' ఉంటాయని, నిర్జీవ పదార్థాల్లో రసాయనిక ప్రతిచర్య మాత్రమే ఉంటుందని వాదించారు. అంతటితో వదలకుండా ఆ ప్రసంగాన్ని, తదుపరి పరిశోధన పత్రాలను రాయల్ ఇనిస్టిట్యూషన్, రాయల్ సొసైటీల ప్రచురణల్లో ప్రచురితం కాకుండా అడ్డుపడ్డారు. అయితే, తాను కనిపెట్టిన సత్యాన్ని ప్రపంచానికి ఆరునూరైనా చాటి చెప్పాలని, మరిన్ని ప్రయోగాలతో రుజువులు సాధించాలని బోస్ నిర్ణయించుకొని, అక్కడే ఉండి మరో రెండేళ్లు ప్రయోగాలు చేశారు. బోస్ ఎన్నో వినూత్నమైన, సున్నితమైన పరికరాలను కనిపెట్టాడు. 'క్రెస్కోగ్రాఫ్' వీటిలో ఒకటి. సెకనుకు అంగుళంలో లక్షో వంతు పెరుగుదలను సైతం బోస్ పరికరాలు నమోదు చేస్తాయి. మొక్క చనిపోవడాన్ని గుర్తించే పరికరానికి 'మరోగ్రాఫ్' అని సంస్కృత పదంతో పేరుపెట్టాడు. మొక్కలకు ప్రాణం ఉందని, మనలాగే అవీ బాధపడతాయని బోస్ ప్రయోగాలు నిరూపించాయి. 1901 రాయల్ సొసైటీ సమావేశంలో, విష ప్రభావం వల్ల మొక్క చనిపోతుందని నిరూపించాడు. ఇది నిరూపించడానికి ఆయన మొక్క కొమ్మలకు వైర్లు కట్టి వాటిని 'డెత్ మీటర్'కు కలిపాడు. విషం ఇవ్వడానికి ముందు పరికరంలో ముల్లు అటూ ఇటూ కదలసాగింది. మొక్కలోని విద్యుత్ 'నాడీ స్పందన'లకు నిరూపణ అది. విషం ఇవ్వడం ప్రారంభించగానే ముల్లు అసాధారణంగా చలించి తర్వాత పూర్తిగా ఆగిపోయింది. అప్పటికి మొక్క పూర్తిగా వడలిపోయి చనిపోయింది. 1902లో 'రెస్పాన్స్ ఇన్ ద లివింగ్ అండ్ ద నాన్‌లివింగ్' పేరిట ప్రచురించిన మోనోగ్రాఫ్ తర్వాత రాయల్ సొసైటీ ఆయన ప్రసంగాలను పరిశోధన పత్రాలను యథాతథంగా ప్రచురించి ప్రపంచవ్యాప్త గుర్తింపు కల్పించింది.

మొక్కలు సూటిగా నిటారుగా కాకుండా వంపులు తిరుగుతూ ఎందుకు పెరుగుతాయన్న దానికి బోస్ సమాధానం చెప్పగలిగాడు. మొక్కల్లో పాజిటివ్, నెగిటివ్ విద్యుత్ ఆవేశాలు ఉంటాయి. వీటిలో వ్యత్యాసాల వల్లే చెట్టు నిటారుగా పెరగలేదు. బోస్ భౌతిక శాస్త్రవేత్తగా ఉండి తిరిగి జీవశాస్త్రం వైపు ఎందుకు మొగ్గాడు? బహుశా మనసులో నిద్రాణంగా ఉన్న చిన్ననాటి అనుభవాలు, ఆలోచనలు ఒక వయస్సు తర్వాత తిరిగి మేల్కొనడం ఒక కారణం కావచ్చు. బాల్యంలో ఒకసారి బంతి వెళ్లి దూరంగా చెట్లలో పడింది. అప్పటికే చీకటి పడింది. జగదీష్ బంతి కోసం తోటలోకి వెళ్తుంటే, తల్లి అతడిని వారించింది. బాబూ మొక్కలు ఇప్పుడు నిద్రపోతున్నాయి, పొద్దుటే వెళ్ళి తెచ్చుకోవచ్చులే అని చెప్పింది. అది చాలా చిత్రంగా అనిపించింది ఆ బాలుడికి. అలాగే ఒకసారి పురుగు పట్టిన ఒక మొక్క ఆకులను కత్తెరతో కత్తిరిస్తున్నాడు. కత్తిరించిన ప్రాంతంలో నీటి బిందువులు పైకి ఉబకడం గమనించాడు. అవి మొక్క కన్నీళ్లేమో అనుకున్నాడు. అయితే మొక్కలు కూడా మనలాగే బాధపడతాయా అన్న ప్రశ్న అతడి మదిలో ఉదయించింది. ఈ సంఘటనల్లో మనకు ఆయన భావి పరిశోధనల మూలాలు కనిపిస్తాయి. ఆధునిక పరికరాలేవీ లేకుండానే అన్నేళ్లూ బోస్ తన పరిశోధనలు చేశాడు. బోస్ ఒక అధునాతన ప్రయోగశాలను కలకత్తాలో స్థాపించాడు. ఆ ఇనిస్టిట్యూట్ బోస్‌కు "ఒక దేవాలయం" వంటిది. బోస్ 20 ఏళ్ల పాటు -1937 నవంబర్‌లో తను కన్నుమూసే వరకూ- ఇందులో పరిశోధనలు చేశాడు. జగదీష్ చంద్ర బోస్ డబ్బూ పేరూ ఆశించకుండా కేవలం సత్యాన్వేషకుడిలా పరిశోధనలు సాగించిన మహా వైజ్ఞానికుడు.

1918-
1997

# మదర్ థెరిసా

సేవకు మారుపేరుగా సేవకే జీవితాన్ని అంకితం చేసిన త్యాగమయి మదర్ థెరిసాగా పేరెన్నికగన్న థెరిసా. 1946 సెప్టెంబర్ 10 తేదీన ఆమె ఎండలో దుమ్ము ధూళితో కూడిన రైలు ప్రయాణం చేసి డార్జిలింగ్ చేరుకున్నారు. 36 ఏళ్ల థెరిసా రెండవసారి దైవ సందేశాన్నందుకుని ఆ మేరకు అక్కడికి వచ్చారు. అంత వరకు 17 ఏళ్లపాటు ఆమె కలకత్తాలోని సెయింట్ మేరీస్ గర్ల్స్ స్కూలులో లోరెటో కాన్వెంట్ సిస్టర్‌గా విద్యార్థులకు హిస్టరీ, జాగ్రఫీ బోధించేవారు. అయితే సాఫీగా సాగుతున్న ఆ ఉపాధ్యాయిని వృత్తిని ఆమె వదలవలసి వచ్చింది. ఆ బోధనకు బదులు పేదలకు సేవ చేయాలన్నదే ఆమె అందుకున్న దైవ సందేశం. ఆమె సేవ కేవలం పేదలకు ఆహారం, నిత్యావసరాల సరఫరా చేయడం కాదు. అంతకు ముందు ఆమె మరికొంత మంది ఐర్లండ్‌కు చెందిన నన్‌లు మోతీ ఝీల్ దగ్గరలోని మురికివాడల్లో ఆ సేవ చేస్తూనే ఉన్నారు. ఇప్పుడు ఆమె చేయవలసిన సేవ వారి మధ్య నివసిస్తూ పనిచేయడం. 'మత సంబంధ జీవితం నిమిత్తం కుటుంబాన్ని, స్వదేశాన్ని వదలి రావడం కంటే ఇది మరింత గొప్ప త్యాగం' అని మదర్ థెరిసా ఈ సేవను గురించి అన్నట్టు నవీన్ చావ్లా తాను రాసిన మదర్ థెరిసా జీవిత సంగ్రహంలో పేర్కొన్నారు. అనాథలపాలిట ఆత్మబంధువుగా పేరొందిన థెరిసా యుగొస్లోవియా (అప్పట్లో ఆల్బేనియా రాజ్యం)లోని స్కోప్‌జ్‌లో జన్మించారు. ఆమె తండ్రి నికొలస్ బొజాక్సియు సంపన్నుడైన బిల్డింగ్ కాంట్రాక్టరు. తల్లిపేరు డ్రెనఫైల్ బెర్నాయ్ బొజాక్సియు. ఆగ్నేస్‌గా బాప్టిజం పొందిన థెరిసా గులాబి రంగు చెక్కిళ్ళతో బొద్దుగా ఉన్నందున ఆమెను ఆల్బేనియా భాషలో మొగ్గ అర్థం వచ్చేలా 'గోంక్సా' అని పిలిచేవారు. బాల్యంలో ఆరో ఏటనే తండ్రి మరణించడం ఆమెను తీవ్ర విషాదానికి గురిచేసింది. దీనికి తోడు తండ్రి వ్యాపార భాగస్వామి ఆస్తుల విషయంలో అవినీతికి పాల్పడి మోసం చేయడంతో వారు ఆర్థికంగా కష్టాలకు గురి కావలసి వచ్చింది. థెరిసాకు తల్లితో సాన్నిహిత్యం ఎక్కువ. ఆమె తల్లి ఎక్కువగా ఆధ్యాత్మిక భావాలు గల వ్యక్తి. ఆమె తల్లి కుట్టు పని చేసిన బట్టలు అమ్మడం వల్ల వచ్చే చాలీ చాలని డబ్బులతో అవస్థ పడుతున్నా ఆపదలో ఉన్నవారిని తన శక్తి కొద్ది ఆదుకునేవారు. ఆదర్శ తల్లిగా తన ముగ్గురు పిల్లల చేత పిలవబడే ఆమె కరుణకు ప్రతిరూపంగా ఉండేవారు. 1928 సెప్టెంబర్ 26న తన పద్దెనిమిదవ ఏట థెరిసా, జాగ్రెబ్ నుంచి ఐర్లాండ్‌లోని లోరెటో ఎబ్బెకు బయలు దేరింది. అయితే జీవితంలో మళ్ళీ వారు కలుసుకోవడం జరగలేదు.

మదర్ థెరిసా దైవ సందేశాన్నుసరించి బయలు దేరడానికి ముందు క్యాథలిక్ మత పెద్దల అనుమతి తీసుకోవలసి వచ్చింది. అది రెండు సంవత్సరాల తరువాత లభించింది. ఆమె బయలుదేరే ముందు తన మదర్ సుపీరియర్‌కు వీడ్కోలు చెప్పేందుకు వెళ్ళినప్పుడు ఆమెకోసం మూడు తెల్లటి నూలు చీరెలు సిద్ధం చేశారు. (ఈ తెల్ల చీరెలు భారతదేశంలో అతి బీద మహిళలు కట్టుకుంటుంటారు) ఆమె ఆధ్యాత్మిక సలహాదారు ఫాదర్ సెలెస్టి వాన్ ఎగ్జెమ్ ఆ వస్త్రాలను దీవించి ఆమెకు ఇచ్చారు. 1948లో సిస్టర్ థెరిసా కలకత్తా ఆర్చి బిషప్ పర్యవేక్షణను ఆమోదించి మదర్ థెరిసా అయ్యారు. అదే సంవత్సరం ఉత్తరభారతంలోని అమెరికన్ మెడికల్ మిషనరీ సిస్టర్స్ వద్ద మూడు నెలల శిక్షణ అనంతరం ఆమె కలకత్తాలో మొట్టమొదటిసారిగా మురికివాడలలోని పిల్లల నిమిత్తం ఒక పాఠశాల ప్రారంభించారు. ఆమె తనంత తానే బెంగాలీ, హిందీ నేర్చుకుని ఆరు బయటే క్లాసులు నిర్వహించేవారు. ఒక్కోసారి మట్టిలోనే ఒక కర్రతో అక్షరాలు రాసి చూపి నేర్పేవారు. రెండేళ్లలోనే 12 మంది మహిళలతో కూడిన మదర్ థెరిసా స్థాపించిన కొత్త మత సంఘం మిషనరీస్ ఆఫ్ ఛారిటీ కలకత్తా ఆర్చిడయోస్ కింద అధికారిక మత సంఘం అయింది.

1954లో ఆమె దుర్భర దారిద్ర్యంలో ఉండి మృత్యువుకు చేరువవుతున్న వారికోసం ఒకప్పుడు కాళికాదేవి ఆలయంగా ఉన్న ప్రదేశంలో ఒక ఆశ్రమాన్ని

ప్రారంభించారు. హిందూ మతం ప్రకారం కాళికాదేవి జీవన ప్రదాత. వినాశకురాలు కూడా అయినందున కూడా ఆమె దానిని అక్కడ ప్రారంభించారు. నిర్మలహృదయ అనే పేరుతో ఆమె సంఘం సుమారు వందకు పైగా తీవ్ర వ్యాధుల బారిన పడ్డవారి ఆలనా పాలనా చూసే అనాథ శరణాలయాల్ని ప్రారంభించింది. వీటన్నింటిలో మృత్యుముఖంలో కొట్టు మిట్టాడుతున్న వారికి శారీరక, భావావేశ అవసరాలను తీర్చే ప్రయత్నాలు వారి ఆలనాపాలన చూడడం జరుగుతుంటాయి. ఈ విధంగా థెరిసా పరివారం పెరుగుతూ సేవా కార్యక్రమాలు విస్తరించాయి. వాటిలో ఒక కుష్టురోగుల పునరావాస కాలనీకూడా ఉంది. ఒకప్పుడు ఒక చెట్టు నీడన ప్రారంభమైన ఆవాసం ఈనాడు ఒక పునరావాస కాలనీగా రూపాంతరం చెంది ఏడాదికి 15 వేల మంది రోగగ్రస్తులకు సేవలనందిస్తోంది. క్రమంగా ఆమె తన కుటుంబంగా పిలిచే అనుచరగణం ఎయిడ్స్ బాధితులు, చితికిపోయిన మహిళలు, మరణశిక్ష పడిన ఖైదీలు, వృద్ధులు, వికలాంగులు, అనాథలు, పసితనంలోనే తల్లిదండ్రులు వదలిపోయిన పిల్లలు వంటి వారి ఆలనాపాలనా చూడడం వారికి ఓదార్పు కల్పించడం వంటి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

1979లో మదర్ థెరిసాకు నోబెల్ బహుమతి లభించింది. పేదల పేరు మీద ఆమె నోబెల్ బహుమతిని అందుకున్నారు. ఆ సందర్భంగాఆమె వ్యాఖ్యానిస్తూ "పేదరికం, ఆకలి, దుస్థితి వంటివి కూడా శాంతికి ప్రమాదకారులు"ని ఒక హెచ్చరిక చేశారు. అలుపెరుగని శక్తితో, నిర్విరామ ప్రమాణాలతో, 1990 దశకం మధ్యనాటికల్లా మంచి పనుల సామ్రాజ్యానికి ప్రతినిధిగా పేరొందారు. ఆమె నిర్మించిన సామ్రాజ్యంలో నిరాశ్రయులకు 286 శరణాలయాలు, 140 స్కూళ్లు, సుమారుగా 840 సంచార వైద్యశాలలు ఉన్నాయి. ఇవి ప్రతి ఏటా 50 లక్షల మందికి సేవలందిస్తున్నాయి. ఆమె స్థాపించిన మిషనరీస్ ఆఫ్ చారిటీలో 4 వేల మంది నన్‌లు, 1,20,000 మంచి సహచరులు ఉన్నారు. వారు 120 దేశాల్లో తమ సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రాపంచిక సుఖాలకు దూరంగా, మదర్ థెరిసా కనబరిచిన పవిత్రత ఎటువంటి పరిస్థితుల్నయినా తట్టుకునే ఒక శక్తిగా మారి ఆ కాలంలోనే ఎంతగానో ఉన్న అవసరానికి తగ్గట్టుగా సరిపోయింది. ప్రతిరోజు వేకువ జామున నాలుగు గంటలకు నిద్ర లేచి అప్పటి నుండి నిర్విరామంగా 16 గంటల పాటు సేవాకార్యక్రమాల్ని చేపడుతుండేవారు. కాగా ఆమె ఎప్పుడూ నేల మీదే నిద్రపోయేవారు.

మదర్ థెరిసా సమాజం మరచినవారికి సేవ చేసినప్పటికీ విమర్శలకు గురి కాకపోలేదు. అధిక జనాభావల్ల కలిగే దుష్పరిణామాలను చవిచూస్తున్న దేశంలో ఉన్నప్పటికీ ఆమె క్యాథలిక్ మతం ప్రబోధించే గర్భస్రావ, గర్భనిరోధ వ్యతిరేక విధానాల విషయంలో ఏనాడూ రాజీపడలేదు. ఈ విషయంలో ఆమె వైఖరి స్త్రీవాదుల ఆగ్రహానికి కారణమైంది. ఆమె మినిస్ట్రీలు దారిద్ర్యం, లక్షణాలపైనే దృష్టిని సారిస్తున్నాయి కాని వాటి మూల కారణాలపై దృష్టి నిలపటం లేదని మరికొందరు విమర్శించారు. అయితే మదర్ థెరిసా దృష్టిలో నిజమైన దారిద్ర్యం ఆధ్యాత్మికమైనది, భౌతికమైనది కూడా. తనదైన శైలిలో ఆమె ఒకసారి దానిని అతి ప్రేమరాహిత్యంగా అభివర్ణించారు. 1989లో మదర్ థెరిసాకు మొదటిసారి గుండెపోటు వచ్చింది. 1996లో మరో రెండుసార్లు వచ్చింది. దానితో అయిష్టంగానే మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్ బాధ్యతల నుండి తప్పుకున్నారు. ఇది జరిగిన కొద్ది కాలానికే 1997లో ఆమె మరణించారు. అతి సాధారణంగా ఉన్న ఆమె శవపేటికను మహాత్మాగాంధీని చితివరకు తీసుకెళ్ళిన వాహనంలోనే కిక్కిరిసిన కలకత్తా వీధుల గుండా తీసికెళ్ళారు. మదర్ థెరిసా 20వ శతాబ్దపు చరిత్రకే ప్రతీకగా నిలుస్తారు. 23వ పోప్ జాన్ పాల్ మదర్ థెరిసాకు సెయింట్ హోదాను ఇస్తూ "ఆమె సర్వజనులను వారి హుందాతనాన్ని, గౌరవాన్ని పెంపొందిస్తూనే సేవ చేశారు. అలాగే జీవితంలో ఓడిపోయిన వారికి భగవంతుని ప్రేమానుభూతిని పంచార'ని పేర్కొన్నారు.

1893-
1976

# మావో జెడాంగ్

శతాబ్దాల పాటు రాజులు, నియంతల పాలనలో మగ్గిపోయిన చైనాలో ప్రజా చైతన్యాన్ని తట్టి లేపి అభివృద్ధి బాటలో దేశాన్ని, ప్రజలనూ పరుగులు పెట్టించిన మహా నేత మావో జెడాంగ్. ఏసుక్రీస్తు, మహ్మద్ ప్రవక్త, గౌతమబుద్ధలాంటి వారిని మినహాయిస్తే ప్రపంచంలో చాలా మందికి తెలిసిన పేరు మావో. పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనాను స్థాపించిన కార్యశీలి. సిద్ధాంతకర్త. సాధారణంగా సిద్ధాంతాలను ప్రబోధించేవారు ఆచరించి చూపరు. ఆచరణలో అద్వితీయమైన విజయాలను సాధించిన వారెవరూ సిద్ధాంతకర్తలు కారు. మానవ సృష్టిలో అరుదుగా ఈ రెండు లక్షణాలను పుణికిపుచ్చుకొన్న వారిలో ఒక వ్యక్తి మావో. ఈ భూగోళంపై నివసిస్తున్న జనాభాలో పావు వంతు ప్రజలకు కర్తవ్యబోధ చేయడమే కాకుండా లక్ష్యసాధనవైపు నడిపించిన మావో ప్రజలపై బుద్ధుడు, ఏసుక్రీస్తు, మహమ్మద్ ప్రవక్త చూపినంత ప్రభావం చూపాడు. కారల్ మార్క్స్ సిద్ధాంతీకరించిన కమ్యూనిస్టు మ్యానిఫెస్టోకు తనదైన భాష్యం చెప్పి, ప్రభావితం చేసిన నాయకుల్లో మావోకాక మరొకరు లేరని చరిత్రకారులు పేర్కొంటారు.

మావో తండ్రి ఒక పేద రైతు. తిండిగింజల వ్యాపారం నిర్వహిస్తూ కొంత డబ్బులు వెనకేసుకున్నాడు. కుటుంబం సుఖసంతోషాలతో ఉన్నప్పుడు మావో పుట్టాడు. మావో తండ్రి నిరక్షరాస్యుడు. కానీ మావో పుస్తకాలంటే పడిచచ్చేవాడు. చైనా సాంప్రదాయాలు, తూర్పు దేశాల చరిత్రను పూర్తిగా అధ్యయనం చేశాడు. రాజనీతి శాస్త్రజ్ఞులు, తత్వవేత్తలతోపాటు తిరుగుబాటు నేతలు, విప్లవకారుల చరిత్రలు మావోను విశేషంగా ఆకర్షించేవి. పశ్చిమ దేశాల్లోని తత్వవేత్తలైన జె.యస్. మిల్ స్పెన్సర్, జీన్ జేక్వెస్ రూసోలను కంఠతా పట్టి, వారి ఆలోచనా విధానాలను తనలో నిక్షిప్తం చేసుకున్నాడు. తండ్రి తనకు పెళ్లి నిశ్చయించడంతో తన తొలి తిరుగుబాటును మావో ఇంటి నుండే ప్రారంభించాడు. మంచూ శాసనానికి వ్యతిరేకంగా సన్‌యెట్‌సెన్ రిపబ్లిక్ ఆర్మీలో చేరి కొంత కాలం పోరాటం జరిపాడు. అలా సైనిక శిక్షణ పొందిన మావో ఛాంగ్సా పాఠశాలలో చేరి రాజనీతిశాస్త్రం, తత్వశాస్త్రాలను అభ్యసించాడు. ఇక్కడే మార్క్స్ రచనలను సంపూర్ణంగా అధ్యయనం చేసిన మావో చైనా ప్రజల విముక్తికి మార్క్సిస్టు సిద్ధాంతాలే శరణ్యమన్నాడు. మార్క్సిజం మీద 1917లో 24 ఏళ్ల ప్రాయంలోనే మావో తన తొలి రచనను ప్రచురించాడు.

1921లో చైనీస్ కమ్యూనిస్టు పార్టీ స్థాపనలో కీలక పాత్ర పోషించిన మావో తన సొంత పట్టణం హూనాన్‌లో కర్షక, కార్మిక యూనియన్లను స్థాపించాడు. పట్టణాలు, నగరాల్లో ప్రజల సమస్యలు ఎల్లప్పుడూ ఉండేవని, అందుకే తాను గ్రామీణ ప్రజల సమస్యలకే ప్రాధాన్యం ఇస్తానంటూ మావో గ్రామీణ ప్రాంత ప్రజలను సమీకరించడం ప్రారంభించాడు. చైనా పాలకుడు చియాంగ్-కై-షేక్ తెచ్చిన కొమిటాంగ్‌ను సమర్థించిన మావో ఆ తరువాత 1920లో వచ్చిన విభేదాలతో ఆయనను పట్టించుకోలేదు. 1927లో శీతాకాల పంటకోతల సమయంలో రైతు సమస్యలకు మావో నేతృత్వం వహించాడు. దీంతో ఆయనను పార్టీ కేంద్ర కమిటీ నుంచి తొలగించారు. మావో అంటే మండిపడిన చియాంగ్ సైన్యాన్ని పంపి మావో రెండో భార్య, సోదరిని 1930లో ఉరితీయించాడు. సోవియట్ రష్యా స్ఫూర్తితో (1928-31) మధ్య కాలంలో చైనాలో గ్రామీణ సోవియట్లను ఆవిష్కరింపచేశాడు మావో. దీనితో శక్తిమంతమైన రెడ్ ఆర్మీతో సహా సోవియట్ రిపబ్లిక్ ఆఫ్ చైనాకు మావో అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు.

1934 అక్టోబర్‌లో యాంగ్జి ప్రాంతంలోని మావో స్థావరాన్ని చియాంగ్ సేనలు చుట్టుముట్టాయన్న వార్తలు వెలువడ్డంతో మావో అప్రమత్తుడయ్యాడు. దాదాపు 90,000 మంది స్త్రీ, పురుషులతో పశ్చిమంవైపుగా 6000 మైళ్ల లాంగ్ మార్చ్ మొదలుపెట్టాడు. 370 రోజుల పాటు ఏకబిగిన 18 పర్వత శ్రేణులు, 24 నదులను దాటుకుంటూ లాంగ్ మార్చ్ సాగింది. మావో అధ్వర్యంలోని కమ్యూనిస్టు శ్రేణులన్నీ అలసిపోయి డస్సిపోయినా లాంగ్‌మార్చ్ ఒక విజయంగా,

తన దేశ ప్రణాళికగా మావో అభివర్ణించాడు. దీంతో రెడ్ ఆర్మీ హీరోల ఆర్మీగా తేలిందని ప్రకటించిన మావోను తమ నాయకుడిగా ప్రజలు సంపూర్ణంగా అంగీకరించారు.

లాంగ్ మార్చ్ విజయవంతం కావడంతో ప్రజలు తనకు సంపూర్ణ నాయకత్వ బాధ్యతలు అప్పగించినట్లు ప్రకటించిన మావో ఆ తరువాత ఇక వెనక్కి తిరిగి చూడలేదు. చియాంగ్ పాలనపై మావో అవిశ్రాంత పోరాటం 1949లో జరిగిన చైనా-జపాన్ యుద్ధం వరకు కొనసాగింది. ఈ యుద్ధంతో బలహీనపడిన చియాంగ్‌ను ప్రజల మద్దతుతో గద్దె దింపి మావో పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనాను స్థాపించాడు. రిపబ్లిక్ కేంద్ర ప్రభుత్వానికి తానే చైర్మన్ అని ప్రకటించుకున్నాడు. ఆ తర్వాత చైనా పాలనలో మరో శకం ప్రారంభమైంది. చైనాను ఆధునిక చైనాగా తీ ర్చిదిద్దాలన్న తపనలో మావో అతిగా వ్యవహరించాడు. 1950-60 మధ్య కాలంలో చైనాలో ప్రయివేటు వ్యాపారస్తులకు కాలం చెల్లింది. విదేశీయులను చైనా సరిహద్దుల అవతలకి తరిమారు. ఆ తరువాత చియాంగ్ హయాంలో కమ్యూనిస్టులపై ఉక్కుపాదం మోపాలని చూసిన విప్లవ ప్రతిఘాత శక్తులను మావో ఏరివేయడం ప్రారంభించాడు. దాదాపు 30 వేల మందిని రెడ్ ఆర్మీ హతమార్చి ఉంటుందని భావిస్తున్నారు. సోవియట్ తరహాలో చైనా సమగ్రాభివృద్ధికి పంచవర్ష ప్రణాళికలను రూపొందించాడు. వేలాదిగా సోవియట్ సాంకేతిక నిపుణులు చైనాకు పయనమయ్యారు. చైనాలో సోవియట్ సహకారంతో పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి కేంద్రాలు, ప్రాజెక్టులు విస్తారంగా నిర్మితమయ్యాయి. అదే సమయంలో వేలాది మంది మేధావులకు విప్లవ పాఠాలు బోధించారు. 1957 నాటికల్లా 3 లక్షల మందిని తిరుగుబాటుదారులనే ముద్రవేసి జైల్లో పెట్టారు. నాలుగువేల సంవత్సరాల చైనా వారసత్వ సంపదను మావో నాశనం చేశాడని పశ్చిమదేశాల చరిత్రకారులు గగ్గోలు పెట్టారు. 1958లో దేశాన్ని ఆధునికీకరించి, సామాజిక వ్యవసాయం చేపట్టేందుకుగాను 'గ్రేట్ లీప్ ఫార్వర్డ్' అనే సిద్ధాంతాన్ని మావో ప్రతిపాదించాడు. దీంతో చైనాలో తీవ్రమైన ఆహార కొరత ఏర్పడి దాదాపు 2.3 నుండి 3 కోట్ల మంది ప్రజలు చనిపోయారు. వీరిలో పసిపిల్లలే అధికం. అదే సమయంలో సోవియట్ యూనియన్‌తో విభేదాలు రావడంతో రష్యా చైనాకు అందిస్తానన్న ఆర్థిక, రాజకీయ సహాయాన్ని పూర్తిగా ఉపసంహరించింది.

తన పథకాలు ఒక్కొక్కటిగా విఫలమవుతుండటంతో మావో ఆధునిక చైనా నిర్మాణం కోసం కొత్త పథకాల అన్వేషణలో మునిగాడు. మరోవైపు మావో తప్ప సమర్థుడైన నాయకులెవరూ లేరని ఆయన అనుచరులు ఊరూరా ప్రచారం నిర్వహించారు. చైర్మన్ మావో సూక్తులు లిటిల్ రెడ్ పుస్తకాన్ని లక్షలాది మంది చైనీయులు కంఠతా పట్టేశారు. సాంస్కృతిక విప్లవం పేరుతో సాగిన దమనకాండలో మావో వ్యతిరేకులను రెడ్ ఆర్మీ ఊచకోత కోసేది. మొత్తంమీద 1960 నుంచి దశాబ్దకాలంపాటు సాగిన సాంస్కృతిక విప్లవంతో 73 ఏళ్ళ మావో చైనాలో మరింత బలం పుంజు కున్నాడు. ఈ దశాబ్దకాలంలో రెడ్ గార్డ్స్ ఏడు లక్షల మందిని కటకటాలపాలు చేశారు. వీరిలో ముప్ఫై ఐదువేల మంది ప్రాణాలు కోల్పోయారు.

మొత్తానికి ఆధునిక చైనా రూపశిల్పి మావో జెడాంగ్ 1976 సెప్టెంబర్‌లో కన్నుమూసాడు. ఒక వారం రోజులపాటు చైనాలో సంతాపదినాలు ప్రకటించారు. మావో అంత్యక్రియలు ఘనంగా నిర్వహించారు. అనంతరం మావో హయాంలో సాంస్కృతిక విప్లవసారథులైన నలుగురు నేతలను ఆ తరువాత నెలరోజులకే అరెస్టు చేసి జైల్లో నిర్బంధించారు. వారికి దుష్ట చతుష్టయమని పేరు పెట్టారు. మావో ఆలోచనా విధానాలను చైనా పాలకులు రద్దు చేయడం ప్రారంభించారు. అనేక నూతన సంస్కరణలను ప్రవేశపెట్టారు. మొత్తానికి మంచికో చెడుకో మావో నిర్మించిన ఆధునిక చైనా ఎన్నో ఆటుపోట్లెదుర్కొని ప్రస్తుతం అమెరికా తరువాత అగ్రరాజ్యంగా పురోభివృద్ధి వైపు దూసుకుపోతోంది.

1870-
1952

# మరియా మాంటిస్సోరి

ఈ తరంలో ఆమె పేరు తెలియని వారు ఉంటారనటం అతిశయోక్తే అవుతుంది. ప్రాథమిక విద్యారంగ స్వరూపాన్నే మార్చి వేసిన ద్రష్ట. పిల్లల మానసిక స్థితిని దృష్టిలో పెట్టుకుని ఆ రంగంలో ఆమె చేసిన ప్రతిపాదనలు సత్ఫలితాలు సాధించాయని ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. నేడు ప్రతిపాఠశాల కూడా ఆమె ప్రతిపాదనలకు అనుగుణంగానే నడుస్తోంది. 'విద్యను బోధించేటప్పుడు కేంద్ర బిందువు ఉపాధ్యాయుడు కాదు విద్యార్థి' అంటూ ఆమె చేసిన పోరాటం సత్ఫలితాలనే ఇచ్చింది. బడికి వచ్చే పిల్లలు కేవలం ఉపాధ్యాయుడు బోధించేది బుద్ధిగా విని ఆచరించడం కాదు, వారికి కూడా తమ సృజన చూపి, అభివృద్ధి చెందే అవకాశం ఇవ్వాలంటూ ప్రతిపాదించిన ఆమె నేర్చుకోవడం అనేది ఒక ఆటలా మార్చివేసింది. ఇందుకోసం నర్సరీ పిల్లలకు ప్రత్యేక పరికరాలను తయారు చేసింది. పిల్లలను కొట్టకుండా వారి తప్పులను సరిచేయాలని ప్రతిపాదించి, సాంప్రదాయ బోధనా పద్ధతులకు స్వస్తి పలికేలా చేసింది. నర్సరీ పిల్లల కోసం ఆమె బొమ్మరిళ్ళలాంటి తరగతి గదులను తయారు చేసి బడికి రావడం వారికి శిక్షలా కాక ఆటలా భావించేందుకు కృషి చేసింది.

ఇటలీలో జన్మించిన మారియా పురుషాధిక్యత వున్న అనేక రంగాలలో తన ప్రతిభను నిరూపించుకుని సాధికారతను సాధించింది. మెడిసిన్‌లో డాక్టరేట్ సాధించిన తొలి ఇటలీ మహిళ ఆమె! చిన్నతనంలోనే గణిత శాస్త్రంలో అత్యంత ప్రతిభను కనబరిచింది. ఆమె రోమ్ మెడికల్ కళాశాలలో చేరేందుకు అప్పటి పోప్ లియో-XIII మద్దతు కూడగట్టుకోవలసి వచ్చింది. ఇవన్నీ ఒక ఎత్తైతే ఆమె విద్యారంగంలో ప్రతిపాదించిన సంస్కరణలు ఆమెను చిరస్మరణీయం చేశాయి. మానసిక వికలాంగులైన పిల్లలకు బోధించే ఉపాధ్యాయులకు శిక్షణనిచ్చే 'స్కోలా మాజిస్ట్రేల్ ఓర్టోఫ్రెనికా'కు కోడైరెక్టర్‌గా వున్న సమయంలో మానసిక వైద్యురాలైన ఆమె ఈ నూతన పద్ధతులను ఆవిష్కరించింది. ఈ వైకల్యం అన్నది పెద్ద వైద్య సమస్య కాదని, బోధనే సమస్య అన్న డాక్టర్ ఎడ్వర్డ్ సెగ్విన్ ప్రతిపాదనలతో స్ఫూర్తి పొందిన ఆమె సరళమైన బోధనా పరికరాలను ఆవిష్కరించడం ప్రారంభించింది. దానికి ఆమె 'సైకో పెడగాగి' అని నామకరణం చేసింది. అవి ఎంత సత్ఫలితాలను చూపాయంటే, వీటి సాయంతో విద్యనభ్యసించిన మానసిక వికలాంగులైన ఎనిమిదేళ్ళ పిల్లలు సాధారణ గ్రేడ్ పరీక్షలలో సైతం ఉత్తీర్ణులయ్యారు. ఇది ఆమె సాధించిన అసాధారణ విజయం. ఆ సమయంలో ఆమె వైద్యురాలికన్నా కూడా విద్యావేత్తగానే పనిచేశారనాలి.

ఆమె ప్రతిపాదించిన పద్ధతులు పూర్తిగా వికసించడానికి, ప్రచారం పొందడానికి ఒక సంఘటన సాయపడింది. రోమ్‌లోని కాసా డి బాంబిని అనే నిర్మాణ సంస్థ కార్మికుల పిల్లలు అపార్ట్‌మెంట్లను పాడు చేస్తున్నారని, వారికోసం ఒక డే కేర్ సెంటర్ ప్రారంభించాలని ఆ సంస్థ మరియాను కోరింది. సాధారణ తెలివితేటలు వున్న పిల్లలకు తన పద్ధతులు లబ్ధి చేకూరుస్తాయనే విషయాన్ని రుజువు చేయాలన్న ఉత్సుకతతో వున్న ఆమె, పిల్లలు గోడలను పాడు చేయరనే హామీ ఆ సంస్థకు ఇచ్చి మరీ ఆ పని చేపట్టారు. అన్నట్టుగా కొద్ది వారాలలోనే ఆరేళ్ళలోపు వున్న ఆ పిల్లలలో వున్న అసహనాన్ని పోగొట్టింది. వారు కార్మికుల పిల్లలైన కారణంగా అలా అరాచకంగా లేరని, వారి మానసిక ఆకలి కారణంగా అలా వున్నారని ఆమె అనంతరం తెలిపింది. ఈ మానసిక ఆకలే పిల్లలను అల్లరిగా తయారు చేస్తాయని, వారికి కొంత సృజనాత్మకత చూపే అవకాశాన్ని ఇస్తే వారిలో ప్రతిభ బయటకు వస్తుందని ఆమె రుజువు చేసింది. కాసా డీ బాంబినీ పద్ధతులను ఇతర పురోగమనకాంక్ష

వున్న పాఠశాలలు అనుసరించాయి. అనతి కాలంలోనే ఆమె ప్రతిపాదించిన పద్ధతులను ప్రపంచవ్యాప్తంగా అనుసరించడం ప్రారంభించారు. అది ఒక ఉద్యమం అయింది.

ఈ విజయాలతో స్ఫూర్తి, ఆత్మవిశ్వాసం పెరిగిన మరియా ఇదే సరైన పద్ధతి అంటూ తన పద్ధతులను గురించి స్వయంగా ప్రచారం చేయడం ప్రారంభించింది. తాను సాధించిన విజయాలను చూపుతూ, విమర్శలను తోసిపుచ్చుతూ అవే సరైనవని ఆమె వాదించింది. అల్లరిచిల్లరిగా వున్న పిల్లలకు బడి పట్ల ఆకర్షణ కలిగేలా చేసింది. ఆమె కేవలం మానసిక వైద్యురాలే కాదు ఆమెకు అనేక రంగాల్లో నైపుణ్యం వుంది. వీటన్నిటికీ తోడు ఆమె పిల్లల హక్కుల కోసం ఉద్యమించింది. బోధనా పద్ధతుల పై ఆమె ప్రచురించిన పుస్తకం వెంటనే 'ది మాంటెస్సరీ మెథడ్' పేరుతో ప్రాచుర్యం పొందింది. ఆమె ప్రతిపాదించిన మాంటెస్సోరీ స్కూళ్ళు అప్పటి వరకూ కఠిన క్రమశిక్షణతో వున్న పాఠశాలలకు భిన్నంగా వుండేవి. ఆమె తన పాఠశాలలో ఉపాధ్యాయులకే కాక పిల్లలకు కూడా ప్రాధాన్యత ఇచ్చింది. వారు తమ సృజనాత్మకతను ఉపయోగించి తమదైన శైలిలో పురోభివృద్ధి సాధించాలన్నది ఆమె భావన. ఈ ప్రక్రియలో టీచర్లు కేవలం క్రమశిక్షణగరిపే వారు, బోధకులుగానే కాక మార్గదర్శకులుగా, పరిశీలకులుగా వ్యవహరించాలని ఆమె ప్రతిపాదించింది. తప్పు చేసినప్పుడు నిందించకుండా దానిని సరి చేయడం ద్వారా పిల్లలు నేర్చుకోవడాన్ని ఒక శిక్షలా కాక ఆటలా భావించేలా చేయాలని ఆమె ప్రయత్నించింది.

ప్రతిపాదించిన అతికొద్ది కాలంలో దవానంలా వ్యాపించిన ఈ పద్ధతి 30వ దశకంలో అంతే త్వరగా కనుమరుగవడం ప్రారంభించింది. ఎందుకంటే, అనేకమంది విద్యావేత్తలు మాంటెస్సోరీ ప్రతిపాదించిన కొన్ని పద్ధతులతో విభేదించారు. ముఖ్యంగా అమెరికా విద్యావేత్త జాన్ డ్యూయీ పద్ధతిని అనుసరించే వారి నుంచి ఆమె వ్యతిరేకతను ఎదుర్కొంది. అంతేకాకుండా, ఆచరణ స్థాయిలో తరగతిగదిలోని సృజనను కల్లోలానికి ఆహ్వానంగా ఆమె విమర్శకులు అభివర్ణించారు. ఈ విమర్శలు ఒక ఎత్తు అయితే ఆమె వ్యక్తిగత జీవితానికి సంబంధించిన కొన్ని విమర్శలు ఆమె వ్యక్తిత్వాన్ని కప్పివేశాయి. ఆమె దత్తత తీసుకున్న కుమారుడు నిజంగా ఆమెకు వివాహం అయిన తర్వాత జన్మించినవాడే అన్న విషయం బయటపడటంతో ఆమె కొంత అప్రతిష్టపాలు అయింది.

ఆమెకు అంత ఖ్యాతి అంత తొందరగా రావడంతో కొంత అడ్డంకులను ఎదుర్కొన్నా 50వ దశకంలో మళ్ళీ మాంటెస్సోరీ పద్ధతిని పునరుజ్జీవింపచేసేందుకు ఆమె కృషి చేసింది. ప్రపంచవ్యాప్తంగా ఆమె బడులను ఫ్రాంచైజ్‌కివ్వడం ప్రారంభించింది. బహిరంగ తరగతి గదులు, అమెరికా హెడ్ స్టార్ట్ వంటి కార్యక్రమాలు విజయవంతం కావడంతో, ఆమె ప్రతిపాదించిన అంశాలలో వున్న లాభాలను విద్యావేత్తలు గుర్తించడం ప్రారంభించారు. తాను పిల్లల విద్య విషయంలో అనుకున్నది సాధించానని, బల్లలకు రెక్కలు గుచ్చివేసిన సీతాకోక చిలుకల్లా తరగతి గదుల్లో కూచునే పిల్లలకు తాను విముక్తి కలిగించానని ఆమె తన అవసాన దశలో కుమారుడికి చెప్పిందిట! ఆమె ప్రారంభించిన ఈ విద్యా ఉద్యమం మొదట్లో ఎన్నో విమర్శలు ఎదుర్కొన్నప్పటికీ ఆధునిక కాలంలో అత్యుత్తమ పద్ధతి అని ప్రపంచం ఆమోదించింది. ఆమె చేసిన సృజనాత్మక ప్రతిపాదనలను ప్రపంచం ఇప్పటికీ గౌరవిస్తూనే వుంది. అందుకే ఇప్పటికీ ప్రాథమిక పాఠశాలలకు ఆమె పేరే పెడుతుంటారు. మనలో చాలా మందిమి కూడా అలా విముక్తమైన సీతాకోక చిలుకలమే కదా?

1907–
1931

# భగత్ సింగ్

శతాబ్దాలపాటు బ్రిటిష్ కబంధ హస్తాల్లో నలిగిపోయిన భారత మాత దాస్యశృంఖాలను తెంచడానికి ఎందరో వీరపుత్రులు తమ ప్రాణాలను తృణప్రాయంగా అర్పించారు. చెరసాలు, ఉరికొయ్యలను ధిక్కరించారు. ఉరికంబాన్ని ఎక్కుతూ కూడా చెక్కుచెదరని చిరునవ్వుతో 'ఇంక్విలాబ్ జిందాబాద్' అంటూ ఉరితాడును ముద్దుపెట్టుకుని ప్రాణాలర్పించిన ధీరులు భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లు. భారత స్వాతంత్ర్య పోరాటంలో భగత్‌సింగ్ అమరకథ ఎందరో యోధులకు స్ఫూర్తి. కేవలం 23 ఏళ్ల ప్రాయంలోనే బ్రిటిష్ సామ్రాజ్యవాదులను గడగడలాడించి, దేశ సేవ ముందు ప్రాణాలు తనకు ఒక లెక్కలోనివి కాదని నిరూపించిన ధీశాలి. ఇప్పుడైతే చాలా మంది రాజకీయ నాయకులు భగత్‌సింగ్‌కు వారసులుగా చెప్పుకుంటారు కానీ, మనదేశానికి సామ్యవాదం, మార్క్సిస్ట్ విధానం అత్యవసరమని నమ్మిన తొలినాటి విప్లవకారుడు భగత్‌సింగ్. రష్యాలో బోల్షెవిక్ విప్లవం పట్ల సంపూర్ణంగా ప్రభావితుడైనట్లు భగత్‌సింగ్ తన ఉత్తరాల్లో ఉదహరించాడు.

విప్లవజ్యోతి భగత్‌సింగ్ 1907 సెప్టెంబర్ 17 అప్పటి పంజాబ్‌లోని (ఇప్పటి పాకిస్తాన్) లాల్‌పూర్‌లో జన్మించారు. 1907లోనే మొదలైన కిసాన్ ఉద్యమ ఆవిష్కర్త అజిత్‌సింగ్‌కు భగత్‌సింగ్ మేనల్లుడు. భగత్‌సింగ్ తండ్రి సర్దార్ కిషన్ సింగ్ గొప్ప దేశభక్తుడు. దేశ స్వాతంత్ర్యం కోసం బ్రిటిష్‌వారిపై పోరాటాలు జరిపిన యోధుడు. విదేశీ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. తనలాంటి ఎందరో దేశభక్తులను కూడగట్టుకొని పౌరహక్కులకై పోరాడాడు. ఎన్నోసార్లు జైలుశిక్ష కూడా అనుభవించాడు. దేశభక్తిగల కుటుంబం నుంచి వచ్చిన భగత్‌పై కుటుంబ సభ్యుల ప్రభావం చాలా ఉంది. కేవలం 13 ఏళ్ల వయస్సులోనే భగత్‌సింగ్ బ్రిటిష్ సర్కారును పడగొట్టే ప్రణాళికలు వేసి పెద్ద పెద్ద నాయకులను ఆశ్చర్యపరిచాడు. మీసాలు కూడా మొలవని వయసులో బ్రిటిష్‌వారి కుతంత్రాలను, కుటిలనీతిని ఎండగడుతూ ఉపన్యాసాలివ్వడం చాలా మందిని ఆకర్షించింది.

మహాత్మాగాంధీ నేతృత్వంలో స్వాతంత్ర్యపోరాటం ఉధృతంగా జరుగుతున్న రోజులవి. సహాయ నిరాకరణ ఉద్యమం దేశంలోని అన్ని ప్రాంతాలకూ విస్తరించింది. భారతీయుల సంఘటిత శక్తిని, గాంధీ నాయకత్వ పటిమనుచూసి గడగడలాడుతున్న సమయం. సరిగ్గా అప్పుడే 1922లో చౌరీచౌరా వద్ద పోలీస్‌స్టేషన్‌ను తగులబెట్టిన ఉద్యమకారుల తీరుకు నిరసనగా గాంధీ సహాయనిరాకరణ ఉద్యమాన్ని నిలిపివేశారు. ఇది 15 ఏళ్ల భగత్‌సింగ్‌ను తీవ్రంగా నిరాశపర్చింది. కేవలం 22 మంది చనిపోయిన కారణంగా ఒక మహోధృత ఉద్యమాన్ని నిలుపదల చేయడంతో ఆయనకు ఔచిత్యం కన్పించలేదు. అహింసాయుత మార్గంలో బ్రిటిష్‌వారిని ఈ దేశం నుంచి తరిమికొట్టలేమని నిర్ధారణకు వచ్చాడు. ఐర్లండ్, ఇటలీ, రష్యాలలో విప్లవకారుల పోరాట పంథాలగురించి తెలుసుకున్నాడు. విప్లవ శక్తుల గురించి తెలుసుకున్న కొద్దీ అతనిలోని పోరాట పటిమ మరింత పెరిగింది.

బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా విప్లవపోరాటంలో మరింత ముందుకు దూసుకెళ్ళేందుకు భగత్‌సింగ్ లాహోర్ చేరుకున్నాడు. అక్కడ విద్యార్థి సంఘాల నేతగా రాజకీయాల్లో చురుగ్గా పాలుపంచుకునేవాడు. దీంతో పోలీసుల దృష్టి భగత్‌పై పడింది. అతని కదలికలపై నిఘా వేశారు. ఒక బాంబు పేలుడులో భగత్ సింగ్ హస్తం ఉండొచ్చన్న అనుమానంతో అతన్ని కొన్నాళ్ళు జైల్లో ఉంచారు. 1928లో భగత్‌సింగ్ స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తి చంద్రశేఖర్ ఆజాద్‌ను కలుసుకున్నాడు. అంతే అగ్నికి ఆజ్యం తోడైంది. పోలీసుల నిఘా ఎక్కువ కావడంతో భగత్‌సింగ్ తన తలపాగాను, గడ్డాన్ని తీసేసాడు. మొదటిసారిగా తీవ్రవాద భావాలున్న 'హిందుస్థాన్ సమాజ్‌వాది ప్రజాతంత్ర సంఘ్' అనే సంస్థను స్థాపించాడు. కొంత మంది సహచరులతో కలిసి బ్రిటిష్‌వారిని తరిమేందుకు బాంబుల తయారీ నేర్చుకునేందుకు కలకత్తా వెళ్ళాడు. 1928లో సైమన్ కమిషన్ భారత్ వచ్చినప్పుడు తీవ్ర ప్రతిఘటన ఎదురైంది. పంజాబ్‌లో లాలా లజపతిరాయ్ ఆధ్వర్యంలో నిరసన ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. ఆ సందర్భంగా ధర్నాకు దిగిన లజపతిరాయ్‌ని సాండర్స్ అనే బ్రిటిష్ అధికారి బలంగా ఛాతీపై కొట్టాడు. ఆ దెబ్బ కారణంగా

మంచానపడ్డ లజపతిరాయ్ "తనపై పడ్డ ఒక్కొక్క లాఠీ దెబ్బ బ్రిటిష్ సామ్రాజ్యవాద శవపేటికకు ఒక్కొక్క మేకుగా పరిణమిస్తాయ"ని అన్నారు. నెలరోజులకు లజపతిరాయ్ మరణించడంతో చలించిపోయిన భగత్ సింగ్ తన మిత్రుడు రాజ్‌గురు సాయంతో పకడ్బందీ ప్రణాళిక రూపొందించాడు. మారువేషాల్లో కాపుకాసి సాండర్స్‌ను కాల్చి చంపారు. దీంతో బ్రిటిష్ సర్కారు వెన్నులో వణుకు బయలుదేరింది. భగత్ సింగ్‌తో సహా విప్లవకారుల అన్వేషణకు ప్రత్యేక బృందాలు రంగంలోకి దిగాయి. అయితే విప్లవకారులెవరూ పోలీసుల చేతికి చిక్కలేదు. అంతకు ముందే 1928లోనే విప్లవకారులు చంద్రశేఖర్ ఆజాద్, విజయ్‌కుమార్ సిన్హా, శివ్ వర్మ, జయదేవ్ కపూర్, సుఖ్‌దేవ్, రాజ్‌గురు వంటి వారు భగత్‌సింగ్‌తో కలిసి ఢిల్లీలో 'జై కిసాన్' పార్టీని స్థాపించారు.

1929 ఏప్రిల్‌లో మనదేశ ప్రయోజనాలను దెబ్బతీసే రెండు వేరు వేరు బిల్లులను సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీలో ప్రవేశపెట్టాలని బ్రిటిష్ సర్కారు నిర్ణయించింది. దీన్ని వ్యతిరేకించాలని ఆజాద్, భగత్‌సింగ్‌లు తీర్మానించారు. ఈ మేరకు బిల్లులను వ్యతిరేకిస్తూ వారి ఆధ్వర్యంలోని హిందుస్థాన్ సమాజ్‌వాది ప్రజాతంత్ర సేన ఒక తీర్మానాన్ని ఆమోదించింది. బిల్లు ప్రతిపాదన సందర్భంగా ఢిల్లీలోని కేంద్ర అసెంబ్లీ హాలులో బాంబులు వేయాలని ప్రతిపాదించారు. దీనికోసం ప్రమాదకరం కాని బాంబులిచ్చి భగత్‌సింగ్‌ను బటుకేశ్వర్ దత్‌ను పంపారు. ఏప్రెల్ 8, 1929లో బిల్లు ప్రతిపాదన సందర్భంగా సెంట్రల్ హాల్‌లోకి ఇంక్విలాబ్ జిందాబాద్ అంటూ వీరిద్దరూ బాంబులు విసిరారు. అవి పెద్ద శబ్దంతో పేలాయి. కానీ ఖాళీ ప్రదేశంలో విసరడంవల్ల ఎవరికీ హాని కలగలేదు. బ్రిటిష్ రాజ్యానికి వ్యతిరేకంగా ముద్రించిన ఎర్ర కరపత్రాలను సందర్శకుల గ్యాలరీలో నుంచి విసిరారు. పారిపోయే అవకాశాలున్నా వీరిద్దరూ అలా చేయలేదు. 'చెవిటి వారికి (ప్రభుత్వం) విన్పింపచేయడానికే తామీ పనిచేశామని పేర్కొన్నారు. పోలీసులొచ్చి బేడీలు తగిలించి అరెస్టు చేశారు. భగత్‌సింగ్ సాహసం చూసి యావద్భారతం అచ్చెరువొందింది. బ్రిటిష్ సర్కారుకు మరోసారి చెమటలు పట్టాయి. అంతే విప్లవకారులపై బ్రిటిష్ సర్కారు కఠినంగా వ్యవహరించింది. దేశవ్యాప్తంగా విప్లవకారుల స్థావరాలపై పోలీసులు దాడులు చేశారు. దాదాపు ఏడు వేల బాంబులు పట్టుబడ్డాయి. చాలా మంది విప్లవకారులను అరెస్టు చేశారు. పట్టుబడ్డ విప్లవకారులపై 'లాహోర్ కుట్ర కేసు' ఛార్జ్ చేశారు. భగత్‌సింగ్, బటుకేశ్వర్‌దత్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లను అరెస్టు చేసి లాహోర్ జైలుకు తరలించారు.

లాహోర్ కుట్ర కేసు విచారణ మొదలైంది. కోర్టు లోపలా, బయటా పటిష్టమైన బందోబస్తు కల్పించారు. విచారణ జరిగినన్ని రోజులూ విప్లవకారులు, 'ఇంక్విలాబ్ జిందాబాద్' అంటూ నిరసిస్తూనే ఉన్నారు. విచారణ సందర్భంగా న్యాయమూర్తికి ఎదురుగా నిలబడి 'ఈ విప్లవం ఇక ఆగదు. మేం మరణిస్తే లక్షలాది భగత్‌సింగ్‌లు, రాజ్‌గురులు, సుఖ్‌దేవ్‌లు పుట్టుకొస్తారు. మీ కుక్కగొడుగు సింహాసనాన్ని కూల్చి వేస్తారు. మీ పతనం దగ్గరకొచ్చింది. ఏం శిక్ష విధిస్తారో విధించండి" అంటూ సింహంలా గర్జించారు ఈ విప్లవమూర్తులు. ఈ ముగ్గురు విప్లవకారులను అనేక జైళ్లు మార్చారు. బంధువులు, తల్లిదండ్రులను కలవనివ్వకుండా చేశారు. చివరికి తీర్పు వెలువడింది. భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లను మరణించేంతవరకూ ఉరితీయాలన్న తీర్పు విన్న భారత్ ఉలిక్కిపడింది.

ప్రజలంతా ముక్తకంఠంతో ఈ తీర్పును నిరసించారు. విప్లవకారులను వదిలిపెట్టాలని లక్షలాది అర్జీలు, విజ్ఞప్తులు వెళ్ళాయి. చాలా మంది నాయకులు భగత్‌సింగ్ శిక్ష తగ్గించాలని బ్రిటిష్ సర్కారుకు విజ్ఞప్తి చేశారు. భగత్‌సింగ్ తండ్రి క్షమాభిక్ష దరఖాస్తుతో కొడుకు వద్దకు వచ్చి సంతకం చేయమంటే ఆ వీరకిశోరం తిరస్కరించాడు. మార్చి 24, 1931న భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లను ఉరితీసేందుకు బ్రిటిష్ ముష్కరులు తేదీని కూడా ఖరారు చేశారు. ప్రజల ఆందోళన, నాయకుల విజ్ఞప్తులను పక్కనబెట్టి మార్చి 24నే లాహోర్ జైలులో ఈ ముగ్గురు భారతమాత ముద్దుబిడ్డలను ఉరికంబమెక్కించారు. చివరి వరకూ నిర్భయంగా చిరునవ్వుతో ఉరితాడును ముద్దుపెట్టుకొని మృత్యువును కౌగిలించుకున్న భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌ల త్యాగం మరువలేనిది.

# 1912-1977

# వాన్ బ్రాన్

అది ఇరవయ్యవ శతాబ్దపు ఆరంభ కాలం. అప్పుడే పుడమి మీద ఒక ప్రియ పుత్రుడు ఊపిరి పోసుకున్నాడు. తన జీవిత కాలమంతా శాస్త్ర పరిశోధనలకు, సైద్ధాంతిక దార్శనికతకు కట్టుబడి వున్నాడు. అంతేనా? ఏకంగా చంద్రమండలం పై కాలూనేందుకు రూపకల్పన చేశాడు. అతడే వాన్ బ్రాన్. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో వి2 రాకెట్ల పేరు వింటే ప్రపంచం గడగడలాడేది. వాటి సృష్టి వెనుక వున్న వ్యక్తి బ్రానే. లండన్‌తో సహా పలు బ్రిటిష్ నగరాల పై ఆ రాకెట్లు విరుచుకుపడ్డాయి. బహుశ అందుకేనేమో ఈ వ్యోమగామికి అమెరికా అగ్రాసనం వేసింది. యుద్ధనేరస్తుడని వ్యతిరేకులు విమర్శించినప్పటికీ అమెరికా అతడిని అవమానించలేదు. నైతికంగా అనుమానిస్తున్న వ్యక్తిని అమెరికా ప్రభుత్వం అలా అగ్రాసనంపై కూర్చోపెట్టడం కూడా ఆశ్చర్యకరమైన విషయమే. అతడికి అమెరికాపై గల ప్రేమను గురించి చాలా మందికి అనుమానాలున్నప్పటికీ, అవేవీ బ్రాన్ పనికి అడ్డుపడలేదు.

అది 1945, జర్మన్ జాతీయుడైన వాన్ బ్రాన్‌తో సహా పలువురు శాస్త్రవేత్తలను అమెరికా అక్కున చేర్చుకుంది. రహస్య సైనిక ప్రాజెక్టును వీరికి అప్పగించింది. వారిలో అగ్రగణ్యుడు బ్రాన్. ఆ దేశం ఎంత సముచిత రీతిలో గౌరవించినప్పటికీ, చాలా కాలం పాటు ఆయనెవరో అమెరికన్లకు తెలియదు. సరిగ్గా 1958, ఫిబ్రవరి 1న వాన్ బ్రాన్ సైనిక సేన ఎక్స్‌ప్లోరర్-1ని ప్రయోగించింది. రమారమి 31 పౌండ్ల బరువున్న ఆ ఉపగ్రహం ఫ్లోరిడా నుంచి నింగికెగసింది. అలా అమెరికా రెండు అంశాల్లో గర్వంగా తలెత్తుకునేలా చేశాడు వాన్ బ్రాన్! అప్పటికే అమెరికాకు బద్ధ శత్రువైన సోవియట్ రష్యా స్పుత్నిక్-1,2ను నింగిలోకి పంపింది. తన రెండవ ప్రయోగంలో శునకాన్ని సైతం అంతరిక్షంలోకి పంపించిన ఘనతను రష్యా సంపాదించుకుంది. అనంతర కాలంలో వాన్‌బ్రాన్ సృష్టించిన జూపిటర్-సి రాకెట్ మాత్రమే ఆకాశంలోకి దూసుకెళ్ళింది.

మార్మికమైన విశ్వ రహస్యాలను ఛేదించేందుకు ఎక్స్‌ప్లోరర్ విజయానంతరం మరో రెండు ప్రయోగాలను అమెరికా చేపట్టగలిగిందంటే కేవలం బ్రాన్ అండ వుండటం కారణంగానే. మూడు సంవత్సరాల తరువాత, అమెరికా తొలి వ్యోమగామిని తీసుకుని రాకెట్ అంతరిక్షంలోకి ఎగసింది. తరువాత ఎనిమిది సంవత్సరాలకు అంటే, 1969, జులై 20న అపోలో -11 ముగ్గురు వ్యోమగాములను చంద్రుని పైకి తీసుకువెళ్ళింది. వారిలో ఒకరైన పైలట్ నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్రుని పై కాలుపెట్టిన తొలి వ్యక్తిగా ప్రపంచ నీరాజనాలనందుకున్నాడు.

జర్మనీలోని విర్సిట్జ్‌లో పెరిగిన వాన్ చిన్నతనం నుంచి గొప్పవాడ్ని కావాలని కలలుగన్నాడు. వీమర్ రిపబ్లిక్ కేబినెట్‌లో సభ్యుడైన బారన్ మాగ్నస్ వాన్ బ్రాన్‌కు రెండవ కుమారుడిగా జన్మించిన వాన్‌కు అతడి తల్లి ఎమ్మీ క్విస్టోర్ప్ ప్రోత్సాహం ఎక్కువ. అతడి కుటుంబం బెర్లిన్ తరలి వెళ్ళిన అనంతరం, బాలిస్టిక్ ప్రొపల్షన్‌లో సాధికారత వున్న హెర్మన్ ఓబర్త్ రాసిన 'ది రాకెట్ ఇంటు ఇంటర్ ప్లానెటరీ స్పేస్' అన్న పుస్తకాన్ని ఎనిమిదేళ్ళ వాన్ కనుగొన్నాడు. మూడేళ్ళ తరువాత రాకెట్ సామర్థ్యం వున్న వాగన్‌ను తయారు చేశాడు. అప్పటికే బాల మేధావి అయిన అతడు బెర్లిన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ విద్యార్థి అయ్యాడు. అతడు అక్కడ ప్రమాదకరమైన మిస్సైళ్ళ ప్రయోగం చేసే క్లబ్‌లో సభ్యుడిగా చేరాడు. వారు బెర్లిన్ మురికివాడలలో వున్న ఒక నిర్మానుష్య ప్రాంతంలో తమ ప్రయోగాలు చేస్తుండే

వారు. వాన్‌ను 1932లో కెప్టెన్ వాల్టర్ డార్న్ బెర్జర్ కలుసుకున్నాడు. 1919లో చేసుకున్న వెర్సైల్స్ సంధి జర్మనీ సైనిక సామర్థ్యాన్ని పరిమితం చేయడంతో ఆ సంధి నిషేధించని దూరగామి ఆయుధం కోసం జర్మనీ సైనిక ఫిజిసిస్టు అయిన బెర్జర్ వెతుకుతున్నాడు. సూపర్ సోనిక్ ఎయిరో డైనమిక్స్ పై వాన్‌కు వున్న సైద్ధాంతిక అవగాహనతో ముగ్ధుడైన బెర్జర్ కుమర్స్‌డార్ఫ్‌లో వున్న లిక్విఫైడ్ ఫ్యూయెల్ రాకెట్స్ అభివృద్ధి శాఖకు ఈ డాక్టరేట్ విద్యార్థిని అధిపతిగా నియమించాడు.

కేవలం 24 ఏళ్ళ వయసులోనే పీన్‌ముండెలో వున్న రాకెట్ పరిశోధన కేంద్రానికి సివిలియన్ టెక్నికల్ డైరెక్టర్‌గా నియమితుడయ్యాడు. అక్కడే 'వెంజెన్స్ వెపన్ 2' (వి2) ఆయుధాన్ని తయారుచేశాడు. అతితక్కువ సమయంలో ఎక్కువ ఆయుధాలను ఉత్పత్తి చేయాలంటూ ఒత్తిళ్ళు ఎక్కువ కావడంతో తన పదవికి రాజీనామా చేసేందుకు సంసిద్ధమౌతున్న వాన్‌ను గెస్టపో అధిపతి హీన్‌రిచ్ హిమ్లర్ 1944లో అరెస్టు చేశారు. హిమ్లర్ డిమాండ్ చేసినట్టుగా తన కార్యకలాపాలను ఎస్‌ఎస్ కంట్రోల్‌కు అప్పగించనందున అతడిని అరెస్టు చేశారు. కాగా, వాన్‌బ్రాన్ లేకపోతే వి2 కార్యక్రమం విఫలమౌతుందని బర్జర్ జోక్యం చేసుకుని హిట్లర్‌కు నచ్చచెప్పడంతో స్వయంగా హిట్లరే అతడిని విడుదల చేశాడు. మిస్సైల్ సాంకేతిక పరిజ్ఞానంలో జర్మనీని అగ్రగామిగా వుంచే వ్యూహాన్ని తయారు చేసేందుకు వాన్ తిరిగి పీన్‌ముండె వెళ్ళాడు. 1945 మే 2వ తేదీన వాన్ అమెరికా దళాలకు లొంగిపోయే ముందు, బెర్జర్, మరికొందరితో కలిసి రాకెట్ ఇంధనం కలిగిన ట్రక్కులలో బవేరియన్ పర్వతాలలోకి తప్పించుకు పారిపోయి న్యూయార్క్ నగరాన్ని లక్ష్యంగా చేసుకోగల ప్రాజెక్టు నిర్మాణం గురించి యోచిస్తున్నారు.

దాదాపు తక్షణమే, న్యూమెక్సికోలో వున్న అమెరికా సైన్యం కింద కాంట్రాక్టుకు వాన్‌ను, జర్మన్ శాస్త్రవేత్తల బృందాన్ని వుంచారు. కొరియా యుద్ధంతో, అణు సామర్థ్యం కలిగిన ఇంటర్ కాంటినెంటల్ గౌడెడ్ మిస్సైల్‌ను నిర్మించేందుకు వాన్‌ను, అతడి బృందాన్ని అలబామాలోని హంట్స్‌విల్లెలో గల రెడ్‌స్టోన్ ఆర్సెనల్‌కు పంపారు. అనంతర కాలంలో అమెరికా పౌరుడైన వాన్ నాసాలోని జార్జ్ సి మార్షల్ స్పేస్ ఫ్లైట్ సెంటర్ అధిపతి అయ్యారు. అప్పటికి శైశవ దశలో వున్న అమెరికా అంతరిక్ష కార్యక్రమ విస్తృతిని పెంచాడు. అపోలోను చంద్రుడి పైకి శాటర్న్ 5 తీసుకువెళ్ళడంతో, వాన్ తాను చిన్ననాడు కన్న కలలను సాకారం చేసుకున్నాడు.

అమెరికాకు గర్వకారణంగా నిలిచినప్పటికీ, వాన్ నాజీ గతం ఒక సమస్యగానే మిగిలిపోయింది. "ఆవిష్కరణలు చేసిన శాస్త్రవేత్తను తప్పుపట్టరాదని, ఆ ఆవిష్కరణను నియంత్రించి, ఉపయోగించే వారిని తప్పుపట్టాలని" 1971లో వాన్ అన్న మాటలు సంచలనమే. అయితే, లండన్‌ను దాదాపు కూల్చివేసి, వేలాది మంది బ్రిటిష్ పౌరుల మృతికి కారణమైన వి2ల మెరుపుదాడులకు తాను బాధపడుతున్నానని ఆయన బహిరంగంగా పేర్కొన్నాడు. అనేకమంది తోటి శాస్త్రవేత్తల వలెనే బ్రాన్‌కు కూడా దేవుడి పై గాఢమైన విశ్వాసం వుంది. నిజమైన శాస్త్రవేత్త అంతిమంగా మతం వైపు రావాలని ఆయన పేర్కొనేవాడు. అయితే, 1951లో ప్రచురించిన ఒక వ్యాసంలో ఆయన పీన్‌ముండెలో వున్న చర్చికి వెడతారా అన్న ప్రశ్నకు యుద్ధం ప్రారంభం అయిన తరువాత అక్కడకు వెళ్ళడం అనవసరమన్నట్టుగా సమాధానం చెప్పారు. ఏది ఏమైనా, నిజమైన శాస్త్రవేత్తల పరిధి ఎల్లలు లేనిదని నిరూపించిన వ్యక్తి బ్రాన్. తన శాస్త్ర ఆవిష్కరణలకు వేదిక జర్మనీ అయినా, అమెరికా అయినా ఆయన ఒకే అంకితభావంతో పనిచేశారు.

1867–1912

1871–1948

# విల్బర్ & ఆర్విల్లే రైట్

ఆ సోదరులిద్దరు అచ్చమైన అమెరికన్ మేధావులు. స్వయం శిక్షణ, కఠోర శ్రమ, ధైర్యంగా ముందడుగు వేయడం వారి స్వాభావిక లక్షణాలు. శతాబ్దాల తరబడి కొరుకుడు పడని సమస్యకు వారు పరిష్కారం చూపగలిగారు. 15వ శతాబ్ది చివరిలో లియొనార్డో డావిన్సి దగ్గర్నుంచి మొదలుపెట్టి 19వ శతాబ్ది తొలినాళ్లలో బ్రిటన్‌కు చెందిన సర్ జార్జి కేలీ లాంటి మహామహులెందరో ప్రయత్నించి విఫలమైన విషయంలో వారు సఫలీకృతులయ్యారు. జీవితాంతం బ్రహ్మచారులు గానే బతికారు వారిద్దరివి భిన్న మనస్తత్వాలైనా ఎగిరే యంత్రాన్ని కనిపెట్టాలనే విషయంలో వారిది ఒకటే లక్ష్యం. బాల్యంలో బహుమతిగా లభించిన హెలికాప్టర్ బొమ్మ వారిలో ఎగరాలనే ఆశకు ప్రాణం పోసింది. ఆకాశంలో ఎగరాలన్న మానవుడి ఆశలకు వారు రెక్కలు తొడిగారు. ఆకాశయానానికి శ్రీకారం చుట్టారు. ఆకాశంలో తొలి అడుగు వేశారు. మొట్టమొదటి విమానాన్ని సృష్టించారు. వారే అమెరికాకు చెందిన రైట్ సోదరులు. అమెరికాలోని ఇండియానా రాష్ట్రంలోగల మిల్‌విల్లెలో రైట్ సోదరుల్లో పెద్దవాడైన విల్బర్ రైట్ 1867లో జన్మించాడు. అతడి తమ్ముడు ఆర్విల్లే1871లో ఓహియో రాష్ట్రంలోని డేటన్‌లో జన్మించాడు. వాళ్ల తండ్రి మిల్టన్ రైట్ చర్చిలో ఫాదర్‌గా పనిచేసేవారు. తండ్రి ఆత్మవిశ్వాసం, పరిస్థితులతో రాజీ పడని తత్వాన్ని రైట్ సోదరులు పుణికిపుచ్చుకున్నారు. మిల్టన్ 1878లో సోదరులిద్దరికి ఒక బొమ్మ హెలికాప్టర్‌ను బహుమతిగా ఇచ్చాడు. ఈ హెలికాప్టర్ బొమ్మను రూపొందించిన అల్ఫోన్స్ పెనాడ్ అంతకుముందు విమానాన్ని కనిపెట్టడానికి విశేషంగా కృషి చేశాడు. ఈ బొమ్మ హెలికాప్టర్ రైట్ సోదరుల్లో ఎగరాలనే ఆశకు ప్రాణం పోసింది. తాము ఎప్పటికైనా ఎగిరే యంత్రాన్ని కనిపెట్టితీరాలని వారు నిర్ణయించుకున్నారు. తర్వాత అదే వారి జీవిత లక్ష్యంగా మారింది.

రైట్ సోదరులు కవల పిల్లల్లా కలిసేఉన్నా ఇద్దరి దృక్పథాలు మాత్రం వేరువేరుగా ఉండేవి. అందగాడైన ఆర్విల్లే మంచి సొగసుకాడు. ఎప్పుడు బట్ట నలగనిచ్చేవాడు కాదు. తాము పరిశోధనలు చేసిన కిట్టీ హాక్ ఎడారుల్లో కూడా కరోలినా ఎండలకు ముఖం కమిలిపోయి జిడ్డు కారకుండా ఆర్విల్లే తరచు నిమ్మకాయ నీళ్లతో ముఖం కడుక్కునేవాడు. విల్బర్‌కి బాగా కనిపించాలనే ధ్యాస ఉండేదికాదు. ఒకసారి ముఖ్యమైన ఉపన్యాసం ఇవ్వడానికి వెళ్లాల్సివచ్చిన విల్బర్‌కి మంచి దుస్తులు లేకపోవడంతో ఆర్విల్లే సూటును అరువు తీసుకున్నాడు. విల్బర్ తరచు నిరాశకు గురయ్యేవాడు. ఈ డిప్రెషన్ నుంచి తప్పించుకునేందుకు అతడు తెచ్చిపెట్టుకున్న ఆత్మవిశ్వాసంతో మెలగేవాడు. అయితే విపత్కర పరిస్థితుల్లో ఈ ఆత్మవిశ్వాసం ఆవిరైపోయి విల్బర్ తనలోకితానే కుంచించుకుపోయేవాడు. చామనచాయగా, బక్కపల్చగా ఉండే అతడు ఎంతో తీక్షణంగా మనసును కేంద్రీకరించి పని చేసేవాడు. ఈ విషయంలో అందరూ అతడ్ని గద్దతో పోల్చేవారు. ఎంతో చురుకుగా ఉండే ఆర్విల్లే జనంలోకి వచ్చి ఉపన్యాసాలు ఇవ్వాలంటే భయంతో వెనకడుగు వేసేవాడు. అయితే వ్యక్తిగత జీవితంలో అతడు గలగల పారే జలపాతంలా ఎంతో ఉషారుగా ఉంటూ ప్రాక్టికల్ జోక్స్ వేస్తూ చుట్టు ఉన్నవాళ్లను ఆకట్టుకునేవాడు. అతడి స్వభావం ఎన్నోసార్లు వారిని పెద్దపెద్ద చిక్కుల్లో నుంచి బయటపడేసింది.

తమ పరిశోధనల కోసం రైట్ సోదరులు క్రమశిక్షణను పాటిస్తు కఠోర శ్రమ చేసేవాళ్లు. మొక్కవోని వారి పట్టుదల, సహనమే వారిని విజయలక్ష్యం వైపు అడుగులు వేయించేలా చేసింది. వాళ్లు అమెరికా, యూరప్‌లలో విమానాల రూపకల్పన దిశగా సాగుతున్న పరిశోధనల నూతన పరిణామాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటుండేవాళ్లు. ఈ రంగంలో అప్పటికే ఎంతో కృషి చేసిన ఆక్టేవ్ చాన్యూట్ రైట్ సోదరులకు ఎప్పటికప్పుడు అమెరికా, యూరప్‌లలోని తాజా పరిణామాలను తెలియజేస్తుండేవాడు. రైట్ సోదరులు కొన్ని నమూనా విమానాలను తయారుచేసి వాటిని తాము రూపొందించిన గాలి సొరంగంలో ప్రయోగించి చూసేవారు. ఎయిరోడైనమిక్ స్థిరత్వాన్ని సాధించడం కోసం వాళ్లు పెట్టెల్లాంటి గాలి పటాలను తయారుచేసి ఎగురవేశారు. తర్వాత దశలో వారు గ్లైడర్‌లను రూపొందించారు. అయితే గ్లైడర్ రెక్కలు గాలిలోకి ఎగరడానికి సహకరించడం లేదని తెలుసుకున్నారు. తమ జీవనోపాధి, పరిశోధనలకు డబ్బు కోసం వారు డేటన్ పట్టణంలో సైకిలు షాపును నడిపే వారు. ఈ క్రమంలో వాళ్లు ప్రయాణిస్తున్న వాహనం గీత గీసినట్లు తిన్నగా వెళ్లదని, చాలాసార్లు అటూఇటూ వెళుతూ నిలదొక్కుకుంటుందని గ్రహించారు. వారు గమనించిన ఈ సూత్రం గాలిలో విమానం ముందుకు ప్రయాణించడానికి

అవసరమైన చలనగతిని సాధించేందుకు వారు చేసిన పరిశోధనల్లో ఉపయోగపడింది. విమాన రెక్కలను గాలి వాటానికి అనుగుణంగా ఎలా రూపొందించాలో వాళ్లకు తట్టింది. ఆ ఆలోచనను వెంటనే అమలు చేశారు. అది పనిచేసింది. సైకిల్ కూర్చుని తొక్కడం వల్ల శరీరం ఎదురుగాలికి గురయ్యి వేగం మందగిస్తోందని గమనించారు. దీనిని తప్పించుకోవాలంటే తాము రూపొందించిన గ్లైడర్‌లో నిలువుగా కూర్చోకుండా అడ్డంగా పడుకుని ప్రయాణించాలని గ్రహించారు.

1900వ సంవత్సరంలో రైట్ సోదరులు గ్లైడర్‌ను రూపొందించడం ప్రారంభించారు. అదే సంవత్సరం అక్టోబర్‌లో ఉత్తర కరోలినా లోని గాలులు వీచే పర్వత ప్రాంతమైన కిట్టీ హాక్‌లో వారు తాము రూపొందించిన గ్లైడర్‌తో ఎగరడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నంలో వారు ఓ మోస్తరు విజయం సాధించారు. ఈ ప్రయత్నం గొప్పగా విజయవంతం కాకపోయినా వారిలో ఆశలను సజీవంగా ఉంచింది. తర్వాత వారు డేటన్‌కు తిరిగివచ్చారు. ఆ తర్వాత వారు మరింత పెద్ద నమూనాను రూపొందించి ప్రయోగించారు. అదీ విఫలం అయింది. దీంతో వారి కళ్లు తెరుచుకున్నాయి. ఇప్పటివరకు తాము రూపొందించిన నమూనాలన్నీ వృథాయేనని, తమ లెక్కలన్నీ తప్పని తెలుసుకున్నారు. సందేహాలు వారిని చుట్టుముట్టాయి. వారు వాటిని తోసిపుచ్చి మరోమారు కార్యరంగంలోకి దూకారు.

రైట్ సోదరులు అప్పటివరకు తాము నమ్మిన సిద్ధాంతాలను, ఆలోచనలను పక్కనబెట్టారు. కొత్త ప్రణాళికలను సిద్ధం చేశారు. రెక్కలు ఉండి విమానానికి చోదక శక్తిని ఇచ్చే ప్రొపెల్లర్‌ను వారు కనుగొనడం జరిగింది. గాలిలో కిందకి, పైకి వెళ్లడం, గుండ్రంగా తిరగడం, పక్కకు వెళ్లడం లాంటి పనులు చేయగల ఇంజన్‌ను వాళ్లు ఎట్టకేలకు రూపొందించగలిగారు. దీంతో విమానాన్ని నడిపే పైలెట్‌కు ఎటు కావాలంటే అటు వెళ్లగలగడం సాధ్యమైంది. దీంతో 1903వ సంవత్సరం ఎండాకాలంలో ప్రపంచంలోని తొట్టతొలి విమానం గాలిలో ఎగరడానికి సిద్ధమైంది. ఇసుకలో కూరుకుపోకుండా విమానాన్ని పట్టాల మీద ఉంచారు. 1903, డిసెంబర్ 14న ఎవరు ముందు విమానాన్ని నడపాలో తేల్చుకోవ దానికి బొమ్మాబొరుసు వేశారు. టాస్ నెగ్గిన విల్బర్ తొలి ప్రయత్నంలో విఫలమయ్యాడు. తన దురదృష్టానికి చింతించాడు. తనను తానే నిందించుకున్నాడు. 'విజయం చేరువలోనే ఉంది, మౌనం వహించండి' అని తండ్రికి టెలిగ్రామ్ ఇచ్చారు. మూడు రోజుల తర్వాత డిసెంబర్ 17న ఆర్విల్లే విమానాన్ని అధిరోహించాడు. విజయవంతంగా 12 సెకన్లపాటు, 120 అడుగుల దూరం నడిపాడు. అదే రోజు చేసిన నాలుగవ ప్రయత్నంలో విల్బర్ 15 అడుగుల ఎత్తులో, 59 సెకన్ల పాటు విమానాన్ని నడిపాడు. అది 852 అడుగుల దూరం ప్రయాణించింది. విజయలక్ష్మిని చేరుకున్న ఆనందంతో ఉప్పొంగిపోయిన సోదరులు తండ్రికి మరో టెలిగ్రామ్ ఇచ్చారు. 'విజయం సాధించాం. గురువారం నాలుగు సార్లు ఎగిరాం. మీడియాకు కబురందించండి. క్రిస్టమస్‌కు ఇంటికి వస్తున్నాం' అని అందులో పేర్కొన్నారు.

అన్నదమ్ములిద్దరు జీవితాంతం బ్రహ్మచారులుగానే ఉన్నారు. డేటన్ పట్టణంలో 1912లో టైఫాయిడ్ జ్వరంతో విల్బర్ మరణించాడు. ఆర్విల్లే ఆ తర్వాత 40 ఏళ్లు జీవించాడు. అయితే ఆయనలోని విజ్ఞాన తృష్ణ చావలేదు. పరిశోధనలు కొనసాగించాడు. తమ చేతిలో ప్రాణం పోసుకున్న విమానం సృష్టించిన మంచి, చెడు రెండింటిని ఆర్విల్లే చూశాడు. వారు సృష్టించిన విమానం ప్రపంచాన్ని చిన్నదిగా చేసింది. ఆధునిక ప్రపంచంలో వాయు రవాణాకు ఎంతగానో ఉపయోగించిన విమానాన్ని యుద్ధాలకు కూడా ఉపయోగపడడం అతడు కళ్లారా చూశాడు. దీనిపై తన ద్వైధీ భావనను ఆర్విల్లే అగ్నితో పోల్చాడు. అగ్ని దహించగలదు, రక్షించగలదు. ఎలా ఉపయోగించుకుంటే అలా ఉపయోగపడుతుంది. విమానాలు కూడా అంతేనని ఆయన పేర్కొన్నాడు. అయితే రైట్ సోదరులు నాగరికత తెలియని పల్లెటూరి మేధావులని, సైకిల్ షాపు నడుపుకుంటూ అదృష్టం కలిసివచ్చి అందలాలు ఎక్కారని అమెరికన్ ప్రజలు నమ్మేవారు. నిజానికి తాము ముఖ్యమని నమ్మినదానిని నెరవేర్చుకోగల సామర్థ్యం ఉన్న ఆలోచనాపరులు రైట్ సోదరులు. మార్పు లేని ప్రకృతి మూల నియమాలను అర్థం చేసుకుని తాము నమ్మినదానిని సాధించడం కోసం భవిష్యత్తును ముందే సందర్శించిన దార్శనికులు రైట్ సోదరులు. వారు సృష్టించిన విమానమే నేడు ప్రపంచం ఓ కుగ్రామమైపోవడానికి దోహదం చేసింది.

1883-
1945

# బెనిటో ముస్సోలిని

ఎందరో నియంతలు ఈ భూమి మీద పుట్టినా.. ఎవరి ప్రత్యేకత వారిదే. వారు చరిత్రహీనులైనా, చరిత్ర వారిని విస్మరించలేదు. అటువంటి కోవలోకి వచ్చే వ్యక్తే బెనిటో ముస్సోలినీ. ఇటలీ పరిరక్షకునిగా, ముక్తిదాతగా తనను తాను అభివర్ణించుకున్న ముస్సోలిని జీవితం చివరకు విషాదకరంగా ముగిసిపోయింది. రెండు దశాబ్దాల పాటు ఇటలీ పాలకునిగా ఆధిపత్యం చెలాయించిన ముస్సోలిని తన తప్పుడు నిర్ణయాలు, విధానాల కారణంగా ప్రజల ద్వేషాన్ని చవిచూశాడు. అధ్యాపకుడి స్థాయి నుంచి జర్నలిస్టుగా, ట్రేడ్ యూనియన్ల వ్యవస్థాపకుడిగా, విప్లవకారుడిగా చివరకు పాలకుడిగా ఎదిగిన ముస్సోలిని చరిత్రలో నియంతగానే మిగిలిపోయాడు.

ఉత్తర ఇటలీలోని దోవియా పట్టణంలో జన్మించిన ముస్సోలిని తల్లి టీచర్. ఆమె కాథలిక్. తండ్రి కంసాలి. అతడికి దేవుడిపై నమ్మకం లేదు. తన మొదటి కుమారుడిని గొప్ప సోషలిస్టుగా తీ ర్చి దిద్దాలన్నది అతడి ఆకాంక్ష. సహజంగానే తెలివైన ముస్సోలిని, విషయాలను త్వరగానే గ్రహించి అవగాహనలో మేటి అనిపించుకున్నా, మొండివాడన్న పేరును కూడా చిన్నతనంలోనే సంపాదించుకున్నాడు. తన పద్దెనిమిదవ ఏట టోల్మెజో పట్టణంలో అధ్యాపక వృత్తిని చేపట్టిన ముస్సోలిని అందులోనే కొనసాగలేదు. మొదటి ప్రపంచ యుద్ధంలో విజేతలైన ప్రజలను తాను ఒక నూతన సీజర్‌లా నడిపించాలని కలలుగన్నాడు. మధ్యధరా మధ్య ప్రాంతంలో ఇటలీ కోల్పోయిన చారిత్రిక ప్రాముఖ్యతను పూర్వవైభవాన్ని తన నాయకత్వంలో పునరుద్ధరించాలని భావించాడు. విప్లవకారుడు, అవకాశవాది, కొంతమేరకు సంస్కరణవాది అయిన ముస్సోలిని తన విశ్వాసాలకు 'ఫాసిజం' అని పేరుపెట్టాడు. కార్మిక వర్గ ఐక్యత అత్యవసరమని, ఆ ఐక్యతను కాపాడేందుకు రాజ్యం హింసను ఉపయోగించడం తప్పనిసరి అని బెనిటో విశ్వసించాడు. కార్మిక అశాంతి నుంచి, అవినీతి నుంచి, కమ్యూనిస్టు, సోషలిస్టు ఉద్యమాల నుంచి కాపాడతానంటూ అతడు ప్రజలకు ఇచ్చిన హామీలు అన్నీ చివరకు నీటిమీద రాతలే అయ్యాయి.

అద్భుతమైన వాక్చాతుర్యంతో అరిచేతిలో వైకుంఠం చూపిన బెనిటో మాటలకు ఆకర్షితులైన ప్రజలు ఆయన అప్పటి దార్శనికతకు మద్దతు ఇచ్చారు. సామాన్య ప్రజలే కాదు అనేక మంది రాజకీయ నాయకులు, మేధావులు తొలుత ముస్సోలిని వాక్పటిమకు ఆకర్షితులైన వారే. అస్థిరమైన ఇటలీ ఆర్థిక రంగాన్ని పరిపుష్టం చేయాలన్న ముస్సోలిని లక్ష్యాన్ని విన్‌స్టన్ చర్చిల్ లాంటి మహానాయకుడు తొలుత కొనియాడినా, తరువాత అతడు తోడేలు అంటూ విమర్శలు గుప్పించాడు. ఆర్థిక, పారిశ్రామిక, సాంకేతిక సంస్థలు జాతీయ అసెంబ్లీతో కూడిన ప్రభుత్వ నియంత్రణలో వుండాలన్న పలు ప్రతిపాదనలను సిగ్మండ్ ఫ్రాయిడ్‌లాంటి మేధావి సమర్థించాడు. ముస్సోలిని బోల్షివిక్‌లను వ్యతిరేకించిన తీరు, సార్వజనీన విద్యకు పలికిన మద్దతు వంటి అంశాల పట్ల పలువురు ఆకర్షితులయ్యారు. కానీ రెండవ ప్రపంచ యుద్ధంలో ఘోర పరాజయానంతరం అప్పటి వరకూ ఒక దేవుడిలా భావించిన ప్రజలు ముస్సోలినీని ప్రజలు తీవ్రంగా ద్వేషించారు. అసహ్యించుకున్నారు.

యుద్ధకాలంలో ఉపాధ్యాయుడిగా పనిచేసిన ముస్సోలిని తాను చేసే పనితో సంతృప్తి పడలేదు. అందుకే, మొదటి ప్రపంచ యుద్ధానంతరం అతడు ఐరోపా యాత్ర ప్రారంభించాడు. జర్నలిస్టుగా, ట్రేడ్ యూనియన్ల వ్యవస్థాపకుడిగా నాయకత్వ లక్షణాలను కనబర్చాడు. అంకితభావం కల సోషలిస్టుగా అతడు తాను నీషె, కాంట్, స్పినోజా, జార్జ్ సోరెల్‌ల నుంచి నేర్చుకున్న అంశాలన్నింటినీ సమన్వయం చేసే ప్రయత్నం చేశాడు. (విప్లవానికి అసలైన పద్ధతి హింసే అని సోరెల్ భావించాడు). తండ్రి సోషలిస్టు కావడంతో ఆ భావాలను అందిపుచ్చుకున్న ముస్సోలినీ 1910లో ఫోర్లిలో స్థానిక పార్టీ నాయకునిగా తన ప్రయాణాన్ని ప్రారంభించాడు. మొదటి ప్రపంచ యుద్ధకాలం తొలినెలలో అతడు తటస్థ వైఖరిని సమర్థించాడు. అదే సమయంలో జోక్యాన్ని కూడా సమర్థించాడు. అతడి భావాలలో వచ్చిన ఈ మార్పు అటు పార్టీలోనూ, ఇటు దాని అధికార పత్రిక అయిన అవంతిలోనూ సంచలనాన్ని సృష్టించింది. అప్పటి వరకూ

ఆ పత్రికకు ఎడిటర్‌గా వున్న ముస్సోలినీని, అభిప్రాయాలు మార్చుకున్న కారణంగా రాజీనామా చేయమని పార్టీ వర్గాలు వత్తిడి చేశాయి. ఓడిపోవడం ఇష్టపడని ముస్సోలిని వెంటనే తన సొంత పత్రికను ప్రారంభించాడు. 'ఇల్ పోపొలో డి ఇటాలియా' పేరుతో అతడు స్థాపించిన దినపత్రిక యుద్ధసమయంలో తన సేవలను అందించింది.

యుద్ధానంతరం ముస్సోలిని తనదైన వ్యక్తిగత సోషలిస్టు ఉద్యమాన్ని నిర్మించేందుకు తిరిగి వచ్చాడు. వచ్చిన తరువాత ముస్సోలిని సమయాన్ని వృథా చేయలేదు. ఖాళీగా ఉన్న అనుభవజ్ఞులను, అశాంతితో వున్న యువతను, దేశంలో దారిద్ర్యం, కార్మిక అశాంతి మార్క్సిస్టు విప్లవానికి దారి తీస్తాయేమోననే భయంలో వున్న సంప్రదాయవాదులను ఆకర్షించి, వారి మద్దతును కూడగట్టుకున్నాడు. దేశంలో దాదాపుగా అరాచకం ప్రబలి వున్న సమయంలో ఆయన తన ఫాసిస్టు పార్టీని స్థాపించాడు. పార్టీని 1919లో ప్రారంభించిన అనంతరం తన ఉద్యమాన్ని బలోపేతం చేసేందుకు మూడు సంవత్సరాలు అవిశ్రాంతంగా కృషి చేశాడు. అనంతరం అధికారాన్ని చేజిక్కించుకునేందుకు 1922లో ఇప్పుడు 'మార్చ్ ఆన్ రోమ్'గా ప్రాచుర్యం పొందిన (బ్లాక్ షర్ట్స్) ప్రజా ఉద్యమాన్ని నిర్వహించాడు. దేశంలో నెలకొన్న అసంతృప్తి, అస్థిరత, అశాంతికి తోడుగా ఈ బలమైన ఉద్యమం కారణంగా ఏర్పడనున్న ముప్పును గుర్తించిన రాజు మూడవ విక్టర్ ఇమాన్యుయేల్ అతడిని ప్రభుత్వాన్ని నిర్వహించవలసిందిగా ఆహ్వానించాడు. ఆ అవకాశాన్ని చేజిక్కించుకున్న ముస్సోలిని ప్రధానమంత్రి అయ్యాడు. ప్రధానిగా ముస్సోలిని సాధించిన ఘన విజయాలేమీ లేవు. వార్తలలో తాను నిరంతరం వుండేలా చూసుకోవడమే అతడు సాధించిన గొప్ప విషయం. ఆ నేపథ్యంలోనే వారాంతపు న్యూస్ రీళ్లపై ఆధిపత్యం సంపాదించాడు. ముస్సోలిని నియంతృత్వ పోకడలకు నాంది ఆ కాలంలోనే పడింది. 1935లో ఇథియోపియాను జయించేందుకు ఇటలీ సేనలను పంపే ముందు గుర్రం పై కూర్చుని సమీక్షిస్తున్న ముస్సోలిని ఫోటోలు అప్పట్లో అనేకం. తదుపరి సంవత్సరంలోనే స్పెయిన్ అంతర్యుద్ధంలో ఫ్రాంకోకు మద్దతుగా తన దళాలను పంపాడు. తన రాజ్య విస్తరణ కాంక్ష కారణంగా అప్పటికే ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్‌లకు దూరమైన ముస్సోలిని, హిట్లర్‌ను అత్యంత బలమైన మిత్రుడిగా స్వీకరించాడు. అగ్రరాజ్యాలతో పొత్తును 1939లో అధికారికంగా కుదుర్చుకున్నాడు. ఆ మరుసంవత్సరం ఫ్రాన్స్ ఓటమిపాలయ్యే దాకా యుద్ధంలోకి నేరుగా ప్రవేశించకుండా ఓపికగా వున్నాడు. హిట్లర్ పట్ల అటు ప్రేమ ఇటు ద్వేషం కలిగిన ముస్సోలిని, నాజీల జాత్యాహంకారాన్ని నిరసించాడు. అయితే, తాను హిట్లర్‌ను అనుసరిస్తానంటూ వచ్చిన వాదన అతడికి ఆగ్రహాన్ని కలిగించింది. హిట్లర్ దగ్గర ముస్సోలిని ఏం నేర్చుకున్నా నేర్చుకోకపోయినా హిట్లర్ మాత్రం అతడి దగ్గర నుంచి గొప్ప వాక్చాతుర్యాన్ని, మీడియా పై ఆధిపత్యం చెలాయించే నైపుణిని నేర్చుకున్నాడు.

మహిళలకు మాతృత్వం ఎంత సహజమో పురుషునికి యుద్ధం అలాంటిదేనని విశ్వసించిన ముస్సోలిని యుద్ధోన్మాదిలా అతడు పలుదేశాల పైకి తన సేనలను పంపాడు. గ్రీసు, ఉత్తర ఆఫ్రికా, స్టాలిన్‌గ్రాడ్‌లలో ఇటలీ ఓటమి ముస్సోలిని పతనాన్ని సూచించాయి. స్టాలిన్‌గ్రాడ్‌లో ముస్సోలిని తన దళాలన్నింటినీ కోల్పోయాడు. 1943లో సిసిలీ చేరుకున్నాడు. ఓడిపోయిన నియంతను రాజు అరెస్టు చేయించాడు. కానీ, జర్మన్ మిత్రులు దాడి చేసి అతడిని ఇటలీ వారి బారినుంచి కాపాడారు. దీనితో ధైర్యం వచ్చిన ముస్సోలిని లేక్ గార్డా కేంద్రంలో తన ఫాసిస్టు ప్రభుత్వాన్ని పునఃప్రతిష్ఠించాడు. కానీ ఆనతికాలంలోనే అగ్రరాజ్య దళాలు చుట్టుముట్టాయి. ముస్సోలిని, అతడి ప్రియురాలు క్లారా పెటాస్సిలను ఇటలీ వేర్పాటువాదులు బందీలుగా చేజిక్కించుకున్నారు. విచారణ అనంతరం వారిరువురిని కాల్చివేశారు. అయినా, వారి ఆగ్రహం చల్లారకపోవడంతో వారిరువురిని మిలన్‌లోని పియాజాలె లొరెటోలో తలకిందులుగా వేళ్లాడదీశారు. రెండుదశాబ్దాల కాలం అధికారంలో వున్నప్పుడు అందుకున్న గౌరవానికి భిన్నంగా వారి రూపురేఖలు గుర్తుపట్టలేనంతగా మారిపోయేలా వారి పై రాళ్ళ వర్షం కురిపించారు.

1926-
1962

# మార్లిన్ మన్రో

చలనచిత్ర జగత్తు పుట్టిన తరువాత అప్పటికీ, ఇప్పటికీ ఎంతో మంది ప్రేక్షక, రసజ్ఞుల హృదయాలను దోచుకున్న అందాలరాణి మార్లిన్ మన్రో. శృంగార దేవతకు నీరాజనంగా ఆనాటి చిత్రాల్లో మార్లిన్ పోషించిన పాత్రలు ప్రపంచవ్యాప్తంగా ఆమెకు అభిమానులను సంపాదించి పెట్టాయి. ఆమె కనుసైగ కోసం, విరిచూపులకోసం కోటీశ్వరులే కాదు దేశాధినేతలు కూడా పడిగాపులు పడేవారు. మార్లిన్ మన్రోకు సంబంధించిన ఏ వస్తువులైనా సరే వేలానికి వేస్తే అవి కోట్లాది డాలర్ల ధర పలకడం చూస్తుంటే ఆమెపైగల వెర్రి అభిమానం ఇప్పటికీ చెక్కుచెదర లేదనిపిస్తుంది.

దుర్భర దారిద్ర్యంలో పుట్టి, తల్లిదండ్రులు వదిలేసిన బిడ్డగా అనాథగా శరణాలయాల్లో పెరిగి జీవితంలో ఎన్నో కష్టాలను ఎదుర్కొంది ఈ అందాల రాణి. 1926లో లాస్ ఏంజెల్స్‌లో ఒక పేదవాడైన ఫిల్మ్ కట్టర్ ఇంట్లో పుట్టిన మార్లిన్‌మన్రో అసలు పేరు నోర్మా జీన్ మార్టిన్ సేస్. తల్లి స్కిజోఫ్రినియా రోగంతో బాధపడుతుండటంతో చిన్న నాడే నోర్మాజీన్ అనాథగా పెరిగింది. ఏడేళ్ల వయస్సు వచ్చేవరకూ ఎలా పెరిగిందో కూడా తెలియని జీవితాన్ని అనుభవించిన నోర్మా ఆప్యాయత, అనురాగాలకు మొహం వాచిపోయింది. అక్కున చేర్చుకునేవారూ, ఇంత తిండి పెట్టేవారూ లేకపోవడంతో ఒక బలహీనమైన పాపగా అక్కడ, ఇక్కడ పనిచేసి జీవితాన్ని నెట్టుకొచ్చింది. పదహారేళ్ల ప్రాయంలో చూడగానే ఆకట్టుకునే రూపం కలిగిన నోర్మా జీన్‌ను బేకర్ అనే ఒక నావికుడు వివాహమాడాడు. పెళ్లైన తరువాత రెండో ప్రపంచయుద్ధం రావడంతో నోర్మా భర్త యుద్ధరంగంలోకి వెళ్ళిపోయాడు. ఆ సమయంలో బర్‌బ్యాంక్‌లోని ఒక రేడియో ప్లేన్ కంపెనీలో పనిచేసేందుకు కుదిరింది. ఎప్పుడూ ఊహాలోకాల్లో విహరించే నోర్మా తన అలంకరణతో అందరి దృష్టిని ఆకర్షించేది. ఇదే కంపెనీలో బట్టలకు పెయింట్ వేస్తున్న నోర్మాను ఒక ఆర్మీ ఫోటోగ్రాఫర్ ఫోటో తీసాడు. కార్యాలయాల్లో పనిచేస్తున్న మహిళగా ఆమె ఫోటోను స్థానికంగా ప్రచురితమయ్యే యాంక్ మ్యాగజైన్‌లో ముద్రించారు. నోర్మా ఫోటోను చూసిన కొందరు ఆమెకు మోడలింగ్ రంగంలో అవకాశమిచ్చారు.

యాంక్ మ్యాగజైన్‌లో ప్రచురితమైన ఫోటోతో మోడలింగ్ రంగంలోకి ప్రవేశించిన నోర్మాజీన్ డబ్బుకోసం ఏం చేయడానికైనా సిద్ధపడింది. గోధుమరంగు (బ్లాండ్) జుట్టున్న నోర్మా మోడలింగ్ రంగంలో నల్లజుట్టుతో, తెల్లజుట్టుతో, అసలు రంగు జుట్టుతో రకరకాల భంగిమల్లో ఫోటోలకు ఫోజులిచ్చింది. నోర్మా జీన్ భంగిమలు అప్పట్లో హాలీవుడ్‌ను శాసించే ట్వంటీయత్ సెంచురీ ఫాక్స్ సంస్థ అధినేతల దృష్టిలో పడ్డాయి. అంతే నోర్మాను అదృష్టం వరించింది. చక్కని శరీరం, ఆకట్టుకునే చిరునవ్వుతో అందంగా ఉన్న నోర్మాజీన్‌ను హోవార్డ్ హగ్స్ తన ఆర్.కె.ఒ. స్టూడియోస్ చిత్రాలకోసం ఆమెతో 1948లో సంతకాలు పెట్టించుకున్నాడు. 1948లోనే నోర్మాజీన్ తన పేరును మార్లిన్ మన్రోగా మార్చుకుంది. అదే ఏడాది విడుదలైన ఆమె తొలి చిత్రం 'డేంజరస్ ఇయర్స్' అంతగా ప్రేక్షకులను ఆకట్టుకోలేకపోయినా, మార్లిన్ మన్రో మటుకు చాలా మంది దృష్టిని ఆకర్షించింది. ఆ తరువాత కొలంబియా పిక్చర్స్ అధినేత జోసెఫ్ ఎమ్. షెంక్ ఆమెతో కాంట్రాక్టు కుదుర్చుకున్నాడు. ఆ సంస్థ నిర్మించిన 'లేడీస్ ఆఫ్ ద కోరస్' చిత్రం 1949లో విడుదలై మన్రోకు మంచి పేరు తెచ్చిపెట్టింది. మరుసటి సంవత్సరం అంటే 1950లో విడుదలైన ఆస్ఫాల్ట్ జంగిల్, ఆల్ అబౌట్ ఈవ్ ఈ రెండు చిత్రాలు బాక్సాఫీస్ వద్ద ఘనవిజయం సాధించడంతో మార్లిన్‌మన్రో పేరు హాలీవుడ్ అంతటా

మారుమోగింది.· ఈ సినిమాల్లో అర్ధనగ్నంగా మార్లిన్ నటించిన దృశ్యాలు ప్రేక్షకులను వెర్రెత్తించాయి. హీరో ఎవరు, బ్యానర్ ఏమిటి అనేది చూడకుండా అభిమానులు మన్రోకోసమే ఎగబడి సినిమాకు రావడం మొదలు పెట్టారు. దీంతో పెద్ద పెద్ద నిర్మాణ సంస్థలు లక్షల డాలర్లు ఇచ్చి మన్రోతో సినిమాలు తీయడం ప్రారంభించాయి.

నగ్న, అర్ధనగ్న దృశ్యాల్లో నటించి ప్రేక్షకులను వెర్రెక్కించిన మన్రోకు అవకాశాలు ఇబ్బడిముబ్బడిగా రాసాగాయి. కొలంబియా, ట్వంటీయత్ సెంచరీ ఫాక్స్, ఆర్.కె.ఒ. స్టూడియోస్ వంటి పెద్ద పెద్ద సంస్థలు నిర్మించిన 'నయాగారా' 'జంటిల్‌మెన్ ప్రిఫర్ బ్లాండ్స్' ఆమెను శృంగార దేవతగా ప్రేక్షకుల హృదయాల్లో చెరగని ముద్ర వేసింది. ఇవన్నీ ఒక ఎత్తైతే 1949లో ప్లేబాయ్ పత్రిక సెంటర్ స్ప్రెడ్‌లో పూర్తి నగ్నంగా మార్లిన్ మన్రో ఫోటో ప్రచురించింది. మరో ఏడాదికి 1950లో 'హౌటు మ్యారీ ఎ మిలియనీర్' అన్న చిత్రంలో ఆమె శృంగారపరంగా నటించిన సన్నివేశాలు ఆమెకు స్టార్ గుర్తింపును తెచ్చిపెట్టాయి. నగ్నంగా ఎందుకు పత్రికకు పోజిచ్చావు అని అడిగితే నేనుంటున్న బంగళాకు అద్దె కట్టాలిగా మరి అందిట మార్లిన్ మన్రో అమాయకంగా. ఆమె చెప్పిన సమాధానాన్ని విని అమెరికా ప్రజలు నవ్వుకొని ఆమెను క్షమించేశారు. సెక్స్ సింబల్‌గా, శృంగార సామ్రాజ్ఞిగా అమెరికా, యూరప్, ఆస్ట్రేలియాల్లో సినీ అభిమానుల గుండెల్లో నిల్చిపోయిన మార్లిన్ మన్రో సినిమాల్లో మరొక సాహసం చేసింది. 1955లో విడుదలైన 'ద సెవెన్ ఇయర్ ఇచ్' అనే సినిమాలో సబ్ వే పక్కన నిలబడి కింద నుంచి వచ్చే గాలికి ఆమె స్కర్ట్ పైకెగిరిపోయే దృశ్యంలో అంగాంగ ప్రదర్శన చేసింది. దాదాపు 20కి పైగా సినిమాల్లో నటించిన మన్రోకు డబ్బుకు డబ్బు, పలుకుబడికి పలుకుబడి పెరగడంతో ఆమె స్వంతంగా సినిమాలు తీయడం ప్రారంభించింది. ఈ మధ్యకాలంలోనే అమెరికాలో పేరు పొందిన బేస్ బాల్ క్రీడాకారుడు, స్టార్ ప్లేయర్ జో డి మాగియోతో ఆమె పెళ్ళయింది. ఆ వివాహం ఎక్కువ రోజులు నిలబడలేదు. ఆర్నెల్లు తిరగకుండానే బేస్‌బాల్ స్టార్‌కు విడాకులిచ్చి తనకంటే వయసులో పెద్దవాడైన ప్రముఖ రచయిత ఆర్థర్ మిల్లర్‌ను వివాహమాడింది.

బాల్యంలో ఎన్నో కష్టనష్టాల నెదుర్కొని, ఆప్యాయతానుగారాలు కరువైన మార్లిన్ మన్రో తన చరిత్రను తిరగరాసుకుంది. ఇంతటి సౌందర్యరాశి ఇక ఈ భూమిపై పుట్టదు, పుట్టబోదని అభిమానులు నీరాజనాలర్పించేంతగా ఆమె అప్పటి పురుషులను వెర్రెక్కించింది. కావలసినంత డబ్బు సంపాదించినప్పటికీ దాన్ని ఆమె నిలుపుకోలేకపోయింది. అమెరికా అధ్యక్షుడు జాన్.ఎఫ్. కెన్నడీతోనూ అతని సోదరుడు రాబర్ట్ కెనడీతోనూ సంబంధాలున్నాయని పత్రికలు, విమర్శకులు కోడై కూశారు. ఎంతో ఆశతో కోట్లాది డాలర్లు ఖర్చుపెట్టి సొంతంగా తీసిన 'బస్‌స్టాఫ్' 'ది ప్రిన్స్ అండ్ ది షో గర్ల్' వంటి ఐదారు సినిమాలు బాక్సాఫీసు వద్ద విఫలమవడంతో మన్రో తీవ్ర మనోవేదనకు గురైంది. 1961లో పిచ్చిపిచ్చిగా ప్రవర్తించిన మన్రోను సైక్రియాటిస్టు పర్యవేక్షణలో మానసిక రోగుల చికిత్సాలయంలో చేర్చారు. మద్యానికీ, డ్రగ్స్‌కూ బానిసగామారింది. అంతకు ముందు రెండు సార్లు నిద్రమాత్రలు మింగి ఆత్మహత్యాయత్నానికి పాల్పడింది. మార్లిన్ అలా ఎందుకు మారిపోయిందో ఆమె అభిమానులు ఎంత యోచించినా అంతుబట్టలేదు. చివరగా తన 36 ఏళ్ల చిన్న జీవితంలోనే బ్రతుకంటే విరక్తి పుట్టి నిద్రమాత్రలను అతిగా మింగి ఈ లోకం నుంచే శాశ్వతంగా సెలవు తీసుకొంది మార్లిన్ మన్రో. ఆమె మరణించి దశాబ్దాలు గడుస్తున్నా ఆమె అభిమానులకు మాత్రం మార్లిన్ మన్రో ఇప్పటికీ శృంగార సామ్రాజ్ఞే.

1921–
1999

# అకియో మొరిటా

ఈ రోజుల్లో వస్తువులు, వాటి నాణ్యత కన్న అది ఏ బ్రాండ్ వస్తువు అన్నదే ప్రధానం. అందుకే అమ్మకందార్లు విక్రయించేది ప్రధానంగా వస్తువులు కాదు. బ్రాండే. అలాంటి విశ్వవ్యాప్తమైన బ్రాండ్‌ను తయారు చేసినవాడు అకియో మొరిటా. ప్రపంచీకరణ, ఆర్థిక సరళీకరణ యుగంలో వినియోగతత్వం విపరీతమై కొనుగోలు చేయడమే జీవితంగా మారిపోయిన నేటి కాలంలో వస్తువులు, వాటి నాణ్యత, వాటిని ఉత్పత్తి చేసే వ్యవస్థలు, వ్యక్తులు అత్యంత ప్రాధాన్యతను సంతరించుకోవడమైంది. ప్రపంచ దేశాల ఆర్థిక సూత్రాలు, సంక్షేమ కార్యక్రమాలు వివిధ బహుళ జాతి వస్తు ఉత్పత్తి సంస్థలే కేంద్రంగా పరిభ్రమిస్తున్నాయి. ఈ నేపథ్యంలో వస్తువు నాణ్యతను తెలిపే బ్రాండ్ అతి ముఖ్యమైనది. సోనీ అన్న టీవీ, వాక్‌మెన్, స్టీరియో గురించి తెలియని వారు ఉండరు. అమెరికా వారి దృష్టిలో కోక్‌కోలా, జనరల్ ఎలక్ట్రిక్ కన్నా సోనీనే అగ్రశ్రేణి బ్రాండ్. బహుళజాతి కార్పొరేషన్లు ఏర్పడడానికి ఆద్యుడు కూడా అకియో మొరిటానే.

మొరిటా కుటుంబం పధ్నాలుగు తరాలుగా వ్యాపార రంగంలోనే ఉంది. మొరిటా మూడో తరగతి చదువుతున్నప్పటి నుంచీ ఆయన కుటుంబ పెద్దలు తమ వ్యాపారానికి అతనే వారసుడు అనుకునేవారు. అయితే మొరిటా పేరు సంపాదించింది. ఆయన కుటుంబం కొనసాగిస్తున్న వ్యాపారం వల్ల కాదు. ఆయన కుటుంబం బియ్యం నుంచి మద్యం తయారు చేసేది. ఒక బ్రాండ్ పేరు చెప్పగానే దాన్ని గుర్తించగలగాలి. దాని నాణ్యత స్ఫురణకు రావాలని మొరిటా భావించేవాడు. కానీ ఆ సమయంలో జపాన్‌లోని అనేక కంపెనీలు మరేదో బ్రాండ్ పేర వస్తువులు ఉత్పత్తి చేసేవి. ఉదాహరణకు పెంటాక్స్ హనీ వెల్ కంపెనీ కోసం వస్తువులు ఉత్పత్తి చేసేది. రీకో, సావిన్ కంపెనీకి, సాన్యో సియర్స్ కంపెనీకి వస్తువులు తయారు చేసి పెట్టేవి.

సోనీ పేరు ప్రపంచమంతటా మారు మోగిపోవడానికి మొరిటాతో పాటు సోనీ కంపెనీ వ్యవస్థాపకుల్లో ఒకరైన 'మసరు ఇబుకా' పాత్ర కూడా అద్వితీయమైందే. ఇబుకా ఇంజనీరు. మొరిటా అమ్మకాల్లో నిపుణుడు. వీరిద్దరి జమిలి ప్రయత్నాలు సోనీ కంపెనీని అజేయంగా నిలబెట్టాయి. జపాన్ సరిహద్దులు దాటి సోనీ కంపెనీ 1963లో మొట్టమొదట అమెరికాలో అడుగు పెట్టింది. అదే సంవత్సరం మొరిటా అమెరికాకు మకాం మార్చాడు. అమెరికా వారిని, వారి మార్కెట్లను, ఆచారాలను, నిబంధనలను, అవసరాలను క్షుణ్ణంగా ఆకళింపు చేసుకుని తన కంపెనీ విజయం సాధించేట్టు చేశాడు. ఆ రోజుల్లో ఇలాంటి వ్యాపార దృక్పథం ఎక్కువ మంది వ్యాపారవేత్తలకు ఉండేది కాదు. మొరిటా అమెరికాలో అక్కడి ప్రజల్లో కలిసి పోయాడు. వారితో స్నేహం చేశాడు. వారికి విందులు, వినోదాలు ఏర్పాటు చేసేవాడు. ఆయన పని రాక్షసుడు. సంగీతం, క్రీడలు అన్నా అయనకు మక్కువే. 60 ఏళ్లు దాటిన తర్వాత కూడా ఆయన విండ్ సర్ఫింగ్, స్క్యూబా డైవింగ్, స్కీయింగ్ లాంటి క్రీడల్లో పాల్గొనేవాడు. వాటర్ స్కీయింగ్‌లో మునిగిపోయి ఉన్నప్పుడు తన భార్య మొషికోతో మాట్లాడడానికి నీటిలో కూడా పని చేసే మైక్రోఫోన్‌ను తయారు చేశాడు.

మొరిటా కనిపెట్టిన అలాంటి వస్తువులలో ముఖ్యమైంది వాక్‌మెన్. తన పిల్లలు, వారి స్నేహితులు ఉదయాస్తమానాలు సంగీతం వినడం, జనం కార్లలో పెద్ద పెద్ద స్టీరియోలు పార్కులకు సముద్రపు ఒడ్డుకు మోసుకుపోవడం గమనించిన ఆయన సంగీతం వినడానికి చిన్న పరికరం ఉంటే బాగుంటుందనుకున్నాడు. అంతే. వాక్‌మెన్ తయారైంది. అయితే రికార్డింగ్ సదుపాయం లేని పరికరం అంటే సోనీ ఇంజనీరింగ్ విభాగం ఇష్టపడలేదు. ఆ తర్వాత ఆ సదుపాయాన్ని కూడా ఆ బుల్లి పెట్టెలో ఇమిడ్చారు.

సోని అన్న పేరు పెట్టడం వెనక కూడా పెద్ద కథే ఉంది. ఆ పేరు ప్రపంచమంతా ఆమోదయోగ్యం కావాలన్నది ఆయన ఆశయం. ఆ పేరు ఆకర్షణీయంగా,

చిన్నగా, సులువుగా ఉచ్చరించడానికి వీలుగా ఉండాలనుకున్నారు. మొరిటా, ఆయన సహచరుడు ఇబుకా కలిసి నిఘంటువులు తిరగేశారు. వారికి సోనస్ అన్న లాటిన్ పదం తగిలింది. సోనస్ అంటే ధ్వని అని అర్థం. ఆ సమయంలో అమెరికాలో పిల్లలను ముద్దుగా సోనీ అని పిలిచేవారు. తమ కంపెనీ శక్తి సంపన్నులైన యువకులకు చిహ్నం అని చెప్పడం కోసం ఈ రెండు పదాలను కలిపి సోనీ అన్న పేరు ఖరారు చేశారు.

అయితే ఈ పేరులో అమెరికా వారికి భాషాదోషాలు కనిపించినందువల్ల సౌండ్ అబేట్ అని మార్చారు. స్వీడన్‌లో దానిని ఫ్రీస్టయిల్ అన్నారు. బ్రిటన్‌లో స్టోవావే అన్నారు. కాని ఒక్కో దేశంలో ఒక్కో పేరు ఉండడం నచ్చని మొరిటా సోనీ వాక్‌మన్ అన్న పేరు నిర్ణయించాడు. అది ప్రపంచ వ్యాప్తంగా ఆదరణకు నోచుకుంది.

మొరిటా వ్యాపారం విశ్వవ్యాప్తమైంది అయినా ఆయనలో జాతీయతా భావాలు కూడా ఉన్నాయి. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ఛిద్రమైన జపాన్ ఆర్థిక వ్యవస్థకు తోడ్పాటు అందించడం కోసం నౌకాదళంలో ఉద్యోగం మానుకున్నాడు. 1960ల నుంచి అనేక సమస్యలపై మాట్లాడడం మొదలు పెట్టాడు. సుంకాలు తగ్గించి వాణిజ్యాన్ని పెంపొందించాలని వాదించేవాడు. ఈ అంశాన్ని గురించి అప్పట్లో జపాన్ వారు ఎవరూ మాట్లాడేవారు కాదు. ఆయన జపాన్ వ్యాపార వర్గానికి ప్రతినిధిగా వ్యవహరించారు. 1970ల నాటికి జపాన్ ప్రపంచంలోకెల్లా రెండవ ఆర్థిక శక్తిగా ఎదిగింది. అందువల్ల జపాన్‌ను విస్మరించడం సాధ్యం కాలేదు.

సోనీ అంతర్జాతీయంగా ఎదుగుతున్న కొద్దీ మొరిటా దృక్పథం కూడా విస్తరించింది. "విశ్వ దృష్టితో ఆలోచించండి. స్థానిక అవసరాలకు అనుగుణంగానే పనిచేయండి" అనేది ఆయన నినాదం. ఒక కంపెనీ ఏ దేశానికి చెందింది అని కాకుండా విశ్వవ్యాప్తంగా వినియోగదారులకు, వాటా దార్లకు ఉద్యోగులకు ఉపకరించాలనేది ఆయన ఆలోచన.ఒక వ్యక్తి జీవిత కాలంలో సాధించడానికి వీలైన దాని కన్నా చాలా ఎక్కువగానే మొరిటా సాధించాడు. తన సహచరుడు, ఇబుకాతో కలిసి 40 ఏళ్ళ పాటు సోనీ వ్యవహారాలు నిర్వహించాధు మొరిటా. ఇబుకా తన ఇంజనీర్లను ఉత్సాహపరిచి వారి సామర్థ్యానికి మించిన పని చేసేట్టు చూసేవాడు. సోనీ కంపెనీ అంతర్జాతీయ స్థాయికి ఎదగడానికి మొరిటా వ్యాపార దక్షత ఉపకరించింది. 1993 నవంబర్ 30న టెన్నిస్ ఆడుతుండగా మొరిటా పక్షవాతం బారినపడి మాట పడిపోయింది. అప్పటి నుంచీ చక్రాల కుర్చీకి పరిమితం అయిపోయాడు.

మొట్ట మొదటిసారి మొరిటా 1953లో అమెరికా వెళ్ళాడు. ఆర్థిక వ్యవస్థ బలంగా ఉంటే ఎంత హడావుడి ఉంటుందో గమనించాడు. 1955లో టేప్ రికార్డర్లు, సోనీ ట్రాన్సిస్టర్ రేడియోలు పట్టుకుని అమెరికా వెళ్ళి పంపిణీ దార్ల చుట్టూ తిరిగాడు. ఫలితం మాత్రం అంతగా లేదు. చివరకు బులోవా అనే గడియారాల కంపెనీ బులోవా పేరున అమ్మకానికి ఒప్పుకొంటే లక్ష రేడియోలు, టేప్ రికార్డర్లు కొనడానికి సిద్ధ పడింది. ఇబుకా, సోనీ కంపెనీ డైరెక్టర్లు కూడా దీనికి అంగీకరించారు. కానీ సోనీని అంతర్జాతీయ బ్రాండ్‌గా నిలబెట్టాలని దీక్ష బూనిన మొరిటా అంత పెద్ద వ్యాపారావకాశాన్ని సైతం వదులుకున్నాడు. తన వ్యాపార జీవనంలో ఇదే అత్యుత్తమ నిర్ణయం అన్నది ఆయన భావన. 1960ల అమెరికాలో సోనీ కార్పొరేషన్‌ను ఏర్పాటు చేసి ఆ తర్వాత 30 ఏళ్లు దాన్ని సాకాడు. జనరల్ మోటార్స్, జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీలకు ఉన్న బ్రాండ్ విలువను సోనీ అధిగమించింది. అమెరికన్లు విపరీతంగా ఆదరించారు.

ఆయన వ్యక్తిత్వం కూడా చాలా ఆకర్షణీయమైంది. ఆయన ఎక్కడ ఉంటే అక్కడ సందడే సందడి. 1992లో డావోస్‌లో ప్రపంచ ఆర్థిక వేదిక సమావేశం జరిగినప్పుడు నెల్సన్ మండేలా, ప్రిన్స్ చార్లెస్, హెన్రీ కిసింజర్, లీపెంగ్ వంటి వారు హాజరైనా మొరిటా విశిష్టత అక్కడ కొట్టొచ్చినట్టు కనిపించింది.

1918-

# నెల్సన్ మండేలా

జాతి వివక్షతకు మాతృభూమి దక్షిణాఫ్రికా. మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ "మహాత్మాగాంధీ"గా మారటానికి నాంది పలికిన దక్షిణాఫ్రికా జాతి వివక్షతపై మడమ తిప్పని పోరాటం చేసిన నల్లసూరీడు నెల్సన్ మండేలా. విద్యార్థిగా ఉన్నప్పుడే ఆయన రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొన్నారు. న్యాయవాది అయిన ఆయనను మహాత్ముడి అహింసా రాజకీయాలు ప్రభావితం చేశాయి. గాంధీ బాట లోనే తన దేశానికి స్వాతంత్ర్యం తేవాలనుకున్నాడు. మార్క్సిస్టు కాకపోయినా రాజకీయ వివేకం కారణంగా కమ్యూనిస్టులతో చెలిమి చేశాడు. ఆఫ్రికన్ జాతీయ కాంగ్రెస్ (ఏఎన్‌సీ) యువజన విభాగంలో చేరాడు. అంచెలంచెలుగా ఎదిగాడు. జాత్యంహకార శక్తులపై జరిగిన పోరాటంలో పార్టీకి, దేశానికి కేంద్ర బిందువయ్యాడు. వ్యవస్థీకృత జాత్యహంకారంపై పోరులో ఆఫ్రికన్ జాతీయ కాంగ్రెస్‌కు జవసత్వాలనిచ్చే ఆధ్యాత్మిక శక్తి అయ్యాడు. 27 ఏళ్ల కారాగారవాసంలో కూడా ఆత్మస్థైర్యాన్ని కోల్పోలేదు. శ్వేత జాత్యంహకార అంధకారంలో మగ్గుతున్న తన దేశానికి స్వాతంత్ర్య వెలుగులను ప్రసాదించిన దక్షిణాఫ్రికా సూర్యుడు నెల్సన్ మండేలా.

డచ్చి జాతీయుల ఆధిపత్యంలోని 'ఆఫ్రికానెర్స్' జాతీయ పార్టీ 1948లో దక్షిణాఫ్రికాలో అధికారాన్ని చేజిక్కించుకుంది. అధికారంలోకి వచ్చిన మరుక్షణమే నల్ల జాతీయులను అణచివేయడానికి క్రూరమైన జాతి వివక్ష చట్టాన్ని ప్రవేశపెట్టింది. ప్రజలను జాతులుగా విభజించింది. శ్వేత జాతీయులకు పట్టంగట్టింది. ఈ చట్టం ప్రకారం నల్లవారు వారికి కేటాయించిన ప్రాంతాలలోనే నివసించాలి. వారికి ఓటు హక్కు ఉండదు. రాజకీయ అధికారం ఉండదు. ఈ చట్టాన్ని వ్యతిరేకిస్తూ ప్రభుత్వంపై మండేలా తిరుగుబాటు బావుటా ఎగరవేశాడు. ఆఫ్రికన్ జాతీయ కాంగ్రెస్ యువజన విభాగంలో చేరాడు. 1950లో యువజన విభాగానికి అధ్యక్షుడు అయ్యాడు. 1952లో ప్రభుత్వానికి వ్యతిరేకంగా రూపుదిద్దుకున్న ఉల్లంఘన ఉద్యమానికి నేతృత్వం వహించాడు. దీంతో ప్రభుత్వం మండేలాను జోహాన్నెస్‌బర్గ్ నగరాన్ని వదిలి వెళ్లరాదని ఆంక్షలు విధించింది. ఆరు నెలల పాటు సాగిన ఈ ఆంక్షల సమయంలోనే మండేలా ఏఎన్‌సీలో తన సహచరుడైన ఆలివర్ టాంబోతో కలిసి న్యాయ సంస్థను నెలకొల్పాడు. ప్రభుత్వ ఉల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నందుకు 1953లో మండేలాకు ప్రభుత్వం తొమ్మిది నెలల జైలు శిక్ష విధించింది. ఏఎన్‌సీకి రాజీనామా చేయాలని కూడా ఆదేశించింది. దీనికి ప్రతిగా భూమిపుత్రులకే నేలను పంచాలని, జాతి వివక్ష లేని దక్షిణాఫ్రికా కావాలంటూ మండేలా ఒక స్వేచ్ఛా పత్రాన్ని విడుదల చేశాడు. ప్రభుత్వం అనేకసార్లు మండేలాను శిక్షించాలని తప్పుడు కేసులు బనాయించింది. అయితే అవి కోర్టులో వీగిపోవడంతో ప్రభుత్వం ఎత్తులు పారలేదు. 1961లో ప్రభుత్వం ఏఎన్‌సీని నిషేధించింది. దీంతో మండేలా అజ్ఞాతంలోకి వెళ్లిపోయాడు. ప్రజలు ఆయనను 'వుంఖొంటొ వి సిజ్వె' (జాతి బల్లెం) అని పిలిచేవారు. పేరుకు తగ్గట్లే మండేలా ప్రభుత్వానికి పక్కలో బల్లెంలా మారాడు. ఆయన నేతృత్వంలో ఏఎన్‌సీ గెరిల్లా విభాగం పరిశ్రమలపై దాడులు జరుపుతూ విప్లవ సమరానికి శంఖం పూరించింది.

మండేలా భద్రతా దళాలను చాకచక్యంగా ఏమార్చి ఎప్పటికప్పుడు వారి వలలో నుంచి తప్పించుకునేవాడు. వారిని ముప్పుతిప్పలు పెట్టేవాడు. ఒకసారి డ్రైవరు వేషంలో ఉన్న మండేలా దురదృష్టవశాత్తు ఓ చురుకైన పోలీసు కంట్లో పడి దొరికిపోయాడు. ఆయనపై దేశద్రోహ నేరాన్ని మోపారు. కోర్టు విచారణలో తాను దేశభక్తుడినని, రాజ్యాంగబద్ధమైన ప్రజాస్వామ్యాన్ని అభిమానిస్తానని మండేలా చెప్పాడు. అయితే కోర్టు అతడిని నేరస్తుడిగా పరిగణించి యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. మండేలా 27 ఏళ్లు జైలులో గడిపాడు. శరీర దారుఢ్యం సడలిపోకుండా ఉండడానికి మండేలా రోజు వ్యాయామం, బాక్సింగ్ చేసేవాడు. ఖైదీలకు

పాఠాలు బోధించేవాడు. జైలు నుంచే తన రాజకీయ పోరాటాన్ని కొనసాగించాడు. ప్రపంచవ్యాప్తంగా వచ్చిన ఒత్తిడితో ప్రభుత్వ స్థైర్యం నీరుగారిపోయింది. అది జాతి వివక్షత నిర్మూలన దిశగా అడుగులు వేసింది. ఎట్టకేలకు మండేలాను విడుదల చేసింది. అప్పటికే విప్లవ పోరాటంలో చురుగ్గా ఉన్న భార్య విన్నీతో కలిసి మండేలా జాతి భవిష్యత్తును నిర్ణయించేందుకు ప్రభుత్వంతో చర్చలకు సిద్ధమయ్యాడు. అయితే ఆయనకు పెను సవాళ్లు ఎదురయ్యాయి. ఓపక్క పార్టీలో నెలకొన్న అయోమయ పరిస్థితులతో ప్రభుత్వం చర్చలపై ఓ అడుగు ముందుకు రెండడుగులు వెనక్కు వేస్తూ ఎటూ తేల్చుకోలేని పరిస్థితిలో పడింది. మరోపక్క జులూ జాతీయులు తమకు ప్రత్యేక దేశం కావాలని వేర్పాటువాద బాట పట్టారు. ఇంకోపక్క మత ఛాందసవాద బోయెర్ జాతీయులు నాజీ ధోరణులను అవలంబిస్తూ విప్లవిస్తామని హెచ్చరికలు జారీ చేశారు. ఈ సమస్యలకు తోడు మండేలాకు ఇంటిని చక్కదిద్దుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. విన్నీ సొవెటోకు చెందిన ఓ యువకుడిని హత్య చేయించినట్లు ఆరోపణలు రావడంతో ఆయన ఆమెకు విడాకులు ఇచ్చారు. తాను జైలులో ఉన్నప్పుడు ఏఎన్‌సీ తమ శత్రువులను హింసించిందని మండేలా ఒప్పుకున్నారు. అయితే మండేలా మొజాంబిక్ అధ్యక్షుడుగా పనిచేసిన దివంగత నేత సమోరా మాచెల్ భార్య గ్రాసా మాచెల్‌తో ప్రేమలో పడ్డారు. ఇద్దరు ఒకరంటే ఒకరు ఇష్టపడ్డా తాము తమతమ దేశాలలో తిరుగులేని నేతలు కాబట్టి ప్రజల మనసు నొప్పించకుండా ఉండడానికి వివాహం చేసుకోకూడదని నిశ్చయించుకున్నారు.

మండేలా... ప్రభుత్వంపై ఒత్తిడి తేవడానికి ప్రపంచ దేశాల పర్యటనను ప్రారంభించాడు. గొప్ప రాజనీతిజ్ఞుడిగా దేశదేశాలు ఆయనకు బ్రహ్మరథం పట్టాయి. అమెరికా కాంగ్రెస్‌ను ఉద్దేశించి ప్రసంగించాడు. తమ దేశ భవిష్యత్తు తనమీదే ఆధారపడి ఉందని దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి పరోక్షంగా సూచించాడు. నూతన దక్షిణాఫ్రికాను నిర్మించడానికి జాతుల సమత్వాన్ని పాటించక తప్పదని మండేలా స్పష్టం చేశాడు. పూర్తిగా ముగియని ఓ యుద్ధానికి, పునర్నిర్మాణానికి మధ్య ఊగిసలాడుతున్న స్థితిలో 1993లో మండేలాకు ఆయన ప్రత్యర్థి, ప్రభుత్వాధినేత ఎఫ్.డబ్ల్యు. డె క్లార్క్‌కు సంయుక్తంగా నోబెల్ బహుమతి లభించింది. నూతన దక్షిణాఫ్రికాలో 1994లో జరిగిన ఎన్నికల్లో ఆజానుబాహువైన మండేలా తొలి, నల్ల జాతి అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. ఆయన సారథ్యంలో అసమానతలకు నెలవైన ఆ సమాజం సమానత్వం దిశగా అడుగులు వేసింది.

అధ్యక్షుడు మండేలా ముందు కొండంత సమస్యలు కొలువుదీరాయి. జులులు, ఇతర జాతుల మధ్య రక్తం ఏరులై పారుతోంది. ఆ భీకర జాతి పోరాటాన్ని ఆపడానికి మండేలా నడుం బిగించాడు. చర్యలు చేపట్టాడు. విదేశీ పెట్టుబడులే దేశాన్ని ఉద్ధరిస్తాయని ఆయన నమ్మాడు. వాటికోసం తీవ్రంగా ప్రయత్నించాడు. యుద్ధ నేరస్తులు, ఇతర రాజకీయ నేరస్తులు స్వచ్ఛందంగా ముందుకువచ్చి తమ వివరాలు వెల్లడించడానికి 'సత్యం, సౌభ్రాతృత్వ పునర్నిర్మాణాల' కమిషన్‌ను ఆయన నియమించారు. అయితే ఎవరు పెద్దగా ముందుకురాలేదు. యుద్ధ, రాజకీయ నేరస్తులకు ఆయన సామూహికంగా క్షమాభిక్ష పెట్టడాన్ని నల్ల జాతీయులు తీవ్రంగా నిరసించారు. మరోపక్క దేశంలో నేరాలు, ఘోరాలు పెరిగాయి. జాతి వివక్షతకు కొమ్ము కాసిన పోలీసులు వీటిని అడ్డుకోవడంలో అసమర్థులయ్యారు. దీంతో విప్లవానికి నేతృత్వం వహించి అధికారం చేజిక్కించుకోవడం, అధికారంలో ఉంటూ దేశాన్ని ఏలడం రెండు వేరువేరు విషయాలని ఆయనకు అర్థం అయింది. మొదటి విషయంలో ఆయన విజయవంతమైనా రెండవ విషయంలో ఆయన అంత సఫలీకృతుడు కాలేదనే చెప్పవచ్చు!

1861-
1941

# రవీంద్రనాథ్ టాగూర్

'విశ్వ మానవుడు', 'ప్రపంచం మొత్తానికి చెందిన మనిషి' ఈ పదాలకు సరైన నిర్వచనం గురుదేవులు రవీంద్రనాథ్ టాగూర్. భారత ఉపఖండంలో ఎందరికో స్ఫూర్తిదాయకమైన బెంగాలీ సాహిత్యాన్ని ప్రపంచానికి పరిచయం చేసిన మహాకవి. భారతీయులు ఇప్పటికీ ప్రతి దినం పాడుకునే జాతీయ గీతం 'జనగణమన' సృష్టికర్త. పాటలు, గేయాలతో సుసంపన్నమైన బెంగాలీ సాహిత్యంలో రవీంద్రుడికి ప్రత్యేక స్థానం ఉన్నది. 1971లో బంగ్లాదేశ్ ప్రత్యేక దేశంగా అవతరించినప్పుడు తమ జాతీయగీతంగా రవీంద్రుడు రచించిన మరో ప్రసిద్ధ గేయం 'అమర్ సోనార్ బంగ్లా'ను ఎన్నుకున్నారు. బెంగాలీ భాషలో రవీంద్రుని అజరామరమైన కవితలను ఇంగ్లీషులో తర్జుమా చేసిన తరువాత ఆ సాహితీ గుభాళింపు పశ్చిమదేశాలకు వ్యాపించింది. రవీంద్రుని గీతాలలో కవితాశక్తిని ఆస్వాదించిన స్వీడన్‌లోని నోబెల్ కమిటి 1913లో విశిష్ట సాహిత్యానికి గాను నోబెల్ బహుమతి అందజేసింది. ఆ రకంగా సాహిత్యంలో తొలిసారి నోబెల్ అందుకున్న మొదటి ఆసియావాసి రవీంద్రనాథ్ టాగూర్.

ఉత్తర కలకత్తాలోని సంపన్న కుటుంబంలో పద్నాలుగో సంతానంగా టాగూర్ 1861 మే 7న జన్మించాడు. తండ్రి, తాతలు, విద్యాసంపన్నులే కాకుండా బ్రిటీష్ సర్కార్‌కు, ప్రజలకు సన్నిహితంగా మెలిగిన వ్యక్తులు. ఏ పాఠశాలలోనూ చదవాల్సిన అవసరం రాని 'రవి'ని తాత, తండ్రి ఇంటి వద్దే మాస్టార్లను ఏర్పాటు చేసి విద్యాభ్యాసం చేయించారు. తాతగారితో కలిసి సాహిత్యపఠనం, అన్నలు, అక్కలతో కలిసి పాశ్చాత్య విద్యా నాగరికతలను నేర్చుకున్న రవి చిన్ననాటి నుంచీ దేనిపైనా అవ్యాజమైన అనురాగం లేదా ద్వేషాన్ని పెంచుకోలేదు. చిన్నప్పటి నుంచీ ప్రకృతిని ఆరాధించిన టాగూర్ తన తండ్రితో కలసి ఓసారి హిమాలయ సందర్శనకు వెళ్ళాడు. అక్కడ ప్రకృతి రమణీయత చూసి ఆయనలోని భావకవి ఉప్పొంగాడు. ఆ తరువాత 'రవి' తన మాతృభాష బెంగాలీలో గేయాలు, కథలు, కవిత్వం, నవలలు, వ్యాసాలు పుంఖాను పుంఖాలుగా రాయసాగాడు. టాగూర్ రాసిన గేయాలు, కవిత్వాన్నంతా 'రబీంద్ర సంగీత్' పేరుతో ఒక పాటల సంకలనంగా ప్రచురించారు.

రవీంద్రనాథ్ తాత ముత్తాతలు ఊరికి పెద్దవారవడం వల్ల వారిని టాగూర్లని పిలిచేవారు. బ్రిటిష్‌వారు ఠాకూర్ అని పిలవడానికి నోరు తిరగక టాగూర్ అని పిలిచేవారు. రాను రాను వారి వంశానికి టాగూర్ అన్న పేరు స్థిరపడి పోయింది. రవీంద్రుడి తండ్రి దేవేంద్రనాథ్ టాగూర్, తల్లి శారదాదేవి. ఇద్దరూ భారతీయ సంస్కృతిని, కళలను ఎంతో అభిమానించేవారు. రవీంద్రుడు చిన్నప్పటి నుంచి ప్రకృతి సౌందర్యోపాసకుడు. సాయం సమయాల్లో తన ఇంటివద్ద ఉన్న ఉద్యానవనాల్లో ప్రకృతిని ఆరాధిస్తూ గంటలు, గంటలు గడిపి ఆ ఆనందాన్నంతా కవిత్వంగా మలిచేవాడు. కేవలం కవిత్వమే పరమావధిగా పెట్టుకున్న కొడుకును మార్చాలంటే పెళ్ళి ఒక్కటే మార్గమని భావించిన దేవేంద్రనాథ్ 1883లో రవికి పెళ్ళిచేశాడు.

అన్ని కళల్లోనూ ప్రవేశం సంపాదించిన రవీంద్రుడు ఆరు దశాబ్దాల కాలంలో 2500 పాటలు, 2000పైగా పెయింటింగ్స్, 28 సంపుటాల కవిత్వం, నాటకాలు, చిన్న కథలు, నవలలు, వ్యాసాలు ఉత్తరాలు లెక్కలేనన్ని రాశాడు. అప్పట్లో రవీంద్రనాథ్ టాగూర్ పేరొక్కటే ఆసియా దేశాలన్నింటిలోనూ సుపరిచితమైనది. 1912లో రవీంద్ర విరచితమైన 'గీతాంజలి' పాటల సంకలనం

అతనికి ఒక్కసారిగా ఎనలేని పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టింది. గీతాంజలి ఇంగ్లీషు అనువాదం చూసి నోబెల్ కమిటీ ఏకగ్రీవంగా ఆ ఏటి నోబెల్ సాహిత్య పురస్కారం రవీంద్రునికి ప్రకటించింది. గీతాంజలే కాకుండా చిన్న కథలు, గల్పికలు రాయడంలో రవీంద్రునిది అందెవేసిన చెయ్యి. ఆయన రాసిన కాబూలీవాలా, బాబూస్ ఆఫ్ నయన్ జోర్, చారులత వంటివి పిల్లలకు పాఠ్యాంశాలుగా చోటు చేసుకున్నాయి.

పిల్లల విద్యాభ్యాసం, ప్రకృతిలో మమేకమై వారు చదవాలని గట్టిగా అభిలషించిన రవీంద్రుడు తన కలల పంట అయిన శాంతినికేతన్‌ను కలకత్తా సమీపంలో స్థాపించాడు. మొదట్లో పాఠశాలగా మొదలైన శాంతినికేతన్ విశ్వభారతి క్రమంగా విశ్వవిద్యాలయ స్థాయికి ఎదిగింది. ఈ శాంతినికేతన్‌లోనే ఇందిరాగాంధీ, అమర్త్యసేన్, సత్యజిత్ రే వంటి మహామహులు ఎందరో చదువుకున్నారు. 'జనగణమన' 'అమర్ సోనార్ బంగ్లా' వంటి దేశభక్తి గీతాలు రాసినప్పటికీ మొదట్లో జాతీయ భావాలు ఆయనను అంతగా ప్రభావితం చేయలేదు. బ్రిటీషర్లు, యూరోపియన్ల నుంచి నేర్చుకోవలసింది ఎంతో ఉందన్నది ఆయన అభిమతం. అయితే ఆయనెప్పుడూ బ్రిటీష్‌వారికి తన మద్దతు ప్రకటించలేదు. అదే సమయంలో వారిని



దేశం నుంచి తరిమికొట్టాల్సిందిగా పిలుపూ ఇవ్వలేదు. కాని 1919లో జలియన్‌వాలాబాగ్ నరమేధం ఆయన మనస్సును తీవ్రంగా కలచివేసింది. తనకు బ్రిటిష్ సర్కార్ ప్రదానం చేసిన బిరుదులన్నింటినీ ఆయన త్యజించాడు. మహాత్మాగాంధీతో స్వాతంత్ర్యపోరాటంపై అనేకసార్లు సమాలోచనలు జరిపాడు. రాను రాను రవీంద్రుని రచనలకు ప్రభావితులైన అనేక మంది యువతీ యువకులు, పెద్దలు ఆయన్ను బ్రిటిష్ వారి నిరంకుశత్వాన్ని ప్రతిఘటిస్తూ రచనలు చేయమని కోరారు. దేశభక్తిని నరనరాన జీర్ణించుకొన్న రవీంద్రుడు తన రచనల ద్వారా మాతృభూమికి దాస్య విముక్తి కలిగించడానికి విశేషంగా పాటుపడ్డాడు. 1901లో శాంతినికేతన్ ప్రారంభించిన రవీంద్రుడు తన ధ్యాసనంతా దాని మీదే కేంద్రీకరించాడు. రత్నాల్లాంటి విద్యార్థులను తయారు చేయడంలో సఫలీకృతుడయ్యాడు. శాంతినికేతన్‌లో విద్యార్థులకు కేవలం చదువులు మాత్రమే కాకుండా సంగీతం, చిత్రకళలు, ఆటపాటల్లో కూడా నిపుణుల చేత శిక్షణ నిప్పించేవాడు. ప్రపంచ ప్రజలందరూ ఒక్కటేనని, దేశాలు, ప్రాంతాలు, భాషా, మత విభేదాలు మరచి మానవులందరూ తమ అభివృద్ధి కోరి కృషి చేయాలని సందేశమిచ్చిన రవీంద్రనాథ్ టాగూర్ విశ్వకవి.

తన ఎనభైయ్యవ యేట 1941లో రవీంద్రనాథ్ టాగూర్ మరణించాడు. టాగూర్ మరణవార్త తెలిసిన వెంటనే మహాత్మాగాంధీ సహా జాతీయనాయకులందరూ కలకత్తా చేరుకున్నారు. టాగూర్, మహాత్మాగాంధీ ఇద్దరూ విశిష్ట వ్యక్తులనీ, అలాంటివారు మళ్ళీ జన్మించాలంటే కొన్ని తరాల దాకా వేచి చూడాల్సి ఉంటుందని నెహ్రూ తన కూతురు ఇందిరాగాంధీకి రాసిన లేఖలో పేర్కొన్నాడు.

# ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్

"ఈ ప్రపంచం ఒక విపత్కర పరిస్థితిలో ఉన్నప్పుడు భగవంతుడు, ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ అనే మంచి మనిషికి శ్వేత సౌధం బాధ్యతలు అప్పగించాడు, అందుకు ప్రజలు ఆ దేవుడికి వేల వేల ధన్యవాదాలు అర్పిస్తారు" రూజ్వెల్ట్ చనిపోయినప్పుడు 'న్యూయార్క్ టైమ్స్' తన సంపాదకీయంలో పేర్కొన్న మాటలివి. రెండో ప్రపంచయుద్ధం వల్ల కలిగిన వినాశనాన్ని చూసి ప్రజలు అల్లాడుతున్నప్పుడు వివిధ దేశాల సహాయంతో 'ఐక్యరాజ్య సమితి' అనే విశిష్ట సంస్థను స్థాపించిన మహామనిషి ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్. స్వేచ్ఛ, సమానత్వాలను కాంక్షించే ప్రతి మనిషికి రూజ్‌వెల్ట్ జీవితం ఆదర్శప్రాయమని అప్పట్లో పలువురు మేధావులు అతనికి నివాళులర్పించారు. అమెరికా చరిత్రలో ఒకే వ్యక్తి దేశాధ్యక్షుడిగా నాలుగుసార్లు పదవీ బాధ్యతలు నిర్వహించడం రూజ్వెల్ట్‌కే సాధ్యమైంది.

ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్ 1882 జనవరి 30న న్యూయార్క్, హైడ్ పార్క్ స్ప్రింగ్‌వుడ్‌లో జన్మించారు. సంపన్న కుటుంబీకులైన జేమ్స్, సారా రూజ్వెల్ట్‌ల ఏకైక కుమారుడైన రూజ్వెల్ట్ హార్వర్డ్ యూనివర్శిటీ నుంచి 1903లో పట్టభద్రుడైయ్యాడు. ఆ తరువాత కొలంబియా యూనివర్శిటీలో న్యాయశాస్త్రం అధ్యయనం చేశాడు. న్యూయార్క్ సిటీలోని ఒక కోర్టులో మూడేళ్ళు న్యాయవాదిగా ప్రాక్టీస్ చేసినప్పటికీ రూజ్వెల్ట్‌కు తన వృత్తి సంతృప్తినివ్వలేదు. చక్కటి వాగ్ధాటి, సమయస్ఫూర్తితో ఎవరినైనా ఆకట్టుకోగల రూజ్వెల్ట్ ఇక రాజకీయాల్లో తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలనుకున్నాడు. 1910లో ఎంతో ఆత్మవిశ్వాసంతో రూజ్వెల్ట్ న్యూయార్క్ సెనేట్‌కు పోటీ చేసి గెలుపొందాడు. 1917 ఏప్రిల్‌లో అమెరికా మొదటి ప్రపంచయుద్ధంలో అడుగుపెట్టింది. ఆ సమయంలోనే అమెరికా నౌకాదళ విభాగంలో సహాయమంత్రిగా ఉన్నారు. ఎన్నో యుద్ధతంత్రాలను ఆయన రచించాడు. 1918లో ఆయన యూరప్‌లోని యుద్ధ క్షేత్రాలలో పర్యటించారు. అక్కడే వివిధ దేశాధినేతలు, సైనిక ఉన్నతాధికారులను రూజ్వెల్ట్ కలిశాడు. మొత్తంమీద మొదటి ప్రపంచయుద్ధం ముగిసేనాటికి రూజ్వెల్ట్ అమెరికాలో ఒక జాతీయ నాయకుడిగా ఎదిగారు.

1921 ఆగస్ట్ 9న కాంప్‌బెల్ దీవుల్లో విహారయాత్ర కెళ్ళిన రూజ్వెల్ట్ నౌకలో విహరిస్తుండగా పట్టుతప్పి నీళ్ళలో పడిపోయాడు. అతనికి తీవ్రంగా జలుబు చేసింది. మరుసటి రోజు అది జ్వరానికి దారితీసింది. వారం గడిచేసరికల్లా రూజ్వెల్ట్ తన కాళ్ళు, చేతులను కదల్చలేకపోయారు. కనీసం చేతిలో పెన్ను పట్టుకొని రాయలేకపోయాడు. డాక్టర్లు రూజ్‌వెల్ట్‌కు పోలియో మెల్లిటిస్ అనే వ్యాధి సోకిందని నిర్ధారించారు. ఏడాది పాటు మంచంలోనే గడిపిన రూజ్వెల్ట్ ఇక కోలుకోలేడని డాక్టర్లు నిర్ధారించారు. రూజ్వెల్ట్ కష్టాలను చూడలేకపోయిన అతని తల్లి రాజకీయాలనుంచి విరమించుకోవాలని కొడుక్కి నచ్చచెప్పింది. కానీ రూజ్వెల్ట్ విధికి ఎదురొడ్డి నిలిచాడు. భార్య సహాయంతో మెల్లగా నడవడం ప్రారంభించాడు. క్రమంగా చేతి కర్ర సాయంతో అటూ ఇటూ తిరిగే స్థాయిని సంతరించుకొన్న రూజ్వెల్ట్ డాక్టర్ల సలహాతో జార్జియాలోని వేడినీటి బుగ్గలలో ఈదుతూ సేదతీరసాగాడు. అగ్ని పర్వతం నుంచి ఉద్భవించే ఆ వేడినీటి బుగ్గల్లో ట్రీట్‌మెంట్ వల్ల క్రమేణా ఆయన ఆరోగ్యం బాగుపడింది. అయితే అది ఎంతో ఖర్చుతో కూడుకున్నది. ఎందరో పేద రోగులు, పోలియో బారినపడ్డ పిల్లలు అంత ఖర్చు భరించలేకపోవడం చూసిన రూజ్వెల్ట్ తన ఆస్తిని అమ్మి ఆ వేడినీటి బుగ్గల్లో కొన్నింటిని కొన్నాడు. అలా పేదవారి కోసం ఖర్చు లేకుండా, ఆ చికిత్సను రూజ్వెల్ట్ ఉచితంగా అందించాడు.

ఇక రాజకీయాలలోకి రాలేనేమో అనుకున్న రూజ్వెల్ట్ 1924లో మళ్ళీ ప్రజల దృష్టిలో పడ్డాడు. న్యూయార్క్ గవర్నర్‌గా ఉన్న ఆల్ఫ్రెడ్ స్మిత్‌ను డెమొక్రాటిక్ పార్టీ తరఫున ప్రెసిడెంట్ అభ్యర్థిగా రూజ్వెల్ట్ ప్రతిపాదించాడు. పోలియోబారిన పడ్డ మూడేళ్ళకు బహిరంగ వేదికపై ఉపన్యసించేందుకు రూజ్వెల్ట్ మెల్లగా కదిలి మైకును అందుకున్నాడు. గంట సేపు నిలబడి మాట్లాడిన రూజ్వెల్ట్‌ను

చూసి సభికులు చలించిపోయారు. విచిత్రమేమిటంటే ఆల్ఫ్రెడ్ ఆ పదవికి నామినేట్ కాకపోయినా రూజ్వెల్ట్ మాత్రం అందరి దృష్టిని ఆకర్షించాడు. 1928లో పోలియో వ్యాధి నుంచి కోలుకున్న రూజ్వెల్ట్ న్యూయార్క్ గవర్నర్‌గా ఎంపికయ్యారు. ఆర్థిక మాంద్యం, రైతులకు గిట్టుబాటు ధరలు లభించని పరిస్థితుల్లో న్యూయార్క్ గవర్నర్‌గా ఎన్నో సంస్కరణలకు ఆయన శ్రీకారం చుట్టాడు. 1932లో డెమొక్రాటిక్ పార్టీ తరఫున రూజ్వెల్ట్ అమెరికా అధ్యక్షపదవికి పోటీ చేశారు. ఆ ఎన్నికల్లో రికార్డు స్థాయిలో రూజ్వెల్ట్‌కు 472 ఎలక్ట్రోరల్ ఓట్లు రాగా అతని ప్రత్యర్థికి కేవలం 159 మాత్రమే వచ్చాయి.

తన 51వ ఏట 1933 మార్చి 4న రూజ్వెల్ట్ అమెరికా అధ్యక్షుడిగా పదవీ బాధ్యతలు స్వీకరించారు. ఆ సమయంలో అమెరికాలో తీవ్రమైన ఆర్థిక మాంద్యం మూడో ఏట కొనసాగుతోంది. అప్పటి వరకూ బహుశా అమెరికా చరిత్రలో అవే అత్యంత గడ్డు రోజులు. వేలాది ఫ్యాక్టరీలు మూతపడ్డాయి. పంటలకు సరైన ధరల్లేక పొలాల్లోనే లక్షల టన్నుల ఆహార ధాన్యాలు, పండ్లు కుళ్ళిపోతున్నాయి. ప్రతి నలుగురు అమెరికన్లలో ఒకరు నిరుద్యోగి. బ్యాంకింగ్ వ్యవస్థ కుప్పకూలిపోయింది. ఏ రకంగా చూసినా అత్యంత దయనీయ స్థితిలో ఉన్న దేశానికి అధ్యక్షుడయ్యాడు రూజ్వెల్ట్. అధికార బాధ్యతలు చేపట్టగానే రూజ్వెల్ట్ రైతుల సంక్షేమానికి నడుం బిగించాడు. గిట్టుబాటు ధరలు రాకపోతే సబ్సిడీ ఇవ్వడం ప్రారంభించాడు. రూజ్వెల్ట్ చేసిన వ్యవసాయ సంస్కరణలను ఇప్పటికీ విప్లవాత్మకమైనవిగా చెప్పుకుంటారు. మెరుగైన ఉత్పత్తులు చేసేందుకు ఫ్యాక్టరీలను ఆధునీకరించే పనిని చేపట్టాడు. అందరితో మంచిగా ఉండే అధ్యక్షుడికి చక్కటి సలహాదారులు తోడు కావడంతో నిరుద్యోగ సమస్యను కూడా పరిష్కరించగలిగారు. అక్టోబర్ విప్లవం తరువాత ఆగిపోయిన అమెరికా-రష్యా వ్యాపార, వాణిజ్యాలు రూజ్వెల్ట్ హయాంలో మళ్ళీ మొదలయ్యాయి. ఈ రకంగా రూజ్వెల్ట్ అధ్యక్షుడిగా నాలుగేళ్ళు సాధించిన ప్రగతితో రెండోసారి ఎన్నికల్లో నిలబడ్డారు. రెండోసారి జరిగిన ఎన్నికల్లో ఆయనకు 523 ఓట్లు లభిస్తే ప్రత్యర్థికి 8 ఓట్లు మాత్రమే వచ్చాయి. రెండోసారి పదవిని చేపట్టిన రూజ్వెల్ట్ సంస్కరణలు, పురోభివృద్ధిని కొనసాగించాడు. జపాన్, జర్మనీ, ఇటలీ, రష్యా ప్రాబల్యాలకు చెక్ పెట్టేందుకు ప్రపంచ దేశాలను సమీకరించాడు.

సాధారణంగా ఒక వ్యక్తి రెండుసార్లు మాత్రమే అధ్యక్ష పదవిని నిర్వహిస్తే, యూరప్, పశ్చిమదేశాల్లో కమ్ముకున్న యుద్ధ వాతావరణం రూజ్వెల్ట్ మూడోసారి అమెరికా అధ్యక్షుడిగా ఎంపిక కావడం సులభతరం చేసింది. అమెరికన్లకు యుద్ధ భయం లేకుండా చేస్తానన్న హామీతో రూజ్వెల్ట్ హ్యాట్రిక్ సాధించాడు. 1941లో బ్రిటన్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్‌తో రూజ్వెల్ట్ అట్లాంటిక్ చార్టర్ ఒప్పందాన్ని కుదుర్చుకున్నాడు. జర్మన్ నాజీలతో పాటు అమెరికా జపాన్‌కు బద్ధ విరోధిగా మారింది. ఈలోగా తటస్థంగా ఉన్న అమెరికాపై జపాన్ వాయుసేన పెరల్‌హార్బర్‌పై దాడి చేసింది. ప్రజామోదంతో రూజ్వెల్ట్ జపాన్‌పై యుద్ధానికి దిగుతున్నట్లు ప్రకటించారు. మరోవైపు జపాన్‌కు బాసటగా జర్మనీ, ఇటలీ అమెరికాపై యుద్ధాన్ని ప్రకటించాయి. ఈలోగా హిట్లర్ యూరప్‌లో మరింత బలం పుంజుకోవడంతో చర్చిల్ సూచన మేరకు రూజ్వెల్ట్ ఆయనతో కలిసి యాల్టాలో స్టాలిన్‌తో సమావేశమయ్యారు. మహామహులు ముగ్గురు కలవటంతో హిట్లర్, ముస్సోలిని కలలు కల్లలయ్యాయి. పెరల్ హార్బర్‌పై దాడికి ప్రతీకారంగా అమెరికా శక్తివంతమైన రెండు అణుబాంబులను హిరోషిమా, నాగసాకిలపై ప్రయోగించింది. జపాన్ లొంగిపోయింది. రెండో ప్రపంచ యుద్ధం ముగిసింది. అమెరికాను ఒక అగ్రరాజ్యంగా నిలిపి ప్రజల హృదయాల్లో చెక్కుచెదరని స్థానాన్ని అధిష్ఠించిన రూజ్వెల్ట్ నాలుగోసారి కూడా అధ్యక్షుడిగా పోటీ చేసి గెలుపొందారు. అలా నాలుగుసార్లు అధ్యక్ష స్థానాన్ని కైవసం చేసుకొని అమెరికా చరిత్రలో అత్యంత దీర్ఘకాలం అధ్యక్షునిగా కొనసాగిన రూజ్వెల్ట్ పదవిలో ఉండగానే 1945 ఏప్రిల్ 12న మెదడులో రక్తనాళాలు చిట్లడంతో మరణించారు.

1887-1920

# శ్రీనివాస రామానుజన్

గణితంలో ప్రపంచానికి దిశానిర్దేశం చేసింది భారతీయులైన ఆర్యభట్ట, వరాహమిహిర, భాస్కరాచార్యులు. కొన్ని శతాబ్దాల తర్వాత అంతటి ప్రతిభతో పాశ్చాత్యులను ఆశ్చర్యానికి గురిచేసిన భారతీయ గణిత శాస్త్రవేత్త శ్రీనివాస రామానుజన్. భారతదేశంలోనే కాదు, అఖిల ప్రపంచం నీరాజనాలు అందుకున్న మేధావి శ్రీనివాస రామానుజన్. ఆయన తన నోటు బుక్కుపై రాసుకున్న కొన్ని లెక్కలు ఇప్పటికీ గణిత శాస్త్రజ్ఞులకు అంతు బట్టలేదంటే రామానుజన్ ఎంతటి మేధావో అర్థం అవుతుంది. చిత్రం ఏమిటంటే ఆయనకు గురువు ఎవరూ లేరు. అంకెలంటే ఇష్టం. ఆ ఇష్టమే ఆయనను మహామేధావిగా మార్చింది.

1887 డిసెంబర్ 22న తమిళనాడులోని ఈరోడ్‌లో రామానుజన్ జన్మించాడు. 13వ ఏట ఆయనకు 'లోనీస్ ట్రిగనామెట్రీ' అనే పుస్తకం దొరికింది. దాన్ని ఔపోసన పట్టిన రామానుజన్ ఆసక్తి చూసి ఓ పెద్ద మనిషి జార్జ్‌కార్ రాసిన 'సినాప్సిస్ ఆఫ్ ఎలిమెంటరీ రిజల్ట్స్ ఇన్ ప్యూర్ అండ్ ఎప్లయిడ్ మ్యాథమాటిక్స్' అనే పుస్తకం బహుకరించాడు. తన ఆలోచనలను, రూపొందించిన సూత్రాలను రామానుజన్ ఒక నోటు బుక్కులో రాసుకునే వాడు. అలా ఆయన రాసుకున్న మూడు పుస్తకాలు అనంతరం గణిత శాస్త్ర ప్రపంచంలో 'రామానుజన్స్ ఫ్రేడ్ నోట్‌బుక్స్'గా ప్రఖ్యాతి పొందాయి.

ప్రపంచ ప్రసిద్ధ కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ లెక్కల ప్రొఫెసర్ గాడ్‌ఫ్రే హార్డీకి ఓ రోజు భారతదేశం నుంచి ఒక ఉత్తరం అందింది. ఆ ఉత్తరంపై ఫ్రం అడ్రసు శ్రీనివాస రామనుజన్ అని ఉంది. ఈ కొత్త పేరు గురించి ఆలోచిస్తూ హార్డీ ఆ కవరును తెరిచారు. అందులో దాదాపు 120 లెక్కల సిద్ధాంతాలు, సమీకరణాలు, ఆవిష్కరణలు ఉన్నాయి. వీటన్నింటిని తానే కనిపెట్టానని రాసుకున్న రామానుజన్ వాటిపై హార్డీ అభిప్రాయాన్ని అడిగారు. హార్డీకి ఇలాంటి ఉత్తరాలు చాలా వచ్చేవి. ఈ సిద్ధాంతం నేనే కనిపెట్టాను, నా లెక్కలతో ప్రపంచ గతిని మార్చేస్తా అంటూ కొన్ని తిక్క కేసులు ఇలా అర్థం పర్థంలేని ఉత్తరాలు హార్డీకి పంపేవారు. ఇది కూడా అలాంటి కేసేననుకున్న హార్డీ అయిష్టంగానే కొన్ని పేజీలు తిరగేశాడు. రామానుజన్ రాసిన థియరీల్లో కొన్ని అర్థం కాకుండా ఉన్నాయి. మరికొన్ని అప్పటికే ప్రచారంలో ఉన్నాయి. ఈ రామానుజన్ ఎవడో మోసగాడిలా ఉన్నాడే అని అనుకున్న హార్డీ ఆ ఉత్తరాన్ని షెల్ఫ్‌లోకి గిరాటు వేశాడు. కానీ రామానుజన్ రాసిన కొన్ని సిద్ధాంతాలు హార్డీ మనస్సులోనుంచి చెరిగిపోలేదు. వాటిలో ఏదో కొత్తదనం ఉన్నట్లుగానే కనబడింది. రామానుజన్ ఉత్తరాన్ని మరోసారి చేతిలోకి తీసుకున్న హార్డీ తన విశ్వవిద్యాలయం కేంబ్రిడ్జ్‌కు చెందిన మరో లెక్కల మేధావి జె.ఇ. లిటిల్ వుడ్‌ను తన కార్యాలయంలోకి రమ్మని పిలిచాడు. ఆ రోజు సాయంత్రం ఇద్దరూ కూర్చుని రామానుజన్ థియరీలను విశ్లేషించడం ప్రారంభించారు. అర్థరాత్రి గడిచేసరికల్లా వారికి శ్రీనావాస రామానుజన్ ఒక అపూర్వ గణిత మేధావి అని బోధపడసాగింది. రామానుజన్ కనిపెట్టిన అన్ని సిద్ధాంతాలూ అపూర్వమైనవి. సరికొత్తవి. ఒక్క సిద్ధాంతాన్ని కనిపెట్టి నానా విధమైన యాగీ చేసే ఎందరో లెక్కల మేధావులతో పోల్చితే రామానుజన్ 120 సరికొత్త సిద్ధాంతాలను సంపూర్ణంగా హార్డీకి ఉత్తరం ద్వారా పంపాడంటే అతని విశ్వసనీయతపై ఆ ఇద్దరికీ ముచ్చటేసింది. 1913వ సంవత్సరంలో జరిగిన ఈ సంఘటన భారత గణిత శాస్త్ర చరిత్రను ఒక మలుపు తిప్పింది. పేద కుటుంబంలో పుట్టిన రామానుజన్ అప్పట్లో మద్రాసు పోర్ట్ ట్రస్ట్‌లో గుమస్తాగా పనిచేసేవాడు. తిండికి, బట్టకు సరిపడే ఆదాయం మాత్రమే వచ్చేది.

రామానుజన్‌కు ముందు ఎన్నడో పురాణాల కాలంలో ఆర్యభట్ట, మిహిరకుడు, భాస్కరాచార్యులు లాంటి వారే మన దేశంలో చెప్పుకోదగ్గ గణిత శాస్త్రవేత్తలు. రామానుజన్ ప్రభావంతో ఎందరో విద్యార్థులు గణితాన్ని ఒక శాస్త్రంగా అధ్యయనం చేసేందుకు ముందుకు వచ్చారు. 1887లో పుణ్యక్షేత్రమున్న కుంభకోణం పట్టణంలో పేద అయ్యంగార్ కుటుంబంలో రామానుజన్ ప్రతిభను గుర్తించిన టీచర్లు అతనికి స్కూల్ టైంటేబుల్ వేసే బాధ్యత అప్పగించారు. 15 ఏళ్ల ప్రాయంలో కుంభకోణంలోని కళాశాల లైబ్రరీ కెళ్లిన రామానుజన్ రోజంతా శ్రమపడి ఒక పాత లెక్కల పుస్తకాన్ని ఇంటికి తెచ్చుకుని పరిశోధన ప్రారంభించాడు. లెక్కల్లో పూర్తిగా మునిగిపోయి మిగిలిన సబ్జెక్టులు పట్టించుకోకపోవడం వల్ల రామానుజన్ రెండుసార్లు ప్రీ డిగ్రీ పరీక్ష తప్పాడు. కుటుంబ భారం మోసేందుకు లెక్కల ట్యూషన్లు ప్రారంభించాడు. అయితే అతను చెప్పేది పిల్లల మెదళ్లకు ఎక్కకపోవడంతో ట్యూషన్‌కు వచ్చే పిల్లల సంఖ్య తగ్గిపోయింది. లెక్కల ప్రపంచం నుంచి దిగుతాడని భావించిన తల్లిదండ్రులు అతనికి 1909లో పదేళ్ల జానకి

అమ్మాళ్‌తో పెళ్లి జరిపించారు. రామానుజం లెక్కలపై ఆసక్తిని, అతని సిద్ధాంతాలు చూసిన అప్పటి నెల్లూరు జిల్లా కలెక్టర్ రామచంద్రరావు నెలకు కొంత మొత్తాన్ని స్టయిపెండ్ మంజూరు చేసేవారు. గణితం యావలో పడి తిండీ తిప్పలుకూడా పట్టించుకోని రామానుజన్‌కు ఒక్కోసారి తల్లి లేదా భార్య తిండి పెట్టేవారు.

అప్పట్లో మనదేశంలో రామానుజన్ లెక్కలను అర్థం చేసుకొని వాటిని విపులీకరించేవారు లేకపోవడంతో స్నేహితుల సలహాపై తన లెక్కలను ప్రపంచంలోని గణిత మేధావులకు రామానుజన్ పంపేవాడు. ఆ క్రమంలోనే కేంబ్రిడ్జ్ ప్రొఫెసర్ హార్డీకి కూడా తన లెక్కల థియరీలను పంపాడు. రామనుజన్ గొప్పదనాన్ని గ్రహించిన హార్డీ, లిటిల్‌వుడ్ అతన్ని ఎలాగైనా లండన్ రప్పించాలనుకున్నారు. అయితే రామానుజన్ సముద్రాలు దాటి లండన్ వెళ్తే కులభ్రష్టులవుతామన్న భయంతో అతని తల్లి సమ్మతించలేదు. ఎలాంటి డిగ్రీలు లేకపోయినా 1913లో మద్రాసు యూనివర్శిటీ రామానుజన్‌కు రీసెర్చ్‌కోసం రెండేళ్లపాటు నెలకు 75 రూపాయల ఉపకారవేతనాన్ని మంజూరు చేసింది. ఆర్థికంగా కొంత వెసులుబాటు రావడంతో ఇక లండన్‌కు వెళ్లే ఆలోచన మానుకున్నాడు.

రామానుజన్ లండన్ ప్రయాణాన్ని వ్యతిరేకించిన అతని తల్లి చిత్రంగా ఒకరోజు కేంబ్రిడ్జ్‌కు వెళ్ళేందుకు సమ్మతించింది. దీంతో రామానుజన్ 1914 ఏప్రిల్‌లో కేంబ్రిడ్జ్‌లోని ట్రినిటి కాలేజ్‌కు చేరుకున్నాడు. అతనికి హార్డీ ఇతర ప్రొఫెసర్లు హార్దికంగా స్వాగతం పలికారు. పంచె, ఉత్తరీయం పిలకముడితో పూర్తి సనాతన భావాలున్న రామానుజన్‌కు లండన్ కొత్త ప్రపంచంలా కనబడింది. హార్డీ రామానుజన్‌ల జంట కలిసి కూర్చుని నెలల తరబడి గణితంలో ఎన్నో అపూర్వ సిద్ధాంతాలను ఆవిష్కరించారు. నాస్తికుడు, క్రీడాప్రియుడు, ఆధునిక భావాలున్న 37 ఏళ్ల హార్డీతో పూర్తిస్థాయి ఆస్తికుడు, పచ్చి శాకాహారి, మడి, ఆచారపరాయణుడైన 27 ఏళ్ల రామానుజన్‌కి దోస్తీ అక్కడున్న వాళ్ళందర్నీ ఎంతో ఆశ్చర్యపరిచింది. అపూర్వ మేధస్సున్న రామానుజన్ ఆవిష్కరించిన కొన్ని సిద్ధాంతాలు అప్పటికే యూరోపియన్ గణిత శాస్త్రవేత్తలు కనుగొన్న సంగతి హార్డీ అతనికి వివరించారు. అయితే రామానుజన్‌ను నిరుత్సాహ పరచకుండా హార్డీ అతని నుంచి అనేక విషయాలు నేర్చుకున్నానని చెప్పుకున్నాడు. ఆధునిక లెక్కలను హార్డీ నుంచి తెలుసుకున్న రామానుజన్ ప్రతిరోజూ అరడజను కొత్త సిద్ధాంతాలను చెప్పేవాడు. అయితే ఇంగ్లండ్ వాతావరణం రామానుజన్‌కు ఎంత మాత్రమూ నచ్చలేదు. తన వంట తానే చేసుకునేవాడు. కేంబ్రిడ్జ్‌లోని భారతీయులందరికీ తను వండింది పెట్టేవారు. మూడేళ్ళు గణితశాస్త్రంపై ఎన్నో ప్రయోగాలు చేసిన రామానుజన్‌కు రాను రాను లండన్ వాతావరణం దుర్భరంగా మారింది. 1917లో ఆయన ఆకస్మికంగా మంచానపడ్డాడు. క్షయ వ్యాధి అని అనుమానించారు. ఆహార లోపంవల్ల అతని శరీరంలో విటమిన్ లోపం ఏర్పడింది. రామానుజన్ దురదృష్టం కొద్దీ మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. అతన్ని పరీక్షించిన డాక్టర్లు రామానుజన్ తిరిగి భారత్‌కు వెళ్ళిపోతే ఆరోగ్యం బాగుపడవచ్చని సూచించారు. ప్రపంచ యుద్ధం కారణంగా మరో రెండేళ్ళపాటు ఆయన అక్కడే గడపాల్సి వచ్చింది. శ్రమపడి కనిపెట్టిన చాలా సిద్ధాంతాలు గతంలోనే యూరోపియన్ లెక్కల మేధావులు కనిపెట్టారని తెలియడంతో ఆ గణిత మేధావి మరింత కృంగిపోయాడు.

రాయల్‌సొసైటీకి, ఫెలో ఆఫ్ ట్రినిటి కాలేజి గౌరవానికి రామానుజన్ ఎంపిక కావడంతో అతని సొంత ఊరిలో ప్రజల ఆనందానికి అవధుల్లేవు. వ్యాధి తిరగబెట్ట డంతో రామానుజన్ 1919 ఫిబ్రవరిలో మద్రాసుకి తిరుగు పయనమయ్యాడు. రామానుజన్‌కు కనివినీ ఎరుగని రీతిలో స్వాగతం లభించింది. కుంభకోణం వచ్చిన తరువాత ఆరేడు నెలలు హార్డీ రామానుజన్‌ల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. తల్లి, భార్య శుశ్రూషలవల్ల ఆరోగ్యం కొద్దిగా మెరుగుపడినా అతడు సంపూర్ణ ఆరోగ్యవంతుడు కాలేక పోయాడు. చివరికి 1920 ఏప్రిల్ 26న రామానుజన్ తన 33వ ఏట చనిపోయారు. సముద్రాలు దాటి లండన్ వెళ్ళి ఎంతో పేరుప్రఖ్యాతులు గడించిన ఆ గణిత మేధావికి శ్రాద్ధ కర్మలు నిర్వహించేందుకు ఏ పండితుడు ముందుకు రాలేదు. రామానుజన్ అస్తమయం తరువాత అతను రాసిన ఎన్నో సమీకరణాలు ప్రస్తుత కంప్యూటర్ యుగంలో అవసరమవుతున్నాయి. రామానుజన్ లాంటి గణిత మేధావి మరో వందేళ్ల తరువాత అంటే ఇప్పుడు పుట్టి ఉంటే అతని అవసరాన్ని ప్రపంచం మరింత గుర్తించేదని మాడిసన్ విస్కన్‌సన్ యూనివర్శిటీ ప్రొఫెసర్ రిచర్డ్ ఆస్కే అన్నారు.

# రాణి మాత

బ్రిటన్ మహారాణి తల్లి లేడీ ఎలిజబెత్ బోవీస్ లీ ఆన్ అంటే అడాల్ఫ్ హిట్లర్ దృష్టిలో "యూరప్‌కెల్లా అత్యంత ప్రమాదకరమైన మహిళ". ఆమె బ్రిటిష్ మహారాణికి వెన్నుదన్నుగా ఉండడమే దీనికి కారణం. కానీ బ్రిటిష్ పౌరులకు మాత్రం రెండో ప్రపంచ యుద్ధకాలంలో ధైర్యసాహసాలు ప్రదర్శించిన అత్యంత ప్రీతిపాత్రమైన వ్యక్తి. రెండో ప్రపంచ యుద్ధ సమయంలో తీవ్రమైన దాడులు జరుగుతున్న సమయంలో రాణీమాత ఎక్కడబడితే అక్కడ ప్రత్యక్షమయ్యేది. యుద్ధ వాతావరణం కారణంగా కకావికలమైన తన జాతి జనులను ఊరడించేది. ఉత్సాహపరిచేది. యుద్ధంవల్ల కొంపా గోడు కోల్పోయిన వారిని పరామర్శించేది. ఆస్పత్రులలోకి వెళ్ళి గాయపడిన వారి యోగక్షేమాలు కనుగొనేది. ఆ సమయంలో రాజకుటుంబంలోని మిగతావారు తమ స్వదేశాలను వదలి వెళ్ళడమో, అజ్ఞాతంగా ఉండిపోవడమో చేస్తే ఆమె భర్త ఆరవ జార్జి ప్రజలను అంటి పెట్టుకుని ఉన్నాడు. వారు ప్రదర్శించిన ధైర్యసాహసాలను, ప్రజలపట్ల కనబరిచిన విశ్వాసాన్ని బ్రిటీష్ పౌరులు ఎన్నడూ మరచిపోలేదు. జార్జి ప్రజలలో మమేకం అయినందువల్ల ఆయనను ప్రజల ప్రభువు అనేవారు. ఎలిజబెత్‌ను రాజుకు దన్నుగా నిలిచిన ప్రబల శక్తిగా పరిగణించేవాడు.

ఆమె బొద్దుగా ఉండేది. విచిత్రంగా ఉండే పెద్ద టోపీ ధరించేది. అంతకు మునుపు 1936లో ఎనిమిదవ రాజు ఎడ్వర్డ్ సింహాసనాన్ని పరిత్యజించినప్పుడు బ్రిటిష్ రాజరికానికి ప్రమాదం ఏర్పడింది. అప్పుడు సిగ్గరి, నత్తి నత్తిగా మాట్లాడే ఆమె భర్త సింహాసనాన్ని అధిష్టించాడు. బహిర్ముఖ వ్యక్తిత్వం కలిగిన ఆకర్షణశక్తి, మృదు స్వభావం ఉన్న ఎలిజబెత్ నిరాసక్తంగా ఉన్న రాకుమారుణ్ని ఉత్సాహపరిచి అతడ్ని గౌరవప్రదమైన రాజుగా తీర్చి దిద్దింది. నిరంతరం జాగరూకంగా ఉండే ఆమె మార్గదర్శకత్వంలో రాజకుటుంబం మొత్తం దేశవాసుల హృదయాలను ఆకట్టుకునేదిగా తయారైంది.

1900 సంవత్సరం ఆగస్టు 4న జన్మించిన అందమైన ఈ మహిళ 1923 ఏప్రిల్ 26న యార్క్ ప్రభువు అయిన రాజకుమారుడు ఆల్బర్ట్‌ను పెళ్ళి చేసుకుంది. ఆమె స్కాట్‌లాండ్‌లోని హెర్ట్‌ఫోర్డ్ షైర్‌కి చెందింది. స్ట్రాత్‌మోర్ సామంత ప్రభువుకు, సామంత రాణికి జన్మించిన ఎలిజబెత్ ఏంజెలా మార్గరెట్ 'గ్లామిస్' రాజప్రసాదంలో పటిష్టమైన కోట గోడల నడుమ పెరిగింది. తల్లి దగ్గర ఎలిజబెత్ విద్యాబుద్ధులు నేర్చుకుంది. ఆ కాలంలోనే దృఢంగా వ్యవహరించే తత్వంగల విక్టోరియా రాణి గతించింది. రాకుమారుడి కంట పడేదాకా లేడీ ఎలిజబెత్ హడావుడి లేకుండా జీవించింది.

ఆల్బర్ట్, ఎలిజబెత్‌ల పెళ్ళి నిశ్చయమైన తీరు వారి స్వభావాన్ని తెలియజేస్తుంది. ఎలిజబెత్ అందానికి లోబడినప్పటికీ రాకుమారుడు ఆమెను పెళ్ళాడతానని స్వయంగా చెప్పేటంతటి చొరవ ప్రదర్శించ లేకపోయాడు. పెళ్ళి ప్రస్తావన తానే స్వయంగా తీసుకురాకుండా తన మిత్రుడి ద్వారా ఈ ప్రతిపాదన చేశాడు. ఎలిజబెత్ ఈ ప్రతిపాదనను చాలా మర్యాదగా తిరస్కరించి ఆల్బర్ట్ సొంతంగా ప్రతిపాదిస్తే అప్పుడు ఆలోచిస్తానని చెప్పింది. ఆల్బర్ట్ స్వయంగా ప్రతిపాదించిన తర్వాత నిస్సంకోచంగా అంగీకరించింది. "అతనిని పెళ్ళాడడం నా విధిగా భావించాను. ఆ తర్వాత బెర్టీతో ప్రేమలో పడ్డాను" అని ఎలిజబెత్ ఆ తర్వాత చెప్పింది.

1923లో వీరి నిశ్చితార్థం అనేక కారణాలవల్ల అలజడి రేపింది. అది ఎలిజబెత్ జన్మ హక్కు గురించి మాత్రమే కాదు, ఆమె కుటుంబానికి శతాబ్దాలుగా బ్రిటీష్ వారసత్వంతో సంబంధం ఉందని గొప్పలు చెప్పుకోవచ్చు. కానీ నేరుగా రక్తసంబంధీకులు కారు. అందువల్ల అంతకు ముందు 250 ఏళ్ల చరిత్రలో ఎప్పుడూ లేనట్టుగా ఒక సామాన్యురాలికి, రాజుకుమారుడికి మధ్య పెళ్ళి జరగాలంటే రాజు అంగీకారం అవసరం అయింది. అయిదవ జార్జి దీనికి అనుమతించాడు. సంకోచించే మనస్తత్వం, సిగ్గరి అయిన తన కొడుకు 'అదృష్టవంతుడు' అని జార్జి అన్నాడు. ఈ సందర్భంలో

వెస్ట్ మినిస్టర్ అబ్బీలో పెళ్ళి గంటలు మోగినప్పుడు లేడీ ఎలిజబెత్ వయస్సు కేవలం 23 మాత్రమే. విల్లులా వంపు ఉన్న పై కప్పు ఉన్న ఆ చర్చిలో రాజకుటుంబం పెళ్ళి జరగడం అన్నది అంతకు ముందు అయిదు వందల ఏళ్ల తర్వాత అదే మొదటి సారి.

లేడీ ఎలిజబెత్‌కు ఎలిజబెత్, మార్గరెట్ అనే ఇద్దరు కూతుర్లు పుట్టిన తరువాత, యార్క్ ప్రభువు భార్య అయిన తర్వాత కూడా ఆమె ఇంగ్లీషువారి రాజకీయ, సాంస్కృతిక జీవనానికి సంబంధించిన సకల పనులను చక్కబెట్టేది. ఆమె పొరపాటు అన్నది ఎరగనిది. సామాజికులతో కలివిడిగా ఉండేది. ఒక దశాబ్దం పాటు అనాథ శరణాలయాలకోసం కృషి చేసింది. రాజకుటుంబం గౌరవ మర్యాదలకు దీటుగా అనేక కార్యకలాపాల్లో పాల్గొనేది. కానీ ఎనిమిదవ ఎడ్వర్డ్ రాజ్యాధికార బాధ్యతలను పరిత్యజించడంతో ఆమె జీవితం ఉన్న పళంగా మారిపోయింది. ఎడ్వర్డ్ ఆయన ఉంపుడుగత్తె వాలిస్ సింప్సన్ ఎప్పుడూ ఇంగ్లండ్ నేలమీద కాలు పెట్టకుండా చేసింది ఎలిజబెత్. రాజకీయంగా కార్యదక్షత గల వ్యక్తి అయినందువల్ల అందమైన ఆ జంట అడ్డంకి కాగలదని ఆమె గుర్తించింది. రాజరికాన్ని పదిలం చేయాలన్నది ఆమె లక్ష్యం. 1936 డిసెంబర్ 10న ఆమె బావగారు సింహాసనాన్ని పరిత్యజించారు. ఆమె భర్త సింహాసనం అధిష్టించాడు. దానితో ఎలిజబెత్ కొత్త బాధ్యతలు స్వీకరించవలసి వచ్చింది. అయిదు నెలల తర్వాత ఆరవ జార్జి ఆమెకు 'లేడీ ఆఫ్ ది మోస్ట్ నోబుల్ ఆర్డర్ ఆఫ్ ది గార్టర్' అన్న బిరుదు ప్రధానం చేశాడు. ఆ తర్వాత కొద్దికాలానికే వారు పట్టాభిషిక్తులయ్యారు.

రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ఎలిజబెత్ బ్రిటన్‌లో మహిళా సేనలకు అధిపతి అయ్యారు. లండన్‌లో సాయుధ శకటంలో తిరుగుతూ కొంపా గోడు లేనివారి, నిర్భాగ్యుల బాగోగుల్ని చూసేది. అప్పుడప్పుడూ తన భర్త వెంట పర్యటనలకు వెళ్లేది. ఆమె చాలా అసాధారణమైన లక్షణాలు కలిగిన సామాన్యురాలు. అయినా ఎప్పుడూ రాజసం ఉట్టిపడేలా వ్యవహరించేది. యుద్ధం జరిగినన్నాళ్లూ ఆమె రాజవంశం వారు ధరించే వస్త్రాలు కాకుండా మామూలు వస్త్రాలు మాత్రమే వేసుకునేవారు. మామూలు స్త్రీలు ధరించే వస్త్రాలు ధరిస్తే ప్రజల్లో కలిసిపోవచ్చనేది ఆమె భావన. యుద్ధం బారిన పడిన పౌరుల బాగోగులు చూడడమే కర్తవ్యంగా పెట్టుకొని తన కూతుళ్లను సైతం భద్రతకోసం కెనడా పంపడానికి నిరాకరించారు. "నేను లేకుండా నా కుమార్తెలు వెళ్ళలేరు. రాజు లేకుండా నేను వెళ్ళను. ఎట్టి పరిస్థితుల్లోనూ రాజు వెళ్లే ప్రసక్తే లేదు" అని ఆమె ప్రకటించారు.

1952లో తన భర్త మరణించిన తర్వాత తన కూతురు రెండవ ఎలిజబెత్ పట్టాభిషిక్తురాలైనప్పుడు పుట్టెడు దుఃఖంలో కూడా కొత్త బాధ్యతలను తలకెత్తుకున్నారు. ఇప్పుడు ఆమె కేవలం రాజవంశానికి చెందిన సామాన్యురాలు మాత్రమే. గుర్రాల పోషణ, సాల్మన్ చేపలు పట్టడం, జిన్ అంటే ఇష్టపడడం ఆమె సరదాలు. అందుకే ది లండన్ టైమ్స్ పత్రిక "చపలత్వ లక్షణాలు" ఉన్న మహిళ అని రాసింది. క్లారెన్స్ హౌస్‌లో నివాసం ఉంటున్న రాణీమాత సుస్థిరతకు, కుటుంబ వ్యవహారాలలో సలహాలకు పెట్టింది పేరయ్యారు. తాను ఆధిపత్యం చెలాయించిన రోజుల్లో రాజకుటుంబం గౌరవ మర్యాదలు ఇనుమడింప చేయడానికి ఆ కుటుంబం మానవీయ విలువలతో మెలగడానికి తీవ్రంగా కృషి చేశారు. గత శతాబ్దం చివరి దశాబ్దంలో రాజకుటుంబ పరిశీలకులు ఆమెను 'దృఢంగా' వ్యవహరించే వ్యక్తిగా పరిగణించారు. విండ్సర్ రాజ ప్రసాదంలోని వారి జగడాలను, చిన్న చిన్న తప్పులను బయటకు పొక్కకుండా జాగ్రత్త పడ్డారు. ఇలా ప్రజల రాణిగా చిరకాలం గుర్తుండి పోయేటట్లు నాలుగు తరాల ప్రజల ప్రేమాభిమానాలు చూరగొన్న రాణిమాత 103 ఏళ్ళు జీవించి 2002 మార్చిలో నిద్రలోనే తుదిశ్వాస విడిచారు.

1921–
1992

# సత్యజిత్ రే

సినిమాకు సంబంధించిన అన్ని విభాగాల్లోనూ విశేష ప్రతిభ కనబరిచి, భారతీయ సినిమాకు ఖండాంతర ఖ్యాతిని ఆర్జించిపెట్టిన విశిష్ట దర్శకుడు సత్యజిత్ రే. తొలి చిత్రం 'పథేర్ పాంచాలి'తోనే కేన్స్ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో ఎవరీ దర్శకుడు అంటూ విదేశీ ప్రముఖులు, మేధావుల దృష్టిని ఆకర్షించిన సకల కళా వల్లభుడు. భారతీయ సినిమాను కొత్త దారి పట్టించి మానవతా విలువలను తన చిత్రాల్లో జొప్పించిన సత్యజిత్‌రేకు 1992లో ఆస్కార్ లైఫ్ టైమ్ ఎచీవ్‌మెంట్ అవార్డు లభించింది.

కలకత్తాలోని కళాకారులు, మేధావుల కుటుంబంలో సత్యజిత్ రే పుట్టారు. పసివాడుగా ఉన్నప్పుడే సత్యజిత్ రే తండ్రి మరణించడంతో తల్లి, పినతండ్రి కలిసి ఆయనను పెంచారు. 1940లో కలకత్తాలోని ప్రతిష్ఠాత్మక ప్రెసిడెన్సీ కళాశాల నుంచి పట్టభద్రుడైన తరువాత రే, రవీంద్రనాథ్ టాగూర్ స్థాపించిన శాంతినికేతన్‌లోని విశ్వభారతి యూనివర్సిటీలో ఉన్నత విద్యను కొనసాగించారు. కమర్షియల్ అడ్వర్టయిజింగ్‌లో పట్టా పుచ్చుకున్న రే మొదట్లో సిగ్నెట్ ప్రెస్ ముద్రించే పుస్తకాల కవర్లు డిజైన్ చేసే పనిని కొంత కాలం చేశారు. ప్రెస్‌లో క్రియేటివ్ డిజైనర్‌గా రే పనిచేస్తున్న కాలంలో అక్కడికి ముద్రణకొచ్చిన ఓ పుస్తకం అతని జీవితాన్నే మార్చేసింది. సాంఘిక నవలలు రాయడంలో పేరున్న బెంగాలీ రచయిత బిబూతీ భూషన్ బందోపాధ్యాయ నవల 'పథేర్ పాంచాలి' రే దృష్టిని ఆకర్షించింది. ఆ నవలను సినిమాగా కళాత్మకమైన దృశ్యకావ్యంగా మల్చవచ్చని రే గట్టిగా నమ్మాడు.

సినిమాలను అప్పట్లో శక్తిమంతమైన దృశ్యశ్రవణ మాధ్యమంగా గుర్తించిన సత్యజిత్ రే 1948లోనే కలకత్తా ఫిలిం సొసైటీని స్థాపించాడు. తన మిత్రులు కొంత మందితో కలిసి యూరప్ పర్యటించిన రే అక్కడే ఆరు నెలల కాలంలో వరుసపెట్టి దాదాపు 100 సినిమాల దాకా చూసాడు. వీటిలో ప్రపంచ ప్రఖ్యాత దర్శకుల సినిమాలు కూడా ఉన్నాయి. ప్రఖ్యాత ఇటాలియన్ దర్శకుడు విటోరియో డి సికా తీసిన 'లద్రి డి బెసిక్లెట్టె' సినిమా సత్యజిత్‌రేను విశేషంగా ఆకర్షించింది. కళాత్మక సినిమాను తీయడానికి అంకితభావం, క్రమశిక్షణ కలిగిన బృందం ఉంటే సరిపోతుందని ఈ సినిమా చూసి 'రే' నిర్ధారణకు వచ్చాడు.

తననెంతో కదిలించిన పథేర్‌పాంచాలి నవలను ఇటలీ సినిమా తరహాలో నిర్మించాలని తీర్మానించుకున్న సత్యజిత్ రే 1945లో తన మిత్రులతో కలిసి సినిమా నిర్మాణానికి శ్రీకారం చుట్టాడు. అయితే సినిమా నిర్మాణానికి అంకితభావం, సృజనాత్మకత ఉన్న కళాకారులు మాత్రం సరిపోరని, కెమెరాలు, రీళ్లు, సూట్‌కేసుల నిండా డబ్బు అవసరమని గుర్తించాడు. దీంతో ఎంతో ఉత్సాహంగా మొదలైన పథేర్ పాంచాలి సినిమా ఆర్థిక సమస్యతో ఏడాది కాలం పాటు ఆగిపోయింది. ఎన్నో ఆశలతో తన సృజనాత్మకనంతా రంగరించి తీసిన పథేర్ పాంచాలి బ్లాక్ అండ్‌వైట్ సినిమాను సత్యజిత్ రే బెంగాల్‌లో కనీసం ప్రివ్యూ కూడా ప్రదర్శించకుండానే 1956 కేన్స్ ఫిలింఫెస్టివల్‌కు భారత్ తరఫున పంపించాడు. పథేర్ పాంచాలి (రహదారి పాట) కేన్స్ ఫిలిం ఫెస్టివల్‌లో ప్రదర్శితం కాకముందు హాలీవుడ్ లేదా యూరప్, అమెరికాల్లో భారతీయ సినిమా గురించి ఎవరికీ అంతగా తెలియదు. అసలు ఆసియా సినిమా గురించే 1950 దాకా తెలియదు. 1950లో జపాన్ దర్శకుడు అకిరో కురసోవా తీసిన కళాఖండాలను ఆస్వాదించిన పాశ్చాత్యులు ఆ తరువాత 1956లో అంతటి హృద్యంగా మలచిన పథేర్ పాంచాలి చూసి అవాక్కయ్యారు. ఒక్కసారిగా ఫిలింఫెస్టివల్‌లో కలకలం రేగింది. ఉత్తమ మానవతా విలువలున్న చిత్రం అవార్డు సహా ఆరు పురస్కారాలు అందుక్ను పథేర్ పాంచాలి కేన్స్ ఫెస్టివల్‌లో ప్రత్యేక ఆకర్షణగా మారింది.

అంతర్జాతీయంగా పథేర్ పాంచాలికి లభించిన ఆదరణ సత్యజిత్‌రేలో కొత్త ఉత్సాహాన్ని నింపింది.

భారతీయ కళాత్మక సినిమాలకు కొత్త దిశా నిర్దేశం చేసిన రే దేశంలో మరెందరో దర్శకులకు మార్గదర్శకుడయ్యాడు. చాలా మంది బెంగాలి, మలయాళ, కన్నడ, హిందీ దర్శకులు 'రే' బాటను అనుసరించడం ప్రారంభించారు. కోల్‌కతాలోనే శ్యాంబెనగల్, గౌతమ్‌ఘోష్, కేరళలో అదూర్ గోపాలకృష్ణన్, భరతన్ కన్నడంలో గిరీష్ కర్నాడ్, కాసరవెల్లి హిందీలో అశుతోష్ ముఖర్జీ వంటి వారికి సత్యజిత్ రే స్ఫూర్తి ప్రదాతగా మారారు. పథేర్ పాంచాలి విజయంతో 'రే' ఇక వెనక్కి తిరిగి చూడలేదు. ఆ తరువాత వరుసగా 36 సినిమాలు తీసాడు. ఒక్కో సినిమా ఒక్కో కళాఖండం. పథేర్ పాంచాలి తరువాత కేన్స్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో జరిగిన అదే ఏడాది అంటే 1956లో అపరాజితొ, అపుర్ సన్‌సార్ (1959) జల్సాగర్ (1958), పోస్ట్‌మాస్టర్ (1961), చారులత (1964), డేస్ అండ్ నైట్స్ ఇన్ ద ఫారెస్ట్ (1969), సోనార్ కిల్లా (1974) పిక్కూ (1980) వంటి కళాఖండాలను 'రే' సినిమా ప్రేమికులు ఆదరించారు. సినిమాల్లో నటీనటులెవరనేది అప్రస్తుతం. అతని సినిమాలో సూపర్‌స్టార్లు, గ్లామర్ హీరోయిన్లు ఉండరు. కానీ జీవం తొణికిసలాడే కథాపాత్రలుంటాయి. ఒక్కో పాత్రను మలచడంలో ఆయన ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటాడు. బెంగాల్‌లో నాటక సమాఖ్యలు, డ్రామా ఆర్టిస్టులు, స్టేజ్ నటుల నుంచి 'రే' ఆణిముత్యాల్లాంటి వారిని ఎన్నుకొని వారిని ప్రపంచానికి చూపాడు.

తానెంతో అభిమానించే గురుదేవులు రవీంద్రనాథ్ టాగూర్ శత జయంతి సందర్భంగా ఆ మహాకవికి నివాళిగా 1961లో తీన్ కన్యా (ముగ్గురు కుమార్తెలు) అనే అద్భుతమైన దృశ్య కావ్యాన్ని 'రే' సెల్యూలాయిడ్‌పై మలిచాడు. సామాన్య ప్రజలు, మధ్యతరగతి బడుగు బలహీన వర్గాలు ఎదుర్కొనే రోజువారీ సమస్యలు, గ్రామాల్లో పెత్తందార్లు, భూస్వాముల అక్రమాలు కళ్ళకు కట్టినట్లు చూపే పోస్ట్‌మాస్టర్, సంపత్తి, కాంచన్‌జుంగా సినిమాలు రే కీర్తి ప్రతిష్ఠలను దిగంతాలకు వ్యాపింపజేశాయి. ఇదొక్కటే కాదు నగరాల్లో, మధ్యతరగతి వర్గాల్లో భార్యాభర్తలు ఇద్దరూ ఉద్యోగం చేస్తే వారెదుర్కొంటున్న సమస్యలను హాస్యాన్ని మేళవించి పరిష్కరించే దిశగా చూపిస్తాడు. 1879లో జరిగిన ఒక దృష్టాంతాన్ని ఆధారంగా చేసుకుని రవీంద్రనాథ్ టాగూర్ రాసిన కథను తీసుకుని మహిళల సమస్యలే ఇతివృత్తంగా 1964లో 'చారులత'ను తీసాడు. ఆ సినిమా అదే ఏడాది దేశంలో ఎన్నో అవార్డులను గెల్చుకోవడమే కాక అంతర్జాతీయ స్థాయిలో కూడా ప్రశంసలు అందుకొంది. 'రే' తీసిన సినిమాల్లో పథేర్ పాంచాలి తరువాత అత్యుత్తమ కళాఖండంగా 'చారులత' విమర్శకుల పొగడ్తలందుకొంది.

కళాత్మక చిత్రాల సృష్టికర్తగా ప్రపంచమంతా పరిచయమైన సత్యజిత్‌రేను కేంద్ర ప్రభుత్వం భారతీయ టెలివిజన్‌కోసం లఘుచిత్రాలు నిర్మించమని కోరింది. దూరదర్శన్ కోసం 'రే' 1984లో 'ఘరే బైరే' 'సద్గతి' లాంటి కథా చిత్రాలు తీసారు. నిరంతరం చిత్ర నిర్మాణాల్లో తలమునకలైన కారణంగా 'రే' ఛాతీకి సంబంధించిన నొప్పితో ఆసుపత్రిపాలయ్యారు. హృద్రోగం కారణంగా ఇక స్టూడియోల్లోనే సినిమాలు తీయమని వైద్యులు చెప్పారు. అలా ఆయన గణశత్రు, శాఖప్రకాశక్, ఆగంతుక్ (1991) సినిమాలు చేసారు.

చిత్ర నిర్మాణరంగంలో స్క్రిప్ట్, నటీనటుల ఎంపిక, దర్శకత్వం, సంగీతం, కెమెరా నిర్వహణ, ఎడిటింగ్ సహా టైటిల్స్ ఎలా వేయాలి, పబ్లిసిటీ ఎలా చేయాలి ఇలా అన్ని విభాగాల్లోనూ తనదైన ముద్రవేసి మేధావుల చేత ప్రశంసలందుకొన్న ఆ మహాదర్శకుడికి 1992లో ఆస్కార్ అకాడమీ లైఫ్‌టైమ్ ఎచీవ్‌మెంట్ ఆస్కార్ గౌరవాన్ని ప్రకటించింది. ఆసుపత్రిలో కదలలేని స్థితిలో ఉన్న 'రే'కు ఆస్కార్ కమిటీ టెలివిజన్ ద్వారా 'లైవ్'లో ఈ అవార్డును అందజేసింది. ఇలా భారతీయ చిత్ర నిర్మాణరంగంలో మరే దర్శకుడికీ దక్కని అపూర్వ గౌరవాన్ని దక్కించుకున్న సత్యజిత్ రే అదే ఏడాది మరణించారు.

1863-
1951

# విలియం రాండోల్ఫ్ హార్స్ట్

ఎల్లో జర్నలిజానికి ఆయన ఆద్యుడు కాదు. మొట్టమొదటి మీడియా సామ్రాట్టూ కాదు. కానీ ఎల్లో జర్నలిజంతోనే ఆయన ఉన్నత శిఖరాలను అధిరోహించాడు. మీడియా మొఘల్ అయ్యాడు. ప్రభుత్వాలను, ప్రజాభిప్రాయాన్ని తన ప్రయోజనాలకు అనుగుణంగా విశేషంగా ప్రభావితం చేయగలిగాడు. స్వప్రయోజనాలకు మీడియాను ఎలా వాడుకోవచ్చో ప్రపంచంలోని ప్రచురణకర్తలకు మొదటిసారిగా రుచి చూపించాడు. ఓపక్క అమెరికా అధ్యక్షుడు కావాలని కలలూ కన్నాడు. ఆ కలలను తన పత్రికల ద్వారా సాకారం చేసుకోవడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. మరోపక్క రాజులకే అసూయ పుట్టించేంత వైభవోపేతంగానూ జీవించాడు. జీవితంలో ఉత్థానపతనాలు రెండింటిని చవిచూశాడు. మీడియా సాగరంలో అక్షరాలా ఎగసిపడ్డ కెరటం విలియం రాండోల్ఫ్ హార్స్ట్.

హార్స్ట్ తండ్రికి బంగారపు గనులు ఉండేవి. ఆయన వ్యాపారంలో విపరీతంగా సంపాదించాడు. హార్స్ట్‌ని తల్లిదండ్రులు అల్లారుముద్దుగా పెంచారు. ఎంతో గారాబం చేసేవారు. దానితో హార్స్ట్ అల్లరిచిల్లరి పిల్లాడిగా తయారయ్యాడు. సెయింట్ పాల్స్ పాఠశాలలో ప్రాథమిక విద్యను అభ్యసించిన తర్వాత ప్రసిద్ధిగాంచిన హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో చేరాడు. కాలేజీలోనే తొలిసారిగా హార్స్ట్ తన జర్నలిస్టు వృత్తికి శ్రీకారం చుట్టాడు. తన నిర్దేశకత్వంలో మొట్టమొదటిసారిగా కాలేజి మ్యాగజైన్ 'హార్వర్డ్ లాంపూన్'ను లాభాల బాట పట్టించాడు. కాలేజిలో చేసిన ఓ తుంటరిపనికి హార్స్ట్‌ను కళాశాల నుంచి బహిష్కరించారు. దీంతో హార్స్ట్ ఇంటిబాట పట్టాడు. శాన్‌ఫ్రాన్సిస్కోలో తన తండ్రి రాజకీయ అవసరాల కోసం కొనుగోలు చేసిన 'శాన్‌ఫ్రాన్సిస్కో ఎగ్జామినర్' అనే పత్రికను తనకు ఇవ్వమని ఆయనను అభ్యర్థించాడు. తండ్రి అయిష్టంగానే పత్రిక నిర్వహణ బాధ్యతను హార్స్ట్‌కు అప్పగించాడు. మీడియా రంగంలో అనుభవం కోసం హార్స్ట్ జోసెఫ్ పులిట్జర్ నేతృత్వంలోని మాస్ మసాలా సంచలనాత్మక 'న్యూయార్క్ వరల్డ్' పత్రికలో చేరాడు. పులిట్జర్ శైలిని ఔపోసన పట్టాడు. 1897కల్లా ఎల్లో జర్నలిజంలో ఆరితేరిన హార్స్ట్ తన 'శాన్‌ఫ్రాన్సిస్కో ఎగ్జామినర్' పత్రికను 'న్యూయార్క్ వరల్డ్' శైలిలో రూపొందించేందుకు సిద్ధమయ్యాడు. పాఠకులను ఆకట్టుకోవడానికి భయానక వార్త కథనాలను ఆసక్తికరంగా, ఆకర్షణీయంగా మలిచాడు. పత్రిక ద్వారా అవినీతిపై అవిశ్రాంతంగా తారస్థాయిలో పోరాటం చేయడం మొదలుపెట్టాడు. మిగతా పత్రికలు ఇస్తున్నదానికి మూడు రెట్లు ఎక్కువ జీతాలు ఇచ్చి ఉత్తమ జర్నలిస్టులను ఆకర్షించాడు. అదేసమయంలో పత్రిక ధరను తగ్గించాడు. దీనితో అమ్మకాలు పెరిగి పత్రిక లాభాల బాట పట్టింది.

తన పత్రిక విజయాన్ని సాధించడం, అదేసమయంలో తల్లి నుంచి సంక్రమించిన మిలియన్ డాలర్ల వారసత్వ సంపద హార్స్ట్‌కు ఉత్తేజాన్ని, ధైర్యాన్ని ఇచ్చాయి. అదే ఊపులో 'న్యూయార్క్ జర్నల్' పత్రికను కొనుగోలు చేశాడు. పులిట్జర్ పత్రికలో పనిచేస్తున్న విలేకరులను తనవైపు లాక్కోవడానికి ప్రయత్నించి గురువునే సవాల్ చేశాడు. ఇద్దరి మధ్య భీకర యుద్ధం జరిగింది. దీంతో ఎల్లో జర్నలిజం మీడియా యుద్ధం పరాకాష్ఠకు చేరింది. 1898లో హార్స్ట్ తన పత్రిక ద్వారా 'మైన్' నౌకను స్పెయిన్ గూఢచారులే ముంచేశారని వార్తా కథనాలు రాశాడు. క్యూబా కోసం స్పెయిన్‌తో తలపడాలని అమెరికా ప్రభుత్వంపై తీవ్ర ఒత్తిడి తెచ్చాడు. పత్రిక ద్వారా ప్రజాభిప్రాయాన్ని యుద్ధానికి అనుగుణంగా మలిచాడు. ఆ ఒత్తిడిని తట్టుకోలేక మెకిన్లే అధ్యక్షతలోని అమెరికా యుద్ధ రంగంలోకి దిగింది. అమెరికా - స్పెయిన్ సంగ్రామం జరిగింది.

అయితే తన రాతలకు ఆదర్శమనే అందమైన రంగును పులిమాడు హార్స్ట్. బ్రిటన్ వ్యతిరేక ధోరణిని అవలంభించాడు. కార్మిక పక్షపాతిగా నిలిచాడు. గుత్త వ్యాపార సంస్థలకు బాసటగా నిలుస్తోందని మెకిన్లే ప్రభుత్వంపై పదేపదే దాడులు చేశాడు. అమెరికా అధ్యక్షుడు కావాలన్న హార్స్ట్ రాజకీయం ఆకాంక్షే ఈ చర్యలకు

మూలకారణం. 1901లో రాసిన సంపాదకీయంలో రాజకీయ హత్యకు పాల్పడడాన్ని హర్ట్స్ ప్రశంసించాడు. దీనిని మెకిన్లేపై ప్రత్యక్ష దాడిగా విమర్శకులు భావిస్తారు. అయితే కాకతాళీయంగా హర్ట్స్ సంపాదకీయం రాసిన ఐదు నెలలకు మెకిన్లే ఓ అరాచకవాది చేతిలో అంతమయ్యాడు. అమెరికా కాంగ్రెస్‌లో 1903 నుంచి 1907వరకు హర్ట్స్ సభ్యుడిగా పనిచేశాడు. 1905, 1909లో న్యూయార్క్ మేయర్ కావడానికి రెండుసార్లు ప్రయత్నించి విఫలుడయ్యాడు. 1906లో న్యూయార్క్ గవర్నర్ పదవిని ఆశించి భంగపడ్డాడు. 1904లో డెమోక్రాటిక్ పార్టీ అధ్యక్ష అభ్యర్థుల రేసులో పాల్గొని తృటిలో ఓటమి పాలయ్యాడు. దీనితో హర్ట్స్ రాజకీయ కల ఎప్పటికీ నెరవేరలేదు. అయితే ఆ కల హర్ట్స్‌ను చాలాకాలం వెంటాడింది. దానినుంచి మేల్కొని మామూలు మనిషి కావడానికి హర్ట్స్‌కు కొన్నేళ్లు పట్టింది.

రాజకీయ కల సాకారం కాకపోవడంతో హర్ట్స్ తన దృష్టిని పూర్తిగా మీడియా వైపే మళ్లించాడు. తన శక్తియుక్తులు ధారపోసి ఓ మీడియా సామ్రాజ్యాన్ని నిర్మించాడు. 1920 చివరి దశకంలో, 1930 తొలినాళ్లలో ఎంత డబ్బయినా వెనకాడక ఇతర పత్రికలను కైవసం చేసుకోవడం మొదలుపెట్టాడు. 28 దినపత్రికలు, 13 మ్యాగజైన్లు, 8 రేడియో స్టేషన్లు, 2 సినిమా కంపెనీలు 1935కల్లా హర్ట్స్ మీడియా సామ్రాజ్యంలో అంతర్భాగమయ్యాయి. హర్ట్స్ వ్యక్తిగత ప్రచారానికి అవి ఇబ్బడిముబ్బడిగా తోడ్పడ్డాయి. వ్యక్తిగత జీవితంలో హర్ట్స్‌కు ఓ ఇల్లాలు, మరో ప్రియురాలు ఉన్నారు. 1903లో మిల్లిసెంట్ విల్సన్‌ను హర్ట్స్ వివాహమాడాడు. 1917లో మేరియోన్ డేవిస్‌ను ఓ సంగీత సభలో చూసి ఆకర్షితుడై ఆమెకు చేరువయ్యాడు. మిల్లిసెంట్ విడాకులు ఇవ్వడానికి నిరాకరించడంతో డేవిస్ హర్ట్స్ ప్రియురాలుగానే కొనసాగింది. అతడు సినిమా కంపెనీలను తన రెండవ భార్య కోసం కొన్నాడు. కాలిఫోర్నియా డెమోక్రాటిక్ ప్రతినిధి బృందం ఓట్లు రూజ్‌వెల్ట్‌కు పడేలా కృషిచేసి విజయం సాధించినప్పటికీ పార్టీ తనకు సీటు నిరాకరించడమనే చేదు నిజాన్ని హర్ట్స్ జీర్ణించుకోలేకపోయాడు. దీంతో హర్ట్స్ రాజకీయ ఆకాంక్షలు కొడిగట్టాయి. మానసికంగా కుంగిపోయిన అతడు కాలిఫోర్నియాకు మరలాడు. తనకోసం ఓ అద్భుతమైన రాజమహల్‌ను కట్టుకోవడం కోసం విచ్చలవిడిగా డబ్బు ఖర్చు చేశాడు. దానికోసం అక్షరాలా 30 మిలియన్ డాలర్లను వెచ్చించాడు. ఆ ఆవరణలో ఓ కోటను నెలకొల్పాడు. చూపరులు మంత్రముగ్ధులయ్యేలా ఆఫ్రికా జంతు సౌందర్యాన్ని అక్కడ ఆవిష్కరించాడు. హాలీవుడ్ నటులకు హర్ట్స్ భవనం ఓ విహారకేంద్రమైంది. తరచు ప్రముఖులకు అక్కడ గొప్పగా పార్టీలు ఇవ్వడం మొదలుపెట్టాడు. హర్ట్స్ సంసార నౌక నింపాదిగానే సాగిపోయినప్పటికీ విచ్చలవిడి ఖర్చుతో అతడి మీడియా సామ్రాజ్యపు పునాదులు కదిలిపోయాయి. పతనం ప్రారంభమైంది. 1937లో అతడి వ్యాపారం దివాలా తీసింది. అయితే రెండవ ప్రపంచ యుద్ధంతో తిరిగి కోలుకున్నాడు. తన మీడియా సామ్రాజ్యాన్ని పునరుద్ధరించినప్పటికీ అది ఎప్పటికీ గత వైభవాన్ని అందుకోలేకపోయింది. హర్ట్స్ సర్వశక్తిమంతుడైన ఓ స్వార్థపరుడనే భావన ప్రజలలో ప్రబలింది. వారికి అతడిపై విశ్వాసం సడలిపోయింది. హర్ట్స్ తన చివరి రోజులను ప్రియురాలు డేవిస్‌తోనే గడిపాడు. ఆమె ఇంటివద్దే 1951లో అతడు మరణించాడు. 1941లోనే హర్ట్స్ జీవితాన్ని ఆధారంగా చేసుకుని 'సిటిజన్ కానె' అనే అద్భుతమైన క్లాసిక్ సినిమాను అర్సన్ వెల్స్ రూపొందించాడు.

మీడియా మొఘల్ హర్ట్స్ జీవితం ప్రపంచ జర్నలిజం గ్రంథంలో ఎప్పటికి మరవలేని ఓ నిండు పేజి. అతడు ఎదిగి, పతనమైన తీరు ప్రపంచవ్యాప్తంగా ప్రచురణకర్తలకు అక్షరాలా ఓ గుణపాఠం. అడ్డదోవల్లో అనతికాలంలోనే పైకివచ్చినా అది ఎక్కువకాలం నిలుపుకోలేరనేది అతడి జీవితం చెప్పే సత్యం. అయితే అతడి జీవితం అక్షరాలా ఓ తెరిచిన పుస్తకం. ధైర్యానికి, స్ఫూర్తికి, ఎదగాలనే ఆకాంక్షకు దోవ చూపించే ఓ నక్షత్రంగా హర్ట్స్ ఎప్పటికీ మీడియా వినీలాకాశంలో వెలుగుతూనే ఉంటాడు.

# టాటా

ఒక పేద పార్శీ కుటుంబంలో పుట్టిన ఓ వ్యక్తి స్వాతంత్ర్యానికి పూర్వమే భారత్ లాంటి పేద దేశంలో ఎయిర్‌లైన్స్ స్థాపిస్తే వ్యాపారం పుంజుకుంటుందన్న ఆలోచనను ఆయన సహచరులు గేలిచేసినా ముందుకు తెచ్చాడు. మూడు తరాల తరువాత వెనక్కి తిరిగి చూసుకుంటే 96 కంపెనీలు, 56 దేశాల్లో వ్యాపార వాణిజ్య కార్యకలాపాలు, రెండు లక్షల ఎనభై వేల మంది సిబ్బంది, స్థూల జాతీయోత్పత్తిలో దాదాపు 3 శాతం, వ్యాపారం మొత్తం కలిపి 5,700 కోట్ల డాలర్లు దాటింది. ఉప్పు నుంచి అత్యాధునిక కార్లు, విమానాల వరకూ రూపొందిస్తున్నది టాటా కంపెనీలే. టాటాల వ్యాపార సామ్రాజ్యానికి మూలపురుషు డైన జీజీభాయి జంషెడ్జీ టాటా భారత్‌లో మొట్టమొదటి స్టీల్ ప్లాంట్, బహుళార్థక విద్యుత్ ప్రాజెక్టు ఆయన నిర్మించినవే. జంషెడ్జీ టాటా తన వ్యాపారంలో కోడలు తరపు బంధువు రతన్‌జీ టాటాను భాగస్వామిగా తీసుకున్నాడు రతన్‌జీ కొడుకే జహంగీర్ రతన్‌జీ దాదాబాయ్ టాటా. తండ్రి తరువాత జేఆర్‌డి టాటా సన్స్ అధినేత అయ్యేనాటికి టాటా కంపెనీల వార్షిక టర్నోవర్ 280 కోట్ల రూపాయలు దాటింది. జహంగీర్ రతన్‌జీ టాటా వ్యాపారం నుంచి విరమించుకునే నాటికి టాటా గ్రూపులో పరిశ్రమల సంఖ్య 50కి పైగా పెరిగాయి. టాటా కెమికల్స్, ఇన్వెస్ట్‌మెంట్స్, కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, నెల్కో, ఎయిర్ ఇండియా వంటి భారీ సంస్థలకు జె.ఆర్.డి. హయాంలోనే బీజం పడింది. అన్నికంపెనీల వార్షిక ఆదాయం దాదాపు 10 వేల కోట్లకు చేరుకుంది.

"భారతదేశ ప్రజలు ఏది కోరుకుంటారో, అది అందించడమే టాటా కంపెనీ లక్ష్యం కావాలి, ఇండియాకు ఏది మంచిది అయితే అదే టాటాలకూ మంచిది" అన్న సూత్రాన్ని తన వారసుడైన నావల్ టాటా తనయుడు రతన్ టాటాకు బోధించి వ్యాపార లావాదేవీలను మొత్తం రతన్ చేతిలో పెట్టాడు. 120 ఏళ్ల వ్యాపార సామ్రాజ్యాన్ని అందిపుచ్చుకున్న రతన్ టాటా ఆ తరువాత వెనక్కి తిరిగి చూడలేదు. ముంబైలో బట్టల మిల్లు నుంచి ఇంగ్లీష్-డచ్ కంపెనీ చేతిలోని కోరస్ స్టీల్ సామ్రాజ్యాన్ని హస్తగతం చేసుకోవడం దాకా రతన్ టాటా భారత పారిశ్రామిక ప్రగతికి వెన్నెముకగా నిలిచారు. రతన్ టాటా ప్యారిస్‌లో పుట్టినా పై చదువులకు అమెరికా వెళ్ళాడు. కార్నెల్ యూనివర్సిటీలో ఆర్కిటెక్చర్, హార్వర్డ్‌లో మేనేజ్‌మెంట్ విద్యనభ్యసించాక భారత్ తిరిగి వచ్చారు. పెదనాన్న ప్రోత్సాహంతో తమ గ్రూపు కంపెనీల్లో ఒకటైన టాటా స్టీల్‌లో అప్రెంటీస్‌గా చేరాడు. 16 ఏళ్లు మేనేజ్‌మెంట్‌లో బాధ్యత నిర్వహించాక ఓ రోజున ఆయన నమ్మలేని వార్త వినాల్సివచ్చింది. ఆ వార్తే వారసత్వ మార్పిడి. టాటా గ్రూపులో ఉద్దండులైన రూసీమోడీ, అజిత్ కేర్కర్ లాంటి వారిని కాదని జేఆర్‌డి టాటాతన వారసుడిగా తనను ఎంపిక చేశారన్న ఈ విషయాన్ని తొలుత రతన్ టాటా నమ్మలేకపోయాడు.

బాధ్యతలు తీసుకున్న వెంటనే నష్టాల్లో ఉన్న ఎసీసీ, టాటా అయిల్ మిల్స్‌ను వదిలించుకున్నాడు. దీర్ఘకాలంగా నష్టాల్లో ఉన్న టాటా స్టీల్‌ను సంపూర్ణంగా పునర్వ్యవస్థీకరించారు. వ్యవస్థీకృత నష్టాల్లో భాగంగా పదిశాతం ఖర్చును తగ్గించుకొని, స్వచ్ఛంద పదవీ విరమణ పథకం ద్వారా ఉద్యోగులను తగ్గించి టాటా స్టీల్‌ను లాభాల బాట పట్టించాడు రతన్ టాటా. టాటా స్టీల్ ఉత్పత్తి సామర్థ్యం 80 టన్నుల నుంచి 265 టన్నులకు పెంచాడు. మరో మూడేళ్లలో టాటా స్టీల్ ఉత్పత్తి సామర్థ్యం 1500 టన్నులకు చేర్చాలన్నది రతన్ టాటా లక్ష్యం. టాటా గ్రూపు సంస్థల లాభాలు ఏడు రెట్లు పెంచాడు. జపాన్, కొరియాలను మినహాయిస్తే ఆసియాలోనే అతి పెద్ద సాఫ్ట్‌వేర్ సంస్థ టాటా కన్సల్టెన్సీ సర్వీసును నెలకొల్పాడు. టాటా మోటార్స్‌ను న్యూయార్క్ స్టాక్ ఎక్చేంజ్‌లో నమోదు చేసిన ఘనత దక్కించుకున్నాడు. బ్రిటన్‌లోని భారీ 'టీ' సామ్రాజ్యం టెట్లీ టీను 440 మిలియన్ డాలర్లు పెట్టి కొనాలన్న నిర్ణయంతో టాటా టీ ఇప్పుడు ప్రపంచంలోనే రెండో స్థాయికి ఎదిగింది. మారుతికి పోటీగా ఇండికా కారును రతన్ భారతీయ మార్కెట్లోకి ప్రవేశపెట్టి విజయం సాధించాడు. బ్రిటీష్-డచ్ కంపెనీ కోరస్‌ను వశపర్చుకోవ డంతో టాటా కంపెనీ అంతర్జాతీయ విఫణిలోకి కాలు పెట్టింది. ప్రపంచ స్టీల్ సామ్రాజ్యాధినేత లక్ష్మీ మిట్టల్‌కు చెక్ చెప్పేందుకే రతన్ ఈ నిర్ణయం తీసుకున్నాడు. లక్ష్మీనివాస్ మిట్టల్ భారత్‌లో అడుగుపెట్టే అవకాశాలున్నాయని ఊహించి నిర్ణయం తీసుకున్నారు. లక్షరూపాయలకే కారును సగటు భారతీయుడు సొంతం చేసుకుని దానిలో కుటుంబ సమేతంగా షికారు చేయాలన్నది రతన్ టాటా కల. అందుకు తీవ్ర ప్రయత్నం జరుగుతోంది. మరో వందేళ్లలో ప్రతి భారతీయుడి జీవన విధానంలో టాటా గ్రూప్ పూర్తిగా పెనవేసుకుని పోవాలన్నదే 69 ఏళ్ళ బ్రహ్మచారి రతన్ టాటా ఆశయం.

# బిల్ గేట్స్

ఇరవయ్యవ శతాబ్దం ఆఖరు నాటికి అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ఐబిఎం-రకం పర్సనల్ కంప్యూటర్లలో 90 శాతం మైక్రోసాఫ్ట్ విండోస్‌నే వినియోగిస్తున్నాయి. ప్రయోజనవంతమైన ఈ సాఫ్ట్‌వేర్‌ను రూపొందించింది వేల కోట్ల డాలర్లతో కూడిన కొన్ని సంస్థల సమాహారమైన మైక్రోసాఫ్ట్. ఇది పారిశ్రామిక విప్లవం అనంతర కాలంలోని ఒక గొప్ప ద్రష్ట అయిన విలియం హెన్రీ గేట్స్-III అధీనంలో జరిగింది. విండోస్‌కు ముందు రూపొందించిన ఎం.ఎస్. డాస్‌తోపాటు విండోస్ కూడా అమెరికావారి జీవితంలో విడదీయరాని భాగం అయిపోయింది. ఈ క్రమంలో బిల్‌గేట్స్ ప్రపంచంలోనే అత్యంత సంపన్నుడిగా అవతరించాడు. చరిత్రలోనే అత్యంత పలుకుబడిగల పారిశ్రామికవేత్తగా పరిణమించాడు. ఆపరేటింగ్ సాఫ్ట్‌వేర్‌లో మైక్రోసాఫ్ట్ ఆధిపత్యం పెరగడంతో బాటే గుత్తాధిపత్యానికి దారితీసే వ్యాపారధోరణులను అనుసరిస్తున్నారన్న విమర్శలూ పెరిగిపోయాయి. విండోస్ 95 ఆపరేటింగ్ వ్యవస్థకు లైసెన్స్ ఇవ్వాలంటే ఇంటర్నెట్ ఎక్స్‌ప్లోరర్‌ను విధిగా లోడ్ చేయాలని నిర్బంధం పెట్టడంద్వారా మైక్రోసాఫ్ట్ 1995 నాటి ఒప్పందాన్ని ఉల్లంఘిస్తున్నదని ఆరోపిస్తూ 1997 అక్టోబర్‌లో మైక్రోసాఫ్ట్‌పై న్యాయస్థానంలో వ్యాజ్యం దాఖలైంది. మార్కెట్‌ను దుర్వినియోగం చేస్తున్నారన్న అనేక ఆరోపణలకు బిల్‌గేట్స్ సమాధానమల్లా తాను ఏ పాపం ఎరగనన్నదే. సుదీర్ఘకాలం పాటు కొనసాగేట్టు కనిపించిన ఆయన న్యాయపోరాటాలను చూసి కమ్యూనికేషన్ రంగానికి చెందిన నిపుణులు ఈ వ్యవహారం అంతా గుత్తాధిపత్యానికి వ్యతిరేకంగా 19వ శతాబ్దంనాటి చట్టాలు ప్రస్తుతం ఉపకరిస్తాయా అన్న అనుమానం వ్యక్తం చేశారు. పైగా ఈ చట్టాలు 21వ శతాబ్దం నాటి సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధికి ప్రతిబంధకంగా ఉన్నాయని కూడా వాదించారు.

కుర్ర చేష్టలున్న వాడిగా కనిపించే గేట్స్‌కు సాంకేతిక పరిజ్ఞానం మీద ఉన్న అవగాహనకు మార్కెట్ వ్యవహార సరళిని ఆకళింపు చేసుకోవడం, అపారమైన శక్తి, నిబద్ధత, సమయస్ఫూర్తి కూడా తోడయ్యాయి. ఆయన తండ్రి సియాటెల్‌లో ప్రసిద్ధుడు. విజయవంతం అయిన కార్పొరేట్ రంగ న్యాయవాది. ఆయన తల్లి ఓ కళాశాల బాధ్యతలు నిర్వర్తించేవారు. ప్రసిద్ధ దాతృత్వ సంస్థలో కార్యనిర్వహణాధికారి. గేట్స్ చాలా ప్రతిభగల విద్యార్థి. లెక్కల్లో అద్వితీయుడు. మొట్టమొదటిసారి అతనికి కంప్యూటర్లతో పరిచయమైంది ఏఎస్ఆర్33 టెలీటైప్ కంప్యూటర్‌తోనే. ఆయనకు తెలిసిన కంప్యూటర్ భాష బేసిక్ మాత్రమే. యవ్వనదశలో ఉన్నప్పుడు ఆయన చదివిన ఒక ప్రైవేటు పాఠశాలలో ఈ అవకాశం కలిగింది. తనకన్నా రెండేళ్ళు పెద్దవాడైన పాల్ అలెన్‌తో బిల్‌గేట్స్‌కు స్నేహం కుదిరింది. గేట్స్‌లాగే అలెన్‌కు కూడా కంప్యూటర్లపై అమితాసక్తి ఉండేది. వ్యాపారంలో చొరవా ఉండేది. గేట్స్‌కు పదహారేళ్లు ఉన్నప్పుడు అలెన్, మరి కొంత మంది మిత్రులతో కలిసి ట్రాఫ్-ఓ-డేటా అనే తమ మొదటి కంపెనీ ప్రారంభించాడు. 1973లో గేట్స్ హార్వర్డ్‌లో చేరాడు. కానీ 1975లో పాలెన్ అలెన్ గేట్స్ చూపిన ఒక వ్యాసం అతని జీవితాన్ని, గేట్స్ జీవితాన్ని మార్చేసింది. అది మొట్టమొదటి సారిగా సరసమైన ధరకు అందుబాటులోకి వచ్చిన ఎంటిఎస్ ఆల్టేర్ 8800 అనే పర్సనల్ కంప్యూటర్‌ను గురించిన వ్యాసం. దీనితో వారిద్దరూ భవిష్యత్తు సాఫ్ట్‌వేర్‌దే కాని హార్డ్‌వేర్‌ది కాదన్న నిర్ధారణకు వచ్చారు. వారి ప్రతిభలో మరోకోణం ఏమంటే సాఫ్ట్‌వేర్ వినియోగించుకోవడానికి, నేర్చుకోవడానికి సులభంగా ఉండాలన్నదే వారి వాంఛ.

వీరిద్దరూ 1975లో మైక్రోసాఫ్ట్ ప్రారంభించారు. వారు చేసిన మొదటి పని ఎంటిఎస్ ఆల్టేర్‌కు సాఫ్ట్‌వేర్ రూపొందించడం. ఆ తర్వాత వారు ఆ లైసెన్స్‌ను ఎంటిఎస్‌కు ఇచ్చేసారు. అది పర్సనల్ కంప్యూటర్లను వాడే వారు సరదాకి వినియోగించే వారే అయినందువల్ల, వారే సాఫ్ట్‌వేర్‌ను రూపొందించి మిత్రులకు అందజేసే దశ మాత్రమే అయినందువల్ల సాఫ్ట్‌వేర్ విక్రయించి డబ్బు చేసుకోవాలన్న గేట్స్ ప్రయత్నం ఆనాటికి చాలా విపరీతమైందే. 1977 కల్లా గేట్స్ హార్వర్డ్ యూనివర్సిటీ చదువుకు స్వస్తి చెప్పాడు. పూర్తి కాలం పనిచేయడం కోసం అలెన్‌కూడా గేట్స్‌తో

చేరిపోయాడు. వినియోగదార్లు అవుతారనుకున్నవారికి మైక్రోసాఫ్ట్ సేవలు అందించడంపై గేట్స్ దృష్టి సారించాడు. ఆ సంవత్సరమే రేడియో షాక్ స్టోర్స్ యజమానులైన టాండీ కార్పొరేషన్ గేట్స్, అలెన్ రూపొందించిన 'బేసిక్'కు లైసెన్స్ తీసుకుంది. ఇక మైక్రోసాఫ్ట్ ప్రస్థానం ప్రారంభం అయింది. అయితే మైక్రోసాఫ్ట్ సహాయాన్ని ఐబిఎం అర్థించడంతో 1980లోనే అసలు వ్యాపారం మలుపు తిరిగింది. అప్పటికి ఐబిఎం రహస్యంగా మాత్రమే రూపొందిస్తున్న పర్సనల్ కంప్యూటర్‌కు సాఫ్ట్‌వేర్‌తోపాటు ఆపరేటింగ్ సిస్టం కూడా అవసరమైంది. ఆ తర్వాత మరో ఏడాదికి ఈ కొత్త కంప్యూటర్లను ఎగుమతి చేయాలన్నది ఐబిఎం ఆలోచన. ఈ రెండింటికీ అందజేయడానికి సమయం చాలా తక్కువ అయినందువల్ల గేట్స్, అలెన్ ఆందోళన పడ్డారు. కానీ సియోటెల్ కంప్యూటర్‌నుంచి ఒక ఆపరేటింగ్ సిస్టంకు లైసెన్స్ తీసుకోవడంతో వారికి పరిష్కారం దొరికింది. వారు తీసుకున్న లైసెన్సే ఎంఎస్ డాస్‌కు ఆధారభూతమైంది.

ఎనభైలలో కంప్యూటర్ పరిశ్రమ విస్తరించడంతో మైక్రోసాఫ్ట్ అనూహ్యంగా అభివృద్ధి చెందింది. సంప్రదింపుల్లో గేట్స్‌కున్న సామర్థ్యం, కచ్చితంగా నాణ్యతను అందించడంలో దీక్ష ఈ ఎదుగుదలకు కారణం. ఐబిఎం తాను అమ్మిన ఎం.ఎస్.డాస్‌తో కూడిన ప్రతి కంప్యూటర్‌పై మైక్రోసాఫ్ట్ రాయల్టీ చెల్లించడంతోపాటు లైసెన్సింగ్ ఒప్పందం ఆ సంస్థకు మాత్రమే పరిమితమైంది కాదు. ఐబిఎంకు పోటీ దార్లకు సైతం మైక్రోసాఫ్ట్ తన సాఫ్ట్‌వేర్ అమ్మడానికి వీలైంది. ఈ పోటీ కంప్యూటర్లను ఐబిఎం నకళ్లు అనేవారు. మైక్రోసాఫ్ట్ అలా పోటీదార్లకు తన ఉత్పత్తులు, సేవలు విక్రయించింది కూడా. ప్రతి సంవత్సరం కొత్త ఉత్పత్తులను విడుదల చేయడంతో మైక్రోసాఫ్ట్ ఎదుగుదల విపరీతంగా పెరిగింది. వరల్డ్ ప్రోగ్రాం ఫర్ ఎం.ఎస్-డాస్, మైక్రోసాఫ్ట్ మౌజ్, విండోస్ 3.0 అనే ఉత్పత్తులు వీటిలో ప్రధానమైనవి.

వ్యాపార దృక్పథంలో గేట్స్ కొత్త పోకడలు ఇతర రంగాలకు విస్తరించడానికి దోహదపడ్డాయి. ఆయన ఎంఎస్ఎన్ అనే ఆన్‌లైన్ ఎంటర్‌టైన్‌మెంట్ సైట్‌ను, ఎన్‌బిసి సహకారంతో ఎంఎస్ఎన్‌బిసి అనే కేబుల్ ఛానల్‌ను ప్రారంభించడంతోపాటు కోర్బిస్ ఆర్కైవ్ అనే డిజిటల్ ఇమేజ్ బాంకును సొంతం చేసుకున్నాడు. ఈ సంస్థ రోజుకు 40 వేల చిత్రాలను రూపొందించే దిశగా ఎదుగుతున్నది. 90లలో ఇంటర్నెట్ దశను దాటి భవిష్యత్తు మీద దృష్టి సారించాడు. కంప్యూటర్‌ను, కేబుల్ టెలివిజన్‌ను సమన్వయం చేయడం మీద దృష్టి నిలిపాడు. దీనినే మైక్రోసాఫ్ట్ 'టెలివిజన్ స్పేస్' అని వ్యవహరించింది. అనేక మోడెంలకన్న వంద రెట్లు ఎక్కువ వేగంతో డేటా అందచేయడం, సుమారు ఏడు కోట్ల ఇళ్లకు (రెండు కోట్ల ఇళ్లలో కంప్యూటర్లు ఉన్నాయన్న అంచనాతో) సేవలు అందించడం భవిష్యత్తులో కేబుల్‌దే ఆధిపత్యం కావచ్చు. 1997 ఏప్రిల్‌లో గేట్స్ 425 మిలియన్ డాలర్లకు వెబ్ టీవీని కొనేశాడు. ఇది టీవికి ఇంటర్నెట్ అందజేసే సంస్థ. రెండు నెలల తర్వాత అమెరికాలోని నాల్గవ అతి పెద్ద కేబుల్ ఆపరేటివ్ సంస్థ కామ్‌కాస్ట్‌లో 11.5 శాతం వాటాకోసం ఒక బిలియన్ డాలర్లు చెల్లించాడు గేట్స్. ఈ సంస్థ ఆయనకు టెలివిజన్ కార్యక్రమాల తయారీలో కూడా వాటా ఇచ్చింది. ప్రత్యక్ష ప్రసార ఉపగ్రహ వ్యాపారంలోనూ వాటా కల్పించింది. 1998లో టెలికమ్యూనికేషన్స్‌లో ఇన్‌కార్పొరేటెడ్‌తో గొప్ప మైలురాయి వంటి కీలకమైన ఒప్పందం కుదుర్చుకున్నట్టు గేట్స్ ప్రకటించాడు. దీనితో విండోస్ సిఇ అనే మైక్రోసాఫ్ట్ కొత్త ఆపరేటింగ్ సాఫ్ట్‌వేర్ ద్వారా చిన్న కంప్యూటర్‌నుంచి డిజిటల్ ఫోన్లను కూడా పనిచేయించే అవకాశం కలుగుతోంది. ఇవి కొత్త కంప్యూటర్/కేబుల్ బాక్సుల ఆధారంగా పనిచేస్తాయి.

20వ శతాబ్దం ముగిసేనాటికి అద్భుతమైన ప్రతిభాశాలి అయిన బిల్‌గేట్స్ వయస్సు కేవలం 45 మాత్రమే. 20వ శతాబ్దంలోని థామస్ ఎడిసన్, హెన్రీఫోర్డ్ వంటి సాంకేతిక రంగ ఉద్ధండులతో బిల్‌గేట్స్‌కు అనేక పోలికలున్నాయి. సాంకేతిక భవిష్యత్తు ఇంకా ఆవిష్కృతం అవుతూనే ఉంది. బిల్‌గేట్స్ అందులో అగ్రభాగాన ఉంటా డనడంలో సందేహం లేదు. ఆ నూతన శకాన్ని ఆయన తప్పకుండా ఆవిష్కరిస్తాడు.

1888-
1970

# సి.వి. రామన్

ఎటుచూసినా విదేశీయులే... హాలు కిటకిటలాడుతోంది. తలపాగా చుట్టుకున్న ఓ భారతీయుడు ఇంకొద్ది క్షణాల్లో చేయబోయే నోబెల్ ప్రసంగం వినడానికి ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్తలు అక్కడ ఎదురుచూస్తున్నారు. ఆయన ఒక్కసారి హాలంతా కలయచూశాడు. అంతమందిలో అతడొక్కడే భారతీయుడు. ఉప్పొంగిన ఆనందం... మరుక్షణంలో ఆవేదన! ఇక్కడ కూర్చొనే అర్హత నా దేశంలో ఇంకెవరికీ లేదా అన్న బాధ ఆయన గుండెను బరువెక్కించింది. వేదికపై ఒక్కసారి వెనుదిరిగి చూశాడు. బ్రిటిష్ యూనియన్ జాక్ జెండా రెపరెపలాడుతోంది. ఆ నీడలో నిలబడి మాట్లాడాల్సి రావడం ఆయన హృదయాన్ని కలచివేసింది. 'నా నిర్భాగ్య దేశానికి కనీసం సొంత జెండా అయినా లేకపోయిందే' అన్న ఆలోచన ఆయన్ను నిలువునా కుంగదీసింది. నోబెల్ బహుమతి అందుకున్న అనిర్వచనీయ ఆనందం క్షణంలో ఆవిరైంది. ఆ దేశభక్తుడు డాక్టర్ సివి రామన్.

సివి రామన్‌గా సుప్రసిద్ధుడైన చంద్రశేఖర్ వెంకటరామన్ సైన్సులో నోబెల్ బహుమతి పొందిన మొట్టమొదటి భారతీయుడు. మొదటి ఆసియావాసి. కాంతి కిరణాన్ని చెదరగొట్టినపుడు దాని రంగు మారుతుందని రామన్ కనిపెట్టాడు. 'రామన్ ఎఫెక్ట్'గా పిలిచే ఆ పరిశోధనకే నోబెల్ ప్రైజ్ ఆయన్ను వరించింది. 'నాకు నోబెల్ ప్రైజ్ తెచ్చిపెట్టిన పరికరాల వెల 200 రూపాయలకు మించదు. అవన్నీ కలిపి ఓ టేబుల్ సొరుగులో పడతాయి' అని సగర్వంగా చెప్పుకునే రామన్ నిజమైన శాస్త్రవేత్త. ప్రకృతిని సునిశితంగా పరిశీలించనిదే ప్రకృతి రహస్యాలు ఛేదించలేమనడానికి ఆయన ఓ నిదర్శనం. ధ్వని తరంగాలు, అయస్కాంత ఆవరణం, కాంతి వంటి విభాగాలలో 475 పరిశోధనా పత్రాలు, 5 మోనోగ్రాఫ్‌లు ప్రచురించాడు. వయొలిన్ వంటి సంగీత పరికరాలపై ఆయన పరిశోధనలు ప్రాచీన హిందువుల ధ్వని విజ్ఞానానికి శాస్త్రీయ గుర్తింపు తెచ్చాయి.

చంద్రశేఖర వెంకటరామన్ 1888 నవంబర్ 7న తమిళనాడులో తిరువన్నామలై అనే కుగ్రామంలో పుట్టాడు. అది ఆయన తల్లి పార్వతీ అమ్మాళ్ పుట్టిల్లు. తండ్రి ఆర్. చంద్రశేఖర్ అయ్యర్ స్థానిక పాఠశాలలో లెక్కలు, సైన్స్ బోధించే ఉపాధ్యాయుడు. తండ్రి గణిత భౌతిక శాస్త్రాల్లో రామన్‌కు ప్రత్యేక శిక్షణ ఇచ్చాడు. రామన్ 1930 వరకూ విశాఖలోనే తల్లిదండ్రులతో ఉన్నాడు. ఎఫ్.ఎ. వరకు విశాఖలోనే విద్యనభ్యసించాడు. 11 ఏళ్లకు మెట్రిక్, 13 ఏళ్లకు ఎఫ్.ఎ. (ఇప్పటి ఇంటర్) పూర్తి చేసి 14వ ఏట మద్రాస్ వెళ్లి ప్రెసిడెన్సి కాలేజీలో బి.ఎ.లో చేరాడు. బిఎ తరగతి గదిలో కూర్చున్న 14 ఏళ్ల రామన్‌ను చూసి ప్రొఫెసర్ ఇలియట్ అనుమానపడ్డాడు. 'అబ్బాయి, నువ్వు బి.ఎ. విద్యార్థివేనా?' అని ప్రశ్నించాడు. బి.ఎ. ప్రథమ శ్రేణిలో, భౌతికశాస్త్రం ప్రధానాంశంగా అదే యూనివర్శిటీ నుండి 1907లో ఎం.ఎ. పట్టాతోపాటు అప్పట్లో ఎన్ని ఫస్ట్ ప్రైజ్‌లు ఉండేవో అన్నీ రామన్ సొంతం చేసుకున్నాడు.

రామన్ చిన్న నాటి నుంచీ జిజ్ఞాసాపరుడు. క్లాసులో చెప్పినదాంతో తృప్తిపడకుండా ఎన్నో ఇతర పుస్తకాలు చదువుతూ ఉండేవాడు. తన కొచ్చే ఏ సందేహాన్నీ నివృత్తి చేసుకోకుండా వదిలేవాడు కాదు. ఎందుకు? ఎలా? నిజమేనా? అంటూ నోట్స్‌లో ఒక పక్క తన సందేహాలు రాసుకునేవాడు. ఈ ప్రశ్నించే తత్వమే రామన్‌ను ఓ అద్భుత శాస్త్రవేత్తగా రూపుదిద్దింది. తండ్రి సలహా మేరకు, ఫైనాన్షియల్ సివిల్ సర్వీస్ (ఎఫ్‌సిఎస్) పరీక్ష రాశాడు. అందులోనూ ఆయనదే ఫస్ట్ ర్యాంక్. 1907లో రామన్ కోల్‌కతా వెళ్లి ప్రభుత్వ ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్‌లో అసిస్టెంట్ అకౌంటెంట్ జనరల్‌గా నెలకు 400 రూపాయల జీతంతో చేరాడు.

ఒక రోజు రామన్ తన ఆఫీస్‌కు వెళ్తూ దారిపక్కన ఉన్న ఓ బోర్డును చూశాడు. దీనిపై "ఇండియన్ అసోసియేషన్ ఫర్ ద కల్టివేషన్ ఆఫ్ సైన్స్". ఆ సాయంత్రం ఆ భవనంలో అశుతోష్‌దేవ్ ద్వారా అసోసియేషన్ గౌరవ కార్యదర్శి అమృతలాల్ సిర్కార్ వద్దకు వెళ్ళాడు. అక్కడి ప్రయోగశాలలో పరిశోధనలు చేయాలని ఉందన్న రామన్ కోరిక అమృతలాల్‌ను ఆనందంలో ముంచెత్తింది. అందుకు కారణం లేకపోలేదు. తండ్రి మహేంద్రలాల్ సిర్కార్ 1876లో ఆ అసోసియేషన్‌ను నెలకొల్పాడు. స్వదేశీ పరిశోధనలను ప్రోత్సహించాలని, భారతదేశం శాస్త్ర పరిశోధనల్లో ముందడుగు వేయాలని దేశభక్తుడైన మహేంద్రలాల్ తపించేవాడు. తొలుత సభ్యుల కోసం సైన్స్ ప్రసంగాలు ఏర్పాటు చేస్తూ ఉండే ఈ అసోసియేషన్, పరిశోధనల కోసం 1891లో ఒక ప్రయోగశాలను ప్రారంభించింది. విజయనగరం మహారాజు దీనికి కావల్సిన ధన సహాయం చేశాడు. విషాదం ఏమిటంటే మహేంద్రలాల్ జీవించి ఉన్నంతకాలం అందులో పరిశోధనలకు ఎవరూ ముందుకు రాలేదు. భారతీయులకు శాస్త్రీయ స్పృహ లేకపోవడం ఆయనకు తీరని విచారం కలిగించింది. రామన్ వచ్చి ప్రయోగాలు చేస్తాననగానే,

అమృతలాల్ తన తండ్రి కల ఇంతకాలానికి నెరవేరబోతోందని సంతోషించాడు. కేవలం శాస్త్ర పరిశోధనల కోసం దేశంలో ప్రప్రథమంగా ఏర్పాటైన ఆ ప్రయోగశాల దేశంలోనే మొట్ట మొదటి నోబెల్ సైన్స్ అవార్డు గ్రహీతకు అలా తొలి వేదిక అయ్యింది. ఉద్యోగం చేస్తూనే ఖాళీ సమయంలో పరిశోధనలు చేయడం, అదీ అరకొర సదుపాయాలతో.... అంత తేలికేంకాదు. అయినప్పటికీ 1917 వరకూ అక్కడ జరిపిన ప్రయోగాల ఆధారంగా రామన్ రాసిన పరిశోధన పత్రాలను నేచర్, ఫిజిక్స్, రివ్యూ, ఫిలాసఫికల్ మేగజైన్ వంటి అంతర్జాతీయ పత్రికలు ప్రచురించాయి. దాదాపు 30 ఒరిజినల్ పరిశోధన పత్రాలను ఆయన ప్రచురించాడు. ఏకతార, వయోలిన్, తంబుర, వీణ మృదంగం, తబలా వంటి పలు సంగీత పరికరాలను, అవి పలికే స్వరాలను రామన్ లోతుగా అధ్యయనం చేశాడు. వీణ సంబంధిత సంగీత పరికరాలు సృష్టించే ధ్వని ప్రకంపనలపై మెకానికల్ థియరీని ప్రయోగ పూర్వక నిర్ధారణలతో రామన్ అభివృద్ధి పరిచాడు.

1917లో కలకత్తా యూనివర్శిటీ సైన్స్ కాలేజీలో రామన్‌కు ప్రొఫెసర్ ఉద్యోగం ఆఫర్ వచ్చింది. రామన్ సందేహించాడు. ఆ సమయంలో భార్య లోక సుందరి ఇచ్చిన సలహాయే శాస్త్ర ప్రపంచం, భారతదేశం ఓ అమూల్య సైంటిస్టును కోల్పోకుండా కాపాడింది. ఆదాయం గురించి ఆలోచించకుండా ఆచార్య పదవిని చేపట్టవలసిందిగా ఆమె సలహా ఇచ్చి ప్రోత్సహించింది. 1917 జులైలో రామన్ కలకత్తా యూనివర్శిటీలో ప్రముఖ భౌతిక శాస్త్రవేత్త 'సర్ తారకానాద్ పలిత్ ఆచార్య పీఠం' అధిష్టించాడు. కలకత్తా యూనివర్శిటీలో చేరినా అసోసియేషన్ ప్రయోగశాలను విస్మరించలేదు. అక్కడ పరిశోధనలు కొనసాగించాడు. యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా నియమితుడైన తర్వాత, అసోసియేషన్ సహచరులతో ముఖ్యంగా, ప్రఖ్యాత ఖగోళ భౌతిక శాస్త్రవేత్త మేఘనాథ్ సాహాతో ప్రయోగశాల వినియోగంపై విభేదాలు పొడసూపాయి. రామన్‌ను బయటి వ్యక్తిగా చూసేవారని ఒక ఆరోపణ ఉండేది. అసోసియేషన్ సభ్యులు రామన్‌ను 1933లో గౌరవ కార్యదర్శి పదవి నుండి దింపేశారు. రామన్ అవమానం భరించలేక పోయాడు. అసలే ఆయనకు హిమాలయాలంత ఆత్మాభిమానం ఉండేది. బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ కౌన్సిల్ ప్రతిపాదనలతో 1933లో రామన్ కోల్‌కతా వదిలి 'ఐఐఎస్‌సి'కి రామన్ తొలి భారతీయ డైరెక్టర్‌గా మారాడు. చేరీ చేరడంతో సంస్థలో రామన్ మార్పులు చేపట్టాడు. భౌతిక శాస్త్రానికి మరోకొత్త విభాగం ప్రారంభించాడు. మిగిలిన వాటిని పునర్ వ్యవస్థీకరించాడు. చక్కటి ఉద్యానవనాలు నాటించి పరిసరాలను సుందరంగా తీర్చిదిద్దాడు. ఉన్నతస్థాయి పరిశోధనలు ప్రారంభించాడు. క్వాంటం మెకానిక్స్, క్రిస్టల్ కెమిస్ట్రీ, విటమిన్లు, ఎంజైముల రసాయనిక శాస్త్రం వంటి రంగాల్లో మౌలిక పరిశోధనల కోసం అసాధారణ ప్రతిభావంతులను సంస్థలో నియమించతలపెట్టాడు. అదే సమయంలో జర్మనీ నుండి హిట్లర్ జాత్యహంకార విధానాలు తట్టుకోలేక పలువురు శాస్త్రవేత్తలు విదేశాలకు వెళ్లిపోతున్నారు. వారిలో కొందరినైనా భారత్‌కు రప్పించాలని రామన్ ప్రయత్నించాడు. రామన్ జాబితాలో పలువురు విదేశీయుల పేర్లున్నాయి. కాని మ్యాక్స్ బోర్న్ ఒక్కడినే రప్పించగలిగాడు. స్వల్పకాలం మాత్రమే బోర్న్ బెంగుళూరులో ఉండి మళ్లీ వెనక్కు వెళ్లిపోయాడు. రామన్ తీసుకుంటున్న ఇలాంటి చర్యలు అప్పటికే ఉన్న పాత వారికి, పాలకులకు రుచించలేదు.

ఒక్కక్షణం కూడా వృథా చేయరాదన్నది రామన్ విధానం. రిటైర్ అయిన రెండో రోజు నుంచి పరిశోధన కొనసాగించడానికి వీలుగా రెండేళ్ల ముందు నుంచీ ఏర్పాట్లు చేసుకున్నాడు. తాను స్థాపించిన ఇండియన్ అకామీ ఆఫ్ సైన్సెస్ ఆధ్వర్యంలో ప్రయోగశాల ఏర్పాటుచేసుకుని, పదవీ విరమణ తర్వాతి రోజే దానిలోకి అడుగుపెట్టి తను అనుకున్నది సాధించాడు. 'రామన్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్'గా ఆయన పేరుతోనే ఏర్పడిన ఈ పరిశోధన సంస్థకోసం రామన్ తన యావదాస్తీ వెచ్చించాడు. నూటికి నూరు శాతం చురుకైన ఫలప్రదమైన జీవితాన్ని కోరుకున్న రామన్ తన కోరిక నెరవేర్చుకున్నాడు. చివరి వరకూ పరిశోధనలోనే జీవించిన ఈ సహజ శాస్త్రవేత్త తన 83వ ఏట, 1970 నవంబర్ 21న కన్నుమూశాడు. ప్రతి సంవత్సరం గాంధీ జయంతి రోజున రామన్ ఏదో ఒక ప్రత్యేక అంశం గురించి ప్రసంగం ఇచ్చేవాడు. 1970లో శ్రవణశక్తికి సంబంధించిన కొత్త సిద్ధాంతాలపై చివరి శాస్త్ర ప్రసంగం చేశాడు. ఎలాంటి ఆధునిక పరికరాలు లేకుండానే తన సహజ సిద్ధమైన మేధా కౌశల్యంతో ప్రకృతి రహస్యాలను ఛేదించి విజ్ఞాన ప్రపంచంలో భారత కీర్తి పతాకను రెపరెపలాడించాడు.

1895-
1989

# లాపాషనారియా

డోలెరెస్ గోమేజ్ ఇబర్రూరి (లాపాషనారియా) స్పెయిన్‌లో జరిగిన రిపబ్లిక్ అనుకూల ఉద్యమకారిణి. స్పెయిన్ అంతర్యుద్ధ సమయంలో ఆమె ఫ్రాంకో ఆధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడారు. యుద్ధరంగంలో దూసుకుపోయే నాయకురాలిగా, అణగారిన వర్గాలను అక్కున చేర్చుకునే తల్లిగా పేరొందిన ఇబర్రూరి మంచి వక్త. నీరసపడిన తన సహచరులను తన ధీరత్వానికి దీటుగా ఉత్తేజితులను చేసే ఉపన్యాసాలతో ఆమె కార్యోన్ముఖులను చేసేవారు. 1936లో మాడ్రిడ్‌లోని రేడియో కేంద్రంపై దాడి సందర్భంగా ఆమె ఇచ్చిన "మోకరిల్లి జీవించేకన్నా మన కాళ్ళపై మనం నిలబడి మరణించడమే మేల"న్న పిలుపు 'నోపసారన్' (వారు మనను దాటి వెళ్ళరు) అన్న ఫ్రాంకో వ్యతిరేక దళాల నినాదానికి కారణమైంది. కమ్యూనిస్టు భావాలకు అంకితమైన విప్లవకారిణి అయిన ఇబర్రూరిపై ద్వేషంతో మితవాద వర్గానికి చెందిన ఆమె ప్రత్యర్థులు ఆమెపై నిందలు మోపేవారు. తర్వాత కాలంలో ఆమె స్టాలిన్‌కు ఇచ్చిన మద్దతు కూడా ఫాసిస్టులు ఆమెను దారుణమైన అవకాశవాదిగా విమర్శించడానికి కారణమైంది. 1939లో ఫాసిస్టులు విజయం సాధించినపుడు ఆమె మొదట పారిస్‌కు, అక్కడి నుంచి మాస్కోకు వలస వెళ్లారు. అక్కడ సోవియట్ నాయకుల ఆశ్రయంలో కొంత కాలం ఉన్న అనంతరం 1977లో పెద్ద ఎత్తున ప్రచారార్భాటం మధ్య స్వదేశానికి తిరిగివచ్చారు.

ఇబర్రూరి మొదటి నుంచి అంతర్జాతీయ కమ్యూనిజం ఉద్యమానికి విధేయురాలు. చిన్న వయసులోనే ఆమె రాడికల్ భావాల ప్రభావానికి లోనయ్యారు. ఇబర్రూరి 1895లో స్పెయిన్ ఉత్తర ప్రాంతంలోని విజ్కాయాప్రావిన్స్‌లో జన్మించారు. 11 మంది సంతానంలో ఆమె ఎనిమిదవది. ఆ ప్రాంతంలో అప్పట్లో పరిస్థితులు దయనీయంగా ఉండేవి. తరచు మారుతున్న వాతావరణంలో, దుర్భర దారిద్ర్యం తాండవించే పరిస్థితుల్లో ఆమె జీవించారు. ఆకలికి అలమటించే పరిస్థితిలోనే ఆమె కుటుంబ సభ్యులుండేవారు ఇబర్రూరి మినహా మిగతా సభ్యులందరూ జీవనోపాధి నిమిత్తం అత్యంత ప్రమాదకరమైన డావిన్‌పోట్ గనులలో పనిచేసేవారు. ఇబర్రూరిని ఉపాధ్యాయురాలిని చేయాలన్న కృతనిశ్చయంతో ఆమె తల్లిదండ్రులు మాత్రం స్కూలుకు పంపేవారు. అయితే కుటుంబ ఆర్థిక పరిస్థితి మరింత దిగజారడంతో ఆమె కూడా పనిమనిషిగా పనిచేయడం, బట్టలు కుట్టడం, చేపలు అమ్మడం వంటి పనులు చేయవలసి వచ్చింది. తన 20వ ఏట ఆమె జూలియన్ రుయిజ్ అనే ఒక గని కార్మికుణ్ణి వివాహమాడారు. అజ్ఞాత సోషలిస్ట్ ఉద్యమ కార్యకర్త కూడా అయిన రుయిజ్ ఆమెకు మార్క్స్, లెనిన్ భావజాలానికి సంబంధించిన పుస్తకాలు ఇచ్చాడు. ఆ పుస్తకాలు, భావజాలం తనకు మార్గదర్శకమయ్యాయని దానితో జీవితం ఒక బురద గుంట కావలసిన అవసరం లేదు. ఒక యుద్ధరంగం కూడా కావచ్చని అందులో తాను అంకితభావంతో పాల్గొనే సైనికురాలిని కూడా కావచ్చని గ్రహించినట్లు ఆ తర్వాత తన రచనల్లో ఆమె పేర్కొన్నారు. ఇదిలా ఉండగా ట్రేడ్ యూనియన్ కార్యకలాపాల్లో పాల్గొన్నందుకుగాను ఆమె భర్త తరచు జైలు పాలయ్యేవాడు. దానితో కుటుంబ పోషణకు అతని నుంచి సాయం లభించేది కాదు. దుర్భర దారిద్ర్యంతో సరైన వైద్యసాయం లేక ఆమె ఆరుగురు సంతానంలో నలుగురు మరణించారు.

రష్యా విప్లవం తర్వాత ఇబర్రూరి పేరు లాపాషనారియాగా మారింది. ఎల్ మినిరో విజ్కెయినో పత్రికలో రాసిన సంపాదకీయం కోసం వాడిన లాపాషనారియా అన్న కలంపేరే ఆమె పేరుగా స్థిరపడి పోయింది. 1920లో ఆమె బాస్క్ కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఆ తర్వాతి సంవత్సరం ఆ పార్టీ వ్యవస్థాపక సమావేశానికి ప్రతినిధిగా హాజరయ్యారు. 1931లో రిపబ్లిక్ ప్రకటన అనంతరం ఆమె మాడ్రిడ్‌కు మారి పార్టీ పత్రిక అయిన 'వర్కర్స్ వరల్డ్'కు ఎడిటర్ అయ్యారు.

అంతేగాక ఆమె పొలిట్‌బ్యూరోలోని మహిళా వ్యవహారాల బాధ్యతలు నిర్వహించేవారు. ఇబర్రూరి జీవితం ఆమె భావాలు రాడికల్ భావాలతో కూడి ఉండేవి. అందువల్ల ఆమె తరచు జైలు పాలయ్యేవారు. ఉద్యమాల బాటలో ఉన్న తనతోపాటు తన పిల్లలు కూడా వీధిన పడవలసి వస్తున్నందున ఆమె వారిని మాస్కోలోని ఒక ప్రత్యేక స్కూలుకు పంపివేసింది. ఆ రోజుల్లో రష్యా బయట పనిచేస్తున్న కమ్యూనిస్టు కార్యకర్తలు తమ పిల్లలను అదే విధంగా మాస్కో పంపేవారు. అనంతరం ఆమె స్పానిష్ కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీ సభ్యురాలుగాను, అక్కడి పార్లమెంటులో ఆస్ట్రియా ప్రాంతానికి చెందిన ప్రతినిధిగాను పదవులు చేపట్టారు. దానితో జాతీయ స్థాయిలో ఆమెకు తగినంత పలుకుబడి లభించింది. అప్పట్లో పార్లమెంటులోని రాచరిక వర్గం సభ్యుడు జోస్ కాల్వో సొటిలో హత్యకు గురయ్యాడు. ఆ హత్య కారణంగానే స్పెయిన్‌లో అంతర్యుద్ధం మొదలయ్యింది. కొంత మంది చరిత్రకారుల అభిప్రాయం ప్రకారం లాపాషనారియా ఘాటైన ఆవేశపూరిత విమర్శలే సొటిలో హత్యకు కారణమై ఉండవచ్చన్న అభిప్రాయాన్ని కూడా వ్యక్తం చేశారు.

అంతర్యుద్ధ సమయంలో లాపాషనారియా పేరు విశ్వవ్యాప్తమైంది. రాజధాని గోడలపై ఆమె బొమ్మ దర్శనమిచ్చేది. రేడియోలద్వారా ఆమె చేసే ఉద్రేక పూరిత ప్రసంగాలతో పెద్ద ఎత్తున యువత రిపబ్లికన్ ఆర్మీలో చేరడంతో వారి సంఖ్య పెరిగిపోయేది. దానితో తరచు దేశభక్తియుతమైన ర్యాలీలు కూడా జరిగేవి. ఆమె పార్టీ విరాళాల కోసం యూరప్ అంతటా పర్యటించారు. సహాయం కోసం అనేక మార్లు రష్యన్లపై ఒత్తిడి తెచ్చారు. మాడ్రిడ్ వద్ద దీర్ఘకాలం జరిగిన పోరులో ఆమె కందకాలు తవ్వి, బారికేడ్లు ఏర్పాటు చేసి, ప్రజాసైన్యాన్ని సమీకరించి, యుద్ధంలో పాల్గొనే దళాలకు ఆహారం, మందులు సరఫరా చేసేందుకు లక్షమంది మహిళలను మొహరించింది. ఆ యుద్ధంలో తమ దేశస్తులకు సాయం చేసేలా 40 వేల మంది విదేశీయులను బ్రిగేడ్లలోకి, వలంటీర్‌దళాలలోకి చేర్చుకోవడంతో ఆమె కీలకపాత్ర వహించారు. ప్రపంచవ్యాప్తంగా విస్తరిస్తున్న ఫాసిజానికి, ప్రజాస్వామ్యంపై జరుగుతున్న దాడిని ప్రతిఘటిస్తున్న మిత్రులుగా వారిని ఆమె స్వాగతించారు.

అయితే 1939లో రిపబ్లిక్ అణచివేతకు ముందు ఆమె రష్యాకు వలసపోయారు. అక్కడ నుంచి ఆమె రెండవ ప్రపంచయుద్ధం సందర్భంగా సోవియట్ అనుకూల, ఫ్రాంకో వ్యతిరేక ప్రచార ప్రసారాలు చేపట్టేవారు. ఆమె సుమారు నలభై సంత్సరాలు అక్కడే గడిపారు. ఒక రకంగా ఆమె కొమింటర్న్‌కు చెందిన బలమైన ప్రతినిధిగా పేరు పొందారు. ఆమె కార్యకలాపాలు ఫాసిస్టు పాలనలో ఉన్న స్పెయిన్‌లో స్వచ్ఛమైన కమ్యూనిస్టు జ్వాల జ్వలించేలా చేశాయి. తన ప్రవాస జీవితమంతా ఆమె అతివాద కమ్యూనిజం మద్దతుదారుగానే గడిపారు. అయితే 1968లో సోవియట్ యూనియన్ ప్రాగ్‌ను ఆక్రమించినపుడు మాత్రం ఆమె నిరసన వ్యక్తం చేశారు. అంతర్యుద్ధ కాలంలో రిపబ్లికన్ పక్షానికి బేషరతుగా సహాయం అందించినందుకుగాను ఆమె స్టాలిన్ తనకు తెలిసిన కమ్యూనిస్టులందరిలోకి గొప్పవానిగా ప్రశంసించారు. అయితే స్టాలిన్ సాగించిన అకృత్యాలను ఆమె విస్మరించారు. ప్రవాసంలో ఎన్నో కష్టనష్టాలను అనుభవించిన ఆమె సహచరులు ఆమెకు రష్యా ఇస్తున్న ప్రత్యేక ఆతిథ్యం చూసి విసుగు చెందేవారు.

1977లో ఫ్రాంకో మరణానంతరం రెండేళ్ళకు ఆమె స్వదేశానికి తిరిగివచ్చారు. అక్కడి పార్లమెంటుకు ఆమె ఎన్నికయ్యారు. 82 ఏళ్ళ వయసులో ఆమె స్వదేశంలో అడుగిడినపుడు సైసైసై డొలోరెస్ ఎస్టా ఆక్వి అంటూ ఆమెకు స్వాగత గీతాలతో ఘనస్వాగతం లభించింది. నల్లటి దుస్తులతో, వయోభారంతో వంగినా అదే హుందాతనంతో ఆమె 1938 నవంబరులో బార్సిలోనాలో ఇంటర్నేషనల్ బ్రిగేడ్స్‌కు వీడ్కోలు పలుకుతూ చేసిన "యూ ఆర్ హిస్టరీ, యూ ఆర్ లెజెండ్, వి షల్‌నాట్ ఫర్గెట్ యు" అన్న వ్యాఖ్యల్ని గుర్తు తెచ్చుకున్నారు.

1894–
1955

# శాంతి స్వరూప్ భట్నాగర్

రావల్పిండి వద్ద చమురు కోసం డ్రిల్లింగ్ చేస్తున్న బ్రిటీష్ కంపెనీకి అనుకోని సమస్య ఉత్పన్నమైంది. డ్రిల్లింగ్‌లో వస్తున్న బురద మట్టి ఉప్పునీటితో కలిసి గట్టిపడి రాయిలా మారుతోంది. దాన్ని విశ్లేషించడం కష్టమైంది. పని ఆగిపోయింది. ఈ సమస్యను ఎలా అధిగమించాలో దిక్కుతోచని బ్రిటిష్ కంపెనీ భట్నాగర్‌ను ఆశ్రయించింది. ఆయన అప్పటికే రసాయనిక శాస్త్రవేత్తగా ఎమల్షన్స్, కొల్లాయిడ్స్ పై అధ్యయనాల్లో పేరుగాంచాడు. విడదీయరాని రెండు ద్రవాల సమ్మేళనాన్ని ఎమల్షన్ అంటారు. పాలు ఇందుకు ఉదాహరణ. అలాగే, ద్రవంలో బంకలా ఉండే క్షార పదార్థాలు కొల్లాయిడ్స్. చమురు కంపెనీకి ఎదురైన బురద సమస్య భట్నాగర్‌కు ఆసక్తి కలిగించింది. లాహోర్‌లోని పంజాబ్ యూనివర్శిటీ ప్రయోగశాలలో ఆయన ఈ సమస్యను అధ్యయనం చేశాడు. డ్రిల్ చేసిన బురదకు జిగురు కలిపితే సమస్య పరిష్కారమవుతుందని సలహా ఇచ్చాడు. ఇంత సులభంగా సత్వరంగా సమస్య పరిష్కారం కావటం కంపెనీ అధికారులను ఆశ్చర్యంలో ముంచెత్తింది. కంపెనీకి భారీ నష్టాలు తప్పాయి. భట్నాగర్‌కు పారితోషికంగా ఆ రోజుల్లోనే రూ. 1,50,000 ఇస్తామన్నారు. కాని, ఆయన ఆ డబ్బు తీసుకోవడానికి ఇష్టపడలేదు. దాన్ని పంజాబ్ యూనివర్శిటీకి విరాళంగా ఇవ్వమని కోరాడు. దాంతో అక్కడ పెట్రోలియంపై పరిశోధనల కోసం ఓ కొత్త విభాగం ప్రారంభమైంది. ఈ ఉదంతం తెలుసుకుని మేఘనాథ్ సాహా వంటి ప్రముఖులు భట్నాగర్‌ను అభినందనలతో ముంచెత్తారు.

మన దేశంలో అత్యధిక సంఖ్యలో రసాయన ప్రయోగశాలల ఏర్పాటుకు డాక్టర్ శాంతి స్వరూప్ భట్నాగర్ విశేష కృషి చేశారు. ఆయనకు ప్రయోగశాలల పితామహుడనే పేరుండేది. రసాయన శాస్త్రంలో ఎమ్మెస్సీ పూర్తి చేసిన భట్నాగర్ ఫెలోషిప్ చేయడానికి అప్పట్లో ఇంగ్లాండ్ వెళ్ళాడు. లండన్ విశ్వవిద్యాలయం నుంచి ఆర్గానిక్, ఎమల్షన్ విభాగంలో ఫెలోషిప్ (డి.ఎస్సీ) తీసుకున్న భట్నాగర్ మాతృదేశంపై ప్రేమతో ఇండియా వచ్చాడు. రెండున్నరేళ్ళ పాటు బెనారస్ హిందూ యూనివర్శిటీలో రసాయన శాస్త్రంలో అధ్యాపకుడిగా పనిచేశారు. రసాయన శాస్త్ర విద్యార్థులకు అతని సహ అధ్యాపకులకు ఎన్నో విషయాలలో భట్నాగర్ మార్గదర్శకుడిగా నిలిచారు. ముఖ్యంగా శాస్త్రీయ విషయాల్లో అవగాహన పెంచుకునేందుకు వచ్చిన విద్యార్థులను భట్నాగర్ విశేషంగా ప్రోత్సహించేవారు. చమురు శుద్ధిరంగం, పెట్రోలియం కంపెనీలకు, రసాయన సాంకేతిక విభాగాల్లో డాక్టర్ భట్నాగర్ చేసిన కృషిని ఎంతో మెచ్చుకున్న నాటి బ్రిటిష్ ప్రభుత్వం ఆయనకు అత్యున్నత సర్ గౌరవాన్నిచ్చి సత్కరించింది. భట్నాగర్ సామర్థ్యాన్ని గుర్తించిన ప్రథమ భారత ప్రధాని నెహ్రూ స్వతంత్ర భారతంలో శాస్త్ర, సాంకేతిక ప్రగతికి భట్నాగర్ లాంటి శాస్త్రవేత్తలు చాలా అవసరమని నమ్మారు. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ ఇండస్ట్రియల్ రీసెర్చ్ సంస్థను డాక్టర్ భట్నాగర్ ఆధ్వర్యంలో నెహ్రూ నెలకొల్పారు.

రసాయన మిశ్రమాలైన ఎమల్షన్, కొల్లాయిడ్స్, పారిశ్రామిక రసాయనాల్లో అపూర్వ పరిశోధనలు చేసిన భట్నాగర్ చాలా పరిశోధనల్లో యూరప్ అమెరికా శాస్త్రవేత్తల కంటే ముందున్నారు. మాగ్నెట్ కెమిస్ట్రీలో విశేష కృషి చేసిన భట్నాగర్ ఎందరో యువ శాస్త్రవేత్తలను ఈ రంగంలో తయారు చేశారు. అయస్కాంత శక్తిని ఉపయోగించి రసాయన మూలకాలను వేరుచేయడంలో భట్నాగర్ కొత్త పంథాలను సృష్టించారు.

మరో యువశాస్త్రవేత్త ఆర్.ఎస్. మాథుర్ సాయంతో రూపొందించిన 'భట్నాగర్-మాథుర్ ఇంటర్ ఫియరెన్స్ బ్యాలెన్స్' ఎన్నో రసాయన పరిశ్రమలకు కోట్లాది రూపాయలు ఆదా చేశాయి. ఈ 'ఇంటర్ ఫియరెన్స్ బ్యాలెన్స్' ఫార్ములాను ఒక బ్రిటీష్ సంస్థ కొనుగోలు చేసి కోట్లాది పౌండ్ల సొమ్మును ఆర్జించింది.

మాతృదేశంపై మమకారంతో భట్నాగర్ అప్పుడప్పుడే అభివృద్ధి చెందుతున్న భారత్‌లో శాస్త్ర సాంకేతిక అభివృద్ధికి బీజం వేశాడు. 1940లోనే ఎన్నో బ్రిటిష్, అమెరికా సంస్థలు ఆయన మరిన్ని ప్రయోగాలు చేసేందుకు వీలుగా పూర్తి స్థాయి వసతి సౌకర్యాలతో కావలసినంత డబ్బు, సహాయకులను ఇస్తామని ప్రకటించాయి. వీటన్నింటిని తిరస్కరించిన ఆయన మన దేశ అభివృద్ధిని కాంక్షించి ఇక్కడే స్థిరపడదామనుకున్నాడు.

వాసన రాని మైనం తయారీ, కిరోసిన్‌ను బాగా మండేలా శుద్ధి చేసే ప్రక్రియ, పెట్రోలియం వ్యర్థాలను చమురు పరిశ్రమల్లో తిరిగి వినియోగించుకోవడం ఇలాంటి అనేక అంశాలు భట్నాగర్ పరిశోధన ఫలాలే. పేటెంట్ల ద్వారా తనకు లభించిన సొమ్మును చాలా వరకు పంజాబ్ యూనివర్శిటీలో పరిశోధనా సదుపాయాల కోసం ఇచ్చేశాడు. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాలు వ్యక్తిగత సంపాదనకు మార్గాలు కాకూడదని విశ్వసించిన శాంతి స్వరూప్ భట్నాగర్ 1894 ఫిబ్రవరి 21న ఇప్పటి పాకిస్తాన్‌లోని షాపూర్‌లో పుట్టాడు. 8 నెలల పసితనంలోనే తండ్రిని కోల్పోయిన భట్నాగర్ ఉత్తర ప్రదేశ్‌లోని తన మాతామహుని ఇంట పెరిగాడు. తాత ఇంజనీరు కావడంతో మనవడి మీద ఆ ప్రభావం పడింది. బాల్యంలోనే బ్యాటరీలు, స్ప్రింగ్ టెలిఫోన్లు తయారు చేస్తూ ఉండేవాడు. సాహిత్యంలోనూ భట్నాగర్‌కు ఆసక్తి ఉండేది. కాలేజిరోజుల్లో రాసిన ఉర్దూ నాటకానికి ప్రథమ బహుమతి లభించింది. 1921లో లండన్ యూనివర్శిటీ నుంచి డి.ఎస్.సి. డిగ్రీ తీసుకున్న భట్నాగర్ పారిశ్రామిక రసాయనాలలోనే కాకుండా మ్యాగ్నెట్ కెమిస్ట్రీలో సొంత ఆవిష్కరణలు చేశాడు. 1940లో కొత్తగా ఏర్పాటైన డైరెక్టరేట్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చ్'కి భట్నాగర్‌ను డైరెక్టర్‌గా నియమించారు. తర్వాత, ఇదే సంస్థ కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చ్ (సీఎస్ఐఆర్)గా మారింది.

బ్రిటిష్ ప్రభుత్వం భట్నాగర్‌కు 'ఆర్డర్ ఆఫ్ ది బ్రిటిష్ ఎంపైర్' బిరుదు ప్రదానం చేసింది. 1943లో రాయల్ సొసైటీ ఫెలో అయ్యాడు. భారత ప్రభుత్వం 1954లో పద్మవిభూషణ్‌తో సత్కరించింది. నెహ్రూ ప్రోత్సాహంతో దేశంలో శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాలకు భట్నాగర్ పునాదులు వేశాడు. చమురు శుద్ధికి, టిటానియం, జిర్కోనియం లోహాల ఉత్పత్తికి కర్మాగారాలు నెలకొల్పడంలో కీలక పాత్ర పోషించాడు. అణుశక్తి ఖనిజాలు, పెట్రోలియం నిల్వల అన్వేషణకు ప్రణాళికలు రూపొందించాడు. 1955 జనవరి 1న తాను కన్నుమూసే నాటికి దేశంలో భట్నాగర్ 12 జాతీయ ప్రయోగశాలలు నెలకొల్పాడు. యూనివర్శిటీల నుంచి బయటకు వచ్చే యువశాస్త్రవేత్తలు విదేశాలకు వెళ్ళాల్సిన అవసరం లేకుండా పరిశోధనలు చేసుకునేందుకు వీలు కల్పించాలన్న ధ్యేయంతో ఇవి ఏర్పాటు అయ్యాయి. ప్రస్తుతం సీఎస్ఐఆర్ ఆధ్వర్యంలో మొత్తం 40 ప్రయోగశాలలు ఉన్నాయి. సైన్స్, ఇంజనీరింగ్, టెక్నాలజీల్లో విశేష ప్రతిభ కనబరిచిన శాస్త్రవేత్తలకు సీఎస్ఐఆర్ ఏటా ఆయన గౌరవార్థం 'శాంతి స్వరూప్ భట్నాగర్ అవార్డు'లు ఇస్తోంది.

# ఎం.ఎస్. స్వామినాథన్

'ఆహార ధాన్యాన్ని దిగుమతి చేసుకోవడమంటే నిరుద్యోగాన్ని దిగుమతి చేసుకున్నట్టే. ఇతర దేశాల రైతులను ప్రోత్సహించినట్టే' అన్నారు భారత హరిత విప్లవ సారథి ఎం.ఎస్. స్వామినాథన్. ఆయన దూరదృష్టి, పట్టుదల, త్యాగనిరతి, దేశభక్తి, అన్నిటినీ మించి రైతన్నమీద, అన్నార్తులమీద ఆయనకు ఉన్న ప్రేమాభిమానాలు ఆయన చేత హరిత విప్లవానికి బాటలు వేయించాయి.

నౌక నుంచి దిగితేగాని తినడానికి ఆహార పదార్థాలు లేని పరిస్థితి నుంచి గోదాములు నిండి ధాన్యాన్ని ఎక్కడ నిల్వచేసుకోవాలో తోచని సంతృప్తికర పరిస్థితికి దేశాన్ని తీసుకువచ్చిన వ్యక్తి డాక్టర్ ఎం.ఎస్. స్వామినాథన్ అంటే అతిశయోక్తి కాదు. ఒక్క భారత్‌లోనే కాదు, యావత్ ఆసియాలో ఆమాటకొస్తే ఆసియా వెలుపలకూడా వ్యవసాయ రంగంలో ఆయన పెను విప్లవం తెచ్చారు. జన్యుశాస్త్రవేత్త అయిన మొన్‌కొంబు సాంబశివన్ స్వామినాథన్ అనేక హైబ్రిడ్ వంగడాల సృష్టి కర్త. ఆయన పరిశోధనల ఫలితంగానే వ్యవసాయ దిగుబడులు ఇబ్బడి ముబ్బడిగా పెరిగాయి. దేశంలో హరిత విప్లవం వచ్చింది. ఆసియా ఖండంలో 'కరువు' అన్న మాట మాయమైపోయింది.

స్వామినాథన్ కృషి ఫలితంగా పంజాబ్ నుంచి పూసాన్ వరకు పంటల పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఏ పొలంలో చూసినా సాంప్రదాయిక వంగడాలు పోయి అధిక దిగుబడినిచ్చే హైబ్రిడ్ పంటలు కనిపిస్తున్నాయి. స్వామినాథన్, భారతదేశంలోనూ, మరికొన్ని ఆసియా దేశాల్లోనూ ఉన్న ఆయన సహచరులు కనుగొన్న హైబ్రిడ్ వంగడాలు రైతుల పరిస్థితిని, తద్వారా వివిధ దేశాల ఆహార భద్రతను ఎంతో మెరుగుపరిచాయి. ఆసియా ఖండంలోని అనేక దేశాలలో జనాభా విపరీతంగా పెరిగిపోతుండటంతో ఆహార ధాన్యాల విషయంలో స్వయం సమృద్ధి సాధించడ మన్నదిచాలా కాలంపాటు ఓ కలగానే మిగిలిపోయింది. అత్యధిక జనాభాగల చైనాలో 1958 నుంచి 1962 వరకు సంభవించిన కరువు కాటకాలకు సుమారు3 కోట్ల మంది ప్రజలు బలైపోయారు. ఇండియాలోనూ అదే పరిస్థితి. అమెరికా నుంచి దిగుమతి అయ్యే తిండి గింజల కోసం ఆశతో, ఆతృతతో ఎదురుచూడాల్సిన దుస్థితి.

ఈ నేపథ్యంలో 1960 దశకంలో ఢిల్లీలోని స్వామినాథన్ ప్రయోగశాలలోనూ తర్వాత ఫిలిప్పీన్ అంతర్జాతీయ పరిశోధనా సంస్థలోనూ ఒక 'అద్భుతం' ఆవిష్కృతమైంది. అధిక దిగుబడినిచ్చే వంగడాలు ఉత్పన్నమయ్యాయి. అమెరికాకు చెందిన ప్రఖ్యాత వ్యవసాయ శాస్త్రవేత్త నార్మాన్‌బోర్‌లాగ్ మెక్సికోలో అభివృద్ధి పరిచిన అధిక దిగుబడి వంగడాలను స్వామినాథన్ ఇండియాకు తెచ్చి, స్థానిక వంగడాలతో సంకరం చేసి హైబ్రిడ్ వంగడాలను సృష్టించారు. ఈ విధంగా సంకరం చేసి అభివృద్ధి పరిచిన గోధుమ సంప్రదాయ వంగడాల కన్నా చాలా ఎక్కువ దిగుబడిని ఇచ్చింది. ఐ.ఆర్.ఆర్.ఐ శాస్త్రవేత్తలు వారి పంటలు కూడా దీన్ని అన్వయం చేసి 'అద్భుత' వంగడాన్ని సృష్టించారు. ఈ హైబ్రిడ్ వంగడాలు అందరి ఆకలి తీర్చడమే కాదు, 1980-90 దశకంలో అనేక ఆసియా దేశాలు ఆహార రంగంతోపాటు ఆర్థిక రంగంలో అభివృద్ధి సాధనకు దోహదం చేశాయి.

అన్ని విప్లవాలకు ఒక మూలం ఉన్నట్టే హరిత విప్లవానికి మూలం 'విత్తనం'. ఈ విప్లవ సారథి స్వామినాథన్‌కు ఒక విప్లవకర్తకు ఉండాల్సిన అన్ని లక్షణాలూ ఉన్నాయి. దూరదృష్టి, అంకితభావం, అలుపెరగకుండా కృషి చేసే తత్వం, చేసిన పని ఎలాంటి ఫలితాన్నిస్తుందో సమీక్షించుకుని ముందుకు సాగే గుణం స్వామినాథన్ సొత్తు.

స్వామినాథన్ తమిళనాడులో జన్మించారు. ఆయన తండ్రి ఒక వైద్యుడు. ఆయన మహాత్మాగాంధీ అభిమాని. చిన్నప్పుడే స్వామినాథన్ తన తండ్రి వెంట గాంధీజీ ప్రసంగించిన ఒక సభకు వెళ్ళాడు. ఆ సభలో గాంధీ విదేశీ వస్తు బహిష్కరణ గురించి ప్రసంగించారు. ఆ ప్రసంగాన్ని స్వామినాథన్ తన జీవితంలో ఎప్పుడూ మర్చిపోలేదు.

కాలేజీలో ఆయన ఆకర్షణీయమైన వృత్తి విద్యలను వదులుకున్నాడు. నలుగురుకి తిండి పెట్టే వ్యవసాయాన్ని ఎంచుకున్నాడు. నాకు దేశానికి సేవ చేయాలనిపించింది. అని చెప్పారు. మద్రాసులో స్వామినాథన్ ఏర్పాటు చేసిన 'ఎం.ఎస్.స్వామినాథన్ రీసెర్చ్ ఫౌండేషన్' రైతును విజ్ఞానవంతులను చేయడానికి, అధునాతన పద్ధతిలో సేద్యాన్ని ప్రోత్సహించడానికి ఎన్నో రకాల కార్యకలాపాలు నిర్వహిస్తుంది. రైతుకు ఇంటర్నెట్ విజ్ఞానాన్ని సైతం అందిస్తుంది. మొదట ఆయన ఓ పోలీస్ ఆఫీసర్‌గా ఎంపికయ్యారు. అయితే 1949లో ఆయనకు ఫెలోషిప్ రావడంతో నెదర్లాండ్స్‌లో జన్యుశాస్త్రం అభ్యసించారు. అది ఆయన జీవన గమనాన్నే మార్చివేసిన ఘట్టం. 1952లో ఆయన కేంబ్రిడ్జి యూనివర్శిటీలో పి.హెచ్.డి. పూర్తి చేశారు. ఆ తర్వాత విస్కాన్సిన్‌లో ఆయన మరింత ఉన్నత విద్యను చదివారు. అక్కడ ఆయన తనకు అందివచ్చిన ప్రొఫెసర్ ఉద్యోగాన్ని తిరస్కరించారు. 'నేను జన్యుశాస్త్రం ఎందుకు చదివాను. అది భారత ప్రజలకు అవసరమైనంత ఆహారం పండించడానికి. అందుకే నేను వెనకకు తిరిగి వచ్చాను' అని ఆయన ఓ సందర్భంలో అన్నారు.

'ఆహారాన్ని దిగుమతి చేసుకోవడమంటే నిరుద్యోగాన్ని దిగుమతి చేసుకున్నట్టే. మన దేశంలో 70 శాతం మంది ప్రజలు వ్యవసాయం మీద ఆధారపడి జీవిస్తున్నవారే. ఆహారాన్ని దిగుమతి చేసుకోవడం ద్వారా మనం ఇతర దేశాల రైతులను ప్రోత్సహిస్తున్నామన్నమాట' అని ఆయన వ్యాఖ్యానించారు. 1966కల్లా ఆయన ఢిల్లీలోని భారత వ్యవసాయ పరిశోధనా సంస్థ (పి.ఎ.ఆర్.ఐ)కి డైరెక్టర్ అయ్యారు. ఎక్కువకాలం ఆయన రైతులతో వ్యవసాయ క్షేత్రాలలో గడుపుతూ, ఉత్పాదకాలను పెంచడానికి ప్రయత్నించారు.

గోధుమ పంటకు రసాయన ఎరువులు ఎక్కువ వాడినా ప్రమాదమేనని ఆయన గ్రహించారు. ఎరువులు ఎక్కువగా వాడటం వల్ల మొక్కలు మరింత ఏపుగా పెరిగి కంకుల బరువుకు దంట్లు వాలిపోయి నష్టం జరగడం గమనించారు. జపాన్, మెక్సికోలకు చెందిన ఒక గోధుమ వంగడం పొట్టిగా ఉండి, ఎక్కువ దంట్లతో ఎక్కువ కంకులు వేయడం గమనించారాయన. రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ సహకారంతో దాన్నే ఇండియాకు తెచ్చాడు. పొట్టిగా ఉండటంవల్ల ఆ మొక్కలు బలంగా నిలబడటమే కాకుండా ఎక్కువ దిగుబడి ఇచ్చాయి. దాన్ని మన దేశంలోని ఒక గోధుమ వంగడంతో సంకరం చేశారు. బంగారు వర్ణంలో మిళమిళ మెరిసే ఆ నూతన గోధుమ వంగడం భారతీయులను విపరీతంగా ఆకర్షించింది.

హరిత విప్లవంలో ఇది పెద్ద ముందడుగు అయ్యింది. 1966లో స్వామినాథన్ ఢిల్లీ వెలుపల 2000 నమూనా వ్యవసాయ క్షేత్రాలను ఏర్పాటు చేసి ఈ నూతన వంగడం గురించి ప్రచారం చేశారు. అప్పుడు మరో సమస్య వచ్చింది. 18 వేల టన్నుల గోధుమ విత్తనాన్ని మెక్సికో నుంచి దిగుమతి చేసుకోవాల్సిన అవసరం వచ్చింది. దానికి పెద్ద మొత్తంలో డబ్బు అవసరం వచ్చింది. పైగా అది కరువు కాలం. కానీ ఆయన అప్పటి ప్రధాన మంత్రి లాల్ బహదూర్ శాస్త్రిని ఒప్పించారు. ఆయన శ్రమ, ప్రయత్నం వృధా కాలేదు. ఆ విత్తనాలతో భారత రైతులు గోధుమ దిగుబడిని అంతకు ముందటి సంవత్సరంతో పోల్చితే మూడు రెట్లు పెంచరు.

ఒక శాస్త్రవేత్తగానే కాదు, రాజకీయ నాయకులను ఒప్పించి, మెప్పించే సామర్థ్యం, చాకచక్యం కూడా డాక్టర్ స్వామినాథన్‌కు ఉన్నాయి. శాస్త్రి తరువాత ప్రధాని అయిన ఇందిరాగాంధీని ఆయన మెప్పించి నూతన వ్యవసాయ విధాన రచనకు దోహదం చేశారు. రైతులకు విరివిగా ఋణాలు ఇప్పించారు. నవీన సేద్య విధానాలను వారు అనుసరించేలా చూశారు. ఫలితంగా గోధుమ దిగుబడి విపరీతంగా పెరిగింది. 1960వ దశకంలో కోటీ 20 లక్షల టన్నుల గోధుమ పండించిన భారత్ ఇప్పుడు 7 కోట్ల టన్నుల గోధుమను పండిస్తున్నది. హరిత విప్లవ సారథిగా స్వామినాథన్ చిరస్మరణీయుడుగా నిలుస్తారు.

1919-
1971

# విక్రం అంబాలాల్ సారాభాయి

1943లో ఓ 23 ఏళ్ళ నవ యువకుడు ఇల్లు వదలి హిమాలయాల బాట పట్టాడు. విశ్వ రహస్యాలు శోధించి వాటి గుట్టు విప్పాలన్న తపన అతడిని మంచుకొండల మీదికి నడిపించింది. ఆ యువకుడే భవిష్యత్తులో ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్తగా రూపుదిద్దుకున్నాడు. భారత కీర్తి ప్రతిష్టలను అంతరిక్షంలో రెపరెపలాడించాడు.

విక్రమ్ అంబాలాల్ సారాభాయి 1919 ఆగస్ట్ 12న అహ్మదాబాద్‌లోని ఓ సంపన్న పారిశ్రామిక కుటుంబంలో పుట్టాడు. సారాభాయి ఇంట్లో 8 మంది పిల్లలు ఉండేవారు. వారి కోసం ఇంట్లోనే ఒకపాఠశాల పెట్టించారు. ఆ ఇంటిబడిలో గ్రంథాలయంతోపాటు ప్రయోగశాలలు, వర్క్‌షాపులు ఉండేవి. పుట్టింది వ్యాపార కుటుంబమైనా గణితం, భౌతిక శాస్త్రాలంటేనే విక్రమ్‌కు మక్కువ ఎక్కువ. హోమీబాబాలాగే పరిశ్రమలకు బదులు పరిశోధనలనే తన లక్ష్యాలుగా చేసుకున్నాడు. బాబా లాగా కేవలం ప్రయోగశాలల స్థాపన, పరిశోధనలకే పరిమితం కాకుండా మరో అడుగు ముందుకేసి దేశంలో రకరకాల సంస్థలు నెలకొల్పాడు. నూతన సాంకేతిక పరిజ్ఞానంతో పరిశ్రమలు అభివృద్ధి చెందడానికి విశేష కృషి చేశాడు. విదేశాలకు తీసిపోకుండా భారత్ అన్ని రంగాల్లో ప్రగతి సాధించి ముందంజ వేయాలని విక్రమ్ కలలు కనేవారు. విక్రమ్‌పై మహామహుల ప్రభావం బాగా పడింది. గాంధీజీ, రవీంద్రనాథ్‌ఠాగూర్, జిడ్డుకృష్ణమూర్తి, జవహర్‌లాల్‌నెహ్రూ, సరోజినీ నాయుడు, మౌలానా అజాద్, సి.ఎఫ్.ఆండ్రూస్, సి.వి.రామన్‌లు అహ్మదాబాద్ వచ్చినప్పుడు సారాభాయిల ఇంట్లోనే బస చేసేవారు. అలాంటి ప్రముఖులతో విక్రమ్‌కు సాన్నిహిత్యం ఉండేది.

కాలేజి చదువు తర్వాత ఇంగ్లాండ్ వెళ్లి కేంబ్రిడ్జి యూనివర్శిటీలో ఉన్నత విద్య కొనసాగించాడు. 1939లో తన కిష్టమైన భౌతిక శాస్త్రంలో 'ట్రిపోస్ పరీక్ష' ఉత్తీర్ణుడయ్యాడు. బాబాలాగే కాస్మిక్ కిరణాలు విక్రమ్‌ను కూడా ఆకట్టుకున్నాయి. సుదూర విశ్వం నుంచి భూవాతావరణంలోకి ప్రవేశించే శక్తి రేణువుల ప్రవాహాలే కాస్మిక్ కిరణాలు. ఇవి భూమిని చేరే ముందు భూవాతావరణం, భూ అయస్కాంత క్షేత్రాల ప్రభావానికి లోనవుతాయి. అంతరిక్ష విశేషాలను ఈ కిరణాల అధ్యయనం ద్వారా తెలుసుకోవాలని విక్రమ్ భావించాడు. పూనా సెంట్రల్ మెట్రియొలాజికల్ స్టేషన్‌లో కొంత కాలం పరిశోధన చేసి, కాశ్మీర్‌లోని హిమాలయ శిఖరాలకు వెళ్లి తన తదుపరి అధ్యయనాన్ని కొనసాగించాడు. 1947లో కేవిండిష్ లేబొరేటరీలో 'ఫొటోఫిషన్' అంశంపై పరిశోధన చేసి పి.హెచ్.డీ పొందారు. కేంబ్రిడ్జి నుంచి స్వదేశం తిరిగి వచ్చి అహ్మదాబాద్‌లో నేషనల్ ఫిజికల్‌రీసెర్చ్ లాబొరేటరీని స్థాపించాడు. కాస్మిక్ కిరణాలు, సుదూర విశ్వాలపై ఇక్కడ ఉన్నత పరిశోధనలు సాగాయి. 1955లో కాశ్మీర్‌లోని గుల్‌మార్గ్ వద్ద ఈ ప్రయోగశాలకు అనుబంధంగా ఒక శాఖను ఏర్పాటు చేశాడు. కేంద్ర అణుఇంధన విభాగం తర్వాత ఇది పూర్తిస్థాయి పరిశోధనకేంద్రంగా రూపుదిద్దుకొంది. ఇంత ఎత్తులో ఉన్న పరిశోధనా కేంద్రం ప్రపంచంలో ఇదొక్కటే. హోమీ బాబా స్థాపించిన 'టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసెర్చ్ (టిఐఎఫ్ఆర్), అణుశక్తి పరిశోధనకు ఎలా దోహదపడుతోందో ఆ రీతిలో భారత అంతరిక్ష కార్యక్రమానికి 'నేషనల్ ఫిజికల్ ల్యాబొరేటరీ' ఉపకరిస్తోంది.

హోమీబాబా మరణానంతరం 1966లో ఆటమిక్ ఎనర్జీ కమిషన్ ఛైర్మన్‌గా విక్రమ్ సారాభాయి

నియమితుడయ్యాడు. అణుశక్తి పరిశోధనలకు హోమీబాబా పితామహుడైతే దేశాన్ని అంతరిక్ష యుగంలోకి నడిపించిన వ్యక్తి విక్రమ్‌సారాభాయి. ఆయన ఇండియన్ స్పేస్ రీసెర్చ్ ఆర్గనైజేషన్ (ఇస్రో)ను బహుముఖంగా విస్తరించాడు. తుంబా లో స్పేస్ టెక్నాలజీ సెంటర్, అహ్మదాబాద్‌లో ఎక్స్‌పెరిమెంటల్ శాటిలైట్ కమ్యూనికేషన్ ఎర్త్ స్టేషన్‌ల ఏర్పాటు సారాభాయి ఆలోచనల ఫలితమే. భారత్ తొలి ఉపగ్రహం 'ఆర్యభట' 1975లో అంతరిక్షానికెగిసిన ఖ్యాతి సారాభాయిదే.

తన జీవిత కాలంలో సారాభాయి ఎన్నెన్నో సంస్థలను నెలకొల్పారు. వీటిలో సైన్స్‌కి సంబంధించనివి చాలా ఉన్నాయి. సామాజిక విద్యారంగాల్లో దేశం ఎదుర్కొంటున్న సమస్యలపై అధ్యయనానికి ఏర్పాటైన 'నెహ్రూ ఫౌండేషన్ ఫర్ డెవలప్‌మెంట్' వాటిలో ఒకటి. విద్యార్థుల్లో, ఉపాధ్యాయుల్లో, సాధారణ ప్రజల్లో శాస్త్రీయ విజ్ఞానం వ్యాప్తి చేయడానికి, సైన్స్ పట్ల అభిరుచి పెంచడానికి, ప్రయోగాలను ప్రోత్సహించడానికి దోహదపడేలా 1966లో 'కమ్యూనిటీ సైన్స్ సెంటర్'ను స్థాపించాడు. అహ్మదాబాద్‌లోని ప్రపంచ స్థాయి "ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్" (ఐఐఎం) విక్రమ్ సారాభాయి స్థాపించిందేనన్నది చాలా మందికి తెలియని విషయం. అలాగే, అహ్మదాబాద్‌లో వస్త్ర పరిశ్రమ కోసం పరిశోధన సంస్థ ప్రారంభించాడు. ఔషధ పరిశ్రమ వ్యాప్తి కోసం తీవ్ర కృషి చేశాడు. తానేంచేసినా మాతృదేశం అభివృద్ధే విక్రమ్ ప్రథమ ధ్యేయంగా ఉండేది. ఉన్నత విద్య కోసం విదేశాలకు వెళ్లడాన్ని ఆయన ప్రోత్సహించాడు. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాల్లో అక్కడ వచ్చిన నూతన పరిణామాలను అధ్యయనం చేయాల్సిన అవసరం ఉందని భావించాడు. అయితే, విదేశాలకు వెళ్లిన వారు అక్కడే ఉండిపోవద్దని, తిరిగి వచ్చి మాతృదేశానికి సేవ చేయాలని యువతకు ఉద్బోధించేవాడు. భారత్‌లో సరైన వాతావరణం, సదుపాయాలు కల్పిస్తే యువ శాస్త్రవేత్తలు తప్పకుండా స్వదేశానికి తిరిగొస్తారని అభిప్రాయపడేవాడు.

విక్రమ్ సారాభాయి ఆగర్భ శ్రీమంతుడైనప్పటికీ, నిరాడంబరంగా, నిగర్విగా ఉండేవాడు. అందరినీ సమానంగా చూసేవాడు. ఆయన మృదుభాషి. కష్టజీవి. అర్థరాత్రి వరకు ప్రయోగశాలలోనే పని చేసుకుంటూ ఉండేవాడు. హోమీబాబాలాగే విక్రమ్ సారాభాయి కూడా చిన్న వయసులోనే 1971 డిసెంబర్ 31న కన్నుమూశాడు. అప్పటికి ఆయన వయస్సు 52 సంవత్సరాలు.

భారత్‌లాంటి పేద దేశానికి ఇంత భారీ ఖర్చుతో అంతరిక్ష పరిశోధనా కార్యక్రమాలు ఎందుకని చాలా మంది ప్రశ్నించారు. అంతరిక్ష ప్రయోజనాలను ప్రపంచ దేశాలన్నీ గుర్తించాయి. రేపటి తరం ఎన్నో అంశాల గురించి అంతరిక్షంపై ఆధారపడాల్సిందే. మనం అత్యంత వ్యయప్రయాసలతో చంద్రునిపై అడుగుపెట్టాలని నేను కోరడం లేదు. ఈ విషయంలో అమెరికా, రష్యా తదితర సంపన్న దేశాలతో పోటీ పడాలని కూడా నేను అనడం లేదు. అయితే అంతరిక్షంలోకి ఉపగ్రహాలు పంపి, మన గురించి మనం తెలుసుకునే స్థాయిలో పురోగమించాలి. భవిష్యత్తులో కమ్యూనికేషన్స్, వినోదం, వాతావరణ పరిస్థితులకు ఉపగ్రహాలే మనకు సాయపడతాయి. అంతెందుకు శత్రువులు మనపై దాడి చేస్తున్నారా లేదా అన్న విషయాలు తెలుసుకోవాలన్నా మనం అంతరిక్షంవైపు చూడాల్సిందే. అంతరిక్ష పరిజ్ఞానాన్ని మనం స్వతంత్రంగా పెంచుకుని దాన్ని సామాన్య మానవుడి సంక్షేమం కోసమే వినియోగిద్దాం" అని సారాభాయ్ వివరించారు.

1896-
1948

# ఎల్లాప్రగడ సుబ్బారావు

ఆధునిక వైద్య విజ్ఞాన శాస్త్ర పరిశోధనా రంగంలో అపరధన్వంతరి, మన తెలుగుబిడ్డ ఎల్లాప్రగడ సుబ్బారావు. ఆయన గురించి అమెరికన్లకు తెలిసినంతగా భారతీయులైన మనకు తెలియకపోవచ్చు. ఎన్నో కష్టనష్టాలు, సవాళ్ళు ఎదుర్కొని అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయం, ప్రపంచ ప్రఖ్యాత మందుల కంపెనీ లీడర్లీ సంస్థలో పనిచేసి అద్భుతమైన ప్రాణాధార మందులను కనుగొన్నారు. ఆర్థోమైసిన్, ఫోలిక్ యాసిడ్, టెట్రాసైక్లిన్, బోదవ్యాధి మందు ఆయన మానవాళికి అందించిన దివ్య ఔషధాలు.

మధ్యయుగాల నుండి 20వ శతాబ్దం వరకూ కోట్లాది మందిని బలిగొన్న ప్లేగు వ్యాధికి సుబ్బారావు టెట్రాసైక్లిన్ అనే దివ్య ఔషధాన్ని కనుగొన్నారు. ఇప్పటికీ ప్రపంచంలో అత్యధిక మందిని బలితీసుకునే దోమ కారణంగానే వచ్చే మలేరియాకు మందు డాక్సీసైక్లిన్ అప్పట్లో ప్రపంచ ఔషధ వాణిజ్యరంగంలో సంచలనం సృష్టించింది. ప్రస్తుతం మార్కెట్లో లభ్యమవుతున్న ఎన్నో యాంటీ బయోటిక్ మందులకు టెట్రాసైక్లిన్ మూల రసాయనం. 1945లో సుబ్బారావు రూపొందించిన ఫోలిక్ యాసిడ్, స్ప్రూ మందులు ఇవ్వాళ్టికి కూడా ఎందరో రోగులకు ప్రాణాధార ఔషధాలుగా పని చేస్తున్నాయి. పెన్సిలిన్ పేరు చెప్పగానే అలెగ్జాండర్ ఫ్లెమింగ్, మశూచి పేరు చెప్పగానే లూయీ పాశ్చర్ గుర్తొచ్చినట్లుగా టెట్రాసైక్లిన్, ఫోలిక్ యాసిడ్ పేర్లు చెప్పగానే మన తెలుగువాడైన ఎల్లాప్రగడ సుబ్బారావు గుర్తుకు రాకపోవడం నిజంగా శోచనీయం.

గోదావరీ తీరాన ఉన్న కొత్తూరు జగన్నాథపురంలో మధ్యతరగతి కుటుంబంలో ఎల్లాప్రగడ పుట్టారు. తండ్రి జగన్నాథం. మెట్రిక్యులేషన్ రెండుసార్లు తప్పడంతో మద్రాసులోని స్కూల్లో చేర్చారు. అక్కడ అతి కష్టంమీద మెట్రిక్యులేషన్ పాసై తరువాత రామకృష్ణ మిషన్‌లో చేరి పట్టుదలతో ఇంటర్‌లో డిస్టింక్షన్ సాధించారు. 1915లో రామకృష్ణ మిషన్ ప్రోత్సాహంతో సుబ్బారావు మద్రాసు మెడికల్ కాలేజీలో చేరారు. ఆ తరువాత హార్వర్డ్ స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్ సంస్థలో సీటు రావడంతో 1923వ సంవత్సరంలో బోస్టన్ వెళ్ళి పరాన్నభుక్కు జీవశాస్త్రాన్ని అధ్యయనం చేశారు. కొంత మంది అమెరికన్ శాస్త్రవేత్తల సహాయంతో 1925లో భాస్వరం బేరీజుపై ఫిస్క్- సుబ్బారావు పద్ధతి ఆవిష్కృతమైంది. అంతర్జాతీయ 13వ వైద్య మహాసభలలో తన కొత్త పరిశోధనలపై పత్రం సమర్పించాడు. 1930లో సుబ్బారావుకు హార్వర్డ్ విశ్వవిద్యాలయం పిహెచ్‌డి పట్టాను ప్రదానం చేసింది. 1940లోగా ఎన్నో ప్రయోగాలు చేసి వాటిలో అద్భుతమైన ఫలితాలు చూపిన ఈ శాస్త్రవేత్తకు లీడర్లీ అనే సంస్థలో ఉద్యోగం వచ్చింది. సుబ్బారావు తన శక్తియుక్తుల్ని, తెలివితేటలను ఉపయోగించి శిలీంధ్రియ ప్రక్రియద్వారా కేవలం నాలుగు డాలర్ల ఖర్చుతో వైద్యరంగంలో విప్లవమనదగ్గ ఫోలిక్ యాసిడ్‌ను కనుగొన్నారు. అది నవజాత శిశువుల వెన్నుపాముల్లో వచ్చే సమస్యలకు ప్రపంచవ్యాప్తంగా వైద్యులు ప్రతిపాదించే మందు. ఫోలిక్ యాసిడ్ క్యాన్సర్ వంటి ప్రాణాంతక రోగాలపై కూడా పనిచేస్తుందని కొందరు డాక్టర్లు నిర్ధారించడంతో సుబ్బారావు దశ తిరిగింది. క్యాన్సర్‌కు, రుమటాయిడ్ అర్థరైటిస్, సొరియాసిస్, ఎక్టోపిక్ గర్భస్రావం వంటి రోగాలకు మెథోట్రాగ్జేట్ రసాయనం పేరుపొందింది. ఆస్మా రోగులు కూడా మెథోట్రాగ్జేట్ వాడొచ్చని తాజా పరిశోధనలు నిర్ధారించాయి.

ఆఫ్రికా, ఆసియాలోని ఉష్ణమండల దేశాల్లో ప్రబలంగా ఉన్న బోదకాలు వ్యాధికి కూడా ఔషధాన్ని కనుగొనడంలో ఆయన విజయం సాధించారు. 1948 జులై 21న అమెరికన్ మ్యూజియం ఆఫ్ నేచురల్ హిస్టరీ సంస్థలో ప్రసిద్ధ జీవపరిశోధకులు డాక్టర్ దుగ్గర్‌తో కలిసి ఎ-377 అనే టెట్రాసైక్లిన్ మందును సుబ్బారావు ఆవిష్కరించారు. ఇది వైద్య చరిత్రనే ఒక మలుపు తిప్పింది. 1994లో గుజరాత్ రాష్ట్రంలో ప్లేగు వ్యాధి ప్రబలినప్పుడు సుబ్బారావు కనిపెట్టిన ఈ టెట్రాసైక్లిన్ మందే కొన్ని వేల మంది ప్రాణాలు కాపాడింది. నిరంతరం వైద్య సేవలకే జీవితాన్ని అంకితం చేసిన ఈ ఆంధ్ర తేజం 1948 ఆగస్టు 9వ తేదీన నిద్రలోనే తుదిశ్వాస విడిచింది. "టెట్రా సైక్లిన్ రసాయనం మానవజాతికి సుబ్బారావు కానుక" అని అమెరికాలో ప్రధాన పత్రికలు విశేషంగా కీర్తించాయి.

# స్టీవెన్ స్పీల్‌బెర్గ్

యూదు జాతీయుడైన కారణంగా బాల్యంలో ఆయన జాతి వివక్షకు గురయ్యాడు. చిన్నతనంలో ఆయన్ని తల్లిదండ్రులు టీవీ చూడనిచ్చేవాళ్లు కాదు సినిమాలకు వెళ్లనిచ్చేవాళ్లూ కాదు. చదువుల్లో వెనకబడి ఉండేవాడు. బాల్యం నుంచే సినిమా మీద మక్కువ పెంచుకున్న ఆయన తీసిన సినిమాలు ఆయన తల్లిదండ్రులనే కాదు ప్రపంచవ్యాప్తంగా తల్లిదండ్రులను, పిల్లలను ఆకట్టుకుంటున్నాయి. ఆయన సకుటుంబ సపరివార సమేతంగా చూడగల సినిమాలు రూపొందించిన క్లీన్ డైరెక్టర్. కాసులు కురిపించేందుకు కళకు సైన్సును జోడించి సెంటిమెంటునూ పండించిన సినీ సైంటిస్టు. అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి ఆయన రూపొందించిన సినిమాలు ప్రపంచంలో అత్యంత జనాదరణ పొందిన, భారీగా వసూళ్లు చేసిన చిత్రాల్లో అగ్రస్థానంలో ఉంటాయి. 'జాస్'తో మొదలైన ఆయన విజయ ప్రస్థానం 'జురాసిక్ పార్క్'తో తారస్థాయికి చేరింది. 'షిండ్లర్స్ లిస్ట్' ఆయనను అత్యున్నత ఆస్కార్ శిఖరాలకు చేర్చింది. అలాంటి మేటి చిత్రాలను రూపొందించిన ఆయనే సినీ ప్రపంచ దిగ్దర్శకుడు స్టీవెన్ స్పీల్‌బెర్గ్.

స్పీల్‌బెర్గ్ అమెరికాలోని ఓహియో రాష్ట్రంలో గల సిన్‌సినాటిలో జన్మించాడు. ఆర్నాల్డ్, లేహ్ పొస్నర్... స్పీల్‌బెర్గ్ తల్లిదండ్రులు. అయితే తల్లిదండ్రులు ఇంట్లో లేనప్పుడు స్పీల్‌బెర్గ్ టీవీ చూసేవాడు. తల్లిదండ్రులు స్పీల్‌బెర్గ్‌కు ప్రథమ, ద్వితీయ గురువులయితే టీవీ అతడికి మూడవ గురువుగా మారింది. అతడి దృష్టికి టీవీ మరో తల్లిగా కనిపించింది. స్పీల్‌బెర్గ్‌కు ఆరేళ్ల వయసప్పుడు తల్లిదండ్రులు అతడిని 'స్నో వైట్ అండ్ సెవెన్ డ్వార్ఫ్స్' అనే సినిమాకు తీసుకువెళ్లారు. ఆ సినిమాలో మంత్రగత్తెను చూసి భయపడ్డ స్పీల్‌బెర్గ్ చాలా రోజులపాటు తల్లి పక్కలోనే పడుకునేవాడు. ఆ బాలుడే తర్వాత తన సినిమాలలో మెరిసే ఎగిరే పళ్లాలతోను, రాక్షస ఆకారం గల డైనోసార్లతోను కోట్లాది ప్రేక్షకుల వెన్నులో చలి పుట్టించడం వి'చిత్రమే'! తండ్రి దగ్గరున్న 8 ఎంఎం కెమెరాతో స్పీల్‌బెర్గ్ ఇంట్లో జరిగే వ్యవహారాలనన్నింటిని తన చెల్లెళ్లతో కలిసి చిత్రీకరించేవాడు. యూదు జాతీయుడైన కారణంగా స్కూల్లో అతడు జాతి వివక్షకు గురయ్యేవాడు. శ్వేత జాతి పిల్లలు స్పీల్‌బెర్గ్‌ను తరచు అవమానిస్తుండే వాళ్లు. చదువులో వెనకబడ్డాడు. దీంతో 13 ఏళ్ల వయసులోనే చిత్ర నిర్మాణ పోటీలో గెలిచినప్పటికీ తనకు ఎంతో ఇష్టమైన కాలిఫోర్నియా ఫిల్మ్ యూనివర్సిటీలో స్పీల్‌బెర్గ్‌కు ప్రవేశం దొరకలేదు. దాంతో అతడు కాలిఫోర్నియా లోని లాంగ్‌బీచ్‌లో ఉన్న స్టేట్ యూనివర్సిటీలో చేరాడు. అక్కడ స్పీల్‌బెర్గ్ ఎప్పుడు సినిమానే ధ్యానించేవాడు. శ్వాసించేవాడు. విపరీతంగా సినిమాలు చూసేవాడు. అప్పుడే స్పీల్‌బెర్గ్ 20 నిమిషాల నిడివి కల 'యాంబ్లిన్' అనే లఘు చిత్రాన్ని నిర్మించాడు. దీంతో అతడు హాలీవుడ్ నిర్మాతల దృష్టిలో పడ్డాడు. యూనివర్సల్-ఎంసిఎ నిర్మాణ సంస్థ స్పీల్‌బెర్గ్‌ను దర్శకుడుగా తీసుకుంది. అతడితో ఏడేళ్ల కాంట్రాక్టు కుదుర్చుకుంది. 1971లో స్పీల్‌బెర్గ్ 'డ్యూయెల్' అనే టెలివిజన్ చిత్రానికి దర్శకత్వం వహించాడు. అది విదేశాల్లో విజయవంతమవడంతో 1974లో 'ది సుగర్‌ల్యాండ్ ఎక్స్‌ప్రెస్' అనే సినిమాకు దర్శకత్వ బాధ్యతలు వహించాడు. దర్శకుడిగా స్పీల్‌బెర్గ్‌కు ఇది తొలి చలనచిత్రం. ఈ సినిమా బాక్సాఫీసు దగ్గర బోల్తా పడ్డా చిత్రంలోని సాంకేతిక విలువలు నిర్మాతలను ఆకట్టుకున్నాయి. రిచర్డ్ జనుక్, డేవిడ్ బ్రౌన్ అనే నిర్మాతలు స్పీల్‌బెర్గ్ దర్శకత్వంలో సినిమా తీయడానికి ముందుకువచ్చారు. వీరు నిర్మాతలుగా స్పీల్‌బెర్గ్ సాంకేతిక విలువలను, నైపుణ్యాన్ని జోడిస్తు సొరచేప కథాంశంగా జాస్ చిత్రాన్ని రూపొందించాడు. దీనికోసం 24 అడుగుల కృత్రిమ సొరచేపను తయారుచేశారు. 1975లో విడుదలైన ఈ సినిమా ప్రపంచవ్యాప్తంగా

సంచలనం సృష్టించింది. ఆద్యంతం ప్రేక్షకులను గుక్క తిప్పుకోనివ్వకుండా ఉత్కంఠకు గురిచేసింది. బాక్సాఫీసు రికార్డులను తిరగరాసింది. సినిమాల్లో కొత్త ఒరవడికి శ్రీకారం చుట్టింది. ప్రపంచ సినిమాను కొత్త మలుపు తిప్పింది. స్పీల్‌బెర్గ్ ఇక వెనక్కితిరిగి చూసుకోలేదు.

1977లో స్పీల్‌బెర్గ్ దర్శకత్వంలో వచ్చిన 'క్లోజ్ ఎన్‌కౌంటర్స్ ఆఫ్ ది థర్డ్ వరల్డ్' విజయం ఆయనను మహా దర్శకుల జాబితాలో చేరడానికి మరో మెట్టు ఎక్కించింది. ఈ సినిమాలో గ్రహాంతర వాసులతో పెనవేసుకున్న మానవ సంబంధాలను ఆయన అత్యంత హృద్యంగా చిత్రీకరించాడు. ఓపక్క అసలు కథకు సెంటిమెంటు రంగరించి ప్రేక్షకుల కళ్లలో నీళ్లు చిప్పిల్లేలా చేస్తు మరోపక్క యాక్షన్ సన్నివేశాలను వేగంగా చూపిస్తూ ఇంకోపక్క స్పెషల్ ఎఫెక్ట్స్‌తో ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేసి ఇది కలా, నిజమా అని వారికి ఆలోచించుకోవడానికి ఏమాత్రం అవకాశం లేకుండా చేసి సినిమాను రక్తి కట్టించడంలో స్పీల్‌బెర్గ్‌కు స్పీల్‌బెర్గే సాటి. 1981లో స్టార్‌వార్స్ నిర్మాత జార్జి లూకాస్‌తో కలిసి తీసిన రైడర్స్ ఆఫ్ ది లాస్ట్ ఆర్క్ సినిమాలో ఉపయోగించి స్పీల్‌బెర్గ్ మరోసారి విజయాన్ని చవిచూశాడు. ఈ సినిమాల సిరీస్ నిర్మాణంలోనే 1983లో తనకు పరిచయమైన కేట్ కాప్‌షాను ఆయన వివాహం చేసుకున్నారు. 1982లో విడుదలైన 'ఈటీ' సినిమాతో స్పీల్‌బెర్గ్ హాలీవుడ్ దర్శకుల్లో అగ్రస్థాయికి చేరుకున్నాడు. ప్రేక్షకుల గుండెలను బరువెక్కించాడు. వాళ్ల కన్నీరు ఆయనకు కనకవర్షం కురిపించింది. స్పీల్‌బెర్గ్ సినిమాలన్నీ కుటుంబమే నేపథ్యంగా సాగుతాయని సినీ పండితులు చెబుతారు. ఆ గూడు చుట్టు అల్లుకున్న కుటుంబ సభ్యుల ఆప్యాయతలను తెరకెక్కించి వాళ్లలోని ఓ బుల్లి హీరో ప్రపంచాన్ని కలవరపరచే అంశాన్ని పరిష్కరించేందుకు బయలుదేరతాడు. మధ్యలో అందంగా అల్లుకున్న ఆ పొదరిల్లులో చిచ్చుపెట్టేందుకు వచ్చే దుష్ట శక్తుల పన్నాగాలను ఆ కుటుంబం తిప్పికొట్టడం ఇవన్నీ ప్రేక్షకుడిని తన కుటుంబం గురించి ఆలోచించుకునేలా చేసి మరో ప్రపంచంలోకి తీసుకుపోతాయి. దీంతో సినిమా కచ్చితంగా విజయం సాధిస్తుంది. ఇదే స్పీల్‌బెర్గ్ ఫార్ములా అని సినీ ప్రముఖులు అంటారు.

'ఈటీ' విజయం స్పీల్‌బెర్గ్‌ను అమెరికన్ల హృదయాలకు చేరువ చేయలేదని కొంతమంది హాలీవుడ్ ప్రముఖులు చెబుతారు. 1993లో స్పీల్‌బెర్గ్ దర్శకత్వంలో వచ్చిన జురాసిక్ పార్క్ అద్భుత విజయాన్ని సాధించి ఆయన సినిమాలన్నింటిలోకి ఎక్కువ వసూలు చేసిన చిత్రంగా నిలిచింది. మహా కమర్షియల్ దర్శకుడు స్పీల్‌బెర్గ్ రూటు మార్చి 1993లో 'షిండ్లర్స్ లిస్ట్' సినిమాను తీశాడు. ఈ చిత్రంలో ఆయన హిట్లర్ యూదు జాతిపై సాగించిన సామూహిక నరమేధాన్ని తెరకెక్కించాడు. కాసులతో పాటు విమర్శకుల ప్రశంసలనూ అందుకున్నాడు. అంతవరకు ఆయనను ఊరించిన మరీచిక ఆస్కార్ అవార్డు దక్కింది. ఉత్తమ చిత్రానికి, ఉత్తమ దర్శకుడిగా రెండు ఆస్కార్ అవార్డులను స్పీల్‌బెర్గ్ అందుకున్నాడు.

1994లో హాలీవుడ్ సినిమా మొఘల్స్ జెఫ్రే కాట్జెన్‌బెర్గ్, డేవిడ్ గీఫెన్‌లతో కలిసి స్పీల్‌బెర్గ్ డ్రీమ్‌వర్క్స్ అనే చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించాడు. ఈ సంస్థ 1997లో తమ తొలి చిత్రాన్ని విడుదల చేసింది. బానిస భారతాన్ని తెరకెక్కించింది. బానిసల జీవితాలపై 'అమిస్టడ్' అనే చిత్రాన్ని రూపొందించింది. స్పీల్‌బెర్గ్ సామాజిక సేవల్లోను పాలుపంచుకుంటు తీవ్రంగా జబ్బు పడ్డ పిల్లల కోసం పనిచేసే ఓ కంప్యూటర్ సంస్థకు సహాయసహకారాలను అందిస్తున్నారు. ఈ సంస్థ ఆ పిల్లలు కంప్యూటర్ నిర్మిత అంతరిక్షంలో మనసు విప్పి మాట్లాడుకునేందుకు సహకరిస్తుంది. స్పీల్‌బెర్గ్ సృష్టించిన అనేక ప్రపంచాలలాగానే ఇది కూడా పిల్లలకు మంచి కథలు చెప్పే ఓ లోకంగా మారింది.

# అలెగ్జాండర్ సోల్జెనిత్సిన్

అలెగ్జాండర్ సోల్జెనిత్సిన్‌ను రష్యన్ నవలా రచయితేగాక నైతిక విలువలు కలిగిన వాటిని కోరే వ్యక్తిగా కూడా అభివర్ణించవచ్చు. ఒకప్పటి సోవియట్ యూనియన్ వ్యవస్థలోని నాయకవర్గం ఆగ్రహానికిగురై లేబర్ క్యాంపులలో బందీగా కష్టనష్టాలకు గురైన సోల్జెనిత్సిన్ తన రచనల ద్వారా ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించారు. టాల్‌స్టాయ్, చెకోవ్‌ల వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్నట్టుగా ప్రశంసలందుకున్న సోల్జెనిత్సిన్ రాజకీయ బందీగా కూడా కాలం గడిపారు.

సోల్జెనిత్సిన్ 1918లో జన్మించాడు. రష్యా విప్లవానంతరం అక్కడి కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వం స్థిరపడుతున్న రోజులవి. సోల్జెనిత్సిన్ తండ్రి సోవియట్ సైన్యంలోని శతఘ్నిదళంలో అధికారిగా పనిచేసేవాడు. సోల్జెనిత్సిన్ జన్మించడానికి ఆరు నెలల ముందే అతను మరణించాడు. తల్లే అతనిని తోడి కోడలు ఇరినా స్పేర్ బాక్ సహాయంతో పెంచింది. రొస్టోవ్ ఆన్ డాన్ నగరంలో ఆమె స్టెనో గ్రాఫర్‌గా పనిచేసేది. ఇంకా స్పేర్‌బాక్ కారణంగా సోల్జెనిత్సిన్‌లో పుస్తకాలు చదవడం పట్ల ఆసక్తి కలిగింది. తొమ్మిదేళ్లకే గొప్ప రచయిత అవ్వాలన్న ప్రేరణ కలిగిన సోల్జెనిత్సిన్ పదేళ్లకే టాల్‌స్టాయ్ ప్రసిద్ధ రచన వార్ అండ్ పీస్‌ను పూర్తిగా చదివేశాడు.

సోల్జెనిత్సిన్ మార్క్సిస్టు భావాలు కలవాడే అయినా చిన్నతనంలో తాను ఇష్టపడిన రష్యన్ ఆర్థడాక్స్ చర్చి భావాలను అతడు ఏనాడూ పూర్తిగా విడిచిపెట్టలేదు. సోల్జెనిత్సిన్ 1936లో రూస్టోవ్‌లో పేరెన్నికగన్న స్కూలు నుంచి గ్రాడ్యుయేషన్ పూర్తి చేశాడు. అనంతరం అక్కడే విశ్వవిద్యాలయంలో చేరాడు. అక్కడనే నటాల్యా రెస్టెటోవస్కయా అతనికి పరిచయమవడం, తర్వాత అతడు ఆమెను వివాహం చేసుకోవడం జరిగింది. విచిత్రం ఏమిటంటే సోల్జెనిత్సిన్ తన హనీమూన్ యాత్రలో తన వెంట మార్క్స్ రాసిన 'డాస్ కాపిటల్' పుస్తకాన్ని తీసుకెళ్ళడం.

సోల్జెనిత్సిన్‌కు రచనలు చేయడంపట్ల ఆసక్తి ఉన్నా అతను డిగ్రీ పొందింది మాత్రం గణితంలో. 1941లో అతను డిగ్రీ పొందాడు. అనంతరం ఒక స్థానిక హైస్కూలులో గణితం, ఖగోళ శాస్త్రం బోధించేవాడు. ఇదిలా ఉండగా హిట్లర్ నాయకత్వంలో జర్మనీ రష్యాపై దాడి చేసినప్పుడు అతడు 'రెడ్ ఆర్మీ'లో చేరవలసి వచ్చింది. తండ్రి మాదిరే అతను కూడా శతఘ్నిదళం అధికారి అయ్యాడు. ఒరెల్ యుద్ధంలో ప్రతిభావంతంగా పనిచేసినందుకు అతడికి ఒక పతకం కూడా లభించింది. అలాగే 1944లో ప్రమోషన్ లభించి కెప్టెన్ అయ్యాడు. ఆ తర్వాత సంవత్సరం అతనిని రష్యా గూఢచార సిబ్బంది అరెస్టు చేశారు. అతడు ఒక లేఖలో స్టాలిన్ వ్యతిరేక వ్యాఖ్యలు చేశాడన్న అభియోగంపై అతనిని అరెస్టు చేశారు. తర్వాత అతనిని ఒక అనధికార న్యాయస్థానం ముందు నిలబెట్టి అతడు పూర్తిగా లెనిన్ భావాలతో కూడిన ఒక కొత్త రాజకీయ పార్టీ ఏర్పాటు పట్ల మొగ్గుచూపుతున్నాడని నేరారోపణ చేసి ఎనిమిదేళ్లు లేబర్ క్యాంపులో నివసించాలని శిక్ష విధించారు. 1947లో అధికారులు సోల్జెనిత్సిన్‌ను మార్ఫినో జైలుకు పంపారు. మార్ఫినోజైలులో విద్యావంతులైన వారిని బందీలుగా ఉంచేవారు. అక్కడ విజ్ఞానశాస్త్ర పరిశోధనలు కూడా జరిగేవి. అక్కడ సోల్జెనిత్సిన్ గణిత శాస్త్రవేత్తగా పనిచేశాడు. అక్కడ ఉండగా సోల్జెనిత్సిన్ మార్క్సిస్టు భావాలను విడనాడి మార్ఫినో అధికార యంత్రాంగానికి ఎదురు తిరిగాడు. అక్కడి పరిశోధనా ప్రాజెక్టులలో పనిచేసేందుకు నిరాకరించాడు. చివరకు 1950లో తన పై అధికారులను విమర్శించినందుకుగాను అతనిని కష్టమైన పనులు చేయవలసి వచ్చే ఎకిబాస్టజ్ లేబర్ క్యాంపుకు పంపారు. ఇది కజకిస్తాన్‌లో ఉంది. అక్కడే అతడి తొలి నవల 'వన్ డే ఇన్ ది లైఫ్ ఆఫ్ ఇవాన్ డెనిసోవిచ్‌కు రచనకు కార్యస్థానమయింది. ఆ నవల అంతటిని అతడు చిన్న చిన్న చిత్తు కాగితం ముక్కలపై రాశాడు.

1953లో సోల్జెనిత్సిన్ జైలు నుంచి విడుదలయ్యాడు. అతను జైలు పాలయ్యేందుకు కారణమైన స్టాలిన్ మరణించిన రోజే సోల్జెనిత్సిన్ విడుదలయ్యాడు. అయితే అతడు స్టాలిన్‌కు వ్యతిరేకి అన్న ముద్రవల్ల అతడు మళ్ళీ అరెస్టయి సోవియట్ దక్షిణాసియాలో ఎడతెగని ప్రవాసంలో గడిపాడు. అక్కడ అతడు గణితం, భౌతికశాస్త్రం బోధించేవాడు. అయితే మూడేళ్ల తరువాత 1956లో అతడిని విడుదల చేశారు. దానితో అతనిపై ఉన్న అభియోగమూ రద్దయింది.

ఆ తర్వాత కూడా సోల్జెనిత్సిన్ తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించాడు. అయితే అధికారులకు భయపడి తన రచన ప్రతులను గోప్యంగా ఉంచేవాడు. అవి ఎక్కడ ఉండేవో అతని రెండవ భార్యకు తప్ప ఎవరికీ తెలియకుండా జాగ్రత్తపడేవాడు. 1961లో కమ్యూనిస్టు పార్టీ 22వ కాంగ్రెస్‌లో ప్రకటితమయిన మరింత సరళీకృత సాంస్కృతిక భావజాలం వల్ల ప్రోత్సాహం పొందిన సోల్జెనిత్సిన్ తాను రాసిన 'వన్ డే ఇన్ ద లైఫ్ ఆఫ్ ఇవాన్ డెనిసోవిచ్' నవలను 'నేవిమీర్' (నూతన ప్రపంచం) అనే పత్రికకు ప్రచురణార్థం అందజేశాడు. అప్పటి నేత కృశ్చేవ్ కూడా ఆ ప్రచురణకు ఆమోదం తెలిపారు. దానితో ఒక్కసారిగా సోల్జెనిత్సిన్ పేరెన్నికగన్న రచయిత అయ్యాడు. అయితే ఆ తర్వాత 1964లో త్వరితగతిన కృశ్చేవ్‌ను పదవి నుంచి తొలగించడం జరిగింది. ఆయన తర్వాత లియోనిడ్ బ్రెజ్నేవ్ నాయకత్వంలోని మార్పులను వ్యతిరేకించే ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. ఆ ప్రభుత్వం సోల్జెనిత్సిన్ వ్రాసిన "ఫస్ట్ సర్కిల్" రచన వ్రాత ప్రతిని జప్తు చేసింది. లియోనిడ్ బ్రెజ్నేవ్ ప్రభుత్వం సోల్జెనిత్సిన్‌పై కన్నేసి ఉంచింది. దీనికితోడు సోల్జెనిత్సిన్ పార్టీకి, యూనియన్ ఆఫ్ సోవియట్ రైటర్స్ అనే రచయితల కూటమికి వ్యతిరేకంగా పలు విమర్శలు చేయడంతో ఆ ప్రభుత్వానికి సోల్జెనిత్సిన్‌పై అవిశ్వాసం ఏర్పడింది.

సోల్జెనిత్సిన్ బయటి ప్రపంచంలో పొందుతున్న విజయాలు ప్రశంసలు స్వదేశంలో ఆయనకు ప్రమాదకరంగా పరిణమించాయి. 1970లో ఆయనకు సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది. దానిని అందుకోవడానికి తాను సుముఖంగా లేనట్టు ఆయనచేత ప్రభుత్వం బలవంతంగా చెప్పించింది. 1971లో లండన్‌లో ప్రచురితమైన ఆయన రచన 'ఆగస్ట్ 1914'లో సోవియట్ చరిత్రలోని గ్రేట్ వార్, విప్లవాల గురించి ఆయన వ్యక్తం చేసిన వ్యతిరేక అభిప్రాయాలు అధికారులకు కంటగింపుగా మారాయి. లేబర్ క్యాంపులలో పరిస్థితిని ఆయన కళ్ళకు కట్టినట్టుగా వివరించడంతో 'గులాగ్ ఆర్చిపెలాగో' ఒక భాగం ప్రచురణతో ప్రభుత్వం ఆయనపై విరుచుకుపడింది. ఆ నవలలో గులాగ్‌లు ఇంకా కొనసాగడానికి స్టాలిన్‌నే కాక, రష్యా విప్లవ సారథి లెనిన్‌ను కూడా ఆయన తప్పుపట్టారు. అంతేకాక తమనాయకుల నేరాలకు సోవియట్ ప్రజలే జవాబు దారులని దానిలో పేర్కొన్నారు. ఈ పుస్తకం ఒక భాగం ప్రచురణతో రంగంలోకి దిగిన రహస్య పోలీసులు ఆ పుస్తకం రాత ప్రతి ఎక్కడుందో తెలిపిన సోల్జెనిత్సిన్ టైపిస్ట్‌ను అరెస్టు చేశారు. ఆ టైపిస్ట్ తర్వాత ఆత్మహత్య చేసుకుంది. అప్పటి వరకు తన రచనకు వివరాలను అందిస్తూ వచ్చిన ఆధారాలను కాపాడుకునే ఉద్దేశంతో పుస్తకం మిగతా భాగాలను ప్రచురించకుండా ఆపి ఉంచిన సోల్జెనిత్సిన్ తన పుస్తకం ప్రచురణకు వెంటనే ఆదేశించారు. ఆ పుస్తకం మొదటి సంపుటం రష్యా నుంచి రహస్యంగా బయటకు వచ్చి 1973 డిసెంబరు నాటికి పారిస్‌లోని పుస్తకాల షాపుల్లో ప్రత్యక్షమైంది. ఇది జరిగిన రెండు నెలలకు సోల్జెనిత్సిన్‌ను రష్యా నుంచి బహిష్కరించారు.

సోల్జెనిత్సిన్ వెంటనే అమెరికాకు వలస వెళ్ళారు. అక్కడ నిర్బంధాలు లేని స్వేచ్ఛా వాతావరణంలో స్థిరపడ్డాక ఆయన తనకు ఆశ్రయమిచ్చిన దేశంపై నైతిక విలువలు లేవని విమర్శలు చేశారు. ఆయన భావాలు తెలిసిన ఆయన మద్దతుదారులు కూడా ఆయన ఊహలలో మంచి రష్యా ప్రభుత్వం అంటే ప్రజాస్వామ్యంతో కూడుకున్నది కాదని రష్యా సనాతన చర్చి పునాదులతో ఏర్పడే మత ప్రాతిపదికగల ప్రభుత్వమని తెలిసి ఆశ్చర్యపోయారు. అయితే తనపై వస్తున్న విమర్శలకు ఏ మాత్రం వెరవని సోల్జెనిత్సిన్ నాటకాలు, వ్యాసాలు, కథలు రాయడం కొనసాగించారు. రచనా వ్యాసంగాల మధ్యలో విరామంలో ఆయన తోటపని చేయడం, అడవులలోకి వాహ్యాళికెళ్ళడం చేసేవారు. అయితే పాశ్చాత్య ప్రపంచంలో నైతిక విలువలు పడిపోతున్నాయన్న ఆయన మధ్య మధ్య విమర్శలు గుప్పిస్తున్న తరుణంలోనే ఊహించని ఒక సంఘటన వాటన్నింటికి అంతరాయం కలిగించింది. అదే సోవియట్ యూనియన్ విచ్ఛిన్నం కావడం. 1994లో ఆయన ఒక టెలివిజన్ ప్రదర్శనను సమర్థించేందుకు రష్యా చేరుకున్నారు. దురదృష్టవశాత్తు 'ది రెడ్ వీల్' పేరుతో ఆయన రాసిన విస్తృతమైన రష్యా విప్లవ చరిత్రను రష్యా ప్రజలు, మేధావి వర్గం పెద్దగా పట్టించుకోకుండా విస్మరించారు. అయితే ప్రపంచ సాహిత్యంపై ఆయన రచనల ప్రభావం విస్మరించలేనిది.

1874-
1946

# గెర్ట్రూడ్ స్టీన్

గెర్ట్రూడ్ స్టీన్ అమెరికాకు చెందిన ఒక ప్రముఖ నవలా రచయిత్రి. ఆమె ఒక విలక్షణ రచయిత్రి. ఆధునికత భావనకు మకుటం లేని మహారాణిగా పరిగణన పొందిన ఆమె రోజుకు ఒక అరగంట మాత్రం తనదైన శైలిలో నవలలు, నాటకాలు, రాసేవారు. వీటికి ఇతివృత్తం, సంప్రదాయబద్ధమైన రచనా శైలి ఉండేవి కావు. చిన్నగా కత్తిరించిన జుట్టు, బుద్ధుని వంటి శరీరం, ఆమె చమత్కార శైలి, విజ్ఞానం ఆమెను అగ్ర భాగాన నిలిపింది. "నేను ఈ శతాబ్దపు సృజనాత్మక, సాహితీవేత్త"నని ఆమె ఒకసారి ప్రకటించారు.

పెన్సిల్వేనియాలోని అలెఘెనిలో ఆమె జన్మించారు. పిల్లలందరిలోకి గెర్ట్రూడ్ చిన్నది. ఆమె తండ్రి డేనియల్ స్టీన్, తల్లి అమీలియా స్టీన్. కఠినంగా వ్యవహరించే ఓర్పులేని వ్యాపారవేత్త అయిన తండ్రిని గెర్ట్రూడ్ ద్వేషించేది. ఇక తల్లి నిష్ప్రయోజకురాలని భావించేది. గెర్ట్రూడ్ జన్మించిన అనంతరం మూడేళ్లవరకు ఆమె కుటుంబం యూరప్‌లో ఉండేది. అనంతరం వారు కాలిఫోర్నియాలోని ఓక్ల్యాండ్ వచ్చి స్థిరపడ్డారు. కాగా 1888లో ఆమె తల్లి, 1891లో తండ్రి మరణించారు. పిల్లల్లో ఎవరికీ తల్లి దండ్రులపట్ల అంతగా ప్రేమాభిమానాలు ఉండేవి కావని ఆమె ఒక చోట పేర్కొన్నారు. పిల్లలు చిన్నవారైనందున సంరక్షకులను నియమించడం జరిగింది. అయితే వీళ్ళ పెద్ద సోదరుడు మైకేల్ తర్వాత సంరక్షుడి బాధ్యతలు తీసుకున్నాడు.

గెర్ట్రూడ్ ఆమె కంటే రెండేళ్లు పెద్దవాడైన సోదరుడు లియో మధ్య ఎవరు ఎక్కువ ప్రతిభావంతులమనే విషయంలో గిల్లికజ్జాలు ఏర్పడేవి. వారిద్దరికి ఒకరంటే ఒకరికి ప్రేమాభిమానాలు ఎక్కువ. ఇద్దరూ మసాచుసెట్స్‌లోని కేంబ్రిడ్జిలో పాఠశాల విద్యనభ్యసించారు. ఆ తర్వాత లియో హార్వర్డ్‌లోను, గెర్ట్రూడ్ రాడ్‌క్లిఫ్‌లోని మరో విద్యాలయంలోను చేరారు. అక్కడ ఆమె విలియం జేమ్స్ వద్ద మనస్తత్వ శాస్త్రం అభ్యసించారు. అనంతరం లియో, గెర్ట్రూడ్ జాన్‌హోప్‌కిన్స్ యూనివర్శిటీలో చేరారు. గెర్ట్రూడ్ అక్కడ వైద్య శాస్త్రంలో చేరింది. అక్కడ నాలుగు కోర్సులలో ఫెయిలవడంతో 1903లో వారిద్దరు పారిస్ వెళ్ళి ఆ తర్వాత ప్రసిద్ధి పొందిన 27 రు డి ఫ్లేరస్ ఫ్లాట్‌లో స్థిరపడ్డారు. అక్కడ లియో పెయింటింగ్స్ చేసేవాడు. గెర్ట్రూడ్ కథలు రాసేది. వారు గొప్ప గొప్ప పెయింటింగ్స్ సేకరించారు. అదే విధంగా హెన్రీ మాటిసి, ఫ్రాన్సిస్ పికాబియా, జార్జెస్ బ్రాక్, పికాసో వంటి ప్రసిద్ధ పెయింటింగ్ కళాకారులను కలిసారు. ప్రసిద్ధ పెయింటర్ పికాసో గెర్ట్రూడ్ చిత్రాన్ని కూడా గీసారు. కొద్ది కాలం తర్వాత శాంతమూర్తి అయిన ఎలిస్ బి. టోక్లాస్ వీరితో కలిసింది. కొన్నేళ్ల అనంతరం లియో మరో చోటికి వెళ్ళిపోయాడు. ఆ కాలంలో రకరకాల పెయింటింగ్స్, కొత్త కొత్త కళా రూపాలను సృష్టించే అభ్యుదయ కళాకారులు వీరిని కలవడానికి వచ్చేవారు. స్టీన్, టోక్లాస్‌లు ఆదివారాల్లో తమ అతిథులకు చక్కని ఆహార పదార్థాలు రుచి చూపించేవారు. భోజనాలనంతరం టోక్లాస్ ఆ రచయితల భార్యలు, స్నేహితురాళ్ళతో కబుర్లాడుతూ ఉంటే గెర్ట్రూడ్ రచయితలందరితో చర్చలు జరిపేది.జననం, మరణం, కళ గురించి ఈ చర్చలు సాగేవి. చివరగా గెర్ట్రూడ్ వాటిపై తన అభిప్రాయాలను స్పష్టపరిచేది.

అప్పట్లో గెర్ట్రూడ్ నివాసాన్ని చరిత్రలో కెల్లా నిలిచిపోదగిన అతి గొప్ప సాహితీవేత్తల, కళాకారుల సమావేశ మందిరంగా పేర్కొంటారు. వివిధ కళారూపాలైన ఇంప్రెషనిజమ్, క్యూబిజమ్, సర్రియలిజం వంటి వాటిలో నిష్ణాతులైన కళాకారులతోపాటు జీన్ కాక్టీ, గిల్లామె అపోలినేర్ వంటి రచయితలు తరచు ఆమెతో

సమావేశమయ్యేవారు. అలాగే మరపుకు గురైన తరంగా పేర్కొనే ఇతర దేశాల్లో నివసిస్తున్న అమెరికన్ రచయితలు ఆమెను కలిసేవారు. అప్పట్లో ఆమెతో సమావేశమైన ప్రముఖ రచయితలలో ఎర్నెస్ట్ హెమింగ్వే, ఎఫ్. స్కాట్ ఫిట్జ్ గిరాల్డ్, ఫోర్డ్ మెడాక్స్ ఫోర్డ్, ఎజ్రా పౌండ్ కూడా ఉన్నారు. అయితే తర్వాత తర్వాత పౌండ్‌ను వీరంతా బహిష్కరించారు. దానికి కారణం ఆయనలో పోటీ పడేతత్వం ఎక్కువ కావడం ఒక కారణం కాగా, రెండో కారణం వాదోపవాదాల్లో ఆవేశం పెరిగినప్పుడు ఆయనకు చుట్టూ వున్న వస్తువులను ధ్వంసం చేసే అలవాటు ఉండటం. జేమ్స్ జాయిస్‌ను కూడా గెర్ట్రూడ్ ఆహ్వానించేవారు కాదు. దానికి కారణం ఆధునిక సాహిత్యంలో ఆయనను తనకు ప్రత్యర్థిగా గెర్ట్రూడ్ భావించేవారు.

రుడి ఫ్లేరస్‌లో ఉండగానే స్టీన్ 'త్రీ లైవ్స్' (1910) అనే మానసిక సంబంధ త్రి స్వర కళారూపాన్ని సృష్టించారు. దీనిని సృజించిన వాటన్నిటిలోనికీ ఉత్తమమైనదిగా పరిగణిస్తుంటారు. ఆమె 1914లో 'టెండర్ బటన్స్', 1925లో 'ది మేకింగ్ ఆఫ్ అమెరికన్స్' 'ఏ ఫ్యామిలీ హిస్టరీ', 1931లో 'హౌ టు రైట్', 1933లో 'ఆటో బయోగ్రఫీ ఆఫ్ ఎలిస్ బి టోక్లాస్' రాశారు. 'ఆటో బయోగ్రఫీ ఆఫ్ టోక్లాస్' అనేది ఒక హాస్య రచన.

ఆమె చివరగా రాసిన ఈ రచనే స్పష్టమైన, సమగ్రమైన శైలిలో ఉంటుంది. తన చుట్టూ ఉన్నవారిని నవ్వు పుట్టించే వ్యంగ్య చిత్రాలతో ఉన్న ఈ పుస్తకమే ఆమెను అమెరికాలో పేరొందిన రచయిత్రిగా మార్చివేశాయి. అంతేకాదు పేరు ప్రతిష్టలు పొందాలన్న ఆమె కోరికను తీర్చాయి. ఈ విజయంతో ఆనందం పొందిన ఆమె ఒక సందర్భంలో 'నా చిన్న వాక్యాలు వారి గుండె లోతుల్లోకి వెళ్ళగలిగాయి' అని అన్నారు.

రచయిత్రిగా స్టీన్ రచనలు ఖచ్చితంగా, ప్రయత్నపూర్వకంగా కొత్త పంథాలో రూపొందినవే. ఆమె పదాల ఎంపిక భావానికన్నా ధ్వని ప్రాధాన్యం కలిగి ఉండేది. ఆమె అనుసరించిన శైలిని ఆ తర్వాత చాలా కొద్ది మంది అనుసరించినా ఆ శైలి ఎర్నెస్ట్ హెమింగ్వే, విలియం బరోస్, షెర్‌వుడ్ ఆండర్సన్, జాక్ కెరో ఆక్ వంటి వారిని ఎంతో కొంత ప్రభావితం చేసింది. అంతేకాక వేలాది మంది ఇతర రచయితలపై కూడా అది ప్రభావం చూపింది. స్టీన్ శైలి కళాత్మకంగా ఉంటుంది. ఆమె సేక్రీడ్ ఎమిలీలో రాసిన 'రోజ్ ఈజ్ ఎ రోజ్ ఈజ్ ఎరోజ్, ఈజ్ ఎ రోజ్' ఫోర్ సెయింట్స్ ఇన్ దీ యాక్ట్స్ అనే పుస్తకంలో రాసిన 'పీజియన్స్ ఆన్ ది గ్రాస్ అలాస్ వంటి వాక్యాలు ప్రశంసలకు, విమర్శలకు పాత్రమయ్యాయి.

మొదటి ప్రపంచ యుద్ధ ప్రభావం గెర్ట్రూడ్‌పైనా ఆమె సహచరురాలు టోక్లాస్‌పైనా ఏమాత్రం పడలేదు. అయితే రెండో ప్రపంచ యుద్ధ సమయంలో మాత్రం వారిద్దరూ రక్షణకోసం స్విట్జర్లాండ్‌లోని ఒక గ్రామంలో తలదాచుకున్నారు. పారిస్ విముక్తమైన తర్వాత ఆమె అక్కడకి తిరిగి వచ్చారు. ఆమె జాతీయతావాదం పట్ల ఉదాసీనంగా ఉంటూ వచ్చినా తనను అభిమానిస్తూ తన ఫ్లాట్ వద్ద మూగిన సైనికులపట్ల ప్రేమాదరాలను ప్రదర్శించారు. అంతేకాదు, వారితో కలిసి ఒక అమెరికన్ బాంబర్ విమానంలో కొద్దిసేపు ప్రయాణించివచ్చారు. 1946లో ఆమె క్యాన్సర్ బారిన పడ్డారు. చివరకు మరణశయ్యపై ఉన్నప్పుడు కూడా ఆమె తన సహచరి టోక్లాస్ వైపు తిరిగి 'సమాధానం ఏమిటి'? అని ప్రశ్నించింది. టోక్లాస్ మౌనంగా ఉండటంతో ఆమె మళ్ళీ 'అలా అయితే ప్రశ్న ఏమిటి'? అని తనను తానే ప్రశ్నించుకుంది.

1866-
1925

# సన్-యెట్-సెన్

రాజకీయ అస్థిరత్వం, అనేక చిక్కుల్లో ఉన్న ఆధునిక చైనాలో సన్‌యెట్‌సేన్‌కు విశిష్టమైన స్థానం ఉంది. ఆధునిక చైనా కోసం కలలుగన్న ప్రతి వ్యక్తికి సన్‌యెటొసేన్ ఒక స్ఫూర్తి ప్రదాత. అతన్ని వ్యతిరేకించిన రాజకీయనేతలకు కూడా సన్‌లోని జాతీయభావాలు మంత్రముగ్ధులను చేసేవి. తన జీవితకాలమంతా దేశం కోసం, ప్రజలకోసం పరితపించాడు కాబట్టే అతన్ని 'చైనా విప్లవ పితామహుడు' అని పిలిచేవారు.

సన్‌యెటొసేన్ 1866లో ఆగ్నేయ చైనాలో పుట్టాడు. సన్ పుట్టిన ప్రాంతానికి హాంగ్‌కాంగ్, మకావు నగరాలు దగ్గర్లోనే ఉన్నాయి. సాంప్రదాయ చైనా పద్ధతులతో సన్ ప్రాథమిక విద్యాభ్యాసం కొంత కాలం సాగింది. సన్‌కు 13 ఏళ్ల వయసున్నప్పుడు అతను తన సోదరుడు వలసపోయిన హవాయికి వెళ్ళాడు. హోనలూలులోని ఒక బోర్డింగ్ స్కూలులో మూడేళ్లు సెకండరీ విద్యను, అక్కడి చర్చ్ ఆఫ్ ఇంగ్లీష్ పాఠశాలలో పూర్తి చేశాడు. ఆ తరువాత అదే మిషనరీ నిర్వహించే కళాశాలలో సన్ మెడిసిన్ చదువు పూర్తి చేశాడు. అక్కడే బాప్టిజం తీసుకున్న సన్ క్రైస్తవునిగా మారాడు. హాంగ్‌కాంగ్‌లో 1893 వరకూ సన్ వైద్యునిగా ప్రాక్టీసు కూడా చేశాడు.

ఆధునిక భావాలున్న సన్ హాంగ్‌కాంగ్‌లో సంతృప్తికరంగా తన వైద్యవృత్తిని కొనసాగించలేకపోయాడు. అతనిలోని దేశభక్తి, జాతీయతాభావాలు ఆయనను తన స్వదేశం చైనాలో జరుగుతున్న పరిణామాలు మానసిక అలజడికి గురి చేశాయి. బ్రిటీష్ సామ్రాజ్యవాద పాలనలో చైనా ప్రజల ఇక్కట్లు, రకరకాల ప్రాంతీయ రాజ్యాల్లో పాలకుల అరాచకాలు అతన్ని కలచివేయసాగాయి. చైనాను దీర్ఘకాలం పరిపాలించిన ప్రజాకంటకులు, 'మంచూ' వంశపు రాజుల ఆకృత్యాలను ఎదుర్కొనేందుకు హాంగ్‌కాంగ్‌లోనే ఉండి, ప్రజా చైతన్యాన్ని ఉద్దీపింపసాగాడు. నవ చైనా నిర్మాణానికి ప్రజలను కష్టాల నుండి దూరం చేయడానికి అక్కడి పాలనను కూలదోయడమొక్కటే మార్గమని బలంగా నమ్మాడు. దాని కోసం తనుండే హాంగ్‌కాంగ్ దాని పరిసర ప్రాంతాల్లో రహస్య బృందాలను ఏర్పాటు చేశాడు.

1894నాటికల్లా స్వార్థపరులైన మంచూ (ఛింగ్) రాజులు బలహీనులు కావడంతో జపాన్ సామ్రాజ్యకాంక్షతో చైనామీద దాడులు జరిపింది. జపాన్‌తో జరిగిన యుద్ధంలో చైనాలాంటి పెద్ద దేశం అవమానకరమైన రీతిలో ఓడి పోయింది. పర్యవసానంగా ఆర్థికంగా బలంగా ఉన్న తైవాన్ ప్రాంతాన్ని చైనా జపాన్‌కు కోల్పోయింది. జపాన్ ఈ విజయంతో ఉప్పొంగిపోతే చైనీయులు తమలోతాము కుమిలిపోయారు. సరిగ్గా ఈ పరిస్థితుల్లోనే సన్‌యెటొసేన్ తన విప్లవానికి కార్యాచరణ ప్రణాళిక రూపొందించుకున్నాడు. చైనీయులలో పెరిగిపోతున్న అసంతృప్తిని తనకు అనుకూలంగా మలుచుకున్నాడు. హవాయికి చేరుకుని అక్కడి తన మద్దతుదార్లతోనూ, హాంగ్‌కాంగ్‌లోని మద్దతుదార్లతో సమాలోచనలు జరిపాడు. కొద్దిపాటి అనుచరులతో ఆగ్నేయ చైనా మంచు ప్రాంతీయ పాలకులపై సన్ తన మొదటి తిరుగుబాటు ప్రారంభించాడు. అయితే అంత పెద్ద సామ్రాజ్యాధిపతులతో సన్ జరిపిన పోరు విఫలమైంది. దీంతో చైనా ప్రభుత్వం బ్రిటిష్ సహకారంతో సన్‌యెటొసేన్‌ను హాంగ్‌కాంగ్ నుంచి బహిష్కరించింది. ఆ తరువాత సన్ తన ఉద్యమానికి సహకారం కోరుతూ వివిధ దేశాలు తిరిగాడు. యూరప్, కెనడా, అమెరికాల్లో పర్యటించి మంచూ రాజుల పాలనను అంతమొందించేందుకు నిధులు సేకరించే ప్రక్రియలో పడ్డాడు. అయితే మంచూ రాజులకు వ్యతిరేకంగా సన్ జరుపుతున్న ఉద్యమనికి ప్రవాసంలో ఉన్న చైనీయులు పెద్దగా స్పందించలేదు. అతని సిద్ధాంతాలు నచ్చినప్పటికీ, ఆయుధాలు లేకపోవడం, నిధుల కొరత వంటి కారణాలవల్ల విదేశాల్లో 'సన్'కు సరైన మద్దతు లభించలేదు.

1905 నాటికల్లా సన్ ప్రచారం విదేశాల్లో కొద్దిగా ప్రభావాన్ని చూపసాగాయి. ప్రజలకు పనికొచ్చే మూడు సిద్ధాంతాలంటూ సన్, జాతీయత, ప్రజాస్వామ్యం, సామ్యవాదాలను ప్రతిపాదించాడు. మొదట చైనాకు శాపంగా మారిన మంచూ రాజులను గద్దె దించాలని, ఆ తరువాత దేశాన్ని పట్టి పీడిస్తున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని తరిమేయాలని సన్ పకడ్బందీగా ప్రణాళిక రూపొందించాడు. చైనాలో పాతుకుపోయిన భూస్వాములను తొలగించి

ప్రజలందరికీ భూములు పంచాలని తలపోశాడు. పటిష్టమైన కేంద్ర ప్రభుత్వం స్థాపించి మొత్తం చైనానంతా ఒకే కేంద్రీకృత పాలనకిందకు తేవాలని భావించాడు. ఒకవైపు ప్రజాకంటకులైన మంచూ రాజుల ఆధిపత్యానికి గండిపడుతుండగా మరోవైపు సన్ జాతీయతా ఉద్యమానికి ఆగ్నేయచైనా, హాంగ్‌కాంగ్, తైవాన్, ఉత్తర అమెరికా, కెనడా దేశాల్లోని చైనీయుల నుంచి విశేష మద్దతు లభించింది. క్రమంగా నిధులు కూడా విశేషంగా రాసాగాయి. ప్రజా ఉద్యమం బలపడి ఏ క్షణమైనా ప్రజలు దాడిచేసి తమను తరిమికొడతారన్న అనుమానం కలగడంతో చైనా రాజులు రాత్రికి రాత్రి కోటలను ఖాళీ చేసి పరారయ్యారు.

1911కల్లా చైనాను వందల ఏళ్ళ పాటు పీడించిన మంచూ రాజుల పాలన పరిసమాప్తమయ్యింది. దీంతో చైనాలో ప్రజాస్వామ్యవాదులందరూ కలిసి కొత్తగా చైనా రిపబ్లిక్‌ను స్థాపించారు. దీనికి సన్‌యెట్‌సేన్‌ను అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. చైనాలోని చిన్న చిన్న రాజ్యాలను ఏకం చేసి ఏకీకృత చైనాను సాధించేందుకు బలమైన సైనిక సంపత్తి అవసరమని సన్ తలపోసాడు. అందుకే తన తోటి కార్యకర్తలతో కొమింగ్‌టాంగ్ (జాతీయ పార్టీ)ని స్థాపించాడు. 1913న చైనాలో జరిగిన తొలి సార్వత్రిక ఎన్నికల్లో కొమింగ్‌టాంగ్ విజయం సాధించింది. తొలిసారిగా చైనాలో రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. అయితే దేశంలో రాజకీయ అస్థిరత్వం ఉండడం, కొత్త ప్రభుత్వం బలంగా లేకపోవడంతో మరికొంత కాలం వేచి చూద్దామనే ధోరణితో సన్ తన పదవికి రాజీనామా చేశాడు. యువాన్ షికాయ్‌కు అధ్యక్ష బాధ్యతలు అప్పగించి అజ్ఞాతం లోకి వెళ్ళిపోతాడు సన్. 1913నాటికి షికాయ్ పాలన నచ్చక ప్రజల ఫిర్యాదు మేరకు సన్ మరోసారి తెరమీదకు వచ్చాడు. అయితే అప్పుడు షికాయ్ ఉచ్చుల్లో బిగుసుకొని అతి కష్టంమీద తప్పించుకుని జపాన్ పారిపోయాడు. జపాన్‌లో మళ్ళీప్రజలు, సానుభూతి పరుల మద్దతు కూడగట్టుకొని చైనా ఏకీకరణకు సన్ నడుం బిగించాడు.

అమెరికా, పశ్చిమదేశాల నుంచి సహాయం అందకపోవడంతో ఆధునిక చైనా నిర్మాణానికి తనకు సాయం చేయవలసిందిగా సన్ సోవియట్ యూనియన్‌ను అభ్యర్థించాడు. సోవియట్ ఇదే సమయమనుకొని అతనికి విస్తృతంగా నిధులు, ఆయుధాలు, మనుషులను సమకూర్చింది. దీంతో 1923లో మరోసారి కొమింగ్‌టాంగ్ పార్టీని, సైన్యాన్ని పటిష్టపర్చి అధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు. సన్ ప్రవాసంలో ఉండగానే అమెరికాలో చదువుకున్న సూంగ్ చింగ్ లింగ్‌ను పెళ్ళి చేసుకున్నాడు. సూంగ్ చింగ్ లింగ్ సన్ కన్నా 26 ఏళ్లు చిన్న. రాజకీయంగా ఎన్నో ఆధునిక భావాలున్న లింగ్ అనుక్షణం భర్తకు తన సహాయసహకారాలందించింది. ఎప్పుడూ దేశంకోసం తపించి, ఏకీకృత చైనాకోసం అహరహం పాటుపడిన సన్ కనీసం తన భార్యకోసం ఒక ఇంటిని కూడా నిర్మించుకోలేదు. అయితే సన్ ఆధునిక చైనా నిర్మాణపు హడావుడిలో సోవియట్ యూనియన్ చేతిలో పావుగా మారాడని అమెరికా చరిత్రకారులు విమర్శిస్తారు. మొత్తానికి సన్ లక్ష్యాలు నెరవేరేందుకు అతి తక్కువ కాలం మాత్రమే కాలవ్యవధి ఉన్న కారణంగా చైనాలో అతను కలగన్న ప్రజాస్వామ్యం అప్పటికి ఇంకా వేళ్లూనుకోలేదు. నిరంతర ప్రయాణాలు, సమావేశాలు, ఉద్యమ చర్చలతో సన్ ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. 1925లో ఒక సమావేశంలో పాల్గొనేందుకు బీజింగ్ వచ్చిన సన్ పూర్తిగా నీరసపడిపోయాడు. అతన్ని అంబులెన్స్‌లో హడావుడిగా ఆసుపత్రికి తరలించారు. అక్కడ డాక్టర్లు సన్ కాలేయానికి క్యాన్సర్ సోకిందని నిర్ధారించారు. అక్కడే సన్ తన తుది శ్వాస విడిచాడు.

సన్ మరణించిన తరువాత అతని ప్రాధాన్యతను చైనా ప్రజలు గుర్తించి అతని భౌతిక కాయాన్ని లెనిన్ తరహాలో భద్రపరిచేందుకు పోటీలు పడ్డారు. సన్ భౌతిక కాయానికి గుడికట్టించిన కొమింగ్‌టాంగ్ పార్టీ నేతలు అతని భావజాలాన్ని మరింత లోతుగా ప్రజల్లోకి తీసుకెళ్ళారు. సన్ ఏ లక్ష్యాల కోసం పోరాడాడో వాటిని సాధించేందుకు ప్రతి చైనీయుడూ సిద్ధం కావాలన్న కొమింగ్ టాంగ్ పిలుపుకు ప్రజల నుంచి విశేష స్పందన లభించింది. సన్ పెంచి పోషించిన అతని వారసుడు చాంగై షేక్ ఆ తరువాత చైనాను ఏకీకృతం చేసి సన్ స్వప్నాన్ని సాకారం చేశాడు.

1908-
1986

# సిమన్ ద బూవోర్

నాజీలు ప్యారిస్‌ను ఆక్రమించుకున్న దశ చాలా కల్లోలితమైంది. అన్ని సాంస్కృతికపరమైన చర్చల్లోనూ విభిన్న వాదాలు చర్చకు వచ్చేవి. ఆ సమయంలోనే ఫ్రెంచి తత్వవేత్త, రచయిత్రి సిమన్ ద బూవోర్ మేధోపరంగా పరిణతి చెందింది. ఆమె తన ఏడో ఏటనే రచనా వ్యాసంగం ప్రారంభించింది. సార్త్రె సహచర్యం, ఫ్రాయిడ్, ఆడ్లర్, జంగ్‌ల మానసిక విశ్లేషణ, లెనిన్, స్టాలిన్‌ల పాలన, రెండు ప్రపంచ యుద్ధాలు కళ్ళారా చూసి ఏర్పరచుకున్న ఫాసిస్టు, సామ్రాజ్యవాద వ్యతిరేకత- ఆమెను బలమైన వ్యక్తిత్వమున్న వ్యక్తిగా తీర్చిదిద్దాయి. ఒక చేతిలో కలం, మరో చేతిలో సిగరెట్ పుచ్చుకొని కేఫ్ ఫ్లోరేలో గడిపిన సమయంలోనే ఆమెలోని తాత్విక భావాలు నిర్దిష్ట రూపం సంతరించుకున్నాయి. జీవిత పర్యంతం ఆమె జీవిత భాగస్వామి అయిన జీన్ పాల్ సార్త్ర్ సాధారణంగా ఆమె సరసనే ఉండేవాడు. 1980లో సార్త్ర్ మరణించేదాకా వారిద్దరి మధ్య విభిన్నమైన సంబంధాలు ఉండేవి. సార్త్ర్ ఆమెకు స్నేహితుడు, ప్రేమికుడు, ఆదర్శ పురుషుడు, గురువు, వ్యతిరేకి, సహకుట్రదారు, కలల సహచరుడు. వారిద్దరి సహజీవనానికి అమితమైన ప్రచారం వచ్చింది. యాభై ఏళ్లపాటు కలిసి అనుభవాలు కలబోసుకున్నారు. ఒకరిని విస్మరించి మరొకరి గురించి ప్రస్తావించడం అసాధ్యం. వారిద్దరూ సోర్బొనె ఇకేల్‌లో 1929లో కలుసుకున్నారు. అప్పుడు వారిద్దరూ ఇరవైలలో ఉన్నారు. తత్వశాస్త్రంలో ఇద్దరూ డాక్టరేట్ కోసం అధ్యయనం చేశారు. అధ్యాపకులుగా స్థిరపడాలనుకున్నారు. అది కలిసి జీవించడానికి ఏర్పాటు మాత్రమే. సార్త్ర్ మాటల్లో చెప్పాలంటే "మాది గాఢమైన ప్రేమ. కాని తాత్కాలికమైన లైంగిక కార్యకలాపం కన్నా చిరుతిళ్లలాంటి లైంగిక సంబంధాలే ఇష్టం అని సార్త్ర్ చెప్పేవాడు. బూవోర్‌కి కూడా తన సంబంధాలు తనకు ఉండేవి. చాలా వరకు సార్త్ర్ సన్నిహిత మిత్రులతోనూ, అతని స్నేహితులతోనూ ఆమెకు సంబంధాలు ఉండేవి. బూవోర్‌కి చాలా ఏళ్లపాటు అమెరికా నవలా రచయిత నెల్సన్ అల్గ్రెన్‌తో ప్రసిద్ధుడైన సినీ దర్శకుడు క్లాడ్ లాంజ్‌మెన్‌తో కూడా ఆమెకు సాన్నిహిత్యం ఉండేది. అయితే సార్త్ర్‌కు, బూవైకు ఇలాంటి వైవాహికేతర సంబంధాలు ఎన్ని ఉన్నప్పటికీ వాటి గురించి దాపరికం లేకుండా మాట్లాడుకోవడాన్ని వారు ఇష్టపడేవారు.

బూవోర్ 14 ఏళ్ల ప్రాయంలోనే తాను నిరీశ్వర వాదినని చెప్పుకునేది. ఏడేళ్ళప్పుడే తను రచయిత్రిని కావాలని నిర్ణయించుకున్నానని బూవోర్ వ్యాస సంపుటాలుగా వెలువడిన తన జ్ఞాపకాలలో రాసుకుంది. భగవంతుడి మీద విశ్వాసం లేనందువల్ల ఆమె అర్థరాహిత్యం గురించి ఎక్కువగా ఆలోచించేది. ఆమె తన రచనలలో ఎక్కువగా తన జీవితం గురించే రాసేది. తనను తాను పునఃస్మరించుకోవడం వల్ల తన అస్తిత్వానికి ఒక అర్థం కల్పిస్తానని ఆమె చెప్పేది. ఆమె జీవితంలో దైవత్వానికి చోటు లేనందువల్ల తన జీవితానికి అర్థం చెప్పుకోవడానికి ప్రయత్నించింది. తన అస్తిత్వానికి తానే బాధ్యత వహించింది. చిన్న వయసు నుండీ బూవై జీవితంలో తాను చేసిన పనులకు నిబద్ధమై ఉండడమే కాక అస్తిత్వవాద నీతి నియమాల ప్రకారం నడుచుకునేది. ఇది ఆమె జీవితంలో ప్రధాన భాగం. ఉత్తేజ పూరితమైన రచయిత్రి కనక ఆమె ఆలోచనలు అనుభవాలు తర్వాత ఆమె జీవితంలో సాహితీసృజన ఆమె నిత్య జీవిత వాస్తవాలతో ముడివడి ఉన్నాయని రుజువైంది.

మార్సెలెస్, రోయెన్‌లలో అధ్యాపక బాధ్యతలు నిర్వహించిన తర్వాత సార్త్ర్ కోరిక మేరకు రచనకే ఎక్కువ సమయం కేటాయించింది. పారిస్‌కు వచ్చి స్థిరపడింది. ఆమె అనేక నవలలు, నాటకాలు రాసింది. వాటితోపాటు తత్వశాస్త్ర గ్రంథాలూ రాసింది. 'ఎథిక్స్ ఆఫ్ ఆంబిగ్యువిటీ' (1947) అన్న రచన అస్తిత్వవాద సిద్ధాంతానికి ఉద్దేశించింది. కానీ 1949లో ప్రచురితమైన

'ది సెకండ్ సెక్స్' అన్న గ్రంథం ఆమెకు అపారమైన కీర్తి ప్రతిష్టలు తెచ్చి పెట్టింది. ఇది స్త్రీవాదానికి విజ్ఞాన సర్వస్వం లాంటిది. గొప్ప అక్షరాయుధం. మార్క్సిస్టులు, ఫాసిస్టులు, వివిధ మతాల ఛాందసులూ ఈ పుస్తకాన్ని చీల్చి చెండాడారు. నేటికీ అలాగే విమర్శిస్తున్నారు. ఇందులో అతివాదులు, మితవాదులనే తేడా లేకుండా పోయింది. పశ్చిమ దేశాల నాగరికతలో మహిళలకు గౌను ప్రాధాన్యతమాత్రమే ఉంది. 'ప్రభువా! నన్ను ఆడదాన్ని చేయనందుకు నీకు సదా కృతజ్ఞతలు' యూదు మగవాళ్ళ నిత్య ప్రార్థన. 'కొన్ని లక్షణాలు లోపించడంవల్ల ఆడది ఆడదే' అరిస్టాటిల్ 'స్త్రీ అసంపూర్ణమైన మనిషి 'సెయింట్ థామస్' 'ఈవ్‌ని అదనపు ఎముక' బొస్సాడే, తరతరాలుగా ఉన్న భావనలివి. స్త్రీలు ఇప్పటిదాకా తీసుకున్నదేం లేదు. పురుషులు ఏమి ఇవ్వాలనుకున్నారో అదే పుచ్చుకున్నారు. ఒక గతం లేదు. మతం లేదు. అసలు చరిత్రే లేదు. ఆవేశభరితంగా ఈ గ్రంథంలో వాదించారు. సెకండ్ సెక్స్ గ్రంథం మహిళల దుస్థితికి కారణం సంస్కృతే కాని శరీర నిర్మాణం కాదని ఆమె తేల్చారు.

"ఎవరూ మహిళగా జన్మించరు. మహిళగా తయారవుతారు" అన్న ఆమె విప్లవాత్మకమైన అభిప్రాయం ఏకంగా అంతర్జాతీయ స్త్రీవాద ఉద్యమానికి ప్రణాళిక అయిపోయింది. వారు ఆయుధ ప్రాణులు కావడానికి తోడ్పడింది. స్త్రీవాద ఉద్యమంలో ఆమె ఆలస్యంగా ప్రవేశించింది. కాని ఒకసారి ఆ ఉద్యమంలో భాగం అయిపోయిన తర్వాత స్త్రీ వాదాన్ని, సామాజిక మార్పుకు చోదక శక్తి అయిన సోషలిజంతో అనుసంధానానికి ప్రయత్నించింది. 1970లలో ఆమె శక్తివంతమైన కార్యకర్తగా తయారయ్యారు. వీరిలో 343 మంది తాము గర్భస్రావం చేయించుకున్నవారే. అప్పటి గర్భస్రావం చేయించుకోవడం ఫ్రాన్స్‌లో చట్టవిరుద్ధమైన వ్యవహారం. మహిళల మీద జరిగే దాడులకు, నేరాలకు నిరసన తెలియజేయడం కోసం ఆమె ఒక ట్రిబ్యునల్ ఏర్పాటు చేయడానికి కూడా తోడ్పడ్డారు. తర్వాత తర్వాత ఆమె తన తీవ్రమైన కార్యకలాపాలను ముమ్మరం చేశారు. సార్త్రతో కలిసి అనేక ప్రాంతాలలో పర్యటించారు. ప్రపంచ నాయకులను కలుసుకున్నారు. అల్జీరియన్లను ఫ్రెంచివారు చిత్రహింసలు పెదుతున్నందుకు, వియత్నాంలో యుద్ధం చేస్తున్నందుకు నిరసనగళం విప్పారు. మహిళల హక్కుల కోసం పోరాడే ఫ్రెంచి సంస్థకు అధ్యక్షురాలిగా వ్యవహరించారు. సాంప్రదాయికమైన ఔచిత్యాలకు వ్యతిరేకంగా ఆమె నిరంతరం పోరాడారు. 60 ఏళ్ల వయసులో సార్త్రతో కలిసి పారిస్ వీధుల్లో నిషేధంలో ఉన్న మావోయిస్టు పత్రికను అమ్మారు. అందువల్ల అరెస్టు అయ్యారు. 1963లో తన తల్లితో రాజీ పడ్డారు. 'ఎ వెరీ ఈజీ డెత్' అనే గ్రంథంలో ఆమె ఆర్ద్రంగా ఈ విషయాలను ప్రస్తావించారు. ఈ గ్రంథాన్ని 1964లో రాశారు. పైన బడుతున్న తన వయసును కూడా లెక్క చేయకుండా 'కమింగ్ ఆఫ్ ఏజ్' అన్న గ్రంథం రాశారు. ఇందులోనూ సమాజాన్ని తీవ్రంగా దుయ్యబట్టారు. అయితే ఆ తప్పు బట్టడం వృద్ధులను నిర్లక్ష్యం చేస్తున్నందుకు. సార్త్ర వీలునామా రాయకుండానే 1980లో మరణించాడు. 1965లో సార్త్రకు ఒక అల్జీరియా మహిళ ఉంపుడుగత్తెగా ఉండేది. అతని ఆస్తిపాస్తుల వ్యవహారాలను ఆమె పర్యవేక్షించేది. ఈ కారణంగా ఆ ఉంపుడుగత్తె అనుమతి లేకుండా సార్త్ర తనకు రాసిన ఉత్తరాలను కూడా బూవోర్ ప్రచురించలేకపోయింది. ఆ తర్వాత చట్టవ్యతిరేకంగా ఆమె వీటిని ప్రచురించారు. ఇలాంటి సంఘటనలు పక్కనబెడితే బూవోర్ మనసులో సార్త్ర జ్ఞాపకాలు పదిలంగానే ఉన్నాయి. ఆరేళ్ళ తర్వాత ఆమె మరణించే దాకా ఇది కొనసాగింది. ఆమె మేధోస్థాయి చివరిదాకా పదిలంగా కొనసాగుతూనే ఉంది.

# 1879-1953

# జోసెఫ్ స్టాలిన్

కమ్యూనిస్టు రష్యాకు ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు తెచ్చి, అనామాక దేశాన్ని అగ్ర రాజ్యంగా మలిచిన ఘనత జోసెఫ్ స్టాలిన్‌కు దక్కుతుంది. ప్రపంచ చరిత్రలో అత్యంత క్రూరమైన నియంతల్లో ఒకడిగా పేరు పొందాడు స్టాలిన్. రెండో ప్రపంచ యుద్ధంతో మానవాళికి మరణశాసనం రాయబోయిన నాజీ నియంత అడాల్ఫ్ హిట్లర్ ఆశలను ఆఖరుక్షణంలో అడియాశలు చేసినవాడు స్టాలిన్. ఏక పక్షంగా యుద్ధంలో అప్రతిహతంగా ముందుకు సాగిపోతున్న హిట్లర్ దూకుడుకు కళ్ళెం వేసి నాజీ సైన్యాలను లెనిన్‌గ్రాడ్ నుంచి బెర్లిన్ వరకూ తరిమికొట్టాడు.

చెప్పులు కుట్టే చర్మకారుడి ముగ్గురు సంతానంలో ఒకడైన స్టాలిన్ 1897 డిసెంబర్ 21న జార్జియన్ నగరం గోరిలో పుట్టాడు. పదే ఏట తండ్రి మరణంతో తల్లి స్టాలిన్‌ను ఒక సనాతన క్రైస్తవ మిషనరీలో చేర్చింది. ముఖమంతా మశూచి సోకిన మచ్చలు, సెప్టిసీమియా (రక్తంలో విషం చేరటం) జబ్బుతో కొద్దిగా వంకరపోయిన చేతితో స్టాలిన్ ఎన్నో రోజులు చర్చిలో ఉండలేకపోయాడు. 1899లో చర్చి నుంచి బహిష్కృతుడైన తర్వాత రెండేళ్లకు స్టాలిన్ జార్జియన్ సోషల్ డెమొక్రాటిక్ విభాగంలో చేరాడు. కోబా అనే మారుపేరుతో ప్రసిద్ధుడైన స్టాలిన్ 1903లో కమ్యూనిస్టు విభాగాల్లో ఒకటైన బోల్షివిక్‌లో చేరి సోవియట్ యూనియన్ వ్యవస్థాపకుడు లెనిన్ దృష్టిలో పడ్డాడు. జార్ సర్కారుకు వ్యతిరేకంగా విప్లవాన్ని రెచ్చగొట్టే కరపత్రాల ముద్రణ, పార్టీకి బలవంతపు చందాల కోసం దోపిడీలకు పాల్పడే స్టాలిన్‌ను అనేక సార్లు అరెస్టు చేశారు. 1912లో కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీలో సభ్యుడిగా స్టాలిన్‌ను లెనిన్ నియమించాడు. ఆ తరువాత కమ్యూనిస్టుల పత్రిక ప్రావ్దా (నిజం)కు స్టాలిన్ ఎడిటర్ అయ్యాడు. విప్లవ కార్యకలాపాలు సాగిస్తున్నందుకుగాను 1913లో స్టాలిన్‌ను అరెస్టు చేసి సైబీరియాలో బంధించారు. ఫిబ్రవరి విప్లవానంతరం క్షమాభిక్షతో విడుదలైన స్టాలిన్ 1917 అక్టోబర్ విప్లవంలో లెనిన్ కుడిభుజంగా కీలకపాత్ర పోషించాడు.

అక్టోబర్ విప్లవం తరువాత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సెక్రెటరీ జనరల్‌గా అత్యున్నత పదవిని అధిష్టించిన స్టాలిన్‌కు అదృష్టం కలిసివచ్చింది. 1922లో గుండెపోటుతో లెనిన్ అకస్మాత్తుగా చనిపోయిన తరువాత నాయకత్వం కోసం జరిగిన పోరాటంలో తన ప్రత్యర్థులను చిత్తుచేసి తిరుగులేని నాయకుడనిపించుకున్నాడు.

పంచవర్ష ప్రణాళికలతో రష్యా రూపు రేఖలు మార్చి 1928లో స్టాలిన్ రష్యా సమగ్రాభివృద్ధికోసం పంచవర్ష ప్రణాళికలు అమలు చేయడం ప్రారంభించాడు. సామూహిక వ్యవసాయ విధానాన్ని ఉక్కు సంకల్పంతో అమలు చేశాడు. దేశాన్ని పారిశ్రామికీకరణవైపు పరుగులు పెట్టించాడు. ఈ క్రమంలో వ్యవసాయ భూములను ప్రభుత్వపరం చేసేందుకు అంగీకరించని లక్షలాది మంది రైతులను ఊచకోత కోయించాడు. మధ్యతరగతి రైతులనుంచి లక్షల హెక్టార్ల భూమిని లాగేసుకున్న రష్యా సైనికులు వారికి ఆహారం కూడా ఇవ్వకుండా మాడ్చి చంపారు. తనకుఎదురు చెప్పిన వారెవరైనా సరే అంతుచూసేందుకు బోల్షెవిక్ పార్టీలో, రెడ్ ఆర్మీలో రహస్య విభాగాలను నడిపాడు. ఈ రహస్య విభాగాల సీక్రెట్ పోలీసు ఎవరింటికైనా వెళ్ళి తలుపు తడితే చాలు ఆ ఇంటి పెద్ద గల్లంతే! స్టాలిన్ రెండో భార్య నాదిజ్దా 1932లో ఆత్మహత్య చేసుకున్నది. తండ్రి నియంతృత్వ వైఖరి సహించలేక స్టాలిన్ కుమారుడు కూడా ఆత్మహత్య చేసుకున్నట్లు చెబుతారు.

ఇంట్లోనూ స్టాలిన్ నియంతలాగే వ్యవహరించేవాడు. తండ్రి ధోరణికి విసిగిపోయిన స్టాలిన్ కొడుకు అంతర్ముఖుడిగా, బిక్కుబిక్కుమంటూ పెరిగాడు. తన 12వ ఏట స్టాలిన్ కుమారుడు తండ్రి ధోరణిని సహించలేక

ఇంట్లో ఉన్న తుపాకీతో కాల్చుకొని ఆత్మహత్యాయత్నం చేసాడు. అయితే తుపాకీ గురితప్పి దవడలో దూరాల్సిన బులెట్ భుజాన్ని రాసుకుంటూ ఇంట్లో గోడకు రంధ్రం పెట్టింది. క్షణాల్లో ఇంట్లో ఉన్న భద్రతా సిబ్బంది వచ్చి స్టాలిన్ కుమారుడ్ని ఆసుపత్రిలో చేర్చారు. అలా స్టాలిన్ కుమారుడు చావు నుంచి బయటపడ్డాడు. అయితే తన కొడుకు ఆత్మహత్యకు ప్రయత్నించాడన్న వార్త విన్న స్టాలిన్ పెద్దగా ఆశ్చర్యపోలేదు. పైగా వాడికింకా తుపాకీ పట్టుకోవడమే సరిగ్గా వచ్చినట్లు లేదు, ఈ విషయంలో వాడికి రెండేళ్ళ శిక్షణ ఇవ్వండి అని సైనిక అధికారులను ఆదేశించాడు.

మరో ఏడేళ్ల తరువాత సైన్యంలో సాధారణ సైనికుడిగా పనిచేస్తున్న స్టాలిన్ కొడుకును జర్మన్ సైనికులు కిడ్నాప్ చేశారు. రష్యన్ల వద్ద బందీగా ఉన్న తమ డిప్యూటీ జనరల్‌ను వదిలిపెడితే స్టాలిన్ కుమారుడిని విడిచిపెడతామని బేరం పెట్టారు. ఈ కిడ్నాప్ విషయం తెలుసుకున్న స్టాలిన్ దీనిపై ఎటువంటి హైరానా పడలేదు. తన కొడుకు ఒక సాధారణ సైనికుడని, అతనికి బదులుగా ఒక డిప్యూటీ జనరల్‌ను విడిచిపెట్టాలన్న డిమాండ్ అర్థరహితమని జర్మన్లకు సమాధానం పంపాడు. దీంతో స్టాలిన్ కుమారుడు రెండేళ్లు జర్మన్ల వద్దే బందీగా ఉండిపోయాడు. ఓ రోజు రహస్యంగా జర్మన్ల చేతి నుండి తప్పించుకోబోయి కరెంటున్న ఇనుప కంచెలో చిక్కుకుని చనిపోయాడు. ఇలా ఈ నియంత ఇంటా బయటా తన దుందుడుకు మనస్థత్వంతో తనకు ఎదురే లేదని నిరూపించుకున్నాడు.

రెండో ప్రపంచ యుద్ధకాలంలో తటస్థ వైఖరి అవలంబించడమే కాకుండా జర్మన్ నియంత అడాల్ఫ్ హిట్లర్‌తో నిర్యుద్ధ ఒడంబడిక చేసుకున్నాడు. ఈ ఒడంబడికను తుంగలో తొక్కిన హిట్లర్ యుద్ధోన్మాదంతో తన సైన్యాలను 1941లో మాస్కోపైకి నడిపాడు. దీనితో హిట్లర్ నిజస్వరూపం అర్థమైన స్టాలిన్ మరింక ఆలస్యం చేయకుండా హిట్లర్‌కు చెక్ చెప్పాడు. ఈ యుద్ధంలో వేలాది మంది నాజీ సైనికులు రష్యా గ్రామాలను నేలమట్టం చేసి సామాన్య పౌరులను ఊచకోత కోశారు. వీటన్నింటికీ ప్రతీకారం అన్నట్లు లెనిన్ గ్రాడ్ వరకూ వచ్చిన నాజీ సైన్యాన్ని స్టాలిన్ సైన్యం తిప్పికొట్టింది. రెట్టించిన ఉత్సాహంతో చీమల దండుల్లా వచ్చిపడుతున్న రష్యా సేనల దాడికి నాజీ సైన్యాలు ఆగలేకపోయాయి. పలాయన మంత్రం పఠించిన హిట్లర్ సేనలను బెర్లిన్ దాకా రెడ్ ఆర్మీ తరిమికొట్టింది. మొత్తానికి 80 లక్షల పౌరులు, సైన్యాన్ని రష్యా పోగొట్టుకున్నది. స్టాలిన్ తన నేతృత్వంలో రష్యా సామ్రాజ్యాన్ని తూర్పు యూరప్‌లో సగభాగం దాకా విస్తరించాడు. జర్మనీని కూడా చీల్చి కమ్యూనిస్టు రష్యాకు సామంత రాజ్యంగా మార్చాడు.

స్టాలిన్ ఆధ్వర్యంలో రష్యా ప్రపంచంలో అమెరికాకు దీటుగా అగ్రరాజ్యంగా ఎదిగింది. సామాజిక వ్యవసాయం, పారిశ్రామికీకరణవల్ల రష్యా స్వయం సమృద్ధి సాధించింది. క్రూర నియంతగా తనకు అడ్డం చెప్పిన వారిని అతి కిరాతకంగా అడ్డుతొలగించుకొని రష్యాకు రెండున్నర దశాబ్దాలపాటు ఎదురులేని నియంతగా వెలిగాడు స్టాలిన్. 1956లో కమ్యూనిస్టు పార్టీ పగ్గాలు చేపట్టిన కృశ్చేవ్, స్టాలిన్ సాగించిన అరాచకాలను బయట పెట్టడంతో అతనిపై రష్యా ప్రజల భ్రమలు తొలిగిపోయాయి. 1961 కల్లా, ఆయన విగ్రహాలను, చిహ్నాలను గుర్తులను రష్యా పాలకులు తొలగించారు. స్టాలిన్ పేరుతో గల రోడ్లు, వీధులు, నగరాలు, పట్టణాలు అన్నింటికీ పేర్లు మార్చారు. స్టాలిన్ నిర్మించి, పటిష్టపరిచిన సోవియట్ యూనియన్ 1991న కుప్పకూలిపోయింది.

# లతా మంగేష్కర్

స్వాతంత్ర్యోద్యమంలో సమరోత్సాహంతో ముందుకు దూకి తన కవితాశక్తితో భారతకోకిలగా సరోజినీనాయుడు ప్రసిద్ధురాలైతే, తన గానామృతంతో భారతీయులందర్నీ సంగీత సాగరంలో ఓలలాడించిన గానకోకిల లతామంగేష్కర్. భారత జవాన్ల గౌరవార్థం ఏర్పాటు చేసిన ఓ కచేరీలో సైనికుల త్యాగాలను లతా 'ఏ మేరె వతన్ కేలోగో, జర ఆంఖ్ మే భర్‌లో పానీ' పాటను హృద్యంగా ఆలపిస్తే ఆ గానామృతంలో సదస్సుకు హాజరైన వారంతా తమను తాము మరచిపోయారు. భారత ప్రధాని నెహ్రూ కళ్ళ వెంట అశ్రువులు రాలాయి. పాట అయిపోయిన తరువాత నెహ్రూ కళ్లు తుడుచుకుంటూ లతను ఆప్యాయంగా భుజం తట్టి 'నీ పాటతో నన్ను ఏడిపించావమ్మా' అన్నారట.

భారత సినిమా చరిత్రలో అత్యధిక పాటలు పాడి గిన్నిస్ బుక్ రికార్డులను ఎన్నడో దశాబ్దాల క్రితమే బద్దలు కొట్టిన గానకోకిల లతామంగేష్కర్ ఒక సాధారణ కుటుంబంలో పుట్టారు. ఇండోర్‌లో 1929లో సెప్టెంబర్ 28న లత పుట్టింది. పండిట్ దీనానాథ్ మంగేష్కర్, జ్యోత్స్నాదేవిల నలుగురు సంతతిలో లతే పెద్దమ్మాయి. ఆమెకు ఆశాభోంస్లే, ఉషలు చెల్లెళ్లు. హృదయనాథ్ ఒక్కడే తమ్ముడు. కుటుంబంలో పెద్దది కావడంతో లత తండ్రికి చేదోడు వాదోడుగా ఉండేది. గ్వాలియర్ పాఠశాలలో సంగీత పాఠాలు నేర్పే తండ్రి నుంచి సంగీత కళను లత వారసత్వంగా పుణికిపుచ్చుకొంది. ఐదేళ్ల వయస్సున్నప్పుడే లత తన కన్నా పెద్ద పిల్లలకు పాఠాలు నేర్పించేది. లతకు 13 ఏళ్ల వయస్సునప్పుడు 1942లో ఆమె తండ్రి మరణించాడు. దీంతో కుటుంబ పోషణ చిన్నారి లతపై పడింది. అప్పటికే అమన్ అలీ ఖాన్ సాహెబ్, అమానత్ ఖాన్ వంటి ప్రసిద్ధులతో సంగీత కచేరీలు చేసిన అనుభవంతో ఆమె సంపాదనాభారాన్ని సంసారం కోసం నెత్తిన వేసుకున్నారు. 1942 నుంచి 1948 మధ్య కాలంలో లత హిందీ, మరాఠీ భాషల్లో కలిసి 8 సినిమాల్లో చిన్న చిన్న పాత్రలు వేశారు. తన కన్నా చిన్నవారిని పోషించడానికి గాను సినిమాల్లో నటించిన లత 1942లో తొలిసారిగా 'కితి హసాల్' అనే సినిమాలో పాటను పాడారు. కానీ దురదృష్టమేమిటంటే ఆ పాట ఎడిటింగ్‌లో పోయింది. ఆ తరువాత 1947లో తొలిసారిగా 'ఆప్ కే సేవా మే' అనే హిందీ సినిమాలో పాట పాడారు. కానీ ఆ పాట కూడా పెద్దగా ఎవరినీ ఆకర్షించలేదు. లత చిత్రరంగంలో ప్రవేశించిన తొలి నాళ్లలో లబ్ధ ప్రతిష్ఠులైన సంగీత దర్శకులు ఆనాటి పంజాబ్ ప్రాంత గాయనీమణులైన నూర్జహాన్, షంషాద్‌బేగం, జోహ్రాబాయి లాంటి వాళ్ల చేత పాడించడానికే ఇష్టపడేవారు. లత గొంతు చాలా పీలగా ఉందన్న కారణంతో ఆమె చేత పాడించడానికి సంగీత దర్శకులు, చిత్ర దర్శకులు ముందుకు రాలేదు. తమాషా ఏమంటే తొలుత మన తెలుగు సంగీత చిత్ర దర్శకులు, అమర గాయకుడు ఘంటసాల గాత్రం సినిమాలకు పనికిరాదని వంకపెట్టినవారే!

జీవన పోరాటంలో పట్టువదలని లత తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలని నిర్ణయించుకొంది. 1949లో లత ఒకటి, రెండు పాటలు పాడిన నాలుగు సినిమాలు బర్సాత్, అందాజ్, దులారి, మహల్ సినిమాలు విడుదలయ్యాయి. వీటిలో లత పాడిన పాటలు ప్రేక్షకులను విశేషంగా ఆకట్టుకున్నాయి. ప్రధానంగా దులారి సినిమాలో 'ఆయేగా, ఆయేగా ఆనేవాలా' పాట సూపర్ హిట్టయ్యింది. 1950 నాటికల్లా హిందీ సినిమా సంగీతంలో లత ప్రభంజనంలా దూసుకువచ్చింది. లత దెబ్బకు అప్పట్లో ఒక వెలుగు వెలుగుతున్న మహాగాయనీమణులంతా తెరమరుగయ్యారు. గీతాదత్, షంషాద్‌బేగం లాంటి వారే మిగిలారు. ఆ తరువాత కాలంలో వారూ కనుమరుగయ్యారు. 1950లో లత సోదరి ఆశాభోంస్లే నేపథ్యగాయనిగా ఆరంగ్రేటం చేయడంతో ఈ అక్క చెల్లెళ్లకు ఎదురు లేకుండా పోయింది. ఇక వెనుకకు

చూడాల్సిన అవసరమే లేకుండా పోయింది.

తన తీయని కంఠస్వరం, హృదయాన్ని పట్టి పిండేసే గానామృతంతో అశేష భారతావనికి ఓలలాడించింది. లతకు ఆత్మగౌరవం చాల ఎక్కువ. తన పాటలకు సంబంధించిన రాయిల్టీకోసం మహ్మద్ రఫీతో పోరాడి ఒకానొక దశలో ఆయనతో యుగళగీతాలు పాడటం మానేసింది. అదే రకంగా ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు ఎస్.డి. బర్మన్‌తో కూడా విభేదాల కారణంగా 1957-62 మధ్య ఆయన సంగీత దర్శకత్వంలో ఆమె పాడలేదు. అయితే లత ప్రాధాన్యతను గుర్తించిన వారిరువురూ చివరకు రాజీపడి ఆమె దగ్గరకే వచ్చారు. ప్రఖ్యాత సంగీత దర్శకులు సి. రామచంద్ర, మదన్ మోహన్‌లాంటి వారి నిర్దేశకత్వంలో లత అప్పట్లో పాడిన పాటలు అజరామరాలుగా నిలిచాయి. 1960-80 మధ్య కాలంలో హిందీ సినీరంగంలో లత పాడని చిత్రమంటూ లేదు. 1980 తరువాత లత సినిమా పాటలు తగ్గించుకొని విదేశాల్లో కచేరీల కోసం ఎక్కువ సమయాన్ని కేటాయించారు. 65 ఏళ్ళ వయస్సు దాటినప్పటికీ 1997లో వచ్చిన 'దిల్ తో పాగల్ హై', 'మాచిస్' 'హమ్ ఆప్ కే హై కౌన్' (1994) దిల్ సే (1993)లో కుర్ర హీరోయిన్లకు పాడి రక్తి కట్టించారు.

చిన్నతనంలోనే కుటుంబ భారం నెత్తిన వేసుకున్న లత బ్రహ్మచారిణిగా ఉండిపోయింది. చిన్నప్పుడు లత ఎంతగానో అభిమానించిన గాయకుడు కుందన్‌లాల్ సైగల్. పెద్దదాన్నైన తరువాత నేను సైగల్ సాబ్‌నే పెళ్ళి చేసుకుంటానని 13 ఏళ్ల ప్రాయంలో లత అనేది. అయితే లతకు 20 ఏళ్ళు రాక మునుపే ఆ మహాగాయకుడు చనిపోయాడు. మొదట్లో గాయనీమణి నూర్జహాన్‌ను అనుకరించిన లత ఆ తరువాత తనదైన శైలిలో బాణీలో పాటలు పాడసాగింది. చిన్న అభిప్రాయబేధం కారణంగా ఒ.పి. నయ్యర్ లతతో పాటలు పాడించరాదని అనుకున్నాడు. ఆ సమయంలో మదన్‌మోహన్'లత చేత అపూర్వ గీతాలు పాడించాడు. ప్రఖ్యాత నటుడు, దర్శకుడు షోమాన్ ఆఫ్ ఇండియాగా పేరున్న రాజ్‌కపూర్ లతను సరస్వతీదేవి అవతారమని ప్రస్తుతించేవారు. లత పాటలపైనే ఆయన ఎన్నో వ్యయప్రయాసలకోర్చి 'సత్యం శివం సుందరం' అనే అపురూప సంగీత కళా ఖండాన్ని నిర్మించారు. అందులో లత పాడిన పాటలన్నీ సంచలనం సృష్టించాయి. సినిమా పాటలే కాక లత తన సోదరుడు హృదయనాథ్ మంగేష్కర్‌తో కలిసి 'మీరా భజన్స్' అనే ఆల్బం కూడా విడుదల చేశారు.

లత తన స్వర మధురిమలతో పండిత, పామరులనే భేదం లేకుండా యావన్మందిని మంత్రముగ్ధులను చేస్తూనే ఉన్నది. ఆమె పొందిన సత్కారాలకు, అవార్డులు, రివార్డులకు లెక్కే లేదు. ఎన్నో ఫిలింఫేర్ అవార్డులే కాక 1989లో పద్మభూషన్, 1999లో పద్మవిభూషన్ పురస్కారాలను లత అందుకున్నారు. 'గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్' వారు ఆమె ప్రతిభను గుర్తించి రికార్డులకెక్కించారు. లండన్‌లోని ఇ.ఎమ్.ఐ. తరఫున ప్లాటినం డిస్క్ పొందిన ఒకే ఒక మహిళగా ఆమె రికార్డు సృష్టించింది. దాదాపు 30,000 పాటలు పాడి చరిత్ర సృష్టించిన లతా మంగేష్కర్‌కు భారత ప్రభుత్వం అత్యున్నత పురస్కారం భారతరత్నను 2001 జనవరి 25న ప్రకటించింది. నాటి ప్రఖ్యాత హిందీ హీరోయిన్లు మధుబాల,, మీనాకుమారి నుంచి నేటి మాధురీ దీక్షిత్, కాజోల్, ప్రీతి జింటా వరకూ ఆమె పాటలు పాడని హిందీ హీరోయినే లేదు. 1960 మొదలు కొని 1985 వరకూ ప్రతి రోజూ లత పాడిన రెండు పాటలన్నా ఏదో ఒక స్టూడియోలో రికార్డయ్యేవి.

పాటలతో ప్రజలను రంజివంచేయడంలోనే కాకుండా సామాజిక సేవలోనూ లతా మంగేష్కర్ ముందున్నారు. పూణెలో దీననాథ్ మంగేష్కర్ హాస్పిటల్, రీసెర్చి కేంద్రాన్ని తన తండ్రి పేర లత నెలకొల్పారు. ఈ ఆసుపత్రికి అనుబంధంగా మహారాష్ట్ర రత్నగిరి జిల్లా ధబోల్ ప్రాంతంలో మరొక వైద్యశాలను ఆమె నెలకొల్పారు. లతామంగేష్కర్‌తో పాటు ఆమె తమ్ముడు, చెల్లెళ్ళు కూడా సేవా కార్యక్రమాలను కొనసాగిస్తున్నారు.

1902-
1973

# చార్లెస్ లిండ్‌బర్గ్

ఎవరూ ఊహించని సాహసాలు చేయడమంటే లిండ్‌బర్గ్‌కు సరదా. డేర్‌డెవిల్, దేవాంత కుడు, అత్యంత ధైర్యశాలి ఇలా లిండ్‌బర్గ్‌కు అభిమానులు ముద్దుపేర్లతో పిలిచేవారు. విమానంలో చక్కర్లు కొట్టడం, విమానపు రెక్కలపై ఆకాశంలో విహరించడం, ప్రాణాంతకమైన స్టంట్లు చేయడం అతనికి వెన్నతోపెట్టిన విద్య. ఒక చిన్న విమానంలో ఒంటరిగా నాన్‌స్టాప్‌గా అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటి చరిత్ర సృష్టించడంతో లిండ్‌బర్గ్ పేరు ప్రపంచవ్యాప్తంగా మారుమోగింది.

అమెరికాలోని డెట్రాయిట్, మిచ్‌గన్‌లో 1902వ సంవత్సరం ఫిబ్రవరి 4న పుట్టిన చార్లెస్ లిండ్‌బర్గ్ మిన్నెసోటాలో వ్యవసాయ క్షేత్రంలో పెరిగాడు. చిన్ననాటినుంచే మెకానికల్ ఇంజనీరింగ్‌లో కొడుకు అద్భుత ప్రతిభ కనబరుస్తుండటంతో తండ్రి అతనికి ఇంజన్ల రూపకల్పనలో శిక్షణ ఇచ్చాడు. 18 ఏళ్ల వయస్సులో ఇంజనీరింగ్ చదివేందుకు యూనివర్సిటి ఆఫ్ విస్కాన్‌ఫిక్‌లో చేరాడు. అయితే అక్కడే ఉన్న పైలెట్ శిక్షణా సంస్థలో తర్ఫీదు పొందిన తరువాత లిండ్‌బర్గ్ మనసు చదువుమీద నుంచి మళ్ళింది. రెండేళ్ళపాటు యూనివర్సిటీలో ఇంజనీరింగ్ చదివి ఆ తరువాత అర్థాంతరంగా కోర్సును ఆపేశాడు. అద్దెకు ఒక చిన్న విమానం కుదుర్చుకుని ఆకాశంలో గిరికీలు కొడుతూ సందర్శకులను ఆకట్టుకునేవాడు. చూసేవారి రోమాలు నిక్కబొడుచుకునేలా బుల్లి విమానంలో సాహసాలు చేసేవాడు. 1924లో అమెరికాలోని జాతీయ వైమానిక దళంలో చేరాడు లిండ్‌బర్గ్. రెండేళ్ళపాటు రిజర్వు పైలెట్‌గా కఠిన శిక్షణ తీసుకున్న తరువాత యుద్ధవిమానాలను నడపడంలో అన్ని మెళకువలను నేర్చుకున్నాడు. ఆ తరువాత అమెరికా పోస్టల్ విభాగంలో చేరి సెయింట్ లూయిస్, మిస్సోరి, షికాగోల మధ్య విమానాల్లో ఉత్తరాల బట్వాడా చేసాడు.

1919లో న్యూయార్క్‌లోని పెద్ద హోటల్ సిటీప్యాలెస్ యజమాని రేమాండ్ ఒర్టీగ్ ప్రపంచవ్యాప్తంగా ఒక సవాలు విసిరాడు. ఎవరైనాసరే న్యూయార్క్ నుండి ప్యారిస్ దాకా ఎక్కడా ఆగకుండా విమానంలో ప్రయాణిస్తే 25000 డాలర్లిస్తానని ప్రకటించాడు. విమానయాన సాంకేతిక నైపుణ్యం అంతగా అభివృద్ధి చెందని ఆ రోజుల్లో ఈ సవాలును స్వీకరించడమంటే మాటలు కాదు. కొంత మంది సాహసికులు ఈ ప్రైజ్‌మనీ కోసం ఈ దుస్సాహసం చేయబోయి ప్రాణాలు పోగొట్టుకున్నారు. 1927 వరకూ కూడా ఈ ప్రైజ్‌మనీ అలాగే ఉండటంతో లిండ్‌బర్గ్ దృష్టి దీనిపై పడింది. తనకు ఒక చక్కటి విమానం లభ్యమైతే ఈ పోటీని గెలుపొందగలనన్న నమ్మకం ఏర్పడింది. సెయింట్ లూయిస్‌కు చెందిన 9 మంది వ్యాపారవేత్తలను కలిసి విమానం తయారుచేయడానికి అవసరమైన ఖర్చులు పెట్టుకోమ్మన్నాడు. వారు అంగీకరించడంతో శాన్‌డియాగోలోని ర్యాన్ ఏరోనాటికల్ కంపెనీ విమానాన్ని కొనుగోలు చేసి దానికి కొన్ని మార్పులు చేర్పులు చేశాడు. ఆ విమానానికి స్పిరిట్ ఆఫ్ సెయింట్ లూయిూ అన్న పేరు పెట్టాడు. 1927 మే నెల 10-11 తేదీల మధ్య ఈ సింగల్ ఇంజన్ విమానాన్ని శాన్‌డియాగో నుంచి న్యూయార్క్‌కు నడిపి పరీక్షించాడు. 20 గంటల 21 నిముషాల్లో సాధించిన ఈ రికార్డుతోనే అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటాలనుకున్నాడు లిండ్‌బర్గ్.

స్పిరిట్ ఆఫ్ సెయింట్ లూయిస్ విమానంలో మే 20, 1927న న్యూయార్క్ సిటీ హాలు నుంచి అట్లాంటిక్ దాటేందుకు బయలుదేరాడు లిండ్‌బర్గ్. న్యూయర్క్ సిటీ నుంచి ఉదయం 7.52 నిముషాలకు బయలుదేరి ఎక్కడా ఆగకుండా 33 1/2 గంటల పాటు ప్రయాణించి, మొత్తానికి మరుసటిరోజు లిండ్‌బర్గ్ 5,790 కిలోమీటర్లు ఏకధాటిగా విమానయానం చేసి పారిస్ చేరుకున్నాడు. ప్యారిస్‌లో లిండ్‌బర్గ్‌కు భారీ

ఎత్తున స్వాగతం లభించింది. విమానయాన చరిత్రలో ఇంత దూరం ఎక్కడా ఆగకుండా ప్రయాణించడం యూరప్, అమెరికాలలో సంచలనం సృష్టించింది. కేవలం 28 అడుగుల వెడల్పుతో సింగిల్ ఇంజన్ కలిగిన ఈ బుల్లి విమానంలో కనీసం రేడియో పారాచూట్‌లాంటి వాటిని కూడా ఇంధనం ఆదా అవుతుందనే ఉద్దేశంతో లిండ్‌బర్గ్ వెంటతీసుకెళ్ళలేదు. మొత్తానికి అంతకు ముందు ఇదే సాహసం చేయబోయి ఆరుగురు మరణించడంతో లిండ్‌బర్గ్ ఈ ఫీట్‌ను ఎలా సాధించాడా అని ప్రపంచం ఆశ్చర్యపోయింది.

ఎవ్వరూ చేయలేని సాహసం చేసి విమానయాన చరిత్రను మలుపుతిప్పిన లిండ్‌బర్గ్‌కు అమెరికా సహా చాలా దేశాలు బ్రహ్మరథం పట్టాయి. నిరాటంకంగా ఏకబిగిన బుల్లి విమానంలో అట్లాంటిక్ సముద్రాన్ని దాటినందుకు అమెరికా ప్రభుత్వం అత్యున్నత ఫ్లైయింగ్ క్రాస్ మెడల్ ఇచ్చి సత్కరించింది. సాధారణంగా ఒంటరి తనాన్ని కోరుకునే లిండ్‌బర్గ్‌కు అభిమానులు, పత్రికలు ఆకాశానికెత్తడం అంతగా నచ్చలేదు. అమెరికా ఏవియేషన్‌లో చేరిన తరువాత దేశ విదేశాల్లో విమానరూట్ల సర్వేలు, కొత్త విమానాల రూపకల్పనలో లిండ్‌బర్గ్ తన వంతు సహకారమందించాడు. మెక్సికోలో అక్కడి అమెరికా రాయబారి కూతురు అన్నె స్పెన్సర్ మారోను చూసి ప్రేమలోపడ్డాడు. వారిద్దరి వివాహం 1929లో వైభవంగా జరిగింది. భార్యకు పైలెటింగ్‌లో శిక్షణ ఇచ్చిన లిండ్‌బర్గ్ ఆమెతో కలిసి దేశవిదేశాలు తిరిగాడు.

భార్యా పిల్లలతో కలిసి న్యూ జెర్సీలో ఉంటున్న లిండ్‌బర్గ్ జీవితంలో విషాదం చోటుచేసుకుంది. 1932లో అతని 20 నెలల కొడుకును ఎవరో కిడ్నాప్ చేశారు. పెద్ద మొత్తంలో డబ్బును అడిగిన ఆ కిరాతకులు లిండ్‌బర్గ్ పోలీసులను ఆశ్రయించడంతో పసివాడిని చంపేశారు. తొమ్మిదివారాల తరువాత పసివాడి అస్తికలు లిండ్‌బర్గ్ ఇంటి సమీపంలో దొరికాయి. ఈ ఉదంతంపై పత్రికలు అతిగా స్పందించి రాద్ధాంతం చేసాయి. పిల్లవాడి శరీరం నుంచి వెంట్రుకలను సేకరించిన కొంత మంది వాటిని అమ్ముకున్నారు. పసివాడి కిడ్నాప్, మరణంపై పత్రికలు అల్లుతున్న కథనాలను చూసి చలించిపోయిన లిండ్‌బర్గ్ భార్యతో సహా పారిపోయి ఇంగ్లాండ్‌లో తలదాచుకున్నారు. పసివాడిని చంపిన కేసులో ఒక వడ్రంగిని పోలీసులు అరెస్టు చేసి నేరాన్ని నిరూపించారు. అతనికి ఉరిశిక్ష పడింది. మొత్తానికి లిండ్‌బర్గ్‌ను ఈ సంఘటన బాగా కలచివేసింది.

1930లో ఇంగ్లాండ్‌లో ఉన్న లిండ్‌బర్గ్‌ను తమ దేశంలో తయారవుతున్న అత్యాధునిక విమానాలను చూడా ల్సిందిగా హిట్లర్ ఆహ్వానించాడు. అమెరికాలో పత్రికలను నడుపుతున్న యూదులంటే ఏహ్యాభావాన్ని పెంచుకున్న లిండ్‌బర్గ్ వెంటనే హిట్లర్ ఆహ్వానాన్ని మన్నించి బెర్లిన్ వెళ్ళాడు. అక్కడే ఉండిపోవాలని నాజీలకు సాయపడాలన్న లిండ్‌బర్గ్ నిర్ణయంపై అమెరికాలో సర్వత్రా నిరసన వ్యక్తమైంది. లిండ్‌బర్గ్‌ను జర్మనీ విమానాలు అమితంగా ఆకర్షించాయి. ఆయనకు జర్మన్ ప్రభుత్వం సర్వీస్ క్రాస్‌తో సత్కరించింది. లిండ్‌బర్గ్ మరిక స్వదేశం రావొద్దని అప్పటి అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్ట్ హెచ్చరించాడు. రెండో ప్రపంచ యుద్ధం తరువాత 1954లో అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ ఆహ్వానాన్ని మన్నించి అమెరికా తిరిగి వచ్చాడు. అయితే లిండ్ బర్గ్ సాహసాలను గుర్తుంచుకున్న ప్రజలు అతను హిట్లర్‌తో చేతులు కలపడాన్ని అంతగా పట్టించుకోలేదు. ఎంతో సాహసి, ధైర్యవంతుడైన లిండ్ బర్గ్‌ను అమెరికా అధ్యక్షుడు మళ్ళీ జాతీయ వైమానిక దళంలో సలహాదారుగా చేర్చుకున్నారు.

# అమర్త్యసేన్

అర్థశాస్త్రమంటే అర్థంకాని ఆర్థిక సూత్రాలు కాదు. అవి సామాన్యులకు ఉపయోగపడే ప్రయోజనకర పాఠాలు. ఎందరికో అర్థం కాని ఈ అర్థశాస్త్రానికి కొత్త భాష్యం చెప్పిన అమర్త్యసేన్ భారతీయ ప్రతిభను దేశ విదేశాలకు వ్యాప్తి చేసిన మేధావి. ఒక రాష్ట్రం గురించో, లేదా ఒక దేశం గురించో అమర్త్యసేన్ సిద్ధాంతాలను చెప్పలేదు. సర్వప్రపంచం సమున్నతంగా శోభిల్లడానికి సేన్ సిద్ధాంతాలను విడమర్చి చెప్పాడు.

అమర్త్యసేన్ శాంతినికేతన్‌లో 1933 నవంబర్ 3న జన్మించారు. అమర్త్యసేన్ తండ్రి అసుతోష్ సేన్ తల్లిపేరు అమితా సేన్. తల్లి దండ్రులు ముద్దుగా బబ్లూగా పిలుచుకునే ఈ బాలమేధావికి అమర్త్యసేన్ అనే పేరు గురుదేవులు రవీంద్రనాథ్ టాగూర్ పెట్టడం గొప్ప విశేషం. 1943లో సంభవించిన బెంగాల్ కరువు అమర్త్యసేన్ దృష్టిని అర్ధశాస్త్రంవైపు మళ్ళించింది. సామాన్యులు పెట్టే ఆకలి కేకలకు అర్థశాస్త్రంలో ముఖ్యంగా సంక్షేమ అర్థశాస్త్రంలో జవాబు దొరుకుతుందేమో అన్వేషించాలని భావించాడు. శాంతినికేతన్‌లో చదువు చాలించిన అమర్త్యసేన్ ఆ తరువాత కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాల నుంచి 20 ఏళ్ళకే డిగ్రీ పట్టా పొందాడు. అనంతరం కేంబ్రిడ్జిలోని ట్రినిటీ కాలేజీలో చదివి అర్థశాస్త్రంలో డాక్టరేట్ తీసుకున్నారు.

ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో లెక్చరర్‌గా పనిచేశారు. ఆ తరువాత ప్రతిష్ఠాత్మకమైన ఆక్స్‌ఫర్డ్‌లో 1980లో ప్రొఫెసర్ ఆఫ్ పొలిటికల్ ఎకనమిస్ట్‌గానూ, హార్వర్డ్ యూనివర్శిటీలో లామేంట్ ప్రొఫెసర్‌గానూ అమర్త్యసేన్ పనిచేశారు. గొప్ప గొప్ప మేధావులు మెరికల్లాంటి విద్యార్థుల మధ్య అనునిత్యం విజ్ఞాన సంవాదం జరిగే ట్రినిటీలో మాస్టర్స్ హోదా పొందడం అంత తేలిక విషయం కాదు. ఇక్కడి ప్రొఫెసర్ స్థాయిలో ఉద్యోగ నియామక ఉత్తర్వులు బ్రిటన్ ప్రధాని జారీ చేయాలి. ఇంతటి మహోన్నత స్థానాన్ని దక్కించుకున్న తొలి భారతీయ మేధావి అమర్త్యసేన్. ఒకవైపు ఉన్నత ఆర్థిక సంస్థల్లో, వివిధ విశ్వవిద్యాలయాల్లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేస్తూనే మరొకవైపు ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో గౌరవ ప్రొఫెసర్‌గా కొనసాగుతూనే ఉన్నారు.

అమర్త్యసేన్ ప్రొఫెసర్‌గా విధులు నిర్వహిస్తున్నా 1943 నాటి బెంగాల్ కరువు ఆయన స్మృతిపథం నుంచి చెరిగిపోలేదు. ప్రజలు కరువు రక్కసి రాక్షసత్వాన్ని తట్టుకోలేకపోయారు. చనిపోయిన వారుపోగా మిగిలినవారు ఎముకల గూళ్లుగా మారి కొనవూపిరితో రోజులు వెళ్లదీశారు. పదేళ్ళ ప్రాయంలో ఈ కరువును కళ్ళారా చూసిన అమర్త్యసేన్ తను పెద్ద వాడైన తరువాత దీనికో శాశ్వత పరిష్కారం కనుగొనాలనే లక్ష్యాన్ని నింపుకున్నాడు. పేదరికం, అసమానతలు, కరువు తదితర అంశాలపై విశేషంగా పరిశోధనలు చేశాడు.

చైనా, కొరియా, థాయలాండ్ దేశాలు భారత్ కంటే ఎక్కువ శాతం విద్యావంతులను పెంచుకోవడంవల్లనే ప్రపంచ మార్కెట్‌ను ఎక్కువగా వినియోగించుకోగలుగుతున్నాయి. నిపుణులైనవారు (విద్యావంతులు) అధికంగా ఉన్నప్పుడే అది సాధ్యమౌతుంది. అంతర్జాతీయ వ్యాపారానికి దూరంగా ఉంటే రావలసిన లాభాలను, అవకాశాలను పోగొట్టుకోవడంలో అర్థం లేదు. చైనా, కొరియా వంటి దేశాలు ఆ అవకాశాల్ని సద్వినియోగం చేసుకొని దేశం, ప్రజల విస్తృతాభివృద్ధిని సాధించాయి. దేశ జనాభాలో సగం మంది స్త్రీలు. వారిని ఇంటి పనులకే పరిమితం చేయడం, వివిధ కార్యక్రమాలకు దూరం చేసి అణచివేస్తే- అది స్త్రీల అణచివేత కాదు. మొత్తం సంఘాన్నే అణచినట్లు. స్త్రీ విముక్తి స్త్రీలకే పరిమితం కాదు. మొత్తం సాంఘిక ప్రగతిలో భాగమని సేన్ హెచ్చరించారు.

ఆర్థిక వ్యవస్థను అన్నార్తుల సంక్షేమం వైపు సేన్ మళ్లించే యత్నంలో రూపొందించిన సిద్ధాంతాలు ప్రపంచవ్యాప్తంగా మేధావుల ప్రశంసలు అందుకొన్నాయి. కరువుకు కారణం పంపిణీ లోపాలేనని ఆయన గట్టిగా నమ్మాడు. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఆకలి చావులపై అధ్యయనాన్ని సేన్ ప్రారంభించాడు. దీనిలో భాగంగా అమర్త్యసేన్ భారత్, బంగ్లాదేశ్, ఇథియోపియా దేశాల్లో కరువు పరిస్థితులపై అధ్యయనం చేశారు. 1981లో 'పావర్టీ అండ్ ఫామిన్' అనే గ్రంథం రాసాడు. ఒక దేశంలో కరువుకు కారణం అతివృష్టి లేదా అనావృష్టి కాదు. ఆ దేశంలో పంపిణీ అసమానతలు, విఫలమైన ప్రభుత్వ విధానాలు ప్రజాస్వామ్యం లేకపోవడం అని ఆయన సూత్రీకరించారు.

1858-61 చైనా కరువులో ప్రజలకే కాదు, ప్రభుత్వానికి కూడా నిజమైన పరిస్థితి తెలియలేదు. పత్రికల నిర్బంధం, ప్రతిపక్షాలు లేకపోవడం వల్ల సమాచార లోపం పెరిగింది. అవసరాలకు మించి 10 కోట్ల టన్నుల ఆహార నిల్వలున్నాయన్న స్థానిక నాయకుల అసత్య నివేదికలను ప్రభుత్వం గుడ్డిగా నమ్మింది. ఫలితంగా 2.3 నుంచి 3 కోట్ల మంది ప్రజలు మరణించారు.

ప్రజాస్వామ్యంలో లోటుపాట్లు ఉండవచ్చు. అయినా అది కరువు వంటి విపత్కర పరిస్థితులను సమర్థవంతంగా ఎదుర్కోగలదు. 1944లో మన దేశంలో కొన్ని చోట్ల ప్లేగు వ్యాపించింది. పత్రికలన్నీ ప్రజల దృష్టిని, ప్రభుత్వ దృష్టిని దానిపైకి మళ్ళించి సత్వర చర్యలు తీసుకునేలా చేశాయి. కొద్ది రోజుల్లోనే పరిస్థితి అదుపులోకి వచ్చింది. 1943 బెంగాల్ కరువు తరువాత మన దేశానికి ఎన్నో విపత్కర పరిస్థితులు ఎదురయ్యాయి. తక్కువ నష్టాలతో వాటిని మనం ఎదుర్కోగలగటానికి ప్రజాస్వామ్యమే కారణం.

ఆర్థిక అసమానతలు, సాంఘిక అసమానతలు, సంఘంలో విలువలను నాశనం చేస్తాయి. హింస, అభద్రత పెరుగుతాయి. బ్రెజిల్, అమెరికా, దక్షిణాఫ్రికాలో హింస ఎందుకు పెరుగుతుందో, మన బీహారులో రోజువారీ ఘర్షణలకు కారణం ఏమిటో అర్థమౌతుంది. అసమానతలు తక్కువ ఉన్న చోటే ప్రజల మధ్య సహకారం పెరిగి కొన్ని లక్ష్యాలను సాధించుకోగలుగుతారు.

విద్యకు ప్రాధాన్యత ఇవ్వాలని అన్ని ప్రభుత్వాలు ఒప్పుకుంటాయి. ఇక్కడ ఒప్పుకోవడం కాదు సమస్య-అమలుపరచడం. అదే జరగడం లేదు. ప్రాథమిక విద్యలో దాదాపు అన్ని దేశాల కంటే మనం వెనుకబడి ఉన్నాం. దేశ జనాభాలో సగం మంది స్త్రీలు. ఇప్పటికీ వారిలో 2/3 వంతు నిరక్షరాస్యులు. ఇలాంటి స్థితిలో ఏ దేశమైనా ఆర్థికంగా ఎలా అభివృద్ధి చెందుతుందని సేన్ సూటిగానే ప్రశ్నించారు. దారిద్ర్యరేఖకు దిగువ ప్రజలు, ఎగువ ప్రజలు అనే సంప్రదాయపు విశ్లేషణలను పక్కనపెట్టి దారిద్ర్యరేఖకు మరీ దిగువ స్థాయిలో ఉన్నవారిని సేన్ పేదరికపు రేఖ విశ్లేషించింది. దీనికి ఆర్థికవేత్తలు 'సేన్ ఇండెక్స్' అని పేరు పెట్టారు.

ఆర్థిక రంగంలో మానవీయ కోణాలు ఆవిష్కరించాలన్న అమర్త్యసేన్ దృక్కోణాన్ని పురస్కరించుకొని స్వీడిష్ అకాడమీ 1998లో నోబెల్ బహుమతి ఆయనకు ప్రకటించింది. తనకు వచ్చిన నోబెల్ బహుమతిపై అమర్త్యసేన్ వ్యాఖ్యానిస్తూ 'అవార్డు రావడం అంతర్జాతీయ వార్త కాదు. ఈ అవార్డు వెనక ఉన్న ఆర్థిక కోణాలను ప్రపంచ దేశాల్లోని ప్రభుత్వాలు అమలు చేయాలి' అన్నారు. ఆర్థిక రంగానికి సంక్షేమమే పరమావధిగా రాచబాటలు వేసిన అమర్త్యసేన్ సూత్రాలు సర్వత్రా ఆచరించదగ్గవి. నోబెల్ విషయాన్ని పక్కనబెడితే నిత్య పరిశోధకుడు అమర్త్యసేన్ పేదవారికి ఉపయోగపడే మరో ఆర్థిక సిద్ధాంత అన్వేషణలో ప్రస్తుతం తలమునకలై ఉన్నారు.

1929-
1968

# మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్

భారతదేశంలో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంపై సత్యాగ్రహం, అహింస అనే ఆయుధాలతో పోరాడి విజయం సాధించిన గాంధీ మహాత్ముని ఆదర్శంగా తీసుకొని అమెరికాలో నీగ్రోల హక్కులకోసం శాంతియుతంగా పోరాడిన మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్ ప్రపంచంలోనే గొప్ప పోరాట యోధుడు. 35 ఏళ్లకే నోబెల్ శాంతి బహుమతి పొందిన ఈ శాంతి కపోతాన్ని 39 ఏళ్ల చిన్న వయస్సులోనే శ్వేత దురహంకారులు మట్టుబెట్టారు. ఇప్పటికీ అమెరికాలో స్వాతంత్ర్యదినం, వాషింగ్టన్ జయంతి, అబ్రహం లింకన్ పుట్టినరోజుతో సమానంగా మార్టిన్ లూథర్ కింగ్‌కు గౌరవంగా జనవరిలో వచ్చే మూడవ సోమవారాన్ని జాతీయ సెలవు దినంగా పరిగణిస్తారు.

మత సంబంధ కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొనే బాప్టిస్ట్ చర్చి ఫాదరైన మార్టిన్ లూథర్ కింగ్ సీనియర్ సంతానంలో రెండో వాడు మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్. ఇతని తల్లి స్కూలు టీచరుగా పనిచేసేవారు. దక్షిణాఫ్రికాలో అడుగుపెట్టిన మహాత్మగాంధీకి రైలులో మొదటి తరగతిలో ప్రయాణించే అర్హత లేదని బయటకు తోసేస్తారు. ఆ అవమానం గాంధీలోని స్వేచ్ఛా పిపాసని మేల్కొలిపితే 25-30 ఏళ్ల తరువాత తన స్వదేశం అమెరికాలో మార్టిన్ లూథర్ కింగ్‌కు ఇంచు మించు ఇదే అనుభవం ఎదురైంది. ఏడేళ్ల వయసులో మార్టిన్ లూథర్ కింగ్ తన టీచర్‌తో పాటు బస్సులో అట్లాంటాకు వెళుతున్నాడు. ఈలోగా కొంత మంది శ్వేత జాతీయులు ఆ బస్సు ఎక్కడంతో అక్కడున్న చట్టాల ప్రకారం మార్టిన్ లూథర్‌ను లేవమంటూ శ్వేత జాతీయుడైన బస్సు డ్రైవర్ ఉరిమి చూస్తాడు. చిన్నారి కింగ్‌ను ఈ సంఘటన ఎంతో బాధించింది. ఎందుకు లేవాలని టీచర్‌ను ప్రశ్నించాడు. మనం చట్టాలను గౌరవించాలని ఆమె కింగ్‌కు నచ్చజెప్పింది. అట్లాంటాకు వెళ్ళే 90 మైళ్ళ సుదీర్ఘ ప్రయాణంలో టీచర్‌తో కలిసి కింగ్ డోర్ పక్కన నిలబడి ఆ చలిలో ప్రయాణించాల్సి వచ్చింది. ఈ సంఘటన కింగ్ మనసులో చెరగని ముద్ర వేసింది. అట్లాంటాలోని జార్జియాలో 1929లో మధ్య తరగతి కుటుంబంలో పుట్టిన లూథర్ కింగ్ మొదట్లో వైద్యశాస్త్రం లేదా న్యాయశాస్త్రం చదువుదామనుకున్నాడు. అయితే లూథర్ కుటుంబానికి సన్నిహితుడైన డాక్టర్ బెంజమిన్ మేస్ లూథర్‌ను మత సంబంధ కార్యక్రమాల్లో పాల్గొనవలసిందిగా ఆహ్వానిస్తాడు. కళాశాలలో హెగెల్, థోరో రచనలు చదివి ప్రభావితమైన లూథర్ భారత స్వాతంత్ర పోరాట యోధుడు మహాత్మా గాంధీని ఆదర్శంగా తీసుకుంటాడు. పెన్సిల్వేనియాలోని క్రోజర్ థియోలాజికల్ సెమినరిలో చదువుతున్నప్పుడు కొందరు భారతీయుల ద్వారా కింగ్ మహాత్మాగాంధీ గురించి తెలుసుకున్నాడు. గాంధీ జరిపిన అహింసాయుత పోరాటం, సత్యాగ్రహం గురించి తెలుసుకున్న కింగ్ ఆ విధానాల పట్ల ఎంతో ఆకర్షితుడయ్యాడు. అమెరికాలో అణగారిన వర్గాలైన ఆఫ్రో-అమెరికన్ నల్లజాతీయుల అభ్యున్నతికోసం గాంధేయ మార్గంలో చారిత్రాత్మక ఉద్యమాన్ని ప్రారంభించాడు. 'నా తల్లి దండ్రుల నుంచి మతపరంగా చిత్త శుద్ధి, లక్ష్య సాధన నేర్చుకున్నాను. మహాత్మాగాంధీ నుంచి ఉద్యమ స్ఫూర్తి పొందాను' అని కింగ్ పలు సందర్భాల్లో పేర్కొనేవాడు. భారతదేశానికి స్వాతంత్రం వచ్చిన ఏడాదే అంటే 1947లో అట్లాంటా లోని ఎబెనైజర్ బాప్టిస్ట్ చర్చిలో అసిస్టెంట్ పాస్టర్‌గా విధుల్లోకి చేరుతాడు. బోస్టన్ విశ్వ విద్యాలయం నుంచి మత శాస్త్రం (థియాలజీ)లో డాక్టరేట్ డిగ్రీ పొందాడు. 1953లో కొరెట్టా స్కాట్‌తో వివాహమైన తరువాత కింగ్ అలబామాలోని బాప్టిస్ట్ చర్చ్‌కు మకాం మారుస్తాడు.

అప్పటికే అమెరికాలో వర్ణ వివక్షతలపై కొన్ని రాష్ట్రాల్లో పౌరహక్కుల ఉద్యమాలు కొనసాగుతూ ఉన్నాయి. 1955లో అలబామాలో జరిగిన ఓ సంఘటన పౌరహక్కుల ఉద్యమాన్ని మరింత ఉధృతం చేసింది. రోసాపార్క్ అనే నల్లజాతి మహిళ బస్సులో తన సీటును తెల్లజాతి వారికి ఇవ్వనందుకు నియమోల్లంఘన కింద అరెస్టు చేశారు. ఆమెను అదే సంవత్సరం డిసెంబర్ 5న విచారణకు హాజరు కావాలని కోర్టు ఆదేశిస్తుంది. దీనితో నల్లజాతి ప్రజల్లో ఆగ్రహం కట్టలు తెంచుకుంది. ఎన్నో శతాబ్దాలుగా నల్లవారిపై కొనసాగుతున్న వర్ణ వివక్షతను ప్రశ్నించేందుకు

ఇదొక సువర్ణావకాశంగా భావించిన లూథర్ కింగ్ తక్షణమే కార్యరంగంలోకి దిగాడు. మొత్తం మాంట్ గోమరీ ప్రజారవాణా వ్యవస్థను బహిష్కరించాల్సిందిగా ఆఫ్రో-అమెరికన్ నీగ్రోలకు పిలుపునిచ్చాడు. మాంట్‌గోమరీ బస్సుల్లో సాధారణంగా 75 శాతం నీగ్రో ప్రజలే ప్రయాణిస్తుంటారు. “శాంతి యుతంగా బస్సుల బహిష్కరణను కొనసాగిద్దాం, మనకూ తెల్లవారికీ టికెట్ ధర ఒకటే అయినప్పుడు తెల్లవారెక్కినప్పుడు మనమెందుకు సీట్లు ఖాళీ చేసి వారికివ్వాలి”. అని తోటి నల్లవారిలో కింగ్ చైతన్యాన్ని తెచ్చాడు.

కింగ్ ఆధ్వర్యంలో మాంట్‌గోమరి బస్సుల బహిష్కరణ విజయవంతమైంది. 382 రోజులపాటు ఒక్క నల్లజాతివాడు కూడా ఆ బస్సులను ఎక్క లేదు. శాంతియుతంగా పౌర రవాణా వ్యవస్థను బహిష్కరించిన నీగ్రోలు శ్వేత జాతీయుల వెన్నులో చలి పుట్టించారు. ఇది పౌర హక్కుల కోసం ఉద్యమించిన మార్టిన్ లూథర్ కింగ్ సాధించిన తొలి విజయం

రెట్టించిన ఉత్సాహంతో కింగ్ సమాన న్యాయం కోసం పౌర హక్కుల ఉద్యమాన్ని అమెరికాలో చాలా రాష్ట్రాల్లో వ్యాపింపజేశాడు. కోట్లాది మంది నీగ్రోలు, మరికొందరు శ్వేతేతరులు, కొందరు తెల్లజాతి మేధావులు కింగ్ ఉద్యమాన్ని సమర్థించడంతో ప్రజలు అతనికి బ్రహ్మరథం పట్టారు. వివక్షతను పాటించే మరొక రాష్ట్రం బిర్‌మింగ్‌హామ్‌లో కింగ్ ఆధ్వర్యాన 1963లో భారీ ఉద్యమం మొదలైంది. నగరాలు, పట్టణాలనే తేడా లేకుండా వివక్షత చట్టాలను రద్దు చేయాలని కోరుతూ ప్రజలు రోడ్ల మీదకు వచ్చారు. వివక్షతా చట్టాలను వ్యతిరేకించే అందరితో కలిసి లూథర్ కింగ్ అమెరికా రాజధాని వాషింగ్టన్‌కు పయనమయ్యాడు. వాషింగ్టన్‌లోని లింకన్ మెమోరియల్ వద్ద రెండున్నర లక్షల మందిని ఉద్దేశించి లూథర్ కింగ్ చేసిన ప్రసంగం ప్రపంచ చరిత్రలో ఒక గొప్ప ఉపన్యాసంగా నిలిచిపోయింది. తెల్లవారితో సమాన పౌరులుగా గుర్తిస్తూ విద్య, వైద్య, ఉపాధి రంగాల్లో అవకాశాలు కల్పించాలని కోరుతూ ప్రసంగించాడు.

కింగ్ నిర్వహిస్తున్న పౌర హక్కులపై అమెరికా సుప్రీంకోర్టు కూడా జోక్యం చేసుకోవడంతో తప్పనిసరి పరిస్థితుల్లో అమెరికా అధ్యక్షుడు సమాన హక్కుల బిల్లును పార్లమెంటులో పెట్టేందుకు సమ్మతించాడు. అనితర సాధ్యమైన రీతిలో ఉద్యమాన్ని నడిపి నీగ్రోలకు శ్వేతవర్ణం వారితో సమాన హక్కులు సాధించి పెట్టిన లూథర్‌కింగ్‌కు 1964లో నోబెల్ శాంతి బహుమతి లభించింది.

పౌరహక్కులు, సమానన్యాయం కోసం నల్ల జాతి ప్రజల్లో అహింసాయుత పోరాటానికి చైతన్యం రగిలించిన మార్టిన్ లూథర్‌కింగ్‌ను చిన్న వయస్సులోనే దుండగులు పొట్టన పెట్టుకున్నారు. పారిశుభ్ర కార్మికుల సమ్మెకు మద్దతు తెలిపాడు. టెన్నెసీలోని మెంఫిస్ చేరుకున్న కింగ్ అక్కడి రాయల్ హోటల్‌లో విశ్రమించారు. రాత్రిపూట కొంత మంది అనుయాయులు కింగ్‌ను చూసేందుకు ఆ మోటెల్ (రహదారి పక్క సత్రం)కు వచ్చారు. వారు కింగ్ బయటకు రావాలి, బయటకు రావాలి అని నినాదాలు చేయడంతో కింగ్ మోటెల్ బాల్కనీపైకి వచ్చారు. ఆ గుంపులోనే కాచుకున్న ఇద్దరు తెల్లజాతి దురహంకారులు వెంటనే కింగ్‌పై బుల్లెట్ల వర్షం కురిపించారు. చుట్టూ ఇద్దరు అంగరక్షకులు కింగ్ కార్యదర్శి ఉన్నప్పటికీ ఆయనకు సంభవించనున్న అపాయాన్ని తప్పించలేకపోయారు. బుల్లెట్ గాయాలతో నేలకొరిగిన కింగ్‌ను తక్షణమే ఆసుపత్రికి తరలించినప్పటికీ ఆయన ప్రాణాలు దక్కలేదు. కింగ్ దారుణహత్యకు గురయ్యారన్న వార్త అమెరికా అంతటా వ్యాపించడంతో నల్లజాతి ప్రజల ఆగ్రహం కట్టలు తెంచుకుంది. చాలా రాష్ట్రాల్లో దౌర్జన్యకర సంఘటనలు, లూటీలు, తెల్లవారిపై దాడులు యథేచ్ఛగా జరిగాయి. చివరికి కింగ్ భార్య, పిల్లలు పదే పదే విజ్ఞప్తులు చేయడంతో ప్రజల ఆగ్రహం చల్లారింది. 39 ఏళ్ల చిన్న వయసులోనే కింగ్ మరణించారు. ఒకవేళ కింగ్ సజీవంగా ఉండి ఉంటే అమెరికా సంయుక్త రాష్ట్రాలకు తొలి నల్లజాతి అధ్యక్షుడు అయ్యేవాడని అప్పట్లో రాజకీయ విశ్లేషకులు అంచనా వేశారు.

1889-
1945

# అడాల్ఫ్ హిట్లర్

పాశ్చాత్య ప్రపంచాన్ని గడగడలాడించిన నియంత, రెండవ ప్రపంచ యుద్ధానికి మూలకారకుడు అడాల్ఫ్ హిట్లర్. 21వ శతాబ్దం వచ్చినా ప్రపంచ దేశాలన్నీ హిట్లర్ నీలి జ్ఞాపకాలను మనసుల నుంచి తొలగించడానికి ఇంకా ప్రయత్నిస్తూనే ఉన్నాయి. జర్మన్‌ల మనసులను ఆకర్షించినవాడు, ఈ శతాబ్దపు అనేక ప్రధాన సంఘటనలకు మూలకారకుడు, నాజీ జర్మనీ ప్రభుత్వ నాయకుడు అయిన హిట్లర్ అయిదు కోట్ల మంది హతులవ్వడానికి, యూరోపియన్ యూదు జాతిని దాదాపుగా తుడిచి పెట్టే ప్రక్రియకు పాల్పడ్డాడు. అంతేగాక, ఎంతో మంది ప్రజలు శరణార్థులు కావడానికి, నగరాలు బూడిదకుప్పలుగా మారడానికి బాధ్యుడు.

హిట్లర్ దిగువ మధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు. అతని తండ్రి పేరు ఎలాయిస్ షికల్ గ్రూబర్ హిట్లర్. అతను ఆస్ట్రియా ప్రభుత్వ కస్టమ్స్ ఉద్యోగి. అతని తల్లి తన భర్త అదుపాజ్ఞలలో నిమగ్నమై కుమారుని బాగోగుల పట్ల అంతగా శ్రద్ధ వహించలేకపోయింది. చిన్నతనంలో హిట్లర్ స్థానిక చర్చిలో పాటలు పాడే కార్యక్రమాల్లో పాల్గొనేవాడు. ఆ సమయంలో అతడు తరచు ఆ చర్చికి సంబంధించిన గుర్తుగల రాతి తోరణం పక్క నుంచి వెళ్ళేవాడు. దాని మీద శిలువకు దగ్గరి రూపంలో ఉండే స్వస్తిక్ గుర్తు ఉండేది. తర్వాత హిట్లర్ ఈ గుర్తునే నాజీ జర్మనీ గుర్తుగా చేసాడు.

హిట్లర్ చిన్నప్పటినుంచి యుద్ధవీరుల గురించిన ఊహలలో తేలియాడుతుండేవాడు. ప్రాచీన జర్మన్ కథలు, సాహసాలు గురించిన కథనాలు అతని ఊహలలో కదిలేవి. ఆ కథలు, సాహసాలను ఆయన ఇష్టపడేవాడు. 1908లో తల్లి మరణానంతరం ఆయన ఒంటరివాడై దిశా నిర్దేశం లేని వానిగా తిరిగి ఒక కళాకారుడవ్వాలని కలలు కనేవాడు. ఆ సమయంలో తన కుటుంబాన్ని వదలి ఉపాధిని వెతుక్కుంటూ జర్మన్‌ల ఆధిపత్యం ఎక్కువగా ఉన్న వియన్నాలో స్థిరపడ్డాడు. ఎక్కువ మంది యూదులు ఉన్నత స్థానాల్లో ఉండడం ఆయనను అమితాశ్చర్యానికి గురిచేసింది. కళాకారుడవ్వాలన్న ఉద్దేశంతో వియన్నాలోని అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్‌లో చేరాలని ప్రయత్నించాడు. అయితే రెండు సార్లు అతను చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. దానితో అతను దుర్భర దారిద్ర్యానికి గురయ్యాడు. విధిలేని పరిస్థితుల్లో చేతితో పెయింట్ చేసిన పోస్టు కార్డులు అమ్మి వచ్చిన చిల్లర డబ్బులతో జీవించేవాడు. అక్కడి నుంచి ఉపాధిని వెతుక్కుంటూ మ్యూనిచ్ వెళ్ళాడు. అక్కడా పరిస్థితి అలానే ఉంది. ఈ లోగా మొదటి ప్రపంచ యుద్ధం మొదలైంది. హిట్లర్ ఒక బవేరియన్ సైనిక రెజిమెంట్‌లో స్వచ్ఛందంగా చేరాడు. యుద్ధంలో కనబరచిన ధైర్యసాహసాలకుగాను ఐరన్‌క్రాస్ పురస్కారాన్ని పొందాడు. శత్రువులు జరిపిన మాస్టర్ గ్యాస్ (ఒక రకమైన విషవాయువు)దాడిలో గాయపడి తాత్కాలికంగా చూపును కోల్పోయాడు. అప్పట్లో హిట్లర్‌ను పరీక్షించిన ఒక మానసిక వైద్యుడు హిట్లర్ ఉన్మాదిలా హింసా కార్యకలాపాలకు పాల్పడే ఒక వ్యక్తిత్వ లోపంతో బాధపడుతున్నట్టు పేర్కొన్నాడు. ఈలోపం మాట ఎలా ఉన్నా యుద్ధరంగంలో అనుభవాలు హిట్లర్‌ను కఠిన మనస్కుడిగా తయారు చేశాయి. తల్లి మరణించినపుడు ఏడుపును ఆపుకోలేని స్థితిలో సున్నిత మనస్కుడిగా ఉన్న హిట్లర్ యుద్ధరంగంలో హింసను రుచి చూసాడు. ఆ తర్వాత ఆ పిపాస ఎక్కువ కాసాగింది. యుద్ధానంతరం తీవ్ర జాతీయతా వాదిగా మారిన హిట్లర్ 1919లో జాతి ఆధిక్యతకు ప్రాధాన్యతనిచ్చే జర్మన్ వర్కర్స్ పార్టీలో చేరాడు. తర్వాత దాని పేరును 'నేషనల్ సోజయలిస్టిక్ డ్యూషే ఆర్బిటర్ పార్టీ (ఎన్ఎస్‌డిఎపి)'గా మార్చాడు. అదే నాజీ పార్టీగా ప్రసిద్ధమయ్యింది. తనలో అద్భుతమైన వాగ్ధాటి ఉందని గమనించిన అతడు రెండేళ్ళలోనే ఆ పార్టీకి తిరుగులేని చైర్మన్‌గా పదవి నలంకరించాడు.

ఆ రోజుల్లో మొదటి ప్రపంచ యుద్ధంలో ఓటమిపాలైన జర్మనీలో పరిస్థితులు ఏమాత్రం బాగాలేవు. యుద్ధంలో ఓటమి కారణంగా వచ్చిపడిన అవమానభారం, దానికి తోడు ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడిన ఆర్థికమాంద్యం దేశాన్ని, ఆర్థిక పరిస్థితిని మరింత దిగజార్చింది. ఈ తరుణంలో హిట్లర్ ప్రవచించే జాతీయతా రక్షణ సందేశాలకు సరైన వేదిక అయింది. పేరు ప్రతిష్టలకు సంబంధించిన భ్రమలు దైవాదేశాన్ని తాను పాటిస్తున్నాన్న భావన గల హిట్లర్ చేసే ఉద్రేకపూరిత ప్రసంగాలు, కష్టాలనెదుర్కొంటున్న ప్రజానీకాన్ని ఆకర్షించడం ప్రారంభించాయి. ప్రపంచ యుద్ధానికి కారణమైన జర్మనీ 3000 కోట్ల డాలర్ల నష్టపరిహారాన్ని చెల్లించనక్కర్లేకుండా

తీర్మానించడమే కాక, జర్మనీని బలోపేతం చేస్తానని ఆహారం కోసం జర్మన్లు బారులు తీ రి నిలబడాల్సిన అవసరంలేని, పార్టీ రాజకీయాలు, యూదుల ఆధిపత్యం లేని జర్మన్ సమాజాన్ని ఏర్పరుస్తానని అతను తన ఉపన్యాసాల్లో పేర్కొనేవాడు. ప్రపంచ యుద్ధవాదుల కూటమి, బోల్షివిక్‌ల నుంచి ఉన్న ప్రమాదం వంటివి తమ దేశంలోని సంక్షోభానికి కారణమనే భావాన్ని అతడు కలగజేశాడు. తన ప్రసంగాలలో ధ్వనించే మారణహోమం, ఊచకోత వంటి భావాలకు దీటుగా వైభవాల గురించి, ఆవిష్కరించనున్న అద్భుతాల గురించి వివరించేవాడు. ఈ భావాలన్నీ ప్రజలలో ఒక రకమైన దేశభక్తిని ఉద్దీపితం చేశాయి. వీటన్నిటిని తాను రాసిన 'మీన్ క్యాంఫ్' అనే పుస్తకంలో ప్రస్తావించాడు. 1923లో తాను లేవదీసిన 'బీర్‌హాల్ పుట్చ్' తిరుగుబాటు విఫలం కావడంతో జైలుపాలయ్యాడు. జైలులో రాసిన మీన్‌క్యాంప్‌లో ఆర్యజాతి స్వచ్ఛత, జర్మనీ సరిహద్దుల విస్తరణ, వంటి ఎన్నో అంశాలున్నాయి.

చట్టంలోని నిబంధనలను అడ్డం పెట్టుకుంటూ హిట్లర్ త్వరిత గతిన అధికారాన్ని హస్తగతం చేసుకునే దిశగా కదిలాడు. బీర్‌హాల్ తిరుగుబాటు సందర్భంగా బవేరియా ప్రభుత్వాన్ని కూలదోయడానికి ప్రయత్నించి విఫలమైన పదేళ్ళకే హిట్లర్ తన అద్భుత వక్తృత్వంతో వినిపించిన ఉపన్యాసాలు జర్మన్ జాతీయతా వాద నినాదాలయ్యాయి. ఇదిలా ఉండగా అప్పటి ఎన్నికల్లో విజయం సాధించిన అధ్యక్షుడు హిండెన్‌బర్గ్ మూడేళ్ళ అనంతరం కొందరి సలహాల మేరకు హిట్లర్‌కు అప్పటి సంకీర్ణ ప్రభుత్వంలో ఛాన్సలర్ పదవి ఇచ్చాడు. ఇది జరిగిన నెలల్లోనే మళ్ళీ ఎన్నికలు జరిగాయి. ఈలోగా హిట్లర్ అనుకూల వర్గాలు వీధులను తమ ఆధీనంలోకి తీసుకున్నాయి. దీనితో అశక్తతకు గురైన అప్పటి జర్మనీ ప్రభుత్వం హిట్లర్‌కు నియంతృత్వ అధికారాలను అప్పగించింది. దానితో 1933 మార్చి 23న నాజీ ప్రభుత్వం ఏర్పడింది.

హిట్లర్ అధికారంలోకి వచ్చాక ఆయన రాజ్యవిస్తరణ కాంక్ష కార్యరూపం దాల్చింది. ఆయన ఎటువంటి ప్రతిఘటన లేకుండా చెకొస్లొవేకియాకు చెందిన సుడెటెన్‌లాండ్‌ను, ఆస్ట్రియాకు చెందిన ఆన్‌స్క్లుస్‌ను స్వాధీనం చేసుకున్నాడు. ఈ చర్యలను ఇతర పాశ్చాత్య దేశాలు తమ అర్థం లేని జర్మనీ బుజ్జగింపు విధానంలో భాగంగా పట్టించుకోలేదు. ఈలోగా సోవియట్ యూనియన్‌తో పరస్పర దురాక్రమణ నిరోధక ఒప్పందం కుదుర్చుకున్న హిట్లర్ నెలలోపే 1939 సెప్టెంబర్ 1వ తేదీన పెద్ద ఎత్తున వైమానిక దాడులతో పోలెండ్‌పై విరుచుకుపడ్డాడు. ఇది జరిగిన రెండు రోజులకే బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీపై యుద్ధం ప్రకటించాయి. దీనితో అధికారికంగా రెండో ప్రపంచ యుద్ధం మొదలైంది. అయితే ఈలోగా జర్మనీ మెరపు వేగంతో నార్వే, డెన్మార్క్, నెదర్లాండ్స్, బెల్జియంలను ఆక్రమించింది. చివరకు 1940 జూన్‌లో ఫ్రాన్స్‌కూడా జర్మనీకి తలవంచింది. అయితే ఆ తర్వాత సంవత్సరం రష్యాను ఆక్రమించాలని హిట్లర్ నిర్ణయించాడు. ఆ దేశాన్ని వలస రాజ్యంగా చేసుకుని అక్కడి సహజసంపదలను కొల్లగొట్టాలని భావించాడు. అయితే వ్యూహాత్మకంగా ఇక్కడే అతడు అతి పెద్ద తప్పిదం చేశాడు. జర్మనీ తమ దేశంపైకి దండెత్తిరావడంతో రష్యా పాలకులు మిత్రరాజ్యాలతో చేతులు కలిపారు. అయితే జపాన్ పెర్ల్ హార్బర్‌పై దాడి చేసిన వెంటనే హిట్లర్ అమెరికాపై యుద్ధం ప్రకటించడం అతడి ఓటమికి కారణమయ్యింది.

ఆ తర్వాత హిట్లర్ సైన్యాలకు క్రమంగా అపజయాలు ఎదురయ్యాయి. 1945 ఏప్రిల్ 30న సోవియట్ సైన్యం బెర్లిన్‌లోని తన సైనిక బంకర్‌కు 300 గజాల దూరం వరకు వచ్చిన తరుణంలో హిట్లర్ అప్పుడే వివాహం చేసుకున్న ఇవాబ్రాన్‌తో కలసి ఆత్మహత్య చేసుకున్నాడు. ఒకప్పుడు తనను తాను 'ఇంతవరకు ఎప్పుడూ లేనంతటి గట్టి మనిషిగా అభివర్ణించుకున్న హిట్లర్ చివరి రోజుల్లో కోపోద్రిక్తుడై "శత్రువులకు ఏనాడూ మనను వధ్యశిలకు పంపే అవకాశం ఇవ్వరాదు' అనేవాడు. అయితే చరిత్రలో ఏనాడూ కనీవినీ ఎరుగని స్థాయిలో అమానుషానికి పాల్పడిన వ్యక్తి నోటి నుంచి ఇటువంటి వ్యాఖ్యలు రావడం విచిత్రమే. హిట్లర్ గురించి భిన్న అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. అతడు చిన్నతనంలో అనుభవించిన వేధింపులు, అతన్ని దుశ్చర్యలకు పాల్పడే మనస్తత్వంగలవాడిగా చేసాయని, అతను లైంగిక లోపాలతో బాధపడేవాడని, ఒక కొత్త రకం కరడుగట్టిన మనస్తత్వం కలవాడని, జాత్యహంకారి అని– ఇలా ఎన్నో అభిప్రాయాలలో ఇవి కొన్ని మాత్రమే.

# వ్లాదిమిర్ లెనిన్

శతాబ్దాల తరబడి క్రూర నియంతలు, కరడుగట్టిన రాజుల పాలనలో మగ్గిపోయిన రష్యాకు వెలుగు బాట చూపిన మహా మనీషి వ్లాదిమిర్ లెనిన్."ప్రజలకు శాంతి కావాలి, వారికి తిండి కావాలి, వారు వ్యవసాయం చేసుకునేందుకు భూమి కావాలి" అన్న నినాదాలతో జారు చక్రవర్తుల గుండెల్లో నిద్రపోయిన విప్లవకారుడు లెనిన్ ప్రపంచంలోని అతి కొద్ది మంది దార్శనికుల్లో ఒకరు.

ఉన్నత వంశస్థుల కుటుంబంలో 1870 ఏప్రిల్ 22న పుట్టిన లెనిన్ అసలు పేరు వ్లాదిమిర్ ఇల్యిచ్ ఉల్యనోవ్. ఉన్నత వంశంలో పుట్టినా లెనిన్ ఆలోచనలెప్పుడూ పేదవర్గం అభ్యున్నతి గురించే. తల్లిదండ్రులు ఇద్దరూ ఉపాధ్యాయులు కావడంతో వ్లాదిమిర్ తెలివైన విద్యార్థిగా క్లాసులో పేరు సంపాదించాడు. పియానో అద్భుతంగా వాయించగలగడమే కాకుండా, చెస్‌లోనూ లెనిన్ బహు నేర్పరి. గెలుపోటములు సమాన స్థాయిలో తీసుకునే చిన్నారి లెనిన్‌ను ఇంట్లో 'వోలోద్యా' అని ముద్దుగా పిలిచేవారు. పీటర్స్ బర్గ్ విశ్వవిద్యాలయంలో 'లా' విద్యార్థిగా దరఖాస్తు నింపుతున్నప్పుడు 'నోబుల్' మ్యాన్ వి. ఐ. ఉల్యనోవ్ అని తన పేరు రాసుకున్నాడు. న్యాయశాస్త్ర విద్యార్థిగా లెనిన్ రాటుదేలి, పేద-గొప్ప, బీద-ధనిక ప్రజల మధ్య తారతమ్యాలను గ్రహించగలిగాడు. లెనిన్ లా కళాశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడే అతని అన్న అలెగ్జాండర్ ప్రభావం బాగా పడింది. విప్లవకారులతో తిరిగే లెనిన్ సోదరుడు అలెక్సాండర్‌ను జార్ చక్రవర్తి అలెగ్జాండర్-3ను చంపడానికి కుట్రపన్నాడని ఆరోపిస్తూ బహిరంగంగా ఉరితీశారు. లెనిన్ మనస్సులో ఈ దారుణం బలంగా ముద్రపడింది. న్యాయశాస్త్రంలో ఫైనల్ పరీక్షలు రాసేసరికే లెనిన్ మార్క్సిస్టు సాహిత్యాన్ని అధ్యయనం చేశాడు. అన్నయ్య విప్లవ లక్ష్యాలను నరనరాన జీర్ణించుకుని లెనిన్ పట్టా తీసుకున్న తరువాత కిరాతక జార్ చక్రవర్తిని అంతమొందించడానికి తిరుగుబాటు శక్తులతో చేతులు కలిపాడు. రాడికల్ శక్తులతో కలిసి పనిచేస్తున్నందుకు గాను లెనిన్‌ను రాజు సైనికదళం 1895లో అరెస్టు చేసి సైబీరియాకు కారాగార శిక్షకై తరలించింది.

సైబీరియా జైల్లో లెనిన్ తన రచనా వ్యాసంగాన్ని మొదలుపెట్టాడు. రష్యాలో పెట్టుబడిదారీ వ్యవస్థ ఎలా వేళ్ళూనుకుందో తెలియజేసే వ్యాసాలను రాసాడు. ఇది ఆయన రూపొందించిన ప్రధాన సిద్ధాంత గ్రంథం. రష్యా జనాభాలో గణనీయమైన సంఖ్యలో ఉన్న శ్రామికవర్గం ప్రజలను విప్లవంకోసం సమాయత్తం చేయగలిగితే గెలుపు తమదేనని లెనిన్ విశ్వసించాడు. అందుకే తన వ్యాసాలు శ్రామిక వర్గ ప్రజలు చదవాలని ఆయన అభిలషించేవాడు. జైలులో తనకిచ్చిన పాలను సిరాగా వాడుకొని వ్యాసపరంపర కొనసాగించాడు. విడుదలైన తరువాత లెనిన్ మరింకా రష్యాలో ఉండలేదు. బహిరంగంగా రష్యా పాలకులపై ధ్వజమెత్తిన తనను జార్ చక్రవర్తి బతకనివ్వడని తెలుసుకున్న లెనిన్ యూరప్ పశ్చిమ ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడే సోషలిస్ట్ దళాలను ఏర్పాటు చేసి పుస్తకాలు రాయడం మొదలు పెట్టాడు. ఇస్క్రా (నిప్పురవ్వ) పేరుతో తోటి మార్క్సిస్టు గెర్గీ ప్లెఖనోవ్‌తో కలిసి పత్రికను నడిపాడు. 1902లో రష్యాలో శ్రామిక వర్గాన్ని మేలుకొలిపే విధంగా 'వాట్ ఈజ్ టు బి డన్' (ఏం చేయాలి?) అనే రచనతో ఆలోచనా తరంగాల్ని రష్యా ప్రజల్లో పాతుకుపోయేటట్లు చేయగలిగాడు. మూడేళ్ళ తరువాత తిరిగి రష్యాకు రాబోయిన లెనిన్ మళ్ళీ ప్రమాదాన్ని శంకించి తిరిగి అజ్ఞాతంలోకి వెళ్ళిపోయాడు. రష్యా సోషల్ డెమొక్రాటిక్ పార్టీలోని బోల్షివిక్ వర్గాన్ని తనవైపు తిప్పుకొని మెన్షివిక్‌లతో పోరాడాడు.

అజ్ఞాతంలో ఉన్న కాలమంతా రచనా వ్యాసంగం, విప్లవపార్టీ పటిష్టతకు కృషి చేసిన లెనిన్ తీ రిక సమయంలో అనేక శాస్త్రీయ, సామాజిక విషయాలను కూలంకషంగా అధ్యయనం చేసేవాడు. ఆర్థిక, సామాజిక, తర్క శాస్త్రాలు సహా లెనిన్ చదవని పుస్తకమంటూ లేదు. రష్యాలో జార్ చక్రవర్తుల క్రూరమైన పాలనతో విసుగెత్తిన లెనిన్ ప్రజా కంటకులపై ఎటువంటి పరిస్థితుల్లో దయ, జాలి, చూపరాదని తీర్మానించుకున్నాడు. తన సిద్ధాంతంలో క్షమ,

దయ, జాలి అనే పదాలే లేవని చెప్పుకొచ్చాడు. "ప్రజల బాగోగులు పట్టించుకోని నియంతను బహిరంగంగా ఉరి తీయాలి, ప్రజల సమక్షంలో గిలగిలా కొట్టుకుని ప్రాణాలు వదలాలి, శ్రామిక, కర్షక వర్గం రక్త మాంసాలను జలగల్లా పీల్చిన కులక్స్, ధనికులకు బతికే హక్కు లేదు. వారిని ఎంత నీచంగా చంపాలంటే కొన్ని వందల కిలోమీటర్ల వరకూ వారి చావు కేకలు విన్పించి ప్రజలు ఆనందంతో నృత్యాలు చేయాలి"

మొదటి ప్రపంచ యుద్ధంలో రష్యా పాల్గొనడంపై లెనిన్ తన అభ్యంతరాలను యూరప్ అంతటా ప్రచారం చేశాడు. రష్యాలో ఉన్న సామ్యవాదులంతా చేరి ఒక్కతాటిపై నిలబడి, దీన్ని ఖండించాలన్నాడు. ఇక విప్లవానికి సమయం ఆసన్నమైందని గ్రహించిన లెనిన్ తమ బద్ధ శత్రువు జర్మన్లు ఏర్పాటు చేసిన ప్రత్యేక రైలులో బయలుదేరి సెయింట్ పీటర్స్ బర్గ్ చేరుకున్నాడు. ప్రత్యేక కారులో రష్యా బయలుదేరాడు. రష్యాను లెనిన్ విప్లవంతో అతాలా కుతలం చేస్తే తాము బాగుపడదామనుకున్న జర్మన్లు లెనిన్‌కు సాయం చేశారు. అప్పటికే యుద్ధంలో పాల్గొని భారీగా నష్టపోయిన రష్యా ప్రజలు దుర్భర దారిద్ర్యం అనుభవిస్తున్నారు. 1917 స్విట్జర్లాండ్ నుంచి రైలులో బయలుదేరిన లెనిన్ జర్మన్ రైలులో ఫిన్లాండ్‌కు వచ్చాడు. స్వదేశానికి వచ్చి తనను నమ్ముకున్న బోల్షెవిక్కులను సాయుధ మిలిటరీ విప్లవ కమిటీలుగా ఏర్పాటు చేశాడు. తన సహచరుడు కామ్రేడ్ 'లియోన్ ట్రాట్స్కీ'తో కలిసి జార్ ప్రభువు రెండో నికొలస్‌ను చంపాలని కుట్రపన్నాడు. మొత్తానికి జార్ చక్రవర్తి అలెగ్జాండర్ కెరెన్స్కీ నియంతృత్వ పాలనకు లెనిన్ ఆధ్వర్యంలోని బోల్షెవిక్కులు 1917 నవంబర్ 7న తెరదించారు. అయితే రష్యాలో పాత క్యాలెండర్ ప్రకారం ఆ తేదీ అక్టోబర్ 25 కావడంతో దాన్ని 'అక్టోబర్ 1917 మహా విప్లవం'గా పరిగణిస్తారు.

జర్మనీతో 1918లో బ్రెస్ట్-లితోస్క్ ఒప్పందం కుదుర్చుకున్న లెనిన్ రష్యా యుద్ధం నుంచి తప్పుకొంటున్నట్టు ప్రకటించాడు. మొదట్లో బోల్షెవిక్ వ్యతిరేకవర్గం వారైన తెల్లవారి ఆగ్రహాన్ని లెనిన్ చవిచూడాల్సి వచ్చింది. మొత్తానికి విప్లవ వ్యతిరేకులు, శ్రామికవర్గం శత్రువులను విజయవంతంగా అణచివేసిన కొత్త విధానాన్ని లెనిన్ 1921లో ప్రవేశపెట్టాడు. దీనివల్ల రైతులు తమ భూములను యధేచ్ఛగా సాగుచేసుకునే అవకాశం కల్పించాడు. అదే ఏడాది రష్యాలో కరువు కరాళనృత్యం చేయడంతో అమెరికా సాయాన్ని సైతం తీసుకున్నాడు.

అయితే లెనిన్ ప్రబోధించిన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఇతర రకాలైన మార్క్సిస్టులు ఎలా బేరీజు వేస్తారు. ప్రజల కోసమే పని చేస్తున్నానని చెప్పుకున్న ఈ నాయకుడు తన వ్యతిరేకులను అంతమొందించడాన్ని ఎలా అర్థం చేసుకుంటారు? అయితే చివరి దాకా లెనిన్ తన ఆశయాలకు చేరువగా ఉన్నవారిని అమితంగా విశ్వసించేవాడు. ఆయన భార్య నదీజ్దా కాన్‌స్టాంటినోవా కృప్‌స్కాయా మీద ఆయనకు అచంచలమైన విశ్వాసం ఉండేది. కృప్‌స్కాయాకు, తనకు నేస్తం అయిన ఎలిజబెత్ డి హెర్బెన్‌విల్లీ ఆర్మాండ్ (ఆమెను ఇన్నెస్సా అనేవారు) మీద కూడా ఆయనకు అపారమైన నమ్మకం. ఆమె తరచుగా లెనిన్ కుటుంబంతో గడిపేది. బీథోవెన్ సంగీతం వినడం వంటి సరదాలను చివర్లో వదులుకున్నాడు. అలాంటివి వినడంవల్ల తాను బలహీన పడుతున్నానని లెనిన్ భావించాడు.

సామ్యవాద రష్యాకు ప్రాణప్రతిష్ఠ చేసిన లెనిన్ రష్యా పాలనా పగ్గాలు కొద్ది కాలమే తన చేతిలో ఉంచుకున్నా, శ్రామిక వర్గం, సామాన్య ప్రజల అభివృద్ధికోసం అహరహం శ్రమించాడు. రష్యా బాగును కోరతారనుకున్న స్టాలిన్ వంటి వారిని అందలాలెక్కించాడు. ప్రపంచంలో మరిన్ని విప్లవాలకు నాందిగా నిలిచిన అక్టోబర్ విప్లవం, రష్యాలో కమ్యూనిస్టు పాలనకు మొగ్గతొడిగింది. లెనిన్‌ను కడదాకా అభిమానించిన రష్యన్లు 1922లో ఆయన అకస్మాత్తుగా చనిపోవడంతో బావురుమన్నారు. కమ్యూనిస్టు రష్యా పితామహుడైన లెనిన్ భౌతికదేహాన్ని మమ్మీగా చేసి ప్రజల సందర్శనార్థం లెనిన్ మాసోలియంలో ఉంచారు.

1890-
1969

# హో-చిమిన్

హో చిమిన్ వియత్నాం స్వాతంత్ర్య యోధుడు. ఉత్తర వియత్నాం తొలి అధ్యక్షుడు. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు వియత్నాం, లావోస్, కంబోడియాలను కలిపి ఇండో చైనా అనేవారు. అప్పట్లో ఇవి ఫ్రాన్స్ వలస పాలనలో ఉండేవి. హోచిమిన్ వియత్నాంను ఫ్రాన్స్ వలస నుంచి తప్పించేందుకు పోరాడి ఆ ప్రయత్నంలో విజయం సాధించాడు. సన్నగా, పొడవాటి గడ్డంతో, నిరాడంబరంగా కనిపించే హోచిమిన్ మొదట్లో పాశ్చాత్య పత్రికల అవహేళనకు గురైనా పట్టుదలతో శ్రమించాడు. సాధించదలచుకున్నది సాధించాడు. తన దేశానికి ఫ్రాన్స్ నుంచి స్వాతంత్ర్యం ఇప్పించాలని కోరుతూ అతను 1919లో వర్సేల్స్ శాంతి సదస్సు సభ్యులను కలిసి విజ్ఞప్తి చేశాడు. ఆ దిశగా కార్యాచరణ నిమిత్తం ఎనిమిది అంశాల ఒక కార్యక్రమాన్ని వారికి అందజేశాడు. అయితే సదస్సు సభ్యులు అతని వినతిని కాని, అతని ఎనిమిది అంశాల కార్యక్రమాన్నిగాని పట్టించుకోలేదు. అదే సమయంలో ఇండో చైనాపై ఆధిపత్యం కోసం జపాన్, ఫ్రాన్స్ దేశాల మధ్య పోరు సాగేది. ఈ రెండు దేశాల ఆధిపత్యం నుంచి తమ దేశానికి స్వాతంత్ర్యం సాధించేందుకు హోచిమిన్ పోరాటం సాగించాడు. ఈ పోరాటాలు అతనిని వలస పాలనకు వ్యతిరేకంగా పోరాడే యోధునిగా మార్చివేశాయి. వియత్నాం రెండుగా విడిపోయిన అనంతరం దక్షిణ వియత్నాం తరపున అమెరికా యుద్ధానికి దిగినప్పుడు ఆ బాంబుల వర్షం నుంచి ప్రజలను కాపాడేందుకు హోచిమిన్ భూగర్భసొరంగాలు నిర్మింపజేస్తున్నప్పుడు ఆయన దృఢ నిశ్చయం, ధీరోదాత్తత మరింత మందికి వెల్లడయింది. వామ పక్షీయుల దృక్పథంలో, ప్రజలు ఆప్యాయంగా 'అంకుల్ హో' అని ఆయనను పిలిచేవారు. టైరు రబ్బరు చెప్పులతో తన బాధలు పైకి కనబడనీయకుండా తమ దేశ విమోచనే ఏకైక లక్ష్యంగా శ్రమించే మునివంటి నిరాడంబరుడు. ఆ లక్ష్య సాధనలో ఆయన నిర్దాక్షిణ్యంగా వ్యవహరించిన సందర్భాలను సైతం క్షమించవచ్చని వారి భావం. 1950 ప్రాంతాల్లో వ్యవసాయక సంస్కరణల సందర్భంగా 50 వేల మంది ప్రాణాలు కోల్పోయారు. దానికి ఆయనే కారణమనేది ఆయన నిర్దాక్షిణ్యానికి ఉదాహరణగా వారు భావిస్తారు. మరోపక్క మితవాదులు ఆయనను మాస్కోలో శిక్షణ పొందిన బోల్షివిక్‌గా, ఫ్రెంచి ఇండో చైనా కమ్యూనిస్టు పార్టీల వ్యవస్థాపకుడిగా, అంతర్జాతీయ కమ్యూనిస్టు కుట్రలో భాగమై దాక్షిణ్య రహితంగా ఇతరులలోని మంచిని గ్రహించలేని ఏజెంట్‌గా భావిస్తుంటారు.

హోచిమిన్ 1890లో గుయెన్ థటో థాన్ అనే ప్రాంతంలో జన్మించాడు. అప్పట్లో ఆ ప్రాంతం ఫ్రెంచి ఇండో చైనాలో భాగంగా ఉండేది. ఆయన ఎగువ మధ్య తరగతికి చెందిన కుటుంబంలో పుట్టాడు అప్పటికే ఆ కుటుంబ సభ్యులు ఫ్రాన్స్ పాలనను ప్రతిఘటించే ఉద్యమంలో భాగస్థులు. హోచిమిన్ తండ్రి ఔషధీయ మొక్కలు పెంచే నిపుణుడే గాక మంచి విద్యావంతుడు. ఆయన వేర్వేరు ప్రాంతాల్లో పర్యటించి ఉపన్యాసాలు ఇచ్చేవాడు. హోచిమన్ మొదట సంప్రదాయబద్ధమైన సినో వియత్నామీస్ విధానంలో విద్య నేర్చినా ఆ తర్వాత తండ్రి ఆదేశానుసారం తమను పాలిస్తున్న వలస పాలకుల భాషను నేర్చుకున్నాడు. కొన్నేళ్ల విద్యాభ్యాసానంతరం 1911లో ఒక ఫ్రెంచి ఓడలో కిచెన్‌లో పనివాడుగా చేరి యూరప్ చేరుకున్నాడు. 1914లో లండన్ కార్ల్‌టన్ హోటల్‌లో పేరెన్నికగన్న చెఫ్ అయిన ఆగస్టి ఎస్కోఫియర్ వద్ద వంటల్లో శిక్షన పొందాడు. 1917 రష్యన్ స్ఫూర్తితో హోచిమిన్ విస్తృతమైన కమ్యూనిస్టు కార్యకలాపాలలో పాల్గొనడం ప్రారంభించాడు. 1918లో హోచిమిన్ పారిస్ చేరుకున్నాడు. అక్కడ బ్రిటన్ రాజకీయ ఆలోచనా సరళిని, పాశ్చాత్య విలువలను ఇముడ్చుకున్న వామపక్ష కార్యకలాపాల్లో మునిగితేలాడు. ఫ్రెంచి, అమెరికా విప్లవాల నేపథ్యంలో ప్రభావితుడైన హోచిమిన్ ఆ తర్వాత వియత్నాం రాజ్యాంగాన్ని అమెరికా రాజ్యాంగ లక్షణాలతోనే రూపొందించాడు.

1923లో హోచిమిన్ రష్యావెళ్లి మాస్కో యూనివర్శిటీలో విప్లవ కార్యకలాపాలలోని మెళకువలు నేర్చుకున్నాడు. ఆ తర్వాత ఇరవై ఏళ్ళ పాటు కమ్యూనిస్టు విభాగాల నిర్వాహకుడయ్యాడు. చైనా, ఆగ్నేయాసియాల్లో గెరిల్లా దళాల పథ నిర్దేశ నాయకునిగా, ప్రవాస వియత్నామీయులు తమ దేశంలోకి చొరబడి దాడులు చేసేందుకు శిక్షణ నివ్వడం వంటి కార్యకలాపాలలో

పాలుపంచుకున్నాడు. వేరు వేరు ప్రదేశాల్లో మారు పేర్లతో మారువేషాలతో ఒకసారి సంపన్న వ్యాపారస్థునిగా మరోసారి బౌద్ధ భిక్షువుగా రకరకాల వేషాలతో కమ్యూనిస్టు కార్యకలాపాలు నిర్వహించేవాడు. హోచిమిన్ నిర్వహిస్తున్న జాతీయవాద కార్యకలాపాలు అప్పటి ఫ్రెంచి పాలకులకు కంటిమీద కునుకు లేకుండా చేశాయి. దానితో వారు అతని పరోక్షంలోనే విచారణ జరిపి మరణదండన విధించాలని నిర్ణయించారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఆగ్నేయాసియాలో ఎక్కువ భాగం జపాన్ ఆధిపత్యంలో ఉండడంతో ఆక్రమణదారులను తరిమికొట్టేందుకు హోచిమిన్ తాత్కాలికంగా చాంగై షేక్ ఆధ్వర్యంలోని చైనా జాతీయతా వాదులతో స్నేహం చేశాడు. 1941లో దక్షిణ చైనాలో వో గుయెన్ జియాప్‌తో వియత్నాం విమోచనా సంస్థను ఏర్పరిచాడు. ఈ లీగ్‌లో వియత్నాం జాతీయవాదులు, వియత్‌మిన్‌గా పిలిచే ఇండో చైనా కమ్యూనిస్టులు సభ్యులుగా ఉండేవారు. ఈ సమయంలో హోచిమన్ కొద్ది కాలం పాటు అమెరికాకు అనుకూలంగా పనిచేశాడు. జపనీయుల కార్యకలాపాల గురించి అతడు ఎప్పటికప్పుడు అమెరికా గూఢచార సంస్థలకు సమాచార మందించేవాడు. ఆ సమయంలోనే ప్రాణాంతకమైన వ్యాధి బారినపడి తృటిలో మృత్యువునుండి బయటపడ్డాడు. 1945లో హోచిమిన్ నాయకత్వంలోని దళాలు జపాన్ దళాలను వియత్నాం నుంచి తరిమికొట్టాయి. వెంటనే ఆయన అమెరికా స్వాతంత్ర్య ప్రకటన మాదిరి 'డెమొక్రటిక్ రిపబ్లిక్ ఆఫ్ వియత్నాం'ను ఏర్పరచి అధ్యక్షునిగా ఎన్నికయ్యాడు.

రెండవ ప్రపంచ యుద్ధంలో జపాన్ ఓటమిపాలవటంతో ఫ్రెంచి వలసపాలకులు జపాన్ ఆక్రమణకు ముందు తమ ఆధీనంలో ఉన్న భూభాగాన్ని తిరిగి స్వాధీనం చేసుకునేందుకు ప్రయత్నించారు. వారికి, హోచిమిన్ నాయకత్వంలోని దళాలకు మధ్య ఎనిమిదేళ్ళ పాటు యుద్ధం జరిగింది. ఇందులో పది లక్షల మంది మరణించారు. 1954 మార్చిలో జనరల్ జియాప్ నాయకత్వంలోని గెరిల్లాదళాలు ఫ్రెంచివారి ఆధీనంలోని డియన్ బియన్ ఫూను ముట్టడించారు. మే 7న ఆ గ్రామం వారి ఆధీనమయింది. దానితో ఫ్రాన్స్ దళాలు వియత్నాం విడిచి వెళ్ళాయి. ఈ సమయంలో వియత్నాం భవిష్యత్తుపై స్విట్జర్లాండులోని జెనీవాలో చర్చలు జరిగాయి. ఆ చర్చల్లో వియత్నాంను విభజించాలని నిర్ణయించారు. 1956లో ఎన్నికల అనంతరం దేశానికంతటికీ ఒకే నాయకుణ్ణి ఎన్నుకునే వరకు రెండు భాగాలుగా విభజించాలని నిర్ణయించారు. 17వ అక్షాంశం వద్ద ఉత్తర, దక్షిణ వియత్నాంలుగా విభజించాలన్న నిర్ణయం తీసుకున్నారు. ఆ మేరకు విభజన జరిగింది. 1956లో ఎన్నికల ముందు ప్రజాభిప్రాయం కూడా హోచిమిన్‌కు అనుకూలంగా ఉంది. అయితే దక్షిణ వియత్నాం అధ్యక్షుడు ఎంగో డిన్ డీమ్ ఎన్నికలు నిర్వహించడానికి ముందుకు రాలేదు. అప్పటికే డిన్‌డీమ్‌కు అమెరికా మద్దతు లభించింది. ఆ ప్రాంతంలో కమ్యూనిజం వ్యాప్తి చెందకుండా అడ్డుకట్ట వేసేందుకు అమెరికా డీమ్‌కు మద్దతునిచ్చింది. దక్షిణ వియత్నాం ఎన్నికల నిరాకరణ, దానికి అమెరికా మద్దతు రెండు వియత్నాంల మధ్య స్పర్థలకు దారితీసింది. 1961 నాటికి ఉత్తర వియత్నాం మద్దతు ఉన్న నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ (వియత్యాంగ్) దళాలు దక్షిణ వియత్నాం సరిహద్దులో గెరిల్లా యుద్ధం ప్రారంభించాయి. అంతకు ముందు వలస పాలన నిర్వహించిన ఫ్రాన్స్‌కు ఆర్థిక సాయం అందించిన అమెరికా దక్షిణ వియత్నాం దళాలకు బాసటగా నిలిచింది. ఏళ్ళ తరబడి భారీ ఆర్థిక సాయంతో బాటు చివరకు వేలాది అమెరికా సైనికులను సైతం ఉత్తర వియత్నాంతో పోరాడేందుకు దించింది. ఈలోగా దక్షిణ వియత్నాంలో ఏర్పడిన ప్రభుత్వాలు అవినీతికి ఆలవాలం కావడం, స్థిరంగా నిలదొక్కుకోలేకపోవడం వల్ల పతనం కావడం పలుమార్లు జరిగింది. చివరకు 1973 జనవరి 27న అమెరికా వియత్నాం నుంచి తన దళాలను ఉపసంహరించుకుంది. ఈ విజయ ఘనత హోచిమిన్‌దే. ఈ విజయం సాధించే నాటికి ఆయన జీవించిలేరు. 1969లోనే గుండెపోటు కారణంగా మరణించాడు. సన్నగా బక్క పలచగా ఉండే ఈ యోధుడు, ఏనాడూ ముందుండి సైన్యాలను యుద్ధరంగంలోకి నడి పించలేదు. అయితే ఈయన ప్రారంభించిన పోరాటం ఒక శక్తివంతమైన అగ్రరాజ్యాన్ని వెనుతిరిగివెళ్ళేలా చేసింది.

1928-
1967

# చే గువేరా

"నిజమైన విప్లవకారుడికి ప్రేరణకలిగించేది ప్రేమ" అని రాశాడు ఎర్నెస్టో గువేరా. ప్రపంచానికంతటికీ ఆయన 'చే'గా బాగా తెలుసు. ఆయన కరకుదనం గురించి ప్రత్యక్షంగా తెలిసినవారికి ఈ మాటలు ఆశ్చర్యం కలిగించవచ్చు. కానీ ఆయనలో అంతర్నిహితంగా ఉన్న దయాగుణం గురించి తెలిసిన వారికి ఆశ్చర్యం ఏమీ లేదు. ఈ రెండు గుణాలను మేళవించుకున్న చే గువేరా సోషలిజం కోసం చంపడం, చావడం అనే రెండింటినీ అలవరచుకున్నాడు. ఈ విప్లవకారుడి జీవన కాలం చాలా చిన్నదే అయినప్పటికీ ఆయనను విశ్వమంతా గుర్తించింది.

లెనిన్‌లాగే చే కూడా గొప్ప వంశంలో జన్మించాడు. అర్జెంటీనాలోని ఉన్నత సమాజంలో మంచి పేరున్న గొప్ప వంశంలో చే మొదటి సంతానంగా జన్మించాడు. ఆయన తల్లి సెలియా డె లా సెర్నా స్పెయిన్‌కు చెందిన ఉన్నత వంశీకురాలు. ఆయన తండ్రి ఎర్నెస్టో గువేరా లించ్ స్పెయిన్‌లోనూ, ఐర్లండ్‌లోనూ గొప్ప వంశానికి చెందినవాడు. ఆయన బాల్యం మామూలుగానే గడిచింది. ఆయన అట్టే శరీర ధారుఢ్యంగల వాడు కాదు కానీ గట్టి పట్టుదలతో క్రీడల్లో పాల్గొనడం ద్వారా ఆ లోపాన్ని సరిదిద్దుకున్నాడు. జీవిత పర్యంతం ఆయన అధిగమించలేకపోయిన రుగ్మతల్లా ఆయనను పీడించిన ఉబ్బస వ్యాధే. కానీ చివరకు అదీ ఆయన వీర గాథల్లో భాగం అయిపోయింది.

1945 నుంచి 1957 వరకూ చే బ్యూనోస్ ఏర్స్ యూనివర్శిటీలో వైద్య విద్యనభ్యసించాడు. ఆ మరుసటి సంవత్సరం దక్షిణ అమెరికా ఖండంలోని నైరుతి ప్రాంతం అంతా తెగ తిరిగాడు. ఏ రకంగా చూసినా ఆయన ఆగ్రహావేశపూరితుడైన, ధర్మాగ్రహం గల మౌలికమైన హిప్పీ. స్నానం చేయడం అంటే ఇష్టపడేవాడు కాదు. ఐహిక సుఖాలను త్యజించేవాడు. తన తల్లిదండ్రులను డబ్బు పంపించమని కోరేవాడు. మార్క్సిజం పట్ల ఆకర్షితుడు అవుతున్నకొద్దీ దక్షిణ అమెరికా ఖండంలోని పేదరికం గురించి ఉపన్యాసాలు ఇచ్చేవాడు. వైద్య పట్టా పుచ్చుకోవడం కోసం 1953లో అర్జెంటీనా తిరిగి వచ్చాడు. అదే సమయంలో గ్వాటిమలాలో జాకొబ్ అర్బెంజ్ నాయకత్వంలో వామపక్ష ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. అక్కడే చే గువేరాలో శైశవావస్థలో ఉన్న తిరుగుబాటు తత్వం మొగ్గ తొడిగింది. 1954లో అర్బెంజ్ ప్రభుత్వాన్ని కూలదోయడానికి అమెరికా గూఢచార సంస్థ (సిఐఎ) పాల్పడ్డ కుతంత్రాలను ప్రత్యక్షంగా గమనించిన 'చే' పేదల హక్కులను సాధించడం కోసం సాయుధ పోరాటం ఒక్కటే శరణ్యం అన్న నిర్ధారణకు వచ్చాడు. ఈ విశ్వాసం ఆయనను ఎక్కడకు తీసుకెళుతుందన్న విషయంలో ఒక అగంతుకుడు ముందే చెప్పిన ఈ మాటలను చే తన డైరీలో రాసుకున్నాడు. "నీవు పిడికిలి బిగించి, దవడలు బిగుసుకుపోయి మరణిస్తావు... నీ నోటి నుంచి తేనె తుట్టెనుంచి తేనె ఒలికినట్లుగా తీయనైన మాటలు జాలువారుతాయి. అవే నీ కార్యాచరణను ప్రేరేపిస్తాయి".

వామపక్ష భావాలు కలిగిన వాడిగా ఆయన స్వదేశం వదిలి వెళ్ళాల్సి వచ్చింది. ఆయనకు మెక్సికో సిటీలోని సెంట్రల్ హాస్పిటల్‌లో ఉద్యోగం దొరికింది. ఆ సమయంలో ఆ ఆస్పత్రి ప్రత్యర్థుల గూఢచార కార్యకలాపాలకు కేంద్రంగా ఉంది. 1955లో 'చే' దేశద్రోహిగా ముద్రపడ్డ ఫిడెల్ కాస్ట్రోను కలుసుకున్నాడు. క్యూబాలోని బాటిస్టా నిరంకుశ పాలనను అంతమొందించడానికి కాస్ట్రో చేసిన ప్రయత్నం విఫలమై ఆయన ప్రవాస జీవితం గడపవలసి వచ్చింది. కాస్ట్రోకు ఉజ్వలమైన విప్లవకర భవిష్యత్తు ఉంది అని గుర్తించిన చే కాస్ట్రో నేతృత్వంలోని కొద్ది మంది సైనికులతో చేరిపోయాడు. ఆ మరుసటి సంవత్సరం తన భార్యను, కూతురిని వదిలి ఆ సైనిక బృందంతోపాటు క్యూబా మీదకు దండయాత్రకు బయలుదేరాడు. రైతులను పేదరికంలో మగ్గబెట్టి, దేశాన్ని భూస్వాములకు, అమెరికన్ పెట్టబడిదారులకు, ముఠాకోర్లకు కుదువపెట్టి హవానాను కాసినోలకు, వేశ్యావాటికలకు నిలయంగా మార్చిన ప్రభుత్వాన్ని గద్దెదించాలన్న లక్ష్యంతో వీరు బయలుదేరారు.

బాటిస్టా సైనికులతో పోరాటం, అనుభవ రాహిత్యం కారణంగా దాదాపు వందమందితో కూడిన గెరిల్లా దళం కాస్తా 24 మందికి తగ్గిపోయింది. వారు సియారా మెస్త్రాకు తరలిపోక తప్పలేదు. 1957 నాటికి వారి

పరిస్థితి మెరుగుపడింది. చేను కాస్ట్రో రెండవ దళం కమాండర్‌గా నియమించేటంతగా పరిస్థితి మెరుగుపడింది. ఆ మరుసటి సంవత్సరం 'చే' నాయకత్వంలోని దళం వ్యూహాత్మకంగా ప్రాధాన్యతగల సాంటా క్లారా పట్టణాన్ని స్వాధీనం చేసుకుంది. 1959 జనవరి ఒకటిన బాటిస్టా పలాయనం చిత్తగించాడు. ఆ తర్వాత తిరుగుబాటుదారులు హవానాను విముక్తం చేశారు.

ఆ తర్వాత బాటిస్టా యుద్ధ ఖైదీల విచారణకు నాయకత్వం వహించిన తర్వాత అర్జెంటీనా యువకుడైన చేగువేరా అనుకోకుండా మంత్రి పదవిని చేపట్టవలసి వచ్చింది. వ్యవసాయ సంస్కరణల మొదటి సంస్థకు ఆధిపత్యం వహించాడు. ఆ తర్వాత నేషనల్ బాంక్‌కు అధిపతి అయ్యాడు. రోజంతా పనిచేస్తూ ఉండేవాడు. చాలా తరచుగా చెరకు నరకడానికి వెళుతుండేవాడు. నూతన సోషలిస్టు మానవుడిని నడిపించేది డబ్బుకాదు నైతికత అని నిరూపించడం కోసమే ఆయన ఈ పనులు చేసేవాడు. అదే సమయంలో ఆయన సోవియట్ యూనియన్‌తోనూ, చైనాతోనూ సన్నిహిత సంబంధాల కోసం ప్రయత్నం చేశాడు. ఈ రెండు దేశాలు అమెరికాకు ప్రత్యమ్నాయం అన్నది ఆయన భావన. 1962లో క్యూబన్లు క్యూబాలో సోవియట్ క్షిపణులను ఉంచడానికి అనుమతించినప్పుడు అమెరికా మీద ముందే దాడి చేయాలని 'చే' వాదించాడు. కానీ అలా జరగకపోవడమే మేలైంది.

ఆయన సాహసోపేతమైన స్వభావం, అశాంతితో కూడుకున్నతత్వం, ప్రజల సాయుధ పోరాటమే మార్గం అన్న సిద్ధాంతంలో ఆయన విశ్వాసం మళ్ళీ ఆయనను విప్లవ కార్యకలాపాల్లోకి ప్రేరేపించేటట్టు చేసింది. ఈ సారి ఆయన కార్యక్షేత్రం కాంగో అయింది. అక్కడ లారెంట్ కబీలా సహాయార్థం చేపట్టిన తిరుగుబాటు ఉద్యమం విఫలమైంది. ఆ మరుసటి సంవత్సరం ఆయన ప్రఖ్యాతిగాంచిన మూడు ఖండాల వామపక్ష మహాసభలో ప్రసంగించాడు. ఆ ఉప న్యాసంలో మనకు ఒక వియత్నాం చాలదు. పోరాటాలకు రెండు, మూడు అనేక వియత్నాంలు అవసరం అని చెప్పాడు. తాను ఉంటున్న అర్ధ గోళంలోనే ఇలాంటివి అనేకం ఏర్పాటు చేయాలన్నది ఆయన లక్ష్యం. ఆ లక్ష్య సాధన దిశలోనే ఆయన 1966లో బొలీవియాలో చొర బడ్డాడు. కానీ కొద్ది నెలల్లోనే ఆయన అనుచరగణం రైతులనుంచి దూరమైంది. పట్టణ ప్రాంతాల్లోని రాడికల్ భావాలుగలవారు తిరస్కరించారు. సి.ఐ.ఎతో సహా వారి శత్రువులు వీరిని వెంటాడారు. ఆకలితో అలమటిస్తూ అదుపు చేయడానికి అలవి కానంతటి ఆగ్రహావేశాలతో ఊగిపోతున్నా, గెర్రెతోక బెత్తెడు ప్రాయంగా తయారైన తన అనుచరగణాన్ని ఆయన ఎగుడు దిగుడు దారిన వినాశనం లోకి నడిపించాడు. 1967 అక్టోబర్ 8న లాహిగ్వేరా అనే చిన్న పట్టణం సమీపంలోని ఒక లోయలో పోరాడుతున్న సమయంలో 'చే' బందీ అయిపోయాడు. ఆ తెల్లవారి ఆయనను అంతమొందించారు. ఆయనను అంతం చేశామన్న రుజువు కోసం ఆయన చేతులను తెగ్గోశారు. 'చే' మృత దేహాన్ని రహస్యంగా ఖననం చేశారు.

తమ ఆరాధ్యుడి కోసం దక్షిణ అమెరికాలోని పేదలు ఆలయాలు నిర్మించారు. వర్ధమాన దేశాలవారు పోస్టర్లు రూపొందించారు. ఆయన సంస్మరణ కోసం భారీ ప్రజాప్రదర్శనలు నిర్వహించారు. అయితే పాప్ సంస్కృతి, పెట్టుబడిదారీ విధానం ఆయనకు మరో రకమైన నివాళి అర్పించింది. టి షర్టుల దగ్గర్నుంచి మోటార్ సైకిళ్లవరకు అన్నింటిని అమ్ముకోవడం కోసం వారు చేగువేరా చిత్రాలను విరివిగా వినియోగించుకున్నారు. ఇది ఆయనకు గిట్టని వ్యవహారమే. తన గురించి తన అంచనా ఏమిటో ఆయన కాంగో మీద దాడికి వెళ్ళడానికి ముందు తల్లిదండ్రులకు రాసిన లేఖలో స్పష్టంగా చెప్పుకున్నాడు. "మరోసారి రోసినేట్ (డాన్ క్విక్సోట్ గుర్రం) పక్క టెముకలు నా పాదాల కింద నలుగుతున్నట్లు అనిపిస్తోంది. కొంత మంది నన్ను సాహసికుడంటారు. నేను సాహసికుణ్నే. కానీ విభిన్నమైన సాహసికుడ్ని. తాము నమ్మిన నిజాన్ని రుజువు చేయడానికి ప్రాణాలు సైతం అర్పించే తత్వంగల సాహసికుల కోవలోని వాణ్ని".

1901-
1989

# ఎంపరర్ హిరోహిటో

హిరోహితో జపాన్ చక్రవర్తి. జపాన్ సింహాసనాన్ని అధిష్టించిన దైవాంశ సంభూతుడుగాను, సూర్యదేవత అయిన అమతెరసు ఒమికమి వంశజుడు గాను షింటో మతం ముఖ్యమతాధిపతిగాను, ఆయన పరిగణన పొందారు. ఆధునిక పాలకులెవరూ పాలించనంతగా 63 ఏళ్ళపాటు సాగిన ఆయన పాలనలో పరిమితమైన ద్వీప రాజ్యంగా ఉన్న జపాన్ ఆధునిక ప్రపంచశక్తిగా రూపాంతరం చెందింది. 1930 ప్రాంతాల్లో ఆసియాలో జపాన్ ఎదుగుదలను, రెండవ ప్రపంచ యుద్ధంలో ఓటమిని, తదనంతరం ప్రబలశక్తిగా జపాన్ పునరుస్థానం ఆయన హయాంలోనే జరిగాయి. యుద్ధంలో మిత్రరాజ్యాల కూటమి విజయం సాధించడంతో యుద్ధనేరస్థునిగా విమర్శకు గురైనా జపాన్‌ను కైవసం చేసుకున్న అమెరికా సైనికాధికారి జనరల్ డగ్లస్ మాక్ ఆర్థర్ ఆయనను శిక్షించకుండా వదిలాడు. ప్రమాదకర సైనికశక్తికి, రాజ్యాంగ బద్ధ రాచరికానికి ప్రతీకగా నిలిచిన చక్రవర్తి హిరోహితోను చరిత్రకారులు పరస్పర విరుద్ధ భావాల కలబోతగా పేర్కొంటారు. జపాన్ అనాలోచితంగా పూనుకున్న రాజ్యవిస్తరణలోను, యుద్ధసమయంలో జపాన్ సైన్యం చేసిన అకృత్యాలలోను ఆయన ఏ మేరకు భాగస్వామి అనేదానిపై వారిలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి.

హిరోహితో 1901లో జన్మించాడు. ఆ కాలంలోని ఇతర రాజవంశాల ఊహకందని భిన్నమైన వాతావరణంలో హిరాహితో జీవించాడు. జపాన్ చక్రవర్తి కానున్న యువరాజు యొషిహిటో యువరాణి సదకొ (వారే తర్వాత చక్రవర్తి తైషో, రాణిగా తైమె పేరు పొందారు)ల మొదటి కుమారుడిగా హిరోహితో జన్మించాడు. 1853లో అమెరికా వైమానిక దళాధిపతి పెర్రీ సందర్శనతో జపాన్ సంస్కృతికి ఏర్పడిన దెబ్బను తట్టుకుని ఆధునిక ప్రపంచం మంచి చెడులను జపాన్ సమాజం అలవరచుకుంటున్న కాలమది. అటువంటి వాతావరణంలో హిరోహితో పెరిగాడు. రాజప్రాసాద జీవితంలోని నియమ నిబంధనలు, లాంఛనాల మధ్య పెరుగుతూ కేవలం ఉన్నత వర్గీయులకే పరిమితమైన పీర్స్ స్కూలులో మరో అయిదుగురితో కలసి హిరోహితో విద్యాభ్యాసం సాగించాడు. 1912లో అతనిని చక్రవర్తికి వారసునిగా ప్రకటించారు. పరిపాలకుడిగా అతడు సైనిక వ్యూహరచనాశాస్త్రాల కంటె తనకు ఇష్టమైన మెరైన్ బయాలజీ పట్లే ఎక్కువ శ్రద్ధ చూపేవాడు. అంతేకాదు యుద్ధ విద్యలకు సంబంధించిన బుషిడో విద్యలో శిక్షణ పొందినప్పటికీ తన తోటి విద్యార్థులతో తరచు యుద్ధం, తన వంశానికి చెందిన దైవాంశ వంటి విషయాల ప్రాధాన్యతలపై వాగ్వివాదాలకు దిగుతుండేవాడు. అయినప్పటికీ చక్రవర్తిగా ఎవరూ తన ముందు తల ఎత్తుకుని మాట్లాడబోరని, తనను పేరుపెట్టి పిలవలేరని, తనకంటే ఆధిక్యతను ప్రదర్శించలేరన్న వాస్తవాన్ని మాత్రం గ్రహించాడు.

1921లో హిరోహితో మొట్టమొదటిసారిగా విదేశాలకు ప్రయాణమయ్యాడు. అంతకు ముందు జపాన్ రాజకుమారులెవరూ విదేశాలకు వెళ్ళలేదు. హిరోహితో ఆ సంప్రదాయానికి నీళ్ళొదిలి తన 20 ఏళ్ళ వయసులో లండన్ వెళ్ళాడు. అక్కడే మొదటిసారిగా వ్యక్తిగత స్వేచ్ఛను రుచి చూసాడు. లండన్‌లో ఆయన బ్రిటన్ రాజు అయిదో జార్జిని కలిసాడు. అయిదో జార్జి మొహమాటపడుతున్న హిరోహితో వీపుపై చరిచి ఆప్యాయంగా ఏది ఇష్టమైతే అది చేయమన్నాడు. అక్కడే బేకన్ (పంది మాంసంతో చేసిన వంటకం), గుడ్లు రుచి చూసి అత్యంత ఇష్టమైన ఆహారంగా మలుచుకున్నాడు. అప్పట్నుంచి దాదాపుగా ప్రతి రోజూ హిరోహితో ఆహారంలో అది భాగమయింది. లండన్ నుంచి పారిస్ వెళ్ళిన హిరోహితో స్వేచ్ఛగా విహరించాడు. తనెవరో తెలియకుండా జాగ్రత్తపడుతూ పారిస్‌లోని భూగర్భరైలులో ఆనందంగా ప్రయాణించాడు. ఆ ప్రయాణం ఆయనను ఎంత ఆనందపరిచిందంటే ఆ రైలు టిక్కెట్లను ఆయన ఒక మెమెంటో మాదిరిగా జీవితాంతం భద్రపరుచుకున్నాడు.

1921లో తన తండ్రి మతి భ్రమణానికి గురి కావడంతో హిరోహితో టోక్యోకు తిరిగి వచ్చి రాజు బాధ్యతలు స్వీకరించాడు. 1926లో ఆయన చక్రవర్తిత్వం స్వీకరించాడు. అక్కడి చక్రవర్తులకు చక్రవర్తిత్వంతోపాటు బిరుదును తీసుకోవడం ఆచారం. ఆ మేరకు షోవా (శాంతి, జ్ఞాన ప్రకాశమానం) అనే బిరుదు స్వీకరించాడు. అయితే అప్పటికే రష్యాతో జరిగిన రష్యాజాపనీస్ యుద్ధంలో విజయం సాధించి జబ్బలు చరుచుకుంటున్న సైనిక ప్రముఖుల ధోరణి దృష్ట్యా చూస్తే చక్రవర్తి స్వీకరించిన ఈ శాంతి స్ఫోరక బిరుదు ఒక విరుద్ధాంశంగా కనిపిస్తుంది. అంతేగాక జపాన్ అప్పటికే తన తీవ్ర రాజ్యవిస్తరణ కాంక్షకి తెరతీసే ప్రయత్నాల్లో ఉంది. ఆ రాజ్యవిస్తరణ కాంక్షకు బృహత్తర తూర్పు ఆసియా అభివృద్ధి ప్రాంతం అనే అందమైన పేరు పెట్టాలని భావించింది. హిరోహితోకు వ్యక్తిగతంగా సైనిక సంబంధ విషయాలలో ఆసక్తి లేకపోయినా చక్రవర్తికి సహజంగా లభించే అత్యున్నత సైనిక పదవి ఆయనకు లభించింది. తన పేరు మీద సైనికాధికారులు సాగించే దుష్కృత్యాల విషయంలో ఆయన వారిని తప్పు పట్టలేదు. కాగా ఆయన అనుమతితోనే ఆ అకృత్యాలు సాగాయని కొందరి అభిప్రాయం. 1931లో మంచూరియాను కొల్లగొట్టినప్పుడు చేసిన అకృత్యాలు, 1937లో నాన్ కింగ్‌లో సాగించిన అత్యాచారాలు అందుకు ఉదాహరణలు. అయితే 1936లో జరిగిన ఒక తిరుగుబాటును మాత్రం ఆయన అణచివేసి దానికి సూత్రదారులైన వారికి మరణశిక్షలు విధించాడు. ఈ చర్య ఆయనకున్న అధికారాన్ని చాటుతుంది. 1941లో అమెరికాతో యుద్ధం చేసే విషయమై నిర్ణయం తీసుకోమన్నప్పుడు మాత్రం ఆయన ఒక అపరిచిత హైకూ చదివి వినిపించాడే తప్ప నిర్ణయాన్ని తమ సైనికాధికారులకే వదలివేశాడు.

అమెరికాపై యుద్ధం ప్రకటించాలన్న నిర్ణయమే నాలుగు సంవత్సరాల అనంతరం జపాన్ పరాజయంపాలు కావడానికి కారణమయింది. అమెరికా అణ్వస్త్రాలతో సాగించిన విధ్వంసం హిరోహితోను దిగ్భ్రమకు లోను చేసింది. 1945లో చివరికంటా పోరాడాలన్నవర్గం, యుద్ధంలో పరాజయం పాలయ్యామన్న వర్గాల మధ్య ప్రతిష్టంభన ఏర్పడింది. అప్పుడు హిరోహితో కలగజేసుకుని అమెరికన్లకు లొంగిపోవాలన్న నిర్ణయాన్ని ప్రకటించాడు.

యుద్ధానంతరం సంప్రదాయరీతిలో, చిత్తశుద్ధితో హిరోహితో యుద్ధవిజేత అయిన అమెరికా సైనికాధిపతి మాక్ ఆర్థర్ ముందు వినమ్రంగా నిలిచి యుద్ధంలో తమ దేశ చర్యలకు తాను వ్యక్తిగత బాధ్యత వహిస్తున్నట్లు ప్రకటించాడు. హిరోహితో ధోరణిని బట్టి యుద్ధ నేరస్థునిగా తనకు మరణశిక్ష విధించమని కోరారన్నది విమర్శకుల భావన. అయితే మాక్ ఆర్థర్ అందుకు నిరాకరిస్తూ హిరోహితో మరణించడం కంటే జీవించి ఉండడమే మేలని పేర్కొంటూ ఆయనను వదిలేసాడు. మరణశిక్ష నుంచి తప్పించుకున్న హిరొహితో అమెరికా ఒత్తిడికి లొంగి తన దైవత్వ హోదాకు స్వస్తిపలికాడు. యుద్ధంలో విజయం సాధించిన దేశాల ఆదేశాల మేరకు రూపొందించిన రాజ్యాంగం మేరకు పాలకునిగా కొనసాగేందుకు అంగీకరించాడు.

చాలా ప్రకటనలకు కేవలం 'అలాగా' అని పొడిపొడిగా మాత్రమే స్పందించే హిరొహితో తదనంతర కాలంలో ఎక్కువగా ప్రజల ముంగిటకు వెళ్ళడం, తన ఫోటోలు తీసుకోవడానికి, తమ కుటుంబానికి సంబంధించిన విషయాల ప్రచురణకు అనుమతించసాగాడు. అయితే ఒక్కోసారి ప్రజాజీవనానికి దూరంగా ఉంటూ తనకిష్టమైన మెరైన్ బయాలజీకి సంబంధించి ఉపయుక్తమైన వ్యాసాలు రాసేవాడు. హిరాహితో మరణించినప్పుడు కూడా ఆయన విషయంలో వచ్చిన వ్యాఖ్యలు ఆయన పాలనా కాలంలో వినవచ్చిన అనుకూల, ప్రతికూల వ్యాఖ్యలనే పోలి ఉన్నాయి.

1880-
1968

# హెలెన్ కెల్లర్

మనిషి ఒక కన్ను లేదా ఒక చెయ్యి లేదా ఒక కాలు కోల్పోతేనే జీవితం వ్యర్థమనిపిస్తుంది. అంగవైకల్యాన్ని జయించడానికి అపూర్వమైన మానసిక ధైర్యం కావాలి. వికలాంగులు అశక్తులు కారనీ, వారు వేరే రకమైన అద్వితీయశక్తితో అందరిలాగా, అందరికంటే భిన్నంగా ఆలోచించి బతుకు పోరాటంలో ముందుంటారని నిరూపించిన వ్యక్తి హెలెన్ కెల్లర్. పుట్టుకతోనే అంధత్వం, బధిరత్వం బాధించినా వాటిని స్వయం శక్తితో అధిగమించి ప్రపంచంలోని వికలాంగులందరికీ స్ఫూర్తి ప్రదాతగా, ఆదర్శప్రాయురాలిగా నిలిచారు.

హెలెన్ కెల్లర్ తాను పుట్టిన తేదీలను రెండు రకాలుగా ఉదహరించేవారు. తను భౌతికంగా 1880 జూన్ 27వ తేదీన పుట్టినట్లు, అయితే తనకున్న వైకల్యాలన్నింటినీ అధిగమించి మార్చి 3వ తేదీన 1887వ సంవత్సరంలో మరోసారి పుట్టినట్లు చెప్పుకొంది. తన రెండో జన్మకు కారకులైన అన్నే సల్లివాన్‌కు తాను జీవితాంతం రుణపడి ఉంటానని ప్రకటించింది. హెలెన్ కెల్లర్ అంగవైకల్యాన్ని జయించడం వెనుక అన్నే సల్లివాన్ కఠోరశ్రమ ఉంది. పాక్షికంగా అంధురాలైన సల్లివాన్ కెల్లర్ జీవితంలో నవవసంతం చిగురింపచేసింది. తన కాళ్లపై తను నిలబడే స్థాయికి చేరుకున్న తరువాత హెలెన్ కెల్లర్ తన జీవితం గురించీ, విధి తనపట్ల చూపిన వివక్షను తానెలా ఎదుర్కొందీ, అందులో సల్లివాన్ పాత్ర గురించి పూర్తిగా వివరిస్తూ ఆత్మకథ రాసింది. 1903లో విడుదలైన 'ద స్టోరీ ఆఫ్ మై లైఫ్' ఆమె తన జీవిత విశేషాలను పూసగుచ్చినట్లు వివరించింది. 19 నెలల వయస్సులోనే చిన్నారి హెలెన్‌కు ఒక వింత వ్యాధి సోకింది. విపరీతమైన జ్వరం సోకిన తరువాత ఆ మగతలోనే ఆ బాలిక చూపునూ వినికిడి శక్తినీ కోల్పోయింది. రెండేళ్ల లోపే వినికిడి శక్తి కోల్పోయిన పిల్లలకు ప్రత్యేక శిక్షణ ఇప్పించకపోతే అది వారి మాటతీరుపై ప్రభావం చూపెడుతుందన్న వైద్యుల సూచనతో హెలెన్ తల్లిదండ్రులు ఆమెకు ప్రత్యేక శిక్షణ ఇప్పించారు. అయితే ప్రాణాంతకమైన జ్వరం వల్ల ఆమె నోరు పూర్తిగా తిరగడం, నాలుక స్వేచ్ఛగా కదలడం లేదు. దీంతో రెండేళ్ళ ప్రాయంలో హెలెన్ కెల్లర్‌ను పరిశీలించిన వైద్యులు ఆమె మామూలుగా మాట్లాడలేదని, కఠినమైన శిక్షణ ఇస్తే కొద్దికొద్దిగా మాట్లాడగలుగుతుందని తేల్చారు. వైద్యుల మాటలతో పూర్తిగా డీలాపడినప్పటికీ హెలెన్ తనకు పట్టుదల ఉందని పదే పదే సంజ్ఞలు చేస్తూ మాట్లాడేందుకు ప్రయత్నించేది. సాంకేతికంగా అంతగా అభివృద్ధి చెందని ఆ రోజుల్లో తమ చిన్నారి నోట కనీసం మమ్మీ, డాడీ అన్న పిలుపైనా వినాలనీ ఆ తల్లిదండ్రులు తహతహలాడిపోయారు.

అదే సమయంలో డాక్టర్ అలెగ్జాండర్ గ్రాహంబెల్ టెలిఫోన్ కనిపెట్టాడు. సుదూర ప్రాంతాల్లోని వారు ఒకరితో ఒకరు మాట్లాడుకునే వీలు టెలిఫోన్ కల్పిస్తుంది. ఈ వార్త వినగానే హెలెన్ కెల్లర్ తల్లిదండ్రులు సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయ్యారు. ఎక్కడో దూరంగా ఉన్నవారు ఈ పరికరంలో మాట్లాడితే వినిపించగా లేనిది తమ ఎదుటే ఉన్న కూతురు మాట్లాడితే తమకు అర్థమయ్యేట్లు విన్పించదా అని వారు గంపెడాశలు పెట్టుకున్నారు. 1886లో హెలెన్ తండ్రి తన ఆరేళ్ళ చిన్నారి కూతురిని వాషింగ్టన్ డి.సి.లో ఉన్న అలెగ్జాండర్ గ్రాహంబెల్ వద్దకు తీసుకెళ్ళాడు. గ్రాహంబెల్ కూడా చెవిటివాడే. తన కూతురుకున్న లోపాన్ని ఆయనకు వివరించి టెలిఫోన్ ద్వారానైనా తన పాప మాట్లాడేటట్లు చేయమని కోరారు. గ్రాహంబెల్ కూడా చెవిటివారు మరింత మెరుగ్గా వినడానికి ఓ పరికరం కనిపెట్టబోయి ఈ టెలిఫోన్‌ను ఆవిష్కరిస్తాడు. అయితే ఎవరైనా స్పష్టంగా మాట్లాడగలిగితేనే టెలిఫోన్‌ద్వారా శబ్ధతరంగాలు అవతలి

వ్యక్తికి విన్పిస్తుందన్న సూత్రం గ్రాహంబెల్ హెలెన్ తండ్రికి వివరిస్తాడు. శబ్ద తరంగాలను విద్యుత్ తరంగాలుగా మార్చి, మళ్లీ విద్యుత్ తరంగాలను శబ్ద తరంగాలుగా మార్చి రిసీవర్, మౌత్‌పీస్‌ల ద్వారా వినిపించే టెలిఫోన్‌ను గ్రాహంబెల్ హెలన్ కెల్లర్‌పైకూడా పరీక్షిస్తాడు. అయితే దీనితో పెద్దగా ప్రయోజనం లేదని భావించిన గ్రాహంబెల్ తానే చొరవ తీసుకుని హెలెన్ కెల్లర్‌ను బోస్టన్‌లోని పెర్కిన్స్ ఇనిస్టిట్యూట్‌కు తీసుకెళ్ళాల్సిందిగా ఉత్తరం రాసిస్తాడు. గ్రాహంబెల్ కోరిక మేరకు పెర్కిన్స్ సంస్థ హెలెన్ కెల్లర్ శిక్షణకు ఒకరిని పంపిస్తామని తండ్రికి హామీ ఇస్తారు.

మరుసటిరోజే పెర్కిన్స్ శిక్షణాలయం నుంచి పద్దెనిమిదేళ్ల ఒక అమ్మాయి హెలెన్ కెల్లర్ ఇంటికి చేరింది. చిన్నారి హెలెన్‌కు శిక్షణ ఇచ్చేందుకు తాను వచ్చానని చెప్పుకొన్న అన్నె సల్లివాన్‌ను హెలెన్ మొదట్లో ద్వేషించింది. ఆమెను దగ్గరకే రానివ్వలేదు. అయితే సల్లివాన్ ఎంతో ఓపికతో నేర్పుతో హెలెన్‌కు ఒక స్నేహితురాలిగా మారింది. మొదట్లో మూగ, చెవిటి, అంధురాలైన హెలెన్‌కు అక్షరాలు నేర్పడానికి సల్లివాన్ నానా కష్టాలు పడింది. అయితే ఏడేళ్ల హెలెన్ ఎంతో పట్టుదలతో తన టీచర్ అయిన సల్లివాన్ నుంచి ఎన్నో విషయాలు నేర్చుకొంది. మూడేళ్ళలోనే అక్షరాలు, పదాలు, గణితం, పరిసరాల విజ్ఞానాన్ని నేర్చుకొని తనకోసం తయారైన టైప్ రైటర్‌పై వ్యాసాలు కూడా రాయగలిగిన స్థాయికి హెలెన్ ఎదిగింది. ఎదుటి వ్యక్తి మాట్లాడుతున్నప్పుడు నోరు, పెదాలు, నాలుక కదిలే తీరు తెన్నులను చేయిపెట్టి పరిశీలించే హెలెన్ త్వరలోనే వ్యక్తులతో సంభాషించగల స్థాయికి ఎదిగింది.

పదకొండేళ్ల ప్రాయంలో సల్లివాన్ శిక్షణలో రాటుదేలిన హెలెన్ సంఘసేవకు నడుం బిగించింది. అమెరికా, యూరప్, ఆసియాలోని వికలాంగులైన పిల్లలకోసం చందాలు, ఉపకరణాలు పోగుచేసే ఒక బృహత్తర కార్యక్రమాన్ని ఆమె తన టీచర్ సాయంతో తలకెత్తుకుంది. హెలెన్ 16 ఏళ్లు వచ్చేసరికే ఇంగ్లీషు, ఫ్రెంచ్, జర్మన్, లాటిన్, గ్రీకు భాషల్లో విశేష పరిజ్ఞానం సంపాదించింది. హెలెన్ కెల్లర్ సాధించిన ఈ గొప్ప కార్యం చూసి ప్రపంచం అబ్బురపడింది. 20 ఏళ్లు వచ్చేసరికి హెలెన్-సల్లివాన్‌ల పేర్లు చాలా దేశాల్లో మారుమోగాయి. ప్రపంచంలోని వికలాంగులందరికీ హెలెన్ ఒక స్ఫూర్తిప్రదాతగా మారింది. వికలాంగులు, బీద బిక్కీ ప్రజలు, అణగారిన వర్గాల జీవితాల గురించి, వారి అభ్యున్నతి గురించి సాయం చేయాల్సిందిగా అభ్యర్థిస్తూ సల్లివాన్‌తోపాటు హెలెన్ దేశదేశాలూ తిరిగింది. 1904లో రాడ్‌క్లిఫ్ కాలేజి నుంచి హెలెన్ ఆనర్స్ డిగ్రీ పొందింది. వికలాంగులకు సమాన న్యాయంకోసం కృషి చేసేందుకు మరింత పట్టుదలతో శ్రమిస్తానని ప్రకటించింది. అమెరికా పౌర హక్కుల కమిటీలో తన పేరు నమోదు చేసుకొని నల్లవారు, మహిళలు, పిల్లల హక్కులకోసం జరిగిన ఉద్యమాల్లో హెలెన్ పాలుపంచుకొంది.

హెలెన్ కెల్లర్‌కు స్ఫూర్తి ప్రదాత, ఆమె అమితంగా ఆరాధించిన టీచర్ అన్నె సల్లివాన్ 1936లో చనిపోవడం హెలెన్‌కు ఆశనిపాతమైంది. దుఃఖాన్ని దిగమింగుకొని పోలి థాంప్సన్‌ను తన శిక్షకురాలిగా నియమించుకొని ప్రజా ఉద్యమాల్లో హెలెన్ పాలుపంచుకొంది. మనిషికి దృష్టి, వినికిడి శక్తి, మాట్లాడే అవకాశం దేవుడు కల్పించిన వరాలని సగర్వంగా చెప్పిన హెలెన్ వాటిని సద్వినియోగం చేయాల్సిందిగా ప్రపంచానికి చాటి చెప్పింది. తనకే గనుక చూపు వస్తే, తనకే గనుక వినే శక్తి వస్తే, తనేం చేయదల్చుకున్నదో వివరిస్తూ కెల్లర్ రాసిన "త్రీడేస్ టు సీ" వ్యాసం ఎవరినైనా కంట తడిపెట్టిస్తుంది. అంగవైకల్యం శరీరానికే కాని మనసుకు ఉండదని నిరూపించిన మహావ్యక్తి హెలెన్ కెల్లర్. ఆమె పేరు ఇప్పటికీ, ఎప్పటికీ ఎన్నో దేశాల్లో వికలాంగులకు స్ఫూర్తి కలిగిస్తూనే ఉంటుంది.

1928-

1916-2004

# ఫ్రాన్సిస్ క్రిక్

# జేమ్స్ వాట్సన్

ఇద్దరు శాస్త్రవేత్తలు. ఒకరు పేద కుటుంబంలో పుట్టి కష్టపడి చదువుకుని పైకివచ్చిన బాలమేధావి. మరొకరు కనిపెట్టడానికి తనకు ముందు పుట్టిన శాస్త్రవేత్తలు ఏమీ మిగల్చలేదే అని బాల్యంలోనే బాధపడ్డ ప్రతిభాశాలి. ఆ శాస్త్రవేత్తలకు బాల్యంలోనే చదువు పట్ల ఆసక్తి కలిగింది. తల్లిదండ్రులూ ప్రోత్సహించారు. చదువునే పునాదిగా చేసుకుని ఏదైనా ఆవిష్కరించాలనే ప్రయత్నంలో పడ్డారు. ఇద్దరివి వేరువేరు నేపథ్యాలు. ఒకరు అమెరికాలో పుట్టి పెరిగితే మరొకరు ఇంగ్లాండులో జన్మించారు. నేపథ్యాలు వేరైనా వారు కలిసి పరిశోధన చేయడానికి అది ఆటంకం కాలేదు. జీన్ నిర్మాణం ఎలా ఉంటుందో అప్పటికి శాస్త్ర ప్రపంచానికి తెలియదు. దానిని కనిపెట్టాలని కలిసి ముందుకు అడుగు వేశారు. మధ్యలో వారి పరిశోధనలకు ఆటంకం కలిగినా ఎట్టకేలకు విజయం సాధించారు. సృష్టి రహస్యాన్ని ఛేదించారు. డీఎన్ఏ రూపాన్ని ఆవిష్కరించారు. అది సర్పిలాకారంలో ఉంటుందని ప్రపంచానికి తెలియజేశారు. బయో టెక్నాలజీకి ఆద్యులయ్యారు. వారే ఫ్రాన్సిస్ క్రిక్, జేమ్స్ వాట్సన్.

అమెరికాలోని షికాగో దక్షిణ ప్రాంతంలో జేమ్స్ వాట్సన్ ఓ పేద కుటుంబంలో జన్మించాడు. అయితే తల్లిదండ్రులకు చదువు పట్ల ఉన్న ప్రేమ అతడిలో బాగా చదువుకోవాలనే తపనకు బీజం వేసింది. బాల మేధావైన వాట్సన్ చిన్నతనంలోనే రేడియో కార్యక్రమాల్లో ప్యానెలిస్టుగా వ్యవహరించేవాడు. షికాగో యూనివర్సిటీ హైస్కూల్లో 15వ ఏట పాఠశాల విద్యను పూర్తి చేసుకున్నాడు. 1947లో 19వ ఏట సైన్సులో డిగ్రీ పూర్తిచేశాడు. తర్వాత ఇండియానా యూనివర్సిటీలో జెనెటిక్స్ చదవడానికి వెళ్లాడు.

బ్రిటన్‌లోని నార్తాంప్టన్ ప్రాంతంలో ఓ మధ్యతరగతి కుటుంబంలో ఫ్రాన్సిస్ క్రిక్ జన్మించాడు. ఫ్రాన్సిస్ తండ్రికి చెప్పులు తయారు చేసే పరిశ్రమ ఉండేది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఆయన ఫ్యాక్టరీని మూసివేశాడు. బాల్యం నుంచే క్రిక్‌కు సైన్సు పట్ల అభిరుచి ఉండేది. తల్లిదండ్రులు చదువుకోమని క్రిక్‌ను ప్రోత్సహించేవాళ్లు. బాల్యంలో ఒకసారి తల్లితో కిర్క్ 'అయ్యో! అన్నింటిని కనిపెట్టేశారే! నేను కనిపెట్టడానికి ఏమీ మిగల్చలేదే' అని వాపోయాడు. సైన్సు రంగంలో ఛేదించాల్సిన రహస్యాలు ఇంకా చాలా ఉన్నాయని తల్లి అతడిని ఓదార్చింది. హిల్ బాలుర స్కూల్లో క్రిక్ చదువుకున్నాడు. చదువులో కనబర్చిన ప్రతిభకు అతడికి స్కాలర్‌షిప్ లభించింది. స్కూల్లో ఉన్నప్పుడే కిర్క్ సైన్సు పట్ల ఆసక్తి చూపేవాడు.

లండన్ యూనివర్సిటీ కాలేజి నుంచి 1937లో క్రిక్ భౌతికశాస్త్రంలో డిగ్రీ పొందాడు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో బ్రిటన్ సైన్యం కోసం పేలుడు పదార్థాల నిపుణుడిగా పనిచేశాడు. తర్వాత మాలిక్యులర్ బయాలజీ చదవడానికి వెళ్లాడు. ప్రాణం, చేతనత్వానికి సంబంధించిన భౌతిక రహస్యాలను ఛేదించేందుకు జీవకణాలను పరిశోధించేందుకు పూనుకున్నాడు. ఆ దిశగా తన ప్రయోగాలను మొదలుపెట్టాడు.

1951లో వాట్సన్ సైన్సు సమావేశానికి హాజరయ్యాడు. జీవ కణాల్లో జీన్స్ ఉన్నాయని కనిపెట్టినా వాటి నిర్మాణం ఎలా ఉంటుందో శాస్త్ర ప్రపంచానికి అంతకుముందు తెలియదు. సమావేశంలో జీన్స్‌ను ఘనీభవింపజేయవచ్చని (క్రిస్టల్స్‌గా గడ్డకట్టించవచ్చని) కాబట్టి వాటికి నిర్దిష్టమైన నిర్మాణం ఉండితీరాలని వాట్సన్ తెలుసుకున్నాడు. దీనితో జీన్స్ నిర్మాణాన్ని కనిపెట్టాలని అతడు నిశ్చయించుకున్నాడు. తన పరిశోధనల కోసం ప్రసిద్ధ మానవ విజ్ఞాన కేంద్రం, ఎన్నో పరిశోధనల్లో కాకతాళీయ విజయాలకు నెలవైన కేంబ్రిడ్జి యూనివర్సిటీలోని కావెండిష్ ప్రయోగశాలను వేదికగా ఎంచుకున్నాడు. ఈ వైద్య పరిశోధనా సంస్థలో పరిశోధన చేయడానికి దరఖాస్తు పెట్టుకున్నాడు. అప్పటికే అక్కడ క్రిక్ 'చావుకు, బ్రతుక్కు మధ్య ఉన్న అంతుపట్టని తేడా'ను కనుగొనేందుకు పరిశోధనల్లో తలమునకలై ఉన్నాడు.

క్రిక్, వాట్సన్‌లు జట్టు కట్టారు. తమ ఆలోచనలను, అభిప్రాయాలను పంచుకున్నారు. సృష్టి

రహస్యాన్ని ఛేదించడానికి లక్ష్యం వైపు కలిసి సాగాలని నిర్ణయించుకున్నారు. పరిశోధనల్లో 'ఒంటరి అన్వేషకులు తమ అభిప్రాయాలకు కట్టుబడిఉంటారని' ఒక తలకాయ కంటే రెండు బుర్రలు మేలని క్రిక్ గాఢంగా విశ్వసించాడు. తామిద్దరం ఒకరినొకరు ప్రోత్సహించుకుంటూ సమస్యను వివిధ కోణాల్లో పరిశీలించవచ్చని తలచాడు. జీన్స్‌లో డీఎన్ఎ ఉంటుందని తెలుసుకున్నారు. తమ ముందు ఉన్న అతి పెద్ద సవాలు ఐన దాని నిర్మాణాన్ని కనుగొంటే అతి చిన్న కణంలో ఇమిడిపోయి ఉన్న సృష్టి కోడ్‌ను ఆవిష్కరించినట్లేనని గ్రహించారు. డీఎన్ఎ నిర్మాణం సరళంగా, అందంగా ఉంటుందని వాట్సన్ అంచనా వేశాడు. డీఎన్ఎ చక్కెర, భాస్వరం, నత్రజనుల సమ్మేళనమని గ్రహించారు. అయితే వీటన్నిటిని ఏయే మోతాదుల్లో ఎలా పేరిస్తే డీఎన్ఎ ఆకారం వస్తుందో వాళ్లకు అంతుబట్టలేదు. ఎక్స్‌రే ఫొటోల ద్వారా డీఎన్ఎ సర్పిలాకారంలో చుట్టగా ఉంటుందని (ఓ సిలెండర్ చుట్టు ఇనప తీగ చుట్టినట్లు చుట్ట ఆకారంలో) అర్థమైంది. అయితే అవి ఒకటా, రెండా, వెయ్యా? ఎన్ని చుట్టలో వాళ్లకు అర్థం కాలేదు. మరోపక్క ఇతర పరిశోధకులు కూడా డీఎన్ఎ నిర్మాణంపై పరిశోధనలు చేస్తుండడంతో వారు తమ పరిశోధనలను వేగవంతం చేశారు. తమ దగ్గరున్న సమాచారాన్నంతటిని క్రోడీకరించి త్రయ సర్పిలాకార నమూనాను తయారుచేశారు. అది తప్పని తేలడంతో అప్పటికే వాళ్ల మీద గుర్రుగా ఉన్న వాళ్ల పర్యవేక్షకుడు క్రిక్, వాట్సన్‌లను ఆ ప్రాజెక్టుకు దూరం చేశాడు. 1952లో లినస్ పాలింగ్ కూడా త్రయ సర్పిలాకార నమూనాను తయారు చేశాడు. అయితే అది కూడా తప్పని తేలింది. అయితే లినస్ తమను అధిగమిస్తాడేమోనన్న భయంతో క్రిక్, వాట్సన్‌లు తిరిగి కార్యరంగంలోకి దూకారు.

క్రిక్, వాట్సన్‌లు ఊహలపై ఆధారపడి ఎన్నో డీఎన్ఎ నమూనాలను రూపొందించారు. 'మెలితిప్పిన నిచ్చెన'గా ఇప్పుడు వాడుకలో ఉన్న డీఎన్ఎ నిర్మాణాన్ని తల్లకిందులుగా ఊహించి వారు ఒక నమూనాను తయారుచేశారు. తాము సత్యానికి దగ్గరలో ఉన్నామని గ్రహించారు. డీఎన్ఎ ఏక సర్పిలాకారంలో ఉంటుందని, దాని నుంచి న్యూక్లియోటైడ్స్ వెలుపలకు స్రవిస్తూ ఉంటాయని వాట్సన్ భావించాడు. వెన్నెముక బయటకు ఉండేటట్లు ఒక నమూనాను రూపొందించమని క్రిక్, వాట్సన్‌కు సూచించాడు. అది మరీ సరళంగా ఉంటుందని వాట్సన్ భావిస్తే చేసి చూడవెందుకని క్రిక్ అతడిని గద్దించాడు. 1953 మార్చి నెలలో ఒక రోజు క్రిక్ సలహా మేరకు వాట్సన్ ఏక సర్పిలాకార నమూనాను రూపొందించడం మొదలుపెట్టాడు. డీఎన్ఎ సర్పిలాకార రూపాన్ని సంతరించుకోవడం అతడి కంటపడింది. 'అన్ని కణాలలోకి అద్భుత కణాన్ని' ఆవిష్కరించడం జరిగింది. బయో టెక్నాలజీకి బీజం పడింది. తామిద్దరం కలిసి రూపొందించిన ఆ డీఎన్ఎ రూపం వాట్సన్‌ను ఎంతగానో ఆకట్టుకుంది. డీఎన్ఎ నిర్మాణాన్ని 'ఇది ఎంతో అందంగా ఉంది. చూశావా!' అని ఒకసారి ఉపన్యాసంలో వాట్సన్ చెప్పడం జరిగింది. డీఎన్ఎ ఆవిష్కరణకు తాము చేసిన ప్రయత్నాలను నిజాయితీగా వివరిస్తూ వాట్సన్ 1968లో 'డబుల్ హెలిక్స్' అనే పుస్తకాన్ని రాశాడు. ఈ పుస్తకంలో ఆయన తమను విమర్శించడం సాటి శాస్త్రవేత్తలకు కోపాన్ని తెప్పించింది. క్రిక్ 1981లో 'లైఫ్ ఇట్‌సెల్ఫ్' అనే పుస్తకాన్ని రాశాడు. ఈ పుస్తకంలో ఆయన తన వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించాడు.

కాలిఫోర్నియాలోని సాల్క్ సంస్థలో క్రిక్ సీనియర్ సైంటిస్టుగా పనిచేశాడు. అయితే అనారోగ్యం కారణంగా పదవీ విరమణ చేశాడు. వైద్య, జంతు దేహధర్మ శాస్త్రాలలో కృషి చేసినందుకు క్రిక్, వాట్సన్‌లకు ఎం.హెచ్.ఎఫ్. విల్కిన్స్‌తో కలిపి సంయుక్తంగా నోబెల్ బహుమతి ఇచ్చారు. దీనిపై క్రిక్ స్పందిస్తూ నోబెల్ బహుమతిని లాటరీగా అభివర్ణించాడు. సైన్సు రంగంలో సాధించిన విజయాలకు అది గీటురాయి కాదని వ్యాఖ్యానించాడు. వాట్సన్ హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా చేరాడు. తర్వాత అతడు మానవ డీఎన్ఎ పూర్తి రహస్యాలను ఛేదించేందుకు మానవ జీనోమ్ ప్రాజెక్టును చేపట్టాడు. కోల్డ్ స్ప్రింగ్ హార్బర్ ల్యాబరేటరిని స్థాపించాడు. మాలిక్యులర్ బయాలజీ శాస్త్రాన్ని అభివృద్ధిపరచేందుకు పూనుకున్నాడు. 40 ఏళ్ల పరిశోధనల అనంతరం అలసిపోయానని చెప్పిన వాట్సన్ 'ప్రసిద్ధులవడం, కాకపోవడం కన్నా బావుంటుందని' వ్యాఖ్యానించాడు.

1943-

# లెక్ వాలేసా

ఆధునిక ప్రపంచంలో ప్రజాస్వామ్య విలువలు తప్ప మరే పద్ధతులూ మనలేవని నిరూపితమవుతూనే వుంది. తమ ప్రమేయం లేకుండా పాలన సాధ్యం కాదని ప్రజలు పదే పదే రుజువు చేస్తున్నారు. ప్రపంచ వ్యాప్తంగా ప్రజాస్వామ్యం కోసం పోరాటాలు జరుగుతూనే వున్నాయి. పోలాండ్ దేశంలో కమ్యూనిస్టులు కూలిపోవడానికి ఒక సామాన్య కార్మికుడి కృషే కారణమంటే ఆశ్చర్యం కలుగక మానదు. సైనికులు, రహస్య పోలీసులు, ఇన్‌ఫార్మర్లు, పార్టీ కార్యకర్తలు అందరూ కూడా షిప్‌యార్డ్‌లో ఒక ఎలక్ట్రీషియన్ చేసిన పోరాటం ముందు తలవాల్చ వలసి వచ్చింది. ఒక సామాన్య కార్మికుడిగా తన జీవితాన్ని ప్రారంభించిన లెక్ వాలెసా పాలక పార్టీ అయిన పోలిష్ కమ్యూనిస్ట్ పార్టీకి వ్యతిరేకంగా తన పోరాటాన్ని సాగించారు. అంతిమ విజయాన్ని సాధించిన ఆయన నూతన పోలెండ్ అధ్యక్ష స్థానానికి ఎదిగారు. తన పోరాటం ద్వారా కేవలం దేశ ప్రజలకే కాకుండా, ప్రపంచ వ్యాప్తంగా వున్న ప్రజాస్వామ్య వాదులందరికీ ఆయన ప్రజాస్వామ్య విలువల పై ఆశాభావాన్ని కల్పించారు.

వాలెసా పొపోవో గ్రామంలో ఒక వడ్రంగి ఇంట జన్మించాడు. వాలెసా పుట్టే సమయంలో అతడి తండ్రి నాజీల చేతికి బందీగా చిక్కాడు. యుద్ధానంతరం అతడిని నాజీలు విడుదల చేసినప్పటికీ,ఆయన అనారోగ్యం పాలై తిరిగి వచ్చిన రెండు సంవత్సరాలలోనే మరణించాడు. అనంతరం వాలెసా తల్లి తన భర్త సోదరుడిని వివాహం చేసుకుంది. ఆమె ఈ చర్య ఆమె నలుగురి పిల్లలకు, వృద్ధ వాలెసాలకు నచ్చలేదు. ప్రాంతీయ వొకేషనల్ పాఠశాలలో వాలెసా మంచి తెలివైన విద్యార్థిగా గుర్తింపు పొందినా, మరోవైపు అతడు సమస్యలు సృష్టిస్తాడనే పేరు కూడా పొందాడు. 1961లో వాలెసా అగ్రికల్చరల్ మెకనైజేషన్ డివిజన్‌లో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి, రెండు సంవత్సరాల పాటు ప్రభుత్వ టెక్నీషియన్‌గా పనిచేశాడు. అనంతరం అతడు చేరిన రెండు సంవత్సరాలలో సైన్యంలో కార్పొరల్ అయ్యాడు. అనంతరం 1967లో నగర జీవితాన్ని చవి చూసేందుకు బాల్టిక్ ప్రాంతాన్ని వదిలిపెట్టాడు. ఓడరేవు పట్టణమైన డినియాలో స్థిరపడాలన్న ఉద్దేశాన్ని వదిలి అతడు వేలాది మంది కార్మికులున్న లెనిన్ ఓడరేవు గల డాన్స్క్ పట్టణంలో స్థిరపడ్డాడు. అక్కడ అతడు నావికా దళ ఎలక్ట్రీషియన్ అయ్యాడు.

తమకు మరింత స్వేచ్ఛ కావాలని డిమాండ్ చేస్తూ దేశవ్యాప్తంగా విద్యార్థులు, కార్మికులు 1968లో నిరసనోద్యమం చేపట్టారు. విద్యార్థులు మేధో స్వేచ్ఛ కోసం ఉద్యమిస్తే, కార్మికులు సమానత్వం, వారి పని పరిస్థితులు, ఆహారం, జీతం వంటి సమస్యల పరిష్కారం కోసం ఉద్యమించారు. ప్రభుత్వం విభజించి పాలించు అన్న రీతిలో విద్యార్థులకు వ్యతిరేకంగా కార్మికులను, కార్మికులకు వ్యతిరేకంగా విద్యార్థులను రెచ్చగొట్టే ప్రయత్నం చేసింది. దీనిని పసిగట్టిన వాలెసా ఆ విధానాన్నే తిరస్కరించాడు. 1970 నాటికి పరిస్థితి మరీ క్షీణించి, కార్మికులు సమ్మెకు పిలుపిచ్చారు. సమ్మె కమిటీలో సభ్యునిగా వున్న వాలెసా, కార్మికులు పోలీసుల పై దాడి చేయడాన్ని అడ్డుకోలేకపోయాడు. అయితే, ఆ అనుభవం నుంచి అతడు సంక్షోభ సమయంలో ఉన్నత స్థాయిలో వున్న అధికారులు ఎలా ఆలోచిస్తారు అనే విషయాన్ని నేర్చుకున్నాడు.

ఆ తరువాత కొన్ని సంవత్సరాలు ప్రభుత్వం, కార్మికులు ఆర్థిక విధానాల పై మల్లగుల్లాలు పడగా, దాని నుంచి ఉద్యమ నిర్వహణను వాలెసా నేర్చుకున్నాడు. అతడు 1976లో తొలిసారి బహిరంగ సభలో ప్రసంగిస్తూ ఒక స్వేచ్ఛాయుత ట్రేడ్ యూనియన్ ఏర్పాటుకు పిలుపిచ్చాడు. అతడిని పనిలో నుంచి తొలగించినా అనేక మంది తాత్కాలిక కార్మిక గ్రూపులతో సంబంధాలు పెట్టుకుని, మరొక ఉద్యోగాన్ని సాధించాడు. వాలెసా కార్యకలాపాల కారణంగా అతడిని మరొకసారి తొలగించారు. దీనితో 1979లో స్వతంత్ర ట్రేడ్ యూనియన్లు, సమ్మె చేసే హక్కు

వుండాలని డిమాండ్ చేస్తూ ఒక చార్టర్ పై సంతకాలు చేశారు. అతడిని పోలీసులు పదే పదే అరెస్టు చేసే వారు. 1980లో సమ్మె చేస్తున్న వారు లెనిన్ ఓడరేవును దిగ్బంధనం చేశారు. అప్పుడే వాలెసా కార్మిక నాయకుడు అయ్యాడు. కమ్యూనిస్టులను వ్యతిరేకించేవారికి అధికార ప్రతినిధి అయ్యాడు. వాక్‌స్వాతంత్ర్యం, సమ్మె చేసే హక్కుతో సహా 21 డిమాండ్లతో యూనియన్ ప్రతినిధిగా ప్రభుత్వంతో చర్చలు జరిపాడు. అనంతర కాలంలో సాలిడారిటీ అన్న గొడుగు కింద యూనియన్ మొత్తం పోలిష్ జాతికి గొంతుకగా మారింది. అటు మేధావులు, ఇటు కమ్యూనిస్టు వ్యతిరేకులు చేరడంతో అది ప్రజా ఉద్యమం అయింది. సోవియట్ సైన్యం దాడి చేస్తోందన్న వదంతుల మధ్య వాలెసా ఒప్పందాలలో అంగీకరించిన అంశాలను అమలు చేయాలని వత్తిడి పెంచడంతో, పోలిష్ ప్రధాని వాజ్‌సీక్ జరుజెల్‌స్కీ దేశంలో సైనిక పాలనను ప్రకటించారు.

ఆ తరువాత మూడు సంవత్సరాలు కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా వాలెసా అహింసాయుత రాజకీయ గెరిల్లా ప్రచారాన్ని నిర్వహించారు. ఇదే ఆయన అరెస్టుకు, నిర్బంధానికి దారి తీసింది. పోలెండ్‌లో ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పేందుకు శాంతియుతంగా, ఎంతో నిబద్ధతతో చేస్తున్న కృషికి గుర్తింపుగా 1983లో అతడికి నోబెల్ శాంతి బహుమతిని ప్రకటించారు. 1987నాటికి ప్రభుత్వం కుంటినడక నడవడం ప్రారంభించింది. అది ప్రవేశపెట్టిన సంస్కరణల పై రెఫరండంను పోలెండ్‌వాసులు బహిష్కరించారు. సంక్షోభం, అశాంతి పెరగడంతో అది వాటికి లొంగి ఇప్పుడు పార్టీగా మారిన సాలిడారిటీని ప్రభుత్వం ఏర్పాటు చేయడంలో సాయపడవలసిందిగా ఆహ్వానించింది. 1990లో వాలెసా అధ్యక్షుడిగా ఎన్నిక కావడంతో ఆయన జైత్రయాత్ర పూర్తి అయింది. వాలెసా పాలన కూడా వివాదాలు లేకుండా ఏం సాగలేదు. పోలెండ్‌లో అధికారం కోసం ప్రయత్నించే యూదులు తమ జాతీయతను వెల్లడించాలని ఆయన ప్రకటించారు. దీనికి విదేశాల నుంచి విమర్శలు వెల్లువెత్తాయి. కేవలం బయట నుంచే కాదు, విద్యా రంగంలో వున్న పోలిష్ వారు కూడా ఆయనను విమర్శించారు. అయినా నిరంకుశంగా, అసహనంతో వ్యవహరించాడు. అధికారదాహంగలవాడన్న విమర్శలూ ఆయన్ను చుట్టుముట్టాయి. నాలుగేళ్ళ తరువాత అంటే 1994లో అతడు రాజ్యానికే ప్రమాదకారి అని అభిశంసిస్తూ పోలిష్ పార్లమెంటు ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

అటు స్వదేశంలోను అటు విదేశాల్లోను విమర్శలు ఎదురవుతున్నప్పటికీ, తనకు ప్రజల నాడి తెలుసునన్న అహంకారంతో వాలెసా 1995లో అధ్యక్ష పదవికి పోటీ చేశారు. మరో సారి అధికారం ఇస్తే తాను అధ్యక్షుని అధికారాలను విస్తృతం చేసి, మంచిగా పాలన చేస్తానని పేర్కొన్నారు. అయితే, పోలిష్ ఓటర్లలో కొందరు అతడిని 1926లో సైనిక దాడి చేసిన మార్షల్ జోజెఫ్ పిల్సుడిస్కీతో పోల్చారు. సైనిక దాడితో ప్రభుత్వాన్ని కూలదోసిన జోజెఫ్ తొమ్మిదేళ్ళ పాటు నియంతగా పాలించాడు. వాలెసాను తిరస్కరించి సోషల్ డెమొక్రాట్ అవతారమెత్తిన ఒక మాజీ కమ్యూనిస్టు నాయకుడికి ప్రజలు ఓటు వేశారు.

బ్రహ్మాండమైన ప్రజల మద్దతుతో అందలం ఎక్కిన వాలెసా, నిరంకుశంగా వ్యవహరించి అదే ప్రజల నుంచి దూరమయ్యాడు. కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా ఉద్యమించిన సాలిడారిటీ సిఐఏ, మొస్సాద్, ఆశ్చర్యకరంగా కెజిబి నుంచికూడా రహస్యంగా నిధులు పొందినట్టు తరువాతి కాలంలో వెల్లడైనా, అవేవీ ఆయన సాధించిన విజయాలను తక్కువ చేయలేవు. ఎందుకంటే, అతడు పురాతన సోవియట్ సామ్రాజ్యంలో ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పాడు. అనంతరం రాజకీయాలనుండి తప్పుకోవడం ద్వారా ఆయన ప్రజాస్వామ్యానికి మేలు చేశాడు.

1919-
1916–2004

# సర్ ఎడ్మండ్ హిల్లరీ & టెన్జింగ్ నార్గే

తొలిసారిగా వారిద్దరూ కలిసి ప్రపంచంలోనే అత్యంత ఎత్తైన శిఖరమైన హిమాలయాల్లోని ఎవరెస్ట్‌ను అధిరోహించారు. వారిలో ఒకరు ఎక్కడో న్యూజీలాండ్‌లో పుట్టిన పర్వతారోహకుడు ఎడ్మండ్ హిల్లరీ, మరొకరు హిమాలయాలు ఎక్కేందుకు వచ్చే పర్వాతారోహకులకు సామాన్లు మోసే షేర్పా టెన్జింగ్ నార్గే. 1919లో న్యూజీలాండ్‌లో పుట్టిన ఎడ్మండ్ హిల్లరీ ఆక్లాండ్‌లో పెరిగాడు. 16 ఏళ్ల ప్రాయంలో ఒకసారి పాఠశాల విజ్ఞాన యాత్రల్లో భాగంగా న్యూజీలాండ్ పశ్చిమ ప్రాంతంలో ఉన్న అగ్నిపర్వతాలు చూసేందుకు వెళ్లాడు. ఎత్తైన పర్వతాలను తన జీవితంలో తొలిసారిగా చూసిన హిల్లరీ ముగ్ధుడయ్యాడు. పర్వతారోహకుడు కావాలన్న బలమైన కోరిక నానాటికీ అతనిలో పెరిగిపోయింది. 1951లో న్యూజీలాండ్ ఆల్పైన్ క్లబ్‌లో చేరి యూరప్‌లోని పర్వతాలను అధిరోహించాడు. వారి ద్వారా భారత్-నేపాల్‌ల్లో ఉన్న హిమాలయాల గురించి విన్నాడు. అధిరోహిస్తే హిమాలయాలను ఎక్కి ఎవరెస్ట్‌ను పాదాక్రాంతం చేసుకోవాలనుకున్నాడు. ఎంతో ఆశతో ఇండియా చేరుకొని గఢ్వాల్ నుంచి హిమాలయాలను మొదట అధిరోహించాలన్న హిల్లరీ ప్రయత్నం ఫలించలేదు. అక్కడ ఎవరెస్ట్‌ను అధిరోహించేందుకు ప్రయత్నిస్తున్న ఓ బ్రిటిష్ బృందం కనబడింది. హిల్లరీని తమ బృందంలో సభ్యుడిగా చేర్చుకున్నారు. వాతావరణం అనుకూలించకపోవడంతో వారి క్యాంప్ మంచు తుఫానులో కొట్టుకొని పోయి ఆఖరి క్షణంలో చావు తప్పి బయటపడ్డారు.

టెన్జింగ్ నార్గే నేపాల్‌లోని ధామై ప్రాంతంలో గిరిజన తెగలో జన్మించాడు. చిన్నప్పటి నుంచే పర్వతారోహకుల సామాన్లు మోసేవాడు. చిన్నప్పుడే భారత్‌కు వచ్చి డార్జిలింగ్‌లో స్థిరపడిన నార్గేకు హిమాలయాలు కూలంకషంగా తెలుసు. అయితే హిమాలయాల్లో ఎవరెస్ట్‌ను అధిరోహించడం అక్కడ ఉండే మియో లుంగు సంగమ అనే దేవతకు ఆగ్రహం తెప్పిస్తుందని బలంగా నమ్మే జాతి నార్గేది. రాయల్ జియోగ్రఫికల్ సొసైటీ, గ్రేట్ బ్రిటన్‌కు చెందిన ఆల్పైన్ క్లబ్ సంయుక్తంగా కల్నల్ జాన్ హంట్ నేతృత్వంలో ఈ బృందం హిమాలయాల అధిరోహణకు బయలుదేరింది. వారికి నార్గే సహాయకునిగా నియమితుడయ్యాడు. 1953 మార్చి 27న తొలిసారిగా ఆక్సిజన్ సిలిండర్ల సాయంతో బయలుదేరిన ఈ బృందంలో మొదటి బ్యాచ్ ఎవరెస్ట్ ఇంకా 500 అడుగుల ఎత్తులో ఉండగానే వెనుదిరగాల్సి వచ్చింది. క్షణ క్షణానికి మారుతున్న వాతావరణం, మంచు తుఫాను కారణంగా కొన్ని గంటలపాటు రెండో బ్యాచ్‌లోని హిల్లరీ, నార్గేలు ఎదురు చూశారు. బృందం సభ్యులందరూ వెనుదిరిగినా పట్టుదలతో వీరిద్దరూ తొలిదశలో 28,200 అడుగుల మేర ఎవరెస్ట్‌పైకి ఎక్కగలిగారు. మంచు ఫలకంపై గుడారాన్ని నిర్మించుకొని వారిద్దరూ భయంకరమైన రాత్రి గడిపారు. తెల్లవారిన తరువాత ఉదయం ఎనిమిది గంటలకు 28,200 అడుగుల ఎత్తు నుంచి ఆరు గంటలపాటు జాగ్రత్తగా ఆచితూచి అడుగేస్తూ 29,028 అడుగుల ఎత్తులో ప్రపంచపు అత్యంత పైభాగాన గల మహామేరువు ఎవరెస్ట్ శిఖరంపై వారిద్దరూ చేరుకుని పరస్పరం ఆలింగనం చేసుకున్నారు. ఎవరెస్ట్ శిఖరాగ్రంపై న్యూజీలాండ్, భారత్, నేపాల్ జాతీయ జెండాలను ఆవిష్కరించారు. వారిద్దరికే ఆ తరువాత ప్రపంచం బ్రహ్మరథం పట్టింది. తనను సంప్రదించకుండా బ్రిటన్ ప్రభుత్వం నైట్‌హుడ్ ఇవ్వడంతో ఎడ్మండ్ హిల్లరీ ఆ గౌరవాన్ని తిరస్కరించాడు. హిల్లరీ న్యూజీలాండ్ వెళ్ళిపోయి తన గురువైన జిమ్ రోస్ కూతురు లూసీని వివాహమాడాడు. ఐదేళ్ళ తరువాత హిల్లరీ బృందం అంటార్కిటికా అన్వేషణను కూడా విజయవంతంగా పూర్తి చేసింది. ఎడ్మండ్ హిల్లరీ, టెన్జింగ్ నార్గేల ఈ సాహసం తరువాత మూడేళ్లకు ఒక అమెరికన్ బృందం ఎవరెస్ట్‌ను ఎక్కింది. ఇప్పటివరకు కొన్ని వందల మంది పర్వతారోహకులు దీనిని అధిరోహించబోయి ప్రాణాలు కోల్పోయారు. ఖాట్మండు వద్ద జరిగిన ఒక విమాన ప్రమాదంలో భార్య, కూతుర్ని పోగొట్టుకున్న తరువాత ఎడ్మండ్ హిల్లరీ నేపాల్ వచ్చి స్థిరపడ్డాడు. షేర్పాలకు చదువుచెప్తూ వారి అభివృద్ధికి ఎంతో కృషి చేశాడు. చివరికి అక్కడే మరణించాడు. భారత్-నేపాల్ ప్రజల హీరోగా వెలిగిన టెన్జింగ్ నార్గే తాగుడుకు బానిసై 1980లో మరణించాడు. ఏడు భాషల్లో మాట్లాడగలిగిన నార్గే ఏ భాషలోనూ రాయలేదు. చనిపోయేవరకూ టెన్జింగ్ పర్వతారోహకులకు శిక్షణ ఇచ్చి మరింత మంది ఈ వృత్తిలో రాటుదేలేటట్లు చేశాడు.

1899-
1961

# ఎర్నెస్ట్ హెమింగ్వే

మొదటి ప్రపంచయుద్ధ కాలంలో 19 ఏళ్ళ ప్రాయంలో హెమింగ్వే అంబులెన్స్ డ్రైవర్‌గా పనిచేసి గాయపడిన సైనికులను క్యాంపులకు చేర్చి వైద్య సహాయం అందించడంలో హెమింగ్వే ధైర్యసాహసాలకు రెండు సార్లు సాహస అవార్డులు కూడా దక్కాయి. స్పానిష్ సివిల్ వార్ కాలంలో, రెండో ప్రపంచ యుద్ధకాలంలో హెమింగ్వే ఎంతో సాహసంతో యుద్ధాలకు సంబంధించిన వార్తలు పంపి ధైర్య సాహసాలున్న విలేకరిగా గుర్తించబడ్డాడు. హెమింగ్వే రచనాశక్తి, ధైర్యసాహసాలు, మాటల చాతుర్యం అతన్ని హాలీవుడ్ వైపు కూడా నడి పించాయి. మహిళలంటే వల్లమాలిన వ్యామోహం ఉన్న ఈ యుద్ధ రచయిత నాలుగుసార్లు పెళ్ళిళ్లు చేసుకున్నాడు. ప్రమాదాలతో ఆడుకోవడం తన సరదా అనే హెమింగ్వే రెండు రోజుల వ్యవధిలో రెండు విమాన దుర్ఘటనలు, కారు ప్రమాదాలను తప్పించుకున్నాడు. తన సాహసాల్నే అతని నవలల్లోని పాత్రలకు వర్తింపజేశాడు. అమెరికాలోని ఓక్‌పార్క్ ధనిక కుటుంబంలో హెమింగ్వే పుట్టాడు. బడికి పంపిస్తే చదువుకోకుండా చేపలు పట్ట డానికీ పక్షుల వేటకూ వెళ్ళేవాడు. 1928లో అప్పుల బాధ భరించలేక హెమింగ్వే తండ్రి తుపాకీతో కాల్చుకొని ఆత్మహత్య చేసుకున్నాడు. తండ్రి మరణం తరువాత ఫారిన్ కరస్పాం డెంట్‌గా పనిచేసి కష్టపడే విలేకరిగా పేరు తెచ్చుకున్నాడు. వృత్తి రీత్యా ప్యారిస్‌కెళ్ళిన హెమింగ్వేకు అదృష్టవశత్తూ పాబ్లో పికాసో, గెర్ట్రూడ్ స్టెయిన్, ఎజ్రాపౌండ్, జేమ్స్ జాయిస్ వంటి కళాకారులు, మేధావులతో పరిచయమేర్పడింది. యుద్ధాలు, సామ్రాజ్యకాంక్షలు, అంతర్యుద్ధాల్లో సామాన్య ప్రజలు ఎన్ని ఇబ్బందులెదుర్కొంటారో వారి సాంగత్యంలో గ్రహించాడు. విశ్వవిఖ్యాత పెయింటర్స్ పికాసో, సెజానే సృష్టించిన కళాఖండాల విమర్శకుడిగా హెమింగ్వే తన రచనా వైదుష్యానికి మెరుగులు దిద్దుకున్నాడు.

ప్రజల కష్టాలను అక్షర రూపంలోకి మలిచాడు. 1926లో తొలిసారి ప్రచురితమైన 'ద సన్ ఆల్‌సో రైసెస్' హెమింగ్వేకు అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టాయి. కోరికలు, కష్ట నష్టాలను కథా వస్తువులుగా చేసుకుని స్పెయిన్‌లో ఎడ్ల పందేలను స్ఫూర్తిదాయకంగా మలిచి కథనంతో రక్తి కట్టించాడు. మొదటి ప్రపంచ యుద్ధం అసలు ఉద్దేశాన్ని, యుద్ధాల హోరులో సామాన్యులు ఎదుర్కొన్న కష్టాలను హృద్యంగా మలచి 1929లో హెమింగ్వే రాసిన 'ఏ ఫేర్‌వెల్ టు ఆర్మ్స్' ప్రపంచవ్యాప్తంగా సంచలనం సృష్టించింది. హెమింగ్వే ఇంత బలంగా యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ నవల రాసినప్పటికీ రెండో ప్రపంచయుద్ధం రానే వచ్చింది. కఠోర వాస్తవాలను అంతే నిక్కచ్చిగా పాఠకుల ముందు పెట్టడంలో హెమింగ్వే ఎప్పుడూ రాజీ పడేవాడు కాదు. ఇదే సిద్ధాంతాన్ని సంపూర్ణంగా నమ్ముతూ హెమింగ్వే 'ఏ మూవబుల్ ఫేస్'రచించాడు. దీనితో హెమింగ్వే రచనల కోసం అంతర్జాతీయంగా అడ్వాన్సులు చెల్లించి ఎదురు చూసే ప్రచురణకర్తలు ఎక్కువయ్యారు.

మానవజాతి చరిత్రలో రెండో ప్రపంచ యుద్ధం ఒక మాయని మచ్చ. మనిషి ఈ భూగోళం మీద ఉద్భవించిన తరువాత కారణం లేకుండా ఇంత పెద్ద ఎత్తున మానవ హననం జరిగిన మరో ఘోర సంఘటన లేదు. అణుబాంబు ప్రయోగంతో కోట్లాది మంది అమాయకుల ఉసురు తీసిన ఈ యుద్ధాన్ని హెమింగ్వే ఏవగించుకున్నాడు. రెండో ప్రపంచ యుద్ధంలో అణుబాంబుల దాడి, ఇక మూడో ప్రపంచ యుద్ధంలో, ఏ ఆయుధాలను ఉపయోగిస్తారు? అన్న ఓ ప్రశ్నకు సమాధానంగా హెమింగ్వే ఏం చెప్పాడంటే. "మూడో ప్రపంచ యుద్ధంలో ఏ ఆయుధాలు వాడతారో నాకు తెలియదు కానీ, నాలుగో ప్రపంచయుద్ధమంటూ వస్తే మనుషులు రాళ్ళు రప్పలతో కొట్టుకుంటారు" అని చమత్కారభరితంగా సమాధానమిచ్చాడు. తన అనుభవాన్నంతా రంగరించి సాధారణ పౌరుడి జీవన విధానాన్ని తెలియజేస్తూ హెమింగ్వే 1952లో రాసిన 'ద ఓల్డ్ మ్యాన్ అండ్ ద సీ' ప్రపంచ వ్యాప్తంగా సంచలనం సృష్టించింది. ఈ అద్భుత రచనకు గాను హెమింగ్వేకు ఆ ఏడాది సాహిత్యంలో నోబెల్ బహుమతి దక్కింది.

1955 తరువాత హెమింగ్వే తీవ్రమైన మానసిక ఒత్తిడికి గురయ్యాడు. ఏమీ రాయలేకపోతున్నాన్న బాధ అతన్ని అనుక్షణం కలచివేసింది. తన నవలల్లోని ధీరోదాత్త హీరోలాగానే చుట్టుముట్టిన సమస్యలను ఎదుర్కొన్నాడు. కానీ సమస్యలకు వెన్ను చూపడం ఇష్టంలేని హెమింగ్వే 1961 జులై 21న తన ఇంట్లో తుపాకీతో కాల్చుకొని ఆత్మహత్య చేసుకున్నాడు. ఆ విధంగా తన చావును కూడా తన చేతిలోనే ఉంచుకొని ధైర్యానికి సరికొత్త నిర్వచనం చెప్పాడు.

1905-
1979

# ధ్యాన్‌చంద్

మాంత్రికుడు, మాయల మరారి ఇట్లాంటి పేర్లు సాధారణంగా మోసగాళ్లకు పెడతారు. కానీ ఓ క్రీడాకారునికి మాంత్రికుడు అన్న పేరు పెట్టారంటే ఏదో విశేషమే ఉండాలి. భారత ఉపఖండంలో పుట్టిన హాకీ క్రీడకు ప్రపంచఖ్యాతి తెచ్చి పెట్టిన ధ్యాన్‌చంద్‌కు హాకీ మాంత్రికుడనే పేరు ఉంది. హాలెండ్‌లో ధ్యాన్‌చంద్ హాకీ ఆడుతున్నప్పుడు అతని హాకీ స్టిక్‌ను క్రీడా పరిశీలకులు విరగ్గొట్టి చూసారు. అందులో అయస్కాంతమేమైనా బిగించారా అని వారు అనుమానించారు. జపాన్‌లో ఆడుతున్నప్పుడు అతని హాకీ కర్రను తీసుకుని దానికి ఏదైనా ప్రత్యేక రకం జిగురు అంటించారేమోనని చాలా సేపు పరిశీలించారు. ఇక బెర్లిన్ ఒలంపిక్స్‌లో నాజీ నియంత అడాల్ఫ్ హిట్లర్ అయితే ధ్యాన్‌చంద్ హాకీ స్టిక్‌ను తనే ఉంచుకొంటానని బేరం పెట్టాడు.

హాకీ క్రీడకు ఇంత గ్లామర్ అద్దిన హాకీ మాంత్రికుడు ధ్యాన్‌చంద్ అసలు పేరు ధ్యాన్‌సింగ్. ఆయన 1905లో ఆగస్టు 29న ఉత్తరప్రదేశ్‌లోని అలహాబాద్‌లో జన్మించారు. సదాచార పరాయణుడైన కుటుంబంలో పుట్టిన ధ్యాన్‌చంద్ చిన్నతనం నుంచే మున్సిపల్ క్రీడా స్థలాల్లో జరిగే హాకీ ఆటల్లో పాల్గొని నైపుణ్యం సాధించాడు. తన అన్న రూప్‌సింగ్‌తోపాటు వెళ్ళి జిల్లా స్థాయి పోటీలను తిలకించే ధ్యాన్ చంద్ త్వరలోనే హాకీలో అన్ని మెళకువలూ నేర్చుకున్నాడు. తమ్ముని నైపుణ్యాన్ని గమనించిన ధ్యాన్‌చంద్ అన్న అతన్ని పంకజ్ గుప్తా అనే కోచ్ వద్ద ఆట నేర్చుకునేందుకు కుదిర్చాడు. పంకజ్‌గుప్తా శిక్షణలో ధ్యాన్‌చంద్ స్వల్పకాలంలోనే అద్భుతమైన ఆటగాడిగా మారాడు. ధ్యాన్‌చంద్ ఏకాగ్రత, అతని చురుకుదనం చూసి కోచ్ నువ్వు ఎప్పటికైనా హాకీలో చాంద్ (చంద్రుడి)లా ప్రకాశిస్తావు అని మెచ్చుకున్నాడు. ఇలా ధ్యాన్‌సింగ్ కాస్తా ధ్యాన్‌చంద్‌గా మారిపోయాడు. అన్నతో కలిసి నిరంతరం హాకీ ప్రాక్టీస్ చేసే ధ్యాన్‌చంద్ మెల్లగా జాతీయస్థాయిలో రాణించసాగాడు.

1928లో హాలెండ్‌లోని ఆమ్‌స్టర్‌డామ్ ఒలంపిక్స్‌కు ఆఖరి నిముషంలో ధ్యాన్‌చంద్‌కు అవకాశం లభించింది. అప్పటికి 22 ఏళ్ల వయస్సున్న ధ్యాన్‌చంద్ భారత జట్టులో అందరికన్నా చిన్నవాడు. భారత ఉపఖండంలో పంజాబ్, సింధ్ లాంటి ప్రాంతాల నుంచి వస్తున్న క్రీడాకారులను ఎదుర్కొని జట్టులో చోటు సంపాదించడమే గొప్ప విషయం. మొత్తానికి అందరూ ఆశించినట్లుగానే ఆమ్‌స్టర్‌డామ్ ఒలంపిక్స్‌లో భారత హాకీ జట్టు స్వర్ణపతకాన్ని సాధించింది. భారత జట్టు ఫైనల్స్‌లో నెదర్లాండ్స్‌ను 3-0 గోల్స్ తేడాతో ఓడించింది. యువకుడైన ధ్యాన్‌చంద్ ఆ మ్యాచ్‌లో భారత్ సాధించిన 3 గోల్స్‌లో రెండు తనొక్కడే చేశాడు. అక్కడనుంచి భారత హాకీలో ధ్యాన్‌చంద్ స్వర్ణయుగం ప్రారంభమైంది. లండన్‌లోని ఫోక్‌స్టోన్ ఫెస్టివల్ సందర్భంగా జరిగిన 10 మ్యాచ్‌లలో భారత హాకీ జట్టు ప్రత్యర్థులపై మొత్తం 72 గోల్స్ సాధిస్తే అందులో ధ్యాన్‌చంద్ వాటా 36 గోల్స్. 1932 ఒలంపిక్స్‌లో కూడా ధ్యాన్‌చంద్ తన హాకీస్టిక్‌తో క్రీడాభిమానులను సమ్మోహనపరిచాడు. హాకీ చరిత్రను తిరగరాసాడు. లాస్‌ఏంజిల్స్‌లో జరిగిన ఈ ఒలంపిక్స్‌లో భారత జట్టు హాకీలో అమెరికా జట్టును 24-1 గోల్స్ తేడాతో ఓడించింది. ఇంత భారీ తేడాతో ఒక జట్టు గెలవడం అప్పటికి ఒక ప్రపంచ రికార్డు. ఈ మ్యాచ్‌లో ధ్యాన్‌చంద్ ఒక్కడే 8 గోల్స్ సాధించాడు. అప్పుడు కూడా భారతజట్టు హాకీలో స్వర్ణపతకాన్ని సాధించింది. అదే ఏడాది దేశవిదేశాల్లో జరిగిన వివిధ పోటీల్లో భారత హాకీ జట్టు మొత్తం 338 గోల్స్ సాధిస్తే ధ్యాన్‌చంద్ ఒక్కడే 133 గోల్స్ చేయడం విశేషం. 1934లో భారత

హాకీ జట్టు ప్రపంచ పర్యటనకు బయలుదేరింది. ఈ పర్యటన ధ్యాన్‌చంద్ జీవితంలో చిరస్మరణీయమైంది. ప్రపంచంలో మొత్తం హాకీ ఆడే 20 దేశాల్ని ధ్యాన్‌చంద్ బృందం పర్యటించింది. ఈ పర్యటన సందర్భంగానే ధ్యాన్ చేతిలోని హాకీ స్టిక్ విన్యాసం క్రీడాభిమానులను అబ్బురపరిచింది. జపాన్, హాలెండ్‌లలో అనుమానం వచ్చిన పరిశీలకులు ధ్యాన్‌చంద్ హాకీ కర్రను పరీక్షల కోసం పంపారు. ఏదో అద్భుత అయస్కాంత శక్తి ఉన్నట్లు, ధ్యాన్‌చంద్ హాకీ కర్రకు బంతి అతుక్కుపోయినట్లు కనబడేది. అయస్కాంతమేదీ లేదని నిర్ధారించుకున్న తరువాత, మరో అనుమానం వచ్చింది. ఈ భారత ఆటగాడు మైదానంలోకి దిగిన తరువాత హాకీ కర్రకు ఏదో జిగురు పూస్తున్నాడు. లేకపోతే గాలిలోకూడా బంతి ఎందుకు ఆ కర్రను అంటిపెట్టుకుని ఉంటుంది అని ఆ క్రీడాకారులకు అనుమానం వచ్చింది. మళ్ళీ హాకీ స్టిక్‌ను పరిశీలించారు. ఈసారి కూడా పరిశీలనలో అతని హాకీ స్టిక్ మిగిలిన స్టిక్స్‌లాగే సాధారణంగానే ఉందని, అసాధారణ మంతా అతని చేతిలో, కాళ్ళలో, ఆటతీరులో ఉందని తేల్చారు. సెంటర్ ఫార్వర్డ్‌లో ఆడుతూ, చక్కని డ్రిబ్లింగ్‌తో ప్రత్యర్థులను ముప్పుతిప్పలు పెట్టే ధ్యాన్‌చంద్ వద్దకు హాకీ బంతి వెళ్ళిందా ఇక అంతే సంగతులు.

ధ్యాన్‌చంద్ ఆటతీరుకు అసలైన కితాబు జర్మన్ నియంత అడాల్ఫ్ హిట్లర్ నుంచి లభించింది. 1936 ఒలంపిక్స్‌లో భారత హాకీ ఆటతీరు హిట్లర్‌ను ఆశ్చర్యపరిచింది. అక్కడ జరిగిన ఫైనల్స్‌లో అందరిలాగే ఈ హాకీ మాంత్రికుని ప్రతిభ హిట్లర్‌ను సమ్మోహన పరిచింది. ఫైనల్స్‌లో గెలిచిన తరువాత హిట్లర్ ధ్యాన్‌చంద్‌ను పిలిపించి భారతదేశంలో నీ హోదా ఏమిటని ప్రశ్నించాడు. సైన్యంలో తాను సిపాయినని ధ్యాన్‌చంద్ చెప్పాడు. "నువ్వు జర్మనీకి వస్తే నీకు మా సైన్యంలో జనరల్ హోదా ఇస్తా" అని హిట్లర్ ధ్యాన్‌చంద్‌కు ఆశ చూపాడు. ధ్యాన్‌చంద్ నవ్వి ఊరుకున్నాడు. కనీసం నీ హాకీ స్టిక్ అయినా మాకిచ్చేయ్, ఎంత ధరైనా ఫరవాలేదు అంటూ హిట్లర్ ఈ హాకీ మాంత్రికుడి ప్రతిభకు సమ్మోహితుడయ్యాడు. వియన్నాలో 1940న నాలుగురోడ్ల కూడలివద్ద ధ్యాన్‌చంద్ కాంస్యవిగ్రహాన్ని ప్రతిష్టించారు. ప్రత్యేక అర్హతలేమీ లేకపోయినప్పటికీ హాకీలో ధ్యాన్‌చంద్‌కున్న అపార ప్రతిభాశక్తిని దృష్టిలో ఉంచుకుని అప్పటి బ్రిటీష్ సర్కారు 1938లో బిరుదు ఇచ్చి గౌరవించింది. 1943లో ఇలాంటి మరో పురస్కారం లభించింది. ధ్యాన్‌చంద్ ఆధ్వర్యంలోనే భారత్ ఒలంపిక్స్‌లో తొలి బంగారు పతకాన్ని, ఆ తరువాత వరుసగా 1932, 36 ఒలంపిక్స్‌లలో బంగారు పతకాలతో హ్యాట్రిక్ సాధించింది. 1947లో అస్వస్థుడయినా ధ్యాన్‌చంద్ తూర్పు ఆఫ్రికా పర్యటించారు. ఆయన 22 గోల్స్ చేశారు.

హాకీలో అనితర సాధ్యమైన ప్రతిభ కనబర్చిన ధ్యాన్‌చంద్ 1949లో రిటైర్ అవుతున్నట్లు ప్రకటించాడు. భారత సైన్యం నుంచి మేజర్ హోదాలో పదవీవిరమణ చేసిన ధ్యాన్‌చంద్ జాతీయ స్పోర్ట్స్ అకాడమీలో హాకీ చీఫ్ కోచ్‌గా కొంత కాలం పదవీ బాధ్యతలు నిర్వహించాడు. అయితే కోచ్‌గా ధ్యాన్‌చంద్ అంతిమంగా సఫలం కాలేదు. 1956లో భారత ప్రభుత్వం ఈ హాకీ మాంత్రికునికి పద్మభూషణ్ పురస్కారమిచ్చి గౌరవించింది. జీవితం చివరి దశలో క్యాన్సర్ బారిన పడి 1979లో చివరి శ్వాస విడిచారు. ధ్యాన్‌చంద్ మరణించిన ఏడాది తరువాత 1980లో ఈ అసామాన్యుడైన హాకీ మాంత్రికుడి గౌరవార్థం భారత సర్కారు ఒక పోస్టల్ స్టాంప్‌ను విడుదల చేసింది.

1901-
1966

# వాల్ట్ డిస్నీ

ఆబాల గోపాలాన్ని అలరించే మిక్కీ మౌజ్ అంటే అందరికీ తెలుసు. కాని అది ఎక్కడ, ఎప్పుడు ఎలా పుట్టిందో చాలా మందికి తెలియదు. న్యూయార్క్ నుంచి పశ్చిమ తీరానికి వెళుతున్న ఒక రైలులో 1928లో మిక్కీమౌజ్ జన్మించింది. మిక్కీమౌజ్ తండ్రికి అప్పుడు ఇరవై ఏడేళ్లు. అతను ఒక యానిమేటర్. 'ఆస్వాల్డ్ ది రాబిట్' అనే తన కార్టూన్ చిత్రంపై హక్కులు కోల్పోయి ఎలాగోలా వ్యాపారాన్ని పునరుద్ధరించాలని ప్రయత్నిస్తున్న వ్యక్తి మనసులో పుట్టిన ఆలోచనల ప్రతిరూపమే మిక్కీమౌజ్. ఆయన కార్టూన్లు గీస్తున్నప్పుడు చెత్తబుట్ట దగ్గర ఒక ఎలుక ఎప్పుడూ తచ్చాడుతుండేది. ఆ ఎలుక ఆధారంగానే వాల్ట్ డిస్నీ తాను ప్రయాణిస్తున్న రైలు లాస్ ఏంజిల్స్ చేరుకునేలోగా మిక్కీమౌజ్‌కు జన్మనిచ్చాడు.

మిక్కీమౌజ్ ముక్కుతో మాట్లాడుతున్నట్టుండే ధ్వని అక్షరాలా డిస్నీ గొంతే. అది త్వరలోనే విషాద ఛాయలు ముసురుకున్న అమెరికన్లకు ధైర్య సాహసాలు కల్పించే చిహ్నంగా మారిపోయింది. మొట్టమొదటిసారి 1928లో 'ప్లేన్ క్రేజీ' అనే కార్టూన్ చిత్రంలో మిక్కీమౌజ్ సాక్షాత్కరించింది. దాని అల్లరి చేష్టలు త్వరలోనే అందరినీ ఆకర్షించాయి. జర్మనీలో మైకేల్ మౌస్‌గాను, దక్షిణ అమెరికాలో మిగ్యూనోల్ రటో సిటోగాను, జపాన్‌లో మికీ కుచీగాను మిక్కీమౌజ్‌గా నామాంతరం చెందింది. డోనాల్డ్ డక్, గూఫీ, ప్లూటో లాంటి కార్టూను చిత్రాల పాత్రలన్నీ మిక్కీమౌజ్ స్ఫూర్తితో పుట్టుకొచ్చినవే. ఆ తరువాత డిస్నీ సోదరుల స్టూడియోలు అద్భుతంగా కొనసాగిన సమయంలో ఎగిరే సర్కస్ ఏనుగులు, విజ్ఞాన ఖనులైన చిరు కప్పలు, సిగ్గుపడే పక్షులు, పాటలు పాడే వింత వింత జంతువులు అనేకానేకంగా అవతరించాయి.

మొదట మిక్కీమౌజ్ అన్యోన్యంగా ఉండే అల్లరి ఎలుకపిల్ల కాదు. కానీ తరువాత తరువాత అది ప్రపంచమంతటా మిలమిలలాడే గందరగోళమైన కళ్లున్న ఆకర్షణీయమైన జీవిగా రూపాంతరం చెందింది. ఎర్రని లాగు, పసుపుపచ్చని బూట్లు, ఊగాడే తోకతో కూడిన మిక్కీమౌజ్ అంతకు ముందు ఉన్న లక్షణాల్ని వదిలించుకొని 'స్టీమ్ బోట్ విల్లీ' (1928)లో తుంటరి పాత్రగా మారిపోయింది. కాని డిస్నీ, అతని ప్రధాన యానిమేటర్ అబ్ ఐవెర్క్స్ మార్గదర్శకత్వంలో ఎలుక రూపాన్ని మార్చుకొని క్రమంగా, సౌమ్యంగా, సర్వజనాంగీకారంగా యోగ్యమైన వ్యక్తిత్వాన్ని సంతరించుకొంది.

ఇలినాయిస్ రాష్ట్రంలోని షికాగోలో జన్మించిన వాల్టర్ ఇలియాస్ డిస్నీ పదేళ్ల ప్రాయం నుంచే అద్భుతమైన కల్పనాశక్తిని ప్రదర్శించేవాడు. అయిదుగురు సంతానం కల ఇంట్లో డిస్నీ అందరికన్నా చిన్నవాడు. వారి కుటుంబం మిస్సోరికి మారిన తరువాత అతనికి జంతువులంటే అమితమైన ఆసక్తి పెరిగింది. ఆ జంతువుల బొమ్మలు గీసి వాటిని సెలూన్ యజమానికి ఇచ్చి క్షవరం చేయించుకునే వాడు. ఆ తరువాత డిస్నీ కన్సాస్ సిటీ ఆర్ట్ ఇనిస్టిట్యూట్‌లో రెండేళ్లు గడిపాడు. ఆపైన మొదటి ప్రపంచ యుద్ధం చివరి నెలలో స్వచ్ఛందంగా రెడ్‌క్రాస్ అంబులెన్స్ డ్రైవర్‌గా కుదిరాడు. పదేళ్ళ తరువాత మళ్లీ కన్సాస్ పట్టణానికి తిరిగి వచ్చి జీవితాంతం తనకు సహచరుడిగా పనిచేసిన ఐవెర్క్స్‌తో కలిసి కార్టూన్ చిత్రాలు రూపొందించేవాడు. అంతిమంగా తన అసలు స్థానం హాలీవుడ్ అని గుర్తించాడు. 1923లో తన సోదరుడు రాయ్‌తో కలిసి 'ఎలీస్' చిత్రాల పరంపరకు రచనలు చేయడం, ఆ చిత్రాలకు దర్శకత్వం వహించడం మొదలుపెట్టాడు. అవన్నీ హాస్యప్రధానమైన చిత్రాలు. సజీవ నటనతోనూ, యానిమేషన్‌తోనూ కూడుకొని ఉండేవి.

యానిమేషన్ రంగంలో ఉద్దండులైన పాట్ సల్లివాన్ (ఫ్రిట్జ్ ది క్యాట్), బిల్ నోలాన్ (క్రేజీ క్యాట్) వంటి యానిమేటర్లను ఆదర్శంగా తీసుకొని చార్లీ చాప్లిన్, లారెల్ అండ్ హార్డీ, బస్టర్ కీటన్ లాంటి గొప్ప సినిమా రంగ ప్రముఖుల స్థాయికి వెళ్ళాడు. తన నైపుణ్యానికి, హాస్యప్రధానమైన కథలు చెప్పే కళకు నిరంతరం పదును పెట్టుకునేవాడు. డిస్నీ ప్రయోగశీలి. తాను సృష్టించిన

పాత్రలు ఆలోచించాలని, నటించాలని, భావాలు వ్యక్తం చేయాలని భావించేవాడు. నా పాత్రలు అనామకంగా ఉండకుండా జవసత్వాలతో నిండి ఉండాలని చెప్పేవాడు. విపరీతమైన పోటీ, ఆర్థికంగా దివాళాకోరు స్థితిలో పదేళ్ల అనవరత శ్రమ తరువాత డిస్నీ అనుసరించే నిక్కచ్చి విధానాలు, పని పద్ధతుల ప్రాతిపదికగా పైకెది గాడు. చిత్ర విమర్శకులు ఇప్పుడు ఆ దశను యానిమేషన్ స్వర్ణయుగం అంటున్నారు. సిండ్రెల్లా మొహంలో సంతోషం వ్యక్తమైనప్పుడు ప్రపంచ వ్యాప్తంగా బాలలందరూ నవ్వులు చిందించారు. బాంబీ తల్లి మరణించినప్పుడు వాళ్ళూ కంటతడి పెట్టుకున్నారు. ఆ చిత్రాలు మానవ ప్రవర్తనలోని చీకటి కోణాల్ని ఆవిష్కరించినప్పుడు సినిమా హాళ్లలో తమ కుర్చీల్లో భయం భయంగా కదిలేవారు.

ప్రతి చిన్న వివరం కూడా డిస్నీకి అత్యంత ప్రధానమైందే. కథను ఎడిట్ చేయడం మీద ఆయన తీవ్రమైన దృష్టి కేంద్రీకరించేవాడు. పాటల గురించి గంటల తరబడి ఆలోచనల్లో నిమగ్నమయ్యేవాడు. విశిష్టమైన ప్రభావాలు కలగచేయడానికి నిరంతరం శ్రమించేవాడు. నిజానికి ఆయన మదిలో నుంచి వెలువడిన బ్రహ్మాండమైన భావాలు, ఊహలు ఏళ్ల తరబడి ఆయన బుర్రలో మెదులుతున్నవే. ఆ భావాలకు, ఊహలకు నిర్దిష్టమైన రూపం ఏర్పడినప్పుడు వాటిని తాను నిర్దేశించుకున్న మార్గంలో సమర్థంగా నడి పించేవాడు. తరచుగా స్టూడియోలోనే ఉండిపోయి ఇంటికి ఆలస్యంగా చేరుకునేవాడు. ఆఫీసు బల్ల మీద పడుకోవాల్సి వస్తోందని తన భార్య లిల్లీకి నచ్చచెప్పేవాడు.

మిక్కీని సృష్టించిన తరువాత అతను తీసుకున్న విశిష్టమైన నిర్ణయంలోనే ఆయన ప్రతిభాపాటవాలు ఇమిడి ఉన్నాయని ఆయన జీవిత చరిత్ర రచయితలు భావిస్తారు. 1927లో చిత్రరంగంలో ధ్వని (టాకీ) వాడకం సాధ్యమైనప్పుడు దాని మహత్తర శక్తిని డిస్నీ వెంటనే గుర్తించాడు. 'స్టీమ్‌బోట్ విల్లీ' అనే కార్టూన్ చిత్రంలో ఈ సదుపాయాన్ని సమర్థంగా వినియోగించుకున్నాడు. తాను రూపొందించే చిత్రాల ఫ్రేములకు, సంగీతానికి మధ్య అద్భుతమైన సమన్వయాన్ని కుదిర్చేవాడు. 'టర్కీ ఇన్ ది స్ట్రా' అన్న పాట రాగానికి అనుగుణంగా మిక్కీ నటనను తీ ర్చి దిద్దాడు. అది వాణిజ్యపరంగా అద్భుత విజయం సాధించ డమే కాక సాంకేతికపరంగా కొత్త పుంతలు తొక్కింది. తన దగ్గర పనిచేసే కళాకారులు వేసిన ఏ బొమ్మకైనా మానుష భావారోపణ చేయగలిగిన శక్తి సామర్థ్యాలు డిస్నీ సొంతం. 1937లో నిర్మించిన స్నో వైట్, సెవెన్ డ్వార్ఫ్ అన్న పూర్తి నిడివి కార్టూను చిత్రాలలో ఈ కౌశలాన్ని శక్తివంతంగా ఉపయోగించుకున్నాడు. మూడేళ్లపాటు శ్రమించి పదహారు లక్షల డాలర్ల వ్యయంతో నిర్మించిన మరో చిత్రం అత్యంత తక్కువ సమయంలో ఎనభై లక్షల డాలర్లు సంపాదించి పెట్టింది. దీనిని అతని ఆంతరంగికులు 'డిస్నీస్ ఫాలీ' అంటారు. ఆ తరువాత వెంటవెంటనే పినోషియా (1939), ఫాంటా షియా (1940) అనే విజయవంతమైన చిత్రాలను నిర్మించాడు.

అమెరికాలో టెలివిజన్ అవతరించిన తరువాత 'అంకుల్ వాల్ట్' గొప్ప తారగా అవతరించాడు. 29 ఏళ్లపాటు డిస్నీ అద్భుత ప్రపంచాన్ని చూపించాడు. జీవితాంతం సిగరెట్లు కాల్చిన డిస్నీ 1966లో ఊపిరితిత్తుల కాన్సర్ వ్యాధి సోకి మరణించాడు. కానీ అతను సృజించిన సామ్రాజ్యం విస్తరిస్తూనే ఉంది. కాసుల వర్షం కురిపిస్తూనే ఉంది. దేశ విదేశాల్లో, గృహ సముదాయాల్లో, ఆ సంస్థ సొంత టెలివిజన్ ఛానల్‌లో విస్తరిస్తూనే ఉంది. 1980లు, 1990లలో డిస్నీ సంస్థ నిర్మించిన పూర్తి నిడివి గల ది లిటిల్ మేర్మేయిడ్ (1989), బ్యూటీ అండ్ ది బీస్ట్ (1991), అల్లాద్దీన్ (1992) ది లయన్ కింగ్ (1994), పోకహంతాస్ (1995) హెర్క్యులస్ (1997) వంటి పూర్తి నిడివి గల చిత్రాలు డిస్నీ విజయపరంపరలో చేరిపోయాయి. సకుటుంబ సమేతానికి వినోదాత్మక యానిమేటెడ్ చిత్రాలను అందించడంలో డిస్నీ స్టూడియో తన కీర్తి పతాకను నిరంతరం ఎగురవేస్తూనే ఉంది.

# స్టీఫెన్ హాకింగ్

స్థల కాలాదులలోని అన్ని ధోరణులను విడమరచగలిగే ఒకే సమీకృత సిద్ధాంతం ఉండాలన్న ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ కలను వాస్తవరూపంలోకి తీసుకొస్తాడని అందరూ ఊహించిన బ్రిటీష్ ఖగోళ శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్ విశ్వం మూలాలను, అది ఎలా పరిణమించబోతోంది అన్న విషయాల గురించి చేసిన సిద్ధాంతాలు 20వ శతాబ్దంలో దిగ్భ్రాంతికి గురిచేశాయి. శరీరంలోని కండరాలు అన్నీ చచ్చుబడిపోయి చిన్న కదలిక కూడా సాధ్యం కాకుండా, చక్రాల కుర్చీకే పరిమితమైన ఈ అద్భుత శాస్త్రవేత్త మేధస్సు మాత్రం జ్వాజ్వల్యమైంది. అసలు అస్తిత్వం ఎలా అస్తిత్వంలోకి వచ్చింది అన్న విషయంలో ఆయన మదిలో నిరంతరం కొనసాగుతున్న ఆలోచనలు దృఢమైన శరీరంలోనే గట్టి మనసు ఉంటుందన్న నమ్మకాన్ని వమ్ము చేస్తాయి.

హాకింగ్ తండ్రి ఆక్స్‌ఫర్డ్ జీవశాస్త్ర పరిశోధకుడు. ఆయన నలుగురు సంతానంలో హాకింగ్ పెద్దవాడు. ఆక్స్‌ఫర్డ్‌లో జన్మించాడు. చిన్నప్పటినుంచీ హాకింగ్‌లో విపరీతమైన జిజ్ఞాస కనబడేది. శారీరకంగా చురుకుగా, అందరితో కలివిడిగా ఉండే హాకింగ్ సెయింట్ ఆల్బిన్స్ పాఠశాలలో చదువుకున్నాడు. అయితే ఆయన పాఠశాల విద్యార్థిగా ఉన్నప్పుడు అంత ప్రతిభావంతుడు ఏమీ కాదు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో చేరడానికి అనువైన స్థితీ లేదు. సరదాగా గడపడం, పడవలు నడిపే వారితోపాటు చుక్కాని తిప్పడం హాకింగ్‌కు ఇష్టం. గణితం, భౌతికశాస్త్రం రోజుకు ఒక గంట కన్న ఎక్కువ చదివేవాడు కాదు. ఆయన పట్టభద్ర స్థాయి విద్య పూర్తి చేసినప్పుడు అద్భుతమైన ప్రతిభాపాటవాలకు నిదర్శనమైనన్ని మార్కులు రాకపోవడంతో పిహెచ్‌డిలో సీటు రావడానికి మౌఖిక పరీక్షకు హాజరు కావాల్సి వచ్చింది. డిగ్రీలో ఆయనను పరీక్షించిన వారు ఆయనలో ఉన్న అద్భుతమైన తెలివితేటలు చూసి వెనుకాడకుండా మొదటి శ్రేణిలో నిలిపారు.

1962లో హాకింగ్ కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ పట్టభద్రుడయ్యాడు. అక్కడే ఆయనకు ఖగోళశాస్త్రం, విశ్వ నిర్మాణ శాస్త్రంలో అమితాసక్తి కలిగింది. ఈ విశ్వం ఎలా జనించింది అన్న ప్రశ్నకు సమాధానం చెప్పగలిగిన వాడిగా ఎదగాలన్నది హాకింగ్ ఉద్దేశం. ఆక్స్‌ఫర్డ్‌లో చేరిన తర్వాత కొద్ది రోజులకే అతని ఆరోగ్యంలో దారుణమైన మార్పు కనిపించడం మొదలైంది. ఆయన శరీరంలోని కండరాలు కృశించడం మొదలు పెట్టాయి. చికిత్స లేని ఈ వ్యాధిని 'లో గెహ్రిగ్స్ వ్యాధి' అంటారు. అస్థిపంజరాన్ని నిలబెట్టే కండరాలు, ఛాతీ కండరాలు కృశించి పోతాయి. ఇక తాను ఎక్కువకాలం బతకడం కష్టం అనుకున్న హాకింగ్ పి.హెచ్.డి. ఎందుకు పూర్తి చేయాలి అన్న నిరాశకు గురయ్యాడు. తాగుడుకు అలవాటు పడ్డాడు. ఆ సమయంలో జేన్ వైల్డ్ అన్న విద్యార్థితో ప్రేమలో పడ్డాడు. 1965లో జేన్‌ను పెళ్ళి చేసుకున్న తర్వాత ఆమె చూపిన అనురాగంతో హాకింగ్‌కు జీవితంపై కొత్త ఆశలు చిగురించాయి. బతకాలని అనుకున్నాడు. ఆయనకు సోకిన వ్యాధి ఆయనను చక్రాల కుర్చీకే పరిమితం చేసింది. తన పనులు తాను చేసుకోవడానికి కూడా వీలులేని రోగం అది.

అయినా హాకింగ్ మేధస్సు మాత్రం చురుకుగానే ఉంది. ఆయన చాలా దృఢ సంకల్పం గలవాడు. రోజర్ పెన్‌రోల్‌తో కలిసి 'విలక్షణత' సిద్ధాంతాలను ప్రతిపాదించాడు. పి.హెచ్‌డి పట్టాకోసం ఆయన ఎన్నుకున్న అంశం కూడా ఇదే. ఒక పెద్ద నక్షత్రం తనలో ఉన్న థర్మో న్యూక్లియర్ ఇంధనాన్ని పూర్తిగా వినియోగించుకున్న తర్వాత అది కుప్పకూలిపోతుందని అప్పుడు ఒక విలక్షణత ఉత్పత్తి అవుతుందని, అప్పుడు ఒక తీవ్రమైన సాంద్రతగల కేంద్రం ఏర్పడుతుందని దానికి ప్రతిఘటించడానికి వీలులేని గురుత్వాకర్షణ ఉంటుందని హాకింగ్ ప్రతిపాదించాడు. అప్పుడు దాని చుట్టు పక్కల ఉన్న ప్రాంతం 'కృష్ణబిలం'లా మారిపోతుంది. ఎందుకంటే శిథిలమైన ఆ నక్షత్రం చుట్టుపక్కల ఉన్న గ్రహాలతోపాటు, సకలమూ శిథిలమైన ఆ నక్షత్రంలోకి వెళ్ళిపోతాయి. ఆ గురుత్వాకర్షణ ఎంత తీవ్రంగా ఉంటుందంటే చివరకు కాంతి కూడా బయట పడడానికి వీలులేదు. కృష్ణ బిలాలు ఉంటాయని అంతకు ముందు పరోక్ష ఆధారాలు ఉన్నప్పటికీ ఈ 'విలక్షణత'ను ఎలా అర్థం చేసుకోవాలో తెలిసేది కాదు. ఎందుకంటే ఈ స్థితిలో విజ్ఞాన శాస్త్ర సూత్రాలు నిరుపయోగం అయిపోయేవి. హాకింగ్,

పెన్‌రోల్ ఈ రంగంలోకి అడుగుపెట్టిన తర్వాత ఐన్‌స్టీన్ ప్రతిపాదించిన సాపేక్ష సిద్ధాంతమే నిజమైతే 'విలక్షణత' ఉండి తీరాలి అని 1965లో గణిత శాస్త్ర పరంగా రుజువు చేశారు. నిజానికి అలాంటి 'విలక్షణత'లు లేకపోతే సాధారణ సాపేక్షతా సిద్ధాంతాన్ని తిరస్కరించినట్టే. పైగా ఈ విలక్షణత విశ్వ ఆవిర్భావానికి కేంద్రం అయి తీరాలని హాకింగ్, పెన్‌రోల్ వాదించారు.

విలక్షణత మీద వారు కొనసాగిస్తున్న పరిశోధనలు, కేంబ్రిడ్జ్ పండితుల్లో హాకింగ్‌కు ఉన్న పేరు ప్రఖ్యాతుల కారణంగా గాన్‌విల్లే, కయస్ కళాశాలలో పరిశోధనలకు ఉపకారవేతనం లభించింది. ఇక్కడ పరిశోధకుడిగా ఉన్నప్పుడు సాధారణ సాపేక్షతను కాకుండా క్వాంటమ్ సిద్ధాంతాన్ని ఉపయోగించి మహా విస్ఫోటనం వల్ల విడుదలైన అపారమైన శక్తి కారణంగా అనేక చిన్న చిన్న కృష్ణ బిలాలు ఏర్పడ్డాయని హాకింగ్ ప్రతిపాదించాడు. ఆయన సాపేక్షతా సిద్ధాంతాన్ని ఈ పరిశోధనలకు ఉపయోగించుకోక పోవడానికి కారణం ఏమిటంటే ఆ సిద్ధాంతం ఉప అణువులతో కూడిన ప్రపంచాన్ని ఆ సిద్ధాంతంలో పూర్తిగా పరిశీలించడం సాధ్యం కాదు. కృష్ణబిలాలు తర్వాత కూడా రేణువులను విడుదల చేస్తూనే ఉంటాయి. మొదట దీనిని ఎవరూ నమ్మలేదు. కానీ ఆ తర్వాత అంగీకరించారు. ఈ రేణువులు విడుదల కావడాన్ని హాకింగ్ అణుధార్మికత అంటున్నారు.

సంక్లిష్టమైన సమీకరణాలు సాధించడంలో అశక్తుడు. అయినా ముక్కోపి అయిన ఈ శాస్త్రవేత్త దృఢ దీక్షతో తన పరిశోధనలను ముందుకు సాగించాడు. సంక్లిష్టమైన సమీకరణాలను తను చేయలేడు కాబట్టి ఆ లోటును భర్తీ చేయడానికి వాటిని జ్యామితి అంశాలుగా మార్చివేశాడు. ఆ జ్యామితి లెక్కలు ఆయన బుర్రలోనే రూపు కట్టేవి. 1978లో ఆయనకు ప్రతిష్ఠాత్మకమైన ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ బహుమతి వచ్చింది. ఆ మరుసటి సంవత్సరం కేంబ్రిడ్జ్‌లో గణితశాస్త్రంలో లుకేషియన్ ప్రొఫెసర్‌గా నియమితుడయ్యాడు. ఈ స్థానంలో ఒకప్పుడు ఐజాక్ న్యూటన్ ఉండేవాడు.

1985లో న్యూమోనియా వ్యాధికి చికిత్స చేస్తుండగా ఆయనమాటకూడా దాదాపు పడిపోయింది. ఒకే ఒక్క వేలు మాత్రం కదిలేది. ఆ ఒక్క వేలు సహాయంతో స్పీచ్ సింథసైజర్‌ను ఉపయోగిస్తాడు. చిన్న చిన్న పనులకు కూడా భార్యమీదో, మరొకరిమీదో ఆధారపడక తప్పదు. కానీ ఆ సమయంలోనే ఆయన 'ఎ బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైమ్, ఫ్రమ్ ది బిగ్ బాంగ్ టు బ్లాక్ హోల్స్' అన్న గ్రంథం పూర్తి చేశాడు. ఆ గ్రంథం విపరీతంగా అమ్ముడైంది. ఈ గ్రంథంలో తన అద్భుత సిద్ధాంతాలను సులభంగా అర్థమయ్యే భాషలో వివరించగలిగారు.

హాకింగ్ అనుసరించిన శాస్త్ర విధానానికి ఆయనలో ఉన్న సహజ జ్ఞానం, విభిన్నమైన ఆయన స్వభావం కారణం అయినప్పటికీ కార్ల్ పాపర్ అన్న తత్వవేత్త భావాలు మీద కూడా ఆయన బాగా ఆధారపడ్డాడు. పాపర్ పరిశీలన, ఊహ, ప్రయోగం అన్న సాంప్రదాయిక శాస్త్ర పద్ధతులను తలకిందుల పద్ధతిలో నిలబెట్టాడు. హాకింగ్ అనుసరించిన ఈ పాపర్ విధానం ప్రకారం శాస్త్రవేత్త ఒక సమస్యకు ఒక పరిష్కారం ప్రతిపాదించి ఆ తర్వాత ప్రయోగాలు కొనసాగించి తన సిద్ధాంతాన్ని తానే నిరాకరించడం ద్వారా మెరుగైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించగలుగుతాడు. సాంప్రదాయేతరమైన ఈ పద్ధతుల కారణంగానే హాకింగ్ చిన్న కృష్ణబిలాల సిద్ధాంతాన్ని ప్రతిపాదించగలిగాడు. విశ్వం కుంచించుకుపోవడమే నిజమైతే అన్ని సంఘటనలు విలోమపద్ధతిలో మళ్లీ జరుగుతాయని ఆయన ప్రతిపాదించాడు. ఆ సిద్ధాంతాన్ని ఆ తర్వాత ఆయనే నిరాకరించాడు. హాకింగ్ కాల్పనిక ఆలోచనాపరుడు. తన ఆఫీసు గదిలో మార్లిన్ మన్రో పోస్టర్ పెట్టుకునేవాడు. ఇరవై ఐదేళ్ల వైవాహిక జీవితం తర్వాత తన భార్యను వదిలేసి 1990లో తనకు ప్రైవేట్ నర్స్‌గా ఉంటున్న ఎలైన్ మేసన్‌ను చేపట్టాడు.

హాకింగ్ సాధించిన మహాద్భుత విజయాల వైపరీత్యం ఏమిటంటే అవన్నీ సాధ్యమేనన్న ఆవరణలో మాత్రమే పనిచేస్తాయి. విలక్షణతను గానీ, కృష్ణబిలం కూరుకుపోవడాన్నిగానీ ఇంతవరకు గమనించిన వారు ఎవరూలేరు. మరీ వైపరీత్యం ఏమిటంటే శుద్ధ నాస్తికుడైన ఈ శాస్త్రవేత్త దేవుడి మేధస్సును కూడా శోధిస్తానని చెబుతున్నాడు.





ఇరవయ్యో శతాబ్దం మానవజాతి చరిత్రలో ఓ అసాధారణ సమయం. అది సంక్షుభితం. విప్లవాత్మకం. ఓ కంట రక్తాశ్రువులను మరో కంట రుద్రజ్వాలలను కురిపించింది. స్వేచ్ఛను స్వచ్ఛంగా అందిస్తూనే దాస్యానికి నూతన రూపాలను ముందుకు తెచ్చింది. ఆకలిని భూగోళపు ఆవతలికి తరిమివేయగల విజ్ఞానాన్ని, అదనపు ఉత్పత్తిని సముద్రం పాలుజేయటాన్ని అనివార్యంగా చూపించే ఆర్థిక విధానాన్ని ఆవిష్కరించింది. ఈ పరిణామాలన్నింటి వెనుక అసాధారణ ఆలోచనలు చేసిన మేధావులు ఉన్నారు. తమ మాటే మంత్రంగా దేశాలను, జాతులను నడి పించిన నేతలు ఉన్నారు. మానవ ఇతిహాసంలోని ఓ ముఖ్య అధ్యాయాన్ని లిఖించిన ఇటువంటి వంద మంది ప్రపంచ ప్రముఖుల జీవితాలు, వారి కృషిని వివరించే, కొత్త తరంలో నాయకత్వ లక్షణాలను పెంపొందించగల అసాధారణ గ్రంథం డిస్కవరి ఐకాన్స్.






- మహాత్మగాంధీ, హోచిమిన్, నెల్సన్ మండేలా లాంటి బానిస సంకెళ్లు తెంచిన మహనీయులు...
- లెనిన్, మావో, జపాటా, ఫిడెల్ కాస్ట్రో, చేగువేరా వంటి సామ్యవాద పథగాములు...
- హిట్లర్, పోల్‌పాట్, ముస్సోలినీ, ఫ్రాంకో మొదలైన నియంతలు...
- ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, ఎడిసన్, మేడం క్యూరీ, సి.వి. రామన్ వంటి అద్వితీయ శాస్త్రవేత్తలు...
- యూరీ గగారిన్, నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ వంటి అంతరిక్ష కవాటాలు తెరిచిన వ్యోమగాములు...
- రవీంద్రనాథ్ ఠాగూర్, జార్జి బెర్నార్డ్ షా, ప్రేంచంద్ వంటి జీవిత చిత్రణలో ఆరితేరిన రచయితలు...






- చార్లీ చాప్లిన్, మార్లిన్ మన్రో, వాల్ట్ డిస్నీ లాంటి వెండితెర వేల్పులు...
- మహ్మద్ అలీ, ధ్యాన్‌చంద్, జెస్సీ ఓవెన్స్ వంటి అద్భుత క్రీడాకారులు...

వీరందరూ ఇరవయ్యో శతాబ్దాన్ని ప్రభావితం చేసిన వివిధ రంగాలలోని ప్రతిభామూర్తులు. వంద మంది ఇలాంటి నిష్ణాతులకు సంబంధించిన కథనాలు, అరుదైన ఛాయా చిత్రాలతో ఏర్చికూర్చిన 'డిస్కవరి ఐకాన్' గ్రంథం హస్తభూషణం కాదు. మెదడుకు మేత. భవిష్యత్తుకు కరదీపిక.





**Rs. 480/-** (Not for sale)
**400 Pages. 200 above rare Images.**